శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy)


సంపుటము ౧౮ { శుక్ల నామసంవత్సరము. చైత్ర వైశాఖమాసములు. } సంచిక ౧.

Vol. 18





కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచే బరిషత్కార్యాలయమునఁ
బ్రకటింపఁబడినది.

చందా { పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. 3. } { విడిసంచిక రు ౦-౮-౦

1929

## ప్రతిష్ఠాపకులు.

శ్రీ రాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు. పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు—ఉయ్యూరు జమీందారువారు.

శ్రీ రాణీ వత్సవాయ వేంకట సుభద్రయ్యమ్మజగపతిబహద్దరు గారు—తుని రాణీగారు.

కీ. శే. మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షుడు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

దర్భా వేంకటశివరామరాజుగారు బి. ఏ., బి. ఎల్.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు.

డాక్టరు వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ. ఎల్. టి. PH D

(కోశాధ్యక్షులు)

శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు

కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు.

అనంతపంతుల రామలింగస్వామిగారు.

దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారు బి. ఏ.

తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు

అకెళ్ల వేంకట్రామయ్యగారు.

కోశా వెంకటసుబ్బారావు నాయుడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిల్లారిసెట్టి రంగబ్రహ్మారావు నాయుడుగారు.

# విషయసూచిక.

# పరిషత్ప్రయోజనములు.

తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయుఁ నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి :—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వాంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట;

ii తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట;

iii ఆధునికశాస్త్ర గ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధము చేయుట;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుటయు;

v సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నియమముగఁ బ్రచురించుట;

vii తెలుఁగుభాషను వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట. ఇందు ప్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాతప్రతులుగూడ నుండవలయును;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపకరించు నన్ని కార్యములను జేయుట.

## కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారు.

మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ బిరుదాంచితు లగు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు జూన్ 18 తేదీ యుదయమున చెన్నపురిలో స్వగృహమునఁ గాలధర్మము నొందిరని తెల్పుటకు మిగుల విచారించుచున్నాము. వీరు వయోవృద్ధులు, విద్యావృద్ధులు నై యాంధ్రలోకమునకు మహోపకారము నొనర్చిరి. ఈవిద్వాంసులు సంస్కృతాంధ్రములయందును, ఆంగ్లద్రావిడములయందును విశేషపాండిత్యము గలవారు. వీరి మరణమువలన నాంధ్రభాషకుఁ జాల కొఱఁత వాటిల్లినది. వీరి జీవితచారిత్రమును గూర్చియుఁ గ్రంథములం గూర్చియు ముందుఁ బ్రకటించెదము.

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్త్రిక

సంపుటము ౧౮. { శుక్లనామసంవత్సరము చైత్రవైశాఖమాసములు. } సంచిక ౧.

## స్వవిషయము

విభవసంవత్సరముతోఁ బరిషత్పత్త్రికకుఁ బదునేడువత్సరములు నిండినవి. పత్త్రికాప్రకటనమును మేము నిర్విఘ్నముగఁ గొనసాగించుటకుఁ గారణభూతులైన పరిషత్సభ్యులకును, పత్త్రికాపాఠకులకును, వ్యాసకర్తలకును మా వందనము లర్పించుచున్నాము. విభవసంవత్సరసంపుటములో, కాళిందీకన్యాపరిణయ ప్రథమభాగమును, ధాతుమాలయుఁ బూర్తియైనవి. పదునెనిమిదవ సంపుట మీశుక్లసంవత్సరముతోఁ బ్రారంభమగుచున్నది. సభ్యులును, చందాదారులును, వారివారిచందాలను సకాలమునఁ బంపి యథాప్రకారము మాకుఁ దోడుపడుటకై వేఁడుచున్నాము. ఈసంవత్సరమునఁ గాళిందీకన్యాపరిణయము ద్వితీయభాగము ప్రకటింపఁబడును. మఱియు నితరాముద్రితగ్రంథములఁ బ్రకటించుటకై యత్నించుచున్నాము. ఇదివఱకెచ్చటను బ్రకటింపఁబడియుండని కదిరీపతిశుకసప్తతిక్కృత్యాదిపద్యములు ప్రకటింపఁబడుచున్నవి. భాషాభిమానులు తామెప్పటియట్లు సభ్యులును బత్త్రికాపాఠకులు నగుటయే కాక తమమిత్త్రులఁగూడఁ బ్రోత్సహించి పరిషదభిమానులఁ జేయఁగోరుచున్నాము. రామరాజురంగప్పరాజుసాంబోపాఖ్యానమునకుఁ బ్రతియొక్కటి సంపాదించి భాషాభిమానులు పంపినచో మాప్రతితో సంప్రతించుకొని ముద్రితప్రతితోఁగూడ వారిపుస్తకము వారికిఁ బంపెదము. (వ. అ)

# ఆంధ్రసాహిత్యపరిషత్తు—అధ్యక్షోపన్యాసము.

జనమంచి శేషాద్రిశర్మగారు, కడప

శ్రీమంతం బగునీయాంధ్రదేశంబునఁ జెలువారు నాంధ్రభాషాఘోషం బోషింప శేముషీవిశేషభూషితు లగుభాషాభిమానులచే నించుమించుగా నిరువదిసంవత్సరములపుడు చెన్నపురియం దుత్సాహసాహిత్యం బనుదార నెలకొల్పఁబడిన యీయాంధ్రసాహిత్యపరిషత్తునకు సంప్రదాయానుసారంబుగఁ బ్రతివర్షంబునఁ బ్రహర్షంబున నిర్వర్తింపఁబడుచుండఁబున నీవిభవవత్సరంబున నతివిభవంబుతో జరపఁబడు వార్షికమహోత్సవసభకు నగ్రాసనాధిపత్యంబు వహింపఁ గోరినయేతత్సభా కార్యనిర్వాహకులు మున్నగునధికారపదవీసమారూఢుల కే నెంతయుం గృతజ్ఞుఁడ నై యభివందనంబులు గావించుచున్నాఁడను. ఈపదవిని నింతకుమున్ను నాకన్న నర్హతములు పెక్కండ్రు వహించి జయప్రదంబుగఁ గరణీయంబులు నిర్వర్తించియున్నా రని యే నెఱుంగుటంజేసి దీనికి నే నిపు డీయకొనుట సాహసం బనియు నే నెఱుంగుదు. అయిన నీయాంధ్రదేశంబున నొకమూలలోఁ జేరియుఁ జేరనట్టు లొత్తిగిలి యున్నదత్తమండలంబున నుండుపండితులను నొకకొన్నిసారు లేని బహూకరింపఁ దలంపుగొని పరిషత్కార్యనిర్వాహకులు మున్నొకసారి దత్తమండలాంతర్గతకడపపురంబున జరగినవార్షికమహాసభకు దత్తమండలాంతర్భూత బళ్లారిపురవాస్తవ్యులు నిపుడు కీర్తిశేషులు నైనకోలాచలము శ్రీనివాసరావుగారి నగ్రాసనాధిపతిం గా నియమించి యీసంవత్సరమునఁ గడపపురనివాసి నగునన్ను నియమింపఁబూనుటచే నీగౌరవము దత్తమండలవాసుల కొనరింపఁబడినదియే కాని సామాన్యుండ నగునాకుఁ గాదని తలంచి యస్మన్మండలవాసులకుఁ గలిగెడుగౌరవంబు పరమాదరణీయం బనియుఁ నవశ్యాంగీకర్తవ్యం బనియు భావించి యిప్పదవి కే నీయకొంటి. ఇక్కార్యంబు నెఱవేర్చుటయందు నాయెడ న్యూనాధిక్యంబు లుండునేని వానిని సరకుసేయక నన్ను మన్నింతు రని యీసభ్యుల నెల్లరం బ్రార్థించెద. ప్రతివర్షంబున జరపఁబడు నీమహాసభయం దితఃపూర్వ మగ్రాసనాధిపతు లెల్లవిషయములం గూర్చి యుపన్యసించియే యుంటచే నే నేమిచెప్పినను నయ్యది చర్వితచర్వణమే యగుంగాని క్రొత్తదిగా నుండఁబోదు.

అయినను భాషాపోషణంబునకును భాషాభివృద్ధికిని నెవరెవ రెన్నిమాటలు నుడివిన నది యుపకారకారకంబుగ నుండు ననియే నాతలంపు. ఇఁకఁ బ్రకృత మనుసరింతము.

— ♦ ఇప్పటియాంధ్రభాషాస్థితి ♦ —

ఈశీర్షికను వ్రాయునపుడే మత్కరంబు ముత్కరంబులుగాని వాక్యంబులు వ్రాయవలసి వచ్చెనే యని ప్రకంపనసముచ్చలిత లలితవిటపంబు చందంబునఁ బ్రకంపమానం బగుచున్నది. పరమేశ్వరీమాయ యెట్టిదో యద్దేవిసంకల్ప మెత్తెఱంగున నున్నదో కలిమాహాత్మ్యం బెప్పగిది నొప్పునో చెప్పలేను. Italian of the East అని పాశ్చాత్య్యలగుహూణవాణీవిచక్షణులు పేర్గొను శ్లాఘ్యంబై సొంపారు మనయాంధ్రభాష నన్నయ, తిక్కన, యెఱ్ఱాప్రెగడ, లోనగు మహాకవీశ్వరులకాలంబున మహోన్నతదశం జెంది యది మొదలు రాజమహేంద్రవరము కొండవీడు రాజధానులయందు రాజ్యపాలనంబు సేయుచుండిన విద్వత్కవిసమాదరణపరాయణులైన రెడ్డిమహీపతులకాలంబునను విదపఁ గవితాసామ్రాజ్యపట్టభద్రుండును నాంధ్రభోజుండును నగు కృష్ణదేవరాయల కాలంబువఱకును గ్రమంబున ననేకభంగుల నభివృద్ధిం గాంచుచు వచ్చినది. దానికిఁ బిమ్మటను నాంధ్రవాఙ్మయమును బ్రభుసమాదరణం బున్నను లేకున్నను నచ్చటచ్చటఁ గవినాథులు సద్గ్రంథములను రచించుచుఁ బోషించుచు వచ్చిరి.

అధునాతనకాలంబునను నాంగ్లేయప్రభుత్వమువారు దేశభాషలయెడ ననాదరంబుసేయక చేయూత యొసఁగి వీనిని గాపాడుచువచ్చిరి. ఇటులుండ మనయాంధ్రవాణి చేసినదురితం బేమియో కాని యిప్పటికిఁ గొన్ని సంవత్సరములనుండి మనము చూచుచుండఁగానే దీనికి దుర్దశ వాటిల్లినది. అద్దేవిని నిజమాతనుంబోలె భక్తితాత్పర్యంబున నుపచరింపవలసిన తత్పుత్రులగునాంధ్రులలోనే కొందఱు ధీమంతు లుప్పతిల్లి యిప్పుడఁతికిఁ బలుదెఱంగుల నొవ్వ గలిగింపఁ దొడంగిరి. వారిం జూచి వల్లే యని ప్రశంసించుచు మఱికొందఱు కుతర్కములు సేయుచు నాసతిని హింసింపఁ జొచ్చిరి. వెండి యుం బలువురు వాదము యాదేవిని వికృతాకృతిం గావించి రూపుమాపం బాల్పడిరి. ఆంధ్రసరస్వతికిఁ దా మిట్లు కైంకర్య మొనర్చుట భాషాసేవ యనియు నది యభివృద్ధిహేతు వనియు నెవరైనను నిక్కరణిని జలుపనగునా యని హితోక్తు లా

డసాహసించిరేని వారితోఁ దుర్వాదంబులు గావింపఁ దొడంగి త్వంశుంఠేత్యాదివచనంబుల నుపాలంభింతురు. తాము చెడుటయె కాక యితరులకును నందును ముఖ్యముగాఁ దరుణవయస్కు లగు బాలురకును దమమతంబులను స్వయము కలుపుటయె కాక ప్రభుత్వమువారు నెలకొలిపియుండు విద్యాశాఖాధ్యక్షుల మూలముగ వానిని బ్రచారమునకుఁ దేర భగీరథప్రయత్నములు సేయుచు నెమ్మాడ్కి నేని తమపట్టినచలంబును సాధించి పేరుగాంచ బద్ధకంకణులై యేపారుచున్నవారు. అట్టివారు సేయు ఘోరకృత్యములవలన సురుచిరరూపలావణ్యవిలాసవిభాసమానురాలుగాఁ బ్రసుదంబునఁ జెన్నారుచు సొగసుగులుకుచుండినయాంధ్రవాణి యిక్కాలంబునఁ బ్రేమపురస్సరపోషితనిజకుమారవర్గంబులు నిర్దయులై కావించు కశాఘాతంబులవలనను కృపాణధారాహతులవలనను గంఠపాశనిర్బంధబంధనంబులవలనను నొడ లంతయు వ్రణాంకిత మై చెప్పరాని నొప్పియొదవ నీముప్పుఁ దప్పింప నితరసుతు లొనర్చుజతనంబులు వితథంబులగుటకుఁ బెల్లుగ దురపిల్లుచు నకటా యని సొమ్మసిల్లుచు వెండియుఁ దెప్పిరిల్లుచుఁ బలవించుచుఁ బ్రాణమాత్రావశిష్టయై కడు దీనతం బొరసి యున్న దని వాక్రువ్వ నోరాడకున్నది. దీనిం దలంప నొడలు గడుంగడు వడంకుచున్నయది. ఉల్లము జల్లనుచున్నది. మాతృసేవాపరాయణు లీకలికాలంబునను నింకను గొంద ఱున్నారు. కావున మాతృహింసకు లగుతమసోదరుల పాపకృత్యంబులఁ గాంచి వారు సైరింపనేర్తురే? ఇప్పు డున్నటులుండి మాతృహింసకులు తెలివిఁదెచ్చుకొని పశ్చాత్తప్తులై తమయకార్యంబుల నుజ్జగించి యాసతీతిలకంబునకుఁ దమకావించిన వ్రణంబుల నార్పను, నెగులును మాన్పను, నుచితచికిత్సలుగావింపను దొడంగిరేనియు నీబాధ లుపశమించి యాదేవి స్వస్థతం బొరయుటకుఁ బెద్దకాలము పట్టును. ఆహా! యిట్టులును వారు మాఱుదురా? అది మదీయాశాజనితభ్రమయే కాని నిక్కముగా నగునొక్కొ? ఇఁకఁ బర్యాయోక్తివచనంబులు మాని ఋజుసరణిని గొండొక వాక్రుచ్చెద. నవీనులగు ప్రజ్ఞాశాలులు కొందఱు పాడినదే యేలరా పాడవలయు ననుసామెత కైవడి నవీనమార్గంబుల భాషాసేవ సేయఁబూని వ్యాకరణసూత్రనిర్ణీతనియమంబులకు లోఁగుట మనకుఁ బరమేశ్వరుఁడు పుట్టుకతోఁ నొసంగిన స్వాతంత్ర్యభావమును స్వీకరింపమి యని యన్నియమంబు లను శృంఖలలఁ ద్రెంపి పాఱవైచి విచ్చలవిడి యిచ్చకు వచ్చినచందంబునఁ గబ్బంబుఁ గూర్ప మొదలిడిరి.

ఒకయూరిలోఁ "గలరా" యనంబడు విషూచివ్యాధి ప్రబలి పెక్కండ్ర నాహుతిగాఁ గొనుచుండ నొకఁడు వీధిం జనుచున్న యొకవైశ్యుంగాంచి నీ వూరికిఁ బోయి రావలయు నంటివే నిలిచినట్లున్న దే యని యడుగ నావైశ్యుఁడు దానిపేరుం జెప్పనొల్లక యయ్యా! యచ్చటఁ 'గ' యున్నదని సన్నని యెలుంగునఁ జెప్పి నాపయనంబు నాపితి నని చెప్పెనయొప్పిదంబున నాతెగవారు వ్రాయుశైలిని "గ్రా" యనిమాత్రము వక్కాణించుచున్నాను. వానింగాంచి కొందఱు యతిప్రాసంబులను నిర్బంధములు రచనాసౌలభ్యంబున కంతరాయము లని యుగ్గడించుచు వానిం ద్యజించి పద్యములు రచనసేయఁదొరఁకొను చున్నారు. ఇంకను గణముల నేలపాటింపవలయు నని వీనిని దొలఁగింపఁ బ్రయత్నింతురు కాఁబోలు. వ్యాకరణనియమములను మనము స్వతంత్రించి యుల్లంఘింపఁ దగునా యని యేరైన నడిగిన వారు మనపూర్వు లెన్నియో యేండ్లకు మునుపు వ్రాసియుంచిన తాటియాకుపొత్తములలో నుండియు శాసనములనుండియుఁ బ్రయోగములను, బండితు లగుబ్రాహ్మణులు సంభాషణంబులందు వ్యవహరించుప్రయోగములను నెత్తి చూపుచు నుచ్చైర్ఘోషంబున నుత్తరంబు లొసంగుచు ధన్యంమన్యు లగుదురు. వీనికిఁ దోడిక్కాలంబున నకారద్వయము తలసూపి యచిరకాలంబుననే యెల్లయెడలను నెల్లవారియుల్లంబు లుల్లసిల్ల నల్లిబిల్లిగా నల్లుకొని యేపు సూపెడు. నకారద్వయ మన నెద్దియో దాని యాకృతి యెట్టిదో యరయవలయు నని మీచిత్తంబులు కౌతుకాయత్తములై యల్లలనాడుచుండును. కావున దానిం దడవుసేయక వ్యక్తీకరించెద. నకారద్వయ మనఁ గా నవలయొకటి, నాటకమొకటి. ఓహో! సగము తెలిసినది గాని మొదటిపద మాంధ్రభాషలో మేముచూచినంతలోఁ గానంబడదే. దాని కర్థమేమి? నవలాయనుపదము వనితార్థమున నున్నది. అదిప్రకృతమున నన్వయింపదే. "టీకా టూకా మపేక్షతే" యన్నటులున్న దేయని కేవలప్రాచీనశుష్కపండితు లెవరైన నుందురేని వారడుగవచ్చును. వారికి దానిం దెలియఁజెప్పెద. నవల యనఁగా నేదేని యొక కల్పనాకథ. ఆంగ్లోభాష యందు "Novel" అని చెప్పఁబడును. తెనుఁగున నవలలను హూణభాష యందలి నవలలవలెనే ప్రణాళికలు కల్పించి వ్రాయవలయును. గ్రంథాది యందు మనప్రాచీనులవలెఁ గాక "రామయ్య- భీమయ్యా! నేను నీతో యేమి చెప్తాను. నీవు చేశావు కావు గా." భీమయ్య- ఔను రామయ్యా! నీవు సెప్తా

పుగాని వోడు సూస్తుండాడు గనక నేను యెట్లా దాన్ని తీసుకొనివొస్తును." అని యివ్విధంబున మనముసందున్నది యేదియో యెఱుఁగనీయకయు రామయ్యా భీమయ్యా లెవ్వరో తెలియరాకయు వ్రాయుట నవలరచయితల మహాసంప్రదాయము ఆవివరములు గ్రంథములో నలువదియేఁబదిపుటలకుఁ గాని గోచరింపకుండునట్లువ్రాయుట గొప్పనేర్పుగా నెన్నంబడు- నాటకములం గూర్చియు దఱకును దెలిసియేయున్నది. "నాటకాంతం సాహిత్య" మ్మను ప్రాచీనాభియుక్తోక్తి యిప్పుడు "నాటకాదిసాహిత్య"మ్మని మాఱినది పాఠశాలలోఁ జదువు (అనఁగా నింగ్లీషు మొదలగు విషయములు ప్రధానముగాను నాంధ్రమానుషంగికముగాను జదువు) విద్యార్థులును దొలుదొల్త నాటకములతోనే గ్రంథరచనకుఁ దొడఁగుదురు అట్టియుగ్రంథములను ముద్రింపించుటకును వాని పైసదభిప్రాయములను వ్రాసి యిచ్చుటకును బలువు రేము నేననిసిద్ధముగా నుందురు "యేన కేనా ప్యుపాయేన ప్రసిద్ధపురుషో భవ" అని మనప్రాచీను లగునార్యులే చెప్పియున్నారుగదా? ఇదియుఁ గాక ఛందోవ్యాకరణనిబంధనంబులకు లోఁగియే యీకాలంబునఁ బద్యము లల్లువారు కొందఱు భావకవిత్వ మని యొకతెఱఁగు క్రొత్తకైత సేయుచున్నారు. అందు భావమేప్రధానముగా నుండునఁట ఏది వ్రాసినను నెక్కరణిని వ్రాసినను క్రొత్త త్రోవనుండియుండుటయే యిట్టివారికి నియమము. ప్రాచీనరీతుల ననుసరించి వ్రాయఁబడునది గద్యమైనను బద్యమైనను బనికిరాదు. పనికిరాదని యేలచెప్పితిని మీరెఱుంగుదురా? అట్టి పుస్తకములను బ్రాయికముగా విద్యాశాలలోఁ దదధ్యక్షులు పాఠ్యగ్రంథములుగా నిర్ణయింపరు. సంస్కృతపదము లెక్కువగా నుపయోగించి వ్రాసినచో దీనిలో సంస్కృతరచనలే కాని తెలుఁగు చాలఁదక్కువయని నిరసింతురు. అచ్చతెనుఁగుపదములును జాతీయము లగుమాటలును గూర్చి సలక్షణంబగు శైలిని నెవ్వఁడేని యొకపొత్తమును వ్రాసిప్రకటించునేని యది "Chaucer's English" (ఛాసర్స్ ఇంగ్లీషు) వలె దురవగాహ మగు మహాప్రాచీనకవులు వాడినవిస్మృతిభాషలో వ్రాయఁబడినదనియు నేతత్కాలపువారి కవి మనోరంజకంబులును నుపయోగకారులును గావనియుఁ దూలనాడుచుఁ దద్గ్రంథనిర్మాతల నిరుత్సాహులనుగాఁ జేయుదురు.

కట్టా! మనయాంధ్రభాష కెట్టిదురవస్థ పాటిల్లె? దీనిఁ దొలఁగించి దానిం బోషించుటయే ముఖ్యోద్దేశముగాఁ గొని పోటుమానిసుల యేటులకు వె

నుదీయక పాటుపడునది యీయాంధ్రసాహిత్యపరిషత్తని నేఁ జెప్పవలయునే? భాషకిక్కాలంబున ఘటిల్లెడు పూర్వోక్తసంకటంబుల నివారింపఁ బూనిన యిప్పరిషత్తున.కిక్కాలంబున నభినవకృష్ణరాయ లనఁబరఁగుచు నిష్ఠాపరులై వలయునంత సాహాయ్యంబొనర్చుచుఁ బ్రధానపోషకులై యున్న శ్రీపిఠాపురము మహారాజాగారు ప్రాచీనమతావలంబు లగు విద్వజ్జనంబుల కెల్లరకును గడుంగను సంస్తవనీయులై యలరారుచున్నకతంబున నాంధ్రవాణి పొలియ దనియు నచిరంబ లబ్ధసంజ్ఞారోగ్యయై మునుపటియందమును జెంది శాశ్వతంబుగ జీవించు ననియు నేను నెమ్మదిం దిరమ్ముగ నమ్ముచున్నాఁడను.

ఇఁక భాషారక్షణోపాయముం గూర్చి నాలుగుమాటలు చెప్పఁదలంచితిని.

## —: భాషాస్వరూపము :—

మానవుని బుద్ధిస్వభావసంయోగకారిణి భాష. ఆంధ్రభాషయన నాంధ్రునిబుద్ధిస్వభావధర్మమును బోధించు శబ్దబృందమనియే సారము. భూతభవిష్యద్వర్తమాననామక కాలత్రయమునందును నాంధ్రసంఘ మేలాగున నుండెను? ఎటు లుండఁగలదు? ఎట్లున్నది యనువిషయములను బోధించుటయే భాషకుం గలఫలము. మన మేసంఘమును బరీక్షించిన నాసంఘమున కేవి స్వభావధర్మములో వానిని వారిభాషయే సువ్యక్తముగాఁ దెలుపుచుండును. ధనమును బ్రాపంచికసుఖమును నధికారము నీమొదలగువానియం దొక్కదానినో రెండింటినో లేక యన్నింటినో యాశించు జాతివారిభాషను మనము పరీక్షించిన నాయూహలనుస్థిరపఱుచుచుఁ దదుపాయములఁ దెలుపుచుఁ దదనుగుణోదాహరణముల వ్యక్తీకరించుచు నాభాషాగ్రంథసముదాయ ముండును. ఆగ్రంథములను మన మాదృతిం బఠించి యంతతో సంతృప్తినొందక స్థాలీపులాకన్యాయమునఁ గాక స్తనశల్యపరీక్షాన్యాయము ననుసరించి పరికించితిమేని యాజాతి భావము లెట్టి వని మనకుఁ బొడకట్టకమానవు. ఈనియమము ననుసరించి మనకు ముందున్నవారి భావము లెట్టివి? వారిసుగుణసంపద యెట్టిది? వారుచేయు కర్మములెట్టివి? అవి యేకరీతిగా నుండినవా? లేక కాలానుసారము మార్పు నొందినవా? పరీక్షించితిమేని మనపూర్వుల గంభీరభావములు, మతధర్మాచరణాదిధర్మనిబద్ధముల సుసద్గుణగణములు, ఐహికాముష్మికములనఁబడుఫలముల వేని గోరి యాచరించిరో ఆకర్మములు, కాలానుసారముగ నెట్లు మార్చుకొనిన శాస్త్రవిరుద్ధముకాదో అట్లు చేసిన మార్పులు, వేనిని మార్చినఁ బ్ర

ధమసూత్రమే నశించునో అట్టివిషయములను వారించుకేని మార్పకుండుట యు నున్నగు ననేకవిషయములు మనకు మణిదర్పణమునఁ బ్రతిబింబమువలె గ్రంథబృందమునుండి స్పష్టములగు. మన మేగ్రంథమును బఠించి సారమిం దేది యని వేసారక పలుసారులు విచారించితిమేని మనపూర్వులమనోవృత్తు లాముష్మికసుఖసంపత్సమృద్ధినే యాశించునవి యని తేటపడియెడిని. ఇట్టివిషయములనుఁ దెలుపుటయే భాషోద్దేశము- మఱియు దేవభాషాప్రతిచ్ఛాయయే యాంధ్రభాష యనియు స్పష్టముగ.

దేశమహోన్నతి భాషాభివృద్ధిచేఁ గలుగును గాని వేఱుకారణమునఁ గలుగ దనవచ్చును. ఈవిషయము నంద ఱంగీకరింతురో లేదో యెఱుంగను గాని పెక్కండ్ర భావ మని మాత్రము నుడువఁగలను. భాషయే మానవులకు గూడిక కల్పించును. క్రొత్తదేశమునకుఁ బోయితిమేని యం దాంధ్రుఁడు కనఁబడినచో వానిం గూడ మనస్సు కోరును. అప్పటియానందము వర్ణనాతీతము. ఆకాలమున నందఱమాటలలో నాంధ్రునిభాషానిస్వానము—

కం. వీనులవిందై యమృతపు, సోనలపొందై యమందసుమచలదళిసీ
గానము క్రందై యాస్వన, మానందబ్రహ్మమైన నధిపతిపలికెన్.

అను రామరాజభూషణుని హృద్యమగు పద్యమును స్మరింపఁజేయక వదలునా ? అట్టియానందమును గలిగించినది భాష గాని వేపముగాదు. అట్టి భాష యత్యున్నతిఁ గాంచినచో నాదేశ మున్నతస్థితిని గాంచి యుండుననుట సముచితమే యని తలంచుచున్నాఁడను. భాషామూలముననే జాతియం దభిమానము గలుగును. అది సాంద్రమైనచో నైకమత్య మనంబడును. ఆనైకమత్యమే దేశాభివృద్ధికాలవాలము. కాఁబట్టి భాషయే మనదేశాభివృద్ధికిఁ బ్రధానకారణమని విన్నవించుచున్నాఁడను.

—♦ ఇతరభాషాసంయోగము ♦—

ఏదేశభాషయం దైనను నితరదేశభాషాపదములు చేరియున్ననుట నిర్వివాదాంశము. ఒకదేశస్థుఁడు కారణాంతరమున దేశాంతరమున కరిగి యటఁ గొలఁదివత్సరములు నివసించి మరలి స్వస్థానమున కరుదెంచినపు డాతఁడు క్రొత్తదేశపుభాషాపదములను వాడుచుండును. అవి కొందఱు కలవడును. అందుఁ గొందఱు కవులుందురు. ఎట్లో కవిత్వమునం దవి చేరును. తరువాతివా రాపదములు మనభాషవే యనుకొందురు. అట్లుగాక యాంధ్రభా

షాపదము లివి యని తెలుపు నిఘంటువు వ్రాసియుండినఁ దక్కిన వన్యదేశ్యము లని కనుఁగొనుట సులభముగ నుండును. అపని సాగనందున మనభాషలో నిమిడియున్న పదము లివి యని యెఱుంగుట సామాన్యులకుఁ గష్టముగ నున్నది. ఈవిషయము నేకాంతమునఁ గూర్చుండి విచారించితిమేని మన భాష యెన్నియో దేశములం దిరిగి యెన్నియో మార్పుల నొందియున్న దని తోఁపకపోదు. అంతియగాక యేభాష యెప్పు డుత్పత్తిల్లెనో చెప్పుటయు నశక్యము. దీనికిం గలకారణము భాషాప్రాచీనత్వ మనవలయును. పెక్కుశబ్దములు కల్పింపఁబడియుండును. ఎందువలన నన్న ప్రశ్న మసంబద్ధము. ఆకాలపువారి యూహాలు తెలుపుట కప్పుడు శబ్దము లుండకుండవచ్చును. అవసరమును బట్టి కల్పింపఁబడి యుండవచ్చును. కొంతకాలముక్రిందట విశాఖపట్టణప్రాంతముల నిష్టాలాపము లాడుకొనుతఱిఁ జమత్కారముగా నొక్కఁ డొకమాట పలికినఁ దక్కినవారు "మతాబా కాల్చెను" అని యనసాగిరి. ఇపు డామాట యామండలమున వాడుకయైనది. "రంజుగా నున్న" దనఁగా శ్రుతిహితముగా నున్నదను నర్థమందుఁ బైమండలమున నున్నవారిలోఁ గొందఱు రసికు లుపయోగింతురు. అది గ్రంథములఁ జేరిన నదియు నాంధ్రభాషయే యనఁబడును గదా? ఇట్లే పెక్కుపదములు కల్పింపఁబడియుఁ బెక్కుపదము లన్యభాషలనుండి చేర్చుకొనఁబడియు నీయాంధ్రభాష వృద్ధియైన దనవచ్చును. తోఁచినట్లెల్ల నన్యభాషాపదములను జేర్చుకొనుటయుఁ బాడిగా దని నాయుద్దేశము. భాష వృద్ధికావలదా యన్న దేవభాష మనకు నిధివలె నున్నది. అందుఁ గలపదము లెందును లేవని పెక్కండ్రు నొక్కివక్కాణించు చున్నవారు. కావున నింకనైన నితరదేశభాషాపదములను జేర్చుకొనక దేశభాషనుండి చేర్చుకొనుచు నీవఱకిన్ని చేరిన వనియు, వాని వ్యుత్పత్తు లివి యనియును దెలిపి భాషను జక్కనలంకరించుట యీపరిషత్తునకు విధియైయున్నది.

## —♦ వ్యాకరణము ♦—

ఆంధ్రభాషాభివృద్ధికి వ్యాకరణము ప్రధానాంగ మనవలయును. ఇపు డుండువ్యాకరణములు చాల వనియుఁ గ్రొత్తగాఁ బెద్దవ్యాకరణము వ్రాయుట యత్యవసర మనియుఁ గొందఱు పలుకుచున్నవారు. కాని యిపు డుండువానినే పఠించువారి సంఖ్యయే తక్కువగ నున్నది. వ్యాకృతిగ్రంథసంఖ్య కొఱంత గాంచలే దని నే నెంచుచున్నాఁడను. ఇపుడు క్రొత్తవ్యాకరణమును వ్రాయు

టకనేకాంతరాయములు లున్నవి. క్రొత్తయక్షరములు కల్పింపవలసి యుండు నేమో? ఆయక్షరములు గలపదము లెంతదనుక నిలుచునో యేక్షణమున నశించునో మన మిపుడు నిర్ణయింపఁజాలము. భాషానియమముల నొక్కకొత్తగ నణఁగఁద్రొక్కి గ్రామ్యభాషగనో వ్యవహారభాషగనో యగ్రామ్యభాషగనో మార్పవలయు నని రామరావణయుద్ధము పద్ధతిగాఁ బోరాడుచుండువారు పెక్కండ్రు గల యిక్కాలంబున నియమముల నేర్పఱుచుటయే సారముగాఁగల వ్యాకరణమును వ్రాయఁబూనుట పరిహాసాస్పద మగునేమో యని యూహించుచున్నాఁడను. లేనిగౌరవమును గాంచ నెంచుటకన్న నున్నదాని నూడిపోకుండఁ గాపాడుట సముచిత మని తలంచుచున్నవాఁడను. పూర్వమహాకవుల మర్యాదయే పూర్ణానుసార్య మగుచుండ నిఁక నిప్పటివ్యాకృతికర్తల కెంత మాత్రము మర్యాద నిలుచునో తెలియఁజాలను. ఈవాదములు తుదముట్టి భాష నియమబద్ధముగ నిలుచునన్న యాశ పొడమ నంతదనుక నీప్రయత్నము నిలుపుటయే శ్రేయస్కరము. అట్లని నిరాశఁ జెందరాదు. ఉన్ననియమముల సడలింపక వానిని సమాశ్రయింపవలయు. తద్విరుద్ధప్రయోగములు ప్రాచీన గ్రంథరాజములయం దున్నచో "ప్రమాదో ధీమతా మపి" అన్నసూక్తి కుదాహరణములుగాఁ గైకొనవలయునే కాని "తదేవాహం సాధయామి" అన్నట్టు మొండిపట్టును బట్టరాదు.

## గ్రంథరచన

ఇఁక గ్రంథరచనం గూర్చి యించుక తెలిపెదను. భాష కాధారము గ్రంథసముదాయమే. నాఁడింథముఁడు సూత్రమునకు రత్నసంతతులఁ గూర్చును. అట్లే కవి ఛందస్సూత్రమునందు మృదుమధురతమపదరత్నసముదయమును గూర్చును. తొలిది కంఠభూషణము. రెండవది వాగ్భూషణము. అయ్యది యపహార్యము. ఇది యనపహార్యము. కవితాశిల్ప మనల్పకల్పనాతిశయ మనోహరము అనన్యసామాలంకార మట్లు దీని కిదియే సాటి. కావుననే "కవితా యద్యస్తి రాజ్యేన కిమ్" అని భర్తృహరి భాషించెను. కవితాశిల్పమునకు సుమతియే పరికరము. లోకవిజ్ఞానముకూడ నొకయంగ మనవచ్చును. కవి మనస్సునకు బ్రహ్మాండములు గోష్పదీకృతము లగుచున్నఁ దక్కిన వారికలెక్కయా? ఆశిల్పము సాధుసనోరంజకము గావలయు. దీనికి ఫల మదియే. కాఁబట్టియే కదా, "యః" స్నాత్వానసగమనాయై వేదం మమతు పాథేయమ్" అని

యొకమహాకవి వాక్రుచ్చెను. కవిత యైహికాముష్మికసుఖంబుల నొడఁగూర్చు నని ప్రాజ్ఞులు పలికియున్నారు. అది యెల్లరయంగీకారమును బడసినది. ఎందఱకో మార్గదర్శకము కూడ నగు. కావునఁ గవిత భాషకాధారము; వాగర్థములవలె నివి పరస్పరాశ్రయము గలవి చతుర్విధపురుషార్థదాయిని కవిత యని కొందఱు పలికిరి. ఇందఱిన్నివిధములఁ బొగడుటఁబట్టియే కవిత నియమబద్ధురాలు కావలసివచ్చెను. కవితాకారము నలంకరించునపుడు దుర్వర్ణములఁ జక్కఁగా శోధించి మనోహరవర్ణములఁ బొందుపఱిచి సకలాలంకారములఁ గూర్పవలయును. భావము సద్భావముగా నుండినఁగాని ఫలము లేదు. ఈ కార్యమునఁ గవి కడు జాగరూకుఁడై మెలఁగవలయుఁ గాని తనకుఁ దోఁచినట్లు మెలఁగి నియమముల నుల్లంఘింపరాదు. అట్టికవిత పతివ్రతరీతి దశదిశలఁ దననిర్మలయశస్సుధాకరకరములు పరఁగ నొప్పారును. అట్లు కానిచోఁ బుంశ్చలివలెఁ గ్రమక్రమముగాఁ గుంగుఁబొంది డిందును.

సత్కావ్యము నొనరించి కవి యశఃకాయమున నిరంతరము ప్రకాశించుచుండును. కావ్యము వ్యంగ్యప్రధానముగా నుండవలయు నని పెద్దలభావము. అట్టి కావ్యమే యుత్తమకావ్య మనియు వారిసిద్ధాంతము.

శ్లో. చతుర్వర్గఫలప్రాప్తి స్సుఖా దల్పధియా మపి,
కావ్యాదేవ యత స్తేన తత్స్వరూపం నిరూప్యతే.

అని విశ్వనాథకవిరాజు నిర్వచించెను.

“శ్లో. వాచ్యాతిశాయి వ్యంగ్యం య దుత్తమం తద్ధ్వనిశ్చ సః,
వీక్ష్య రామం ఘనశ్యామం సీతా జాతా సమున్ముఖీ.”

అని రాజచూడామణి దీక్షితుఁడు కావ్యదర్పణమందు వ్రాసెను. అట్టి కావ్యములను మహాకవులు రచించి తమజననము సార్థకముగాఁ జేసికొనిరి.

మన మెల్ల నిపు డేభూభాగమున నిలువఁబడి యున్నవారమో యాభూభాగమే వాగనుశాసనునిచేఁ బవిత్రీకృతమయ్యెను. ఈమండలమే సకలకవికులతిలకపోషకుఁడై ధర్మపాలవాదరుండగు శ్రీమద్రాజరాజనరేంద్రపరిపాలితము నాఁటినుండి నేఁటివఱకు వాగనుశాసనుని లెక్కించిన యంగుళియందు నిలుపఁదగిన పేరు గలకవి యెవ్వం డేని కలఁడా? గంగాప్రవాహశీతలవిమలసలిలశీకరములంబోలె శబ్దవిసరమును వెదఁజల్లినవాఁ డొక్కఁడేని కలఁడా? ఆమహాత్మున కామహాత్ముఁడే సాటి యని చెప్పుట యతిశయోక్తియని యెవ్వఁ

డనగలఁడు ? వారిపద్యము నొక్కదానిం బఠించి జన్మము పవిత్రతమముగాఁ జేసి కొనెదను.

చం. దళితనవీనకందళకదంబకదంబకకేతకీరజో
మిళితసుగంధబంధురసమీరణుఁ డన్ సఖుఁ డూచుచుండఁగా
నలియుచు మొల్లగుత్తులను నుయ్యెల లూపఁగ నెక్కియాఁగె ను
ల్లలదళినీకులంబు మృదులధ్వనిగీతము విస్తరిల్లఁగన్.

ఇందలిపదలాలిత్య మనుపమానము. అర్థచమత్కృతి వర్ణింపఁ దరము గానిది. ఇట్టికావ్యముల మూలమున నాకాలపుమతనియమాదులు స్పష్టము లగుచుండును. అట్టిమహాకవులప్రాపున నట్టిమహారాజులయండ నీయాంధ్రభాష పెంపునొందెను. నవనవాలంకారముల విరాజిల్లెను.

ఇపుడు కావ్యరచన యడుగంట నున్నది. మొదలు కావ్యరచనయే వ్యర్థ మని కొందఱు వాదించుచున్నారు. నియమములఁ బాటింపకుఁ డని యుద్ఘోషించుచున్నారు. మఱికొందఱు ప్రాచీనాంధ్రగ్రంథములయం దతిశయోక్తులు గాని స్వభావవర్ణనము గనుపట్ట దందురు. అట్టిమహాత్ములు,

సీ. పాలుపారఁగా బోరగిలి పాన్పునాల్గుమూలలకును వచ్చును మెలఁగి మెలఁగి
లలిఁ గపోలంబులు గిలిగిలింతలుపుచ్చి నవ్వింపఁ గలకల నవ్వినవ్వి
ముద్దులునోలఁ గాడ మ్రోఁకాలఁ గేలను దడవుచు నెంకును దారితారి
నిలుచుండఁ బెట్టి యంగుళు లూఁత చూపఁగాఁ బ్రీతిఁదప్పడుగులు పెట్టిపెట్టి
యన్నఁ గంటిఁ దండ్రి నిగంటి నయ్యఁ గంటి, నింకు రావయ్య విందులవిందవనుచు
నర్థిఁ దన్నుఁ బిలువఁగ నడయాడి యాడి, యుల్లసిల్లెఁ గృష్ణుఁడు శైశవోత్సవముల

సీ. వాఁకలఁ బడి నీరు వలియఁ బ్రాఁకఁగ మిఱ్ఱుగొండొండ బలసితృణోత్కరముల
తుదలు *పచ్చఁదనంబుతోఁ దలచూపఁగఁ దీఁగలొయ్యనఁ గొంకు దేఱికొనలు
మొగమెత్తమెత్తన యిగురాకుడొంకఁ దరువులు తనిగాడ్పుశశసరుచులు
గాంచి సప్రాణించి క్రమ్మఱఁ గొమ్మలు గదలించి నర్తనక్రమ మొనర్ప
నెలవు లేర్పడి క్రుమ్మరు నెలవు లెఱిఁగి, మృగకులంబులు బ్రమువాసి మెలఁగఁ, జొరఁగ
నాటవికకోటితమజాడలరసితిరుగ, నడవు లొప్పారెఁ జండవర్షాత్యయమున.

అను నెఱ్ఱాప్రెగడరచించిన హరివంశమునఁ గలయీపద్యములను బఠించి నికృత్తసంశయు లగుదురుగాక ! ఈసునను నొందె, శక్తిహీనత నొందె, పూర్వ

*. నిశ్ఛదనంబుతో-అనిమార్పఁబడినది.

లఁ దిరస్కరించిన లాభ మేమి గలదు? పద్యకావ్యములు విశేషించి వృద్ధికావలయును. గద్యకావ్యములు నిస్సారము లని నాభావము కాదు. మనస్సమ్మోదము నుత్పాదింపఁ బద్యకావ్యము లే మిన్న లని సన్నుతింగాంచిన వని నే నెన్నెద. శాస్త్రము లన్నియు నాంధ్రమునఁ బరివర్తనము చేయునపుడు గద్యము హృద్యముగ నుండును. నియమబద్ధముగను మృదుతమముగను నుండుభాష గ్రంథములయం దుండఁదగినది. పరస్పరసంభాషణమున వ్యాకరణమును బాటింపనంతమాత్రమున నట్టిభాష గ్రంథములఁ జేర్పఁదగదు దానరసమొదవదు.

## ——♦ భావకవిత్వము ♦——

ఇఁక భావకవిత్వమును గుఱించి నాలుగుమాటలు వచించెదను. భావకవిత్వ మనఁగా నర్థమేమో, వా రేయర్థమునం దిమిసించిరో తెలియదు. భావప్రధానకవిత్వ మని మన మూహింపవచ్చును. ప్రాచీనగ్రంథములయందు శబ్దాడంబరమే గాని భావము లేదని వారియూహ యైనట్లును దోఁచెడి. ఇంతకన్న నసంగత మగుమాటకలదా? ఏభావము లేకున్నఁ గవిత చెప్పుటెట్లు? పూర్వోదాహృతపద్యమునందు నన్నయభట్టారకుని భావ మేమని పరికింతము. వర్షర్తువును వర్ణించుచున్నాఁడు. ఆకాలమునందుఁ గుసుమపరిమళభారమును వహించి వాయువు వీచుచుండు ననియు, నటవీమల్లికలు పూచియుండఁ గా నాగుత్తులయందుఁ దుమ్మెదలు ఝుంకారము లొనరించుచు నూఁగుచుండె నని భావము. దీనిచేఁ బాండవులు శ్రీకృష్ణాగమనమునఁ గుతూహలస్వాంతులు కాఁగల రని ధ్వని ఇందు గంభీరభావము లేదా? వ్యంగ్యకావ్యము ప్రశస్తమని పూర్వులసిద్ధాంతము. భావము వాచ్య మగుచో మధ్యమకావ్యమే యగు. ఎంత తఱచిన నంతభావము వెల్లివిరియుచున్నది ఎట్టివారు వినినను జదివినను మనస్సున కేపగ్గింపక శబ్దముల భావము కూడ నలరారుచుండవలయు. ఇట్లు మనగ్రంథములు వేలకువే లుండఁగా భావకవిత్వ మని క్రొత్తదారి యిది యని త్రొక్కఁజూచుట భావకవిత్వమునకే కాని వేఱొండు లాభము కానరాదు. భావము లేని కవిత్వ మొకటియుండునా?

కొందఱు భావముమాట మాకేల గాని ఛందోనియమముల సడలింపవలయు నని పెనఁగులాడుదురు. యతిప్రాసము లేలయని ప్రశ్నింతురు. శ్రుతి, తాళము, సంగీతమునకేల యని ప్రశ్నించినట్లే యీప్రశ్నయు గనఁబడుచున్నది.

అట్టినియమము లున్నదే పద్య మగును. ఆనియమములు వలదనువారు యక్షగానముల రచింపవచ్చును గద్యమును వ్రాయవచ్చును. నిష్కారణవైరమును ఛందోవిషయమునఁ బూననేల? గీర్వాణభాషయందు లేనినియమము లిందేలయని ప్రశ్నింపరాదు. ఒక్కొక్కభాష కొక్కొక్కపద్ధతి హెచ్చుగా నుండవచ్చును. అది సంపదనియే రాజోలికిఁ బోక తొలఁగుట మంచిది. అంతియగాని దానిని సవరింపఁ బూనరాదు. దాన మేలు లేదు. మఱియుఁ గీర్తి కలుగఁబోదు.

## — నాటకములు —

ఇఁక నాటకములస్థితి యెట్లున్న దని విచారించు టనవసరము కాదు. నాటకనియమములకుఁ దిలోదకము లొసంగి చాలకాల మైన దనవచ్చును. ఎవ్వరైన వ్రాసిన దాని నెల్లను క్రొత్తపద్ధతి యని తూలనాడుదురు. నాటకములు భాషాభివృద్ధికి మూలము లనక తప్పదు. నాటకదర్శనమే పాపమను వారు కొందఱు గలరు. నటుల దుష్ప్రవృత్తిం గాంచి వారట్లు బెదరియుందురు. నాటకములు ప్రాచీనులమతాచారములను, మర్యాదలను రాజప్రజలపరస్పర సంబంధములను, నింక ననేకవిషయములను బోధించుచు నీతిని బోధించుటకే యుద్భవించినవి. శ్రుతి స్మృతులఁ బరిశీలించిన పెద్దలు కూడియుండుసభలకుం జని తెలిసికొనుట యొకపద్ధతి. నాటకములఁ జూచి నేర్చుకొనుట యొకపద్ధతిం ఈరెండుపద్ధతులయందు జనసామాన్యమునకు రెండవపద్ధతియే యనువగునది. ఇట్లు లోకమున కుపకరించునాటకములు లక్షణవిరుద్ధములయ్యె నేని చెప్పవలసిన దేమి? "మంత్రీ! భోజనమునకు వేళయైనది. పోవుదము రమ్ము" అని రాజు నోటఁ బలికించినచో నద్దానిం జూచి రాజమర్యాద యెట్టి దని నేర్చుకొందురో చెప్పవలయునా? నాందీపద్యము నాటకార్థమును సూచించునది గా నుండవలయు నన్న నియమ మేనాఁడో త్యజింపఁబడినది. స్వేచ్ఛగా రచించుట యాచారమైనది అంకములుగ విభజించు నాచారము గలిగియుండెను. ఇపుడు తోచినన్నిరంగములు గా వ్రాసి ముగించునాచారము క్రొత్తగా వచ్చిన ట్లొక నాటకము పరిశీలించుచుఁ జూచితిని. ఇట్లు నియమముల నుల్లంఘించి నాటక కర్తలను బాధింపక యుండఁ గాపాడుట భాషాభిమానులకు విధియైయున్నది. ఇట్టిస్వేచ్ఛయు భాషాభివృద్ధి కొక కొఱంత యని తలంచుచున్నాను. రాజభక్తి, దేశభక్తి, మతాభిమానము మొదలగువానిని వృద్ధిచేయునది గా నాటకము వెలయవలయు నను భావము నాంధ్రులు మఱవరాదు. దానిని బోషించునా

టకముల వ్రాయించునూహలను గల్పించుట యీమహాపరిషత్తునకు విధియై యున్నది.

## —♦ నా ట క భా ష ♦—

ఉత్తమమధ్యమాధమపాత్రములకుఁ దగినట్లు భాష యుండవలయు నని, తుడుము మొదలు దేవతార్చనమువఱ కన్నట్లు రాజు మొదలు సేవకునివఱకు నొక్కరీతిగా భాషయుండరా దని, కొందఱమతము. ఎట్లుండిన బాగుగనుండునో నిర్ణయించుట శక్యమగు పనికాదని యొక్క కొందఱమతము. పండితాఖండలు లుండు నీమహాపరిషత్తీభారమును గూడవహించి సిద్ధాంతము చేయు నెడల సమంజసముగా నుండు నని నే నాశించుచున్నాఁడను.

## — విమర్శనగ్రంథములు —.

భాషాపరిపూర్ణజ్ఞానమునకు విమర్శనగ్రంథములు మహోపకారకము లని కొంద ఱూహింతురు. ఆయూహ రసికజనాదృతికిం దగినదియే. మనపూర్వు లట్టిగ్రంథముల రచింపలేదనువారు కొందఱు కలరు. అది యొకలోప మనువారుకూడఁ గొందఱు కలరు. విమర్శనగ్రంథము లుండవలయు నన్నమాట సమ్మతమే గాని పూర్వులు వ్రాయలేదనుట పొరపాటు. ఔచిత్యవిచారచర్చ లోనగునవి యట్టివే కదా. క్షేమేంద్రునికంటె మిన్నయగువాఁ డొక్కవిమర్శకుఁ డుండునా. తెలుఁగునం దట్టిగ్రంథములు లేవే యనవచ్చును. తెలుఁగునఁ గవిత్వ మారంభించి యించుమించుగా నేఁడెనిమిదివందలవత్సరములకంటె మించ లేదు. నన్నయభట్టారకున కాదికవి యని యిచ్చుతాంబూల మిపు డూఁగులాడుచున్నది. నన్నెచోడుని పరిసరమునకు జరపఁ బడుచున్నది. అంతకుముందుఁ గవు లుండరా. వారిఁ బరిశీలింతము. ఏలతొందఱపడవలెను. కొట్టులో నాతాంబూలమును బెట్టింపుఁ డని కొంద ఱనుమతి యిచ్చుచున్నారు. ప్రథమకవి యెవ్వఁడని నిర్ణయింపఁబడునో యూహింపఁ జాలకున్నాఁడను. ఆవాదమీబ్రహ్మకల్ప ముండుదనుక నుండవలసినదే. ఎవ్వఁ డెవ్వనిపేరు చెప్పి యీతఁ డాదికవి యన్నను వానికి ముం దుండరా యన్నప్రశ్నము రాకమానదు. ఇది యనవస్థాప్రసంగమునఁ బర్యవసాన మగును. తుదకు నన్నయభట్టారకునకే చేరఁదగు ననియు, నామహాత్ముని మించినివాఁడు లేఁ డనియు నేనూహించువాఁడను. భాషాభివృద్ధికిఁ దగినన్నిగ్రంథములే లేనపుడు రచించినవారిగ్రంథమును విమర్శింపఁబూనుకొన్నచో మనకేల యీచిక్కని వారుకూడ మానుదురేమో యను

భీతినూరకుండు రని యీవిషయమున నా భావము. లేకయున్న నీపాటి పాండిత్యము వారికి లేకుండునా.

మనము మహాభారతమును బరమపావనగ్రంథరాజమునుగా భావించుచున్నవారము. వ్యాసాదులను భగవంతునివలె భావించుచున్నవారము. అనుదినము వారియుపదేశములు వేదవాక్కు లని నమ్మియున్నవారము. అట్టిభారతమును విమర్శింపఁబూనినపు డందుఁగల ధర్మవిశేషము లేవి? తరణోపాయము నెన్నిరీతుల బోధించిరి? ఎందువలన నందుఁ గొందఱు జగద్వినుతికిఁ బాత్రులైరి? అను మొదలగు విషయముల నడఁగద్రొక్కి యస్మదాదులకుం గలభక్త్యుత్కర్షమును నశింపఁజేయఁబూని వ్యాసాదులు కుఁభ్రష్టులు వారిమాటలు పరిగ్రాహ్యములు కావు, ఆకాలమునఁ గలనాగరకత యత్యంతమునీచము, అను నీరోసగుభావముల వెల్లడించుచు విమర్శనగ్రంథము వ్రాయుట వ్యర్థము. పామరులకుం గలభక్తి నందుఁగల యొక్కశ్లోకమే పెంపొందఁ జేయును. చతుర్విధపురుషార్థముల తత్త్వముఁ దెలుపునట్టియుత్కృష్టగ్రంథరత్నమును దూషించుట బాగుగాదు. ఆస్తికుల నాస్తికులనుగాఁ జేయఁబూనుటకే యీప్రయత్నమని కొందఱు తలఁతురు. ఖండాంతరవాసులు వ్రాయునిందు, నాస్తికాభాసులు దానిం దలదాల్పుదురు. భగవంతుఁడు భావనామాత్రసంతుష్టహృదయుఁడు. భారతము వేదమనియే భావించి యందలినీతుల నేర్చుకొన్నఁ దరింపఁగూడదా. అట్టి గ్రంథరత్నము నామూలాగ్రము, సమన్వయము చేయఁజాలని మనమాక్షేపించి లోపములనుజూపి యున్నవిశ్వాసముం గూడ నూడఁగొట్టుట మంచిపనియే కాదని నాయూహ. ఇట్టిపుట్టగొడుగులవంటి గ్రంథము లెన్నిలక్షలు పుట్టినను దానినాదరించువారు కోట్లకొలఁదిగ నుందురనుట సత్యము. సూర్యునిపై నుమిసినట్లు భారతమును దూషించినందున వేఱొకలాభ మేదియుఁ గానరాదు. కావున నట్టి ప్రయత్న మొనరించి యపూర్వఖ్యాతిని గాంచనెంచక క్షీణింపనున్న భక్తిని బెంపొందించునట్లు విషయముల నుద్ధరించి వ్రాయుచు భవిష్యద్గ్రంథకర్తలకు మార్గదర్శకులుగా విమర్శకు లుందురుగాక యని వారిని వేఁడుచున్నాఁడను.

విమర్శనగ్రంథకర్తలయం దొక్కదోష మారోపింపవచ్చును. వారు విశేషించి లోపములనే చూపఁబూనుదురు. మఱియు గ్రంథకర్తను దూషింపఁ దలపెట్టుదురు. తుదకు నది వ్యక్తిని దూషించుపనితో సమాప్తమగును

విమర్శనగ్రంథకర్తకంటెఁ గవికి మిత్రుఁడు వేఱొకఁ డుండఁ డని నా తలంపు. గుణదోషములఁ జూపి యందును దోషములఁ దెల్పునపుడు నాతికఠినముగఁ బలికి గుణవిమర్శనమునం దధికప్రసంగము చేయుట సరసము. లేనిచో విరసమే. ఎట్టివారికిఁ బ్రమాదము లుండకమానవు.

శ్లో. తేనాభిఘాతరభసస్య వికృష్యపత్రీ వన్యస్యనేత్రవివరే మహిషస్య ముక్తః
నిర్భిద్యవిగ్రహమశోణితలిప్తపుంఖస్తం పాతయాం ప్రథమమాస పపాతపశ్చాత్

అని కాళిదాసమహాకవి-(రఘు ౯-౬౧)ఇందలిప్రమాదమును గొప్పగాఁ బలికి పెద్దగ్రంథము చేసి,

శ్లో. స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః పయోధరోత్సేధనిపాతచూర్ణితాః
వళీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే చిరేణ నాభిం ప్రథమోదబిందవః.

అని కాళిదాసు రచించిన (కుమా. ౫ స) శ్లోకమునందలి భావగాంభీర్యమును విమర్శించునపుడు నాల్గుమాటలతోఁ జల్లఁగా జాఱవిడిచిన నాతఁడు విమర్శకుఁడు కాఁడు. అది యొకవిమర్శనగ్రంథము కాదు. ఆంధ్రభారతమును విమర్శించుచు ధారుణి, జీవగఱ్ఱ, లోనగువాని నాక్షేపించి యాక్షేపించి,

సీ. సహకారమత్ప్రియసహచరుఁ బున్నాగ పున్నాగుఁ దిలక భూభువనతిలకుఁ
జందన బుధహరిచందనుఁ బుష్పితాశోక సుహృజ్జనశోకదమను
వకుళ కులైకదీపకు విభీతక భయభీతార్తిహరు నలుఁ బ్రీతితోడఁ
గానరే కానరే కాన లోకోత్తరు ననిమ్రాఁకమ్రానికి నరుగు నరిగి-మొ॥

అను మొదలగుతావులఁ గలచమత్కృతిని వినుతింపక యున్న నదేటి విమర్శము? కొంతకాలముక్రింద నొక్కపండితుని గ్రంథమును వేఱొకపండితుఁడు విమర్శించెను. నే నద్దానిం జదివితిని. చమత్కారముగా దూషించుటెట్లో తెలిసికొనఁగల్గితి. అందు సత్యము లే దని నాభావము కాదు. వ్యక్తిని దూషించుట సరసము గా దని నుడివితిని. సావధానముగా నాలోచించి గుణదోషవిమర్శనమునందుఁ గవి తన చాతుర్యమును జూపవలయు ననుటయే యీనామాటలం గలసారము. అట్టిగ్రంథము లుత్పత్తిల్లినం గాని యిప్పటిగ్రామ్యభాషావాద మడుగంటదు. ఇప్పట్టున గ్రామ్యభాషం గూర్చి నాలుగుమాటలు పలికెదను.

— గ్రా మ్య భా ష . —

గ్రామ్యభాష ప్రతిదినము వింతరూపములు గలదిగా మాఱుచుండును.

కొన్నిమండలముల నుండువారు "గుఱ్ఱమెక్కె" నన్నమాటను గల్లుత్రాగె ననునర్థమున వాడుదురు. వేఱొకమండలమున నశ్వము నధిరోహించె ననునర్థమునందే దాని నుపయోగింతురు. ఇట్టి వెన్నియో కలవు. కళింగాంధ్రదేశ సంయోగస్థలములఁ గొన్ని గ్రామ్యభాషాపదములు గలవు, అవి కర్ణాటకము తెలుఁగుదేశము గలియుతావులను, ఆసమీపభాగములయందును నించుకంతయుఁ దెలియఁ దరముగాకయుండు. తెలుఁగు, ఆంధ్రము కలియుప్రదేశములఁ గలపదములు మఱొకచోట విపరీత మగునర్థము నిచ్చుచుండును. ఒక్కమండలముననే యొక్కమూల నున్నపదములు వేఱొకమూల నున్నవారికి విరుద్ధార్థములు గలవిగాఁ దోఁచును. కావుననే గ్రంథములయందట్టివానిని జేర్పరాదని మనవా రూహించిరి. ఆంధ్రము, తెలుఁగు ననుదేశములు పూర్వము వేఱుగా నుండెను. ఏకాలముసందో, ఒక్కటిగాఁ జేరినవి. ఇపు డాంధ్ర మన్నను దెలుఁ గన్ననొక్కటియే. ఆదినుండి యట్లు లేవు.

శ్లో. జగన్నాథా దూర్ధ్వభాగ మర్వాక్ శ్రీభ్రమరాత్మికాత్
తావదంధ్రాభిధో దేశ స్సౌరాష్ట్రం శృణుసాదరమ్
శ్రీశైలంతు సమారభ్య చోళేశా న్మధ్యభాగతః
తైలంగదేశో దేవేశి ధ్యానాధ్యయనతత్పరః॥ అనిశబ్దకల్పద్రుమము.

నన్నయభట్టారకుఁడు తెలిఁగించెదననియె, తిక్కనసోమయాజి ఆంధ్రీకరించెద ననియె. ఆనాఁటికే యవి రెండు నేకరూపత నొందియుండె నని యూహింపవచ్చును. తెలుఁగురాజు లాంధ్రదేశముపైకి దండెత్తి వేఁగినాఁడు చేరిరని యొకచో నున్నయు ట్లొకరు వ్రాసిరి. ఆంధ్రరాజులు నర్మదానదివఱకు దిగ్విజయమొనర్చిరని యుదాహరణము లున్నవి కదా! ఈరెండు నేకాలమున నేకరూపమును దాల్చెనో సిద్ధాంతము చేయఁ బూనుఁ డని పరిశీలనమున దక్షులగు మ. రా. శ్రీ జయంతి రామయ్యపంతులుగారి నభ్యర్థించుచున్నాఁడను. ఆంధ్రమనుదానికిఁ దెలుఁగనునది పర్యాయపదముగాఁ బూర్వము లేదని నే నూహించుచున్నాఁడను. దీనితత్త్వము నెఱుంగఁగోరుచున్నాఁడను. గ్రామ్యపదములు చొప్పించి వ్రాసినపుస్తకములు శ్రుతికటువులుగ నుండుటయే గాక విద్యార్థులకు ననర్థావహము లనఁదగి యుండును. ఆపదములం గూర్చి వ్రాసినగ్రంథ మెట్లుండునో యిపుడు చెప్పనక్కఱలేదు. దానికి వ్యాకరణమక్కఱలేదు. ఎవరికిఁదోఁచినట్లు వారర్థముచేసికొనవలసియుండును. అట్టిస్థితి మన

యాంధ్రభాషకు సంభవింపక యుండుఁగాక యని వారక కోరుచున్నాఁడను. ఇది భాషకు విపత్కాలము. ఆపదుద్ధారకులు నిలువంబడి హోరాహోరిగాఁ బోరాడి భాషను రక్షింతురు గాక. ఇంకఁ బ్రబంధవిషయము:—

వీనింగూర్చిన విషయము గ్రంథరచన యనుదానియందే చెప్పఁదగి యుండియు నిట చెప్పటకుఁ గారణము గలదు. పురాణములు తెలిఁగించు కాలము సాఁగఁగాఁ బ్రబంధముల నారంభించిరి. తొలుదొలుతఁ గల్పనాప్రధానములుగా నుండుట బాగుగనే యుండిన దనక తప్పదు. కాలము జరగినకొలఁది వెఱ్ఱియావేశము కవులకుం గల్గిన దనవచ్చును. దానికిఁ బ్రతిఫల మసమంజసముగా వర్ణనాదులు పెంచుటయే యనవలయును. చదువరుగూడ మనస్స్వప్నవిధముగా వ్రాయఁబూనిరి. యథామాతృకాన్యాయానుసారము మార్పించుక గావించి ప్రాఁతకల్పనలనే చేర్చుచువచ్చిరి. కావున గ్రంథపఠనమునకు ఫలము విసుగనియే మన మూహింపవచ్చును. ఏ ప్రబంధము చదివినను వరుస తప్పువివర్ణనములు కన్నులకు భారమును గల్పించుచుండును. కావున లోకజ్ఞానము విశేషించికలవా రిట్టి గ్రంథములవలన లాభము లేదని యూహింపఁజాలిరి. ప్రబంధము నీతిదాయకముగను బూర్వపద్ధతులఁ దెల్పునదిగనుండవలయును. కేవలశృంగారముమాత్రమే తెలిపుచ్చునదిగా నుండరాదు. ఈకాలమునఁ బ్రబంధములు రచించువారు తక్కువయగుచున్నారు. ఒకవేళ నెవ్వరైనం బూనినను జాగరూకత గలిగి పూర్వసదాచారములఁ దెలుపఁజాలి విసుగును గల్గింపక యుండునట్లు రచియింతురుగాక! అందందుఁ గఠినపదములఁ బ్రయోగించినను గాలము ననుసరించి నిఘంటువులఁ జూడఁజాలనంత యలసు లుందురు, గాన సులభరీతి నాశ్రయింతురుగాక! వర్ణనములే పనికిరావనియుఁ బ్రాచీనలక్షణములఁ బాడొనరింప వలయుననియు నాభావమని గ్రహింపకుఁడు. చేష్టలు రూపాంతరమును దాల్చినవి! సంభాషణవిశేషములు తాఱుమాఱైనవి. గజహయరథవర్ణనము లిప్పుడు పనికిరావు. బాష్పశకటముల వర్ణింపవలయును. కావున నామార్గమునే వదలి యుచితమగు రీతి వర్ణనములఁ గనఁబఱిచి కథాభాగమునఁ దమకుఁ గలచమత్కృతిజనకపాండిత్యవిశేషమును బాటింతు రని యభ్యర్థించుచున్నాఁడను. సంస్కృతమునఁ గలయలంకారముల కెల్ల నుదాహరణములు దొరకునట్లు ప్రబంధములు రచింపఁ గవితల్లజులం బతిమాలుచున్నాఁడను. ప్రాయికముగఁ బూర్వప్రబంధముల యందుఁ గొన్నియలంకారము

లకే యుదాహరణములు లభించును. సూక్ష్మాద్యలంకారముల కుదాహరణము లు దొరకునా యనుసందియము నన్ను బాధించుచున్నయది. మనకాలముననే యాంధ్రభాషాయోషామణి దైన్యము గాంచక యుండ నెల్లభంగులఁ గాపాడుట న్యాయ్యము కావున భాషను రక్షింప నడుము కట్టవలయును. తీసుక పెట్టుక యిత్యాదిశ్రుతికటువులు నిషిద్ధములు నగు ప్రయోగముల మానవలయును. ప్రాచీనగ్రంథములయం దున్నవే యని శంకింపరాదు. వారిహృద్యతమ కవిత్వమునం దిట్టి వెందో యుండినను బ్రమాద మని యుపేక్షించుట వారిని సేవించినట్లే యగు నని నేనెంచుచున్నాఁడను. ఇపుడే క్రొత్తవ్యాకరణము లుప్పతిల్లం జూచుచున్నవి. వానికి నుదాహరణసమృద్ధిం గల్గింపఁ బ్రయత్నింపక ప్రాచీనప్రమాదప్రయోగప్రకరణమునకుఁ జేయూఁత యొసంగక మనకుంగల యత్యల్పపాండిత్యము నాధారముగా మహాత్ముల నాక్షేపింపక సాధుమార్గమున గ్రంథరచన యొనర్చి భాషాదేవి నుపాసింతు రని నేఁ బ్రార్థించుచున్నాఁడను.

—♦ పరిషద్విధి ♦—

ఇప్పటి భాషాదుర్దశను దొలఁగించుభార మీపరిషన్మూర్ధముననున్నది.

శ్లో. దశావరా వా పరిషద్యం ధర్మం పరికల్పయేత్
త్ర్యవరావాపి వృత్తస్థా తం ధర్మం నవిచాలయేత్.

అను మనుస్మృతిప్రమాణము ననుసరించి కరికించితి మేని పెక్కండ్రు పండితాఖండలులు చేరియున్న యిమ్మహాపరిషత్తు భాషారక్షణము గావింపఁ గంకణము కట్టుకొన్నది గాన నేది నిశ్చయించినను దాని నెల్లరు శిరసావహింపవలయును. పత్రికాప్రకటనకార్యము చాలదు. పురాణగ్రంథము లెన్నియో మూలలఁ బడియున్నవి. ముద్రించిన మహాభారతాదులయందే ముద్రాక్షరశాలాస్థానపండితులు స్వేచ్ఛగా నెన్నియో పాఠభేదములఁ గల్పించినారు. పుస్తకాంతరములఁ జూచినట్లే కొందఱు పల్కుచున్నారు. భారతాదులలో నిట్టి ప్రమాదములఁ బరిశీలింపకుండినచో నిఁక గతియేది? మునుముం దట్టిపాఠములఁ బరిశీలించి బహుగ్రంథములం బరికించి యందుత్తమపాఠములను దెల్పి పుస్తకముల బాగుచేయవలయును. అది చేయకయున్న నావంటియల్పమతులు పెక్కండ్రు స్వతంత్రించి ప్రయోగించుపదములే వ్యాపించును. నిఘంటుకార్యమపారముగనున్నది. దానిని సత్వరముగాఁ బైకిఁ దేవలయును. కాని గొడ్డలి నానవేసినట్లు చేయరాదు. ఈపరిషదుత్సవము గుంటూరునందు సాఁగినదిమొద

లీనిఘంటువును వీక్షింప వేడుకపడుచున్నాఁడను. దానిసందర్శించుటయే యీ జన్మమునకు ఫలమని తలంచుచున్నాఁడను. ఆపుణ్యము మెప్పుడు లభించునో తెలియఁజాలకయున్నాఁడను. మహాకార్యమును దలపెట్టినపుడు ప్రతిక్షణవిలక్షణముగాఁ బని కొనసాగింపవలయును గాని యాలసించుట మంచిదిగాదు. కార్యమో కడుం గడుం బెద్దది. సముద్రమున కేఁతము వేసినట్టిది. ఐనను మానవులము గావున నశ్వత్థామవలె బ్రదుకఁజాలము. కొంత లున్నఁ దరువాతివారు తీర్చుకొందురుగాక యని బయలుపఱుపవలయు నే కాని మీనమేషము లెంచుచుండరాదు.

శ్లో. ఆదానస్య ప్రదానస్య కర్తవ్యస్యచ కర్మణః
క్షిప్ర మక్రియమాణస్య కాలః పిబతి సంపదః.

అన్నసూక్తి ననుసరింపక తప్పదు. లేకున్నను నెన్నియో యంతరాయములు రావచ్చును. కావున భగవంతునిమీఁద భారమువైచి దానిం బూర్తిచేసి యాంధ్రమహాజనులయెదుటఁ బెట్టవలయు నని మఱిమఱి వేఁడుచున్నాఁడను. శ్రీయుత పీఠికాపురమునజరిగిన యీపరిషన్మహోత్సవమునని దగ్రాసనాధిపతిగారు ముచ్చటించియున్న యట్లు సత్కవుల యోగ్యతలను బరిశీలించి బిరుదముల నిచ్చుచుండవలయు నని నేను గోరుచున్నాఁడను. ఇంతకుముం దెవ్వరును దీని నేల ప్రస్తావింపలేదో యని ప్రశ్నించుకొని తగినకారణమును దానిని వారే తెల్పిరి. ఎల్లరును బిరుదముల నీయ వెనుదీయుటలేదు. తుదకవి గౌరవమును గోల్పోవుచున్నవి. ఏతన్మహాపరిషత్ప్రదత్తబిరుద మట్టిది కాదు. కావుననాపని యొనరింప నీపరిషత్తు వెనుక త్రొక్కుత్రొక్కరా దని విన్నవించుచున్నాఁడను. భాషోద్ధరణమే ముక్తియని భావించు నీమహాసభ యట్టి కార్యములఁ గొనసాగింపకయున్న నిఁక దీనిం బూనుకొనువా రెవ్వరు గలరు ?

మహాశయులారా ! నాయీవాక్యములు నిస్సారములు; వీనిం జెప్పుచు నమూల్య మగుమీకాలమును వ్యర్థముగ జరగఁజేసితిని. పండితోత్తము లుపన్యసింప నాతురతఁ జూపుచున్నవా రని యే నెఱుంగుదు. నేనును దదుపన్యాసామృతమును గ్రోలి సుఖింపఁదలంచెదను. నన్నిఁకదనుక మాటలాడ ననుజ్ఞయొసంగి యాదృతిం జూపిన మీకెల్లరకు నమస్కరించుచు నేతత్పరిషత్ స్థాపక మహాశయులకుఁ గృతజ్ఞుఁడనై యుండువాఁడను.

# సాహిత్యపరిషత్తుల కృత్యములు.

—♦ పవ్వు మల్లికార్జునరావుగారు. బి. ఏ. కోరంగి ♦—

మానవపురోవృద్ధికి నీతిచట్టము లెట్లో భాషాపురోవృద్ధికి వ్యాకరణశాసనము లట్టివి. నీతిచట్టములు కృత్రిమములుగాఁ గాన్పించుచుండినను ప్రకృతిసౌందర్యమును బోషించుటకుఁ దోడ్పడినట్లు వ్యాకరణశాసనములు భాషాసౌందర్యమును బోషించుట కాధారము లగుచున్నవి. మానవాంతఃకరణప్రవృత్తులను బ్రకృతిచిత్రములను బాగుగాఁ బరిశీలింప నేర్పుగలమహాకవులు భాషాప్రపంచమందలి మనోహరశబ్దరూపములనుగూడ లెస్సగాఁ గనిపెట్టవలంతు లనియే మనము నమ్మవలసియున్నది. కావుననే మహాకవులధారాళప్రయోగములు వ్యాకరణస్థములై సర్వజనానుకరణీయము లగుచున్నవి. భాషాసౌందర్యమును జెడఁగొట్టుకొనకుండఁ గోరుకొమేని వ్యాకరణశాసనముల నుల్లంఘింపకుందుముగాక ! అట్లుల్లంఘింపక వ్రాసినవారిభాషను కృతకభాష యనుట పొరపాటని నాయభిప్రాయము. కృతకత్వ మెచ్చట నున్నది? భాషలో లేదు. భాషాపదములు ప్రకృతినుండి గ్రహింపఁబడినవే మన మెన్నుకొనుటచేఁ గృతకత్వము కలదా. అంతమాత్రముచేఁ గృతకభాష కాఁజాలదు. ప్రకృతిసిద్ధము లగునరణ్యములందు వృక్షము లేక్రమమును లేక జీకాకుగాఁ బెరిగియుండఁగా వానిలోఁ గొన్నిటిని మనోహరమైనవానిని సేకరించి యుద్యానవనము నిర్మించినచో నందలివృక్షములు కృతకము లగునా? మనము వాని నెన్నుటలోను నాటుక్రమములోను గృతకత్వ ముండును గాని యవి పెరుఁగుటలోను వాంఛితఫలంబు లొసంగుటలోను బ్రకృతిధర్మమునె యనుసరించును గాని లక్షణవస్తువులవలెఁ గృతకములు కాఁజాలవుగదా అట్లే వ్యాకరణమున స్వీకృతములైన పదములును భాషాప్రకృతిలోనివియే గాని కృతకములు కాఁజాలవు. భాషాప్రపంచమందలి మనోహరపదార్థములను మేధావంతు లగుమహాకవులు సర్వకాలములయందును గ్రహించి భాషను స్వాభావికమైనపెంపును బొందించుచున్నారే కాని యస్వాభావికముగా నొక్కమాఱు వృద్ధిచేయ సమకట్టి వికృతరూపములు గలపదములఁ దూర్చి భాషాస్వరూపనాశనమున కెన్నఁడును బూనుకొని యుండలేదు. ఇప్పుడు మన మట్టి

యత్నములలోఁ బ్రవేశించితి మేని భాషాస్వరూపమును నాశనముచేసి శాశ్వత మగునపకారము మాతృభాష కొనర్చినవార మగుదు మని కావ్యకర్తలకును వ్యాసరచయితలకును ప్రబోధము చేయుచున్న వాఁడను మార్పులభివృద్ధి కవసరము లనుమాట సత్యమే కాని రాజకీయవిషయములలో నొక్కొక్క జాతి కనుగుణ మగు రీతిని సాంఘికవిషయములలో నొక్కొక్క సంఘమున కనుగుణ మగురీతిని మార్పులు చేయుట సమంజస మని బుద్ధిమంతు లెట్లు తలఁచుచున్నారో యట్లే భాషావిషయములోఁ గూడ నొక్కొక్క భాష కనుగుణ మగు రీతిని మార్పు లొనరించుట భాషాసంప్రదాయానుసరణ మగునభివృద్ధియే యగును. ఒ అనునక్షరమున కిప్పి వంకర లెందుకు? ఆంగ్లేయభాషలో సున్న చుట్టిన "ఒ" యగుచున్నది. కావున మనము సున్న వంటిసులభరూపమునే పొందుద మని కాని దానితో బాలురవిద్య నారంభింత మని కాని యసాంప్రదాయకముగ యత్నించుట మతిభ్రమణసూచకము గాని మేధాస్ఫురణము కాదు. కావున సంప్రదాయానుసరణముగ భాషాపరిణామములఁ గావింప నిశ్చయించుట యొకకర్తవ్యము.

వాఙ్మయమందు సద్రుచి కలిగియుండుటయు నితరులకుఁ గలిగించుటయు రెండవకార్యము. "కవితాయ ద్యస్తి రాజ్యేన కి’మ్మనువారోక్తికిఁ బాత్రమగు కవితాపటిమను గొందఱు తుచ్ఛవిషయంబులను దుచ్ఛవర్ణనలందును వినియోగించుచున్నారు. అట్టివానిని సద్గ్రంథములుగఁ బరిగణించి త్యజింపుచుఁ బాఠకులకుఁ బ్రోత్సాహము కలిగింపకుండవలెను. గ్రంథపఠనము కేవలవినోదమునకే కాక జ్ఞానాభివృద్ధికిని నవసర మని యెంచెడుపక్షమున సదసద్గ్రంథవిచారణ మత్యావశ్యకమై యున్నది. ప్రస్తుతకాలమున నవలలు నాటకములు కుప్పలుతిప్పలుగ బయలుదేఱుచున్నవి. భూభారమునుఁ దొలఁగించుటకై పరమేశ్వరుని యవతార మవసర మైనయట్లు భాషాభారమును దొలఁగించుటకై సదసద్గ్రంథవిచక్షణ మనుశాసించుట యవసరమై యున్నది.

తరువాత, పాఠశాలలలో బాలురు పఠించుటకై యేర్పఱుగ్రంథములు ప్రస్తుతము విశ్వవిద్యాలయమందలి విద్యాశాఖోద్యోగులవలనఁ గాని కొండొకయుపసంఘమువలనఁ గాని నిర్ణయింపఁబడుచున్నవి. భాషాగ్రంథములు సాహిత్యపరిషత్తు నిర్ణయించుట కధికార ముండవలెను. ఏగ్రంథకర్త "ఎక్కువ

కమీషన్" యిచ్చునో యాతని గ్రంథములు పాఠశాలలలోఁ బెట్టుపద్ధతి మాఱవలెను. బాలురమనములు కోమలములై లక్ష్యవలె నుండి తొలుదొల్త నేవిషయముల గ్రహించునో యవియే భావిజీవితంబులం దాదర్శప్రాయము లగును. రామాయణభారతవీరుల చరిత్రలత్యాసక్తితోఁ జిన్నతనమున వినిన శివాజి భారతదేశమునం దొకముఖ్యమైనరాజ్యమును స్థాపింపఁగలిగినవాఁ డాయెను. కావునఁ జిన్నతనమున మంచియాదర్శముల బాలురకుఁ గనఁబఱుచుగ్రంథములఁ బఠింపఁజేయవలెను అట్టిగ్రంథముల నిర్ణయించుటకు సాహిత్యపరిషత్తు పూనుకొనవలెను.

తరువాత, అముద్రితగ్రంథముల పరిశీలన మొకకార్యము. తాళపత్త్రగ్రంథము లెన్నియో పల్లెలయందును బట్టణములందును గూడ లభ్యమగుచున్నవి. వానిలోఁ గొన్ని ముద్రితగ్రంథములై యున్నను పాఠభేదములఁజూపు ప్రతులుగా నుండును. వానిని బరిశీలించి యేపాఠములు న్యాయమైనవో నిర్ణయింపవలసి యున్నది. దీనివలన ననేకాంశములు బయలుపడును. ముద్రణకాలమున కేదోయొకప్రతి దొరికి దానఁ దమయూహలకుఁ బ్రమాణము కలుగునట్లుగా సవరించి ప్రకటించిన వారి దొంగతనము బయలుపడును. ప్రక్షిప్తముల నిర్ణయింపవచ్చును. ఇఁక నముద్రితములుగా నున్నగ్రంథములవిషయములో సరసమగుగ్రంథము లేవో ప్రామాణికములుగా గ్రహింపఁదగుగ్రంథములేవో విమర్శించి చూచి వానిని సాధ్యమైనంతత్వరలో ముద్రింపించవలసి యున్నది. ఈకార్య మీసాహిత్యపరిషత్తు కొంత యిదివఱలోఁ జేసియున్నది. కాని యెంతయో యింకను జేయవలసియున్నది. "ధనమూల మిదం జగత్తు"ను నట్టిట్టికార్యములు ద్రవ్యైకసాధ్యములై యున్నను విద్యావంతులు చేయవలసిన పని పూర్తి గావించి కార్యక్రమ మేర్పఱచి యుంచుకొన్నచో ద్రవ్యవంతుల సమీపించి వారియౌదార్యమునకుఁ దగినదేశకాలపాత్రములు గలవని నివేదింపవచ్చును. సత్కార్య మనునమ్మిక గలదేని నెంతధనమైనను విరాళ మొసంగఁగల దాతలు మనయాంధ్రదేశమున లేకపోలేదు.

మఱి యొకముఖ్యమైనపని శిలాశాసనాన్వేషణము. ఇది దొరతనము వారియం దొకశాఖ పనిచేయుచున్నది. అయినను మనము గూడఁ దోడ్పడినచో భాషావిషయమున మంచిఫలములఁ బొందఁగల మని చెప్పఁగలను. మన దేశపరిపాలకుల కాలాదిక మగుచరిత్ర యెంతయో శాసనరూపముననున్నది.

అది లెస్సగాఁ బరిశీలించినచో నాంధ్రకవితాకన్యక యెప్పు డుద్భవించి యెట్లు వృద్ధినందినదియుఁ దెలిసికొనఁగలము. దానికిఁగాను మొట్టమొదట యేయే గ్రామముల నేయేకట్టడములపై శాసనములు లిఖింపఁబడియున్నవో వానిపట్టిక నొకదానిని దయారుచేయింపవలెను. పిమ్మట వానిప్రతులను దెప్పించి విమర్శించి చూచి ప్రస్తుతకాలపు భాషలో లిఖించి యుంచవలెను. తరువాత వాని నన్నిటిని ముద్రింపించి గ్రంథరూపమునఁ బ్రకటింపవలెను. కవికాలాదికముల నిర్ణయింపఁగోరువారి కివి యెంతయో యుపయోగకరము లనుట నిర్వివాదాంశము.

ఇట్టికృత్యముల సాహిత్యపరిషత్తుమూలమున నెఱవేర్చుకొనఁ గోరుదుమేని నయ్యది యొకయధికారము గలసభగా నుండవలెను. దీని కధికారమెవ రిచ్చెద రని మీ రనుకొనవలదు. మన మందఱమే యీయవలెను. ప్రతివిషయమునను సంఘపరిపాలనము గోరు నీదినములలో భాషావిషయమునఁ గూడ నది యేలవర్తింపఁగూడదు? భాషకు సంబంధించిన సర్వవిషయములు నిర్ణయించుట కొకప్రామాణికసభ యుండుట భాషాభివృద్ధికి నెంతయో యవసరమే. చట్టముల నిర్మించుటకును వ్యవహారమందుఁ బ్రయోగింపఁజేయుటకును శాసనసభలు రాజకీయమం దెట్లవసరములై యెట్టి యధికారగౌరవములఁ బడయుచున్నవో యట్లే భాషావిషయమునఁ గూడ సాహిత్యపరిషత్తులు ప్రవర్తిల్లినఁగాని భాష సద్రూపమునను నూర్జితసత్త్వమునను బ్రకాశింపనేరదు. భాషావిషయికకృత్యము లన్నియు సాహిత్యపరిషత్తునకు సంక్రమింపఁజేయునెడల నయ్యది యొకవిశాలమైన సభగా నుండవలెను. అనఁగా నన్నియాంధ్రమండలములవారి ప్రతినిధులను గలిగి యుండవలెను. మండలమున కిద్దఱు పండితులు చొప్పున నెన్నుకొనఁబడవలెను. వారు చందా నిచ్చినను నీయకపోయినను సరే మండలప్రతినిధిత్వమున కర్హులైనచోఁ బరిషత్తున నుండవలెను. సంవత్సరమునకు నాలుగుసార్లైనను వారందఱు సమావేశమై ప్రకటితగ్రంథములలో సదసద్గ్రంథవిచారణచేసి నిర్ణయింపవలెను. వారిచే నిరాకరింపఁబడిన గ్రంథములు పాఠశాలలలోఁ బఠనీయగ్రంథములుగా నుండకుండుటకై విశ్వవిద్యాలయమువారి కొకవిజ్ఞాపనము పంపవలెను. ప్రకటితగ్రంథముల ప్రతి నొకదానిని పరిషత్తునకుఁ బంపునట్లు దొరతనమువారిని గోరవలెను. వారికి విమర్శననిమిత్తము ప్రతిముద్రాశాలనుండియు రెండుప్రతులు

పంపఁబడుచుండును, గనుక, యొక ప్రతి పరిషత్తునకొసంగినచో వారివిమర్శనకుఁ దోడ్పాటుగా నుండును గావున నట్లు చేయుటకు నభ్యంతర ముండఁగూడదు. ప్రతిచందాదారునకును ప్రతినిధి నెన్నుకొనునధికార ముండును గాన భాషాభిమాను లెల్లరు చందాదారులుగఁ జేరునట్లు ప్రోత్సాహింపఁబడవలెను. చందాధనములును, విరాళములును గాక స్థిరరూపక మగువసతులుగూడ సాహిత్యపరిషత్తునకు సమకూర్ప యత్నించవలెను. ఈ ప్రకార మధికారములతోడను నైశ్వర్యముతోడను సాహిత్యపరిషత్తు వర్ధిల్లున ట్లుచిరకాలమున నీశ్వరుఁడు ప్రసాదించుఁగాక.

---

# కపిలగడ్డము, కఱకంఠుఁడు నన్నయ ప్రయోగించె ననవచ్చునా ?

—♦ చంద్రాభట్ల రామమూర్తిగారు—రాజమహేంద్రవరము. ♦—

విభవసంవత్సరశ్రావణభాద్రపదమాసములందుఁ బ్రకటింపఁబడిన యాంధ్రసాహిత్యపరిషత్పత్త్రికలో బాలవ్యాకరణసంజ్ఞాపరిచ్ఛేదమున 'నార్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యం' బనెడుసూత్రమున కుదాహరించిన కఱకంఠాద్యనింద్యగ్రామ్యములం గూర్చి నాకుఁ దోఁచినయభిప్రాయములను వ్రాసియుంటిని.

అందుమీఁద మ॥ రా॥ శ్రీ॥ జాస్తి శ్రీరాములు చౌదరీగారు చాలఁ బ్రయాసపడి యాశ్వయుజకార్తికమాసములందు వెలువడిన తత్పత్త్రికలో విమర్శించియుండిరి.

వారివిమర్శనము కేవలము పక్షపాతసూచకముగా నుండుటచే సమాధానము వ్రాయుచున్నాను.

"సూరిగారు ప్రాసభంగమును గుర్తింపఁజాలనట్టి యవిమర్శకులుగా"రని శ్రీచౌదరీగారు వ్రాసిరి. అవిమర్శకు లని నే ననలేదు. కాని ప్రమాదపడి యుండవచ్చు నని నాతలంపు.

"వారు ప,వప్రాసము నంగీకరించియు 'కపిలగడ్డము' మొదలగురూపముల నొప్పుకొని వాని ననింద్యగ్రామ్యములలోఁ జేరిచి" రని లిఖించిరి

పూర్వలాక్షణికు లెవరును నీ పవప్రాస మంగీకరింపలే దనియు నీవిషయమున సూరిగారు ప్రమాదపడి రనియు నాయభిప్రాయము. ఇట్లు నేను మాత్రమే తలంచుటలేదు.

"చిన్నయసూరిగారు కపిలగడ్డము కపిలజడ లుదాహరించుట ప్రమాదమునసే, కవిలగడ్డము కవిలజడ లనియే భారతమునందుఁ బ్రయోగింపఁబడె" నని యాంధ్రవాల్మీకి నాఁబరఁగు వావిలికొలను సుబ్బారావుగారు తమసులభవ్యాకరణమునఁ దెల్పియుండిరి. వావిలికొలను సుబ్బారావుగారు భారతకవులకు ప,వప్రాస మిష్టమో యనిష్టమో గ్రహింపఁజాలని యవిమర్శకులా ?

దీనింబట్టి భారతమందుఁ గవిలగడ్డము కవిలజడ లనియే ప్రయోగింపఁబడె ననియు, సూరిగారు ప్రమాదపడి రనియు స్పష్టముగాఁ దేలుచున్నది.

"కపిలశబ్దభవము కవిలశబ్దం బొందు గానంబడెడి- ఉ. అక్కర. అవస రజ్జుండయు.........కవిలగడ్డంబుచు..............దవినయన్నువ............ యువిదకన్నుంగవ........... ౨౦భార ఆది ర ఆ" అని శబ్దరత్నాకరాదినిఘం టునిర్మాతలును బహుగ్రంథపరిశోధకులును నగు బహుజనపల్లి సీతారామా చార్యులవారు తమత్రిలింగలక్షణశేషమందు వ్రాసియున్నారు. ఆప్పొత్తమును శ్రీసీతారామాచార్యులవారు బాలవ్యాకరణమందలి ప్రమాదములను జూపె ట్టుటకును నందు విడువఁబడిన విషయములను విపులపఱిచి తెలుపుటకును నుద్దేశించి వ్రాసిరి. ఇట్టిసీతారామాచార్యులవారు సూరిగారు ప్రమాదపడి రని గ్రహించియే గదా తమవ్యాకరణమందు "కవిలశబ్దం బొందు గానంబడెడి" నని సూత్రించి యుదాహరించియుండిరి. ఇట్టివారు భారతకవులకు ప,వప్రాస మిష్ట మో యనిష్టమో గ్రహింపఁజాలని యవిమర్శకులా ?

గవురుగడ్డం బని తమయొద్ద నున్నభారతప్రతిలోఁ గలదనియు గౌరుశబ్ద భవము గవురు కావచ్చు ననియు, "గౌరోఽరుణే సితేపీతే" యని యమర మనియు 1903 సంవత్సరము పిబ్రేవరునెలలో వెలువడిన యముద్రితగ్రంథచిం తామణియందు 18 పుటలో నొకవిలేఖకుఁడు వ్రాసియున్నాఁడు. ఆవిలేఖకుఁడు భారతకవులకు ప,వప్రాస మిష్టమో యనిష్టమో గుర్తింపఁజాలని యవిమ ర్శకుఁడా ?

వారిమాట యటుండనిండు "వారిపెంపు వరీక్షింపమొ" (వసు ఆ 3 పద్య) యనుచోట వికృతిశబ్దప్రథమకుఁ బరమైన సాంస్కృతికపకారమునకు వకా రము ప్రయోగింపఁబడినది. ఇది ప్రాసస్థలముగాన నచ్యుత ప్పనుటకు వీలు పడ" దని చొదరీగారి గురువర్యు లగువజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి గారు తాము రచించినవసుచరిత్రవిమర్శనగ్రంథమున 108 పుటలో లిఖించి యుండిరి. *దీనింబట్టి శ్రీచొదరీగారిగురువర్యులును ప,వప్రాసమున కనిష్టు ల నియే ప్రకటిత మగుచున్నది.

సూరిగారు భారతకవులకు ప,వప్రాస మిష్ట మని యెచ్చటను ముచ్చ టించి యుండలేదు. వారు పద్యము వప్రాసముతోఁ బ్రారంభింపఁబడిన దని

---

*వసుచరిత్రవ్యాఖ్యాతయైన సోమకవి 'పెంపునితర్కింపమొ' యనుపాఠము నిట దెల్పినాఁ డు. అక్కవి ప, వప్రాసము నిర్దుష్టమని తలంచినయెడల నట్లేల సవరించును ?

గుర్తింపక ప్రమాదమున కపిలగడ్డము మున్నగున వనింద్యగ్రామ్యము లని వ్రాసియుండిరి.

అట్టి ప్రమాదమును సమర్థించుటలో చౌదరిగారును భారతకవులకు ప,వప్రాస మిష్టమని పొరబడిరి.

మఱియు శ్రీ చౌదరిగారు "కవదొనలును గాండీవము, నవల నిడంబ నుపు ముంచ రరదముడిగు మే, నుపిదప డిగియొద శుభకర, మవు నివ్విధ మిట్లు సేయు మనుము నతండున్" (శల్యపర్వము) అను మొదలగు భారతపద్యోదాహరణములవలనను భారతకవులు ప,వప్రాస మంగీకరించినట్లు తెలియుచున్న" దని యొకయపూర్వవాదమునకుఁ గడంగిరి.

అప్పకవి యిప్పద్యమును సంధిగతప్రాసమున కుదాహరించి "ఏనువిదప" యని ప్రాసస్థానమున వకారముంచి యే వ్రాసెను. ఇఁక సముద్రితగ్రంథచింతామణి యనెడు మాసపత్రికలో శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారు "ఏన విదప" యని ప్రాసస్థానమున వకార మనియే సమర్థించిరి. వేమూరివారిచేతను వావిళ్ళవారిచేతను ప్రకటింపఁబడిన భారతప్రతులలో "ఏనవిదప" యని ప్రాసస్థానమున వకారము పెట్టియే యున్నారు. పైఁగా వారు వ్రాఁతప్రతులలో "ఏను విదప" యనియున్నట్లుకూడ వ్రాసిరి. కాని చౌదరిగారు వ్రాసినట్లు 'ఏను పిదప' యని యెక్కడను లేదు. వీరివ్రాఁత నిరాధారము.

దీనికై చౌదరిగారి కింతగొడవ యేల? 'ఏను వెనుక' యనిన నిర్బాధముగదా.

"కలము మనచేతిలోనిది గాన నిచట కూడ ఏను బిదప యని దిద్దిబ, వల కభేదప్రాసము చెప్పుకొనరాదా? యని శంకింప వీలులేదు. స్వత్వము మీఁద సరళాదేశము చేయఁబడ" దని స్వకపోలకల్పితరాద్ధాంత మొకటి చౌదరిగారు కల్పించిరి.

ఏను బిదప యని దిద్దఁగూడదంట. ఎందువలననో?

"ద్రుతప్రకృతికములమీఁది పరుషములకు సరళములగు (సంధిపరిచ్ఛేదము. సూత్రము ౧౬. బాలవ్యాకరణము) పూచెను......కలువలు......... పూచెనుగలువలు. అని యెవరియుం దింత యభిమానమునకు లోనై చౌదరిగారివ్యాసము వ్రాసిరో యట్టిచిన్నయ్యసూరిగారే పైని పేర్కొన్నరీతిని సూత్రించి స్వత్వముమీఁద సరళాదేశ ముదాహరించియున్నారు. వా రిచ్చిన

యిట్టియుదాహరణము లింకను గలవు గ్రంథబాహుళ్యభీతిని వాని వదలితిని. వానినెల్ల బాలవ్యాకరణమునఁ జూడనగును.

దీనినిబట్టి 'యేను బిడప' యని దిద్దిన దోసమేమో చౌదరిగారు దెల్ప వలసియున్నది.

మఱియు నాసూరిగారే "దాను నేను పదంబులద్రుతంబునకు సంశ్లేషం బు లేద. (సంధిపరిచ్ఛేదము. సూత్రము ౨౩.) తాను......చదివె......తాఁ జదివె, తానుజదివె" యని వ్రాసిరి. ఇక్కడఁ దానుజదివె నని విస్పష్టముగా స్వత్వముమీఁద సరళాదేశము చేసి యుదాహరింపఁ బడియున్నది.

దీనింబట్టి ఏను బిడప యని దిద్దిన దోసమేమొ శ్రీచౌదరిగారు దెల్ప వలసియున్నది.

ఇంకను "ఏనునేనుతానుపదంబులద్రుతంబునకుఁ బూర్ణబిందుసంశ్లేషం బులు లేవు.........ఏనుపలికితి.........ఏనుబలికితి, ఏఁబలికితి" అని సులభ వ్యాకరణకర్త 'ఏనుబలికితి' నని స్వత్వముమీఁద సరళాదేశముచేసి యుదాహ రించెను. దీనింబట్టి ఏనుబిడప యని దిద్దిన దోసమేమొ చౌదరిగారు దెల్పవల సియున్నది. ఇంతెందుకు? పరిషత్పత్త్రికలో చౌదరిగారివ్యాసమందే వా రుదా హరించి వ్రాసిన యక్కరలో "కపిలగడ్డంబును, గపిలజడలును, గపిలకన్నులు ను......దీర్ఘపుదనువును జూచి" యని స్వత్వముమీఁద సరళాదేశముచేసి వ్రాసినారు.దీనింబట్టి ఏనుబిడప యనిదిద్దిన దోసమేమొ వీరుదెల్పవలసియున్నది.

వీరుదూరమాలోచింపక స్వకీయవాదసంరక్షణార్థమై 'కలము మనచేతి లోనిదిగాన" యని యితరులను దామాక్షేపించినరీతిని వ్రాసిరి. తాము వ్రా సినరీతి నోరులెవరును వ్రాయరా దనుచున్నారు. ఒరు లెవరునునట్లుసాహసించి వ్రాయఁజాల రని విన్నవించుచున్నాను. 'ప్రాసస్థానములందు స్వత్వముమీఁద సరళాదేశము చేసినరూపము లగపడకుంటయే దీనికిఁ గారణ" మని చౌదరిగా రొక క్రొత్తవింతహేతువును గల్పించిరి. ప్రాసస్థానములందు స్వత్వముమీఁద సరళాదేశముచేయఁగూడదనియాంధ్రవ్యాకరణకర్త లెవరును నిషేధించి యుం డలేదు. చౌదరిగారును నగపడకుంటయే దీనికిఁ గారణ మనిరి గాని నిషేధించి యుండలేదు. అట్లగపడకుంటచే నిషిద్ధమెట్లగునో దెల్పవలసియున్నది.

"మఱియు సులక్షణసారమున నున్న 'బవయోరభేద మనియెడు, నెప ముస పఫబభలు వాకు నిలిచినయెడలం, దపమింపవచ్చుఁగృతులం, దుపనిష

దుచితార్థసూక్తి యొనరుటవలనన్' అను పద్యమును పవప్రాసమునుజూపట్టి యీయభిప్రాయమును దృఢపరచుచున్న" దని వ్రాసిరి.

సులక్షణసారమం దీపద్యము చౌదరిగారు వ్రాసినరీతిని లేదు, సరేకదా, యది వడికొఱకుఁ జెప్పఁబడియున్నది గాని ప్రాసము కొఱకుఁ జెప్పఁబడియుండ లేదు. ఆనందరంగరాట్ఛందములో నీపద్యము గనఁబడుచున్నది. కస్తూరిరంగ కవి యం దభేదయతి కుదాహరించినాఁడు. నన్నయభట్టు లక్షణసారములోని దని చెప్పినాఁడు. వపయోరభేదమని వ్రాసినాఁడు గాని బవయో రభేద మని వ్రాయలేదు. సులక్షణసారములోని దని చెప్పియుండలేదు.

వపయోరభేదమనియున్నదానిని బవయోరభేద మని మార్చి అభేద యతి యనుశీర్షికను దీసివైచి నన్నయభట్టులక్షణసారములోని దని చెప్పిన దానిని పాఠకప్రతారణము నిమిత్తము సులక్షణసారములోని దని శ్రీచౌదరీ గారు వ్రాసి 'యీపద్యము రంగరాట్ఛందమున వ, పయోరభేదమనియెడు నెప మున' అని ముద్రింపఁబడినది. అది తప్పు ఉపనిషదుక్తి బవయో రభేదః' యని కాని 'వపయోరభేదః' అనికా దని ౧౮౫ పుటయం దడుగున వ్రాసిరి.

పూర్వలాక్షణికు లెవరైన నీప,వ ప్రాసము పనికివచ్చు నని సిద్ధాంతీ కరించిరా ? సిద్ధాంతము లేదు. సరికదా పైఁగా నిషిద్ధముగాఁగనఁబడుచున్నది.

ఎందు బవయనుటకు వపయని తప్పుగా ముద్రింపఁబడిన దని చౌదరీ గారు భ్రాంతిపడుచున్నారో యాయానందరంగరాట్ఛందములో నుండియే ప, వప్రాసము నిషిద్ధ మని తెల్పిన యుదాహరణములను నీక్రిందనిచ్చెద.

కవిరాక్షసచ్ఛందమున:—క॥ లళలకు లడలకు నొకటొక, టలవుగఁ బ్రాసంబు యతియు నొ వపలకున, వ్వల దడలకు రళలకు యతి, వెల యుం బ్రాసంబు తగ దభేదమిది యగున్." అని వపలకు దడలకు రళలకుఁ బ్రాసము నిషేధించెను.

ఉత్తమగండచ్ఛందంబున:—క॥ లడలు లళలు నొండొంటికి, వడిప్రా సముచెల్లు రలలు వపలును దడలున్, వడిఁ జెల్లుఁ బ్రాస మమరదు, కడున రయ నభేదసంజ్ఞఁ గను నివి యెల్లన్" అని రలలకు వపలకు దడలకుఁ బ్రా సము నిషేధించెను.

అట్టి కస్తూరి రంగకవి నన్నయభట్టులక్షణసారములోని "బవయో రభే దమనియెడు" పద్య ముదాహరించె ననియు ప,వప్రాసమును జూపెట్టెననియు

చౌదరిగా రూహించుట పొరపాటనక తప్పదు. ఆతఁడు వపయోరభేదమని యెడు-అనియున్న పద్యమునే యుదాహరించె ననియే చౌదరిగా రొప్పక తప్పదు. అది ముద్రణమునఁ దప్పుపడిన దని తోఁపింపఁజేయుట కిఁకఁ జౌదరి గారు ప్రయత్నింప కుందురుగాక. కస్తూరిరంగకవి యతికొఱ కా పద్య ముదాహరించెను గాని ప్రాసమునకై యిచ్చియుండ లేదు. ఇఁక వీరికి నన్నయమీఁద నెట్టిగౌరవము కలదో యాక్రింద వారుచూపినయక్షరవలనఁ దేలఁగలదు

"అవసరజ్ఞుఁడయి వ్యాసుఁ డేతెంచె నఁత నత్తపసి
కపిలగడ్డంబు, గపిలజడలును, గపిలకన్నులును
తపసియన్నువు నల్లనైన దీర్ఘపుఁదనువును జూచి
యువిద కన్నుంగవ మొగిచి తెఱవక యుండె భయమున"

అని గపిలగడ్డమును సమర్థించుటకు నన్నయ యక్షర యారూపము కల దని నిరూపించుచున్నారు. వీరు నిజముగా నన్నయకవిత్వమం దాదరము కలవారేనా. ఇందు మొదటిపాదము వకారప్రాసమునఁ బ్రారంభింపఁబడినది. ద్వితీయ తృతీయపాదము లన్ననో పకారప్రాసము గలవి. ఇఁకఁ జతుర్థపాదమ న్ననో మొదటిపాదమువలె మరల వకారప్రాసమైనది.

భిన్నాక్షరప్రాస మంగీకరించినచోట్ల మూఁటనొకటిగాఁ బ్రాసస్థలమున నుండునుగాని సరిసంఖ్యగా పల్లులు ప్రామాణికప్రయోగములందుఁ గాన రావు. అట్టిసందర్భములలో సరిసమానసంఖ్య గలప,వప్రాసములతోఁ గూడిన పద్యము నన్నయ రచించియుండె నని వాదించుట నన్నయకుఁ గళంక మాపాదించుటకే ప్రయత్నించిరని నాయూహ.

ఇంతియెగాక ప్రథమపాదాంతమున నత్తపసి యనిప్రయోగించె ననియు, తృతీయపాదప్రారంభమున మరల తపసియని ప్రయోగించెననియు జూపెట్టి పునరుక్తిదోషమునకు నన్నయను పాల్పడఁజేసిరి. ఇట్టివారా నన్నయ మీఁద నాదరము కలవారు?

మఱియుఁ దవిన యన్నువ యనిన సారస్యము చెడిన దనియుఁ దపసి యన్నువలో నేమో సారస్య మున్నదనియుఁ దలఁచి వీరు కొంతప్రసంగమునకు దిగిరి. కాని తవినయన్నువకంటెఁ దపసియన్నువు అనిన సారస్య మేమికలదో యర్థమేమొ వివరింపక దాననే వీరివాదదౌర్బల్యము తెల్లమగుచున్నది.

చౌదరిగారు వారిగురుపర్యులు వ్రాసిన అక్కర లను వ్యాసము చూడుమనిరి. నే నీరాజమహేంద్రవరమున నెంత ప్రయత్నించినను నా కది లభింప లేదు. తమరికడనున్న దానిని నాకుఁ బంప వేఁడుచున్నాను. అది చూచిన పిమ్మట నీవిషయమై విరివిగా వ్రాయఁదలంచితిని గాన నిప్పటి కీవిషయము విరమించుచున్నాను.

"మిశ్రబహుప్రీహి గనుక యియ్యది గ్రామ్య మని బాలవ్యాకరణము తద్భవ మగుదీనియందు సంస్కృతవర్ణ శకార ముండుటచే గ్రామ్య మని ప్రౌఢ వ్యాకరణకర్త" యని కఱకంఠశబ్దమును గుఱించి లిఖించిరి.

పరికించిచూడ వీరినిశ్చయము మిశ్రబహుప్రీహి యనియో తద్భవ మనియో తేలుటలేదు. కాని గ్రామ్యమనిమాత్ర మంగీకరించిరి. అంతియెచాలు.

వీరియూహా ననుసరించి యాంధ్రశబ్దచింతామణి నన్నయకృతమే యైన "అనియమా ద్గ్రామ్యంహి యత్త్వపభ్రంశ" యని యందుఁదెల్పిన యిమ్మహాకవి కఱకంఠుఁ డనునట్టి యపభ్రంశగ్రామ్యప్రయోగ మొనర్చియుండునా?

"కఱకంఠుఁడు బహుప్రీహి (చూ సంజ్ఞా- ౯) దీని నాహోబలపతి పండితుఁడు మిశ్రబహుప్రీహి యనె గాని య దట్లగుట దుర్ఘట" మని ప్రౌఢ వ్యాకరణమునఁ దెల్పఁబడియున్నది.

"శకటరేఫము తద్భవతత్సమములందు లే" దని చిన్నయసూరిగారు వ్రాసిరి. "తద్భవములందును నలఘురేఫము కల" దని సీతారామాచారిగారు వ్రాసిరి. కఱశబ్దము తద్భవమో దేశ్యమో చౌదరిగారు నిర్ణయింపరైరి.

ఎట్లయినను గఱశబ్ద మాచ్ఛిక మని యొప్పుకొనవచ్చును కాని కంఠశబ్దము కంఠము పట్టుకొనుచున్నది. తద్భవములందు సంస్కృతవర్ణ శకారము లేదు. కఱకంఠుఁడు బహుప్రీహి యని సీతారామాచార్యులు వారు చెప్పినారు. ఏబహుప్రీహియో నిర్ణయింపలేదు సరికదా మిశ్రబహుప్రీహి యగుట దుర్ఘట మని పైఁగా నిరసించిరి. సీతారామాచార్యులవారిమతము ననుసరించి మిశ్రబహుప్రీహి కాదని తేలుచున్నది. అంతియె గాని సాంస్కృతికబహుప్రీహియో యాచ్ఛికబహుప్రీహియో తేలుటలేదు. ఏమున శకటరేఫము సంస్కృతమున లేదు. తద్భవములందు శవర్ణము లేదు.

ఇఁకఁ జిన్నయ్యసూరిగా రన్ననో మిశ్రబహుప్రీహి యని యెచ్చటను దెల్పలేదు. చౌదరిగారు మాత్రము కఱకంఠుఁడు మిశ్రబహుప్రీహి యని సూరి

గారితలం పైనట్లువ్రాసిరి. వీరు సూరిగారితలం పెట్లుగ్రహించిరో నాకుఁదెలియకున్నది.

ఎట్లయిన నేమి సూరిగారును సీతారామాచార్యులుగారు నేఁగూడఁ గఱకంఠుఁ డనుప్రయోగము నింద్య మని విశ్వసించియే గ్రామ్యమునఁ జేర్చిరని నిశ్చయింపకతప్పదు.

చింతామణియందలి "అనియమాద్గ్రామ్యంహి యత్త్వపభ్రంశ" యనెడు సూత్రమే నన్నయభట్టిట్టిప్రయోగము చేసియుండఁడని తెల్లముచేయుచున్నది.

కావున నిట్టిదుష్టప్రయోగమును నన్నయభట్టునకంటఁగట్టి దానిని సమర్థించుటకు నిరర్థకప్రయాసము పడుటకంటె చౌదరిగారు మూఁటి కొకటిగా లఘ్వలఘురేఫప్రాస మంగీకరించి గరకంఠుఁడను సిద్ధశుద్ధసమస్తపదమును నన్నపాకవి ప్రయోగించె నని యంగీకరించుట నిర్వివాదాంశము.

పూర్వలాక్షణికులలో నిట్లు రేఫద్వయప్రాస మంగీకరించినవారు గలరు.

క. కరుణాకర నినుజూచిన వెఱతురు రక్కసులు సురలు వేఁడుదు రెపుడున్
మురహర భవహర యనియనఁ బరఁగును రేఫమునకిట్లు ప్రాసం బగుచున్"
అని అనంతచ్ఛందము.

గీ. పరఁగ రేఫకు రేఫయే ప్రాస మగు ఱకారమైన ఱకారంబె గలుగుఁ గృతులఁ," గలితరేఫఱకారసంకలితముగను, జెల్ల దిట మూఁటికొక్కటి చెల్లుఁ గృష్ణ." అని కవిరాట్ఛందము.

ఇఁకమీఁద నైన వీరుపూర్వలాక్షణికులు కొందఱు మూఁటి కొకటిగా గురులఘురేఫప్రాస మంగీకరించినవారు కల రని గ్రహించి నన్నయమహాకవి కూడ నామతమువాఁడే యనియు, నాతఁడు గరకంఠుఁ డని సంస్కృతసమాసమునే ప్రయోగించి యుండు ననియు నొప్పుకొందురుగాక.

"రామమూర్తిగారు చింతామణి నన్నయకృతము కాదని వాదించువారైన నన్నయభారతభాగమున రేఫఱకారములకు నొకప్రాసమున మైత్రి గలిపిన వేఱొండుపద్యమును జూపుబాధ్యత వారియందున్న"దని చౌదరిగారు ప్రకటించిరి.

అట్లయిన మిశ్రబహువ్రీహిసమాస మైనకఱకంఠుఁడువంటి ప్రయోగములగల వేఱొకపద్యమును, సమానసంఖ్యాక,వప్రాసమును జూపెట్టుచుఁ దాము

వ్రాసిన యక్కరశక్తిగల మణికపద్యమును, నన్నయభారతభాగమునఁ గనఁ బలుచు బాధ్యత శ్రీచౌదరీగారియందును గలదు.

తాముదాహరించిన "కవదాన"లనుపద్యము తిక్కనమహాకవి విరచిత మనియు నన్నయవిరచితము కా దనియు వీరికీసందర్భములో విశదము చేయవలసివచ్చినది.

(I) 1-క. కాఱడవిఁ బఱచుమృగముల, నూఱడకం దిగిచి డస్సియున్న తని శ్రమం, బాఱఁగ నెదఁబరితాపము, దీఱఁగఁ బైవీచె నన్నదీపవనంబుల్. (భారతమాదిపర్వము)

2 క. కౌరవులు చేయ నవమతి, కారణముగఁగోపమెత్తుకర్ణుని వదనాం భోరుహము గనుంగొన శ్రమ, మాఱున్నావశముగాక యాతనిబుద్ధిన్." (శాంతిపర్వము)

మొదటిపద్యములోఁ శ్రమంబాఱఁగ యనుచోట ఆఱుధాతువు గురురేఫముగాఁ బ్రాసస్థానమునఁ జెప్పఁబడినది.

రెండవపద్యములోఁ 'శ్రమమాఱుఁగా' అనుచోట ఆఱుధాతువు రేఫముగాఁ బ్రాసస్థానమునఁ జెప్పఁబడినది.

ఆఱుధాతువును శ్రీచౌదరీగారలఘురేఫముగా నిశ్చయించినయెడలఁ దిక్కనమహాకవి భారతమున మూఁటికొకటిగా రేఫఱకారప్రాస మంగీకరించె నని నిశ్చయింపవలసివచ్చును. అట్లు కాదని లఘురేఫముగా నిశ్చయించిన యెడల నన్నయమహాకవి భారతమున మూఁటికొకటి గా లఘ్వలఘురేఫప్రాస మంగీకరించె నని నిశ్చయింపవలసివచ్చును.

(II) 1-క. ధరణిం గాశ్యపవైశ్యా, నరమార్కండేయులోలి నజగద్ధితవాక్పరులై రొక్కెడ వారొకమఱిగోష్ఠిరతినుండి మనుజాధీశా." (అను- ఆ ౧)

2-క. ఉఱుముచు మెఱుముచుఁ బిడుగులు, పఱలఁగ నల్లడలఁ బడ నవారితవృష్టుల్, గఱుకొని కురియఁగఁబంచెను, మఱియును నయ్యనలుమీఁద మఘువుం డలుకన్." (ఆది ఆ ౧)

మఱి మొదటిపద్యమున రేఫముగాను రెండవపద్యమున శకటరేఫముగాను భారతమున ప్రయోగింపఁబడినది.

ఇట్లే ముందర మొదలగుమాటలు బండిరాగాను రేఫముగాను గూడఁ బ్రయోగములందుఁ గలవు

వీనికి రెండురూపములును గలవని రేఫద్వయప్రాసనిరోధకులు వాదించెదరు గాని వారివాదము నిరాకరము రెండురూపము లెట్లు వచ్చినవి? వారు రేఫద్వయప్రాసము తమకిరా దని తలంచుటయే యిందులకుఁ గారణముకాని వేఱుకాదు.

పోనిండు రెండురూపములును గలవని వాదించువార లట్టిప్రయోగములను మూఁటికొకటి గాక సరిసంఖ్యగలవిగా నొక్కపద్యమునందు భారతమున గనఁబఱుపఁగలరా ?

కావున భారతకవులు మూఁటికొకటి గా రేఫద్వయప్రాస మంగీకరించి చెప్పినపద్యములలోఁ దమకు బాధకములు గా నున్నపదములకు స్వవాదోపబలార్థము రేఫద్వయప్రాస మంగీకరింపనివారు కొందఱు రెండురూపములను గల్పించి రనియు సిద్ధసమాస మైనగరకంఠుఁ డనుదాని కట్లు కల్పింప వీలు లేక దానిని గఱకంఠా యని దిద్ది నన్నయయందు దోషారోపణము చేసి రనియు నమ్మహాకవి యిట్టియపభ్రంశగ్రామ్యప్రయోగమును జేసియుండఁ డనియును మొదట సిద్ధశుద్ధసమస్తపదముగానే గరకంఠః డని యాతఁడు ప్రయోగించి యుండు ననియు నానమ్మకము.

కావునఁ బేరెన్నికఁగన్న యాంధ్రమహాకవుల ప్రయోగములు కూడ మఱికొన్ని నిందుఁ దార్కాణముగాఁ జూపెదను.

కం॰ మాఱాడినఁ గోపింతువు, నీఱుగ శపియింతు రేము నీబోంట్లకు నీ
 శూరతములు వెఱుతురె మముఁ, గాఱియఁగానిట్లుపలుకఁగలరే యుర్విన్॰

(హరివంశము॰ ఉ॰ భా॰ 6॰ ఆ.) ఇందు మూఁటి కొక్కటి రేఫద్వయప్రాసమంగీకరింపఁబడి యున్నది॰

కం. పోరామిచుట్టమితఁ డని,కూరిమి చెలికాఁ డనంగఁ గోరి వరుసగోత్రారి హరిబాంధవుల వే(శ్వేరన్ గుశలంబు లడిగెఁ బ్రియమెలరారన్.

(హరివంశము॰ ఉత్తరభాగము) వేశ్వేరన్ అని నప్పుడు ప్రాసస్థానమున వచ్చిన యీరేఫముశకటరేఫము. రేఫముగా వ్రాయుట అచ్చుపొరపాటు కావున నిట మూఁటికొకటి రేఫద్వయప్రాస మంగీకరించివ్రాయఁబడినది.

శబ్దరత్నాకరమందు "కౌరవులసేన యెల్ల వేశ్వేర నడిగె"నని భారతోద్యోగపర్వము రెండవయాశ్వాసమం దున్నట్లు చెప్పఁబడినది. ఇక్కడఁ బ్రా

నయతికి రేఫద్వయ మంగీకరింపఁబడెను. వే అలఘురేఫముగానే వాడఁబడు చున్నది గాని లఘురేఫముగా వాడఁబడుచుంటలేదు.

కం. పెరజనులయందు విభునకు,నరయంగ వినోదమాత్ర మనురాగమెదం
బొరసిన యప్పుడు పలువురు,తరుణులయెడ రాగ మొకఁడు తాల్చుటతరుణీ.

(మార్క. ౮ ఆ ౫) పెర పరశబ్దభవము శకటరేఫయుతము ఇట మూఁటికొకటి రేఫద్వయప్రాస మంగీకరింపఁబడినది. దీని నన్నయ "చఱచి యొకచేతఁగూర్మముఁబెఱచేతగజం"బని శకటరేఫముగానే యాదిపర్వమునవాడెను.

మఱియును శ్రీచౌదరీగారు "కవదొనలును గాండీవము నవలనిడంబనుపు ముందర రదముడిగు"మని యిందు ముందర అలఘురేఫముగా వ్రాసిచూపెట్టిరి. శబ్దరత్నాకరమందు గురురేఫముతోఁ గూడిన ముందఱ కర్థములు వ్రాయుచు "3 మొదలు క. ముందఱరదముడిగుము భార- శల్య- ౨" అని యలఘురేఫముగా నుదాహరింపఁబడినది. ఇట్టి పరస్పరవిరుద్ధమునకు గారణమేమో?

శబ్దరత్నాకరమందు "క. ధరణిఁ గడుఁబేదవారును బురిటికి ఘృతతైలధాన్యములఁ జెచ్చెరముం దరసంగ్రహింతు రవి మన కరుదుగ నతిదుర్లభంబులర్థము లేమిఁ. భార. అర. 3 ఆ.

చ. చిఱుతతనంబునం దగవు చిత్తమునం దలపోయ లేకముం
దఱ నటువోవ నిచ్చితి— భార ఉద్యో 3 ఆ" యుదాహరణపద్యములు.

దీనినిబట్టి మైనఁ బైరీతిని రేఫద్వయప్రాసమును భారతకవులు భాగవతమం దక్కడక్కడఁ బ్రయోగించినపద్యములు కల వనియుఁ, దరువాత లఘ్వలఘురేఫప్రాసమైత్రి నంగీకరింపనివారు కొందఱు బయలుదేఱి తమవాదము నెట్లైన నిలువఁబెట్టికొనుటకై సాహసించి వానిని రెండురూపములు కల వానినిగా దిద్ది రనియు సిద్ధసమాసమైన గరకంఠుఁ డనుచోట నట్లు సాధ్యపడమిఁ గఱకంఠుఁ డనిదిద్ది రనియు చౌదరీగారు తెలిసికొనవలయును.

ప్రాణశబ్దభవము పాన మని శబ్దార్థచంద్రికలోను లక్ష్మీనారాయణీయములోను చెప్పఁబడియున్నది. తూర్పుదేశమున పానాలనియు వాడుక గలదు. కుట్టుక శబ్దభవము గొడ్డ మగునుగాని ప్రాణకుట్టుక శబ్దభవము ప్రాణగొడ్డము కాదు. ఇందు రెండుపదములు కలవు. ఏకపదము కాదు. కాన ప్రాణశబ్దభవమైన పానశబ్దముతో కుట్టుకశబ్దభవమైన గొడ్డముచు జేర్చి సమాసముచేయుట

నిర్బాధకము. పానగొడ్డము నాచ్చిక మనవచ్చును. ఇట్లని నే ననుటవలన దోస మేమికలదో వారు నిరూపింపవలెరి.

జీవగఱ్ఱను సాధింపక విడిచితి నని శ్రీచౌదరిగారు నన్నధిక్షేపించిరి. కవిత్రయమువారి భారతమున నీప్రయోగము నాకుఁ గాన్పింపలేదు. అందువలన దానిని గూర్చి వాదించుట నిరర్థక మని యూరకుండుదునుగాక.

"అంతియె గాని చంద్రాభట్ట రామమూర్తిగారు వ్రాసినటుల నన్నయభట్టు మొదలగుకవీశ్వరులకుఁ గళంకము వాటిల్లఁజేయుటకై ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు, అను సూత్రమును సూరిగారు వ్రాసియుండలే"దని చౌదరిగారు వ్రాసిరి. నేను సూరిగారు నన్నయభట్టు మొదలగుకవీశ్వరులకుఁ గళంకము దెచ్చిపెట్టుటకై ప్రయత్నించి రని యెచ్చటను వ్రాసియుండలేదు. కాని, వీరివాక్యములను బట్టి యీవిషయ మిట వ్రాయవలసి వచ్చినందులకు విచారించుచున్నాను. సూరిగారు వ్రాసినయీసూత్రమువలనను దాత్పర్యమువలనను మనయాంధ్రకవులకును భాషకును గళంకము వాటిల్లుచున్నది.

"పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యం బయిన గ్రహింపఁదగు నని తాత్పర్య"మని సూరిగారు వ్రాసిరి. పెద్దల ప్రమాదములు ప్రామాణ్యము లని సూరిగా రీసూత్రమును రచించి రని స్పష్టము. కలకంఠుఁడు మున్నగు నుదాహరణములు గ్రామ్యము లైనను గ్రాహ్యము లనియు నట్టివి ప్రయోగార్హము లనియు నిందువలనఁ దేలుచున్నది. ఇట్టియపభ్రంశప్రయోగములను జేసినవా రెవరు? నన్నయభట్టాదులు. ఇట్లనుటవలన నన్నయాదులకుఁ గళంకము వాటిల్లునా వాటిల్లదా యని చౌదరీగారి నడుగుచున్నాను.

ఇట్టివి గ్రాహ్యము లగుటచే భాషకుఁగూడఁ గళంకమే భాషలో నిప్పగిదివి చేర్పవచ్చు నని తేలుచున్నది. అపభ్రంశప్రయోగములు పనికిరా వను వారు భాషోద్ధారకులా? పనికివచ్చు ననువారు భాషోద్ధారకులా?

ప్రమాద మెన్నఁడును బ్రమాణముకాదు. హేయమని నాయభిప్రాయము. అట్టి హేయము లగుగ్రామ్యములు సూరిగారిసూత్రతాత్పర్యములను బట్టి గ్రాహ్యము లని భ్రాంతిపడవల దనియు గ్రామ్యప్రయోగములను గావ్యములందు రానీయకుండనియు చౌదరీగారిని పాఠకమహాశయులను బ్రార్థించుచున్నాను. ఇఁక నీసూత్రోదాహరణములనుగూర్చి విచారించి చూచినయెడలఁ బ్రాణగొడ్డ మనింద్యగ్రామ్యములలోఁ జేర్పవలసినంత యావశ్యక మేలవచ్చెనో

కారణము గ్రహింపఁజాల మని వీరు సూరిగారితలంపును ద్రోసిపుచ్చిరి. కపిల గడ్డము మున్నగునవి సూరిగారు ప్రమాదమున నుదాహరించినట్లు సులభప్రాజ్ఞ వ్యాకరణములనుబట్టి తేలుచున్నది. ఇఁకఁ గఱకంఠుఁ డను ప్రయోగము నింద్యమనియు మిశ్రబహువ్రీహియగుట దుర్ఘట మనియు మూఁటికొకటిగా గురు లఘురేఫప్రాస మంగీకరించి నిర్దుష్టమగు గఱకంఠుఁడను బ్రయోగమునే నన్నయ చేసియుండెననియు, దేలుచున్నది. ఇఁక జీవగఱ్ఱ మాత్రమే సూరిగారిచ్చినయుదాహరణములలో నున్నది. దీనిని గవిత్రయము వారు భారతమునఁ బ్రయోగించినట్లు కనఁబడుచుండుటలేదు. అందువలన నీయుదాహరణమునకుఁ బ్రాముఖ్యము లేదు. కావున సూరిగారివ్యాకరణమున "ఆర్యవ్యవహారంబుల దృష్టంబుగ్రాహ్యం"బనెడు సూత్రమును దానివృత్తియునుదీసివైచినచో సూరిగారికిగాని నన్నయభట్టు మున్నగుమహాకవులకుఁ గాని భాషకుఁగాని కళంకము వాటిల్ల దనియు మీఁదుమిక్కిలి వన్నె హెచ్చుననియు నాయాశయము.

శ్రీరస్తు.

## ఆంధ్రసాహిత్య పరిషత్ప్రశంస.

పండితారాధ్యుల నాగభూషణము, ముమ్మిడివరము.

---

శా. శ్రీసంపన్నులు సద్బుధుల్ సుకవితాశ్రేష్ఠుల్ సుధీశాలురున్
దానత్వంబు భజింపసొంపెసఁగు నీదర్బారు నేత్రోత్సవ
శ్రీసంధిల్లఁగఁ జూడఁగల్గె బరిషత్సీమంతినీ నేటికిన్
వాసింగాంచెను గోనసీమయు భవద్భద్రాగమప్రాప్తిచేన్.

ఉ. పండితులున్ గవీశ్వరు లపారసుధీఖనులున్ విమర్శనో
ద్దండకళాధురంధరు లుదారులు దాతలు నేతలండగా
నుండి భవద్యశంబున కనూనవికాసము గూర్చుచుండి ర
బ్జాండమునిండ నోపరిషదంబ! భవత్సుకృతంబవర్ణ్యమా.

చ. ఘనుఁడలపీఠికానగర కాంతుఁడు పోషణభారమూని నా
డనఘుఁడు రామయాభిదుఁ డహర్నిశలున్ బనిబూనిసేమమున్
గనుఁగొనుచున్నవాఁడు; కవినాథులు పండితులెల్ల దాసులే
మని గొనియాడుదుర్ బరిషదంబరొ! తావకభాగ్యమేనికన్.

చ. ఎచ్చటనుంటివో తెలుఁగరెవ్వరు మున్నటిదాక నేటికిన్
వచ్చితి వాంధ్రదేశమున వాసముగైకొన నింక మీదటన్
హెచ్చిన దీక్షనీదు సుతులెల్లరుచే బనిగొంచు సద్యశం
బచ్చుపడంగ సుస్థిరతనందెద వారవితారకంబుగన్.

సీ. ప్రకటించుచున్నావు ప్రాచీనకవివర, గ్రథితంబులౌ మహాగ్రంథములను
వెలయించుచున్నావు విధివశంబున నేల, పాలైన శాసన ప్రతతినెల్ల
ఖండించుచున్నావు గ్రామ్యవాదంబులఁ, దలయెత్తకుండ భూతలమునందు
సాగించుచున్నావు సర్వత్ర శ్రమలకోర్చి, ఘనమైన యాంధ్రనిఘంటురచన
గీ. జరపుచుంటివి దేశదేశములకేగి, యాంధ్రవాఙ్మయ మభివృద్ధినందసభల
ప్రతిసమంబును విమతదుర్వాదభూరి, గిరినికరశంబ! సాహిత్యపరిషదంబ!

ఉ. మున్ను చళుక్యభూవిభుని పోషణమందున, రెడ్లనాఁడు, వి
ద్వన్నుతుఁడైన కృష్ణవసుధావరు పాలనమందుఁ గన్నయా
వన్నెయు వాసియుం దెనుగుబాసకు నెన్నటికైన నీదయా
భ్యున్నతి చేత నేఁగలుఁగునో పరిషజ్జనయిత్రి క్రమ్మరన్.

మ. తెలుఁగన్నన్ మొనమొన్నదాఁక మిగులన్ ద్వేషించుచున్ వాదముల్
సలుపం జొచ్చిరి పెక్కుమంది యిపుడా సంరంభముల్ వీగి య
త్యలఘుప్రాభవమందెనో పరిషదంబా! యాంధ్రమీ నీకుమా
రుల దీక్షాఫలితంబుగా; నసమశూరుల్ గారె నీపుత్రకుల్.

సీ. శ్రీమంతులార! మీ చిరయశఃప్రదమైన, వితరణావేశంబు వెలయఁజేసి
కవిరాజులార! మీ ఘనకార్యనిర్మాణ, కౌశలప్రాశస్త్య గరిమఁ జూపి
విద్వాంసులార! మీ వివిధవిద్యాసార, వేతృత్వమెల్లను వెల్లడించి
సద్విమర్శకులార! విద్వన్నుతంబైన, భవదీయ బుద్ధివైభవముఁ జూపి
గీ. కాలవశమునఁ దొల్లింటి గౌరవ ప్రశస్తులం గోలుపోయి మీపాలఁబడిన
యాంధ్రభాషాలతాంగి సాయంబొసంగి, బ్రోవఁగదరయ్య మీరెల్లరును గడంగి.

శా. బాలారిష్టము లెల్లబాసె; బడుచుం బ్రాయంబు బ్రాప్తించె; భూ
పాలాలంబనమును ఘటిల్లె; నటుపై స్వస్థాన మాంధ్రావనిన్
గాలుం బెట్టితివింక నీవు పరిషత్కల్యాణి! సౌభాగ్యశో
భాలాలిత్య విలాససంపదలచే వర్ధిల్లు మేకాలమున్.

(2) జయంతి స్వామినాయనగారు — ముమ్మిడివరం.

సీ. శ్రీపీఠికాపురీభూపాలశేఖరుం డుర్వి నై దండ నీ కొసఁగుచుండఁ
గార్యనిర్వహణదీక్షాదక్షుఁ డౌ రామ యాఖ్యుండు నీసేవ మరయుచుండ
షడ్దర్శనీమనీషాశాలు లౌ బుధుల్ సద్భక్తి శుశ్రూష సలుపుచుండఁ
గవిరాజు లెల్ల నీఘనయశశ్చంద్రికల్ నిఖిలదిక్తటముల నింపుచుండ
నాంధ్రదేశంబున నల్గుననఘులెల్ల, వివిధరీతుల నీ యభివృద్ధికొఱకుఁ
బాటుపడుచుండ నీకులోపంబి కేమి? యాంధ్రసాహిత్యపరిషదబ్జాయతాక్షి!

సీ. రాజన్మహారాజరాజేంద్రునాఁటివైభవము రాకుండునే? పరిషదంబ!
తొలిరెడ్డిభూపాలకులనాఁటి యసదృశప్రతిభ రాకుండునే ? పరిషదంబ !
అలకృష్ణదేవరాయలనాఁటిమేటి యాదరణ రాకుండునే? పరిషదంబ !
శ్రీతిమ్మజగపతిక్ష్మాతలేంద్రునినాఁటి పసుపు రాకుండునే ? పరిషదంబ !
కాల మొకరీతి నేరికిఁ గడవఁబోదు, నేఁడు గాకున్న రేపైన నిశ్చయముగ
మంచిదినములు నీకుఁ బ్రాప్తించితీరు, బ్రవిమలయశఃకదంబ! యోపరిషదంబ!

సీ. సంతానకాంక్షి యైజలజసంభవుకృపాకలనచేతను నిన్నుఁ గాంచినాఁడు
కాంచుటాదిగ నీకు మించువేడుకతోడ ఘనసంప్రదాయముల్ గఱపినాఁడు
కఱపుటయేగాక కవిబుధాగ్రణులచే వివిధశాస్త్రముల నేర్పించినాఁడు
నేర్పించుటయెగాక నిఖిలదేశాధీశదివ్యసభలఁ గీర్తి దెచ్చినాఁడు
చేయవలసిన దంతయుఁ జేసినాఁడు, వృద్ధుఁడై నాఁడు రామయాభిధుఁడు నేఁడు
ప్రాజ్ఞజీవివు; దగినభూభర్తనెనసి, సౌఖ్యముల నందుమీ! పరిషచ్ఛుభాంగి!

గీ. కోవిదారామసీమ, మా కోనసీమ కరుగుదెంచితి మాదు భాగ్యంబుకతనఁ
గైకొనఁగదమ్మ మాయిచ్చు కాన్కలివియె భవ్యపద్యప్రసూనముల్ పరిషదంబ!

గీ. ఆంధ్రసాహిత్యపరిషదబ్జాయతాక్షి! నీకు నినుఁగొల్చు సద్బుధానీకమునకు
నిఖిలశుభములనొసఁగి నిర్నిద్రకరుణ, నెలమిరక్షింపుఁగాత మా క్షేత్రేశ్వరుండు.

(3) దువ్వూరి కామేశ్వరరావుగారు — శానపల్లిలంక.

శ్రీమత్పండితమండితం బగుచు వాసిం గాంచి పుణ్యావగా
స్తోమానూనమహానిధాన మగుచుఁ సొంపారు నేసీమ ని
స్సీమశ్రీ నలకోనసీమ యిటు నిన్ సేవింపఁగాఁ గల్గె భ
వ్యామేయోన్నతి నందుచుం బరిషదంబా! యింక వర్ధిల్లుమా.

సీ. రాజితశ్రీమహారాజరాజనరేంద్రు నాస్థానమున మహాయశము నంది
యనవేమభూపాలుఁ డాదిగాఁగల రెడ్డిరాజులచే నాదరణ వహించి
యాంధ్రభోజఖ్యాతి నధిగమించిన కృష్ణరాయలచేత గౌరవము వడసి
యానందగజపతిక్ష్మానాథుపోషణంబున బెంపుసొంపును బొందఁగల్గి
దినదినాభివృద్ధి దీపింపఁగా నేఁటి, దనుక గీర్తితోడఁ దనరుచుంటి
వందిరింకఁ జేతి కనుకూలు రౌసుతుల్, ప్రణుతకవికదంబ! పరిషదంబ!

చ. దినదినగండ మన్న గతి తేటపడంగ నదేమిపాపమో
దినమున కొక్కగండ మయి దీప్తినసింపఁగఁ జేయఁబూనసీ
కును బ్రతిభావిశేషకవికుంజరు లైనభవత్తనూజు లా
ఘనతరదుర్దశల్ దొలఁచి కావరొకో పరిషత్సతీమణీ!

సీ. పట్టినకార్య మేపట్టున జయముచేఁబెంపారు నన నింటిపేరె సాక్షి
మాతృభాషాసక్తి మహితమంచు వచింప నాంధ్రవిజ్ఞానమే యధికసాక్షి
సంస్కృతభాషావిశాలపోషణసమాసక్తి కీపురపాఠశాల సాక్షి
సకలవిద్వత్తపీశానాదరణచే నెసంగు ననంగ నీసభయె సాక్షి

గీ. యట్టియనఘాత్ముఁ డైన జయంతిరామ
యార్యుఁ డిటఁ బెద్దకొమరుఁ డై యలరుచుండ
నెందు నభివృద్ధియే కాని యేమిలోటు
వటిలఁగల దమ్మ నీకు నో పరిషదంబ!

చ. జననము నందినందులకు సార్థకతా జననీపదాబ్జముల్
మనమున నిల్పి సేవలు సముంచితభక్తిఁ బొనర్చుచుంట గా
వున భవదీయగర్భమునఁ బుట్టినయర్భకుఁ డైననేను నీ
కును దగఁ బంచరత్నములు కూర్చెదఁ గైకొను మమ్మ నెమ్మిమైం.

---

# భాషాయోషాసౌష్ఠవము.

— క్రొత్తపల్లి సుందరరామయ్యగారు, ఏలూరు. —

---

ఉ. ప్రాణము లైదిటిం బిగియఁబట్టి, యిట్టును లాగు నర్థపుం
బ్రాణము లొక్కరెండు నడుమం గలియం గనువంగి తూలుచుం
జేనెఁడు మట్టమెత్తు గలచెప్పులతోఁ దలబర్వు వెల్లనా
నాననసీమతోఁ బలుకు నాంగ్లకళాలలనం గనుండదే ! 1

చ. స్థిర మని నీదు లేఖిని రచించుపదంబులయందుఁ గల్గు న
క్కరములు నీదునోటఁ బలుకంబడ వాంగ్లకళావధూటి! య
క్షరములు కావు కా వవి భ్రష్టపుక్షరంబులు గాని, ఋత్వమున్
సరియని రేఫఁజేసి కొన సంస్కృత మాడుదె! యెన్నిభంగులన్. 2

గీ. ఊరియందటిదొక దారి యులిపిసెట్టి, దొక్కదారి యు నన్నట్టు లుర్వి నొరగి
పుట్టుచేయువాటంబుగాఁ దుఱ్ఱుమనుచుఁ జాఱుములకపలుకునవలారతనము

క. పలువంకరటింకరనడ, కలును, నొడలిమచ్చలును, వికారాకృతియుం
దలముక్కజిలుఁగుదుప్పటి తొలిచూపులఁ దురకబాసతొయ్యలికె తగున్.

గీ. పంటిక్రిందికి యవలగపడకయుంట
నోయనుచు మాటమాటకు వాయిఁ దెఱచి
యఱచుచుం బికిరమ్మెత్తు నతివఁబోలె
నుత్కళికళావరారోహ యొఱపుఁజూపు. 5

చ. పలుకఁగ వ్రాయ గష్ట మగువర్ణముతోడఁ గళంబు దాఁటి గుం
డెలకును నాభికిం గలసడిన్ బిగదట్టుచు వర్ణభేదముం
దెలియని గద్రగోళము ప్రతిశ్రుతులం దొలి వేయనేమొ నాఁ
బలుకుచు వచ్చు నీయఱవబాసపడంతియలంత వింతయా. 6

గీ. కృష్ణకుం గ్రిష్ణయంచు మాతృపదశుద్ధిఁ
దొలఁచి నాల్క చివరపల్లుతోడ హృదయ
గతముఁగానీక యఱవాయి నతుకుపెట్టి
యఱవఁ నఱవఁబు నాఁబడె నఱవబాస. 7

క విడువని జడముడి తలయును, నడువడి వ్యత్యస్తమునుఁ గణఁతబొట్లుఁ గడు
న్నడయాడుగోచిగల కన్నడబానపొలంతి తీరు ‘నాఁ’ గనఁ దెలియున్. 8

గీ. ఆంధ్రభాషావధూటి యొయ్యార మింత, పూనన నె చి చరించునుగాని దానఁ
దనకుఁ దలవంపు లంచును దలఁపఁబోదు
బాగు! భళిర! కర్ణాటభాషావధూటి 9

చ. అవయవసౌష్ఠవంబు నిజు నక్షరమాలలఁ గంఠమందుఁ దా
లువులను దంతసీమ నెదఁ గోపల నోఁదల నూష్మనాసికో
ష్ఠవితతి వెల్వరించు చనిశంబును దత్సముదాత పద్యోదన్
హావణిలలాగుచుం దిరుగు నాంధ్రకళారమణి న్నుతించెదన్ 10

శా. వ్రాయంజాలిన వారలుండినను ద్వ్యర్థశ్లేషకావ్యంబు లెం
తేయోగ్యక్రియఁ బల్కనేర్చెదవు, సాధ్వీ పాకమందైనఁ బ్ర
జ్ఞాయుక్తంబుగ నీవచస్సరణి విశ్వస్తుత్య మో యాంధ్రభా
షాయోషామణి! మాతృభక్తి యరయ స్సర్వంబు నీసొమ్మగున్. 11

ఉ. నాల్కఁ గదల్పకుండ రదనచ్ఛదరక్తియు ముద్దులొల్కఁగాఁ
బల్క నిరోష్ఠ్యపద్ధతిని బల్కిన నేకలిపి న్వచించినం
బల్కిన పల్కె యర్థమును భావము భేదము నొందఁ బల్కినం
బల్కొక వేయియౌఁ దెనుఁగుబాసపడంతుక యెంతదానవే! 12

ఉ. వాసిని గన్న నీదగుసువర్ణశరీరమునం దొకించుకే
దోసము గల్గు నన్న కనుదోయిది దోసముగాక నీదియే
బాసలయందునం దెనుఁగుబాసయె లెస్సని నీముఖంబునన్
వ్రాసినవాఁడు బ్రహ్మ యనవచ్చు నిజంబుగ నాంధ్రసత్కళా! 13
పుట్టిననాఁటఁగోలె బహుభూములఁ గ్రుమ్మరి ప్రౌఢవౌచు నీ
విట్టులు పుట్టినింటఁ బను నేడవయేటి జయంతి వేడుకం
జుట్టము లుబ్బజేయఁగను జూచితె! యాంధ్రకళాసభాసతీ!
పెట్టుము ముక్తిభిక్షువు గవిప్రకరంబుల కందు వీఁగఁగన్. 14

క. ఋణముక్తీశ్వరమునసిన్, బ్రణుతించిన వేఱచెప్పవలయు నెవి ద్వ
జ్జనములభాగ్యము, వికృతిక్షా, గణియుంపరుగాక! నుడువఁగా శక్యంబే? 15

ఉ. నీవరయంగ దేవతవు నీదుజయంతి సనుఃబు లెన్నఁగా
దేవసమంబు లీతెలుఁగుదేశము నీయది యాంధ్రరామ! నిన్
బావనఁ గాంచి పెంచెను భవజ్జనయిత్రి కవంగవృద్ధ, భా
షావిషయప్రచార మిఁక సర్వము నీవ యెఱింగి చేయుమా! 16

# ఁడు

జయంతి రామయ్యపంతులుగారు. బి. ఏ. బి. ఎల్.

"డు, ము, వు, లు ప్రథమ" యని మనము బాలవ్యాకరణములోఁ జదివి యున్నాము. ఇందు డువర్ణకము మహదర్థకప్రథమావిభక్త్యేకవచనప్రత్యయము. అనుస్వారపూర్వకమును. అనుస్వారము పూర్ణ మనియు, ఖండ మనియుఁ దెలుఁగులో రెండువిధములు. నిండుసున్న పూర్ణానుస్వారరేఖ. అరసున్న యర్ధానుస్వారరేఖ. తాటియాకులపుస్తకములలోఁ గాని పూర్వశాసనములలోఁ గాని యర్ధానుస్వారరేఖ యెక్కడను గనఁబడదు. నిండుసున్నయే కనఁబడుచున్నది. దానిని సందర్భోచితముగా నొకచోటఁ బూర్ణముగాను నొకచోట ఖండముగాను నుచ్చరింపవలయును.

క. " ఆకరికాలనరేంద్ర ప్రాకటవంశమునం బుట్టె భాస్కరకులర
త్నాకరచంద్రుండు రిపునృప । భీకరుం డధికుండు చోడబిజ్జన బిరుదై"

ఈపద్యములో 'వంశమునం బుట్టె' 'చంద్రుండు' ననుచోటుల రెండవ యనుస్వారమును 'భీకరుఁ డధికుం' డనుచోట మొదటి యనుస్వారమును దేల్చి పలుకవలయును. అట్లు పల్కనిచో ఛందోభంగ మగును.

ఇంతకంటెను బ్రాచీనము లగుశాసనములలో బిందువునకు బదులుగా ననునాసికాక్షరములే కనఁబడుచున్నవి. అనఁగా ననుస్వారమునకుఁ బరమందున్న వ్యంజన మేవర్గములోనిదో యావర్గములోని యంత్యాక్షరము కనఁబడుచున్నది. కట్టిఞ్చె, తమ్ముణ్డు, అన్తయేనియు, అశ్వమేధమ్బుల ఫలమ్బు-ఇత్యాది రూపములు కానవచ్చెడిని. ఈరూపములను వీనిపౌర్వాపర్యమును బట్టి చూడఁగాఁ దెలుఁగులో ననుస్వార మని వాడఁబడుచున్నది వర్గాంత్యానునాసికాపరరూప మనియు, అది తొలుత ననునాసికాక్షరముగానే వ్రాయఁబడుచుండి కొంతకాల మైనపిదప సౌకర్యార్థము బిందురూపముగా వ్రాయఁబడెనో యనియు నాబిందువు తొలుతఁ బూర్ణముగానే యుచ్చరింపఁబడి రాను రాను లాఘవార్థము దీర్ఘముమీద నిత్యముగాను హ్రస్వముమీద వైకల్పికముగాను దేల్చి పలుకఁబడసాగె ననియు, దీనివలననే పూర్ణార్ధానుస్వారభేద మేర్పడె ననియుఁ దేలుచున్నది. వర్ణక్రమములో ననునాసిక మేస్థానమం దుండెడిదో దాని కాదేశముగా వచ్చినబిందువు కూడ నాస్థానమందే తొలుత

నుండెడిది. వాడు యనుచోట డువర్ణము నెత్తిమీఁద నుండెడిది కొంతకాలము నకుఁ గొంచె మెడమప్రక్కకు జరిగి యుండి మఱికొంతకాలమునకు నిప్పు డున్నట్లు పూర్వాపరాక్షరములు రెంటికి నడుమఁ బ్రవేశించినది. వాణ్డు వాడు, వాడు, వాండు. ఇది యనుస్వారరూపావతారక్రమము. మఱియుఁ బూర్ణానుస్వారరేఖ తొలుత నాగరలిపియందువలెఁ గేవలబిందు (బొట్టు) రూపముగా నుండి పిదప నిప్పటి సున్నగా మాఱినది. ఆసున్న నడుమను నిలువుగీతగీసి రెండుసమానభాగములుగాఁ జీల్పఁగా నందలి యెడమభాగ మర్ధానుస్వారరేఖ యైనది.

దీనినంతను బట్టి చూడఁగాఁ దెలుఁగులోని యనుస్వారము నిజముగా హల్లుగాని యచ్చు కాదని స్పష్టపడుచున్నది. బిందుయతులు, అనుస్వారసంబంధియతులు, అనునాసికాక్షరయతులు ననువ్యంజనాక్షరయతు, లీయర్థమును దృఢపఱుచుచున్నవి. ఇది యిట్లుండఁగా నిటీవలి లాక్షణికులు అనుస్వారమునుస్వరముగాఁ బరిగణించుట రూపమునం దిది సంస్కృతములోని యనుస్వారమునుబోలియుండుటవలనఁ గలిగిన ప్రమాదముచేత నయి యుండవచ్చునని యూహింపవలసి యున్నది. ఇంతియకాక అర్ధానుస్వారమే ప్రథమరూప మని యూనది హ్రస్వముమీఁద వైకల్పికముగాఁ బూర్ణమగు ననియుఁ జెప్పెడి లాక్షణికమతము గూడఁ బొరపాటని తేలుచున్నది. ఇది యనుస్వార విచారము.

ఇఁక డువర్ణకస్వరూప మెద్దియో చూతము. పుస్తకములలో నేమి శాసనములలో నేమి యీయక్షర మిప్పటివలె డువర్ణకముగానే కనుపట్టుచున్నది. కాని, కొంతకాలము క్రిందట, కడపమండలములోఁ గనిపెట్టబడిన యతిప్రాచీనాంధ్రశాసనములు కొన్నింటిలో డకారమునకు బదులుగా శకటరేఫము వంటి మఱియొకయక్షరమును దానికిఁబూర్వము తృతీయానునాసికమునకు, బదులుగాఁ జతుర్థానునాసికమును, అవఁగా న్రు అనురూపము గనుపట్టుచున్నవి. ఉదాహరణములు.

౧. దీని లుచ్చువాన్రు పఞ్చమహాపాతకస(ంయుక్తు) న్రగుఙ్ (క)

౨. (దీ) ని రక్షిఞ్చి కట్టి (పి) వాన్రు అస్వమేధమ్బున పల్గమ్బు కాఞ్చున్ (క)

(క) నాయొద్దనున్న యొకశిలాశాసనప్రతిబింబము, దీనిపై గ్రామముపేరు లేదుగాని కడపమండలములో, ప్రొద్దుటూరుతాలూకాలోని, అరకటవేముల గ్రామములో నీశాసనము దొరకినట్లు జ్ఞప్తి కలదు.

౩. దీనికి వక్రంబు వచ్చువాన్డు పఞ్చమహాపాతకస(ం)యుక్తున్డగు (చ)
౪. దేవస్వంబులఞ్చంబు గొన్నవాన్డు వారివాశ్రిపచ్చినపపంబుగొన్నవాన్డు(ట)
౫. నూఱయెణుబొన్డ ఇడ్డసమయంబున (త)
౬. యిన్తయేయు ఱాగొణ్ణవాన్డు నిచ్చినవాన్డు చెడువాన్డు (త)
౭. శత్యాదిత్యున్డు (సత్యాదిత్యుండు.)(ప)

ఈశాసనములు చాళుక్యరాజులనాఁటి శాసనములకంటెను బ్రాచీనములయి యిప్పటి కించుమించు పదునాలుగువందలసంవత్సరముల నాఁటివని చెప్పఁదగియున్నవి. ఇవి యచిరకాలములోనే ప్రకటింపఁబడును. దీనిస్వరూపము నిర్ణయించుట కితరభాషాసంప్రదాయము లేమైన నుపకరించునేమో యని విచారింపఁగా ద్రావిడభాషలోఁ గొంతయాధారము దొరికినది. ఈభాషలో రెండు రేఫలుగలవు. ఒకటి మనలఘురేఫమువంటిదే. అదికాక గురురేఫ మొకటి గలదు. ఇది యరవభాషకు విలక్షణమైనదనియు, దీనికి సరియగునక్షరము తెలుఁగులోఁ గాని కన్నడములోఁ గాని లేదనియుఁ దెలుగులోనిది సాధారణముగా డకారముగా మాఱుననియు కాల్డువేల్ (Caldwell) గారిసిద్ధాంతము.

"Neither the Telugu nor the Canarese possesses the Tamil ṛ'.

"The same Consonant which is ṛ in Tamil, is generally ḍ in Telugu and always ḷ in Canarese."

అరవములో రెండు నకారములు కూడఁ గలవు. అందొకటి యీగురురేఫముందే వచ్చును, గాని దానికి అన్నగరము (ఱకారనకారము) అని పేరు. ఈ నకారఱకారములు కూడినప్పుడు వాని సంయుక్తోచ్చారణములో డకారో

---

(చ) కడపమండలములోని అరకటవేములలో విష్ణ్వాలయములోనున్న యొక ఱాతిమీఁదిశాసనము (1906 సంవత్సరములో శాసనాధికారులు సంపాదించిన శాసనములలో 474 సంఖ్యగలది)

(ట) కడపమండలములోని పెద్దముడియముగ్రామమున శివాలయములో నొక శిలాస్తంభముమీఁద నున్నశాసనము (1905 వ సంవత్సరములో శాసనాధికారులు సంపాదించిన శాసనములలో 351 సంఖ్యగలది)

(త) ట సంజ్ఞశాసనముగల ఱాతి యడుగుభాగమునఁ జెక్కఁబడి యున్నది.

(ప) కడపమండలమునందలి మాలెపాడుగ్రామము పడమటనూతిసమీపమందున్న యొకఱాతిమీఁద నున్నది. Epigraphia Indica. పత్రిక ౧౧ సంచికలోఁ బ్రకటింపఁబడినది.

చ్చారణ మొకటి యంతర్భూతమై వచ్చును. ఒన్ఱు, పెన్ఱి యనునవి సరిగా నుచ్చరించునప్పుడు ఒన్డ్ఱు, పెన్డ్ఱి యగును: వాండు అను మన తెనుఁగు సర్వనామమునకు ద్రావిడరూపము అవన్ అని వర్ణప్లుతిన్యాయమున మొదటి అకారము వకారమును దాఁటి యీవలకురాఁగా వాన్ అను రూప మేర్పడినది. దానికి నకారయుక్తగురురేఫమును జేర్చినచో వాన్ఱు అను రూపము సిద్ధించును. ఈశబ్దముకొంతకాలమీరూపముననుండి క్రమక్రమముగా నందలి రేఫోచ్చారణము లోపించుటయు డకారోచ్చారణము స్ఫుటపడుటయు, దాని కనురూపముగా దంత్యనకారము మూర్ధన్యణకారముగా మాఱుటయుఁ దటస్థింపఁగా వాణ్డ్రు అనియు, తేల్చిపలుకుటచే వాఁడు అనియు రూపము లేర్పడినవి. ఇట్లే ఎనమండ్రు రూపముగూడ సాధించునది, వాన్ఱులోని చివరిహల్లు డకారమే యనుకొనరాదా యని కొందఱనవచ్చును. ప్రస్తుతశాసనములు కొన్నింటిలో విలక్షణమైన డకారరేఖ వేఱుగ నుండుటచేతను, రేఫకు ముందున్న నకారము దంత్య మగుటచేతను నట్లనుట కవకాశము కనఁబడదు. ఈయక్షరము బండిఱాను గొంతవఱకుఁ బోలియున్నను రెంటికి నాకారమందు భేదము కొంత యగపడుచున్నది. ఎణుబోన్ఱు యనునప్పు డీవింతయక్షరమును శకటరేఫయుఁ గలిసియున్నవి. కాని వాని యుచ్చారణములు వేఱు. కావున నీయక్షరములు రెండును వే ఱని చెప్పఁదగియున్నది. ఈరెండక్షరములయొక్కయు డకారముయొక్కయు శాసనస్థరూపము ) క్రిందఁ జూపఁబడుచున్నవి.

ఆంధ్రమందలి మహదర్థకప్రథమావిభక్త్యేకవచనప్రత్యయ మగు బిందుపూర్వకడువర్ణకముయొక్క ప్రథమరూపము ద్రావిడభాషలోని అన్నగరపూర్వకగురురేఫ మనియు, ఆ నకారరేఫల యుచ్చారణములతో డకారోచ్చారణముకూడ సమ్మిళితమైయుండె ననియుఁ గ్రమముగా నీమూఁ డుచ్చారణములలో రేఫోచ్చారణము లోపించి డకారోచ్చారణము స్ఫుటమగుటవలనఁ జతుర్థాంతస్థమైన నకారము తృతీయాంతస్థముగా మాఱిన దనియు, నీయంతస్థము లేఖనసౌకర్యార్థము బిందురూపము ధరించినది యనియు నీబిందువును దేల్చిపల్కుటచేత నర్ధానుస్వారోచ్చారణము కలిగిన దనియు, దీనివలన వాన్ఱు అనునది క్రమముగా వాణ్డ్రు, వాండు, వాఁడుగా మాఱిన దనియుఁ దెలుఁగులోని యనుస్వారము నిజముగా హల్లుగాని యచ్చుగా దనియు నీవ్యాసము ఫలితము.

| శాసనము. | శకటరేఫము. | వింతయక్షరము. | డకారము. |
| --- | --- | --- | --- |
| ౧ | ౨ | ౩ | ౪ |
| క | ఱ | | డ |
| చ | ,, | ఴ | ,, |
| ట | ఱ | ఴ | ,, |
| త | ఱ | ఴ | డ |
| ప | ఱ | ఴ | డ |

# సంస్కృతదూతకావ్యోత్పత్తివికాసములు.

యీయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు.
(ఆన్ధ్రగీర్వాణసాహిత్యపరిషదధ్యక్షులు ; విజయనగరము.)

## విజ్ఞప్తి.

సంస్కృతసాహిత్యపరిషత్కార్యద్రష్టలును కావ్యతీర్థోపాధిధారులును, వంగగీర్వాణాంగ్లేయ సాహితీసంపన్నులును, మన్మిత్రసత్తములు నగు శ్రీ చిన్తాహరణచక్రవర్తి (M. A.) గారు "భారతీయేతిహాసత్రైమాసికపత్త్రిక" ("Indian Historical Quarterly" Vol. III. No. 2. June 1927 Calcutta) లో "Origin and Development of Dutakavya Literature in Sanskrit" అను శీర్షికతోడను, సంస్కృతసాహిత్యపరిషత్పత్త్రికలలో (Vol. VIII. No 10; Vol. X No. 4 August 1927) "దూతకావ్య"మను శీర్షికతోడను సర్వోత్కృష్టవ్యాసములం బ్రచురించియుండిరి. నావ్యాస మావ్యాసములకు (ముఖ్యముగా నాంగ్లవ్యాసమునకు) నాంధ్రీకరణము. వారియనుజ్ఞననుసరించియే నేనీవ్యాసమును వ్రాసియున్నాను. ఈవ్యాస మొక్క రసికునకైనను సారస్వత పిపాసను గొంతవఱకైనఁ దీర్పఁజాలినచో నీయనువాదకర్త ధన్యుఁడు.

'*' ఇట్టులు గుర్తింపఁబడిన వ్యాసభాగములు శ్రీచిన్తాహరణసూరియాంగ్ల వ్యాసమున లేవు. అవి యనువాదకారునిచే నిందుఁ జేర్పఁబడినవి.

*దూతకావ్యములు(సన్దేశకావ్యములు) సంస్కృతసారస్వతమునఁ బ్రధానస్థానము నలంకరించును. ఈసన్దేశకావ్యములు, పంచకములు, అష్టకములు, దశకములు, శతకములవలెనే గీర్వాణసారస్వతరత్నాకరమునకు నిట్టి రసోద్రేకపూరితకావ్యరత్నముల (Lyric) వైరళ్యముం జాలవఱకుఁ బూరించును. కాని యీ లఘుకావ్యము లన్నిటియందును "దూతకావ్యము" లే యత్యున్నతపదము నలంకరించును. ఏలన, నివి యత్యున్నతకవితాభావభాసురములై, నాయి

*ఉత్తరహిందూస్థానమున మేఘసందేశమువంటి కావ్యయముల ప్రతులన్నియు "దూత" పదయుక్తము లగుటచే నీకావ్యములకు "దూతకావ్య" నామ మొసఁగఁబడినది. దాక్షిణాత్యప్రతులలోఁ బ్రాయికముగ నీకావ్యములు సందేశశబ్దసంయుక్తములు. ఉదా. హంససందేశము, మేఘసందేశము. సందేశకావ్యములనియే యిట్టికావ్యములు వ్యవహరింపఁబడుచుండెడివి ఉదా. "విద్వత్ప్రీత్యైబహురససుధాస్యన్దిసన్దేశకావ్యమ్." సుభగసన్దేశము- కడపటి శ్లోకము.

కానాయకవిప్రలంభశృంగారవర్ణనాత్మకము లగుటచే నతిమాత్రమనోహరకవితాసౌరభసంపన్నములై యలరారుచున్నవి. ఇందు విరహవేదనాదోదూయమానమానసులగు నాయికానాయకుల హృదయవేదన గుండె నీరైపోవునట్లు వర్ణింపఁబడెను. ఇట్టి కమనీయకవితాసుధనే కదా రసికాళి యాస్వాదించును! మఱియు నీదూతకావ్యములలో నాఁటిభారతవర్షమునందలి యాయాపట్టణములభివర్ణింపఁబడియుండుటచే నీకావ్యములప్రాధాన్యము మఱింత యతిశయించుచున్నది. అందుచే నీకావ్యములయుత్పత్తిపరిణామచరితము నించుక యరయుట యవసరము.

అనేకవిద్వాంసులు వారికిఁ దెలిసిన దూతకావ్యముల ప్రణాళికలను వ్రాసిరి. మహారాజరవివర్మ మలబారుదేశమున రచింపఁబడిన *యాఱుదూతకావ్యములం గూర్చి యుల్లేఖించెను. ఆఫ్రెట్ అంతర్వాణి (Prof. T. Aufrecht) వీనికంటె భిన్నములగు †పది దూతకావ్యములఁ జేర్చెను. పండితమనోమోహనచక్రవర్తి యీరెంటిని గలిపి ‡పదునాఱు దూతకావ్యములఁ జేర్చెను. బహుకాలగవేషణాఫలముగ నాకు లభించిన యేఁబదిదూతకావ్యములఁ గూర్చి యిట ముచ్చటించెదను. మఱియు మన తీక్ష్ణపరిశోధనాతీతములై, యసూర్యంపశ్యము లగుకొన్ని దూతకావ్యము లుండియుండు నని మున్ముందు గోచరించెడిని.

— సముపలబ్ధ దూతకావ్య పరిగణనాభివర్ణనము —

దూతకావ్యముల యుత్పత్తికి నిదాన మేదియో, యవి యే యేమార్గముల నభివృద్ధి నందినవో యరయుటకుఁ బూర్వ మీవాఙ్మయశాఖయొక్క యితిహాసమును సింహావలోకనన్యాయమున యథామతి నరయుట సమంజసము. ఇందుఁ బెక్కుకావ్యముల కాల మిదమిత్థ మని నిశ్చయింపఁబడమి నీకావ్యనామములఁ గాలక్రమానుసారముగఁ గూర్చుట దుశ్శకము; అందుచే నిట నీకావ్యనామము లకారాదిగాఁ గూర్పఁబడినవి. కావ్యములోని వృత్తవిషయము వ్రాయఁబడనియెడల నా కావ్యము "మన్దాక్రాన్తా" వృత్తమయ మనియే యెఱుంగునది. నామమాత్రావశిష్టము లగు కొన్నికావ్యములయెడ నిది వర్తింపదు,

* Journal of the Royal Asiatic Society. 1884—401 పుట.

† Z. D. M. G. Vol. 54. p 616.

‡ Journal of the Asiatic Society of Bengal. 1905. p 42.

I. ఇన్దుదూతము*:—వినయవిజయగణికృతము.

తద్విరచితేతరగ్రంథములు:—కల్పసుబోధిక, హైమలఘుప్రక్రియ † (1710 V. S.) లోకప్రకాశము [*బృహత్కథామంజరి, కవికంఠాభరణము, పద్యకాదంబరి మొదలగు ననేకకావ్యములకు నిర్మాతయగు క్షేమేన్ద్రకవీన్ద్రుని కంటె భిన్నుఁడు, కాశ్మీరదేశోత్పన్నుఁడు షాహాజహాన్ సమకాలీనుఁడు నగుక్షేమేన్ద్రకవిచన్ద్రకృతమగు "లోకప్రకాశము" మఱియొకటి కలదని యెఱుఁగునది. చూ. నిర్ణయసాగరయన్త్రాలయముద్రితమగు "కథాసరిత్సాగర" పీఠిక. 3 వ పుట*] ఇన్దు దూతమునందు 131 శ్లోకములుగలవు. జైనుఁడును యోధాపుర (Jodhpur) నివాసియు నగు నీకవి, సూరతునగరమున నున్న తన మతాచార్యులకుఁ దా నతిమాత్రభక్తిశ్రద్ధలతోఁ జేయుచుండు మతప్రచారవృత్తాంతమును జంద్రుని సందేశహారునిగాఁ జేసి యభివర్ణించుట యిందలి యితివృత్తము. యోధాపురమునకు సూరతునగరమునకు నడుమనుండు జైనదేవాలయములు, జైనపుణ్యస్థలములు నిందత్యంతమనోహరముగ వర్ణింపఁబడియున్నవి.

II. ఉద్ధవదూతము‡:—మాధవశర్మనిర్మితము.

ఇందు 141 శ్లోకములు గలవు. శ్రీకృష్ణుఁ డుద్ధవుని గోపికలయొద్దకు దూతగాఁ బంపుట, ఉద్ధవుఁడు తన్ను గోపికలకుఁ దెలిపికొనుట, వారు తమ దుర్భరవిరహావేదన నాతనితోఁ జెప్పికొనుట, ఆతఁడు శ్రీకృష్ణసందేశముం జెప్పి వారి ననునయించుట యిం దభివర్ణితములు. ఈయితివృత్తమే భాగవతమునఁ (10 స్కం. 47 అ) గూడఁ జూడనగు.

* మాధవశర్మ క్రీ. శ. 17 వ శతాబ్దాంతమున విలసిల్లి యుండెను. 'ఉద్ధవదూత' లిఖితప్రతులలోఁ బ్రాచీనతమము తలితనగరము (Talita) న నున్నది. ఇది 1742 వ శకవత్సరమున లిఖితము. ఈకావ్యము కాళిదాసమేఘ

---

* కావ్యమాల. 14 వ గుచ్ఛము. 40—60 పుటలు. (బొంబాయి) † Dr. Belvelkar) 'Systems of Sanskrit Grammer,' p. 79.

‡ i Dr. John Haeberlin's काव्यसंग्रह (A 'Sanskrit Anthology being a collection of the best smaller poems in the Sanskrit language) pp. 348 ff. W. Thacker & Co., Calcutta. 1847; (ii) "కావ్యకలాపము" హరిదాస హీరచన్ద్రప్రకటితము. (బొంబాయి, 1864), pp. 59 ff; (iii) "కావ్యసంగ్రహము" భావనచన్ద్రబసక్ ప్రకటితము (కలకత్తా, 1874) pp. 145 ff., (iv) "కావ్యసంగ్రహము" (ప్రథమ సంపుటము) జీవానన్ద విద్యాసాగరభట్టాచార్య ప్రచురితము (కలకత్తా; 1888.) పుటలు 581—595.

దూతకునీచానుకరణము.("It is a slavish imitation of the Meghaduta")

—Vide Sriman M. Krishnamacharya's (M. A., B. L.,) "The Classical Period of Sanskrit Literature." p. 127.

III. ఉద్ధవసన్దేశము*:—శ్రీరూపగోస్వామికి నారోపితము.

ఇది 138 శ్లోకపరిమితము. ఇందుఁగూడ మధురానగరమునుండి శ్రీకృష్ణుఁడు, గోకులవాసినులగు గోపికలయొద్ద కుద్ధవుని దూతగాఁ బంపుట వర్ణింపఁబడియున్నది. ఈకవి క్రీ. శ. 16 వ శతాబ్దిలో జీవించియుండెను. వంగదేశీయుఁడును, వైష్ణవమతసంస్కర్తయు నగు శ్రీ చైతన్యస్వామియొక్క సన్నిహితశిష్యులలో నీతఁ డొకఁడు. వైష్ణవమతము నవలంబించుటకుఁ బూర్వ మీతఁడు గౌడదేశాధీశుని (Allauddin Hussain Shah) సంస్థానమున రాజకీయోద్యోగిగా నుండెను. నూతనమతస్వీకరణానన్తర మీతఁడు తన యాచార్యుని మతము నత్యంతాభినివేశముతో నందఱకు బోధించుచుఁ దన్మతప్రతిపాదకము లగు ననేకగ్రంథరాజముల నిర్మించెను. ఈతని గ్రంథము లన్నియుఁ బరస్పరవిలక్షణము లగు కావ్య, నాటక, అలంకార, నాట్యశాస్త్ర, శాబ్దశాస్త్ర వేదాన్తశాస్త్రరూపము లయ్యు, నేకసూత్రగ్రథిత వివిధసుమములం బోలి, యాతని నూతనమతతత్త్వములం బ్రబోధించును. ఈవిషయమున నీ కవితల్లజుఁడు, సర్వతంత్రస్వతంత్రులును, కవితార్కికసింహులును, వేదాన్తదేశికులు నగు వేంకటేశ(వేంకటనాథ)విద్వత్కవిశిరోమణిం దలఁపించుచున్నాఁడు. అప్రతిమ ప్రతిభాభాసురులును, సర్వంకషప్రజ్ఞాధురంధరులు, నగు నీవేదాన్తదేశికమహోదయులు తమయావద్గ్రంథముల విశిష్టాద్వైతవేదాన్తశాఖ యగు "వడగలసాంప్రదాయప్రతిపాదకములుగా విరచించి తన్మతము నుద్ధరించెను. ఇట్టులే శ్రీరూపగోస్వామి గ్రంథము లన్నియు వైష్ణవమతప్రబోధకములు.

* "Rupa is a true poet and his verse is always of an unstrained construction. Long compounds do not mar the effect of easy intelligibility. Not unfrequently his poetic fancies are good and fresh, and his lines have an air of simplicity around them."* ("A History of the Classical Sanskrit Literature" by Mr. M. Krishnamacharya, M. A., B L, pp. 105—1906)

* (i) Haeberlin's "Sanskrit Anthology," 323—47; (ii) 'కావ్యసంగ్రహము' జీవానన్దవిద్యాసాగర ప్రకటితము (కలకత్తా), III సం 215—75 పుటలు; (iii) 'కావ్యసంగ్రహము' భువనచన్ద్రబసక్ ప్రకటితము (కలకత్తా, 1874), 120 పుట.

శ్రీరూపగోస్వామికృత గ్రంథరాజిలో నీ క్రిందివి ముఖ్యములు:— (i) ఉజ్జ్వలనీలమణి, (ii) ఛందోష్టాదశకము, (iii) దానకేళికౌముది, (iv) నాటకచన్ద్రిక, (v) పద్యావళి, (vi) భక్తిరసామృతసిన్ధువు, (vii) లలితమాధవము, (viii) హంసదూత, (ix) ఉద్ధవదూత, (x) విదగ్ధమాధవము*, (xi) ముకున్దముక్తావళి. (చూ. xiii) హంసదూత)

iv. కీరదూతము:†—రామగోపాలకృతము. ఇందు 104 శ్లోకములు గలవు. ఈనడుము సాచార్య (Doctor of Literature) బిరుదము నందిన శ్రీమహామహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రి పాదులవారి యభిప్రాయ ప్రకారము, పైకవి నవద్వీపాధినాథుడును, (Nuddea in Bengal) "వివాదార్ణవసేతు‡"ను నిర్మించినవారిలో నొకఁడునగు కృష్ణచంద్రుని యాస్థానములోని రామగోపాలకవి యని తెలియుచున్నది. బృందావనమునుండి గోపికలు మధురానగరముననున్న శ్రీకృష్ణునకుఁ గీరము (చిలుక)ను దూతగాఁ బంపుట యిందభివర్ణింపఁబడెను.

v. కోకిలసన్దేశము§:—ఉద్దండకవికుంజరకృతము. ఈతఁడుత్తరార్కాటుమండలవాసి, రంగనాథరంగదేవీసూనుఁడు; గోకులనాథుపౌత్త్రుఁడు; క్రీ. శ. 15 వ శతాబ్దారంభమున జీవించియుండెను. (Indian Historical Quarterly Vol III part i, Page 223) వాసుదేవకవి యనునతఁడు "భృంగసన్దేశము"ను రచించి (చూ. xxiii) యుద్దండకవిదండకుఁ బంప నీతఁడు దానికిఁ బ్రత్యుత్తరముగఁ "గోకిలసన్దేశము"ను రచించె నని తెలియుచున్నది. ఈ కావ్యమునఁ గాంచీపురవాసుఁ డగునొకకాముకుఁడు (Lover) కేరళదేశమున నున్న తనప్రియురాలియొద్దకుఁ గోకిలచేఁ బ్రేమసన్దేశ మంపుట వర్ణితము.

* ఈయుద్దండకవియే "మల్లికామారుత" ప్రకరణప్రణేతయగు నుద్దండకవియని తోఁచెడిని. ఇందుకుఁ గొన్ని ప్రమాణములఁ బ్రదర్శించెద:—

---

* శ్రీమద్భాగవతదశమస్కంధమునకు రూపగోస్వామి సోదరుఁడు సనాతనగోస్వామి (జీవగోస్వామి?) "వైష్ణవతోషిణి" యను వ్యాఖ్యానము రచించెను వ్యాఖ్యానాంతిమశ్లోకములలో నిజవంశానువర్ణనావసరమున నాతఁడు రూపగోస్వామికృతకృత్యముల ప్రణాళిక నొసంగెను. (Rajendralal Mitra, op. cit. Vol. VI No. 2125.)

† ఈగ్రంథముయొక్క వ్రాఁతప్రతి కలకత్తా సాహిత్యపరిషత్తులో నున్నది.

‡ "Notices of Sanskrit Manuscripts" Mahamahopadhyaya Haraprasadasastri Vol. I Preface. P. XXXIX.

§ "A Descriptive catalogue of Skt. Mss. in the Gov. Oriental Library"—Madras; Vol. XX No. 11835 (page 7914.)

ఆచార్య బెరిడేల్ కీత్ మహాశయుఁడు తన "సంస్కృతనాటకచరిత్ర (పుట 257) లో నిట్లువ్రాసియున్నాఁడు:—

"The Mallikamaruta (Ed. Calcutta 1878) of Uddandin or Uddandanatha, who has had the quite undeserved houour of being taken for Dandin, but who was really no more than the court-poet of the Zamindar of 'Kukkutakroda' or Calicut, in the middle of the 17th century. The plot follows that of Bhavabhuti's "Malatimadhava" almost slavishly.

Dr. A. B. Keith's, Sanskrit Dram1. P. 257.

మద్రపురప్రాచ్యలిఖితగ్రంథాలయపట్టికలో నిట్లున్నది.

"The author is Uddandakavi, son of Bhatta Ranganatha and grandson of Gokulanatha and a native of Ladapura, a village on the banks of the P1lar in the North Arcot Dt. This poem (Kokilasandeśa) is said to have been written in response to a similar poem named भृंगसन्देश written and sent to the author by Vasudevanambudri, a poet in the court of Ravivarma and Goda-varma who ruled at Calicut."

D. C. S. Mss. (Vol. XX No. 11835; P. 7914.)

ఉద్దండకవియొక్క జన్మాదికములకు గ్రంథాలయపట్టికలోఁ 'కోకిలసన్దేశము' నుండి యేమియుఁ బ్రమాణములు చూపఁబడియుండలేదు ప్రమాణములుచూపఁబడక యిట్టులేల లిఖింపఁబడెనో ? "మల్లికామారుతము" నుండి ప్రకృతోపయోగములగు నను కృతులం జూపెద:—

"తత్రచాముష్యాయణస్య ఆపస్తంబశాఖాధ్యాయినో వాధూలకులతరుపల్లవస్య కవితావల్లభస్య పంచమోఽఙ్చితకీర్తే రుపాధ్యాయ గోకులనాథ పౌత్త్రస్య కృష్ణసూనోః పుత్త్రో రంగనాథస్య ఉద్దండకవిరిత్యుదారమభిజన్త"

ప్రథమాంకాంతిమశ్లోకము:—

"శ్లో. ఉద్దండం రంగనాథ స్సుతమలభత యం రంగదేవీ తథాంబా
త్రైవిద్యేశోమహార్ణి ర్నిరవధిమహిమా యద్ధితే జాగరూకః
తస్య శ్రీవిక్రమాజ్ఞాబహుమతిరచితే మల్లికామారుతేస్మిన్
ఆద్యఃప్రాగాత్ దశానాం ప్రకరణతిలకే నిష్ఫలజ్యోఽయమఙ్కః!"

ఈకవియాపస్తంబశాఖాధ్యాయి; వాధూలకులతరుపల్లవుఁడు; ఇతని జన్మస్థలము కాంచీపురనికటస్థమగు లాటపురము. దక్షిణహిందూదేశమునందలి యనేకవిద్యాపీఠములలోఁ దనకవితాగానముం జిమ్ముచు నీకవికోకిలము

పిమ్మట మలబారుదేశమునందలి 'శాక్తమానవిక్రమ' పండితపారిజాతము నాశ్రయించెను. ఈకవి తన "మల్లికామారుతము" లోఁ గుక్కుటక్రోడము (ప్రకృతము, కాలికట్టునగరము)ను, స్థాలీశ్వరమును సూచించి యుండుట యీతఁడు 'జమోరిన్' (Zamorin) రాజధానిలో నుండియుండె ననుటకత్యుజ్జ్వలనిదర్శన మగుచున్నది. (చూ. కృష్ణమాచార్యకృత "సంస్కృతసారస్వతేతిహాసము" పుట. 107) పైగ్రంథమునుండి కొన్నివాక్యముల నుటంకించెద:—

"Tradition says he ( Uddanda ) was a contemporary of Narayana Bhattasri, the renouned author of the lyric 'Dasavata--rastava' For the present the 16th cy. A. D must be accepted as the proboble date of Uddanda's literary activity. His 'Mallika-maruta' is a 'prakarana' in ten acts and *the only work extant* of our poet. The drama follows in strict detail the plot of the Malati–madhava. But the wide learning of Uddanda tended to improve upon Bhavabhuti's construction in various details of development. * * * Uddanda's touches are not always original" (Mr. M. Krishnamacharya's "A History of the Classical Period of Sanskrit Literature." p. 107)

కోకిలసన్దేశమల్లికామారుతనిర్మాతల యైక్యముం గూర్చి విద్వాంసులు విమర్శింపఁ బ్రార్థితులు.

కోకిలసన్దేశమునుండి గ్రంథాంయపట్టికలో నుదాహరింపఁబడిన శ్లోకములం జూపెద:—

కావ్యప్రారంభము:—

శ్లో. సాధేతుఙ్గే సహదయితయా కోఽపిసంక్రీడమానః
ప్రాపస్వాపం పరమపురుషః శేషభోగేశ్రియేవ
చిత్రా ద్వైపీగతి రియమసౌ శైలజామణ్డితాయాం
కాఞ్చ్యాం కమ్పాతటభువి తయానన్వితో బుధ్యతేస్మ.

* *

శ్లో. తత్రద్విత్రాన్ ప్రియసహచరీవిప్రయోగాతిదీర్ఘాన్
కామార్తోఽయం శివశివసముల్లఙ్ఘ్యమాసాన్ కథంచిత్
చైత్రారంభే సముదితమధుశ్రీకటాక్షాభిరామం
చూతాఙ్కూరాస్వాదనరసికం కోకిలం సన్దదర్శ.

శ్లో. గన్తవ్య స్తే త్రిదివవిజయీ మఙ్గలాగ్రేణదేశః
ప్రాప్తః ఖ్యాతిం విహితతపసః ప్రాగ్జయ న్తస్య నామ్నా
పారేచూర్ణ్యః పరిసరసమాసీన గోవిన్దపఙ్క్తే
లక్ష్మీపీఠావిలలితసుధాశీతలః కేరళేషు.

* * *

“శ్లో. ముక్తాజాలైర్ధవలపులినం వీచిమాలావికీర్ణైః
కూలాభ్యాసంకుసుమితకు (త) రుస్నిగ్ధమాలంబమానః
దేశాద్దేశం వ్రజసి కుతుకాత్త్వంముగ్ధాఙ్గనానాం
వామాక్షీణాం నయనపులకైః సాదరం పీయమానః
శ్లో. కుర్యాత్ప్రీతిం తవనయనయోః కుక్కుటక్రోడనామ
ప్రాసాదాగ్రోల్లిఖితగగనం పత్తనం తత్ప్రతీతం
యద్దోర్వీర్యద్రఢిమకరదీభూతరాజన్యవీరాః
శూరాగ్రణ్యశ్శిఖిజలధిస్వామినం (నః) పాలయన్తి.

కావ్యోపసంహారకశ్లోకములు:—

శ్లో. ఏతత్కృత్యం ప్రియసఖ మమభ్రాతురార్తస్య కృత్వా
నాసీరఃస్యా జగతికరుణాశాలినాం సంవిభాగే
శంసన్తిత్వాం ననుపరభృతం శైశవే యద్భృతోఽన్యైః
పత్రివ్రాతాభరణభరణే నాద్యసత్యం పరేషామ్.
శ్లో. ఏవం తస్యా విరహవిధురం జీవితం స్థాపయిత్వా
గచ్ఛ స్వేచ్ఛావిహారణ యథాప్రార్థితం దిగ్విభాగమ్
పన్యశ్రీఃస్యాన్మధననృపతేః కోకిలాతేఽనుకూలా
భూయాన్మైవంసకృదపి తయావిప్రయోగప్రసఙ్గః.”

D. C. S. Mss. Vol. XX No. 11835; Page 7915—౬.

vi. కోకిలసన్దేశము*:—నృసింహకవినిర్మితము.

vii. కోకిలసన్దేశము†:—తాతయతనూభవుఁడగు వేంకటాచార్య రచితము.

viii. చకోరసన్దేశము‡.

* "A Preliminary List of Skt. & Prakrt MSS. in the Adyar Library"—Madras. P. 128.

† Burnell—"A Classified Index to the Skt. MSS. in the Palace Library" Tanjore, 157.

‡ Burnell—Op. Cit. P. 158.

శ్రీ ర స్తు.

# శుకసప్తతి—కృత్యాది.

— పాలవేకరి కదిరీపతి నాయకుఁడు. —

ఉ. శ్రీకమలాక్షి యై మెలఁగుసీత తటిద్రుచి నొంద లక్ష్మణ
శ్రీకరబాహుదండమునఁ జేర్చుధనుర్లత యింద్రచాపశో
భాకృతిఁ దాల్ప మేరుశిఖరాశ్రయనీరదలీల సింహపీ
ఠికమనీయుఁ డౌ జయపటిష్ఠుని శ్రీరఘురాము నెన్నెదన్ ౧

మ. వరవామాంకమృగేంద్రపీఠి నెలమి న్వర్తించి ప్రాంచత్కృపా
కరవీక్షాంకురచంద్రిక న్సకలలోకశ్రేణి నీడేర్చుచున్
వరసౌభాగ్యధురీణ యౌ జనకరాడ్వంశాబ్ధిజాత న్సువ
ర్ణరుచిస్ఫూర్తిసమేత సీతఁ ద్రిజగన్మాతం బ్రశంసించెదన్. ౨

మ. మును శేషత్వముఁ బారతంత్ర్యమహిమంబుం దాల్చి లక్ష్మీప్రియుం
గని సేవించి యతండు రాముఁ డయి జోకన్ ధాత్రి నుండంగ నిం
పున శేషత్వముఁ బారతంత్ర్యమహిమంబుం దాల్చి సేవించి మిం
చిన శ్రీలక్ష్మణదేవు నాత్మఁ దలఁతున్ శ్రీవాక్ప్రభావాప్తికిన్. ౩

మ. సిరు లొప్పంగ రఘూద్వహుండు సుజనక్షేమంకరోద్వృత్తిమై
నరుదార న్మణిభద్రపీఠమునఁ గొల్వై యున్నచో ఛత్రచా
మరముల్ మ్రోల వహించి చిత్త మలరింపం జాలి భక్తాలి బం
ధురపాపౌఘభయఘ్ను లౌ భరతశత్రుఘ్ను ల్ననుం బ్రోవుతన్. ౪

సీ. పరిపక్వసహకారఫలమా సముద్దండమహనీయమార్తాండమండలంబు
తూలికాఘటితకందుకమా నభశ్చుంబిదృఢతరద్రోణధాత్రీధరంబు
బిసకాండవిసరమా యసమత్రిలోకవిద్రావణాసురమహారాజబలము
క్రీడానివాసమా కృతశాంబరీభయంకరనక్రవరగర్భగహ్వరంబు
బళిర యీలీల యని సురల్ ప్రస్తుతింప
నలరి శ్రీరామచంద్రపాదారవింద
వందనానందరససుధాస్పందహృదయుఁ
డగుసుధీమంతు హనుమంతు నభినుతింతు.

క. వాణి న్వీణాపుస్తక, పాణిన్ శుకవాణి విపులభాసురపులిన
శ్రోణి న్బలభిన్మణిజి, ద్వేణిం గమలభవురాణి వినుతింతు మదిన్. ౬

ఉ. ముద్దులుగుల్కు శైలసుతముందఱ శైశవలీల నాడుచో
నొద్దికనున్న తండ్రి తలయూఁచ జటామకుటాభ్రరేఖపై
నిద్దపుసబ్జమోహమున నెమ్మిఁ గరాగ్రము సాఁచువేలుపుం
బెద్ద గణేశుఁ గొల్తు మదభీప్సితకావ్యకళాసిరూఢికిన్. ౭

మ. కవితాకన్యకల న్సువర్ణసదలంకార ప్రయుక్తిన్ యథా
ర్థావరప్రాప్తి నమర్చి కీర్తినిధులై యాచంద్రతారార్కమై
భువి వర్ధిల్లఁగఁ జేయుపుణ్యుల మదిం బూజింతు వల్మీకసం
భవులన్ వ్యాసులఁ గాళిదాసముఖుల న్సత్కావ్యసంసిద్ధికిన్. ౮

గీ. ధృతి దురాచారమతి నేకదృష్టివలన, బహుపదార్థపరిజ్ఞానపటిమలేక
కర్ణకటువుగ వదరెడు కాకవులను, గాకవులటంచు నెంచి తృణీకరించి. ౯

వ. ఇవ్విధంబున నిష్టదేవతానమస్కృతియును సకలసుకవిజనపురస్కృతియును
గావించి సముంచిత సకలరసానుబంధబంధురం బగునొక్క మహాప్రబంధంబు
నకళంకకళాకానిశాకర కరనికరానర్గళగళిత సుధారసధారా మాధురీధురీణ
వాగ్ధోరణీనిబంధనంబుగఁ జెప్పంబూని యున్నసమయంబున నొక్కనాఁటి
శుభావహాగరీయం బైనవిభావరీతుర్యయామంబున. ౧౦

సీ. మరకతంబులయొప్పు మైనుప్పతిలనొప్పుగోమువాఁ డెలనవ్వుమోమువాఁడు
వనజాతములబింక మెనయుకన్గవపొంక మమరువాఁడొకవింతకొమరువాఁడు
చికిలిక్రొంబగడంపు జిగిగుంపురవణంపుమోవివాఁ డెనలేనిరీవివాఁడు
మిసిమిబంగరుచేల పసమించుకటిలీలఁ జెలఁగువాఁడుశుభాప్తిమెలఁగువాఁడు
దివ్యకోదండశరకాండధృతకరాబ్జ,యుగమువాఁ డెన్నరానిసోయగమువాఁడు
జానకీలక్ష్మణులతోడ స్వామి రాముఁ, డెలమిఁగలలోన నాచెంతనిలిచెనంత.

క. కని విస్మయసమ్మోదము,లెనయ న్భయభక్తియుక్తిహృదయుఁడనగుచున్
వినయస్థితి నల్లజక, జ్జనకున కేనతు లొనర్చి సంప్రీతుఁడనై. ౧౧

* * * * *

క. ఈవిధమున నాయనుమతిఁ, గావించితివేని సకలకవిబుధజనసం
జీవన మై నీవంశము, పావన మై వెలయు నుత్కృపామహిమాప్తిన్.

వ. అని యద్దేవుం డానతిచ్చిన మహాప్రసాదం బని యంగీకరించి యత్యంత
భయభక్తి కరకమ్రనమ్రశిరస్కుండ నై సాష్టాంగనమస్కృతులు గావించి
యానందబాష్పంబులు చిలుక పులకాంకితగాత్రుండ నై మేలుకాంచి యమం
దకందళితానందనిష్యంద హృదయారవిందుండ నై ప్రభాకరప్రభావిభాసు
రం బగు ప్రభాతంబున సౌశీల్యాదిమాంగల్యహేతుకాల్యకరణీయంబులు
నిర్వర్తించి నిరంతర నితాంతతంత్యమాన కాంతికాంత దంతురిత ద్వార
బంధసంధానితగంధసింధురకరాసీత శాతకుంభకుంభ సంభృతాంభోవిజృంభ
మాణ ధారాభిషిక్తాంభోజవాసినీ సంవాసితంబును నిశాత్యంతాసమాన
వసవాసమాగత రోలంబకదంబ విలంబమాన ప్రసూనమాలికా లలిత
నానాసూన వర్ణనీయవర్ణవిచిత్ర చిత్రాంబరవితాన విద్యోతమానంబును
బృందావనాళిందకళిందనందనీ నందనోద్యానవల్లవసుందరీసందోహానంద
విహారమాణముకుంద క్రీడావిలాస చిత్రితభిత్తిప్రభాభాసితంబును వినూ
త్నరత్నకంబళాస్తరణోపరిభాగవిన్యస్తప్రశస్తనిస్తులగాంగేయ విస్తీర్ణోదీర్ణ
సూర్యపుటోపధాన శయ్యాగారమణీయంబును నటనటీ గాయనగాయనీ
నాట్యసంగీత సందర్శనాకర్ణనోత్కంఠాయాత పురందరపురసుందరీ సందో
హావిభ్రాంతికృత్సాలభంజికాపుంజ రంజితవలభీప్రదేశ ప్రభూషితంబును
వేదవేదాంగాద్యనేక శాస్త్రరహస్య విజ్ఞానధురీణ విపశ్చిన్మౌహూర్తిక
సుకవి గాయక మంత్రిపురోహిత విలసితంబును భరతమతంగదత్తిలకోహ
లాంజనేయశార్ఙ్గదేవమతాది వివిధభరతశాస్త్రవిశారద కుశీలవలలితం
బును గమలరాగోపల ఫలకాయమాన చూతనూతనపల్లవోల్లసిత తోర
ణాలంకృతంబును హిమవాలుకాచూర్ణ రంగవల్లీ విరాజమాన ప్రాంగణ
దేశదేదీప్యమానంబును సముంచితానవరతాగురుధూపవాసనా వాసితం
బును నై విరాజిల్లు నాస్థానభవనరాజంబు వందిమాగధబృందంబు లందం
దచ్చైవారంబు సేయం బ్రవేశించి బంధుహితామాత్య సామంతజనంబు
లభ్యర్ణప్రదేశంబున వసియింపఁ జేరోలగంబున నుండి సముద్భట వీరభట
రాహుత్త సంఘంబుల కొల్వు గైకొని భూసురాశీర్వాద భాసురమంత్రాక్ష
తంబు లుత్తమాంగంబునఁ ధరియించి విద్వజ్జనంబులకు నమస్కరించి స్వ
ప్నప్రకారంబు విన్నవించిన విననవధరించి వార లిట్లనిరి. నీలనీరదశ్యా
మాకృతియగు రఘుపతి ధనుర్బాణపాణియై మ్రోలనిల్చుటం జేసి దిగ్విజ

యంబు సకలజగన్మాత యగు సీతసందర్శనంబువలన నిరంతరసంపత్పరంప రావాప్తియగు నిజాగ్రజన్మ సేవాశుభలక్ష్మణుం డగు లక్ష్మణవిలోకనంబు కతన గురుభక్తి యుక్తియును గలుగు నీస్వప్నంబు వివిధశోభన ప్రయత్నంబులు దెలుపుచున్నయది. నీయట్టికృతార్థున కిట్టిమహత్త్వంబు లబ్బుట యాశ్చర్యంబె మహావంశసంభవుండవు ధైర్యస్థైర్యశౌర్యౌదార్యగాంభీర్య లతాలవాలంబగు భవద్వంశావతారం బభివర్ణించెద మాకర్ణింపుము.

గీ. సారమై శౌరికేళికాసారమైన, పాలమున్నీటివలన సంభవమునొందెఁ
గువలయామోదకారియై కుటిలచక్ర, హారియైసత్కళాధారియైనరాజు.

క. ఆయమృతాంశుఁడు త్రిజగ, ద్గేయుండగు రోహిణేయుఁ గిల్బిషహారణో
పాయుఁ గ్గ సంశ్రితనికరవి, ధేయు న్బుధనామధేయు ధీయుతుఁ గాంచెన్.

క. అతనికిఁ గల్గె బురూరవుఁ, డతఁడాయువుఁ గాంచె నహుషుఁ డాపుణ్యునకున్
సుతుఁడతఁడు కనియెఁ దనయుం, దతవిభవోన్నతి యయాతిఁ దద్వంశమునన్

మ. భువనాధారవిహారియైనహరి యాపుణ్యాత్మనామంబుచే
భువి భాసిల్లు కులంబునన్ హరిహరాంభోజాసను ల్మెచ్చ సం
భవుఁడై ధాత్రి నరాతిజాతిభయకంపంబెల్ల వారించి సం
స్తవనీయుండన నొప్పె నాతఁడు యదుక్ష్మాభర్త పొల్పొంద మహిన్

ఉ. ఆరసికావతంసకుల మాత్మసముద్భవహేతుభూతమై
ధీరతఁ బాలవెల్లి జగతిం దగెఁ దన్మహిమం బపారగం
భీరఘునాఘసంభరణభీమబలప్రతిభాప్తిఁ గాంతు నం
చారయఁ బాలవేకరికులాఖ్య వహించె నదంచితోన్నతిన్. ౯

ఉ. ఆమహితాన్వవాయ వసుధాధిపు లచ్యుతగోత్రపాత్రు లు
ద్దామభుజాపరాక్రమ విదారితఘోరమదారి వీరులై
భూమి భరించి రానృపుల భూతి మహోన్నతినేలె భోగసు
త్రాముఁడు తాడిగోళ్ళ పురధాముఁడు శ్రీపెదయాబళుండిలన్ ౧౦

సీ. తనమాట శకయుగంధర లాటనృపవరు ల్వినయోక్తిఁ గడుగారవించిమెలఁగఁ
దనకీర్తి దశదిగంతరపూర్తి నేవేళ నిండారు పండువెన్నెలలుగాయఁ
దనధాటి రిపుమహీధవకోటి కద్రిగంహారకుటీరములఁ గాఁపురమమర్పఁ
దనదాన మర్థిలోకనిదాన మనఁ గర్ణఖచరామరాగవైఖరులఁ బొసఁగఁ

దనమహోగ్రప్రతాప ముద్దండచండ, భానుమండలి నేరయుసౌభాగ్యవిభవ
రాజ్యలక్ష్మీసహాయుఁడై ప్రబలెరూప, భావజనిభుండు పెద్దయాబళవిభుండు

సీ. రాయదత్తాశ్వవారణరత్నవరత్నహారాంబరంబు లేయధిపుఁడందె
నళిరామరాజేంద్రబలవద్రిపులఁద్రుంచు కలసి కేధీసుండు కర్తయయ్యె
(?)దెరాకమునతెర్క మొదలుగల్గు బహురాజ్యమేశౌర్యమహితుఁడేలె
గురుదేవతాపాదసరసీరుహార్చనాపరత నేనిపుణుండు ప్రోథిగాంచె
నతఁడు వెలయు సమగ్రమహాహవోగ్ర, సప్తకసహస్రచాపభృత్సైన్యజితమ
దాహితెంగాగనుద్రుండు(?)తాడిగోళ్ళ, జలధిచంద్రుడు పెద్దయాబళవిభుండు.

చ. నరచక్రేశుల నెంచిచూడ హనుమన్నాగారిబిహ్నధ్వజై
పరబాణాసనచాతురిం గనిరి తత్రాగల్భ్య మెంతం చుఁ దా
నరచక్రేశత రాయదత్త హనుమన్నాగారిబిహ్నధ్వజుఁడై
పరబాణాసనచాతురిం దనరె నోబక్షోణిపాలుండిలన్. ౧౩

సీ. క్రోడుగ ల్మొదలైన గురుతరగ్రామము ల్మహిమఁ జెన్నగు భోగమండపములు
సరస గుబాళించు వరధూపవాసన ల్వివిధరాజాన్ననివేదనములు
కట్టాణిముత్యాలగట్టిచౌకట్లజో డమరైన నవరత్నహారలతలు
కడుదీప్తి మెఱయు నఖండదీపజ్యోతు లనుపమ సుప్రసూనార్చనములు
మొదలుగాఁ గల్గుకైంకర్యములనమర్చె, శ్రీకరుండైనఖాద్రినృసింహమూర్తి
కెనయఁ బ్రహ్లాదుఁడితఁడో యనఁగభక్తి, గలిగి పెదయాబళేంద్రుడు వెలయుజగతి

క. ఆపెద్దయోబనృపతికిఁ, గోపకనద్భాస్వదంశుకుముదీభవదా
ఘోపాలసముదపరి, క్ష్మాపాలకుఁడైన నారశౌరి జనించెన్. ౧౪

సీ. సలుపఁ డనుచు
జీవనంబొసఁగి రక్షింపఁ జాలుఘనుండు చంచలాత్మకతగర్జించుననుచుఁ
దాభోగియై యనంతాభిధానుఁడు జగత్ప్రాణాపహారియై
.ణ్యాజనవృద్ధికోర్వఁడనుచు
జలజరిపుమేఘశేషసూర్యులహసించి, కాంచెనతచక్రభరణమూర్జించెధైర
మవనిఁ బాలించె నిర్జించె నఘజనాళి ౧౫

చ. యోబవిభు నారనృపాలుని యోలగంబునం
గలితసుగంధమాల్యవసనంబులతో నెలవైనవక్త్రా
కులె యొకరాయ మన్నెదొర
త నుతింప ఫణీంద్రునకైన శక్యమే. ౧౬

సీ. తొలఁగినఁ గడుసూతువారలవనాయాసవర్ధితదుఃఖాశ్రువర్షములకుఁ
గొలిచినసరి ములకు
నాశ్రయించిన భూసురాగ్రేసరులు సేయఁదొడఁగినసవనాగ్నిధూమములకు
నిడిన సత్త్రముల నభీష్టమృష్టాన్నభోజనజనజయజయశబ్దములకు
నేమిటి కిందని తెలిసి దాఁటె
నేడువార్ధులు గడవెళ్ళఁ దాడిగోళ్ల, నారవిభునియశఃకాత నడతవింత ౨౮

క. మేరుగిరిధైర్యనిధియా, నారనృపాలకు
హారులఁ దొమ్మంద్రుసుతుల నతులితమతులన్ ౨౯

క. ఆరమణీయయశోవి, స్తారుఁలలో వినుతిఁ గాంచె సకలధరిత్రీ
భూరితర భారవహ ౩౦

సీ. వరదానవాగ్వైభవముల సీకనవచ్చుఁ గర్ణుతో శేషదృక్కర్ణుతోడ
నంగసౌందర్యశౌర్యముల జోడనవచ్చు మారుతో గిరిజాకుమారుతోడ
భవునితోఁ గమలసంభవునితోడ
కలితసాహిత్యకీర్తుల సరి యనవచ్చు భోజుతో నిర్జితాంభోజుతోడ
ననుచుఁ దను గీ స్నానదాన
ధర్మగుణముల శోభిల్లు తాడిగోళ్ళ, నారనరపాలునొబళనాయకుండు. ౩౧

చ. వననిధి మేటి దానము
లకు నాఁపతి మీఁజు సముద్రవారివా
హానకమతేంద్రసైంధవుల కబ్బఁడు మిన్నుట మాపగాధిరా
ద్వనధరపాళభృజ్జ ౩౨

సీ. ఘనములై ముక్తిసాధనములై మానిపావనములై పొలుపొందు వనములలర
శ్రుతులై పదార్థసంగతులై విలసదలంకృతులై విరాజిల్లు కృతులు దనర
మురువులై మున్నిటిహరువులై చూడనచ్చెరువులై వెలయుబల్చెఱువులొనర
నయములై మణిహేమమయములై యుత్సవాలయములై మనుసురాలయము
లమర
ధరఁ బ్రతిష్ఠించి వెలసె సంగరధరోగ్ర, బహుళహాళహాళనిభకోపగహానదహన
భీమరిపుభూమివిభుమనోభీకరుండు, నారభూవరునొబళనాయకుండు. ౩౩

క. అవసుధాధిపుపట్టపు, దేవులలో సకలజలనిధిప్రాకృతగో
త్రావలయదీనరక్షా, ప్రావీణ్యకళాప్తిఁ గాంచె బాలమ ధాత్రిన్. ౩౪

సీ. మగనికి సకలసంపదలు గల్గ మెలంగి కమలయై నెగడె నీకంబుకంఠి
ప్రజల సత్పుత్రులపగిదిఁ గన్గొని యన్నపూర్ణయై తనరె నీపువ్వుఁబోఁడి
యోర్పుగల్గి యొకింతయును గోపమెఱుఁగక ధాత్రియై వెలసె నీతరళనయన
సుచరిత్రధర్మమెచ్చోఁ జాయ కలయరుంధతియై రహించె నీ నలిననయన
యనుచుఁ దనతోడిసతులెల్ల నభినుతింపఁ, బరఁగుఁ బరమపతివ్రతాభరణమగు
చుఁ దాడిగోళ్లబళకుమాధవువిరాణి, భవ్యసద్గుణనికురుంబ బాలమాంబ.
క. ఆరమణీమణివలనన్, గారవమున నోబవిభుఁడు గనియెఁ గుమారున్
ధీరుని నవమన్మథశృం, గారునిఁ గరెమాణికేంద్రు గరుణాసాంద్రున్. ౩౭
మ. కరెమాణిక్యనృపాలుకీర్త్యధికిం గంజారితారాసము
త్సరము ల్ఫేనము లింద్రదంతి జలనాగం బీశతాలాంకని
ర్జరమాన్యావళి నీరుపాపగమి భాస్వద్రత్నసాన్వాదిభూ
ధరము ల్రత్నము లబ్జజాండములు మత్స్యాండంబు లయ్యెన్ ధరన్. ౩౮
సీ. ఏవదాన్యుఁడు రామదేవరాయలసరిద్దియ నోడ్డోలగమున నుండె
నేమనుజాధీశుఁ డితరనృపాలరాజ్యస్థాపనాచార్యుఁడై చెలంగె
నేపరాక్రమవంతుఁ డెదిరినశత్రుభూపాలుర నడవులపాలుపఱిచె
నేమహామహుఁడు శ్రీరామనామధ్యాననిష్ఠాగరిష్ఠప్రతిష్ఠగాంచె
నతఁడు చతురబ్ధివలయితకుతలభార, భరణవిభవప్రచురబాహుబలవిహారి
తాడిగోళ్లబళనృపాలతనయమౌళి, నీతిగీష్పతి కరియమాణిక్య నృపతి.
క. అలకరెమాణిక్యేంద్రుని, బలుధాటికి నల్కి యవనపతు లందఱు న
వ్వలయాచలపశ్చాత్స్థలి, నిలువఁగఁ బాశ్చాత్యు లనెడునియతి ఘటిల్లెన్.
సీ. తాళి చౌకళి కుంచె కాళాంజి చామరద్వయము ముత్తైపుఁదురావాహనము పి
రంగికత్తి మొదలౌ రామరాయకృపావరదత్తబిరుదాంకవార మంది
కదనభూతలభయంకరకరాగ్రసమగ్రకరవాలహతరిపువ్రాతుఁ డనఁగఁ
దాడిగోళ్లన్వయోదధినిశాకాంతుండు కరియమాణిక్యభూకాంతు డలరు
నభయదానార్ద్రనతవినుతావనీశ, పాకభిల్లోచనానందబాష్పకణము
రందబంధురపాదారవిందుఁ డగుచుఁ, జక్రవాళావృతాచలచక్రమునను.
క. ఆకరెమాణికరాయ, క్ష్మాకాంతునికాంత లమిత కమనీయశుభ
శ్రీకాంతలు సంపత్స, ద్మాకాంతలు నల్గు రెన్నఁ దనరుదు రెలమిన్. ౪౧
గీ. అందు లచ్చమ్మ లచ్చమ్మయగు గుణమున, వలపు రాచమ్మ రాచమ్మ కలిమి కెలన
ధృతకురంగమ్మ రంగమ్మ పతిహితమున, నాసుభద్రమ్మ భద్రమ్మ యాదరమున.

శా. శ్రీకృద్ధికరెమాణికేంద్రుఁ డిసధారేయుండు తేజోఘనుం
డాకాంతామణులందుఁ గాంచెను వసంతాధీశు రామాధిపుం
బాకారిప్రతిమాన వైభవయుతు న్నారప్రభు న్నారదా
శ్రీకంఠాభయశోవిశాలుఁ గదురోర్వీపాలు లీలాంగజున్. ౪౩

క. అం దగ్రజుండు వెలయుఁ బు, రందరభోగాఢ్యుఁ డమలరమణీయయశః
కందళజితముక్తాహారి, చందనమందారుఁ డనవసంతేంద్రుఁ డిలన్. ౪౪

చ. సమరదిలీపుఁ డైతగువసంతన్నపాలుని కీర్తిశౌర్యముల్
సమరసధర్మమార్గణ విశాలవితీర్ణిమనంటి జంటగాఁ
గమలభవాచ్ఛభానుకరకాంతిత మెంతని వంతగించె నా
క్రమకలధాతభూధరవికస్వరరూపము లేపుమీఱఁగన్. ౪౫

క. ఆధన్యునకును సంభవుఁ, డై ధాత్రిభరించి భీకరాకృతి రిపురా
డ్బాధరసంఘాతేంద్రా, ణీధవుఁ డన రామమేదినీధవుఁ డలరున్. ౪౬

మ. సమరక్షోణిని రామభూవిభుఁడు భాస్వల్లీల ఖండింపఁ ద
ద్విమతాధీశ్వరకంఠరక్తతటినీవేగాహతిక్షుబ్ధవా
ర్ధిమహారావచరత్తటిద్రుమకముల్ ద్వీపక్షమాపాలనా
ర్థము గట్టించిన తోరణంబు లనఁగా రంజిల్లు నల్దిక్కులన్. ౪౭

గీ. ధాత్రి తనకీర్తి రంజిల్లు తాడిగోళ్ల, రామభూపతి |రంగరాయదత్త
మత్స్యమకరధ్వజాఢ్యుఁ డైమధురధర్మ, భరణతరహించురతిమనోహరునికరణి

సీ. తనగుణలతికాకదంబకంబునకు లోకాలోకనగము పందిరి గాఁగఁ
దనశౌర్యచండభానుని కరాతిధరాధినాథులు ఘూకసంతతులు గాఁగఁ
దనదానసంతానమునకు శుభ్రాంశుధామములు భాస్వత్ప్రసూనములుగాఁగఁ
దనకీర్తిబాలకు వనజజాండకటాహ మెల్లప్పటికి బొమ్మరిల్లు గాఁగఁ
బరఁగు రణరంగరంగదభంగజవతు, రంగసారంగయోధ శతాంగధుతప
రాగపరిభూతభీతారిరాజచయుఁడు, తాడిగోళ్లాపురీరామధరణివిభుఁడు.

మ. ధర రామక్షితిపాలుసెల్వున వసంతత్యాగకాలంబునన్
వరమాణిక్యపురాసు లెల్ల భటవిద్వద్యాచకు ల్వచ్చి యం
దఱు నొక్కుమ్మడిఁ గొల్లలాడి కొనిపోఁ దచ్ఛేషముం దానిజో
దరమం దుంచుక రత్నగర్భ యను ప్రోద్యత్సంజ్ఞచే మించదే. ౫౦

క. ధామనిధితేజుఁ డగునా, రామనృపాలకుఁడు శరపరాభూతమహా
భీమరిపుస్తోమవపుః, స్థేముని రఘునాథవిభుఁ జెల్వుగఁ గాంచెన్. ౫౧

సీ. తనసదాచారంబు తనసదాచారంబు సరణి నానాఘనోత్సవమొనర్పఁ
దనశుభాలోకంబు తనశుభాలోకమ ట్లతిలోకబాంధవోన్నతి ఘటింపఁ
దనకలావిభవంబు తనకలావిభవంబు మాడ్కిని సర్వజ్ఞమౌళి నెనయఁ
దనసన్నిధానంబు తనసన్నిధానమ ట్లనవద్యతర నిరంజనత వెలుఁగఁ
బరఁగు యుద్ధధరిత్రీద్ధ పటుపటహావి, జృంభణార్భటీ దళితదిక్సింధురాళి
కుంభముక్తౌఘగుంభితకువలయుండు రామభూపాలురఘునాథభూమివిభుఁడు

చ. నరనుతమూర్తి యైన రఘునాథనృపాలుని కీర్తిసంఘ మా
హారిశరజన్మ హంసభవ హారివిలాసము, తత్ప్రదాన మా
హారిశరజన్మ హంసభవ హారివిలాసము, తత్ప్రతాప మా
హారిశరజన్మ హంసభవ హారివిలాసము, ధాత్రి నెన్నఁగన్. ౫౩

ఉ. ఆరఘునాథభూమివిభుఁ డంబరభూజసమీభవత్ఘన
ద్గారవకీర్తియై కొలువఁ గంసహరాంశభవుండు రామధా
త్రీరమణుం డనేకజగతీపరిపాలతఁ బూనె సద్గుణా
వారణలీల సర్వజనవర్ణితదానకళాకలాపుఁడై. ౫౪

క. ఆరామశౌరితమ్ముఁడు, నారనృపాలకుఁడు వెలసె నక్షత్రశర
ద్ధారాధరతారావర, హారామరతరుహిమాచలాంచద్యశుఁడై. ౫౫

మ. అరిపద్మంబులచే మహోత్పలకళోద్యద్వృద్ధిచిత్తంబులం
బరమాహ్లాదముఁ జెందవచ్చు మదిలోఁ భావించి రేఱేఁడు భా
స్వరతేజుండగు నారభూవిభుని సచ్ఛత్రాకృతిం దాల్చి తా
నరిపద్మంబుల మైత్రి గన్గొనియె నాత్మాలోకమాత్రంబునన్.

సీ. సురసరిత్పూరహారస్థిరశరద్ఘనవయశ్కరనిధిచ్ఛవికనచ్చటులకీర్తి
ఘనరటత్పటహనిస్వనవినిర్దళితశాత్రవపురప్రకటవప్రనికరుండు
రణవిఖండితరిపుప్రభుగళస్రవదసృక్తతరసప్రకరపూరితపయోధి
సలిలభృజ్జలజభిజ్జలధికల్పకవికర్తనసుతస్తవనీయదానయుతుఁడు
మన్నమాత్రుండై నిజపాదమంజుకటక, ఘటితపటురత్నపటల విస్ఫుటవిదృశ్య
మానమత్తారిరాజన్య మస్తకుండు, నారభూపాలుఁ డమితసన్నాహబలుఁడు

శా. ఆపృథ్వీపతిసోదరుండు కదురక్ష్మాధీశవర్యుండు యో
షాపంచాస్త్రుఁ డనంతభూషణవిశేషస్ఫూర్తియుం బ్రాప్తల
క్ష్మీపాలత్వముఁ గల్గి సజ్జనగణశ్రేయస్కరోద్యోగుఁడై
దీపించెన్ శివకేశవాంశజుఁ డనన్ దివ్యప్రభావోన్నతిన్. ౫౮

సీ. పద్మాప్తపద్మాప్త పద్మాప్తతుల్యుఁ డేఘనుఁడు సంపత్ప్రాకలితరుచుల
హరిణాంకహరిణాంకహరిణాంకసముఁ డేరసానాయకుఁడు బలైశ్వర్యకళల
హరిరాజహరిరాజహరిరాజనిభుఁ డేనృపాలుండు శౌర్యోక్తిభక్తిరతుల
మకరాంకమకరాంకమకరాంకసదృశుఁ డేఘనుఁడు దానాకార గౌరవముల
నతఁడు గుణధాముఁ డభిరాముఁ డర్థధాముఁ
డమితజయభీముఁ డుద్దాముఁ డరివిరాముఁ
డతులవైభవసుత్రాముఁ డనఁగ భద్ర
నాముఁ డలరారుఁ గదురభూనాయకుండు. ౫౯

క. సంగరజయుఁ డగుకదురనృ, పుంగవువాక్కీర్తులలరె భూస్థలిఁ హరజూ
టాంగనటద్గాంగరట, ద్భంగాభంగోద్ధనీనదధవళద్యుతులన్. ౬౦

చ. హరనరవాహవహ్నిహరు లాకదురేంద్రుని కీర్తిదానశౌ
ర్యరసకృపావిశేషముల కల్మి కృశించి కురూపులై సదా
మొరయుచుఁ జాల నల్లనయి భూమిధరంబున మూలచట్ల సా
గరమున విశ్రమింప నొదుగం దిరుగం బడియుండెఁ జూడరే. ౬౧

క. ఆమహిమాఢ్యునకుఁ బురం, ధ్రీమణియగు కదురమాంబ దీనావనయై
మెఱయ మహిని వర్ధిలు, తామరసాక్షునకు వార్ధితనయ యనంగన్.

సీ. తారత్నగర్భాభిధానయయ్యును విభు నప్పుల తాయి మోయంగఁ జేసెఁ
దాఁ గల్మియొసఁగెడు తరుణియయ్యును నిజప్రాణేశుఁ బసులకాపరిగఁ జేసె
దా జనకజయయ్యు ధవునిఁ గారడవిలో జనకవియోగాప్తి నెనయఁ జేసెఁ
దా హైమవతియయ్యుఁ దనమనోనాథుని బునుకపేరులు దాల్చుకొనఁగఁ జేసె
నని ధరాదేవి నిందిర నవనికన్య, నచలజాతను నిరసించి యాత్మపతికిఁ
గీర్తితాభీష్టవైభవస్ఫూర్తులొసఁగు, వదనజితపూర్ణశశిబింబ కదురమాంబ.

గీ. పరమగుణశాలి కదురనృపాలమౌళి, కదురమాంబికయందు శృంగారనిధుల
నందనులఁ గాంచెఁ గదురభూనాథు నిన్న, వేంకటాగ్రణి నతిదాసవిబుధమణిని.

చ. ఇనవిభ తాడిగోళ్ల కదురేంద్రుని శ్రీకదురావనీశ నీ
యనుజుని వేంకటక్షితివరాగ్రణి నెన్నఁదరంబె ధాత్రిపై
వనయముఁ దత్ప్రతాపజలజాప్తుఁ జే వలయాద్రిరాడ్వలం
ఘనమగు శత్రుభూభుజులు గాంతురు సత్పథసౌఖ్యసంపదల్. ౬౬

సీ. అనిమిషావాససంప్రాప్తిఁ జెందనివారి కనిమిషావాస సంప్రాప్తిఁ బొసఁగ
విషధరస్థలినుండ వెగ్గలైనవారికి విషధరస్థలినుండ వెలుఁగుమాన్పు
స్వస్థానవిహరణాసహ్యులౌ వారికి స్వస్థానవిహరణాసహ్యముడిపెఁ
దశమహాబిలపదస్థలి లేనివారికిఁ దశమహాబిలపదస్థితిఁ గడించె
నౌరతొలుదొత్త్రాడసిజొమ్మ సిమిగడిమి, చించిచెండాడి గాసిఁ జేసినది యయ్యె
విమతతతిపట్ల కదురభూవిభుని వేంక, టాగ్రణికరాసి మొతదయాంబురాశి.

చ. సరసతఁ దాడిగోళ్ల పురశాసనుఁడై తగు వేంకటప్రభుం
డరివిజయప్రయాణ సమయానకనాదవిధూతతారకాం
బరమున కాత్తఖడ్గహరిమర్దిత శాత్రవహస్తిమస్తకో
ద్ధురుచిరమౌక్తికప్రతతి తారలపెక్కు ఘటించు నిచ్చలున్. ౬౭

స నవనవాగతశీతపవనవారమహోగ్రదవలవావళి చేత దర్పముడిగి
తలతలావృతసుకోకిలకులాననగళత్కలకలారభటి చేఁ గసుఁ గలంగి
ప్రసవసారసితసారసరసాశనమత్తభసలసాధ్వసము చే భంగమంది
స్మరశరాననసముద్ధుర శరాకులమనస్సరసరాగము చేత శయ్యనొరగి
ధరణి నెఱిఁగింతురీరీతిఁ దాడిగోళ్ళ, కదురవిభు వేంకటేంద్రుని కదనధాటి
కలికి దుర్గమకాననస్థలులఁ బడిన, యాత్మనాథులపైకమి నహితసతులు. ౬౮

ఉ. శ్రీనిధి తాడిగోళ్లకదిరీపతినాయుని వేంకటక్షమా
జాని జయప్రయాణపటుసంభ్రమసంభృత భూరిభేరికా
ధ్వాన మమర్త్యలోకవనితాజనము ల్విని నూతనప్రియా
నూనసుఖోన్నతుల్గలుగునో యని యెంతురు సమ్మదంబునన్. ౬౯

ఉ. ఆయనుజుండఖండవిభవాఢ్యుఁ డమందముదంబొనర్ప నా
రాయణపుణ్యమూర్తి యయి రంజిలితీవు శుభైకశాశ్వత
శ్రీయుత తాడిగోళ్ళకదిరీపతినాయక వేంకటాంబ య
త్యాయతకీర్తిపూరితదిగంతర పట్టపుదేవి యై తగన్. ౭౦

చ. అమితయశఃపయోధి కదురాధిపు(శ్రీ)కదురక్షితీంద్ర చి
త్రము విను మొక్కవార్త సమరస్థలి దుర్మదవద్విరోధిరా
ట్సముదభవద్భయంకరభుజప్రవిభాసికరాసిసంహతి
స్విమతులకంఠరక్తము స్రవించి ద్రవించు మనంబు రంభకున్. ౨౧

సీ. మేఘంబు లేనిక్రొమ్మెఱుంగులు కుముదారి లేనివెన్నెలలు వార్ధి లేనిబాడ
బములు సురాద్రిలేని మణిసానువు లరణ్యములేని దావానలములు కొలను
లేని కెందమ్ములు ప్రాను లేనిచివుళ్లు గనిలేని కెంపులు మనసిజారి
లేనికన్నంటలై లీల నిండెను ధరాస్థలి నౌర యుష్మత్ప్రతాపరుచులు
దహనసహాకారకారాజదర్పహరణ, రణమహాభీమభీమాబ్జరమ్యకీర్తి
కీర్తితాలోకలోకైకకీర్తనీయ, ఘనగుణకలాప కదురేంద్రకదురభూప. ౨౨

క. తతరణమున నీవిమత, క్షితినాథు లనంతధవము? జెందరె భయసం
యుతులై నతులై హతులై, గతకల్మషతాడిగోళ్ల కదురనృపాలా. ౨౩

చ. అమృతము శీతభానుగత మన్నది కాదు తృణాస్థితం బటం
చమలమతి న్వచింతురు మహాత్ములు కాదని రేని నీరిపుల్
రనుణఁ దదాప్తిమాత్రమున రక్షితులై మనుటెట్లు ధాత్రిభూ
రిమహిత తాడిగోళ్ల కదిరీపతినాయక లోకపాలకా. ౨౪

సీ. తనపేరురంబుఁ ద్రొక్కినవాఁడు సిగ్గుచే సరిగాక తలయెత్తవెఱవ లేదొ
తనతలఁ దన్ని నిల్చినవాఁడు సామ్యంబుఁ జెందలేక కృశత్వ మొందలేదొ
తన వాలుజడలనిండి నది దీటుకురాక బెట్టుగాఁ బెనుమొత్తవెట్టలేదొ
తనుమోది తిరుగఁజొచ్చినదితుల్యము గాక ఘనభయంబునఁ బూరిగఱవ లేదొ
తానుసరిచనఁదలఁచి నీధవళకీర్తి, కెనయఁగా లేక నగమయ్యె నీశుఁడతఁడు
వసుధ సర్వజ్ఞుఁడెట్లు సర్వజ్ఞమౌళి, కంజశరరూప కదురేంద్రకదురభూప.

క. ధర్మగుణకలితమార్గణు, లర్మిలి నీచర్య లెంచ నలరితివౌరా
ధర్మగుణకలితమార్గణ, నిర్మథితవిపక్ష కదురనృపవర్యా. ౨౬

సీ. కావ్యనైపుణిశబ్దగౌరవప్రాగల్భ్య మర్థావనాసక్తి యతిశయోక్తి
నాటకాలంకార నయమార్గసాంగత్య సాహిత్యసౌహిత్య సరసముద్ర
సకలప్రబంధవాసన సువాక్ప్రౌఢిమాన్వితచతుర్విధసత్కవిత్వధాటి
లక్ష్యలక్షణగుణశ్లాఘ్యతాపటిమంబు నైఘంటికపదానునయనిరూఢి

గనిననీకునసాధ్యం బెగణుతిసేయ, ధాత్రి శుకసప్తతియొనర్పఁ దాడిగోళ్ళ
ఘనకులకలాపకదురేంద్రకదురభూప, చెలఁగి వాక్ప్రౌఢిచేఁ గృతిసేయుమని.

వ. అని విద్వజ్జనంబు లానతిచ్చిన నేను నమందానందరసభరభరిత హృదయా
రవిందుండనై. ౭౮

క. కుంభిన్యాత్మభవాకుచ, కుంభపరీరంభణాత్తకుంకుమపంకో
జ్జృంభితసంకుమదాగురు, శుంభద్వక్షునకు భానుకులరత్నునకున్ ౭౯

క. బంధురదశకంధరగ, ర్వాంధనజిద్గంధవాహహితునకుఁ బటుద
ర్పాంధకహరబంధునకు, గబంధాసురనిబిడతిమిరభాస్వంతునకున్. ౮౦

క. చండద్యుతినిభమణిమయ, కుండలునకజాండభాండకోదండకళా
మండలమండితదనుజా, ఖండలఖండనసమర్థఘనకాండునకున్. ౮౧

క. భర్గేష్వాసనదళనా, నర్గళదృఢబాహువీర్యునకుఁ బూర్వవచో
మార్గచరిష్ణుమునీశ్వర, వర్గప్రణుతానివార్యవరచర్యునకున్. ౮౨

క. షడ్వదనజనకసుమనో, రాడ్వినుతచరిత్రునకును రాజద్గాత్ర
త్విడ్విజితాదిత్యునకు వి,రాడ్విగ్రహధామునకును రఘురామునకున్. ౮౩

# గ్రంథవిమర్శనము.

1. క్రీడాభిరామము.

కర్త:—వినుకొండ వల్లభామాత్యుఁడు (?)

ప్రకాశకులు:—గంటి సూర్యనారాయణశాస్త్రి అండుకో.

Post Box No. 110 మదరాసు.

వెల రు ౧౦—౦—౦

ఈగ్రంథము తొలుత నిరువదిసంవత్సరముల క్రిందట మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించినారు. అశ్లీలములని కవిగారు విడిచిపెట్టిన భాగములం జేర్చి వేటూరి ప్రభాకరశాస్త్రులుగారీప్రతిని సమకూర్చుటయేకాక దానికి విపులమైన పీఠికనుగూడఁ జేర్చినారు. ఈరెండుప్రతులకునుగూడ, తంజావూరు సర్ఫోజీమహారాజా సరస్వతీ భాండాగారమునందున్న వ్రాఁతప్రతియే మాతృక. మాతృకలోఁ గొన్ని గ్రంథపాతము లున్నవఁట. అవి ముద్రితప్రతులయందు నుగలవు.

ఈగ్రంథము వీధి యనురూపకము లక్షణమునకు సరిపోవుచున్నది. కార్యరంగము ప్రతాపరుద్రదేవునినాఁటి యేకశిలానగరము. గోవిందమంచనశర్మ యను బ్రాహ్మణుఁడును నతని చెలికాఁడగు టిట్టిభసెట్టియను వైశ్యుఁడు నుగలసి యోరుగంటి రాజవీధిలోఁ దము కగపడిన విషయముల నన్నింటిని వర్ణించుకొనుచు సంచరించినట్లున్నది. కోడికూఁత, కోడిపందెములు, మేషయుద్ధము, కల్నాటిపీరులు, సాములవాఁడు, మైలారభటులు మొదలగు విషయము లనేకము లిందు వర్ణింపఁబడినవి ప్రస్తావవశమున శ్రీకాకొళము తిరునాళ్ళుకూడ వర్ణింపఁబడినవి. వర్ణనములు హాస్యరసప్రధానములుగను హృద్యములుగ నున్నవి. ఆకాలమునాఁటి యాంధ్రదేశాచారవ్యవహారములనుగూర్చిన పెక్కువిషయము లీగ్రంథమునఁ దెలియుచున్నవి.

ఈగ్రంథము కర్ణాటాధీశ్వరుండగు హరిహరరాయల కోశాధ్యక్షుఁడైన తిప్పనమంత్రికుమారుఁడు వల్లభామాత్యునిచే రచియింపఁబడినట్లు గ్రంథావతారికయందున్నది. ప్రథమముద్రణపీఠికలో, "పైకారణములచే నిది శ్రీనాథరచిత (మే)మోయని సందేహించుచున్నాను." అని రామకృష్ణకవిగారు వ్రాసినారు. శ్రీనాథుఁడును వల్లభమంత్రియు నేకకాలమువారే. శైలినిబట్టి యీ

గ్రంథము శ్రీనాథకృతమనియే పండితలోకములోఁ బలువుర యభిప్రాయము. వ్యతిరేకాభిప్రాయము గలవారు లేకపోలేదు. ఆయభిప్రాయమును ఖండించుట కే ప్రభాకరశాస్త్రిలుగారి పీఠికలో నధికభాగము వినియోగపడినది. శాస్త్రిలవారి సిద్ధాంతము సరియైనదే యనియు శ్రీనాథుని వీధినాటకమని వాడుకగల గ్రంథ మిదియేకాని యీపేరఁ బ్రకటింపఁబడుచున్న చాటుపద్యమంజరి కాదనియు మాయభిమతము. రావిపాటి త్రిపురాంతకదేవ విరచితమగు ప్రేమాభిరామమను సంస్కృతనాటకము ననుసరించి యీ తెలుఁగునాటకము రచింపఁబడినట్లీ గ్రంథమందున్నది. సంస్కృతమాతృక దొరకినట్లు లేదు.

మూలగ్రంథమునందును టీకయందును అశ్లీలభావములుగల పద్యములుగలవు అశ్లీలపద్యములఁ బ్రకటింపనేకూడ దని కొందఱి యభిప్రాయము. అది మాయభిప్రాయము కాదు. అశ్లీలగ్రంథములవలనఁగూడఁ దెలిసికొనఁదగిన విషయము లనేకము లున్నవి. కావున నట్టిగ్రంథముల నాశనముచేయుట యుచితముకాదు. విద్యాగంధములేని సామాన్యజను లీనాటకమును జదివినచో వారికి విపరీతమనోవృత్తులు పుట్టవచ్చును, గావున, విద్యాధికులకుమాత్రమే గ్రంథము లభ్యమగునట్టి యుపాయము చేయుట యుచితము. ఈయుద్దేశముతోడనే పుస్తకమునకుఁ బదిరూపాయలు వెలపెట్టి పండితులకుమాత్రమే యమ్మవలయునని ప్రకాశకులు నియమము చేసికొన్నారు. పదిరూపాయలవెల యత్యధిక మని మాయభిప్రాయము. అంతసొమ్ముపెట్టి పుస్తకము కొనఁగల పండితులరుదు. పండితులకుమాత్రమే యమ్మవలయునను నియమమునుంచి వెల తగ్గించుట మంచి దని యెంచెదము.

"ఎల్ల నృపులుఁ గొలువ నెఱుఁగవే బాసాడి, దేశభాషలందుఁ దెలుఁగులెస్స"

అని యాముక్తమాల్యదయం దుండుటచేత నీరెండవగీత పాదములోని వాక్యమును గృష్ణరాయలే తొలుత రచించెనని యింతవఱకు లోకము గ్రహించుచున్నది. కాని కృష్ణరాయల కాలముకంటెఁ బూర్వముపుట్టిన యీక్రీడాభిరామములో—

"జననిసంస్కృతంబు సకలభాషలకును, దేశభాషలందుఁ దెలుఁగులెస్స."

ఇత్యాదిపద్యమం దీవాక్యము మిక్కిలి యుచితముగాఁ బ్రయోగింపఁబడినది. ఈగ్రంథమునుండియే రాయ లీవాక్యమును గ్రహించియుండునేమో యని యూహింపఁదగియున్నది. జ॥ రా॥

2. ఆంధ్ర మీమాంసాపరిభాష.

కర్త:—కూచిమంచి గోపాలకృష్ణమ్మగారు. ఎం. ఏ. ఎల్. టి.

ప్రకాశకుఁడు:—కూచిమంచి రామమూర్తిగారు. అమలాపురము, తూర్పుగోదావరి జిల్లా.

వెల రు ౧—౦—౦

ఇందలి విషయము "పూర్వమీమాంసాపరిభాష." వేదమునందు ముందు వెనుకలుగా నుండు నర్థములకుఁ బరస్పరవిరోధము లచ్చటచ్చట భాసిల్లుచుండుటం జేసి యీ వేదమునకు వాస్తవమగు నర్థ మేది యను నాకాంక్ష కలుగఁగా దీని నుపశమింపఁజేయుటకొఱకే మీమాంసాశాస్త్రము రచియింపఁబడినది." అని గ్రంథోపోద్ఘాతమునం దీ శాస్త్రమునకుఁ బ్రయోజనము చెప్పఁబడినది. ఈశాస్త్రమునకు ముఖ్యవిషయము వేదమే యైనను నిందలి కట్టుపాటులు న్యాయములు నవైదికశాస్త్ర సమన్వయమునకుఁగూడ నుపకరించును ప్రకృతమం దీశాస్త్రమునకు ద్రావిడదేశమునందుఁగల వ్యాప్తి యాంధ్రదేశమునందు లేదు. ఈశాస్త్రమునకు సంబంధించిన గ్రంథము లింతవఱకుఁ దెలుఁగులో బైలుదేఱి యుండలేదు. ఈనడుమ శ్రీపీఠికాపురాధీశ్వరుని యాజ్ఞానుసారముగ, కీర్తిశేషులయిన శ్రీ పురాణపండా మల్లయ్యశాస్త్రిలుగారు ఉత్తరమీమాంసాశాస్త్ర మగు బ్రహ్మసూత్ర శాంకరభాష్యమును దెలిఁగించినారు. ఇప్పుడు గోపాలకృష్ణమ్మగారు. పూర్వమీమాంసా శాస్త్రవిషయములను సంగ్రహముగాఁ దెలిఁగింపఁగోరి ముందుగా నీచిన్న గ్రంథమును బ్రకటించినారు. ఆంధ్రమీమాంసార్థసారము, ఆంధ్రమీమాంసాన్యాయదీపిక యను మఱిరెండుగ్రంథము లచ్చగుచున్నవఁట ఈమూఁడు గ్రంథములను జదివినవారికీశాస్త్రములోని ముఖ్యవిషయములు చక్కఁగాఁ దెలియును.

గోపాలకృష్ణమ్మగారి యాంధ్రవచన రచనాపద్ధతి చక్కగా నున్నది. భాష సలక్షణము. శైలిసులభము. శాస్త్రగ్రంథరచనకీశైలి యాదర్శముగాఁ గొనవచ్చునని మాయభిప్రాయము. విషయము క్లిష్టమైన దగుటచేతను గొన్నితావుల నర్థస్ఫూర్తి వెంటనేకాకపోవచ్చును. అది రచనాశైలిదోషముగాదు.

ఆంధ్రమునందు శాస్త్రప్రతిపాదకగ్రంథము లత్యల్పముగా నున్నవి. ఇట్టిగ్రంథములు పెక్కులు పుట్టినఁగాని యాంధ్రవాఙ్మయము సర్వాంగసుందరమనిపించుకొనఁజాలదు. గోపాలకృష్ణమ్మగారి గ్రంథములు పండితాదరణీయములై యాంధ్రసరస్వతికిఁ గంఠాభరణము లగుననుటకు సందేహము లేదు. జ॥ రా॥

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

## ద్వితీయభాగము.

### — చతుర్థాశ్వాసము —

క. శ్రీమద్భార్గవరామవి, రామశరస్తోమధామ రమ్యభుజబలో
ద్దామాభిరామ నుతసు,త్రామా సాకేతధామ దశరథరామా. ౧

వ. మహాత్మా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

— వసంతర్తువర్ణనము —

క. అంతట విమలక్ష్మీరత, సంతతసుమనఃకదంబసంజీవనతం
బొంతై సురభికి మిక్కిలి, వింతై *యేతెంచె సురభి విరహులు †బెగడన్.

గీ. ఉదయరాగచ్ఛదంబు మై నూనికొనఁగఁ, దలఁచి వనలక్ష్మి జీర్ణచ్ఛదంబు విడిచె
మాధవుని రాక కని వృక్షమండలంబు, దాల్పఁగను బట్టు జీర్ణచ్ఛదంబు ‡రాలె.

సీ. నిఖిలాగమాంతనిర్నిద్రశోభ నొసంగు నిరుపమమహిమచే ర్వెసఁగువాఁడు
శుకముఖద్విజరాజిచూపుల కింపైనఫలములు చేకూర్పఁ గలుగువాఁడు
బలుజడిచే నైనయలజడి సహియించు మౌనుల మధురోక్తి మనుచువాఁడు
తెలిపువ్వునీటిచే దేహయాత్ర ఘటించు మధుకరశ్రేణి మంచువాఁడు
సాధుసుమనోనిరంతరసౌఖ్యమైక, మూలకారణమైనట్టి మేలువాఁడు
మాధవుఁడు వచ్చె నవ్వేళ మధురలీల, వనరమాంగనయామోదమున మెలంగ

సీ. తనరు దక్షిణజగత్ప్రాణున కేవేళఁ జెడనిమాంద్యగుణంబు సేయుకతన
నతిరక్తపల్లవప్రతతి వర్ధిలఁజేయు నభ్యుదయంబుచే నడరుకతన
నఖిలనిస్సంగుల నాయాసపడఁజేయు నీలదేహుల కుక్తి నేర్పుకతన
సురుచిరాకృతి జాతిసుమనోవిలాసంబు కొదవకు నొడిగట్టుకొన్నకతన
నప్రసాదత కాటపట్టైనకతన, నధికసాంద్రరజోవ్యాప్తి నందుకతనఁ
గలుగునయశోవితానంబుకరణిఁ గనుచు, నళులు చరియించు నామని నాళిఁ గనుచు.

చ. అలరులచే జగద్విజయ మందె మరుం డన యుక్తి భూషకుం
గలుగును లక్ష్యమన్న నది గాదు జగజ్జయసాధనంబులై
మెలఁగెడు చాపబాణములు మేలుగ నిర్మితి చేసి మాధవుం
డల మరు నంగహీను విజయాన్వితుఁ జేయు ననంగ లక్ష్యమా. ౩

---

* యేతెంచు-మూ. †పొగడన్ మూ. ‡వోలె ర్వెసగువాఁడు-అనుటమంచిది.

మ. ధరఁ బాదంబులు నాటి ప్రాణ్పడుచు వంధ్యత్వంబు పోఁగోరి య
త్తరురాజు ల్పడు మాధవుం గొలువఁగాఁ దద్వంధ్యతోత్సాదన
స్ఫురణోద్యత్ప్రసవాభిరామఫలసంభూతు ల్ఘటింపించు త
త్త్ర(ర)దత్తారుణమంత్రితాక్షత లనం గానంగనయ్యె న్వనల్. ౮

క. ఫలగర్భిత గొను లతికా, కలకంఠలకుసుమగుచ్ఛఘనవక్షోజం
బుల మిగుల నొప్పె నైకొను, నలిశోభిశ్యామచూచుకాంచితరోచుల్. ౯

గీ. పంబురసమునసుమనశ్శదంబకంబు, కాలగతి(?)దుప్పవకాంతలఁజాలఁగూడెఁ
దత్సమాయాతమైనపాతకముకతన, విరిసెఁ గాఁబోలు నన నద్ది విరియుచుండెఁ.

చ. అరయఁగఁ బుష్పవత్యభిధ నంటి రజోవతు లన్న పేరిచేఁ
బరఁగులతాలతాంగులయభంగురసంగతిఁ బొంగి సమ్మద
స్ఫురితనినాదము ల్గొనుట చోద్యమె మత్తమధువ్రతాళికిం
గర మురవైన యవ్వృజినకాళిమ మేనున నంట నబ్రమే. ౧౧

క. గిఱికపడి కొనలు సాఁగక, యొఱలులతాంగనలఁ బెనిచి యొప్పఁగఁ బుష్పం
బఱఁ బువ్వుమొగ్గగుబ్బలు, వఱల ఫలం బెసంగఁజేసె వలపుబుతు వౌగిఁ.

క. మాధవవిభవముఁ దెల్పుచు, సాధుకవిప్రీతి యొసఁగు సర్వాగమముల్
మాధవవిభవముఁ దెల్పుచు, సాధుకవిప్రీతిదములు సర్వాగమముల్. ౧౩

క. మును వృద్ధికి ఘనులొసఁగిన, ఘనఋణ మొగిఁదీర్పఁ దరులుకప్రసుమపుటం
బునఁ బొదిగి ఋణముఁ దీర్చెను, గనదళిదంభంబుదాల్చుఘనదూతలకుఁ.

గీ. బంధురము లైనయలవనస్పతుల కెల్ల, సౌమనస్యంబు విఘటిల్ల భూమిజాత
భావమాకులపాటొదఁబరఁగు*మర్య, శంబునానటమధువ్రజంబుమిగిలె

చ. వరవనమాలికాకలితవాసన లూనుచు మాధవీమనో
హారరుచి కాస్పదం బగుచు నాత్తమహాగముఁడై ద్విజాతివి
స్ఫురణము మాన వర్తిలుచు భూరికవిప్రజమాననీయుఁడై
పరఁగెను మాధవుం డపుడు భవ్యఘనాకృతి మాధవాకృతిఁ. ౧౬

గీ. యోగుల భరించి యరిచక్రయుక్తి మించి, భోగిసంసేవితాకృతిస్ఫూర్తిగాంచి
మాధవుఁడు మాధవుండగుమదిఁ దలంప, నలయుపాంసులతాగుణం బరుదుగాని

సీ. పంజరగుహాలలోపల నున్నిఁ గైకొని శర్కర మెక్కెడుజంతువితతి
నతివృష్టి కోరిచి యశనంబు గానక గాసిల్లు ఘూనిసంఘాతములను
సరసులలో నుండి జలవాసవృత్తిచే వర్తిల్లు వరహంసవారములను
నలరునీ రక్కడనక్కడఁ ద్రావుచు వసియించు చేతనవ్రాతములను

*ధుర్యశంబనా-మూ.

సత్పరిగ్రహలాభంబు సంభవిల్ల, సుకృతరామోద మందెడు యోగితతుల
మన్నన యొనర్పఁ దా వచ్చి మాధవుండు, కామితార్థంబు లవ్వారిగాఁ గనిచ్చి.

గీ. దీర్ఘవిశ్రుతశబ్దవృత్తిప్రకాశ, మాశ్రితాంచితమాధుర్య మధిగతప్ర
సాదమై యొప్పె నప్పుడు వసంతఋతువు, మహితకావ్యప్రకాశకృత్స్మృతము వోలె.

క. పల్లవపేశలశయ్యా, వేల్లద్రీతులకుఁ దనిసి విమలధ్వనులం
బెల్లెనయుచుఁ బుంస్కోకిల, తల్లజులు వసంతవేళఁ దనరిరి మిగులన్. ౨౦

చ. తెలిపుపునీటివర్షము లుదీర్ణములై యొనరంగ నత్తఱిన్
మలయగఁ జొచ్చెఁ బుష్పడికుమారము లెల్లెడల న్నిరంతరా
కలనవహించి దట్టముగ కానఁగ నయ్యెను యోగదూరతం
గలఁగెడు దంపతిప్రతతి గాంచు మహాత్మపుటాక్షగాఢ్పలుల్. ౨౧

సీ. ఉవిదపుక్కిట సుర యుమిసిన నొక్కఁడు తరువు పాదాబ్జఘాతమున నొకటి
చెట్టు, వేఱొక్కటి తిట్టుచు జూసిన నామోదసంపద నంది వెలయ
ముద్దుల నగవుల మురిపెంపుఁ బాటలఁ గౌఁగిలింతలఁ బ్రేమఁ గనుఁగొనుటల
నడుగుట నూర్చుట హస్తసంస్పర్శలఁ గొన్నిమహీజముల్ చెన్నుగొనియె
నవనియందు నచేతనతానుభూతి, గనినన్ప్రౌకుల కామినీపుటితగౌర
వావమానంబు లొకటిగా నలరరసికు, లలరు టెంత యహో చింతయతివపొంత.

గీ. చెలువుమీఱిన యవ్వేళఁ జిత్రమొకట, నెమ్మి గైకొని మెలఁగెడు నెమ్మిరొదలు
నెపుడుఁ బాయని వైజాత్యమిరవుకొన్న, యట్టివయ్యును సాజాత్యమాశ్రయించె.

సీ. అరసానుభూతుల సరసానుభూతులై మెలఁగుచుండఁగఁ జేయు మేలుశక్తి
లేఁగొమ్మపొంకలు లేకయుండెడువానిఁ దద్వృత్తనందింపఁ దనరు నేర్పుఁ
బ్రసవవాసన లేక బడలుచుండెడువానిఁ బ్రసవాప్తినమరించు ప్రబలమహిమ
పల్లు లింపులు మీఱఁ బలుకనేరనివానిఁ బలుకదిద్దిన యట్టి పాటవంబుఁ
గలిగినవయోగిజనములఁ గడుముదమున, నెనయఁ జేయువసంతయోగీంద్రుఁ గన్న
యోగరహితజనంబులయుల్లములను, బెల్లువర్తిల్లకుండునె పల్లటములు.

క. సురభీరయమార్గచరా, స్థిరమాశన సమ్మదశ్రుతే ర్భవతి కుహూ
పరిహార్తా నేత్యేవం, పరవాక్యుల నవిరళముగఁ బలుకుం బికముల్.(?) ౨౪

ఉ. పంకజకోశపుష్పపుటభాసిమిళిందవిలాసవాసనై
యంకురసూచికావినిహతాహితమండలజీవితంబునై
శంకిలఁ జేయు నాభరతశాస్త్రము నామని దానిజూడఁగా
నంకురమూఁచు హ్లాదభర మన్యనిరీక్షణఁ గల్గ నేర్చునే. ౨౫

## —♦ గ్రీష్మఋతువర్ణనము ♦—

క. అంతట వేసవి దోఁచెను, రంతమహోష్మానుగతనిరంతరమిథ్యా
దంతాభ్యర్హితమతద్భ, ష్మాంతమరీచీనిమీలితాశాంతంబై. ౨౮

క. వరసుమనోజీవిత మగు, సురభిం బలుపంగ భువనశోషకతిగ్మా
కరదనుజుఁడు వడిగఁ దదా, కరవిపినంబులనుమిగులఁ గాఁక దహించెన్. ౨౯

క. ఆమెడ దక్షిణదిగ్భవ, వాయువదత్రయికి నెన్న వరుణాలయదిగ్వాయువు సపాదసప్తా, ధ్యాయి యనం దగు నటంచు నడరు న్నుడువుల్.

మ. ప్రతికూలుం డగుచంద్రుఁ గూడి విరహివ్రాతంబు నేఁచంగనో
యతిగాఢచ్ఛదశాఖలౌ వనుల ధ్వాంతారాతి డాపంగనో
యతికోపోగ్రత నవ్వసంతుపయిఁ దా నందెం జుమీ నాఁ బదా
హతి దూరోన్మత లోకశాంధవునియం దారూఢమై వర్తిలెన్. 3౦

మ. సతవాహంబులు మచ్చరం బొదవఁగా నప్తాశ్వము న్వేఁట న
ప్రతిమం బౌ రథమూన వంతిడఁగ నాభావంబుచే శీఘ్రపుం
గతి నయ్యాశ్వము గాంచలేమి జడిమం గాంచెం బ్రయాణంబు భా
పతికిన్ నా దివసంబు లాయతము లై పాటిల్లె నవ్వేసవిన్. 3౧

సీ. నాదగు దాహగుణంబు కారణగుణప్రాప్తంబుగా జగత్ప్రాణువాహ
సక్తిసంపత్తికి సంశయింపఁ బనేమి నీమఁ డొక్కఁడు గంధనిలయగోత్ర
మంది తద్ధర్మంబుఁ జెంది స్వధర్మంబు విడిచిన నేఁ బోవ విడుతు నెట్లు
జడత గైకొనుట నే జలముతో మైత్రికిఁ జొరఁజిచ్చు హరియింతుశరధిఁజొచ్చి
యనుచుఁబచ్చినుజలనిధియందు మెలఁగు, భీకరాటోపబడబాగ్ని వెడలె ననఁగ
నఖిలజనములు భీతి నిట్టట్టు గాఁగఁ, బట్టుచాలక వడమటి వెట్ట దోఁచె. 3౨

క. పుడమి విరియంగఁ గొలుకుల, తడి కొలఁకులతడులతోడఁ దరలఁగ జంతుల్
కడు బడలి నీళ్లగాళ్లం, బడి గొంతులుదడుప మ్రుం(?)పడమరసాగెన్. 33

సీ. బలిసెను బహుదూరపదవి ప్రపలతోడ భూరిసరిన్నద్యపులినవితతి
మొండసాగెను మార్గగేహితకూపంబు లమితపాంథాళికంఠములతోడ
దీర్ఘత గైకొనె దినములు మఱిమఱి యతిస్పృహజలరజ్జుతతులతోడ
మించెను మిత్రోపలాంచదగ్నిశిఖాళి చటులదవానలచ్ఛటలతోడ
సంతతాన్నప్రదాతకు సాధుకర్త, శీలునకు నీళ్లవలనలు సేయవలసె
నతులపశువృద్ధి గలిగినయట్టివాని, కైన నర్ధాంబు వబ్బుట యరిదియయ్యె.

గీ. కూటిపేదటికంబు గైకొనిరి మిగుల, నాతరము చేత బ్రతికెడునట్టివారు
ఖననమొనరించితనుయాత్ర గడుపువారు, కూలిగలుగుటనవ్వేళ గూటబడిరి

గీ. తల్లి *పదమునందు ధార్మికమనస్కుల, (సుకవి)కవితయందు సాబగుమిగులు
గుబ్బలాంధ్ర పీఠకుచమధ్యసీమల, నిలువ శైత్య మనుచు నిలువ బుద్ధి

క. కూటిరుచి పాన మొందెను, బాటిల్లెను నీళ్ళపుష్ప పవనంబునకున్
మేటిసురతములకూరిమి, గాటపుటుప హాసనముల గదలక నిలిచెన్. ౩౮

గీ. చూడక యుండ జూచికొన్నింటిపిడనాడి, యరసి యొకకొన్నిరూపంబులాగికొను
చు, బురుషులింతులు వేర్వేఱ బురదపేరు, కడవ వెలితిగ గైకొనికనుబడలిరి.

క. హారఘా రోద్ధతవహ్నియె, తిరుగం గ్రాగం గ దలంచి దీపించె నటం
చురవడి వెట్టకు వెఱచుచు, మరు మరుకుచశీకరన్ముమధ్యము జేరెన్.

క. బలుబీటలవెంబడి జనగల (జల)జంతువులు మొనటగల పదనుంబు
జెలువబలుగుబ్బ చలువల, నెలవుగ గైకొను మగండు నేర్పున బ్రతికెన్.

సీ. ఇరుడు దాక్షిణ్యంబు వెనసి ముక్తాలోకభాంధవుడనదగి యమూద్ధతకరత్వ
మమవుగ దమకు జీవనసిద్ధి గావింప దయగొనిజంతుసంతతులకోడ
ముదము గైకొనె నదీనదము లంతట గాలగతిచేత నత్యుగ్రకరత బూని
యతడు దాక్షిణ్యంబు గతముగా దినదినంబును నాత్మదత్తజీవనము నెల్ల
గాక గైకొన జంతుబాకటికి లేక, మలమలనుమాడఖిన్నతగలయుగ్రమ్ము
న దఱుల్లంఘనముసేయునమితవంక, భావమొదవంగనెంతయుబయటబడియె.

క. పట్టపగ లెవ్వఁడుభానుడు, బెట్టగు కాకల జగంబు బెదరింప హరం
డట్టియెడ గాన నెకక, న్దట్టపుజిగి మెఱపెననెనతల పురమించెన్. ౪౨

గీ. పనలధఃకృతరేభభావ ప్రచండ, ఘనవనుప్రవృత్తి దీక్షతాచటుల మగుచు
దివ్యతేజోగుణంబున దీప్తిగాంచి, సువిశ్రుతిరీతిగననయ్యె జూపరులకు.

క. పడమటిసెక నుడుకగబడు, పిడికిటివస్త్రంబు తెల్ల బెట్టాఱంగా
గుడికరమునందు నిలిపిరి, కడు బూతం బనుచు వాని గర్మారూఢుల్. ౪౪

గీ. చిత్రచిత్రరుచివ్యాప్తిజెంది యరస, భావవిత్యాస్పదంబపలుక దగుచు
భీకరనిదాఘసమయంబు పెంపుగొనియె, జరమకావ్యంబుగొన్న సౌష్ఠవముగాంచి

క. పంకరుహాజాండభాండము, పంకజహితతిగ్మకాంతి పటువహ్నిశిఖా
బొంకమఱ గ్రాగుచపటిని, రంకుశధూమంబనం బరాగము వొడమెన్. ౪౬

*పదమునందును. మూ.

గీ. భూరిరవిరోచిఁ గాలెడు పుడమి వెడఁద, పెనము పైఁబంచు వెన్నెల పేరి యట్టు
మంటమీఁటినయాఁకటమఱియు నటె యుఁబొట్టనింపించె రేతేరిపులుఁగుఁగుటుము

చ. ఖరకరరుక్ప్రతప్తదృఢకంజభవాండఘటాంతరంబునం
గరము మెలంగి క్రాఁగుచున కాంతవిభామృతముం జకోరముల్
పరఁగు(గుటా)గుటార్భటులఁ బానముచేసెను నోరుపొక్కఁగాఁ
బర మతురక్తిమై మిగులఁ బాటిలుదప్పికి వేఁడి వాఁడియే ౮౭

గీ. అతులమాధుర్యమకలంకమనుచు విబుధ, నమనయుం బెన్నజగతిఁబ్రశస్తిగాంచు
నక్కళాభృత్సుధం జన్నవామృతంబు, గ్రోలి సుఖియించెఁ జాలఁ జకోరసు*కవి ౮౮

క. చిమ్మనరి పగటి కాఁకల, విచ్చిన జక్కవలు సుఖితవిలిచెను గాఁకల్
హెచ్చెను వెన్నెలవానికి, మచ్చికజవరాంత్ర రేలు†యుఱుకునఁ బకటన్

చ. తొలుత హిమాంశుమంజురుచితోయరుహోత్థకరప్రతప్తతన్
మెలఁగెడు చంద్రకాంతముల మీఁదటఁ బర్వ ఛటచ్ఛటార్భటీ
మిళితపుటాంబురుల్ దిశల మించెను బిమ్మట రాలు మెత్తనై
నిలిచె ద్రవంబుజాలు బలునిర్ఝరముల్ గలిగెం గ్రమంబునన్. ౯౧

గీ. చంద్రుఁడమ్మెయినుదయనుండు చక్రవాక, దంపతులకెల్లనవ్వేళఁ దపనుఁడయ్యెఁ
జందమామయుఁదలఁపనిచందమునదె, యోగతదభావహేతువులూర్జితముగ.

క. భోగులకు రాత్రివేళల, బాగుగ రుచియించె మధురపానకరసముల్
బాగై రుచించె నంతకు, బాగా నిజసతులమోవిపానకరసముల్. ౯౩

ఉ. వేసవిరాత్రులందు నరవిందరిపూపలవారి నిర్ఝరో
ల్లాసముఁ జేసెఁ బ్రోషితవిలాసివధూ‡రుదితోత్థబాష్పముల్
గాసిగ వీచునట్టి బలుకాఁకల వారుణదేశవాయువుల్
భాసిలఁ జేయఁజాలెఁ దదపారముఖోదితతిగ్మవాతముల్. ౯౪

క. వ్యాకోచపుల్లికాకుసు, మాకృతులవ్వేళఁ గాననయ్యెనుఁ జంద్రా
లోకపరిలీనమగుచున్, వ్యాకీర్ణోదీర్ణపరిమళాంచితమహిమన్. ౯౫

## ♦ వర్షఋతువర్ణనము ♦

గీ. అమితభూతాపవినివారణాశ్రయంబు, భువనసస్యౌఘసంతతస్ఫూర్తిబీజ
మార్తచాతకసంజీవనౌషధంబు, నంతఁగృష్ణాభ్రము ప్రకాశ మధిగమించె.

క. తనబలుజీవనధనములు, గొని జగములనేఁచు గ్రీష్మఘోరాసురునిం
దునుమాడ నెత్తె వరుణుఁడు, ధను వన నపరాశ నింద్రధను వుదయించెన్.

---

*కవిశబ్దము పక్షిపర్యాయముగా వాడుచున్నాఁడు †మరదలిపనుచున్ మూ. ‡గదపావబాష్ప. మూ.

సీ. చంచలారోపవైశ్వానరశిఖ లొప్పఁ జిత్రధనుర్లతాస్ఫీతు లెనయ
మేదురగర్జానినాదంబు లెసఁగంగఁ గరకామహాశిలగతులు మిగుల
నాశుగోద్ధతవృష్టు లవిరళంబులుగాఁగ హరిగోపకు(క్ర)ప్తతాపార్చ్చ లడర
వాహినులెంతేని వడి మించి నిగుడంగ నశేషఘోరాస్త్రవిహార మెనయ
నలమయూరాదికవివరు లతిముదమున, ఘనతరస్తుతులొనరింపఁగా ఘనుండు
అఖిలసంతాపకారి గ్రీష్మాపకారి, కడకమాయించె సర్వోపకారియగుచు.

క. *వార్షికమహాభ్రపటలా, కర్షణపటుమంత్రవిద్య ఖరఖరఖరతా
ధర్షణకారణ మగులే, ఖర్షభదిగ్వాయు వపుకు కడు దీపించెన్. ౫౯

చ. పడమటిగాలి దా జగముప్రాణము నుగ్రకరుండు గాంచునే
వెడఁ గగులోకబాంధవత వేదనసేయు నటంచు రోయుచుం
గడు నల(ర)న్ బలారిదెసగాడ్పు వదాన్యఘనుండు దోఁపుతన్
నడువ జగంబుప్రాణ మనునామము లోకములో విరాజిలెన్. ౬౦

క. జలధిం జుళుకంబునఁ గొను, బలునేర్పరి కుంభయోనిఁ బ్రార్థింపుచుఁ ద
జ్జలముగొను †నేర్పు గన నన, జలదంబులుజనుసతోడఁ జాయకునడచెన్

గీ. పగలు రేయి దివాకరుఁ బద్ధవైరిఁ, బొదివి వీక్షింపఁ గను విరహిదళనంబ
నేమమునఁ జేయఁ బూనుచు నెగడెమింట, విపులతరమైన(యాకృష్ణ)విషధరంబు

క. ధారాధరగళదురురస, ధారానిర్ఝరమునందుఁ దత్త్వజ్ఞులకున్
దూరించెను సమవిషమా, కారజ్ఞానములు రూపకం బొక్కటిగాన్. ౬౩

క. స్థలజలభేదము మానఁగ, జలదము వర్షం బహర్నిశంబు ఘటించెన్
విలసల్లక్షణవృత్తికి, బలుశాబ్దికు లాత్మవృత్తి ప్రతిసేయంగన్. ౬౪

ఉ. అందముగాంచు నెట్టిజవరాండ్రను బెండిలియాడుచో మదిం
జెందు కలంకతో వడిగఁ జేరు స్రవంతివధూటుల న్నిజా
మందతరంగహస్తముల మంచి నెదుర్కొని కౌఁగిలింపుచున్
జెందములోని యక్కలఁక దీర్చును దక్షిణవార్ధి నిత్యమున్. ౬౫

సీ. ఆహితాగ్నుల కెల్ల నాత్మవైశ్వానరరక్షయే కార్యసర్వస్వ మయ్యె
భోగికైనను రాత్రి భోజనం బెచ్చట సన్నమాత్రముకాని యబ్బదయ్యె
సారమంత్రోపాస్తిచతురుల కశనంబు వార్తగల్గుట గానివారియయ్యెఁ
బ్రతిగృహంబున కేగి ప్రార్థింప(బ్రార్థింప)శిఖి యొకింతొసఁగిసఁ జిత్రమయ్యె

* వర్షుక—మూ. †నొప్పుగనళన—మూ.

జంబుగూడలకలుములు డంబు మిగిలెఁ, గతకసంపాదనంబులు ఘనతగాంచె
నన్నదాతకు నేనియు నతిథికొకఁ, డైన నన్నంబు గలదను టరిది యయ్యె.

మ. చటులోద్యద్ఘనగర్జితధ్వనులు చంచచ్చంచలారోచు లు
ద్భటవృత్తిన్ ఘటియిల్ల భీతి మదిఁ దోఁకన్ భీరురంభోరువుల్
పటుమానంబులు మాని తమ్ము బిగుగుబ్బల్ గాఢసంఘర్షఁ జ
ప్పటలోనట్లుగఁ గౌఁగిలింప రమణుల్ ప్రాపింతు రానందమున్. ౬౯

సీ. భూప్రజాసంతాపభూరివైశ్వానరజ్వాలతోఁ దావాగ్నికీల యడఁగ
నూర్జితమేదురగర్జితార్భటులతోఁ గండళీసంపదల్ గ్రమ్ముకొనియె
నవిరళఘనాసారధారాధరములతో గోష్ఠీరగుచులు పొంగులువహించెఁ
గర్షకపాదజాఖండమోదంబుతోఁ గాసరామోదంబు వాసిగాంచె
జాతికుసుమ(జ)పరిమళభాతి కేకి, జాతికేకారవంబుతోఁ జాలనెగడెఁ
జాతకవ్రాతమదతమస్రములతోడఁ, గలయ దిక్కులఁ గటకిచీఁకటులు బలిసె.

గీ. దినదినంబును శుచికాత్మతేజ మిచ్చి, యుగుడఁగైకొన రోఁతనిమానమేమొ
తరణికిరణంబులన్నియుఁ బరఁగెనేమొ, ఘనములగుచును గాకున్న నినునిగనరె

చ. జలధిమథింపఁగాఁ బొడమెఁ జంద్రమయం బగు సుర్వముద్ద దా
బలుఘనమండలంబు వడిఁబట్టఁగఁ జేయు మహాంబుధారలోఁ
గలియుచు నీరమయ్యె నని గట్టిగఁ దోఁచెను బుద్ధి కానిచో
జలరుహవైరి నత్తఱిఁ బ్రజల్ గనరేల యొకప్పు డేనియున్. ౭౦

క. నిర్జరులలోన నాదిమ, నిర్జరుఁ డగునీటిచూలి నిరతస్ఫురితా
త్యూర్జితవృష్టి న(ని)ర్జర, తార్జితదుష్టి రియయ్యె నని ప్రజ నుడువున్. ౭౧

గీ. ఆటవెలఁది యనఁగ నమరెను దద్వృష్టి, యురుపయోధరత్వమిరవుకొనుచు
శ్యామభావ మొదవ సంతతమన్మథ, వికృతిమహిమ కెల్ల విత్తనంగ. ౭౨

గీ. ఉరుతరంబగువృష్టిసూర్యోదయాస్త
మయము లెంతేనిసందిగ్ధములయిన యాపుడు
సోమపుం గన్నిఁ బ్రణయించుచోట నొదవు
ననుమయూయత్తనిష్కృతియాహరహంబు. ౭౩

గీ. అఖిల మష్టాయ మగునట్టు లాచరించి, ముద్వేలుంగు విలాసంబు ముంచి తాన
యద్వితీయతఁ గైకొని యభ్రపటలి, మాదిమబ్రహ్మ మన విస్మయంబొసంగె.

ఆవాసః కిలికిఞ్చితస్య—

నెల గాయఁజెంత సఖి వ, ర్తిలఁ బికములు మ్రోయఁ గవి నుతింప సిగందం
డలుచుట్టి చైత్రమున జనుఁ, డలరు న్వెల్లూరి వేంకటాచల రమణా. ౧౪

పాన్థస్త్రీవిరహానలాహుతికళా—

విరహానలాహుతికళా, స్ఫురనురుమంజరులు పికవ*ధూహితములు నై
మరుదంకురములు మధువ్రన, నరుదగు వెల్లూరి వేంకటాచలరమణా. ౧౫

ప్రథితః ప్రణయవతీనాం—

మలయపవనములు చల్లఁగ, వెలయుచుఁ జైత్రమున పీవ విరిఁబోఁడులకుం
బొలయలుక లుండ నేర్చునె, యలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౬

సహకారకుసుమకేసరనికరభరా—

ధరఁజాతకుసుమపరిమళ,భరితము లగువనములందు భ్రమరమ్ములు ఝాం
కరణ మొనరించు మధువ్రన,నరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౭

అచ్ఛాచ్ఛచన్దనరసార్ద్రితరామ్యగాత్ర్యః—

సురభిని దెలిమేడలు గం,ధరసార్ద్రార్ద్రకుచలైన తరుణులుఁ బువ్వుల్
మరునిమది వృద్ధిసేయును,హరసఖ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౮

స్రజోహృద్యామోదాః—

తెలిమేడ వెన్నెలను జెలు,వలు సిగవిరులేయ వలిపవల్వలుఁ బూదం
డలుఁ దాల్చి సురభి ధన్యుం, డలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౧౯

సుధాశుభ్రంధామ—

తెలిమేడలు నెల చెలిమో, మలరులు చందనముఁ గలఁచు ననురక్తుని ని
శ్చలు గ్రీష్మమున భ్రమింపవు, నలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా.

తరుణీవేషోద్దీపితకామా—

ధర నుద్దీపితకామయు, నురుజాతిసుగంధి ధృతపయోధర యై సుం
దరివలె వర్షర్తు మనో,హరమగు వెల్లూరి వేంకటాచలరమణా. ౨౧

వియదుపచితమేఘం—

విను సఘనము కందళభూ,వనికుటజకదంబవాసి పవనమ్ము శిఖి
ధ్వనివని సర్వజనోత్క్రం,తనలరు వెల్లూరి వేంకటాచలరమణా. ౨౨

* యతిషమాదము- వధూహిత మన వచ్చును.

ప్రకారాంతరము—

జలదకలితగగనము కందళవిలసితభూమి కుటజతరుపవనములుం
గలుగుచు సుఖ నసుఖ నెల్లర, నలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౯౩

ఉపరిఘనం ఘనపటలం —

ఇల కందళసితరుచి నగములు నర్తితకేకు లభ్రమును ఘనయుతమౌ
నలపాంథుఁడెచటఁ జూచునో, యలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా ౯౪

ఇతోవిద్యుద్వల్లీవిలసిత మితః—

ఉరుములు మెఱపులుఁ గేతకి, పరిమళములుఁ గేకిరవము భాసిల్లంగాఁ
విరహిణు లేగతిఁ దాళుదు, రరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౯౫

అసూచీసఞ్చారే—

ఇల సూది మోపునంతెడ, గలుగని చీఁకటి మెఱపులు గర్జనలును జి
న్కులుఁ బడఁ గులట చరించును, నలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా.

ఆసారేణ నహర్మ్యతః—

చలిగాలికి జడికెటు సన్, కిల సీతున కలికి చెలువ లెదఁ జేర్పఁగ భో
గులకు సుదినమె దుర్దిన, మలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౯౭

అర్ధం సుప్త్వా నిశాయాః—

శరదర్ధరాత్రి మేడల, సురగొని పవళించి లేచి సురతశ్రమ పో
గరితలు దే నుదకము గ్రోలరుదుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౯౮

హేమన్తే దధిదుగ్ధసర్పిరశనా—

పెరుఁగు నెయిద్రావి లోమంచిరమునఁ జలి విడెము నలిపి ధృతవరలేపాం
బరులై స్త్రీరతి నుందురు, దరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. *

చుమ్బన్తో గణ్డభిత్తీ—

వలిగాలి సీత్కృతులుపుల, కలు గలుగఁగఁ జేయు నంశుకములు దిగుచుఁ జె
క్కులు నొక్కు విటులవలెఁ దో, య్యలియును వెల్లూరి వేంకటాచలరమణా.

కేశానాకులయన్—

వలిగాలి మగనివలెఁ గుం, తలచలనము వణఁకు సీత్కృతము రోమాంచం
బులు చేలాకర్షణ మ్మల్పలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౦౧

ధన్యానాం నవపూగపూరిత—

చలి విడెము లోనఁగఁ గ్రీడలు, నలుపుజనుల కరుగు వేగఁ జలిరాతిరి షో
దలకు నిసిఁ జింతఁ దపవగు, నలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౦౨

* ప్రోద్యత్ప్రౌఢప్రియంగు-అను శ్లోకమునకుఁ బద్యములేదు.

# 3. వైరాగ్యశతకము.

చూడోత్తంసితచన్ద్రచారుకలికా—

శశిరుచిశిఖమున శ్రీయో, దశధామము కామశలభదగ్ధము మోహాం

ధతమము నగుశివదీప, మ్మశరణ వెల్లూరి వేంకటాచలరమణా. ౧

భ్రాన్తం దేశ మనేకదుర్గవిషమం—

పలుబూములు దిరుగఁ గాకము, వలె దుష్టాన్నము భుజించు ఫలమందక హీ

నులఁగొల్వఁ దృష్ణ చేసెరుఁ, దలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౨

ఉత్ఖాతం నిధిశఙ్కయా క్షితితలం—

ఇలఁద్రవ్వ నోడబేరము, సలుపఁగ హేమింప రాజసత్కృతి మంత్ర

మ్ములు గలుగ గవ్వదొరకునె, తలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. 3

ఖలాలాపాస్సోఢాః—

కనుల నీరుంచు నగుఁ బెట్టిన నూరకయుండు బడిబడిఁ ధనికున కం

జలిచేయుఁ దృష్ణ చేసెరుఁ, దలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౪

అమీషాం ప్రాణానాం—

నలజలతుల్యప్రాణ, మ్ములకై యిట్టి ధనాంధులకడ మూఢులు పాప

మ్ములనక తముఁ దామెన్నరు, దలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౫

క్షాంతం న క్షమయా—

క్షమలేక శాంతి సంతోషము లేక విరక్తి యోగచరితము లేకన్

హిమసూర్యాతపసహనం, బనరదు వెల్లూరి వేంకటాచలరమణా. ౬

భోగా న భుక్తా వయమేవ—

ఇలభోగకాలతృట్టప, ములు భుక్తమె శిథిలజీర్ణములె తప్తములే

ఫలభోక్తలు మనుజులె కా, కలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౭

వలిభిర్ముఖమాక్రాన్తం—

తల నరసిన మోమున వళు, లలరినఁ గాయంబు శిథిలమైనప్పుడు మ

ర్త్యులతృష్ణ వాయ దేమన, నలవడు వెల్లూరి వేంకటాచలరమణా. ౮

నివృత్తా భోగేచ్ఛా—

కనులఁ బొర గప్ప బహుమతి, చనఁ జేతికిఁ గోలరాఁగ సఖులరుగ సుఖం

బణఁగ మెయితృష్ణ చనదే, మనవలె వెల్లూరి వేంకటాచలరమణా. ౯

ఆశానామనదీ —

ధృతికుజహారము మనోరథ, తతికము తృష్ణోర్మికము వితర్కఖగము రా
గతిమగు నాశానది * దాఁటఁదరమె వెల్లూరి వేంకటాచలరమణా. † ౧౦

అవశ్యం యాతారః —

నిలువవు విషయసుఖంబు లవె, తొలఁగిన దుఃఖంబు తానె తొలఁగించిన ని
శ్చలసుఖ మపరిమితం బై, యలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౧౧

బ్రహ్మజ్ఞానవివేకనిర్మలధియః —

అనఘుఁడు లభించుభోగము, లను రోసి త్యజించుఁ బరుఁడు లభియింపని వె
నను గోర్కులు మఁగఁజాలం, డచ్చుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౨

ధన్యానాంగిరికన్దరేషు —

పులుఁగులు తోడ నాడశ్రువు, లొలుకఁగ ధ్యానించు గుహల యోగివరుఁడు మే
డల వనిక్రీడల నెప్పటి, కలరుఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౩

భిక్షాశనం తదపి నీర —

ఇల సజ్జగ నుండియుఁ జిం, పులబొంతయుఁ గప్పి బికిరపుంగూడుదిన
య్యలు నై తము మోహముడుగ, రలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౪

స్తనౌమాంసగ్రన్థీ —

ఇలఁ జీమిడిబుడ్డలు మో, ములు రోఁతలు కటుఁ బొలసుముద్దలు కుచముల్
నెలకరిఘటములు వసుకుం, డలగునె వెల్లూరి వేంకటాచలరమణా. ౧౫

ఏకోరాగిషు రాజతే —

గిరిజ మెయిఁ గలుగు హరుఁడో, క్కరుఁడే రాగియు విరాగి గతకాముఁడుఁ డే
వరు లుభయభ్రష్టులు గద, యరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా ౧౬

అజానన్దాహాత్మ్యం —

శలభము లగ్ని దుముకుఁ జేఁ, పలు గాలముఁ బ్రింగుఁ దెలివివాసి మనుష్యుల్
తెలిసియు మోహముడుగ లే, రలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౭

తృషా శుష్యత్యాస్యే —

మనసిచ్చయించ వనితల, నెనయుం దప్పైనఁ ద్రావు నీరాఁకలికిం
దిను భక్ష్యాన్న మిదిసుమా, యను శ్రీవెల్లూరి వేంకటాచలరమణా. ౧౮

---

* దాఁటఁదరమె – యనినఁ బ్రాసభంగము – ఇట్టివిందుఁ బెక్కు గలవు.

† దీనికి బిమ్మట – "నసంసారోత్పన్నం" అను దానికిఁ బద్యము లేదు.

తుఙ్గం వేశ్మసుతాస్సుతాం—

ఇలు దార యౌవనము తన, యులుఁ దిర మని మోహాకార నుండజ్ఞుఁడు జ్ఞా
నులు నిత్యము గాదనియెద, రలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౯

దీనాదీనముఖైః—

తనయులు క్షుధ నవ్వాబు, వ్వని జీర్ణపటంబు దిగువ నడిగని దేహీ
యనుఁగాని ఘనుఁడుతనకొలఁ, కనునా వెల్లూరి వేంకటాచలరమణా ౨౦

అభిమతమహామానగ్రన్థి—

ఘనగుణనవలచంద్రిక శ్రీ, వనిపరశువు మానహరణపటువు కడుపు నిం
డనిబాన యెవరి నెటుసే, యనిదవు వెల్లూరి వేంకటాచలరమణా. ౨౧

పుణ్యేగ్రామే వనేవా—

సరివారి నడుగుకంటెను, వరపుణ్యస్థలముచేరి పాటులయిండ్లం
దిరిప మడిగి కుడుచుట మే, లరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౨

గఙ్గాతరఙ్గకణశీకరశీతలాని—

చలిమలనెలవులు గంగా, జలశీతల మునివనములు చనెనె బుధులు దు
ష్టులఁజేరి కూటికడిగెద, రలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨3

కిం కన్దాః కన్దరేభ్యః—

ఫలకందమూల జలవ, ల్కలములు లేవె ధనగర్వకచలదుర్బాచా
పులనృపులఁగొల్వఁగా మద, మలరునె వెల్లూరి వేంకటాచలరమణా* ౨౪

ఫలం స్వేచ్ఛాలభ్యం—

కొలఁకులఁ జల్లనిజలములు, ఫలములు వృక్షములు పల్లవక్షితిశయ్యల్
గలుగ ధనికు కొలువేమిటి, కలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౫

ఏవర్తన్తే ధనపతిపురః—

మనుజేంద్రాశ్రయముఃఖం, బున భోగసుఖముల దినము వో యెనని నగుఁ
వని ధ్యానాంతంబున బుధుఁడనయము వెల్లూరి వేంకటాచలరమణా. ౨౬

యేసన్తోషనిరన్తరప్రముదితాః—

పరితుష్టులేమిగోరరు, ధర లుబ్ధులు మేరుభూమిధర మగపడినం
బరితోషముఁజెందరు పుర, హరసఖ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౭

భిక్షాహారమదైన్య మప్రతిమ ఖం—

దురితహార మభయ మక్షయ, కరమప్రతిహతము యోగికామితముచు శం
కరసత్రముభిక్షాశన, మరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౮

* స్థైర్యాన్మూలఫలైః-అను దానికిఁ బద్యము లేదు.

భోగేరోగభయం—

బలభోగవిత్తవిద్యా, కులములకుభయ మరిరోగకుపవాదిహతం
బులు నభయము వైరాగ్యం, బలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౯

ఆక్రాన్తం మరణేన—

జర వయసుకు నస్థైర్యము, సిరి నాశముఁ దోషణంబు చిలువ వనము సుం
దరిశమము సాంపరంజే, యరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా* 30

భోగాస్తుఙ్గతరఙ్గభఙ్గతరళాః—

తరుణత్వ మస్థిరము గాఁ, పురములు తుచ్ఛములు విభవములు పీచులు వా
నర మన్పమని బుధుఁడు సుఖ,మరయును వెల్లూరి వేంకటాచలరమణా. 3౧

భోగా మేఘవితాన—

పవనచలితాభ్రకము నా, యువు తుచ్ఛలు స్త్రీలు మెఱపులు సుభోగములం
చవని బుధుఁడు చిత్సాధకుఁడవు శ్రీవెల్లూరి వేంకటాచలరమణా. 3౨

ఆయుః కల్లోలలోలం—

మెఱపులు భోగము లర్థము చిర మాయువు పీచి చెలఁలచెలి మధ్రువమా
నరులకని యోగితత్త్వం, బరయును వెల్లూరి వేంకటాచలరమణా. 33

కృచ్ఛ్రేణా మేధ్యమధ్యే—

జననికుక్షిస్థనిర్భా, ధన మబలాసంగచింతనము వార్ధక్యం
బును నీ దీనసుఖము లే, దనువుగ వెల్లూరి వేంకటాచలరమణా. 3౪

వ్యాఘ్రీవతిష్ఠతిజరా—

పులివలె జర తెవు లరిగతిఁ, గలఁప జనులబ్రతుకు భిన్నఘటజలమువలెం
దొలఁగ నహితముడుగని దను,దలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. †

బ్రహ్మేన్ద్రాది మరుద్గణాః—

కమలజుపదవి తృణప్రా, యము త్రిభువనరాజ్యలక్ష్ము లతితుచ్ఛము లం
చు ముని విభవములఁ గోరం, డమరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. 3౬

సా రమ్యానగరీ మహాన్—

పురములు రాజులు తరుణులు, పరివారము భోగ మెవరివశమునునుండుఁ
ధరనాకాలమె దైవం, బరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. 3౭

ఆధివ్యాధిశతైః- †భోగాభఙ్గురవృత్తయ. అనువానికిఁ బద్యముఁలేదు.

యత్రా నేకః క్వచిదపిగృహే.

ఒకటి పది పదొకటిగఁ గా,లకితవుఁ డిలఁ బలకఁ బ్రాణులనాస్రెలపా
సికలు కేఁబగలుగా నా,టకలరు వెల్లూరి వేంకటాచలరమణా. ౩౮

ఆదిత్యస్య గతాగతైః—

అనుదిన మినుని గతాగత, మున నాయువు నిత్యకృత్యములఁ గాలము వో
మనుజుఁడు మోహాసుర భ్రమిం, చనయము వెల్లూరి వేంకటాచలరమణా.

రాత్రిః సైవపునస్సఏవ—

ఇనుఁడుదయించెనుగ్రుంకెను, దినమురజనియనుచుఁ బనులఁదివురుచుర యో్యా
జనులిందేమిఫలములే, దనువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౪౦

నధ్యాతం పద మీశ్వరస్య—

మనసిజవైరిధ్యానము, ఘనధర్మము స్త్రీసుఖంబు గనలేనిజనుల్
జననీయౌవనఘాతుకు, లనవలె వెల్లూరి వేంకటాచలరమణా. ౪౧

నాభ్యస్తా ప్రతివాదిబృన్దదమనీ—

చెలి నెనయక నరుఁడసి వి,ద్యలఁ బరుల జయింపక నె వృథాప్రాయమువో
నల పాడిలు దీపము వలె, నలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౪౨

పక్షద్వయనిరూపణము—

వనితాసుఖమందరు వి,ద్యను గత్తినిఁ బరుల గెల్చి యశమందనియా
జనులు పాడింటి దీపము, లనువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౪౩

విద్యానాధిగతా కళఙ్కరహితా—

తలిదండ్రుల మనుపక వి,ద్యల దొరచే ధనముగొనక యతివ నెనయకం
బలుకూళ్లకాకివలె నరుఁ, డలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౪౪

వయం యేభ్యో జాతాః—

తనపెద్దలు సములు హితులు, జనఁ గర్మము వెంటనంట సైకతవనిరీ
తిని నుండఁ బ్రమద మెట్లగు, ననువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౪౫

ఆయుర్వర్షశతం—

సమశత మాయువు సిద్రస, గము గొద వది బాల్యవార్ధకములభయదరో
గములఁ జను జనులకునుసుఖ, మమరునె వెల్లూరి వేంకటాచలరమణా.

క్షణం బాలో భూత్వా—

బాలుఁడగు దరుణుఁడగు నర, పాలుఁడగు దరిద్రుఁడగు నరటుఁడగువటుఁడౌ
లీల నరుఁడు నటునతి శర, దాలక వెల్లూరి వేంకటాచలరమణా. ౪౭

త్వం రాజా వయమ ప్యుపాసితగురుః—

కలదు సిరి దొరకు నే విద్యలు గలగురుభటుఁడ నతఁ డనాదృతి సేయ
న్నిలనే మగుదను నిస్పృహుఁ, డలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా*

ఫలమల మశనాయ స్వాదుపానాయ తోయం—

ఫలములు దినఁ ద్రావఁగ జలములు వలువలు గట్టఁ దల్పముగ నిలయుండం
గలుద్రావుధనికులకు బుధుఁ, డళుకునె వెల్లూరి వేంకటాచలరమణా. ౯

అశీమహే వయం భిక్షాం—

ధరఁ బర్వళించి హరి దంబరులై భిక్షాన్నమెత్తి భక్షించెదు భూ
సురులు ఖలనృపుల మెత్తురె, హరనుత వెల్లూరి వేంకటాచలరమణా. ౧౦

ననటా న విటా న గాయకాః—

కులుకుఁగుచంబులు గలచెల్వల నట విట గాయకులను ఒలుఁజ్జలము
ర్యులఁగాక కనఁడు బుధముం, డలి దొర వెల్లూరి వేంకటాచలరమణా.

విపులహృదయై రీశైః—

తగఁ గొన్ని పల్లెలకు దొరలగు నల్పులకేల గర్వ మధిపు లనేకుల్
జగ మేలి గెలిచి విడువరె, యగధర వెల్లూరి వేంకటాచలరమణా. ౧౨

అభుక్తాయాం యస్యాం—

ధర నెంతయు నేలిన భూవరతతి కేలాభ మబ్బె నాఁకతాంశ
స్థిర నలి గర్వపడియెద, రరసులు వెల్లూరి వేంకటాచలరమణా. † ౧౩

సజాతీః కో ప్యాసీత్—

నారుఁ డాత్మకపాలము తల, ధరియింప మను నంబవ దొర తన ప్రోవను న
ల్గురు మ్రొక్క మదింప నితరుఁ, డరుసా వెల్లూరి వేంకటాచలరమణా. ౧౪

పరేషాం చేతాంసి ప్రతిదివసం—

పరహిత మొనర్చి నరుమది, స్థిరమై యుండ దది గలుగఁ జింతామణిచే
కులుగతి నిష్టము లీయదె, యరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౫

పరిభ్రమసి కిం ముధా—

మనసు వెతఁ జెంద నేలయు, యిన దౌఁ గాని దిల గాదు ధృతిపి బుధుఁడువ
చ్చినఁ గొను లేకూరకెయుం, డనువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౬

* అర్థానామీశిషే త్వం– వయమిహ పరితుష్టావల్కలైః–అను శ్లోకములకుఁ బద్యములు లేవు.

† వృత్తిం డో జలశేఖరా కలయితం – అను శ్లోకమునకుఁ బద్యము లేదు.

# కాకినాడ-పరిషత్కార్యాలయమున వెలకు దొరకు గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయకవి | రు 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... ... | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి ... | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్లపాక పెదతిరుమలార్యుఁడు ... | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు బి. ఏ., యల్. టి. ... ... | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి ... | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు ... | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ. రామయ్య పంతులు గారు, బి. ఏ., బి. ఎల్. ... ... | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి ... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రితగ్రంథసూచిక ... ... | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... ... | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు ... | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్య పంతులుగారు బి ఏ., బి. ఎల్. ... ... | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... ... | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | 0 | 8 | 0 |
| 17 | Dravidian Lexicography ... ... | 0 | 4 | 0 |
| 18 | ప్రహస్వరంగములు-క్రొత్తపల్లి సూర్యరావు ... ... | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము ఉత్తరభాగము-హరిభట్టు ... | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ. ... | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయఁకుఁడు ... | 0 | 12 | 0 |
| 2 | కాళిందీకన్యాపరిణయము. (మొదటిభాగము) అహోబలపతి | 1 | 0 | 0 |

Printed by M. Rangiah at the Cocanada Printing Works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**

సంపుటము ౧౭. { శుక్ల నామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. } సంచిక ౨



కాకినాడ:

కొత్తపల్లి సూర్యరావుచేఁ బరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా { పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. 3. } { విడిసంచిక రు ౦-౮-౦

1929

## ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు, పరిషద్వ్యవస్థాపకాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

శ్రీరాణి చెల్లపాయ వేంకట సుభద్రయ్యమ్మజగపతిబహద్దరు గారు-తుని రాణీ గారు.

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షుడు.

జయంతి రామయ్యపంతులు గారు బి. ఏ, బి. ఎల్.

### కార్యదర్శులు.

దర్భా వేంకటశివరామరాజుగారు బి. ఏ., బి. ఎల్.

కిడాంబి రాఘవాచార్యులు గారు ఎం. ఏ., బి. ఎల్.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడు గారు

డాక్టరు వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ. ఎల్. టి. PH D (కోశాధ్యక్షులు)

శ్రీత్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు

కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు

అనంతపంతుల రామలింగస్వామిగారు.

దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావు గారు బి. ఏ

కుమ్మల సీతారామమూర్తి చౌదరీగారు.

అల్లక్కి వేంకట్రామయ్యగారు.

కోటా వెంకటసుబ్బారావు నాయుడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు గారు.

పిల్లారిసెట్టి రంగబ్రహ్మారావు నాయుడుగారు.

# సవరణలు.

ఈసంవత్సర ప్రథమసంచికలో ౨౬ వ పుటలో మొదటిపంక్తిలో

౧. "వాడు అనుచోట" అనుటకు బదులుగా "వాండు అనుచోట" అని యుండవలయును.

౨. ఆపుటలోనె ౭ వ పంక్తిలో "వాడు, వాడు, వాండు" అనుటకు బదులుగా "వాడ్రి, వాండు, వాండు" అని యుండవలయును.

3 ఆపుటలోనె ౨౫ వ పంక్తిలో "దీని లుచ్చువాన్డు" అనుటకు బదులు "దీని ఇచ్చువాన్డు" అని యుండవలయును.

# విషయసూచిక.





ఉచ్ఛ్వాసైశ్చ పరిచ్ఛేదో యత్ర యా చూర్ణకోత్తరా
"వక్త్రం వా పరవక్త్రం వా యత్ర సాఖ్యాయికా స్మృతా"

అని యాఖ్యాయికాలక్షణము.

శ్లోకైః స్వవంశం సంక్షేపా త్కవి ర్యత్ర ప్రశంసతి
ముఖ్యస్యార్థావతారాయ భవేద్యత్ర కథాంతరమ్
పరిచ్ఛేదో నయత్ర స్యా ద్భవే ద్వాలంబకైః క్వచిత్
సా కథా నామ తద్గర్భే నిబధ్నీయా చ్చతుష్పదీమ్.

ఆఱవశతాబ్దము నందున్న సుబంధునివాసవదత్తను జూచి యాశైలి ననుసరించి తన ప్రతిభావిశేషముచే విపులముగా, కాదంబరీహర్షచరిత్రములను రచించెను. మఱికొంతకాలమున కీగ్రంథముల ననుకరించి వాదీభసింహుఁడు గద్యచింతామణిని ధనపాలుఁడు తిలకమంజరిని వ్రాసిరి. కాని యవి బాణుని ప్రబంధములవలె నంతరసవంతములై యుండలేదు.

హర్షచరిత్రము గ్రంథకర్తను గుఱించి గ్రంథనాయకుఁడైన హర్షవర్ధనుగుఱించి కొంతసత్యమైనవృత్తాంతమును దెలుపుచున్నది. మొదటిమూఁడుచ్ఛ్వాసములయందు బాణుఁడు స్వీయచరిత్రను యథార్థముగా వ్రాసెను. మిగిలినయుచ్ఛ్వాసపంచకమందుఁ దనకుఁ బ్రభువు పోషకుఁడు నైనహర్షవర్ధనుని వంశోత్పత్తి, వంశచరిత్రము, ఆతని జననము, పట్టాభిషేకము, దండయాత్రలు రాజ్యపరిపాలనక్రమము, ఆతనియేలుబడిలో భరతఖండముయొక్క యుచ్చస్థితి మతము, విద్య, సంఘస్థితి మొదలగు ననేకవిషయములను బ్రతిపాదించెను. బాణుఁడు హర్షచరిత్రలో వ్రాసినహర్షునివృత్తాంతము చీనదేశపుయాత్రికులగు హుయాన్‌ధసాంగు, యువన్‌చంగ్, ఇత్సింగు మొదలగువా రాకాలమం దీదేశమునకుఁ గష్టములకోర్చి వచ్చిచూచి చైనాభాషలో వ్రాసిన వృత్తాంతముతో సంవదించుచున్నది. ఈగ్రంథము పూర్వకాలమందు భరతఖండము నేలిన మహారాజులలో ముఖ్యతముఁ డగునీహర్షునిచరిత్రమును వ్రాసిన చరిత్రకారుల కమితసహాయము నొనరించెను.

ఈకవి తనవంశమున కుత్కర్షము నాపాదించుటకు సరస్వతీసంబంధనివేదక మగునొకకథను గల్పించి గ్రంథాదియందుంచెను. అదియెట్లనఁగా:—

ఒకకాలమందు బ్రహ్మ సత్యలోకమందు సరస్వతీసమేతుఁడై దేవతలు బ్రహ్మర్షులు సిద్ధులు సాధ్యులు మొదలగువారు తన్నుఁబరివేష్టించి యుపాసింపఁ

గాఁ బేరోలగంబున నుండె. అపుడు సభలోనున్నవా రనేకవిధములఁ బరమేష్ఠిని నుతించిరి. వారిలో నతికోపశీలుఁ డగుదుర్వాసుఁడు సామములఁ బాడుచు స్వరముఁ దప్పెను. అది విని సరస్వతి పక్కున నవ్వెను. అందుపై దుర్వాసుఁడు కుపితుఁడై మర్త్యలోకమునకుఁ బొమ్మని సరస్వతిని శపించెను. అంతఁ జతుర్ముఖుఁడు సరస్వతి యొకపుత్త్రుఁడు లభించువఱకు భూలోకమం దుండవలయు ననియుఁ దరువాత మరలఁ దనలోకమునకు రావచ్చు ననియు వాదుర్వాసుని శాపమును మార్చెను. సరస్వతియు మునిశాపమును మన్నించి సావిత్రితోఁ గూడి మర్త్యలోకమును బ్రవేశించి శోణనదీతీరమున నున్న యరణ్యములో నొక యాశ్రమమును గల్పించుకొని యచట నివసించియుండెను. ఇట్లుండగా నొక దినమందు ప్రాతఃకాలమున నశ్వహేషాధ్వని వినఁబడెను. ఇట్టివిజనారణ్యమందు గుఱ్ఱపుసకిలింత వినవచ్చుటకుఁ గారణం బేమి యని విచికిత్స గలదియై సర స్వతి విపినమధ్యంబునఁ గొంతద వ్వరిగి చూడఁగా నాశ్వికబృందానుయాతుం డున్నతహయారూఢుండు రూపజితమారుండు నగునొకఋషికుమారకుని, వాని వెనుకఁ జనుదెంచుచున్న యొకవృద్ధుని గాంచెను. వారుభయులు సా విత్రిసరస్వతులను జూడవచ్చిరి. వారిరువురికి వనవాసోచితమగు నతిథిసత్కార మును జలిపి సేమం బరసి యావృద్ధు నుద్దేశించి సావిత్రి "ఆర్యా! ఇక్కుమా రుఁడెవ్వఁడు? ఇతనితలిదండ్రు లెవ్వరు? ఎచటినుండి యెచటికిఁ బోవు చున్నా" రని యడుగ నాస్థవిరుండు "ఇతఁడు చ్యవనఋషికి శర్యాతిమహారాజ పుత్త్రిక యగుసుకన్యయందు జనించిన సుపుత్త్రుఁడు. ఇతనిపేరు దధీచి పుట్టినది మొదలుకొని యీచిన్నవాఁడు మాతామహునియింటనే యుండెను. సకల విద్యాపారంగతుఁడై యౌవనవయస్సులోనున్న వీనిఁ జూడవలె నని తండ్రి కోరఁగాఁ బితృసదనంబునకుఁ బోవుచున్నాఁడు. నేనాతని కానుయాత్రికుఁడను. నాపేరు వికుక్షి. చ్యవనాశ్రమ మిచటికి కాసన్నమే యని పలికెను. కొంత సేపుండి దధీచి వికుక్షులు సరస్వతీసావిత్రులయభ్యనుజ్ఞ వడసి యథాభిలషిత దేశంబునకుఁ బోయిరి. అంత సరస్వతి దధీచి రూపలావణ్యాదులను వీక్షించి యాతనియం దనురక్తచిత్తయయ్యె దధీచియు సరస్వతీసక్తమానసుం డయ్యె. ఇట్లు వారిద్దఱు సంజాతపరస్పరానురాగులై యొకసంవత్సర మొకచోట సుఖ ముగా నుండిరి. సరస్వతిగర్భవతియై యొకపుత్త్రుని గాంచెను. వానిపేరు సార స్వతుఁడు. సరస్వతి యాతనయుని దనప్రభావముచేఁ జతుర్దశవిద్యావిశారదుని

జేసి దధీచి కొప్పగించి సావిత్రి బ్రహ్మలోకంబునకుం జనియె. దధీచియు సరస్వతీవియోగసంతప్తహృదయుండై తనకుమారుని తమ్మునిభార్య యయిన అక్షమాలయను దాని కొప్పగించి తపశ్చర్యారతుండై యరణ్యంబున కేగె. అక్షమాలయు నాసారస్వతుని జన్మదివసమందే యొకసుతుని గనెను. వానిపేరు వత్సుండు. కొంతవయస్సు వచ్చినతరువాత సారస్వతుండు తనసోదరుండైన వత్సునికి సమస్తవాఙ్మయము సంక్రమింపఁజేసి తప స్సానరించుబుద్ధితోఁ దండ్రియొద్దకుఁ బోయెను.

ఆవత్సుని వలన నొకపరిశుద్ధబ్రాహ్మణవంశ ముత్పన్నమయ్యె. కాలక్రమమున నావంశమందు కుబేరుఁ డనునొకద్విజశ్రేష్ఠుండు పుట్టెను. వాని కచ్యుతుఁడు, ఈశానుఁడు, హరుఁడు, పశుపతి కొడుకులు. వారిలో పశుపతికి అర్థపతి యనువాఁడు తనయుఁడు. ఆయర్థపతికి భృగువు, హంసుఁడు, శుచి, కవి, మహీదత్తుఁడు, ధర్ముఁడు, జాతవేదుఁడు, చిత్రభానుఁడు, త్ర్యక్షుఁడు, అహిదత్తుఁడు, విశ్వరూపుఁడునని పదునొకండ్రు తనయులు కలిగిరి. వారిలోఁ జిత్రభానుఁ డనువానికి రాజదేవియను బ్రాహ్మణియందు బాణుఁ డుదయించెను. ఇతనిశైశవమందే తల్లి మృతినొందెను. కొంతకాలము తండ్రియే యితనిని సంరక్షించి వార్ధకము రాకమున్నె యతఁడును గాలధర్మము నొందెను. బాణుఁడు బాల్యమందు వేదములను శాస్త్రములను జదివి మహావిద్వాంసుఁడై యున్నను యౌవనదశలో స్వైరవిహారము గలవాఁడై మిత్రులఁ గొందఱిని వెంటఁబెట్టుకొని దేశాటనముఁ జేయనారంభించెను. హర్షచక్రవర్తి సోదరుఁడైన కృష్ణరాజితనికి రాజదర్శనము కొఱకు రమ్మని వార్తనంపఁగా వెళ్ళి చక్రవర్తిని జూచి మరల నిజనివాసంబున కేతెంచె. ఈ బాణుని కనేకులు మిత్రులుండిరి. వారిలోఁ గొందఱు విద్వాంసులు, కవులు, పౌరాణికులు, గణకులు, మఱికొందఱు గాయకులు, నర్తకులు, ఇంద్రజాలికులు, చిత్రకారులు. వీరితో నెల్లపుడుఁ గలిసియుండెను.

ఒకనాఁ డీతనిమిత్రులలో నొకఁడైన సుదృష్టి యనువాఁడు రక్తకంఠముతో వాయుపురాణమును జదువుచుండఁగాఁ దక్కినవా రందఱుఁ గుతూహలముతో వినుచుండిరి. అపుడు సూచీబాణుఁ డనువంది-

"తదపి మునిగీత మతిపృథు తదపి జగద్వ్యాపి పావనం చరితమ్
హర్షచరితా దభిన్నం ప్రతిభాతి హి మే పురాణమిదమ్"

అని యొకశ్లోకమును జదివెను.

అది విని బాణునిమిత్రు లందఱు హర్షునిచరిత్రమును దమకుఁ జెప్పుమని ప్రార్థించిరి. అందుపై బాణుఁడు హర్షచరిత్ర మిట్లు వారికిఁ జెప్పఁ దొడంగె.

స్థాణ్వీశ్వర మనునొకదేశవిశేషము కలదు. దానిలో శ్రీకంఠ మను జనపద మొకభాగము. దానిని పుష్పభూతి యనురాజు పాలించెను. అతఁడు బాల్యమునుండి పరమమాహేశ్వరుఁడు అతనిమంత్రులు సచివులు భృత్యులే కాక యతనిదేశమం దున్నప్రజ లందఱు శివభక్తులు. ఆకాలమునందు భైరవాచార్యుఁ డనునొకద్రవిడదేశపు సన్న్యాసి సకలశైవతంత్రవిశారదుఁడు శివభక్తుఁ డుండెను. అతనిప్రసిద్ధి లోకమంతట వ్యాపించెను. పుష్పభూతియు శివభక్తుఁడు గావున నాభైరవాచార్యుని జూచుటకుఁ గుతూహలము గలవాఁడై యుండెను. ఇట్లు కొంతకాలము గడచినపిమ్మట నొకనాఁ డాతనిశిష్యుఁడు వచ్చి భూపతికి భైరవాచార్యునిరాక నెఱింగించెను. రాజు భైరవాచార్యుని జూడఁబోయెను. మఱియొకసమయమున భైరవాచార్యుఁడు రాజుసన్నిధి కేతెంచి కొంతసేపు సంభాషించి మహారాజా తొల్లి నేను మహాకాళీహృదయ మనుమహామంత్రమును కృష్ణవస్త్రమాల్యానులేపనధరుండనై శ్మశానమందుఁ గల్పోక్తవిధిగాఁ గోటిజపముచే నుపాసించియున్నాను. వేతాళసాధనముచేఁ గాని జపసిద్ధి లభింపదు. అసహాయు లగువారు వేతాళమును సాధింపఁజాలరు. ఈపనికి మీరు సమర్థులు. మీ రఖిలకార్యభారమును వహింపఁగా నాశిష్యులు మఱిముగ్గురు నాకు సహాయు లగుదురు. ఆగామికృష్ణచతుర్దశినాఁటి రాత్రికి మీరాయుధద్వితీయులై శ్మశానమునకుఁ దప్పక రావలయు నని ప్రార్థించెను. రా జియ్యకొనెను. యథాప్రతిజ్ఞాతముగా నాఁటిరాత్రి భూకాంతుఁడు శ్మశానమునకుఁ బోయి కర్మ చేయుచున్న భైరవాచార్యుని గలిసికొనెను. తక్కినముగ్గురు కూడవచ్చిరి. వీరిసహాయముచే భైరవాచార్యుఁ డతిభీషణం బగుకర్మ నాచరించుచుండఁగా, కర్మవిఘ్నము సలుపుటకు వచ్చినభూతప్రేతపిశాచములు విఫలప్రయత్నములై తొలఁగి పోయెను. అంతలో రాత్రి యామమాత్రావశిష్టమై యుండఁగా నరపతియున్నదిక్కున భూరంధ్రమునుండి ఘోరరూపుఁ డైనయొక నాగుఁడు బయలువెడలి రాజువైపుఁ జూచి ఓరీ దురాత్ముఁడా! ఈక్షేత్రాధిపతి నైననన్నుఁ బూజింపక యిట్టిపని చేయించుచుంటివా? నాపేరు శ్రీకంఠుఁడు. ఈదేశము నాపేరుచేతనే వ్యవహరింపఁబడుచున్నది. ఇట్టిన న్నలక్ష్యముచేసెదవా యని రాజు నెదిరించెను. అంతనారాజు వానితో బాహుయుద్ధముఁ జేసి

నేలఁగూర్చెను. ఇంతలో కమలగంధ మాఘ్రాణింపఁబడెను. నూపురధ్వని వినఁబడెను. మహాతేజస్సుతో నొకస్త్రీవ్యక్తి కానవచ్చెను అది గని రాజు ధైర్యముతో "అమ్మా నీవెవ్వతెవు? ఈయపరరాత్రమం దీప్రేతభూమి కేల వచ్చితివి" అని యడుగఁగా "నేను విష్ణువక్షస్స్థలారూఢ నగుమహాలక్ష్మిని, నీపరాక్రమముచే మిగుల సంతసిల్లితిని. నీకిష్టమైనవర మడుగు" మని పలికెను. రాజు స్వార్థనిరభిలాషుఁడై భైరవాచార్యునికి గ్రసిద్ధి నొసంగు మని ప్రార్థించెను. మహాలక్ష్మి దానికి సమ్మతించి "రాజా నీవు చంద్రసూర్య వంశములతో సమానమగుగొప్పప్రసిద్ధినొందిన రాజవంశమునకుఁ గర్తవు కాఁగల" వని వరమిచ్చి యంతర్ధానము నొందెను. శ్రీకంఠుఁడును వినీతుఁడై రాజునొద్ద సెలవు పుచ్చుకొని తాను వచ్చినభూవివరమును జొచ్చెను.

ఇది యంతయు హర్షచరిత్ర మూఁడుచ్ఛ్వాసములలోని కథ. మూఁడవ యుచ్ఛ్వాసము కొనను పుష్పభూతికి లక్ష్మి దర్శనమొసంగి నీవువంశకర్తవు కాఁగల వని చెప్పుట గ్రంథనాయకుని వంశమునకు గొప్పతనము నారోపించుటకు బాణుఁడు కల్పించెనని నాయభిప్రాయము. బాణునిస్వీయచరిత్ర మంతయు వాస్తవముగా నున్నట్లు తోఁచుచున్నది.

పైనఁ జెప్పఁబడిన పుష్పభూతి యీహర్షవర్ధనుని వంశమునకు మూలపురుషుఁడు- వానినుండి గొప్పరాజవంశ ముత్పన్నమైనది. తగినగ్రంథప్రమాణము గాని శాసనములు గాని లేకపోవుటచే నాకాలపురాజులపేర్లు గాని చరిత్రలు గాని మన కేమియుఁ దెలియవు. రాధాకుముదముఖర్జీయను పండితుఁడు వ్రాసిన (Rulers of India Series) హర్షచరిత్రలో నుదాహరించిన మధువన శాసనము హర్షునితండ్రిని, తాతను, ముత్తాతను, వానితండ్రిని జెప్పుచున్నది.

నరవర్ధన. -వజ్రిణీదేవి.

|

రాజ్యవర్ధన. అప్సరోదేవి.

ఆదిత్యవర్ధన.—మహాసేనగుప్తాదేవి.

ప్రభాకరవర్ధన— యశోమతి. (మాళవరాజైన యశోధర్ముని కూఁతురు)

## — హర్షునిజననము —

ఆ పుష్పభూతివంశమునందు ప్రతాపశీలుఁ డనునపరనామము గల ప్రభాకరవర్ధనుఁ డనుమహారాజు పుట్టెను. అతఁడు హూణహరిణకేసరి, సింధు

రాజజ్వరము, గూర్జరప్రజాగరము, గాంధారాధిప గంధద్విపకూటపాకలము, లాటపాటవపాటచ్చరుఁడు. మాళవలక్ష్మీలతాపరశువు నని ప్రసిద్ధి కెక్కెను.

ప్రభాకరవర్ధనుఁడు సంతానప్రాప్తికొఱకుఁ జిరకాలము సూర్యోపాసన చేయఁగా సూర్యుని ప్రసాదమువలన నిద్దఱుపుత్త్రులు నొకపుత్త్రిక కలిగిరి. పెద్ద కుమారునిపేరు రాజ్యవర్ధనుఁడు, చిన్నకొడుకుపేరు హర్షవర్ధనుఁడు. ఇతఁడు క్రీ. శ. 590 సం॥ జ్యేష్ఠమాసములో జనించెను. రాజ్యశ్రీ యనునది పుత్త్రిక. యశోవతీసోదరుఁడు భండియను పేరుగల తనకుమారుని రాజపుత్త్రులకు సేవకునిగాఁ జేసెను.

ఈరాజపుత్త్రు లిరువురికి వయస్సువచ్చినతరువాత మాళవదేశాధీశ్వరుఁడు మాధవగుప్త కుమారగుప్తు లనుతనకొమాళ్ల ననుచరులఁగా నొనర్చెను.

ఇట్లు కొంతకాలము నడచినతరువాత ప్రభాకరవర్ధనుని జతురంగసైన్యమును సహాయ మిచ్చి హూణులను జయించుటకుఁ బంపెను. అట్లు దండయాత్రకుఁ బోవుచున్న వానివెంబడి హర్షుఁడును గొంతదూరము వెళ్ళి కైలాసప్రాంతమున నున్నయరణ్యములో మృగయావినోదము సలుపుచుఁ గొన్నిదినంబు లుండెను. అచ్చట వేఁటాడుచున్న దినములలో నొకనాఁటిరాత్రి వేకువజామున మహాసింహ మొకటి ఘోరదావాగ్నిజ్వాలలచే దహింపఁబడినట్లును, పిల్లలను విడిచిపెట్టి యాఁడుసింహము కూడ నామంటలలో దుమికినట్లును స్వప్నమందుఁ జూచెను. తెలివివచ్చినది మొదలుకొని తనకుటుంబములో నేమియనర్థము సంభవించునో యని శంకించుచుండె. అనేకదుర్నిమిత్తములనుజూచెను. ఇంతలో కురంగకుఁ డనుభృత్యుఁ డొకఁడు విషణ్ణవదనుఁడై వచ్చి దేవా మహారాజు ఘోరమైన దాహజ్వరముచేఁ బీడింపఁబడుచున్నాఁడు. మీరు శీఘ్రముగా రావలె నని చెప్పెను. అపుడు హర్షుఁడు తీవ్రశోకావిష్టుఁడై పరివారమును వెనుకనుండి రమ్మని చెప్పి హయారూఢుఁడై యాహారనిద్రలు లేకుండ మూఁడుదినములు ప్రయాణముచేసి రాజధానిని జేరెను. అభ్యంతరమునకు బోయి మరణవేదనతో బాధపడుచున్న తండ్రినిజూచి ధైర్యమును గోల్పోయెను. భావిభర్తృమరణదుఃఖమును భరింపఁజాలక హర్షునితల్లి సరస్వతీతీరమం దగ్నిలోఁ బడి దేహమును బరిత్యజించెను. మఱిరెండుదినములకు హర్షునికిఁ జెప్పవలసినబుద్ధులను జెప్పి మహారాజుకూడఁ గాలధర్మము నొందెను.

హర్షుఁడు పితృమరణమునకు శోకించుచుండఁగా నింతలో రాజ్యవర్ధనుఁ

డు యుద్ధమందు హూణులను జయించి నిజపురంబుఁ బ్రవేశించెను. పితృనిధన దుఃఖోద్విగ్నమానసుండై తనకు రాజ్యమక్కఱలేదనియు విరక్తుఁడనై కాషాయము గట్టుకొని తపశ్చర్యకరణ్యంబునకుఁ బోయెద ననియు నిశ్చయించెను. అంత హర్షుఁడు సోదరుని బతిమాలి దుఃఖోపశామకము లగుమాటలఁ జెప్పి యెట్టకేల కతికష్టముతో రాజ్యమేలుటకు సమ్మతింపఁజేసెను.

ఆసమయమందు హర్షునిసోదరి యయిన రాజ్యశ్రీయొక్క భర్తను గ్రహవర్మను మాళవదేశపురాజు శిలాదిత్యుఁడు వధించెననియు, రాజ్యశ్రీ కాన్యకుబ్జమందు జెఱసాలలోఁ బెట్టఁబడె ననియు రాజ్యశ్రీ భృత్యులలో ముఖ్యతముఁడైన సంవాదకుఁ డనువాఁడు వచ్చి హర్ష రాజ్యవర్ధనులకుఁ దెలియఁజేసెను. ఆవార్త విని రాజ్యవర్ధనుఁ డతికుపితుఁడై భండిని వెంటఁబెట్టుకొని తానొక్కఁడె మాళవరాజు నెదిరింపఁబోవుదు నని నిశ్చయించి హర్షుని రాజధానిలో నుండి పొమ్మని నిర్బంధించి మాళవదేశముపైకి దండెత్తి వెళ్ళెను. కొన్ని దినములు గతించినతరువాత నొకనాఁ డాకస్మికముగా రాజ్యవర్ధనుని కత్యర్థప్రియుఁడైన కుంతలుఁ డనువాఁ డతిదైన్యముతో వచ్చి "మీయన్నరాజ్యవర్ధనుఁడు మొదట మహాపరాక్రమముతోఁ బోరాడి మాళవరాజసైన్యము నోడించి విజయమునుగొన్నవాఁడై యుండఁగా నానాఁటిరాత్రి రహస్యముగా నాతని జంపె నని చెప్పెను.

అందుపైని హర్షుఁడు కోపోద్దీపితుఁడై తొల్లి పరశురాముఁడు పితృవధామర్షచేఁ గార్తవీర్యునికుటుంబము నేగాక లోకములోనుండు సకలక్షత్రియజాతిని నిర్మూలముచేసి నట్లు తనసోదరుని జంపిన గౌడరాజునేగాక భరతఖండములో నున్నరాజుల నందఱిని వధించి తనరాజ్యమును విస్తరింపఁజేయుదు ననియు, కారాగృహనిబద్ధయైన సోదరిని విడిపించెదననియుఁ బ్రతిజ్ఞం బూని యొకశుభదినమందు దిగ్విజయార్థమై బయలుదేఱెను. హర్షునికి బిత్రృసఖుఁడైనసిహనాదుఁ డను సేనాధిపతి యీపనికిఁ బురికొల్పెను.

ఇట్లు హర్షుఁడు చతురంగసైన్యసమేతుఁడై బయలుదేఱి మొదట సరస్వతీనదీతీరమందు విడిసెను. ఆస్థలమందు కామరూప (Assam) దేశాధీశ్వరుఁడగు భాస్కరవర్మ యమూల్యము లగువస్తువుల నుపాయనముగాఁ బంపి యుద్ధమందు హర్షునికి సహాయ మొసఁగెద నని వాగ్దానము చేసెను. హర్షుఁడా కానుకల నతివినయముతో బరిగ్రహించి యెడతెగని ప్రయాణములతో

బద్ధదీక్షుఁడై పోవుచుండఁగా రాజ్యవర్ధనునిచే జయింపఁబడిన మాళవరాజు సైన్యమును వెంటఁబెట్టికొని వచ్చుచున్న భండి మధ్యమార్గమందు హర్షునికిఁ గానవచ్చెను. రాజ్యవర్ధనుని రహస్యవధప్రకార మంతయును జెప్పెను. రాజ్యశ్రీవృత్తాంత మే మయ్యె నని యడుగఁగా రాజ్యవర్ధనవధానంతరము కనోజ రాజ్యమును గుప్తుఁడనువాఁడు వశపఱచుకొనఁగా రాజ్యశ్రీ కారాగృహము నుండి తప్పించుకొని తనపరివారముతో వింధ్యారణ్యమును జొచ్చె నని పలికెను. అపుడు హర్షుఁడును గుఱ్ఱము నెక్కి వింధ్యాటవికిఁ బోయి వెదకి యం దొకచోట నగ్నిప్రవేశముచే దేహత్యాగమును జేసికొనుటకు సిద్ధముగా నున్న సోదరిని మరణమునుండి తప్పించి తనతోఁ దీసికొనిపోయెను. హర్షుఁడు తన సోదరుని భగినీభర్తను జంపిన రాజులను ఘోరసంగ్రామమందు సంహరించి వారిరాజ్యములను స్వాధీనపఱచికొనెను అంతతో విరమింపక వలభిరాజును జయించి వానిని సామంతరాజునుగాఁ జేసికొని వానిరాజ్యమును వానికి విడిచిపెట్టెను ఆనందపురము, కచ్, సౌరాష్ట్రము మొదలగుదేశముల నాక్రమించె నని యువన్‌చాంగు వ్రాసియున్నాఁడు.

హర్షుఁ డిట్లవ్యాహతప రాక్రమముచే నానాదేశములను జయించి స్వరాజ్యమును బెంచుచుండఁగా నాకాలమందు మహారాష్ట్రదేశము నేలుచున్న చాళుక్యవంశపురాజైన రెండవపులకేశి యితనికి లొంగలేదు. 634 సం॥న నీ పులకేశి యాస్థానమం దున్న మహాకవి రవికీర్తి వ్రాసిన అహిహోల్ శాసనమందు పులకేశిచే హర్షుఁడు పరాభూతుఁ డయ్యె నని చెప్పఁబడియున్నది. పారశీకదేశపురాజు రెండవకస్రు అనువాఁ డితనితో సంధిఁజేసికొనెను. సంయుక్తరాష్ట్రము (United Provinces) బీహార్, బంగాళాదేశము, రాజపుత్రస్థానము, ఒరిసా, పంజాబులోఁ గొంతభాగము, పశ్చిమహిందూస్థానము, మధ్యహిందూస్థానము మొదలగు దేశములు హర్షునియేలుబడిలో నుండెను. ఇతనిరాజ్యము దక్షిణమందు రేవానదివఱకు వ్యాపించినది. దక్షిణహిందూస్థానపు శాసనములలో హర్షుఁ డుత్తరాపథమునంతను నేలె నని చెప్పఁబడియున్నది.

## రాజ్యపరిపాలనము.

హర్షునిరాజ్యపరిపాలనపద్ధతిని బాగుగాఁ దెలిసికొనుటకుఁ దగినయాధారములు లేవు- తనరాజ్యములో నేమూల నేమి జరుగుచున్నదో యెచ్చట వివాదములు పుట్టుచున్నవో యేప్రదేశమం దీతిబాధలు కలవో దానినంతయుఁ

గనుంగొనుట రాజ్యపాలకునికి మైన కర్తవ్యము. ఈవిషయములో హర్షుని మించిన రాజు లెవ్వరును లేరు. ఏదో యొకమిష గల్పించుకొని తఱచుగా నీతఁడు స్వరాష్ట్రమందు సంచారము చేయువాఁడు. ఇతనిరాజ్యమందు భుక్తి యని, విషయ మని, గ్రామమని మూఁడువిభాగము లుండెను. గవర్నరు-గోప్త, భోజపుఁడు, భోగపతి యనియు, వైస్రాయ్ (Viceroy) రాజస్థానీయుఁడని యు నద్యోగస్థులు నియుక్తు లని యు, మహాసామంతు లని యు, మహారాజులనియు దౌస్సాధనికు లని యు, విషయపతు లని యు, ఉపరికు లని యు వ్యవహరింపఁబడిరి.

పట్టణముల కధిష్ఠానము లనిపేరు.

పుస్తపాలుఁడు=Record Kceper

అక్షపటలము=Record office

కరణములు=Documents

కరణికుఁడు=Registrar

అధ్యక్షమహామాత్రుఁడు=Superintendent of the inner apartment

సేనాపతి, మహాసేనాపతి, బలాధికృతుఁడు- సేనాధిపతికిఁ బేళ్ళు.

భటస్వపతి=పదాతిసైన్యముల కధిపతి

బృహదశ్వవారపతి=గుఱ్ఱపుదండున కధిపతి

మహాదండనాయక=Chief Justice

దండపాశిక=Police man

యామచేటిక=రాత్రిపారాయిచ్చు స్త్రీ=Woman watcher of the night.

## మతము, విద్య.

హర్షుని రాజ్యపరిపాలనకాలమందు భరతఖండమునకుఁ గలిగినవిద్యాధనాభివృద్ధులను గుఱించి యువన్‌చాంగు తెలియఁజేసిన వృత్తాంత మత్యద్భుతముగాఁ గానవచ్చుచున్నది. ఈచీనాయాత్రికుఁ డుదరపోషణము కొఱకు దేశాటనముచేయు సన్యాసులవంటివాఁడు కాఁడు. ప్రపంచకములో నున్న దేశము లన్నింటిలో భరతఖండ మొక్కటియే మోక్షసాధన మగు జ్ఞానసంపత్తిని గుత్తగొన్న దేశ మగుటచే నట్టి దివ్యజ్ఞానమును సంపాదించుట కొఱకే యీదేశమునకు వచ్చెను. క్రీస్తుశకాలము మొదలుకొని వంగదేశపు రాజైన ధర్మపాలుని కాలము వఱకు సుమారు పదిశతాబ్దము లవిచ్ఛిన్నముగా చీనదేశ

పువిద్యార్థు లాకాలమందు భరతఖండములో నున్ననలాందా మొదలగు ప్రసిద్ధవిద్యాలయములలోఁ గొంతకాలముండి విద్యల నభ్యసించి పండితులై స్వదేశమునకుఁ బోయిన ట్లనేక గ్రంథనిదర్శనము లున్నవి.

అట్టివిద్యార్థులలో ఫాహియన్ (Fa hie ) యువన్‌చంగ్- (Yuan-chewang) ఇత్సింగు (It- sing) అనువారు ముఖ్యులు. ఆకాలమందు బౌద్ధమే గాక వైదికమతముగూడఁ బ్రబలముగా నుండెను. అన్నివర్ణములలోను పరిశుద్ధతములైన బ్రాహ్మణులచే భరతఖండ మంతయు నిండియుండె ననియుఁ బండితులైన బ్రాహ్మణు లందఱు సంస్కృతభాషనే వ్యవహరించుచుండి రనియు బౌద్ధమతగురువులు కూడఁ దమమతగ్రంథములను సంస్కృతభాషలోనే వ్రాసి రనియు, యువన్‌చాంగు వ్రాసియున్నాఁడు. మధ్యహిందూస్థానమందు వ్యవహరింపఁబడు సంస్కృతభాష పరిశుద్ధమై మృదుమధురమై యుండెను. దానికిఁ బైగానున్న దేశములందు వాడఁబడు భాష వికృతినొంది సంస్కారహీనమైయుండెను. కృష్ణుని గొల్చెడువారు, కాణాద, వైశేషికమతస్థులు, కాపిలులు, లోకాయతికులు, ఆర్హతులు కూడ నాకాలమం దుండి రని బాణుఁడు వ్రాసెను.

హర్షవర్ధనుఁడు మతభక్తుఁ డనియే కాక విద్వత్కవిపోషణరతుఁడనియు స్వయముగా విద్వాంసుఁడుఁ గవియు ననియుఁ బ్రసిద్ధినొందెను. అతని యాస్థానమం దున్నకవి గావున బాణుఁడు హర్షుని కవితాచాతుర్యము వర్ణింపశక్యముగాదని వ్రాసెను. పోషకు నిట్లు స్తుతించుట యాశ్చర్యము కాదు, గాని, యీయంశమును సమర్థించుటకు మఱియొక సాక్ష్యము కలదు. హర్షుని మరణానంతరము (క్రీ- శ- 679- 687) సంవత్సరములలో నిండియాకు వచ్చిన ఇత్సింగు హర్షుఁడు మహాకవి యనియు నతని యాస్థానమం దున్నకవు లయిదు వందల కావ్యములను రచించి యతనికిఁ గృతి యిచ్చి రనియు నివి యన్నియు బుద్ధుచరిత్రమును దెలుపునవి యనియు వ్రాసెను. ఇట్లు రచింపఁబడిన కావ్యములలో నార్యసూరుఁడు రచించిన జాతకమాల యొకటి.

ఆకాలమందు బ్రాహ్మణు లందఱు వేదములను శాస్త్రములను గృషిచేసిరి. ప్రథమపాఠపుస్తకమునకు “సిద్ధిరస్తు” అని పేరు. వర్ణసమామ్నాయమునకు నలువదితొమ్మిది యక్షరములు. విద్యార్థులకు వ్యాకరణప్రవేశమును గలిగించుట కొకచిన్నవ్యాకరణమును నేర్పెడివారు. క్రమముగా వారిజ్ఞానము పెరిఁగినతరువాత జయాదిత్యవిరచితమైన కాశికావృత్తితోఁ బాణినిసూత్రములు

లను, పిదప శబ్దవిద్య, శిల్పస్థానవిద్య, చికిత్సవిద్య, హేతువిద్య, ఆధ్యాత్మవిద్య యను నయిదువిద్యల నభ్యసింపఁజేయువారు. నలాందాపాఠశాలలోఁ జదువుచున్నపుడు ఇత్సింగు పాలీభాషలో ననువదించిన సుహృల్లేఖయను కావ్యము, అశ్వఘోషుని బుద్ధచరిత్రము, జాతకమాల మొదలగునవి విద్యార్థులు చదువు సాహిత్యగ్రంథములు. వైదికవిద్యార్థులు బౌద్ధవిద్యార్థులుకూడఁ బూర్వోక్తమైన విద్యాపంచకమును జదివినపిదప వారివారిమతగ్రంథములను జదువవలె నని యేర్పాటు. ప్రతివాఁడును ప్రత్యేకముగా నేదో యొకశాస్త్రమునందు విశేషజ్ఞానమును సంపాదించి యుండవలెను. అందుకు వ్యాకరణశాస్త్రమునందు చూర్ణియనునామాంతరముగల పతంజలిమహాభాష్యము, వాక్యపదీయము, చదువవలసినగ్రంథములు- యోగశాస్త్రమునందు యోగాచార్యశాస్త్రము, అసంగుని యెనిమిదిగ్రంథములు తర్కశాస్త్రమునందు జినుని యెనిమిదిగ్రంథములు ధర్మశాస్త్రమునందుషట్పాది- ఆగమములయందు నికాయచతుష్టయము- చదువవలెను.

సంస్కృతవాఙ్మయచరిత్రతో సంబంధించిన కొందఱుగ్రంథకర్తలు హర్షునికాలమం దుండిరి. జయాదిత్యవామనులు, ధర్మపాలుఁడు, నలాందాపాఠశాలాధ్యక్షుఁడు శీలభద్రుఁడు, సుబంధుని వాసవదత్తతోను, సర్వదర్శనసంగ్రహమందుఁ జేర్పఁబడిన ధర్మకీర్తి, తామ్రలిప్తి విహారాధిపతి, రత్నకూటసూత్రప్రణీతయునగు రాహులమిత్రుఁడు, నలాందాపాఠశాలలో నుపాధ్యాయులైన జినప్రభువు, జ్ఞానచంద్రుఁడు, మహాపండితుఁడు మహాకవియు నగు బాణభట్టుఁడు. భారవి, జానకీహరణమును రచించిన కుమారదాసుఁడు, మాఘుఁడు, బాణునికంటెఁ గొంచెము ముందువాఁడైన సుబంధువు- హర్షునికిఁ బ్రతికక్షుఁడైన రెండవపులకేశియాస్థానకవి యగురవికీర్తి, సూర్యశతకమును వ్రాసిన మయూరుఁడు మాతంగదివాకరుఁడు మొదలగువారు

### హర్షుని యవసానము.

చైనాదేశపుశకమైన (Yung Hui) యంగ్‌హూయిశకాంతమం దనఁగా క్రీ. శ. 655 సం॥లో హర్షుఁడు స్వర్గస్థుఁడాయెను. 648 సం॥ మని మఱి కొందఱు చరిత్రకారులు నిశ్చయించిరి.

“సోయం సుజన్మా సుగృహీతనామా తేజసాం రాశిః, చతురుదధికేదారకుటుంబీ, భోక్తా బ్రహ్మస్తంబఫలస్య, సకలాదిరాజచరితజయజ్యేష్ఠమల్లః దేవః

పరమేశ్వరో హర్షః, ఏతేన ఖలు రాజన్వతీ పృథ్వీ- చిత్ర మిద మత్యమరం రాజత్వమ్. అపిచాస్య త్యాగస్య అర్థినః ప్రజ్ఞాయాశ్శాస్త్రాణి, కవిత్వస్య వాచః సత్త్వస్య సాహసస్థానాని, ఉత్సాహస్య వ్యాపారాః కీర్తేర్దిఙ్ముఖాని, అనురాగస్య లోకహృదయాని, గుణగణస్య సంఖ్యా, కౌశలస్య కళాః, నపర్యాప్తో విషయః" అని యీతని చరిత్ర కారుఁడైన బాణుఁ డీతని ప్రభావమును వర్ణించి యున్నాఁడు.

నానావిధమైన శక్తు లతనియందు విచిత్రముగాఁ గలిసియుండెను. మహాపండితుఁడు, పరమైశ్వర్యసంపన్నుఁడై యున్నను దీనులయందుఁ బరమకారుణికుఁడు, సార్వభౌముఁడైన పతినన్ముఁడు, మొదట తనసోదరుని బావమఱదిని జంపిన రాజులపై పగఁదీర్చుకొనుట కౌద్ధత్యమును, ప్రతాపమును జూపించినను గొనకతిప్రశాంతుఁడై బౌద్ధధర్మముల నవలంబించి స్వసిద్ధాంతమును స్వకృతి యగునాగానందమందు దాను కల్పించిన నాయకుఁ డగు జీమూతవాహనునిద్వారా ప్రకటించెను.

శ్లో॥ "స్వశరీర మపి పరార్థే యః ఖలు దద్యా దయాచితః కృపయా
రాజ్యస్యకృతే సకథం ప్రాణివధక్రౌర్య మనుమన్యే"

1 నాదౌ కించి ద్భవతి నియతం యచ్చ పశ్చా న్నకించి
న్మధ్యేఽకస్మా త్స్వపదిఘటయ యత్స్థిదాన్త్యనుబోధమ్
నిక్ష్రాంఘ్రి ర్నట ఇవ ముహుః కోపిజంతు ర్నటిత్వా
నోజానీమో భవయవనికాంతర్హితః క్వప్రయాతి.

2. కోన్యః కాల మతిక్రాంతుం నేతుంప్రత్యక్షతాంక్షమః,
కవిప్రజాపతిం త్యక్త్వా రమ్యనిర్మాణ శీలినమ్.

# విరూపాక్షరాయ లెవ్వరు?

వఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు — విజయనగరము.

తుంగభద్రానదీతీరమున విజయనగరసామ్రాజ్యమును స్థాపించి ప్రజాపాలనము చేసిన సంగమవంశపు గిరీటధారిచక్రవర్తులలో విరూపాక్షరాయలు తుదివారు. ఈయన ప్రౌఢదేవరాయలపుత్రుఁడని కొందఱును పౌత్రుఁడని కొందఱును నభిప్రాయపడియున్నారు. ఈవిషయమును విమర్శించుటకు ముఖ్యముగా రెండుశాసనము లాధారము లయి యున్నవి. అం దొకటి విజయనగరచరిత్రాధారము లనెడి (Sources of Vijayanagar History) గ్రంథములోని డెబ్బదవ పుటయందలి శ్రీరంగముప్లేటు లనెడిశాసనము. వేఱొకటి, ఎపిగ్రాఫియా కర్ణాటికా III వాల్యుము మళవల్లితాలూకా 121 నెంబరు శాసనము. శాసనవిమర్శకులకు వీనిలో రెండవది మొదట లభించియుండెను. అద్దానిలోని విరూపాక్షరాయలను సంబంధించిన భాగము నిటఁ జూపుచున్నాను

"...............విజయభూపతిః సత్యనారాయణీ దేవ్యాం । ప్రామరాసీద ః । ప్రౌఢప్రతాపవిభవ । ప్రతాపాఖ్యో మహీపతిః । గుణైరనేకై రవనీతలేస్మిన్ విరాజమానః సుకృతాప్తకీర్తిః । నిజాగ్రజాప్రాప్తమనాదిరాజ్య । సాధీకృతార్థివ్రజపారిజాతః । తస్య సింహళదేవీతి । భార్యాసర్వగుణాశ్రయా............తస్యాం శివః ప్రాదురభూ ద్గుణాఢ్యో । నామ్నా విరూపాక్ష ఇతి ప్రసిద్ధః ।. నిజప్రతాపా దధిగత్య రాజ్యమ్. .....దివ్యం సింహాసనం ప్రాప్య పాలయన్ ధరణీ మిమామ్ ।............... శాలివాహననిర్ణీత శకవర్షక్రమాగతే । ఋతురంధ్రగుణైర్యుక్తే । విధునాయుతవత్సరే (1396), *విజయాఖ్యే ('సజయాఖ్యే' అని యుండవలెను.) సంక్రాంత్యాం మకరాఖ్యాతే ।..............."(ఎపిగ్రాఫియాకర్ణాటికా III వాల్యుము. మళవల్లితాలూకా. 121 నెంబరు.)

ఈశాసనములో నున్న ప్రమాదములనేమియుఁ బరిగణింపకయే రైసు

* "1396" అను శాలివాహన శకసంఖ్యచే గుర్తింపఁబడు వత్సరము జయ యగును గాన 'స, జయాఖ్యే' అనిశాసనపాఠ ముండియుండును. శాలివాహనశకమున గతాబ్దసంఖ్యతోనే యా యావత్సరములను గుర్తించుట జ్యోతిషగ్రంథములందే గాక శాసనములందును సంప్రదాయమయి యున్నది.

దొరగారు యథాశ్రుతముగా నందలి "అగ్రజా" అనుశబ్దమును జూచి ప్రతాపరాయలు జ్యేష్ఠభగిని (Elder Sister) నుండి ప్రాప్తమయిన యనాదిరాజ్యమనఁగా విజయనగరరాజ్యము గలవాఁడని యర్థముచేసి యాప్రతాపరాయలు ప్రౌఢదేవరాయలే యనుకొని చక్రవర్తి యగువిరూపాక్షరాయలు ప్రౌఢదేవరాయలకుమారుఁ డని వ్రాసిరి.

"విజయనగరరాజులకుఁ బురుషసంతతిలోనె వరుసగా రాజ్యము వచ్చియుండుటచేతను, ప్రౌఢదేవరాయలకుఁ దనజ్యేష్ఠసోదరి నుండి రాజ్యము వచ్చెననుసది నిరాధారమగుటచేతను, బయిరీతి నర్థముచేయుట యసంగతము. అచట "నిజాగ్రజాత్" అని శాసనపాఠమై యుండును; కాఁగాఁ బ్రౌఢ దేవరాయలును బ్రతాపదేవరాయలును సహోదరు లగుటచే నచట నర్థము కుదురును. విరూపాక్షరాయలు ప్రౌఢదేవరాయపుత్త్రుఁ డగుమల్లికార్జునదేవరాయలకుమారుఁడు" అని యిట్లు హెచ్. కృష్ణశాస్త్రిగారిచే వ్రాయఁబడినట్లు విజయనగరచరిత్రపుఁ జిన్నభాగము" (A Little known chaper of Vijayana_gar History) అను గ్రంథమున వ్రాయుచు డాక్టరు, యస్. క్రిష్ణస్వామి అయ్యంగారద్దాని నీక్రిందిరీతి నిరసించిరి.

"శాసనపాఠమును సవరించుట సాహసము. మఱియు నట్లు దిద్దవలసిన యావశ్యకతయు లేదు. అట్లు దిద్దినను బ్రతాపరాయలకు రాజ్యప్రాప్తియే లేకుండుటం జేసి యాతనికిఁ దనయన్న యగుప్రౌఢదేవరాయలనుండి యనాదియగురాజ్యము వచ్చిన దని లభించెడునర్థము కేవలము నసంగతమె యగును. మఱియు నట్లు దిద్ది యావాక్యమును ప్రౌఢదేవరాయలతమ్ముఁ డగుప్రతాపరాయలపరముగా నన్వయించునపుడు తర్వాత నున్న "తస్య సింహాళదేవీతి భార్యా ..........." అనుభాగముచే సింహాళదేవి ప్రతాపరాయలకు భార్యయనియు విరూపాక్షరాయ లాదంపతులకుఁ బుత్త్రుఁ డనియు నర్థము లభించును గాన నది విరూపాక్షరాయలు మల్లికార్జునరాయలకుఁ బుత్త్రుఁ డని వాదించెడి కృష్ణశాస్త్రిగారి వాదమునకు సంగతము కానేరదు." అని యిట్లు కృష్ణశాస్త్రిగారి వాదమును డాక్టరు యస్. క్రిష్ణస్వామి అయ్యంగారు నిరసించిరే గాని యెట్టియర్థము చెప్పుట కయినను బయిశాసనము సమన్వితమె యయియుండలే దనియు నాశాసనపుఁ బ్రతిబింబము తీయుటలోఁ గొన్నిచోట్ల బ్రమాదములు కూడినవనియు గ్రహింపరైరి. మీఁద వివ్రాసిన యందు సవరణము చేయుట సాహసము కూడ

నాక్షేపించిరి. అట్లు ఫయిశాసనమునందేమియు సవరింపనపుడందలి "సాధీకృతార్థివ్రజపారిజాతః" అనుదాని కేమియర్థము గలదని శాసనవిమర్శకు లనుకొనిరో తెలియకున్నది. మఱియు ప్రతాపాఖ్యో మహీపతిః" అనుదానికి విశేషణము లయియున్న "విరాజమానః సుకృతాప్తకీర్తిః" అనువానికిం దరువాతను, "సాధీకృతార్థివ్రజపారిజాతః" అనుదానికి ముందును గల "నిజాగ్రజాప్తమ్" అనుద్వితీయాంతమునకును "అనాదిరాజ్య" అను ప్రాతిపదికమునకును నన్వయ మెట్లు లభించు ననుకొనిరో తెలియరాకున్నది. ఫయిరీతి ననర్థకమును ననన్వితమును నైయున్న శాసనభాగమును బట్టికొని యొక్కొక్కరొక్కొక్కవిధముగ నద్దాని నన్వయింపఁజూచు టెల్ల గగనారవిందసౌరభ్యమును బరిశీలించునట్లు పరిహాసనీయమై యున్న దని సంస్కృతభాషాజ్ఞానము గలవిమర్శకులకుఁ దోఁచకమానదు గదా !

తుది కదృష్టవశమునఁ బయిశాసనమునకు మూలమై యనఁదగు శ్రీరంగము ప్లేటులను శాసనము లభించుటచే వెనుకటిశాసనమునందలి ప్రమాదముల రూపుమాపుట కవకాశము గల్గినది. కాన నిట శ్రీరంగముప్లేటు లనెడి శాసనములోని విరూపాక్షరాయలను సంబంధించిన భాగము నిటఁ జూపుచున్నాను.

"………విజయభూపతిః । తస్యనారాయణీ దేవ్యా ముత్పన్న శ్శుభలక్షణః । ప్రతాపరాయ ఇత్యాఖ్యా మగమ త్పార్థివోత్తమః । గుణై రనైరవనీతలే స్మిన్ విరాజమానః సుకృతాప్తకీర్తిః । నిజాగ్రజాత్ప్రాప్త ఘనాద్రిరాజ్యః । సాధీ ("సార్థీ" అని యుండియుండును) కృతార్థో జనపారిజాతః । తస్యసిద్ధలదేవీతి భార్యా లక్షణసంయుతా । ………తస్యాం శివః ప్రాదురభూ ద్గుణాఢ్యో । నామ్నా విరూపాక్ష ఇతి ప్రసిద్ధః .నిజప్రతాపాదధిగత్య రాజ్యమ్………పిత్ర్యం సింహాసనం ప్రాప్య । పాలయన్ ధరణీమిమామ్ ।………*వస్వష్టగుణభూయుక్తే (1388) పార్థివాఖ్యేచ వత్సరే ।

* '1388' అను శాలివాహశకసంఖ్యచే గుఱితింపఁబడు వత్సరము పార్థివ కానేరదు. కాన పార్థివకు సరిపడునట్లుగ శాసనమున "మస్వష్ట" అని గాని "మున్యష్ట" అని గాని పాఠ ముండియుండునని గ్రహింపవలెను. (మనుశబ్దము వైవస్వతమనువాచకము గాన సప్తసంఖ్యను బోధించును) పై శాసనమం దిట్టిసవరణము చేయ నగునని యే ఆనరబుల్ దివాన్ బహాదూరు యల్. డి. స్వామికన్నుపిళ్ళగారు కూడఁ దలంచినట్లు డాక్టరు యస్. కృష్ణస్వామిఅయ్యంగారి యీక్రిందివ్రాఁతవలన విశదమగుచున్నది.

"I am obiliged to the Hon'ble Diwan Bahadur L. D. Swamy kannu Pillai for the equivalent Christian date which is Friday 8th November A. D. 1465………………"

కార్తికాఖ్యేచ మాసే. ." (విజయనగర చరిత్రాధారములు శ్రీరంగము ప్లేటులు_70 పుట)

ఈశాసనమును, వెనుకటిశాసనమును, సరిచూచువారి కీశాసనములోని శ్లోకములే చాలవఱకు వెనుకటిశాసనములోఁ జొనుపఁబడినవని తోఁచక పోదు. అక్కారణమునఁ జాలవఱకుఁ బరిశుద్ధముగ నున్నదీనినిబట్టి వెనుకటి శాసనములోని పాఠప్రమాదములను సవరించుట సాహసము కానేరదు. కాఁగా వెనుకటిశాసనములో హెచ్. కృష్ణశాస్త్రిగారు దిద్దినదిద్దుపాటే గాక మఱి కొన్ని సవరణములు నైతము కర్తవ్యములే యనియు నట్లు సవరించుట డాక్టరు యస్. క్రిష్ణస్వామి అయ్యంగారు చెప్పినట్లు సాహసకార్యము కాదనియు నీ శాసనము శాసించుచున్నది.

చాలవఱకుఁ బరిశుద్ధముగ నున్నయీ శ్రీరంగపుశాసనము లభించినను డాక్టరు క్రిష్ణస్వామిఅయ్యంగారు వెనుకటిశాసనపరిశీలనమువలనఁ గల్గినసంస్కారమును వీడఁజాలక యిందలి ప్రతాపరాయలు ప్రౌఢదేవరాయలే యనియు విరూపాక్షరాయలు ప్రౌఢదేవరాయల రెండవకుమారుఁ డనఁగా మల్లికార్జున రాయలతమ్ముఁ డనియు వీరు తలంచిరి. వీరు తమయీయభిప్రాయమునకు శాసనములోని "నిజాగ్రజాత్ప్రాప్తఘనాద్రిరాజ్యః" అను వాక్యము సందర్భపడుటకయి "ప్రౌఢదేవరాయల కెవరో పేరులేని యన్నగారుండి రనియు నాతఁడు ఘనాద్రి యనఁగాఁ బెనుగొండరాజ్యమును జయించి చక్రవర్తియుఁ దమ్ముఁడును నగుప్రౌఢదేవరాయల కొసంగె ననియు నావాక్యమున కర్థము చేసికొనిరి. కాని ప్రౌఢదేవరాయలకు జ్యేష్ఠసోదరుఁడు గలఁ డనుటకు శాసనాధార మెచ్చటను లేదు. శాసనాధారమె యననేల? ఏయాధారమును లేదు. ఇఁకఁ బ్రౌఢదేవరాయల కన్నగారె యుండునపు డాయనకుఁ బిత్ర్య మగువిజయనగరరాజ్యము సంక్రమింపక తమ్ముఁడగు ప్రౌఢదేవరాయలకు వచ్చునెట్లు? అట్టి జ్యేష్ఠసోదరుఁ డనామకుఁడై రూపుమాయు టెట్లు? మీఁదుమిక్కిలి యట్టియనామకుఁడు చక్రవర్తికి సాధ్యముగాని పెనుగొండరాజ్యమును జయించి తనరాజ్యము నాక్రమించిన తమ్మునకుఁ బ్రసాదించుటెట్లు? అట్టియన్నగారి రాజ్యము నాక్రమించిన ప్రౌఢదేవరాయలు నాపెనుగొండరాజ్యమును జయింప నేరమియెట్లు? ఇట్టి నిరాధారవిరుద్ధాంశములకు లోనయిన యర్థము విమర్శకాగ్రగణ్యులయియున్న డాక్టరు క్రిష్ణస్వామిఅయ్యంగారిచే నెట్లంగీకరింపఁబడెనో తెలియకున్నది.

పయిరీతిని కేవలము నసంగతమై యున్న యర్థమును విడిచి పై రెండుశాసనములలోని ప్రతాపరాయలు ప్రౌఢదేవరాయలతమ్ముఁ డనియు, నాతఁ డన్నగారివలనఁ బెనుగొండను జాగీరుగఁ బొంది యుండె ననియు నట్టిప్రతాపరాయలకు సిద్ధలదేవి, లేకసింహళదేవి యందు జన్మించిన యాతఁడే విరూపాక్షరాయలనియు, నతఁడు ప్రౌఢదేవరాయలపుత్త్రుఁ డగుమల్లికార్జునదేవరాయలయనంతరమున రాజ్యము నాక్రమించుకొని చక్రవర్తియయ్యెననియు మల్లికార్జునరాయలసంతతినుండి రాజ్యము నాక్రమించుటచేతనే యాతని దానశాసనములు పై రెండిటిలోను, మహాప్రసిద్ధుఁ డగుప్రౌఢదేవరాయలు సైతము పేర్కొనఁబడలేదనియు నర్థము చేసికొనుట యెంతయు సమంజసముగ నుండునుగదా? ఈపక్షమునకు "నిజాగ్రజాత్ప్రాప్త ఘనాద్రిరాజ్యః" అనుశాసనద్వయస్థవాక్యము ప్రబలాధార మగుచుఁ జక్కఁగా సమన్వితమగుచున్నదిగదా! ప్రౌఢదేవరాయలకుఁ బ్రతాపదేవరాయ లనెడి తమ్ముఁడు గలఁ డనుట క్రింది శాసనసాక్ష్యమగుచున్నది. "వీరో విజయ భూపతిః । ...... దయానిధే రభూత్తస్య । దేవీనారాయణాంబికా......పుత్రరూపం తయోశ్శ్లాఘ్యం । పూర్వజన్మతపః ఫలం । దేవరాయమహీపాలో । దాతా విజయతే భువి। ...... ప్రతాపదేవరాయేణ । ప్రఖ్యాతేనానుజన్మనా । మహేంద్రస్యేవ యస్యశ్రీ । రుపేంద్రేణ ప్రకాశతే......"

(ఎపిగ్రాఫియా ఇండికా, III వాల్యము. సత్యమంగళముప్లేటులు. 35 పుట)

పయిసందర్భమును బట్టియు వెనుకటి శాసనద్వయములో నున్న "నిజాగ్రజాత్ప్రాప్తఘనాద్రిరాజ్యః" అను వాక్యమును బట్టియుఁ, దచ్ఛాసనద్వికములోని ప్రతాపరాయలు ప్రౌఢదేవరాయల తమ్ముఁ డగు ప్రతాపదేవరాయలే గాని ప్రతాపదేవరాయనామాంతరము గలప్రౌఢదేవరాయలు కాఁ డని సిద్ధాంతిత మగుచున్నది. కాఁగాఁ గిరీటధారి యగువిజయనగరచక్రవర్తి విరూపాక్షరాయలు ప్రౌఢదేవరాయలతమ్ముఁ డగుప్రతాపదేవరాయలపుత్త్రుఁ డని నిశ్చితమగుచున్నది.

# త్రిలింగము-తెలుఁగు-తెనుఁగు.

—♦ విద్యాప్రవీణ, బులుసు వేంకటరమణయ్యగారు, రామతీర్థము ♦—

మనము నివసించుచున్న యీయాంధ్రదేశమునకును, వాడుకొనుచున్న భాషకును "ఆంధ్రము-త్రిలింగము-తెలుఁగు-తెనుఁగు" అనువ్యవహారములు వాడుకలోను మాత్రమే గాక గ్రంథములయందును గన్పించుచున్నవి. ఈవ్యవహారములను విమర్శించుచుఁ జాలమంది విమర్శకులు తలకొకరీతి నభిప్రాయము లిచ్చియున్నారు. అందు "త్రిలింగము-తెలుఁగు-తెనుఁగు" అనువ్యవహారముల యాథార్థ్యమును దెలియపఱుచుటయే యీవ్యాసరచనమునకుఁ గల ముఖ్యాభిప్రాయము.

మూఁడుశివలింగములు మూఁడెడల సరిహద్దులు కల దగుట నీయాంధ్రదేశము త్రిలింగదేశ మని వ్యవహరింపఁబడుచున్న దని యు, "తెలుఁగు, తెనుఁగు" లీత్రిలింగముయొక్క వైకృతము లనియుఁ (అనఁగాఁ ద్రిలింగము నుండి తెలుఁ గుత్పన్నమైన దనియుఁ, దెనుఁగు తెలుఁగు యొక్క రూపాంతర మనియు) జాలమంది యభిప్రాయపడియున్నారు. ఆమూఁడులింగములఁ దెలియఁజేయుచు శబ్దరత్నాకరకారులు "శ్రీశైలదాక్షారామకాళేశ్వరములనడుమఁ గలదేశముగుట నియ్యది త్రిలింగ" మని చెప్పుచు—

క. శ్రీక్షితిధరకాళేశ్వర, దాక్షారామంబు లనఁగఁ దనరారెడు నీ
త్రిక్షేత్రంబులలింగము, లీక్షితిని ద్రిలింగసజ్ఞ నెన్నికకెక్కున్.

అని త్రిలింగనిర్వచనము చేసినయప్పకవిని

"శ్రీశైలదాక్షారామకాళేశ్వరమధ్యవర్తిత్వే నాంధ్రదేశస్య త్రిలింగదేశ ఇతి ప్రసిద్ధిః" అని వివరించిన యహోబలపండితుని బ్రమాణభూతులనుగా నిచ్చియున్నాఁడు. సంస్కృతమునఁ బ్రతాపరుద్రయశోభూషణ మనునలంకారగ్రంథమును రచించిన విద్యానాథమహాపండితుఁడు కూడ—

యై ర్దేశ స్త్రిభి రేష యాతి మహతీం ఖ్యాతిం త్రిలింగాఖ్యయా
తేషాం కాకతిరాజకీర్తివిభవైః కైలాసశైలాః కృతాః
తే దేవాః ప్రసరత్ప్రసాదమధురాః శ్రీశైలకాళేశ్వర
ద్రాక్షారామనివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయసే జాగ్రతు.

(ప్రతాపరుద్రీయమ్-నాటకోదాహరణమ్. 5 అంక 22 శ్లోక)

అని వర్ణించి పై యభిప్రాయమునే సూచించియున్నాఁడు. బాలవ్యాకరణ సుప్తార్థప్రకాశికాకారులు నీరీతినే చెప్పుచు నీశ్లోకముయొక్క వ్యాఖ్యను గూడ గ్రంథస్థము చేసియున్నారు. త్రిలింగమునుండి తెలుఁ గుత్పన్నమైన దనియుఁ, దెనుఁగు తెలుఁగు యొక్క రూపాంతర మనియు సుప్తార్థప్రకాశికాకారులు కూడ వ్రాసియున్నారు. మఱికొందఱు త్రిలింగమునుండి తెలుఁగుపుట్టలే దనియు 'ఉత్కలింగమునుండి యుత్కళము పుట్టినట్లే తలకళింగమునుండి తెలుఁగు పుట్టిన దని చెప్పుచున్నారు. కాని దానినివిశ్వసింపఁదగిన ప్రమాణములు లేవు.

ఇందు శ్రీశైలద్రాక్షారామములు ప్రసిద్ధము లగుటచే వానివిషయమై వివాద మక్కఱ లేదనియుఁ, గాళేశ్వరమనఁ బెద్దతిరుపతిచేరువఁగల సుప్రసిద్ధ క్షేత్ర మగు కాళహస్తియా, లేక మఱివేఱుగ నున్నదా! యని సందేహము కలుగవచ్చు ననియు నెంచి, "నామైకదేశే నామగ్రహణ"మ్మను న్యాయంబునఁ గాళహస్తీశ్వరుఁడే కాళేశ్వరుఁ డనియు, గాళహస్తియే కాళేశ్వర మనియు శబ్దరత్నాకరకారులును, సుప్తార్థప్రకాశికాకారులును సిద్ధాంతీకరించిరి, కాని, నిజాంరాష్ట్రమునఁ గలచాలభాగము తెలుఁగుదేశ మగుటచే దానింగూడఁ ద్రిలింగమునఁ జేర్చు' యుక్త మనియుఁ, ద్రిలింగవ్యవహారము దానింబట్టి యే వచ్చిన దనియు నిశ్చయించి నిజాంరాష్ట్రమునందలి మంథెన సమీపమునఁ గలకాళేశ్వరమునే కొందఱు గ్రహించిరి.

"మీఁద జెప్పఁబడిన మూఁడులింగముల నడుమఁ గలదేశమే త్రిలింగ (తెలుఁగు) దేశ మనియు, నందు వాడుకొనుభాషయే తెలుఁగనియుఁ జెప్పినచో, నీయెల్లలలోఁ జేరనట్టియు, గోదావరిజిల్లాలోని కొంతభాగమును, విశాఖపట్టణముజిల్లాయును, గంజాముమండలములోని కొంతభాగమును, జెంగల్పట్టుజిల్లాయందలి కొంత భాగమును, అనంతపురముజిల్లా బళ్ళారిజిల్లాలలోని సగము భాగమును, ఇంక నిట్టి చిన్నచిన్న తెలుఁగు భాగములు పరిమితికలిగినట్టియుఁ దెలుఁగుభాష వ్యవహరింపఁబడుచున్నట్టియు, భాగములు తెలుఁగుదేశమునఁ జేరకపోవచ్చును మఱియుఁ ద్రిలింగమనుపదము నన్నయభట్టారకాదిప్రాచీనులగ్రంథములలోఁ గనుపింపక కేవలము పదునాల్గవ శతాబ్దపు వాఁడగు విద్యానాథుని గ్రంథముననే గన్పడుటచే నిదివిద్యానాథునికల్పితసంజ్ఞయే యనిచెప్పనొప్పును. ఓరుగంటిరాజ్యమున మూఁడుదిక్కులయందు మూఁడులింగము లుండియుండవచ్చును. దానింబట్టియే యానడుమఁ గలదేశము త్రిలింగమని విద్యా

నాథమహాకవి కల్పించి యుండవచ్చును. కావునఁ బైకారణములచేతఁ ద్రిలింగమునుండి తెలుఁగు పుట్టినదని చెప్పరాదు. మనయాంధ్రదేశమునకుఁ దెలుఁగు దేశమని తొలుతనుండియు వ్యవహారము కలదు. ఆవ్యవహారము సంస్కృతములోనికి వచ్చుసరికి త్రిలింగమై సంస్కృతగ్రంథములలోని కెక్కినది. కాఁగా తెలుఁగునుండియే త్రిలింగము పుట్టినదని చెప్పవలె'' నని సుప్రసిద్ధవిమర్శకులును, జరిత్రకారులునగు, కీ. శే. కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుపంతులుగారొకవ్యాసమును వ్రాసియుండిరి.

లక్ష్మణరావుగారిసిద్ధాంత మన్నివిధముల నూహకు సరిపడియున్నది. కాని విద్యానాథుఁడే త్రిలింగమనువ్యవహారమును గల్పించె ననుటకు మాత్రము ప్రబలప్రమాణము కానరాదు. నన్నపార్యాదులు కేవల వేంగీమండలాధీశ్వరులు మొదలగువారి యాస్థానములం దుండుటచే ద్రిలింగము మొత్తము విషయమై వారు ప్రస్తావించి యుండకపోవచ్చును. నేఁటివఱకు వెలువడిన వాఙ్మయ మంతయు మనకు లభించియుండదు గదా! లభింపనిగ్రంథములలోఁ ద్రిలింగవ్యవహార ముండిన నుండవచ్చునుగదా ! మఱియు విద్యానాథుఁడు "యైర్దేశస్త్రిభిరేష యాతి మహతీం ఖ్యాతిం త్రిలింగాఖ్యయా" అని త్రిలింగమను వ్యవహారము చాలదినములనుండి వచ్చుచున్నదిగా నిరూపించుటచే నావ్యవహారము విద్యానాథకల్పిత మనియే చెప్పవలనుపడదుగదా !
ఇంకను బ్రహ్మాండపురాణమునందలి

''శ్రీశైలభీమకాళేశ మహేంద్రగిరిసంయుతమ్ ।
తత్కాలప్రభృతిక్షేత్రం త్రిలింగ మితి విశ్రుతమ్ ''

అను శ్లోకముంబట్టి త్రిలింగవ్యవహారము చాలకాలమునుండి వచ్చుచున్నట్లు తెలియుచున్నది. పురాణము లనేకము లగునసంగతములతోఁ గూడియుండుటచే వానిని బ్రమాణముగ గ్రహింపఁగూడ దనులక్ష్మణరావుగారును బ్రహ్మాండపురాణము A. D. 14 వ శతాబ్దమునకంటెఁ బ్రాచీన మైనదని యొప్పుకోవలెను. పురాణము లన్నింటిలోను బ్రహ్మాండపురాణమే ప్రాచీనతమ మైనదని శ్రీలక్ష్మణరావుగారి సిద్ధాంతము కూడను. కావునఁ దెలుఁగుదేశమునకుఁ ద్రిలింగదేశ మనువ్యవహారము విద్యానాథునికిఁ జాలపూర్వమునుండియు నుండిన దని చెప్పవలెను. కాఁగా "త్రిలింగమునుండి తెలుఁగు పుట్టిన" దనుట కొక యాధారము లభించినది.

ఇట్లు త్రిలింగమునుండి తెలుఁగుపుట్టినదని యంగీకరించినను త్రిలింగములనునవి మీఁదిరీతిని శ్రీశైల ద్రాక్షారామ కాళేశ్వరములే యైనచోఁ దక్షిణతెలుఁగుదేశపు టుపపత్తి యాలోచనీయమే యైయున్నది. కాన నాత్రిలింగము లనునవి యేవో ప్రకారాంతరమున నిర్ధారణ చేయవలెను. అట్లు నిర్ధారణ చేయుటలో మిక్కిలిగా నుపకరించు తెనుఁగును విమర్శించినచోఁ ద్రిలింగములయంశమును దేటపడును కావునఁ దొలుత దానిని విమర్శింతము.

త్రిలింగభవ మగుటవలనఁ దెలుఁగు దేశ మనుట సరియగును. కాని, విలక్షణముగఁ దెనుఁగనువ్యవహారము కనుపించుటచేఁ దెనుఁగునకుఁ గూడ నొకప్రకృతి యుండవలెను. త్రిలింగము తెలుఁగైనరీతిఁ ద్రినగము తెనుఁగగుట యుక్తియుక్తముగ నున్నది. మఱియుఁ ద్రిలింగతద్భవ మగు తెలుఁగుయొక్క రూపాంతరమే తెనుఁగనుటకంటెఁ ద్రినగశబ్దభవమే తెనుఁ గనిన లాఘవము కలదు. ఈరీతివాదము లిదివఱకున్నట్లు గుప్తార్థప్రకాశికాదిగ్రంథములంబట్టి తెలియుచున్నది.

తెలుఁగులో వలెనే తెనుఁగు నందును బిందువు కనుపించుటచేతను, త్రినగములో లేని (ప్రకృతి) బిందువు వికృతిలోఁ గన్పింప నవకాశము లేకుండుటవలనను, త్రిలింగోత్పన్న మగు తెలుఁగు రూపాంతరమే తెనుఁగనుట పాడియే యగునని కొందఱు వాదింపవచ్చును. కాని యదియుక్తిదూరము. వికృతియందు బిందు వున్నచోఁ బ్రకృతియందును బిందు వుండవలె నను నియమము లేదు. అట్లు ప్రకృతిలో బిందువు నొందక, వికృతియందు బిందువును బొందు రూపము లనేకములు కనుపించుచున్నవి.

| ప్రకృతి - నిరనుస్వారము. | వికృతి - సానుస్వారము. |
|---|---|
| పీఠము | పీఁట |
| పూగము | పోఁక. |
| వ్యాఘ్రము | వేఁగి. |
| వైశాఖము | వేసఁగి. |

కావునఁ ద్రినగశబ్దమునుండియే తెనుఁగుపుట్టిన దని చెప్పవచ్చును. ఇఁకఁ దెలుఁగు, తెనుఁగులు పరస్పరపర్యాయపదము లగుటచేఁ ద్రిలింగ, త్రినగములు రెండింటికిం గూడఁ బరస్పరసంబంధ ముండవలయును. అనఁగాఁ ద్రిలింగములుండుచోటఁ బ్రసిద్ధము లగుమూఁడుకొండలు కూడ నుండితీరవలె

ను. ఇదివఱకుఁద్రిలింగము లనివ్యవహరింపఁబడు వానిలో ద్రాక్షారామమునఁ బ్రసిద్ధికెక్కిన పర్వత మేదియును లేకపోవుటచేఁ ద్రిలింగములలో నది యొక టనిచెప్పవీలుపడదు. ఇంకను ద్రాక్షారామమును సరిహద్దుగా నంగీకరించినచో గోదావరిలోసగము, విశాఖపట్టణము, గంజాములోనిసగము మండలములు తెలుఁగుదేశము కాకపోవచ్చును. కావున నీకారణముచేతం గూడ సరిహద్దును బొడిగింపకతప్పదు. అట్లు పొడిగింపనెంచిన మీఁద—

"శ్రీశైలభీమకాళేశ మహేంద్రగిరిసంయుతమ్ ।
తత్స్థాలప్రభృతిక్షేత్రంత్రిలింగమితివిశ్రుతమ్॥"(బ్రహ్మాండపురాణము)

అనువచనప్రామాణ్యమునఁ ద్రిలింగములలో గంజాముమండలము నను మఁగల మహేంద్రగిరియొకటి యని నిశ్చయింపవచ్చును. మహేంద్రగిరికూడఁ బ్రసిద్ధికెక్కిన శివక్షేత్రము. శివరాత్రి మొదలగు గొప్పయుత్సవములకు వేన వేలు యాత్రికులు నింగినంటు నామహేంద్రగిరి నెక్కి దేవదేవుని దర్శింతురు. కాఁగా మహేంద్రగిరి త్రిలింగములలో నొకటి యని నిశ్చయింపవచ్చును. కానఁ బ్రసిద్ధ మగుపర్వతమును, శివక్షేత్రమును గలచోటే త్రిలింగములలో లెక్కకు రావలెను. తక్కిన శ్రీశైల- కాళేశ్వరములు ప్రసిద్ధపర్వతములును, శివలింగములును గల వనుట నిర్వివాదాంశము.

ఆత్రిలింగములఁబట్టి తెలుఁగను వ్యవహారమును, త్రినగములంబట్టి తెనుఁగను వ్యవహారమును గలిగిన దని తుట్టతుదకుఁ దేలిన సారాంశము.

తారానాథుఁ డనుబౌద్ధగ్రంధకర్త తెలుఁగుదేశమునకుఁ ద్రిలింగ మను నామధేయము కలదనియుఁగళింగము దానిలో (తెలుఁగు) నొకభాగ మనియుఁ జెప్పియుండుటచేఁ గళింగము తెలుఁగులోఁ జేర్చుట దోస మని భ్రమింప రాదు. కాళేశ్వర మనఁగా నిజాంరాష్ట్రమునందలి దనియే చెప్పవలెను. కావు న నిజాంరాష్ట్రమునందలి తెలుఁగుదేశము త్రిలింగములోఁజేరఁగలదు. కర్నూ లుజిల్లాలోని శ్రీశైలమును గ్రహించుటచే నించుమించుగ నదితెలుఁగు దేశ మున కొకచివర యని చెప్పవచ్చును. హద్దుదాఁటినపిదపఁ గొంచెము తెలుఁగు దేశముండవచ్చును. హద్దనఁగా నించుమించుగా హద్దనియే తాత్పర్యము. కావున బళ్లారిలో సగముభాగముకూడఁ దెలుఁగులోఁ జేరవచ్చును. ఇంచుమిం చుగా హద్దని గ్రహించుటచేతనే గంజాముమండలములోని ఛత్రపురపర్వం తము తెలుఁగుదేశమే యని గ్రహింపవలయును.

ఇఁకవిద్యానాథకవిసార్వభౌముని యుక్తిని విమర్శింపవలెను. శ్రీలక్ష్మణరావుగారు వ్రాసినట్లు కాకతీయసామ్రాజ్యమునకు మూఁడునైపులఁగల క్షేత్రములను హద్దులుగా నిర్ణించుకొనెను, గాని, యుపపత్తి నాలోచించి కాదు. అతనిమతమే నిశ్చయ మని యంగీకరించినచో నం దంతర్భవింపని తెలుఁగుదేశము తెలుఁగుదేశమే కాకపోవలసివచ్చును.

కావున నీపైకారణములవలనఁ ద్రిలింగమునుండి తెలుఁగు, త్రినగమునుండి తెనుఁగు పుట్టినవనియుఁ, ద్రిలింగత్రినగములకు సంయోగసంబంధము కలదనియుఁ, లింగ, నగము లొకచోట ప్రసిద్ధము లగునవి యుండుస్థలములే త్రిలింగదేశపుటెల్లలను నిశ్చయింప నుపయోగించు ననియు నాయాశయమును దెలియఁజేయుచున్నాను.

## జయాశీర్వాదము.

—♦ కావ్యకళానిధి శతావధాని చిదంబరశాస్త్రిగారు, పిఠాపురము ♦—

ఉ. సత్యమునందు నిల్చి నిజసత్త్వముఁ బాదుకొనంగఁజేసి దా
ర్ఢ్యము రూపుమాపి మతిమంతుల శ్లాఘలకెల్లఁ బాత్రమై
నిత్యము ధర్మనిర్వహణనీతి నెసంగుచునుండు నాంధ్రసా
హిత్యసభాసతీమణికి నీశ్వరుఁడభ్యుదయం బొసంగుతన్.

సీ. గ్రాంథికభాషాపరంజ్యోతి నెఱుఁగ నాంధ్రనిఘంటుబోధ మేర్పఱిచినావు
గ్రామ్యవాదకుభృన్నికాయంబు నడఁగింపఁ బత్త్రికాభిదుర మేర్పఱిచినావు
ప్రజ్ఞావిలోకనప్రాభవం బొదవ సద్గ్రంథాంజనంబు లేర్పఱిచినావు
విద్యాభిరుచిసుధావిర్భావ మెసఁగ నుపన్యాసవార్ధు లేర్పఱిచినావు
ఆంధ్రదేశశుభాభ్యుదయంబుకొఱకు, నిజకృపాసారమును గరుణించినావు
నీకుఁ బూర్ణాయువిడుఁగాత లోకసాక్షి, యాంధ్రసాహిత్యపరిషదార్యామతల్లి.

సీ. ప్రాచీనధర్మసంరక్షణక్రమమందుఁ బూర్ణమైనవ్రతంబుఁ బూనినావు
భాషావిశేషానుపాలనంబునయందుఁ గంకణంబును గేలఁ గట్టినావు
ఆంధ్రదేశమహోదయాపాదనమునందు నెనలేనిదీక్ష వహించినావు
గ్రామ్యభాషానిరాకరణకార్యమునందు దిట్టమైనప్రతిజ్ఞ వట్టినావు
ఆంధ్రమసిమెఱుఁగిడి నామమే యంతరించు, కాలమున నడ్డుపడి నిల్పఁజాలినావు
నిత్యకళ్యాణివై నీవు నెగడుమమ్మ, యాంధ్రసాహిత్యపరిషదబ్జాయతాక్షి!

# బేరిజు పద్యములు.

— విస్సాప్రగడ కామరాజకవి. —

ఉ. శ్రీవెలయంగ హస్తమున జింక చెలంగ శిరంబుమీఁదఁ దా
రావిభుఁ డింపెసంగ నగరాజతనూభవ మై వెలుంగ రా
జీవభవాబ్జలోచనులు చెంగట మ్రొక్కులిడంగ నొప్పు న
ద్దేవుఁడు భక్తరక్షణుఁడు తెల్లనివేలుపు మమ్ముఁ బ్రోవుతన్. ౧

మ. కరపద్మంబునఁ బువ్వబంతివలె శంఖంబు వ్వతిల్లంగ నా
సిరి మాణిక్యమురీతి వక్షమున భాసిల్లంగఁ బైమీఁద బం
గరునిగ్గు ల్గలవల్వ కేలుకరణిం గ్రాలంగ శోభిల్లుఁ దా
మరసాక్షుండు దయాసముద్రుఁ డగుచు న్మమ్ముం గటాక్షించుతన్. ౨

చ. అమరనుతప్రసంగునికి హంసతురంగునికి న్సరస్వతీ
కమలముఖీమణీహృదయకంజపతంగునికి న్మహోజ్జ్వల
ద్విమలదయాంతరంగునికి దివ్యశుభాంగునికి న్గరారవిం
దములు మొగిడ్చి మ్రొక్కెద ముదంబున ధాత్రిఁ జిరాయు వొందఁగన్. 3

చ. కరకమలంబు లెత్తి యొడికంబుగ మ్రొక్కి నుతింతుఁ బార్వతీ
శ్వరులతనూజునిం గనకసన్నిభతేజునిఁ బద్మసంభవాం
బురుహనిభాక్షముఖ్యసురపూజితపాదపయోజు నుజ్జ్వల
త్పరమదయాకటాక్షపరిపాలితభక్తసమాజు నర్మిలిన్. ౪

చ. కవులకుఁ బాదభక్తులకుఁ గల్పమహీరుహవల్లి కేకిసైం
ధవునికిఁ గన్నతల్లి గిరిధన్వికిఁ బద్మముఖీమతల్లి కే
శవునివెలందికి న్నలువసారసగంధికి నల్లిబిల్లి మై
యవని వెలుంగు గౌరి యనయంబు మముం గృపఁజూచి ప్రోవుతన్. ౫

చ. విరివిలుకానియమ్మ యరవిందదళాక్షునిముద్దుగుమ్మ క
ర్బురగిరికార్ముకాంబురుహభూతపయోధరవాహముఖ్యని
ర్జరులను బ్రోచుకొమ్మ బహుసంపద లిచ్చు పసిండిబొమ్మ స
త్కరుణవహించి మాభవనకంజమునందు వసించుఁగావుతన్. ౬

చ. అతికరుణాలసన్మతికి హాటకశైలధనుర్ధరాది దై
వతనుతసద్గుణోన్నతికి వారిజపుస్తకవల్లకీకళా

రతికి సరస్వతీసతికి రాజపటీరతుషారహారగౌ
పతితరుసన్నిభాకృతికి భారతి కంజలి చేసి మ్రొక్కెదన్. ౭

క. రామునిశిష్యుం డగు నా, రామునికథ లుర్విమీఁద రంజిల శ్రీమ
ద్రామాయణంబు చెప్పిన, యామునివల్మీకభవుని నాత్మఁదలంతున్. ౮

ఉ. చారుతరప్రభావిజితశక్రమణిం గలుషప్రభంజన
క్రూరఫణిన్ సుపర్వమునికుంజరనేత్రచకోరపూర్ణనీ
హారఘృణిం బరాశరసమాఖ్యమునీంద్రతనూభవాగ్రణిం
గూరిమితోడ నాహృదయకోకనదంబున నిల్పి మ్రొక్కెదన్.

ఉ. భాసురకీర్తిశాలి యగు భారవికిన్ భవభూతికాళికా
దాసమయూరచోరులకు దండికి బాణునకిన్ బ్రియంబున
వ్యాసిగనామనోజ్ఞమున వందనము ల్పదివేలొనర్చి నేఁ
జేసితిఁ బద్యముల్ రసికజిహ్వాలయందు నటింపుచుండఁగన్. ౧౦

క. ము న్నెన్నఁబడినకవులకు, నన్నయ్యకు శంభుదాసునకుఁ దిక్కనకుం
జెన్నొందు భాస్కరునకు, సన్నించి నమస్కరింతు మత్కృతి వెలయన్. ౧౧

ఉ. కొన్ని తెనుంగుఁగబ్బములు గూర్చినవారల కల్లసాని పె
ద్దన్నకు సింగసానిసరసన్నకుఁ బిల్లలమర్రి చిన్నవీ
రన్నకు నందితిమ్మనకు హర్షమెలర్పఁగఁ గూచిమంచి తి
మ్మన్నకు జగ్గనార్యునకు హస్తసరోజము లెత్తి మ్రొక్కెదన్. ౧౨

ఉ. మన్ననచేసి మ్రొక్కి పలుమాఱు మదిం బ్రణుతింతు భాగ్యసం
పన్నుని వీరరాఘవునిపట్టి యశోజితపూర్ణచంద్రు వి
ద్వన్నుతశీలు మద్గురు నుదారగుణాఢ్యుని జెట్టురాతి ల
క్ష్మన్నను రాజపూజితుని నాంధ్రకవిత్వకళాధురీణునిన్. ౧౩

సీ. మున్నుజమీందారి తాలుకలాయిపాకుల యందంబులెచ్చఁగ న్నాయంగ నేర్చి
పొగడొందు(నట్టే)మా భూసురోత్తములకు నాగవరపు వేంకటాహ్వాయునకు
వినుతశీలుఁడు కంచి వేంకటరామన్న కలరావికంటిజగ్గప్పమణికి
భాసిల్లు తుమ్మలపల్లియంతన్నకు శ్రీకోటభానయ్యశేఖరునకు
ధీసమన్వితకూరాడతిరుపతయ్యకుఁ, జిత్తమునహస్తకమలంబులెత్తి మ్రొక్కి
ప్రతిదినముఁ గౌతుకంబునఁ బ్రస్తుతింతు, వారికృపచేత నాకవిత్వము వెలుంగ

చ. బకములు హంసము ల్గగనభాగమున న్విహరించు కైవడిం
గుకవులు సత్కవీశ్వరులఁ గూడుచు రా సభలందుఁ గావునం
గుకవులకుం గవీంద్రులకుఁ గూరిమితోడ నమస్కరించెద
న్సకలజనాభిరమ్యముగఁ జల్పినమత్కృతి విస్తరిల్లఁగన్. ౧౭

గీ. మీఁదఁగలజీడిదీసి మామిడిఫలంబు, రసము గ్రోలెడుచందాన రసికజనులు
తప్పువిడనించి నాకవిత్వమునఁ గల్గు, సుగుణసముదాయ మెంతురు చోద్యమలర

వ. అని యిష్టదేవతానికరంబునకుఁ గవిజననికరంబునకు డెందంబున వందనంబు గావించి శ్రీమదీయమందిరంబున స్వేచ్ఛావిలాసంబుల విహరించుచున్న నొక్కనాఁడు రాత్రి సంధ్యాకాలంబునఁ బాదప్రక్షాళనంబు చేసి ధౌతపరిధానం బవలంబించి పద్మాసనంబునం బ్రాఙ్ముఖుండనై యాచమనంబొనరించి సంధ్యావందనంబు దీర్చి నామనఃపద్మంబునఁ గొంతసేపు మహేశ్వరధ్యానంబు గావించి మృష్టాన్నంబులు భుజియించి యాతట లేచి హస్తాబ్జంబు నీరార్చి గండూషంబు లొనర్చి శుద్ధాచమనంబు గావించి యంతఃపురంబున కేఁగి కార్పాసతూలికాతల్పంబున నత్తమిల్లి కర్పూరతాంబూలభాసురవదనారవిందుండనగుచు సుఖగోష్ఠిం గొంతప్రొద్దుపుచ్చి యున్మీలితలోచనుండనై యుండక నిద్రించుసమయంబున, ౧౮

సీ. వజ్రపుసరిఫేషువలె మస్తకంబునఁ గలువలపాసుపాకళి వెలుంగ
సొగసైనకుంకుమచుక్క తెఱంగున శుక్రుండు నుదుటిపై శోభిలంగ
బలభేదినీలంబుపగిదిఁ గంఠమునందు డంబైనగరళకూటంబెసంగ
విరిసిన మల్లెక్రొవ్విరిదండకైవడి ఫణిరాజు బొజ్జపై భాసిలంగ
మించువెలియాలరాతేజి మీఁదనెక్కి, సకలకల్మషహరుండు శంకరుండు
శీతలగ్రావపుత్రీసమేతుఁ డగుచు, నవ్వుమనువచ్చి నామ్రోల నివ్వటిల్లె ౧౯

క. మినుసిరదొర యివ్విధమునఁ, గనుపట్టినఁ గేలుదమ్మిగవ ముకుళింప
న్ననుఁ జూచి యానతిచ్చెను, మనమునఁ గౌతూహలంబు మఱియుంబొందన్.

గీ. సుజనహితుఁడగు మీతండ్రి జోగిరాజు, పూజ గావించె మత్పదాంభోజయుగళి
చేడియలు మెచ్చ మీతల్లి చెల్లయాంబ, పార్వతీపూజ గావించెఁ బ్రతిదినంబు.

క. మీయన్న యెపుడుమిక్కిలి, మాయందున్ భక్తిగలిగి మానసపూజల్
చేయుచును బైఁడిపువ్వులు, చేయించెను భక్తజనులు సెబాసనఁగన్. ౨౦

క. కావున నను మీమందిర, దేవునిఁగా మదిఁ దలంచి ధీయుతు లెన్న
నీవానరించెదు కబ్బము, గావింపుము కాన్క నేఁడు గైకొందుఁ గృపన్. ౨౨

క. తలిరువలె సువ్యక్తోర్వీరి, వలె నవనీతంబువలె దవనమార్దవమై
విలసిల్లు నీకవిత్వము, చెవులకు మాకర్ణనంబు సేయుకుమారా. ౨౩

చ. అన విని మేలు కాంచి హృదయాబ్జమునందు నమస్కరించి స
జ్జనులకు నిత్తెఱంగు రభసంబునఁ దెల్ప దయాంతరంగులై
నినుఁ గరుణింపవచ్చు నలనీలగళుం డని వారు వల్కినన్
మనమున సంతసిల్లి కృతినాథునిఁ జేసితి విశ్వనాథునిన్. ౨౪

వ. అనంతరంబ మదీయ వంశావతారం బభివర్ణించెద. ౨౫

క. వనజభవసముఁడు కశ్యప, మునికులమునఁ బుట్టెఁ బాలమున్నీటను గ్రొ
న్ననవిల్తుమామ కైవడి, జనమాన్యుఁడు జోగిరాజు సద్గుణమణియై. ౨౬

చ. సకలనృపాలపూజితుఁడు చంద్రసమానయశోధనుండు పా
వకరవిసన్నిభప్రభుఁడు వైరిపయోజగజేంద్రుఁ డబ్జసా
యకరిపుపాదపంకజసమర్పితకోమలచిత్తవృత్తుఁడై
సుకవులు మెచ్చ రంజిలెను జోగయమంత్రిపురందరుం డిలన్. ౨౭

సీ. తెలివేల్పుసన్నిధి దీపము ల్వెలిఁగించుఁ గుటిలచిత్తులమీఁదఁ గోపగించుఁ
బెద్దలకట్లఁ జెప్పినమాట జరిగించు బీదవారలలేమి వెల్లగించు
సరవి బంధువులింట సంపద లలిగించు శివకథల్ హరికథల్ చిత్తగించుఁ
గడువేడ్క బహురాజకార్యము ల్పొసఁగించుఁ బగరైననృపులపైఁ బంతగించు
నరులు గొనివచ్చి తనజేవి కప్పగించు, నర్థి కాపద రాకుండ నడ్డగించు
భూసురుల నెల్ల నేప్రొద్దుఁ బుజ్జగించు, సుజను లెన్నంగ వెలుఁగొందు జోగిరాజు.

క. రసికుఁడగు జోగిమంత్రికి, బిసరుహరిపుబింబవక్త్ర పేరాంబికకుం
గుసుమశర సన్నిభాంగుఁడు, బసవామాత్యుండు గలిగె భాగ్యాన్వితుఁడై

చ. శుభచరితుండు నిర్మలయశోజితచంద్రుఁడు సూర్యసన్నిభ
ప్రభుఁడు సుధీమరుద్గురుఁడు బంధుచకోరవిధుండు సత్కళా
విభవచతుర్ముఖుండు పృథివీవరకార్యధురంధరుండు నై
యభినవలీల నొప్పె బసవాహ్వయమంత్రిసురేంద్రుఁ డిమ్మహిన్. ౩౦

సీ. కనికరంబున నుపాకన్యాధిపునితాత భాసిల్లుమాతాత బసవరాజు
క్షితి శూరతకుఁ బరీక్షిన్నరేంద్రునితాత భాసిల్లుమాతాత బసవరాజు

అసమానధృతికి సవ్యసుకృపాలునితాత భాసిల్లుమాతాత బసవరాజు
నలువొందు తేజంబునకు యుధిష్ఠిరుతాత భాసిల్లుమాతాత బసవరాజు
భూరిగాంభీర్యమునకు సద్బుధునితాత, బుద్ధికలితకు జాంబవత్పుత్రితాత
కడుమహాభోగములకు నంగదునితాత, పరిఢవిల్లెడి మాతాత బసవరాజు

క. బసవామాత్యశిఖామణి, యసమానగుణాన్వితాత్మ నన్నమ్మను బెం
పెసఁగఁ గరగ్రహణంబై, వసుధాధిపు లెన్న వెలసె వడిగలవాఁడై. ౩౨

సీ. సోమశేఖరునైనమోముల తెలుఁగువఁ గల్పభూరుహపంచకము విధమున
నబ్జముఖీరత్నమగు నన్నమాంబకు శ్రీబసవామాత్యశేఖరునకుఁ
గూర్మినందను లైదుగురు జనించిరి వధూపంకజాతశరుండు శంకరుండు
సుగుణవారిధిరాజు జోగిరాజు విభావరాజితగ్రహరాజు రామరాజు
పృథువచోజితఫణిరాజు పేరరాజు, కలితధీరత్వగిరిరాజు గంగరాజు
సుజనమిత్రులు వారిలో జోగిరాజు, రాజుచేనిమ్మపం డనఁ దేజరిల్లు. ౩౩

చ. మతికిఁ జతుర్ముఖుం డనఁగ మాటలకున్ ఫణిరాజనంగ ధీ
రతకు గిరిప్రభుం డనఁగ రమ్యతరాకృతికిన్ హరిప్రియా
సుతుఁ డనఁగన్ గభీరతకుఁ జుక్కలఱేఁ డగురుం డనంగ భూ
పతులసభాంతరాళముల భాసిలు జోగయమంత్రిరత్నమై. ౩౪

సీ. ఏసుందరాంగి ధాత్రీసురాంగనలకు నొసలఁ గుంకుమబొట్టు లొసంగుచుండు
నేపద్మగంధి గౌరీపదాబ్జములకుఁ జిత్తాబ్జమునఁ బూజ సేయుచుండు
నేమీనలోచన యొలమి నోములు నోఁచి విప్రుల కన్నంబు వెట్టుచుండు
నేబాల చేడియల్ చేబాసనంగను గాటంపు పతిభక్తి గలిగి యుండు
నేజలజపాణి శ్రీభావ (మెసఁగ) నరవ, రాజమంత్రికిఁ బుత్త్రియై తేజరిల్లు
నట్టిశుకవాణి జోగయ్యయనుఁగురాణి, చెలఁగు సద్గుణనికురుంబ చెల్లమాంబ

సీ. ఉదయాద్రి రవిచంద్రు లుదయించుకైవడి జలజాక్షునకు సరోజాతభవుఁడుఁ
గమ్మవిలుతుఁడును గలుగువిధమ్మున రాజమాన్యుఁడు జోగిరాజునకును
మానవతీలలామము చెల్లమాంబకు భ్రాజితగ్రహరాజు బసవరాజు
కామరా జనుపేరు గలవాఁడ నగు నేను బురవైరిపదభక్తిపుంగవులము
చారుసద్గుణమాణిక్యసాగరులము, సుజనహితులము సత్కళాశోభితులము
శ్రీసమన్వితరాజపూజితుల మగుచుఁ, గలిగితిమి తల్లికన్నుల కఱవుదీఱ.

క. రాజశ్రీ బిరుదాంకుఁడు, రాజీవనిభాననుండు రజతాద్రిమహో
ద్భ్యాజకవిసమసమాఖ్యుఁడు, రాజిలు మాయన్న బసవరాజాహ్వయుఁడై.

ఉ. అందమెఱింగి పాకెఱిఁగి యందఱ కింపొనరించుకల్పనల్
పొందుగ లెక్కవ్రాయుఁగలపూజ్యుఁ డితం డని మేదిని న్సురు
ద్బృందముచే మహీవరుల బృందముచే నుతికెక్కి మించె న
న్నందరధీయుఁడుఁగా బసవమామ్మంత్రిశిఖామణి యివ్వసుంధరన్. ౩౮

సీ. సోయగంబునకు నచ్యుతుతలోదరి యన్న భాసిల్లు మాయన్న బసవరాజు
సత్యంబునకు నభస్వత్కుమారుని యన్న భాసిల్లు మాయన్న బసవరాజు
నలువొందువిభవంబునకుఁ గుబేరుని యన్న భాసిల్లు మాయన్న బసవరాజు
కలితసత్కళలకుఁ గార్తికేయుని యన్న భాసిల్లు మాయన్న బసవరాజు
ప్రబలబుద్ధికి నలవీరభద్రునన్న, మహితదాతృత్వమునకు ధర్మజుని యన్న
ధీరతకు శూలికట్టపుదేవి యన్న, పరిఢవిలుచున్న మాయన్న బసవరాజు.

క. శివపాదకమలభక్తుఁడ, నవనీరజముఖుఁడఁ జంద్రనగధీయుఁడ నేఁ
గవివిద్వద్వదనాంబుజ, రవి విస్సాప్రెగడ కామరాజాహ్వయుఁడన్. ౪౦

—♦ షష్ఠ్యంతములు ♦—

ఉ. రాజకళావతంసునికి రమ్యయశోజిత కౌముదీమహో
ద్భ్యాజఫణీంద్రహంసునికి భూరికృపారసదృష్టిపాలిత
భ్రాజితభక్తవర్గునికి భర్గునికిన్ ముఖనిర్జితాబ్జసం
కేజునికిన్ నతాజునికిఁ గిల్బిషహర్తకు లోకహర్తకున్ ౪౧

చ. వరకరుణాంతరంగునికి వార్ధినిషంగునికిం దరస్వీక
ర్బ్బరభుజగర్వభంగునికి భూరిసితాంగునికిన్ సమస్తని
ర్జరనుతపుణ్యసంగునికిఁ జారుపదాబ్జసమర్చితాష్టది
క్పరివృఢచిత్తభృంగునికి గపర్దికిన్. ౪౨

ఉ. ఈశునికి న్సమస్తభువనేశునికిన్ శతకోటిసూర్యసం
కాశునికిన్ గిరీశునికిఁ గర్మవినాశునికిం గచీకృతా
కాశునికి న్సుకేశునికి గ్రావనివేశునికిం గృతాంత
నాశునికిన్ హతప్రమదనాగబలాశునికిం ద్రిశూలికిన్ ౪౩

చ. వనజదళాక్షమిత్రునికి వారిజనేత్రునికిన్ సుభద్రప
త్రునికి దికళత్రునికి దుర్భరదోష వనోగ్రవీతిహో

త్రునికి నసంగశత్రునకుఁ దోయజసంభవముఖ్య దేవతా
వినుతలసచ్చరిత్రునికి విస్మయగాత్రునకిం బురారికిన్. ౮౩

చ. హరునకుఁ ద్రి　　　　　భిదాదినిలింపచిత్తమం
దిరునకు దివ్యకాంతిజిత దేవనదీకుముదాబ్జభార్గవీ
గురునకు శ్రీమహేశ్వరునకున్ మునిపుంగవలోచనాబ్జభా
స్కరునకు వేడ్క నర్పణము సల్పెద మత్కృతి తేజరిల్లఁగన్. ౮౪

చ. సురుచిరశోభనాకృతికి సూనృతవాక్తతికి న్మనోజ్ఞపు
ష్కరనయనాంఘ్రిజారతికిఁ జారులసద్ధృతికి న్మహేశవి
శ్వరనుత సద్గుణోన్నతికి శత్రుపయోజగజేంద్ర కాశికా
పురపతి విశ్వనాథునికి భూతసనాథునికిన్ హితంబుగన్. ౮౫

చ. సలలితమైన కాగితము పాకుతెఱంగు లెక్కింగి వ్రాయఁగా
వలయునటంచు మీకడకు వచ్చితి మిర్యగమంచుఁ జిత్రగు
ప్తులు వలుక న్వినాయకుఁడు భూరికృపారసదృష్టిఁ జూచి వా
రల కెఱిఁగించె నవ్విధము రంజిలఁ జేసెద నివ్వసుంధరన్. ౮౬

చ. వలగొని లెక్కపత్రములు వ్రాయుటకున్ బహుమార్గము ల్మహిం
గల వనుమాట నేనెఱిఁగి కల్పన చేసితి నొక్కపద్ధతిన్
సులభముగా సుధీజనులు చూచి గ్రహింప ననేకమార్గముల్
గలుగఁగ జాతివారిపుకు కాశికిఁ జేసినతోఁపకె వడిగా. ౮౭

సీ. ముద్దుగుల్కెడు జింకె మునదరు బింతీలు నవ్యశాఖావితానములుగాఁగ
విరివిగా నచ్చోట విలసిల్లు తబిసీళ్ళు దట్టమై తనరిపత్రములు గాఁగ
విబుధు లెన్నం దగు విశదాంకురంబులు వికసించునట్టి క్రొవ్విరులుగాఁగ
లతులకోలఁదిచాలంగును నెలబారు పరిపక్వఫలకదంబములుగాఁగ
ధరణిలోపల మందారతరువువోలెఁ, గాగితపులెక్కపత్రంబు పాకెఱిఁగి
వ్రాయఁగాఁదగు నదివ్రాయు వారికెల్ల,నీప్సితార్థంబు లొనగూర్చు నిదిఁ జంబు.

సీ. దొరగారినామంబుతో నుల్లసిల్లంగ సంవత్సరంబుతో సంధిలంగఁ
దగుమాసతిథివారతతులతోఁ జొనుపంగఁ దులలేని మద్దులతోఁ జెలంగ
గాముగానాలతోఁ గడు విరాజిల్లంగఁ దొడరి యాసామీలతో నెసంగఁ
దొరంపు తబిసీళ్ళతో నివ్వటిల్లంగ లావుబేరీజులతో వెలుంగ

సొనగు పెనుకొద్దిగట్లతో శోభిలంగ
వ్రాయవలె లెక్కపత్త్రంబు వ్రాసిరేని
నృపులు గని మెత్తు రదియెంత నిఖిలసురలుఁ
జూచి మది నగ్గడింతురు సొంపుగులుక. ౪౯

చ. మసదరు మస్తకం బగుచు మద్దు కరాబ్జములై జిలేలుపెం
పెసఁగు దుచమ్మ కన్నులయి యింపెసలారు రకార లంఘ్రులై
యసదృశ మైనబిత్తి నడుమై తగు నంకెలు మంజులోక్తులై
పొసఁగును లెక్కపత్త్ర మనుపూర్ణసుధాకరసన్నిభాస్యకున్. ౫౦

చ. సిరులు లభించుఁ బుణ్యములు చెంతవసించు నృపాలకోటిస
త్త్వరుణఘటించు శత్రుజనదర్పము లెల్ల హరించు సౌఖ్యముల్
విరివిగ సంభవించుఁ గడు వేడ్క మనోరథము ల్ఫలించు నా
వరుసను లెక్కపత్త్రములు వ్రాయుసమర్థుల కివ్వసుంధరన్ ౫౧

సీ. సిరి యనుగల్వక్రొవ్విరికిఁ బున్నమనాఁటి పరిపూర్ణచంద్రబింబం బనంగఁ
దగుమనోరథమిళిందములకుఁ శాకశాసనభూజపుష్పగుచ్ఛం బనంగ
నిబిడదరిద్రతాసిరేజపాళికి రాణించుమదకుంజరం బనంగ
వితతవిపత్తిదర్వీకరశ్రేణికిఁ గమలలోచనతురంగం బనంగఁ
దేజరిలు లెక్కపత్త్రంబు దీనిమహిమ, నలువ కైనను వర్ణింప నలవి గాదు
చెప్పఁబూనితినాకుఁ దోఁచినవిధంబు, రసికజనులార మీదయూరసమునొంద

ఉ. ఎన్నికఁ జెందినట్టిఘను లెన్నితెఱంగు లెఱింగియుండినం
గొన్నితెఱంగు లేర్పఱిచి కొన్నితెఱంగులు దెల్పుచున్న వా
రన్నితెఱంగులందు నసమర్థు లటన్నప్రసిద్ధివచ్చు నం
చున్నతెఱంగు లన్ని విబుధోత్తము లెన్నఁగ నేర్పరించెదన్. ౫౩

ఉ. కొందఱు పాకపద్ధతియుఁ గూర్మి నెఱుంగ రెఱింగిరేని వా
రంద మెఱింగి వ్రాయవలె నంచు నెఱుంగ రెఱింగిరేని మె
చ్చం దగినట్టి కల్పనలు సల్పనెఱుంగరు వానిపద్ధతుల్
పొందుగ నెల్లవారలకు బోధపడన్ రచియింతు నిమ్మహిన్. ౫౪

కం. అందము లెఱిఁగినకల్పన, చందము లెఱిఁగినను పాకసరియవిరామిన్
డెందమున బుద్ధిమంతులుముందుగపాకెఱుఁగవలయు మొదలిదిగనుకన్ ౫౫

సీ. సితమూఖు ల్మున్న రంజిలుచున్న... మొగలాయి పాకులెఱుఁగి
నిపుణులు వ్రాసిన నెలజమాఖర్చులు తెప్పించి వానిలోఁ దేజరిల్లు
బహుకల్పవలసొంపుఁ బరఁగుమద్దులయింపు బెనఁగొన్నతబిసీళ్ళ పెంపుఁజూచి
కడుసంతసిలి యందుఁ గలిగి వెలుఁగు చమత్కారములు కొన్నిమదిగ్రహించి
వన్నెమీఱంగఁ దమలెక్క వ్రాయుకొఱకు
ముందుఁ బొగడొందు పాకులు చెందియున్న
యందములు కొన్ని గొని యింకఁ బొందుపఱిచి
ఘారమను పాసగల్పింపఁ బ్రబలమయ్యె. ౫౬

సీ ఘర దరబంద నా బందులో సగమొప్పు బం దనంగను రెండు ఘరదులనఁగ
నలువొందుతాబులో నాల్గవపాలొప్పుఁ దాబులోసగ మరతాబు రెండు
బందులనంగఁ జెన్నొందుచుండుతాబు దనరారు రెండరతాబులనఁగ
నాలుగు బందు లనంగ భాసిల్లు మూఁడు బందు లనంగ ముబ్బందులనఁగ
బందుతక్కువయగుతాబు పరిఘవిల్లుఁ
జాలఁ దబిసీళ్ళువచ్చిన సమయమందు
నందమైయుండుఁ దాబు ముబ్బందనంగ
(నీవిధంబును) మతిమంతులెఱుఁగ వలయు. ౫౭

సీ. ...బైనయరబందు చెన్నొందు ఘరము నా ఘరదులు రెండొక్క బందనంగ
భాసిల్లు నవిరెండు బందులు జతగూర్ప నరతాబనంగ సొంపలరుచుండు
మూఁడుబందులుగూర్ప ముబ్బందనఁగనొప్పుఁదగు నాల్గుబందులు తాబనంగఁ
దాబులిర్వదినాల్గు దస్తాయనంగను దళుకొత్తుఁ బదిరెండు తాబులైనఁ
దనరు నరదస్తయని యాఱు తాబులైన, బావుదస్తాయనంగను బరిఘవిల్లు
నలువుమీఱంగ నొకబందు నాల్గుగదులు, చేయఁగాఁజెల్లునదిరకానాయనంగ.

సీ. దుగరకానాలు పొందుగ జతేయనసొప్పు మూఁడురకానాలుము సదరనఁగఁ
జెలువొందు మొదటను జివరనున్నవిమూని నడుమనుండినరకానాలు రెండు
బింతియనంగను బెంపొందు బింతిలో నర నిమేబింతి నానందమొందు
ఖాసిల్లుము సదరులో సగంబేప్రొద్దు మద్దు గుల్లును నిమేము సదరనఁగ
లోకులెన్నంగఁదగు జితేలో సగంబు, నవనిమీఁదనిమేజితే (యనఁగనెంచుఁ)
బరఘవిలుర కాన లోపలసగంబు, నాడెమైన నిమేరకానాయనంగ. ౫౮

చ. పనివడి తాటిఁబుఁదెచ్చి నలుబారులుగా నొనరించి బందు వే
ర్వడనుగొని నాల్గువేపులను గత్తెరచే సవరించి పొంకమై
తనరెడు బందుపట్టు ప్రముదంబున నల్లను శీల్పుటించి యిం
పొనరఁగ లెక్కవ్రాయుపలయుఁ మతిమంతులు దానిమీఁదటన్. ౬౦

సీ. లేపనులు కడకొత్తు లెక్కపత్త్రముప్రాయు మున్నతురుష్కులు వన్నె కెక్కు
కణపకలంబు యోగ్యమటంచు నెంచిరి జాతివారలు సీమబాతుకలము
క్షేమంబటంచు సంగీకరించిరి నృపుల్ విలసిల్లు నీవి రెండు విధములైన
కలములఁజూచి మిక్కిలి పసందొనరించి గణుతించి రదిగాన కణపకలము
సీమబాతుకలమ్ము ప్రసిద్ధిఁజెందె, వానితో లెక్కవ్రాయంగవలయుఁ గాని
కడమ కలములుఁదెచ్చి ముఖ్యములటంచు, వసుధ నెవ్వరుఁ జేపట్టి వ్రాయరాదు

చ. గణపతియిచ్చు సత్కళలు కంజభవుండు చిరాయువిచ్చు ష
డ్గుణుఁడగు పద్మలోచనుఁడు కోరిన కోరికలిచ్చు నాగభూ
షణుఁడు విభూతులిచ్చు శరజన్ముఁడు పేంద్రుఁడు శక్తులిచ్చు నా
గణపకలంబు హస్తమునఁ గైకొని వ్రాయు సుధీజనాళికిన్. ౬౧

ఉ. ధాతవెలంది సత్కృపకుఁ దానకమై శరదిందుచంద్రికా
జాతవిభాసమానములు శత్రుమనోజ్ఞమదేభహస్తమై
వ్రాఁతకుమూలమై సకలవైభవముల్సమకూర్చు మాతయై
బాతుకలంబు పెంపెసఁగెఁ బల్కులఁ గైకొని వ్రాయ మేలగున్ ౬౩

ఉ. కమ్మనిమింటి ఒల్లొరను గన్నవజీయ కృపారసంబు చొ
క్కమ్ముగఁ దాల్చెనంచు నొడికంబుగ హస్తమునందునిల్పి నె
య్యమ్ముగ వ్రాయునక్షరములంచు మహీదివిజుల్నుతింపఁగా
నెమ్మికలమ్ము భాసిలెను నెమ్మి జనంబులు వ్రాయ మేలగున్. ౬౪

చ. కణపకలంబు బ్రహ్మకనికారముఁ నెమ్మికలంబు పంకజే
క్షణుని దయారసంబు రభసంబున బాతుకలంబు నాగభూ
షణు కృపగల్గి మించెనని సర్వజనుల్ ప్రణుతింప మానవా
గ్రణులు కరారవిందములఁ గైకొని వ్రాయుదురక్షరంబులన్. ౬౫

చ. జిగిగలపెంకులోపలను జేరెఁడు బియ్యముఁబోసి తెచ్చి చ
క్కగఁ బ్రొయిమీఁద నుంచి యొడికంబుగఁ గ్రింద దృఢాగ్నిఁజూపి పొం

డుగ నవి తప్తమైనతటిఁ దోయము లోఁ దగినట్లుపోసి యొ
ప్పుగ నది తెల్లగుడ్డ వడపోసినఁ బాకము వంగఁ జెల్వగున్. ౬౬

సీ. పరికించి తెల్లని పాపసన్నని గుడ్డముక్కలో బెత్తెఁడు ముక్కఁదీసి
ముకురవిభాస్వచ్ఛ నొకవత్తిచేయించి ప్రమిదెలోపలనుంచి చమురుపోసి
దీపంబు వెలిఁగించి తెల్లసున్నమ్మునఁ బూతఁబెట్టిన పెంకుమూఁతవేసి
పెంపొందవానిపైఁ బేఁడముద్దయమర్చి దివ్వెవగ్గిక్కులఁ దేజరిల్లి
యున్నఁ గన్గొని కొంతసే పూరకుండి
యొక్కగడియకు మిక్కిలి యుంచకపుడు
పొంకుఁదీయంగ దానిలోఁ బెరసియున్న
యమ్మసి వెలుంగుఁ గాటుకయన మహేశ. ౬౭

ఉ. చేరెఁడు గుడ్డగో మిసిమిఁ జెందిన కాయక తెచ్చియుంచి బ
ల్లారిమి నాల్గుచెంగులును గూర్చికరంబునఁ బూని లోఁతు వి
స్తారము లేని పళ్ళెమునఁ జల్లని పాకముపోసి రుద్దినన్
మీఁటి సిరాయనంగ నది మేదినిపైఁ జెలువొందుఁ బూజ్యమై. ౬౮

చ. తెగువగలట్టి చాకుఁగొని తెల్లని బాతుకలంబు చెక్కి క్రొం
జిగి దళుకొత్త సూది మొనఁ జేసి సమత్వముఁ గాఁగనొక్కి కొ
ద్దిగఁ దగుపాళిమొత్తి యిరుదిక్కుల రెండవమూఁటి చెక్కినన్
సొగసుగ వ్రాయు మేల్కలము చూడ నృపుల్మది నెంతు రర్మిలిన్. ౬౯

సీ. కమలాక్షువక్త్రకంజమునందు నొక్కటి యనలుని నేత్రములందు రెండు
డంబైన శక్తిపీఠత్రయంబున మూఁడు నలువ నెమ్మోముదమ్ములను నాల్గు
వలరాజుపగవాని వదనాబ్జములనైదు శరజన్ము మోముఁ దామరలనాఱు
మఱువొందు సప్తర్షిముఖపద్మములనేఁడు వసుముఖాబ్జములందు వఱలుదచ్చి
నరవిధులందుఁ దొమ్మిదిజననమందె, బిదపనోంకారమునయందు బిందువొకటి
యుదయమైసంఖ్యబిందువు నుర్విమీఁద, గణనదుర్లభమైయొప్పి కానఁబడియె.

గీ. సన్నుతింపఁగఁ దగినట్టి సున్నయందుఁ
గలమహత్త్వంబు చెప్పశక్యంబుగాదు
చెప్పఁబూనితి నాకుఁ దోఁచిన విధంబు
దొరలు నుతియింప బుద్ధిమంతులు గ్రహింప. ౭౧

ఉ. చేవ పలాశిలోపలను జెన్నువహించినరీతిఁ బువ్వులోఁ
దావి వెలుంగుమాడ్కిఁ గలధౌతములోపల వన్నె మిక్కిలిం
దావిలసిల్లునట్టివిదితంబుగఁ గొబ్బరకాయలోపలన్
జీవనమొప్పుచందమునఁ జెల్వుగఁ దొమ్మిది సున్నలోపలన్. ౭౨

చ. తనజతఁగూడి నిర్వటిలుదాని ఘనత్వము నొందఁజేసి తా
ఘనతవహించుఁ దానొకతెగాఁ జెలువొందిన సర్వశూన్యమై
తనరెడు వర్ధమిచ్చు విదితంబుగ సున్న మహత్త్వమెన్నఁగా
వనరుహగర్భురాణియగు వాణికిఁ గాదది నాకుశక్యమే. ౭౩

గీ. రూపుమీఱంగఁ దనలెక్క చూపఁబడుచు
నెంతమట్టుకు సంఖ్య పెంపెక్కియుండు
ముద్దుగుల్కుచు నన్ని తొమ్మునులుదాల్చు
నుప్పతిలు సున్నమహిమంబుఁ జెప్పఁదరమె. ౭౪

—♦ నగదుజమాఖర్చు ♦—

సీ. నగదుచిత్తావ్రాయఁదగురీతి జమ ఖర్చు వేర్వేఱ నావర్జ వేయుదారి
నెలజమాఖర్చు నక్లెలి వ్రాయుపద్ధతి వేఁడ్కఁ జెందిన పద్దు వేయుసూటి
పరికించి ముసరపుబాకసేయు తెఱఁగు సాలుజమాఖర్చు సలుపువిధము
పరఁగజమా వసూల్బాకీ జమాఖర్చు వరుసవసూల్వాడివ్రాయు నేర్పు
లోకు లెన్నంగఁదగు చెల్లుబాకి సరణి
యవని జమకట్టి సెహాసేయునట్టిక్రమము
చెప్పఁబూనితి నాకుఁ దోఁచినవిధంబు
రసికజనులార మీద యూరసము నొంద. ౭౫

—♦ చిత్తావ్రాయుపద్ధతి ♦—

సీ. నాడెంపుబందులు నలుగడల్ కత్రించి కడుబందుబందు సల్గములుచేసి
పలసినబందులు వరుసగా సమకూర్చి సీరుబాతుకలంబు చేతఁబూని
తగినపాయీకలందాను చెంతనునిల్పి సాటిమునద్దిబు సన్నుతింప
నందమైతగు మీఁదిబందుపై ముందుగా మవ్వంపు మునదరు మద్దుసలిపి
నలువొందు పరగణానామంబు లిఖియించి పిమ్మటయజమానుపేరు వెనుక
రాణించు సంవత్సరముపేరు తరువాతఁ బెంపొందు మాసంబుపేరు వ్రాసి
దీనికి బెత్తెఁడు దిగువ జిలేగాని వన్నెమీఱఁగరోజువారముంచి
తబిసీళ్ళతోనొప్పుతాలూక దేహయుయాసామివారితో భాసిలంగ

వ్రాసి యాకర్వాత వచ్చు జుల్మానాలు వట్టముల్ రుసుములు బాజుగుస్తు
కజ్జలు మొదలుగాఁ గలవస్తు జమకట్టి పేరోజు మజుకూరు వెరసి చేసి
పరఁగ రోజుకుజస్తు బాకి విలోకించి యున్నచోకట్టు రెం డొకటిచేసి
దీనికి బెత్తెఁడు దిగువ జితే గొనిఖర్చును(?)
మస్తుగొని తబశీళ్ళతో నొప్పుగొమరుబుకుల(?)
దాఖలు సర్కారు తౌజీవివాములు భత్యఖర్చులు బరాతములురద్దు
ఖర్చులు మొదలైన ఖర్చులు ..వేర్వేరులిఖియించి వెరసిచేసి
కూర్చి జమయందు నీఖర్చు కొట్టివేసి, పైకిఁ దేలిన శేషంబు బాకిదించి
యమలు జరిగెడు పద్ధతి ననుసరించి, వ్రాయవింపాంపునగదుచిత్తా యనంగ.

—♦ జమ ఆవర్జా వేయుపద్ధతి ♦—

సీ. తనరారు నొక్క తెల్లని తాబు గైకొని చెలువైన కత్తెరచేఁ బూని
వన్నె మీఱఁగ వాల్గువెప్పుడు కత్తిరించి మొదిమిది గడులుగా నేర్పరించి
తురుమగా వ్రాయు బాకుకలంబు చేపట్టి నిండుపాయియా బుడ్డి దండనుంచి
చెలువొందు దానిపై చిత్తాయులిఖియించి బారామునర్దీలు ప్రస్తుతింప
నాడె మై చెన్నొందు నగదు చిత్తాఁ జూచి కూరిమిరోజుమజ్కూరు వేసి
తొలిగదియందుఁ బొందుగ బారు గావించి కడువేడ్కమిగిలిన గదులయందుఁ
దెలియంగ తాలూకు దేహాయ ఖర్చులు వట్టముల్ రుసుములు బాజుగుస్తు
లొదవు జుల్మానాలు మొదలుగాఁ గలవస్తు బత్తబిసీళ్ళతో బారుచేసి
వాని బేరీజు లన్నియు వన్నెఁ గూడి, దేని బేరీజు దానికిఁ దేటపఱచి
మొట్టు బేరీజు గల్పిసరి కట్టియున్న(?) నదివసుంధర నావర్జ యని వెలుంగు.

—♦ ఖర్చువెరసి-ఖర్చు ఆవర్జా వేయుపద్ధతి ♦—

సీ. తనరారు నొక్క తెల్లని తాబు గైకొని నల్గడల్ కత్తిరించి వాల్గురెండు
గదులుగా నొనరించి పిదపనా తాబుపై రాణించు చిరునామ వ్రాసి వెనుక
నాడెమై చెన్నొందుఁ నగదుచిత్తా జూచి కడువేడ్క ప్రతిరోజు ఖర్చువెరసి
తొలిగదియందుఁ బొందుగ వ్రాసి మిగిలిన గదులలోపలను సర్కారుచెల్లు
తలజులు రద్దు ఖర్చులు భత్యఖర్చులు తౌజిబరాతముల్ ధర్మఖర్చు
లాదిగాఁ గలఖర్చు లన్ని విమర్శించి బత్తబిసీళ్ళతో బారుచేసి
వాని బేరీజు లన్నియు వరుసఁ గూడి, దేని బేరీజు దానికిఁ దేటపఱచి
మొట్టుబేరీజుకలిపిసరికట్టియున్న(?) వఱలుచుండును ఖర్చునావర్జయనఁగ.౭౮

—♦ ఫర్దువేయుపద్ధతి ♦—

సీ. గొనవైనఫరుదులు గొని మీఁద సిరినామ సరగున వ్రాసి ఫేషాణినిలిపి
భవ్యమై తగు మీఁది ఫరుదుపై ముందుగా మవ్వంపుమునదరు మద్దుదెచ్చి
ఖరదారు నిల్పి యాక్రింద బింతీగొని తాలూకుదేహాయ గీలుకొలిపి
దానిక్రిందను మునదరులుగా పరగణాల్ లిఖియించి వాని జిలేల యందుఁ
దగుగ్రామములువ్రాసి. తరువాత నొకబింతి మళ్ళిగైకొని తతిమ్మా లిఖించి
తనరారు దానిక్రిందను గొన్నిమునదరుల్ దొరకొని బాజుగుస్తులు శివాయ
కర్చు మొదలుగాఁగఁ గలవికతాయించి మేలైన వానిజిలేలయందు
వ్రాయంగఁ దగు నెవ్వి వానిపేరులు వ్రాసి బారామునద్దీలు ప్రస్తుతింప
మూఁడుతొమ్మిదిమాసముల జిలేఖర్చులఁ గన్గొని యాజమాఖర్చులందు
మురువొంద దేహాయ మొదలైన జములెల్ల బత్తబిసీళ్ళతో బారుచేసి
వెనుక జముకట్టి శహాదెచ్చి వేర్వేఁ గలిపి, వానిబేరీజు లన్నియు వరుసఁగూడి
దేని బేరీజు దానికిఁ జేట పటిచి, మొట్టబేరీజు పైదాని మీఁదనిలుపఁ
బరిఢవిల్లుచునుండు మొఫర్దనంగ. ౭౯

—♦ మునరపువేయుపద్ధతి ♦—

సీ. పాటించి తెల్లని ఫరుదులుగైకొని వానిపై సిరునామవ్రాసిక్రిందఁ
బెంపొంద సొగసుగా ఫేషాణి లిఖియించి భవ్యమైతనరుమైఫరదు మీఁద
మవ్వంపుమునదరు మద్దుగా ఖరదారు నిల్పి యాక్రింద బింతీ యమర్చి
సరగున దాఖలు సర్కారు గీల్కొల్పి దానికి దరులుదెచ్చి(?)
వాతౌజీబరాతముల్ తైనాతి దారా...నిలురసాల్వార దలైన మెచ్చివ్రాసి
వానితర్వాతను వానిజిలేలవ్రాయఁగనొప్పు భాసిల్లునామముల్ పాకుకొల్పి(?)
మూఁడుతొమ్మిదిమాసముల జమాఖర్చులు గన్గొని యాజమాఖర్చు లందు
సంధిల్లుదాఖలు సర్కారు మొదలుగా బత్తబిశీళ్ళతో బారుచేసి
వెనుక జముకట్టు శహాదెచ్చి వేర్వేఁ గల్పి, వానిబేరీజులన్నియు వరుసఁగూడి
దేని బేరీజు దానికిఁ దేటపటిచి, వ్రాయు మునరభనంగ బాగై మెసంగు. ౮౦

శ్రీరామార్పణమస్తు.

[ఈపద్యము లింకను గొన్నియుండునో యింతటితో సరియో తెలియరాదు. ఇది శ్రీపిఠాపురముమహారాజావారి పుస్తకభాండాగారములోని ప్రతి నుండి ప్రకటింపఁబడినవి.]

# కీర్తిశేషులైన వేదము వేంకటరాయశాస్త్రిగారు.

మహోపాధ్యాయ కళాప్రపూర్ణ బిరుదాంచితు లగు వేదము వేంకటరాయశాస్త్రిగారు గొప్పపండితులు. ఈపండితులు చెన్నపురిలో 1853 సం॥రము డిసెంబరు నెల ది 21 తేదికి సరియైన ప్రమాదీచనామసంవత్సర మార్గశీర్ష బ ౬, బుధవారమున జన్మించిరి. వీరికుటుంబము పండితకుటుంబము. వీరిపితామహులు వేదము వేంకటరాయశాస్త్రిగారు తాతగారిపేరే మనశాస్త్రిగారికిఁ బెట్టఁబడినది. తండ్రిగారు వేంకటరమణశాస్త్రిగారు. వీరు నర్సాపురము విశాఖపట్టణము మున్నగుతావుల నుపాధ్యాయులుగా నుండిరి. సహస్రమాసజీవి. ఎనుబదిమూఁడుసంవత్సరములు జీవించిరి తల్లి లక్ష్మమ్మగారు. శతంజీవినియని చెప్పవచ్చును. తొంబదియెనిమిదేండ్లవయసున మున్న మొన్ననే పుత్రులచేతులలోఁ బరమపదించిరి. వీరియొక్క తమ్ములు వేంకటాచలయ్యగారు, బి ఏ. బి. యెల్. నెల్లూరిలో వకీలు. వీరివంశమునం దందఱు దీర్ఘాయుష్మంతులు. కావుననే వీరును డెబ్బదిమూఁడువత్సరములు భూలోకము నలంకరించిరి. వీరిద్వితీయసతీమణి శేషమ్మగారు. ఈయిల్లాలికి సర్వసాధారణస్త్రీసహజమైన వైధవ్యము వార్ధకదశలో సంప్రాప్తమగుట శాస్త్రిగారిమరణముతోపాటు మాకు దుఃఖహేతువైనది. వీరికుమారుఁడు మాత్రము కౌమారవయస్సుననే తల్లిదండ్రులకుఁ బుత్రశోకమును గలిగించిరి, గాని, యౌదార్యవతిఁ బౌత్రులను శాస్త్రిగారికప్పగించిరి. ఈయన ప్రసిద్ధవిద్వాంసులగు ప్రొఫెసరు శేషగిరిశాస్త్రిగారి యల్లుఁడఁట. శాస్త్రిగారు పుదూరుద్రావిడశాఖాబ్రాహ్మణులు, చాలకాలము నుండి యీశాఖాబ్రాహ్మణతల్లజులవలననే సంస్కృతాంధ్రభాష లభివృద్ధినొందుచున్నవి. వావిళ్ల రామస్వామిశాస్త్రిగారు, వీరియల్లుఁడగు చదలువాడ సుందరరామశాస్త్రిగారు, వీరిబంధువు లగుదండిగుంట సూర్యనారాయణశాస్త్రిగారు, వేంకటరాయశాస్త్రిగారివలెనే యాంధ్రభాషకు సంస్కృతభాషకు నెట్టిసహాయముచేసిరో జగద్విదితము. మాటమాత్రమునకే వీరు ద్రావిడులుగాని యాంధ్రభాషాపోషణమే వీరివ్యాపారము.

వేదము వేంకటరమణశాస్త్రిగారు చెన్నపట్టణమునుండి వచ్చి గోదావరి, విశాఖపట్టణము జిల్లాలలో నుపాధ్యాయులుగానుండిరి. అపుడు వేంకటరాయశాస్త్రిగారిది బాల్యము. నర్సాపురములో విద్యాప్రారంభ మని చెప్ప

వచ్చునః. విశాఖపట్టణములో మెట్రిక్యులేషను, ఎప్. ఏ. పరీక్షలకుఁ జదివి గెలిచి కలక్టరుకచేరిలోఁ గొంతకాల ముద్యోగము చేసిరి. తర్వాతను రాజమహేంద్రవరము టౌనుహైస్కూలులో ప్రధానోపాధ్యాయులైరి. పిమ్మట చెన్నపురి ముత్యాలపేట స్కూలులో హెడ్మేష్టరుగా నుండిరి. అనంతరము క్రిస్టియన్ కాలేజీలోఁ బండితులుగా నియమింపఁబడి సమర్థి రంగయ్యచెట్టిగారి యనంతరము వారిపదవి నధిష్ఠించిరి. ఆకళాశాలనుండి విశ్రాంతిపొందినపిమ్మట 1911 సంవత్సరములో ఆంధ్రసాహిత్యపరిషత్తు స్థాపింపఁబడినపుడు దానికిఁ గార్యదర్శిగానుండిరి. శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యము ప్రారంభింపఁబడినపుడు వీరు దానికి 1915 సంవత్సరము సెప్టెంబరునెలనుండి ముఖ్యసంపాదకులుగానుండిరి. నెల 1 కి రు 225 రూపాయలజీతముపై వీరాపనిని 1918 సం॥రము జనవరినెలవఱకుఁ గావించిరి. నెల్లూరిలో జరగిన యెనిమిదవపరిషద్వార్షికసభకు 1919 సంవత్సరము జూన్ నెలలో నధ్యక్షులైరి. 1929 సంవత్సరము జూన్ 18 తేదీని వీరు మరణించువఱకుఁ బరిషద్గౌరవసభ్యులుగా నుండిరి. ఈపదునెనిమిదియేండ్లును శాస్త్రిగారు పరిషత్తు ననేకవిధముల గౌరవించిరి.

వీరు కొంతకాలము జ్యోతిష్మతీముద్రాక్షరశాలను స్థాపించిరి. అందు ముద్రింపఁబడిన గ్రంథములు సుందరముగాను నిర్దుష్టముగా నుండెననుట యెల్లలకు విశదమే. పరిషత్పత్త్రికకూడఁ గొన్నినా ళ్ళాముద్రాలయముననే ముద్రింపఁబడినది.

శాస్త్రిగారిపాండిత్యము సంస్కృతాంధ్రములయందుఁ గూలంకషమైనది. దానికిఁదోడు మాతృభాషయగు నఱవమును, రాజభాష యగునింగిలీషును వచ్చినవారగుట చే మిగుల వారి పాండిత్యము రాణించినది. ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రిగారు, పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు, కల్లూరి వేంకటరామశాస్త్రిగారు, కస్తూరి శివశంకరశాస్త్రిగారు మున్నగుపండితులు వీరితోఁదుల్యులు నధికులు నుండిరిగాని రాజభాషాదిసహకారము వారికిఁ దక్కువ. ఒక్క యింగ్లీషునే వీరు పాఠశాలలో గురువులయొద్ద నేర్చిరిగాని సంస్కృతాంధ్రములు స్వయంకృషిచేతనే సంపాదించి వృద్ధిచేసికొనిరని చెప్పుదురు. సమయానుగుణముగ నాయాగ్రంథములు విశేషవిమర్శతోఁ జదివియుండిరి. వీరి శాస్త్రపాండితి శృంగారనైషధము, ఆముక్తమాల్యదల వ్యాఖ్యానములం దిలకించినను, నితరగ్రంథములం గాంచినను దెలియవచ్చును.

వీరనేక సంస్కృతాంధ్రగ్రంథములను ముద్రించి ప్రకటించి యుండిరి. వాని వివరము కొంత యీక్రిందఁ జూపుచున్నాము.

1. పూర్వకవుల సంస్కృతగ్రంథములు.

రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, వీనికి సంస్కృత వ్యాఖ్యయుఁ బూర్ణాంధ్రటీకాతాత్పర్యములును.

అమరుకము, పుష్పబాణవిలాసములకు వ్యాఖ్య, టీకలు.

భర్తృహరిశతకత్రయమునకు, సం. వ్యా. తెనుఁగుటీకాతాత్పర్యములు.

హితోపదేశపంచతంత్రదశకుమారచరిత్రలు_ మూలము.

విక్రమార్క-భోజచరిత్రలు - బిల్హణీయములకు, టీకాదులు.

రసమంజరి - తెనుఁగుసంపూర్ణటీక.

ప్రియదర్శికానాటిక సం, తెనుఁగు.

శబ్దమంజరీతిజంతమంజరులు.

2. పూర్వకవుల యాంధ్రగ్రంథములు.

శృంగారనైషధమునకు సర్వంకషవ్యాఖ్య

విజయవిలాసము సారంగధరచరిత్రములకు టీకలు టిప్పణులు.

ఆముక్తమాల్యదకు సంజీవనీవ్యాఖ్య

చిన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణి 1_7 ఉల్లాసములు.

ముక్కుతిమ్మన్న పారిజాతాపహరణము_మూలము.

మడికి సింగన్న జ్ఞానవాసిష్ఠరామాయణము.

గౌరన హరిశ్చంద్ర ద్విపద - సటిప్పణి.

ఆంధ్రబిల్హణీయము - మూలము.

3. శాస్త్రిగారు రచించిన గ్రంథములు.

రత్నావళి, ప్రియదర్శిక, నాగానందము, విక్రమోర్వశీయము, ఉత్తర రామచరిత్రము, మాళవికాగ్నిమిత్రము, అభిజ్ఞానశాకుంతలముల కాంధ్రీకర ణంబులు గావించిరి. ప్రతాపరుద్రీయము, బొబ్బిలియుద్ధనాటకము, ఉషానా టకము, నివి వీరిస్వతంత్రనాటకములు హితోపదేశము, భోజచరిత్రము, బే తాళుని యద్భుతకథలు, కథాసరిత్సాగరము, దశకుమారచరిత్రము అను నాం ధ్రీకృతవచన కావ్యములు.

తిక్కనవిజయము, ప్రసన్నరాఘవనాటకవిమర్శనము, విమర్శవినోదము మొదలగు విమర్శగ్రంథములు.

అలంకారశాస్త్రసంగ్రహము.

స్త్రీపునర్వివాహదుర్వాదనిర్వాపణము- మతవిషయము.

భగవద్గీతలు- సాహిత్యదర్పణము- కాదంబరి మున్నగునవి యముద్రితములు నసంపూర్ణములును గలవని వదంతి.

వీరికి మహోపాధ్యాయబిరుదమును వీరివిద్వత్తకు మెచ్చి నెల్లూరిలో నొక పీఠాధిపతులిచ్చిరి. అప్పు డేమో మా శాస్త్రిగారికి శాశ్వతధనసహాయము చేయఁబడినట్లు చెప్పుకొందురు గాని యిప్పటియాందోళనము గాంచిన నది యున్నట్లు కనఁబడదు. కళాప్రపూర్ణ బిరుదమును బెజవాడ, ఆంధ్రవిశ్వకళాపరిషత్తువా రిచ్చినది.

ఇంతటి గొప్పపండితునియింట లక్ష్మీసరస్వతుల తగవులాట జరిగినది. ముసలిదియగు నత్తను కోడలు నిలువనీయలేదు. కావుననే లక్షాధికారులగు రెడ్డిమిత్రులు, సర్వాధికారములు గలయున్నతోద్యోగులగు శిష్యులు ధనికులగు బంధువులును గలశాస్త్రిగారియింట నన్నివిధములను సరస్వతివిజయధ్వజమే లేచినది. పోరునష్టము- అత్తగారితోఁ బోరినది కావుననే, శాస్త్రిగారి శారద, తనకాంచిక కాలుకిఁకిణులకంటె నెక్కువఁగాఁ జేయించుకొనలేకపోయినది.

ఈవిద్వద్వర్యుని మృతి యాంధ్రభాషకు గొప్పనష్టముం దెచ్చినది. ఆంధ్రభాషకు మహోపకార మొనర్చియు, నొనర్చుచును, నొనర్పఁబోవుచును, నాంధ్రలోకమును విచారమగ్నము చేసి స్వర్గస్థులయిన వీరియాత్మశాంతికిఁ బలువురు పత్త్రికాధిపులు సూచించినట్లు గా వీరిగ్రంథములను గొనియు నచ్చువేయించియు, వీరికుటుంబమునకు సాయపడుట తప్ప నితరమార్గము లేదు.

# కవిగజాంకుశము.

(భైరవకవి)

క. శ్రీమత్పరమసితానన, తామరసవికాసలీలఁ దగిలి భ్రమరాం
బామధుమత్తభ్రమరిక, నామనసరసీరుహంబునన్ భ్రమియించున్. ౧

వ. అని యిష్టదేవతాప్రార్థనంబుఁ జేసి, ౨

క. నిరుపమమతివిస్ఫురణం, బరఁగినసత్కవులఁ దొల్లి బహువిధముల న
చ్చెరువొందఁ జెప్పఁబడిన, సరసుతసాహిత్యలక్షణగ్రంథములన్. ౩

క. సందడిగడు లక్షణమును, బొందుగ ధవళించి జాఱఁ బోవిడిచి సుధీ
బృందంబు మెచ్చ నేనొక, చందమ్మునఁ గవిగజాంకుశమ్మను పేరన్. ౪

గీ. లక్షణగ్రంథమొనరించి లాగుమీఱి, దానిఁ గొని యేను గుకవిమాతంగములను
మదము దూలంగ గీపెట్టుముల పువాఁడ, నని ప్రతాపించి పలికిన పలుకు వినుఁడు.

క. భ్రమరాంబికామహానర, సముదితనిరవద్యహృద్యసాహిత్యకళా
శ్రమవిమలప్రతిభాచం, క్రమణక్రమశాలినైన గౌరనసుతుఁడన్. ౬

క. భైరవుఁడ నుభయభాషా, పారీణుఁడ లోభిభవనభవభూమివ్యా
పారనివారకమ్మవి, ఘోరపిశాచులకదంబ్బకొను భైరవుఁడన్. ౭

క. నక్షత్రగ్రహగణభూ, తాక్షరగుణదోషనిర్ణయం బొనరింపన్
దక్షుండగానిదిగాదని, శిక్షించినఁ గన్నులెఱ్ఱఁజేతురు కుకవుల్. ౮

క. కినుకుచు లక్షణ మెఱుఁగక, కొనుకుచు వడిఁ బ్రాస యతిని గూడకమిన్నుల్
వెనకుచుఁ బదసంధులు చెడ, నదుకుచు నరకవిత చెప్పునతఁడు గవియే.

క. నెఱయు గురులఘువివేకము, లెఱుఁగని ననగూఁటులెఱుక నెమ్మెఁ గవిత
ల్గొఱగెడు కుకవులఁ బద్యపుఁ, దఱటులఁ గొనవ్రేయువలదె తద్జ్ఞులు సభలన్.

క. సేవించిన ధనపతిఁ గా, దీవింప నహంకరించి తిరిగిన భిక్షుం
గావింప లక్షణజ్ఞుఁడ, భావింపఁగ నమ్ము నెన్నఁ బనిలే దిఁకన్. ౧౧

వ. లక్షణంబు లెవ్వియనిన, ౧౨

సీ. అవనిగణాళి గణాళికి నధిదేవతలు గ్రహంబులు గ్రమంబులును వాని
కులములు ఫలముల గూడుమర్యాదలు ముక్కపొంతువులు నచ్చువులు నెఱిఁగి
పిదపమహాభూతి బీజచింతనమును వర్ణవర్ణగ్రహనిర్ణయంబు
లక్షరవేధయు నరిమిత్రశోధన క్రమముఁ దత్ఫలవిచారమును దెలిసి

తమకు నెదురులేక దర్పించివసురుతీ, విభులసభల బుధులు వివిధవిధులఁ
జెలఁగిపొగడఁ గవితసెప్పెడివారు సత్కవులపేరుసాటికవులుగలరె. ౧౩

క. ఈయెన్నిలక్షణము లమే యుప్రతిభన్ రచింతు మృదుతర కావ్య
శ్రీయెసఁగఁ బొసఁగనది బళి, రేయనుచు న్సుకవులాదరించి నుతింపన్.

క. జగతీజలానలానిల, గగనసుధాకరవరోష్ణకరపరమాత్ముల్
మగణాదుల కధిదేవత, లగజావల్లభుని మూర్తులవి యెనిమిదియున్. ౧౪

క. రవితురగరజతవిద్రుమ, కువలయహారనీలశకలకురువిందసుధా
నవకనకనికషరేఖా, ప్రవిమలకాంతులఁదనర్చుఁ బరువడిగణముల్. ౧౬

క. రజనికరతనయభార్గవ, కుజతరణిజదితిజరాజగురుగురుగ్రహముల్
నిజముగ మయరసతలకును, భజలకు నెన్న న్గజాధిపతులు గ్రహంబుల్.

క. నలి తయలును నగ్రజకుల, ములు రజలవనీశసుకులములు భగణము వి
ప్రులజము మగణము నాలవ, కులమిది నగణమ్ము హీనకులమాదితలఁపన్.

క. సరసాన్నరుచిరభూషణ, పరితాపస్థానచలనబహుసుఖగుజా
పరమాయురచలలక్ష్మీ, కరములు యమరసతభజనగణములు వరుసన్. ౧౯

క. నచ్ఛతగణాధిదేవత, మచ్ఛగణగ్రహము సత్త్వమహా బలిమిఁగదా
ముచ్చఁగవిభానుఁడనియెను, వచ్చ మతింగినిసి ఆయువగులం దిట్టైన్. ౨౦

క. మహి వేల్పులు నెరసినశిల, లహితహితంబుల నొనర్చు నాగతిగణముల్
మహితశ్లోకముఖ బున, గ్రహవశమున మేలుఁగీడుఁ గడువడిఁజేయున్. ౨౧

క. తొలుతగణగ్రహమైత్రులు, తలపోయని దుడుకుఁగవుల తరమే హర్షం
బొలసిన మన దీవింపం, గలుషించిన బద్యవహ్నిఁ గాల్పఁగఁ దిట్టన్ ౨౨

గీ. ఏయవస్థనుండి యేవేళ నేగ్రహం, బేశుభాశుభంబు లిచ్చుచుండు
నాయవస్థనుండి యావేళనాగణం, బాశుభాశుభంబు లందఁజేయు ౨౩

గీ. గ్రహములులికిగణము గరి యక్షరముపింజ, పద్యమెసఁగుకోలచోద్యమైన
జిహ్వవిల్లు మనసు శింజిని లక్ష్యంబు, ధూర్తజనుఁడు సుకవివార్తజోదు. ౨౪

క. మగణాదిగణంబులకును, బగయును మైత్రియును నెఱుకపడు సుకవులకున్
జగమునఁ దత్తద్గ్రహముల, పగయును మైత్రియును శాస్త్రపద్ధతిఁ గనినన్

గీ. గ్రహముపొత్తుకలిమి గలగణసంగతి, నుండిదుష్టగణము నొసఁగుశుభము
గ్రహముపొత్తులేని గణముతోఁ బద్యాదిఁ, గూడి మంచిగణముఁగీడుసేయు.

వ. గ్రహమైత్రిప్రకారం బెట్టిదనిన. ౨౫

క. తొలుఁగణము గ్రహము మిత్రులు, దనర ద్రికోణాధిపతులఁ దత్తద్గ్రహారా
సులగణము లాదిగణముకుఁ, గలసినచుట్టంబు లివియె గ్రహగణమైత్రుల్.
క. మించు గిరిగొన్నముత్తెము, కాంచనమునఁ గదిసినట్టిగతి నలయగణం
బంచితముగఁ దనుగూడిన, మంచిదగు లక్ష్మిఁ బొసఁగు మగణము పతికిన్.
క. మగణముతోఁ బద్యాదిని, రగణము గదిసినను జావు రయమున వచ్చున్
తగణముడాసినఁ గృతిపతి, పగఱకు వెన్నిచ్చి మానభంగముఁ బొందన్.
క. ముందట నిలిపిన మగణము, క్రిందట జగణంబుఁ గదియఁ గీలించిన మే
లొందును సగణము నటువలెఁ, బొందించిన విభుఁడు రిపులఁ బోరఁ జయించున్.
క. యగణముతోఁ బద్యాదిని, మగణము గదియింప ధరణి మండలమెల్లన్
బాగడొందఁ దనేలుఁ గృతిపతి, నగణము గదిసినను (గీర్తి) చదలకు నెక్కున్.
క ఉదకగణంబును రగణము, నదవదవడి చెడి కృతీశు డవలంబినకున్

*           *           *           *           *

క. శంకింపక యగణముతోఁ, బంకజహితగణము గూర్చి పద్యము చెప్పం
బొంకము చెడి విభుఁడరులకు, లెంకెంబడి కూలి దిక్కు లేక చరించున్.
క ఇంగలపుగణము జగణము, సంగతముగనొంది తగణసంగతినొందన్
మంగళకరమని సుకవులు, ముంగలనిలుపుదురు పద్యములకుం గృతులన్.
క. యగణము గూడిన నిప్పుల, మగు మగణము గదియఁ బ్రాణహాని యొనర్చున్
రగణము సగణముఁ బొందై, భగభగయని పతిగృహంబు భస్మము సేయున్.
క. మారుతగణంబు నంప, త్కారణ మంభోగణంబు గదిసినయపుడం
గారకగణంబు గదిసినఁ, జోరులచేఁ బతిగృహంబు చూఱంబోవున్. ౩౭
క. నేరక దుష్టపు లల్లుతు, టారపుఁ బద్యముల మొదల డాసినఁ దనలో
నారవిగణంబు గూడిన, మారుతగణ మధిపు బ్రతుకు మట్టము సేయున్. ౩౮
క. తగణము మగణము గదిసిన, వగవగు సగణంబు గదియ నైరిభయంబు
న్నగణము గదిసినఁ దేజము, రగణము గదిసినను గర్తరాజ్యము సేయున్.
క. మొగవాఁగ, తగణముండఁగ, వగవగు యగణంబు దానివడినడి కిచుకం
దెగి తన్నుఁ జంపఁగడఁగెడు, పగవానికినైనఁ జనునె పద్యము చెప్పన్.
గీ. ఆదితగణ మొప్పు నధిదేవతా ఫలం, బరసి చూడ దాని కమరగురుఁడు
గ్రహముగానఁ బద్యగద్యముఖంబుల, మంచిదనుచు భీముఁ డెంచినాఁడు.

క. ఆరోగ్యప్రదుఁడగునినుఁ, డారయ జగణమున కొడయుఁ డది మొదలిడఁగా
నేరోగము గైకొన దా, చేరువచుట్టంబు గణముఁ జెప్పిరి జాణల్. ౪౨

క. రవిగణమును గగనగణము, కవి మొదలిడి పద్యమొసఁగఁ గలిగిన నేలా
భువి జెదరములు (?) గతమును, శివశివనరులిట్టి తపము సేయరు మొదలన్

క. రాజులకు జగణరగణము, లోజం గదియించి సుకవి యొసఁగిన పద్యాం
బాజుల జయమీఁజాలదె, తేజంబు నేనుఁగులు భటులుఁ దేరులు నేలా ౪౪

చ. ఉడుపతి యే గ్రహంబు పది నున్నను దానును వానివన్నెయై
నడచి శుభాశుభంబుల నొనర్చును లోపల నేగణంబునం
గడి భగణంబు నిచ్చు నధికంబగు నాఫలమిచ్చు నవ్విధిం
దొడయుఁడు గాన దానికదియుత్తమ మెన్న వృథోక్తులేటికిన్. ౪౫

గీ. శుక్రశశులు తెలుపు... వర్ణులు, తరణికుజులు బుధుఁడు సురగురుండు
పసిఁడివన్నెవారు భానుజరాహులు, సజలజలధరంబుచాయవారు. ౪౬

ఉ. వారిజమిత్రసూనుఁడును వారిజమిత్త్రుఁడు భూమిపుత్త్రుఁడుం
గ్రూరులు వారిఁ జేరునెడఁ గ్రూరుఁడు చంద్రతనూభవుండు బృం
దారకరాజమంత్రియును దైత్యగురుండును సౌమ్యులవ్విధిం
దారయఁ గృష్ణపక్షతిథులందు శుభప్రదుఁ డబ్జు చూడఁగన్ ౪౭

గీ. శ్వేతచంద్రుఁడైన సేమంబుచేకూరు, రక్తచంద్రుఁడైన రణము చేయుఁ
గృష్ణచంద్రుఁడైనఁ గెడయించు భగణంబు, పీతచంద్రుఁడైనఁ బ్రియము సేయు.

క. చందనతరుసంగతిఁ బిచుమందంబులు పరిమళించు మాడ్కినయుఁ దా
నందము ... గణము, పొందున హృద్యగణవర్ణములు ప్రియమొసఁగున్. ౪౯

క. రగణముతో రగణంబును, సగణముతో సగణమునను జగణముతోడన్
జగణంబును దగణముతోఁ, దగణంబును గూర్చి చెప్పఁ దగ దెల్లెడలన్

క. శత్రుగణంబులు నొప్పవు, మిత్రసమగణంబులైన మేలౌత జోకై
మిత్రగణంబులు మనుపును, శత్రుగణంబులు కృతీశుఁ జయ్యనఁ జంపున్.

క. శతముఖజలపావకమారుత జీవాద్యమృతపాకరుక్తారలు స
న్నుతముగ మగణాదిగణా, ప్రకృతికిఁ దారకలు గ్రహములా గణుతింపన్.

క. హారిణజబలిముఖమేషీ, వరసైరిభధేనుమహిషవాతాశనముల్
వరనమయరసతభజలకు, నరుదుగ నక్షత్రయోనులై విలసిల్లున్. ౫౩

క. ఉరగంబును ముంగిసయును
హరిణంబును గుక్కుటంబు నావును బులియుం

దరుచరమును మేషంబుచు
దురగము మహిషమును జెలిమిఁదొరయవు మఱియుఁ. ౫౪

క. నరగణము లర్యమాంభో, ధరరసతారకలు శక్రధహానర్క్షము లా
సురగణము లనిలగురుహీమ, కరనక్షత్రములు దేవగణములు వరుసన్. ౫౫

క. సురరజనీచరగణములు
కరకరిపదుదనుజపునుజగణములు మఱియు
న్నరసురగణములు వొరయును
సరిఁ బ్రియమొనరించు నొక్కచందపుగణముల్. ౫౬

క. కమలహితుఁడున్న నక్షత్రము మొదలుగ నేడుదోషతమములు నహము
బ్రమదప్రదములు పంద్రెం, డమరఁగ శుభములు తొమ్మిదింటం బద్యాదిన్ (?)

క. మొదల సజీవగణంబిడ, గొదలేక కృతిప్రకృతిసు బ్రకుకు కొనసాఁగు మది
న్వొదకక నిర్జీవగణం, బడికినయప్పుడు భయంబు నాయువు దరుగున్.

క. కృతిమొదలి దగ్ధతారక, పతి నతిదారిద్ర్యుఁ జేయుఁ బ్రజ్వలితము దు
ర్మృతి నొందించును మఱి దు, ర్మితనక్షత్రంబు రుజల మెయి నలయించున్.

క. పతితారకుఁ బద్యముఖ, స్థితతారకుఁ గీడుమేలుఁ జింతింపక దు
ర్మతిఁ గవితఁ జెప్పఁ దొడఁగెడు, నతఁడుచు మీకవిపిశాచమూరయనుర్వీన్.

ఉ. వర్ణము నిర్ణయించి కృతివక్త్రమునం గదియింప నాయకుం
డర్ణవవేష్టితావని సమస్తము నేలుఁ గవీశ్వరుండు నా
పూర్ణమనోరథుం డగుచుఁ బొల్చు సుఖస్థితిఁ గావ్యముల్ బుధు
ల్వర్ణన సేయనొప్పు దిశలన్వసుధేశసభాంతరంబులన్. ౬౧

మ. క్షితిబీజంబులు సంపదల్పొదలఁ బోషించుం బయోబీజముల్
సతతంబుం బ్రమదంబొనర్చు శిఖిబీజంబుల్ మృతిం జేయు మా
రుతబీజంబులు శోకవారిధిఁ బడఁద్రోచు న్నభోబీజముల్
పతి నత్యంతదరిద్రుఁ జేయు వరుసం బద్యాది నొందించినన్. ౬౨

వ. తత్ప్రకారం బెట్టిదనిన, ౬౩

సీ. అఇఉఋలేనును నాదీర్ఘవర్ణంబు లైదు నేకారంబు నైదునవల
వరుసం గవర్ణాది వర్గపంచకమును యాదులైదును షాదు లైదుఁగూడఁ
బదివర్గములు వర్ణపంక్తులు నొఁడొంటి క్రిందఁ బొందుగ నిల్పనందులోనఁ
బ్రథమాక్షరంబులు పవనబీజంబులు నవలివి దహనబీజాక్షరములు

అవి బీజాక్షరంబులకుఁ ద్రుతియాక్షరములు, వాని బీజంబులౌ తరవాతిలిపులు
గగ, బీజంబు లైదవకడలవెల్ల, వాని మేలు సుగీమను వలయుఁ దెలియ.

క. పొందొంద నంశచక్రము, నందలి తారాపదాక్షరావలి వెడలం
బొందుగ నుండఁ గవీంద్రులు, ముందట నిడవలయుఁ బద్యముఖమున నిలువన్.

గీ. అక్షరంబు మంచి దైనఁ గ్రూరగ్రహ, వేధఁ బొంది గుణము విడిచి చెఱచు
నక్షరంబు దుష్టమైన సౌమ్యగ్రహ, వీక్షణమునఁ గీడు విడిచి మనుచు. ౬౬

వ. అది యెట్టిదనిన. ౬౭

సీ. అశ్విని పాదాక్షరాదిగా నఖిలతారాపదాక్షరములు క్రమముతోడ
నింద్రుని దెసనుండి యిరువదియై దేసి నలుదిక్కులందును నిలిపి వాని
నవపంచ రాశివర్ణములతో నాగ్నేపి నాగ్నేసి రేఖలం దగులొనర్చి
నడుముల మిగులు వర్ణములకు... నేడింట రేఖలు గూడ దీపి
అర్కుఁడాదిగాఁగ నంశచక్రంబుల, రాసులందు సుస్థిరముగ నిలిపి
వేధ దెలిసి చూపు వివరించి వర్ణంబు, వలయు నిలుపఁ బద్యవక్త్రములను.

చ. ఉరుతరసిద్ధకావ్యముల నున్న సముంచిత వర్ణసంకులం
బరుగును సిద్ధకావ్యములఁ బ్రస్తుతికెక్కిన యక్షరంబులుం
గరకరి లేకకూడి కవికర్తల కభ్యుదయంబొనర్చు నే
విరవుననైన శత్రువిధి బృందముఁ జంపక తక్క దెక్కడన్. ౬౯

వ. మిత్త్రారివర్ణ శోధనక్రమం బెట్టిదనిన. ౭౦

సీ. చదుములై పదియాఱు చౌకపిండ్లుఁగల యొదియ షోడశచక్రమందులోన
మొదలింట మూఁటను బకునొకంటను దొమ్మిదింట రెంటను నాలుగింటఁ బదియు
రెంటను బదియు నాఱింట నెనిమిదింట నలిఁ బదాఱిటఁ బద్నాలుగింట
నేనవ తావున నేడవింటను బదియేనింటఁ బమమూఁట నిట్లుగలయ
నక్షరంబులుగలయంగనైదు పదులు, నిలిపి వడి కావ్యమున నుండి వలయు ముగను
సిద్ధసాధ్యసుసిద్ధాది చింత వెలయఁ గాంచి లిపుకోలి నడవంగ నెంచవలయు

వ. మఱియును, ౭౨

క. ఇలనకచటతపమాఖ్యలఁ, గలిగిన లిపివర్గసప్తకమున కధీశుల్
జలజహితభౌమబుధకవి, కులిశాయుధసచివసౌరికు వలయు మిత్త్రుల్. ౭౩

క. బహుసంశోధితవర్ణ, గ్రహమునకుఁ బ్రసిద్ధపద్యగద్యాదిగణ
గ్రహమునకుఁ గర్తరాశి, గ్రహమునకును మైత్రి వెఱయఁగలుగఁగవలయున్

వ. గ్రహంబు లెట్టివనిన. ౭౫

సీ. విభుఁడు మేషమునకు వృశ్చికరాశికిఁ గ్రూరగస్వభావుఁ డంగారకుండు
నాథుండు మిథునకన్యారాసులకు జనానందవర్తనుఁ డిందునందనుండు
అధిపతి మీనబాణాసనరాసుల కతులప్రభావుఁ డ య్యమరగురుఁడు
రాజు తులావృషరాసులు రెంటికిఁ బరమతపోనిధి భార్గవుండు
మకరకుంభములకు మార్తాండసూనుఁడు, పతి త్రివేదమూర్తి భాస్కరుండు
కర్త సింహమునకుఁ గర్కటరాశికి, నఖిలలోకవంద్యుఁ డమృతకరుఁడు ౭౬

వ. అని యివ్విధంబున. ౭౭

మ. గణవర్ణాదుల మేలుఁ గీడు వెలయంగాఁ జెప్పె సాహిత్యల
క్షణదీక్షాగురుఁడైన గౌరనసుధీసత్పుత్రుఁ డత్యుల్లస
ద్గుణరత్నాభరణుండు *భైరవకవీంద్రుం డొప్పుఁ దద్జ్ఞుల్ దనం
బ్రణుతింపం గవిరాడ్గజాంకుశము భూప్రఖ్యాతమై మించఁగన్. ౭౮

---

* రత్నపరీక్షను, శ్రీరంగ మాహాత్మ్యమును రచించినకవి.
ప్రతికిమూలము మానవల్లి రామకృష్ణకవిగారిచ్చినది.

# గ్రంథస్వీకారము.

## 1 పెద్దాపురముముట్టడి.

ఇది సమవాకారము. మూఁడంకములు. చిరకాలము పెద్దాపురములో నివసించి ప్రస్తుతము కాకినాడలో నివాసముచేయు మ॥ బుద్ధవరపు పట్టాభిరామయ్యగారిచే రచింపఁబడినది 1714 సం॥ నుఁడి పెద్దాపురములో శ్రీమదుద్దండరాయ జగపతిరాజుగారిపట్టమహిషి శ్రీరాగమ్మదేవిగారు పరిపాలనము చేయుకాలములో నాసంస్థానమున జరిగిన యుద్ధము ముట్టడి యిందు వర్ణింపఁబడినవి. కథ చరిత్రములలోఁ బ్రసిద్ధమైనది ఈసమవాకారమునకు మ॥ విస్సా అప్పారావుపంతులు ఎం. ఏ. గారుపోద్ఘాతము వ్రాసిరి. అవతారికలోఁ గథాభాగము, (పూర్వభాగము నుత్తరభాగము) వివరింపఁబడినవి కథానుకూలములగు చిత్రపటము లందందుఁగలవు. దీనింజదువువారి కాహ్లాదము నుద్రేకమును గొన్నితావులం బుట్టుచుండును.

"మఱియు నేటిపాఠకులకు గాని ప్రయోక్తలకు గాని చదువరులకు గాని యక్కరలేని యర్ధానుస్వార నియమమును పాటింపక ధ్వనిప్రధాన మగు పట్టులమాత్ర ముపయోగించితిని." అని కవిగారు లిఖించినారు. అక్కఱలేని వారు పాటింపరు తామేల మానవలయునో? నాటక మందఱకుఁ గావలయు నా. వలసినవారు చదువుకొందురు. తక్కినవారు మానుదురు.

"చిన్నపామునైనను పెద్దకఱ్ఱతోఁ గొట్టవలయును."

"పరాజితులజేయజాలినను పెద్దాపురమునం దడుగుపెట్టినచో ప్రాణములతోఁ బోఁగలరా, పన్నవలసినతంత్రముల్ బన్నినాము" ఇట్టితావుల వీరి యర్ధానుస్వారనియమము పాటింపఁబడకపోయినను సంధిసలుపుటలోను మానుటలోను వీరియభిప్రాయమేమో ?

ఇతరమెఱుంగక, మాఱెఱుంగక, యొండెఱుంగక, దక్కఁ దేమి బొఱబడి ఇట్లు పలుతావుల ఆకార ముపయోగింపఁబడినది, యిది యిప్పు డెవ్వరుకోరుచున్నారో? ప్రేక్షకులకుఁ బ్రదర్శనకాలమున నర్ధానుస్వార మెవ్వారికిని గనఁబడదు. అది ధ్వనిప్రధానముగనుక దాని నచటఁ బెట్టినా రని సంతోషించువారుందరు. చదువువారికే కావలయును. "కవులకును ముద్రాశాలలవారికినిఁ

గూడ నక్కఱలేని యర్ధానుస్వారశకటరేఫములు" అని కూడనుండిన మేలు. ధ్వనిప్రధానభాగము తెచ్చుటనో తెలిసికొనలేకపోయితిమి.

పృధ్వీశ్వరుంకు—పృథ్వీశ్వరుండు అనిశుద్ధపత్రములోఁ జేర్చినారు. ఈకడపుగోబా ట్రిప్పు డెవ్వరికిఁ గావలసివచ్చినది. భీభత్సము - బీభత్సమని దిద్దలేదు. పైనియమవాక్యములను కవిగారు సూచింపవలసిన యవసరము కనఁబడదు. ప్రసిద్ధులగు కవులే యిట్లు తిరస్కరించిన నింకనెవ్వరు వాని నాదరింతురు ?

రంగాంతములలో "తెరవడును" అని సూచించుట యనవసరము. ఆదిలోఁ దెర యెత్తఁబడినట్లు సూచించినారు గారుగదా?

"నాటిమొదలి తెవులు ? వ్రీట బ్రతికి-ఒకవంకన్ మహారాష్ట్రనాయక రిపువ్యూహంబు" - ఇట్టిచో "నాఁడుమొదలు," "మహారాష్ట్రనాయక" యని యుండుట యుక్తము. "రాజమహేంద్రవరము సర్కారునకు మర్‌లష్కర్‌గా నియమించుచున్నాను (ఆజ్ఞాపత్రమును వ్రాసియిచ్చి)" ఇచ్చట "నొకయుద్యోగిచే వ్రాయించియిచ్చి" యనిన నుచితముగా నుండును "తోటపల్లినుంచి గూఢచార్డూవోర్డూ." ఈవాక్యములో గూఢచార్డు పాత్రోచితముగా నుండదు. రాజాముగారి సేవకుఁడు—అచ్చా, అని నిష్క్రమించును. అంతరంబు— హుజూర్—జోహుకుమ్--ఇట్లని నిష్క్రమించుట యుచితము.

ఇవి మేరుచూపుస్వల్పవిషయములు—పద్యగద్యములు హృద్యములుగా ధారాళములుగానున్నవి.

ఉ. చూచెదరేమి ఱిచ్చపడి చోద్యముగా నరిసేనమీఁద నా
రాచపరంపరల్ విడిచిరాలగ గొట్టుదు శత్రుశీర్షముల్
రాచబలంబు, వెళ్లలపరాక్రమముఁ మనభోయసేనపై
ఘాచికవిక్రమంబు నొకసారి విజృంభణమొందనీయరే.

ఉ. వాడట సీతశీలము వసంతదయన్ బ్రకటించి యాపెగా
పాడిన వాడపీవు కడుపావనమూర్తివి మమ్ము నింకగా
పాడెడువేళవచ్చె నిక వత్సవయాన్వయగౌరవంబుగా
పాడుము నిన్నుఁ జొచ్చెద మపారముదంబున పావకేశ్వరా.

వెల రు 1—0—0　　　　కవిగారియొద్దఁ గాకినాడలో దొరకును.

2 ఈ క్రిందివి భోగరాజు నారాయణమూర్తిగారిచే రచియింపఁబడినవి

(1) భారతనీతికథలు:—1, 2 భాగములు. బెడదాడ వెంకటరామ్ అండ్ కో వారు ప్రకటించిరి ప్రతిభాగమునందును 24 చొప్పునఁ జిన్నచిన్న భారతకథలు- ఉపమన్యుఁడు- గురుభక్తి; అగ్నిభట్టారకుఁడు- సత్యవ్రతము; కద్రువ-మచ్చరము; అని యిట్లు శీర్షికలతోఁ గలవు. ప్రతివిషయముచివరను భారతములోని నీతిపద్య మొక్కటి చేర్పఁబడినది. పెద్దతరగతులబాలురకు బడులలోను జదువుకొనుట కర్హములుగ నున్నవి. వెల 1 కి రు 0—6—0

(2) కృతజ్ఞత- (కిడాంబి రామానుజాచార్య నిర్యాణతారావళి) అణాగ్రంథమాలలోఁ బ్రకటింపఁబడినది. రెండుమచ్చుపద్యములు-

1. కవితాతత్త్వము తావకీనఘనసాంగత్యంబున న్నేర్చితిన్
   గవితాశక్తి మఱింత వృద్ధిపఱుపం గాఁగల్గితిన్ వ్రాసితిన్
   నవకావ్యంబులు భావభాసురరసానందంబు సంధిల్ల మ
   త్కవితాచార్యుఁడ వీవ నీకిదె నమస్కారంబు రామానుజా.
2. కవు లెవ్వా రెటువంటి మేటికృతులం గల్పించి విన్పించినన్
   సవరింపందగుచోట్లు తెల్పెదవు విస్పష్టంబుగా నీవు నా
   కవితన్ మాత్ర మొకప్పుడే నిది యిటుల్ గాదంచుఁ బల్కాడ వెం
   తవిశేషం బకపక్షపాతమతియో నాయందు రామానుజా.

(3) విమలాదేవి :—దీనిని వెనుక విజ్ఞానచంద్రికాగ్రంథమండలివారు ప్రకటించిరి. ఇది ద్వితీయముద్రణప్రతి. మూలకథ యబలాసచ్చరిత్రరత్నమాలలో నుండి గ్రహించిరి. కీ॥ శే॥ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు మరాటీలోనున్న విమలాదేవి యనునవలనుండి తెనుఁగుచేసి చెప్పినందున నిందుమూలకథకు మరాటీగ్రంథమునుండి విశేషాంశములు చేర్చి యక్కన్న మాదన్నగార్ల చరిత్రాదికమును స్వయముగఁ జేర్చి వన్నెగలిగించియున్నా మని కవిగారు తెల్పుచున్నారు. 336 పుటలు 40 ప్రకరణములుగల నవల. వెల రు 1—2—0

(4) ఖండుగకట్నము- ఇయ్యది సాంఘికవిషయపద్యకావ్యము- హాస్యరసప్రధానము. హాస్యరసప్రధానము లగుపద్యకావ్యములు మృగ్యము లని తలంచి దీనిని గవిగారు రచించిరి.

క. "పాన్నాడ కామరాజని, యున్నాఁడొకచిన్నవాఁ డయోగ్యుఁడు కాఁడే
   మన్నను నొక్కఁడె; తమ్ములు, నన్నలు లే రాస్తి యెల్ల నతనిదె సుమ్మీ."

డా జయచంద్రుఁ గావ వెలయుచ్వలయుఁ గగనంబుననుండి ఘో
రాజి మురారిచక్రమొ పురారిత్రిశూలమొ, వజ్రివజ్రమో.

దీనివెల రు 1—0—0.

3. శ్రీబాలాత్రిపురసుందరీ స్తవమ్,

ఎఱ్ఱమిల్లి ప్రకాశకవిగారిచే రచింపఁబడిన సంస్కృతము

54 ఆర్యావృత్తములు- కడపట-

గంగాధరరామమహీపతిహితకృత్త్రిపురసుందరీకృపయా
భవ్యమిదం దేవ్యాస్తాదార్యాశతకం ప్రకాశకవ్యుదితమ్

అనియున్నది. కాఁబట్టి యీకవి పిఠాపురసంస్థానపోషితుఁడు- గతసంచికలోని హాసమచ్ఛశతక మీకవిరచించినదే. ఈ స్తవములోని యొక్క శ్లోకము.

అంబ తవకఠహారగాచ్ఛాంసస్ఫుటికాయితాబ్జజాండశతే
కేనా కల్పేనాహం మనల్పా మిహ కల్పయామి తాం ప్రీతిమ్. వెల ౦-౩

4. సుందరి-(నవల.)

గ్రంథకర్త—చెన్నపురిలోని బెంటిక్ హైస్కూలు సీనియర్ తెనుఁగు పండితుఁడు; విద్వాన్ మంకాల శ్రీపతిగారు- ప్రకాశకులు- టి. వి. చెల్లప్ప శాస్త్రి అండు సన్సు (మదరాసు) వారు. వెల 0—10—0

కథ-గ్రంథకర్తగారు వ్రాసినట్లుగా సత్త్వవికల్పనావిశేషావహపూర్వవృత్తము. పీఠికలో "నిందలికథాప్రణాళిక శ్రుతపూర్వ మయ్యు-నశ్రుతపూర్వస్వకపోలకల్పనంబుల నియ్యది యొకనూతనగ్రంథ మని పాఠకమహాశయు లెఱుంగఁగలరు" అనిచెప్పిరి. నిజమే, షేక్స్పియర్ మహాకవి "టెంపెస్టు" నాటకము కథననుసరించి- ఇక్కాలమున సర్వజనాదరణీయమైన పరిశోధకనవలక్రింద మార్చి గ్రంథకర్త శుద్ధమైనభాషలో దీనిని సమకూర్చెను. క్రౌను సైజు 159 పుటలు- ఇరువది యధ్యాయములు-శైలిసర్వసాధారణ మగునవలలశైలికంటె బిగువుగ నున్నది కావున నిది పెద్దతరగతులలోఁ బాఠ్యపుస్తకముగా నియమించుటకుఁ దగియున్నది. భాషావిములకుఁ జదువుకొనుటకు మనసుపుట్టునట్టి కల్పనలుకొన్ని గలవు. అన్నినవలలలోవలె నిందును సందేహములు కొందఱకుఁ గొన్ని కలుగవచ్చును. ఉదా.

"సుందరీమణి చేత నొకభూతదర్పణమున్నది. దూరముగా నున్నవస్తువుల నయ్యది దగ్గఱనున్నట్లు కనఁబడుచును. తననేత్రములకు సరిగా దాని నుంచుకొని యామె సముద్రమునే చూచుచుండెను. నీట మునుంగుచున్న యోడను

జూచెను. జనులయార్తరావము వినెను." వాన, గాలి, తుఫానులలో భూతదర్ప ణము పనిచేయునేమో! ఆర్తరావమువినఁబడునేమో!

264.(డిటెక్టివునవల) 1-2 భాగములు.

ఆంధ్రప్రచారిణీగ్రంథమాల ౫౦-౫౧ పుష్పములు. గ్రంథకర్త కొమర్రోలు నాగభూషణరావుగారు. ఇది యేయితరభాషలకును భాషాంతరీకరణముగాక నాగభూషణరావుగారి కపోలకల్పితమే కావచ్చును. "రెండువందల యిరువదినాలుగు" అను నీనవల మేము ప్రకటించిన పరిశోధకనవలలన్నిటికంటెను విలక్షణమై యద్భుతఘటనలతో నిండి నిమిషనిమిషమునకుఁ బాఠకులయుత్సాహమును అభిరుచిని వర్ధిల్లఁజేయఁగల దని విశ్వసించుచున్నాము......ఈగ్రంథమునందలి విశేషములను మేమే యుగ్గడించుటకంటె పాఠకులే గ్రహింపియానందింపఁగల్గినచో మాయుద్దేశము చరితార్థము కాఁగలదు." అని ప్రకాశకులగు వేంకటపార్వతీశ్వరకవులు వ్రాయుచున్నారు.
వెల ౧ కి ౧-౮-౦

6. మోక్షసోపానములు.

కర్త- కాకినాడనివాసులు ఎ. వి. కామేశ్వరశర్మగారు. ప్రకాశకులు, కాకినాడ రాధాకృష్ణ అండు కో వారు- సమర్పితము శ్రీకృష్ణసేవానిరతులగు భావరాజు లక్ష్మీనారాయణరావుగారికి-                    వెల ౦-౧-౦

ఇందు సత్యమేవజయతి 2 సత్యముఁగొప్పదైవది. ఇట్లు 50 జ్ఞానసూత్రములుగలవు. మఱియుసద్గుణాభ్యాసోపాయములు, మాతృభక్తి, పితృభక్తి యిట్లని బహుశీర్షికలక్రింద విషయములున్నవి. "కంటిరా మనజీవిత మెట్లు వ్యర్థమైపోవుచున్నదో- తుద కీశరీరమును మృత్యుదేవత కర్పించునంతటి వెఱ్ఱులమైతిమి. కాలసర్పము మృత్యుముఖము తెఱచుకొని యున్నది." ఇట్లిందలివిషయము బోధించును. "శ్రద్ధగలిగి యిందుఁజెప్పినవానిని! ప్రేమతోడ నధికభక్తితోడ! నలుపుచున్నమీకు సౌఖ్యంబులొదవును! మోక్షమబ్బు సత్యమయ్య వినుఁడు" అని యీరామభక్తుఁడుగీతముపాడుచుఁ దన్మయత్వమున యతిభ్రంశమైనది యు నెఱుఁగఁడయ్యెను. 36-వ పుటలోనిసీసపద్యమును ముఖపత్రము 4-వ పుటలోనిసీసపద్యమును గూడఁ జాలఁదప్పులతోనిండియున్నవి.

7. శ్రీపమిడిపాటిమహాలక్ష్మీశతకము.

సచ్చిదానందగ్రంథమాల- ౯ అనుబంధము. కర్తలు- (1) గౌరావఝ్ఝల రామకృష్ణశాస్త్రిగారు, (2) సీతారామశాస్త్రిగారు- వీరు శతావధానులు, ఆశుకవిచక్రవర్తులు, అభినవబాణకవులు, నైయున్నారు. కర్నూలుజిల్లా గజ్జలకొండపోస్టు అనంతరవరాగ్రహారనివాసులు, ఒంగోలుతాలూకాలో

ఉప్పుగుండూరు రైలుస్టేషనుకు సమీపమున నున్న పమిడిపాడు గ్రామములోని మహాలక్ష్మి యను దేవతపై నీశతకమును రచించిరి.

"ఈశతకము త్వరితముగా వ్రాయుటచేతను చిత్తువ్రాసిన కాగితములే ముద్రణ కిచ్చుటచేతను ప్రూఫుదిద్దుటలోను కొన్ని ప్రమాదములు బడినవి...... ప్రమాదములు మన్నింపఁ జదువరుల ప్రార్థితులు" అనికవులు వ్రాసికొనిరి. కావున నేమనుటకును సందు లేదు. గ్యాసులైట్లు, బోట్లు మొదలైన యన్యభాషా ప్రయోగము నచ్చటివారు కోరిరఁట కాఁబట్టి "ఉల్లాసంబిప్పుడు, ౧౦౩-మును గుంబో? తిరణాలలో జరుఁడు ౧౦౮ ఇష్టాగోష్టి ౮౯-మాటాడక దీరదు-౧౦౬ మొదలైనపదములను ప్రమాదములక్రిఁద నెంచవచ్చును. ఇరువురుకవులు రచించుచు "కవితాపట్టాభిషేకంబుమాకొదవెఁ దల్లి శతావధానముల నెన్నో చేసితింగాని-౯ పద్యము- నెలవామా కిఁకఁ బోయివచ్చెదము......పోఁగాలాడదయ్యో నతుల్ సలుపుఁగాఁగలఁ బైడిపాటి-౧౧౩ పద్యము-ఇట్టివానిని త్వరితముగా వ్రాయుటలోఁ జేర్పవలయును. ఆశుకవిచక్రవర్తులు త్వరితముగా వ్రాయుటచేతఁ బ్రమాదములు గలిగినవని చెప్పుట తగియుండలేదు. ప్రతిపద్యమునందునఁ జతుర్థపాదాదిని లకారము రానూహించిచెప్పుపద్యములు త్వరలో నూహించిచెప్పిన వాట కష్టము. మచ్చుపద్యములు.

మ. యతియేతప్పునొ ప్రాసమే చెడునొ శబ్దార్థంబులే దోఁచవో
గతిభంగం బగునో యటంచు వెరుకం గన్వోయ కీరీతిగా
శతకంబుల్ రచియింపఁ బూనితిమి యీసాయంబు లోకస్థి మే
ల్గతిచేకూర్పుము పైఁడిపాట్పురమహాలక్ష్మీ త్రిలోకావనీ. ౫

మ. తొలిజన్మంబునఁ జిల్లిగవ్వయిన సాధుశ్రేణి కర్పింపనం
దులకేమో యిటులయ్యె నాబ్రదుకు చేతుల్ రెండు పైకెత్తి మొ
క్కులనర్పించెద నాదునేరములఁ గైకొకుండ నన్నేలుమా
లలితాలంకృత పైఁడిపాట్పురమహాలక్ష్మీ త్రిలోకావనీ. ౧౦౬

శతకముపేరు కూడ పైఁడిపాటిమహాలక్ష్మీశతకమనియున్న హానియేమో తోఁపదు. ఈశతకమును శ్రీపమిడిపాటి అప్పయ్యగారు, రావినూతల కోదండయ్యగారు, పిన్నక నాగయ్యగారు, పల్లబోతు వీరయ్యగారును నూజెళ్ళపల్లె కండ్లగుంట గ్రామస్థులును ధనసహాయ మొనరించి ముద్రింపించిరఁట- దీని వెల ౦-౨-౦- ఇది యేకాక యనేకగ్రంథములీకవులయొద్ద దొరకఁగలవు. సూచీపత్రమునకై వ్రాయుఁడు.

# సంస్కృతదూతకావ్యోత్పత్తివికాసములు.

(పూర్వప్రకటితావశేషము)


యీయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు.

(ఆన్ధ్రగీర్వాణసాహిత్యపరిషదధ్యక్షుఁడు; విజయనగరము.)


IX చన్ద్రదూతః— 1

గోపీకాన్తభట్టాచార్యసూనుఁడగు కృష్ణచంద్రతర్కాలంకారకృతము. శ్రీరాముఁడు లంకాలంకారమగు జానకియొద్దకుఁ జంద్రుని దూతగాఁ బంపుట, యింతలో నితఃపూర్వమే ప్రేషితుఁడగు హనుమంతుఁడు జానకీసందేశమును జానకీజానియొద్దకుఁ దెచ్చుట యిం దభివర్ణింపఁ బడియున్నది.

X చన్ద్రదూతః— 2

జమ్బూకవిసర్జితము. ఇందు 23 మాలినీవృత్తములు గలవు. ప్రతిశ్లోకము నంత్యయమకాలంకారము నుదాహరించును.

XI చన్ద్రదూతః— 3 వినయప్రభువిరచితము.

XII చాతకసన్దేశము:— 4

ఇందు 141 శ్లోకములు గలవు. ఒకానొక భూసురుఁడు తిరువనంతపురాధిపతి యగు రామవర్మమహారాజునొద్దకుఁ జాతకమును (Cucculus Melanoleucus) దూతగాఁ బంపుట యిం దభివర్ణితము. ఈవిప్రుఁ డుత్తరమలబారులో నివసించుచుండి, మలబారుమీఁద 'టిప్పుసుల్తాను' దాడి రా నచ్చటిప్రజలతోపా టీతఁడును జన్మస్థలమును వీడి తిరువనంతపురమునకు వచ్చెను. అట నాతనికి మహారాజసందర్శనభాగ్య మబ్బెను. కాని కొలఁదికాలమున కా బ్రాహ్మణుఁ డాకస్మికముగ రుజాగ్రస్తుఁడై ప్రభువు నాజ్ఞం గొనకయే జన్మస్థల

అధోజ్ఞాపిక—1. "Notices of Sanskrit Manuscripts." Haraprasada Sastri Vol. II. p. 153.

2. "A Third Report of operations in Search of Sanskrit Manuscripts" Bombay Circle (Peterson, April 1884—March 1886) page. 292.

3. "Report on the Search for Skt. MSS. during the years 1884-85, 1885-86, 1886-87-R. G. Bhandarkar, No.354.

4. "Journal of the Royal Asiatic Society" 1884, P. 451.

పునర్గమనోత్కంఠచే వెడలిపోయెను. రోగముక్తుఁడైన పిమ్మట నాతఁడు ప్రభుక టాక్షపునఃప్రసారమునకై యీకావ్యమును రచించె నని తెలియుచున్నది.

XIII చేతోదూతః— 5

ఈకావ్యమున 129 శ్లోకములు గలవు, సంపూర్ణముగా నున్నది. ఆచార్యునియొద్దకు నంతేవాసి నిజచేతస్సును దూతగాఁ బంపుట యిందలివస్తువు. కవి యిందు నిజసమస్యాపూరకప్రజ్ఞాద్యోతకముగఁ గాళిదాసీయ "మేఘదూత" యందలి తురీయపాదములఁ దనశ్లోకములకుఁ దురీయపాదములుగాఁ జేసికొని పైమూఁడుపాదములఁ దాను రచించెను ఈకృతిచమత్కృతి యీక్రింద వివరింపఁబడు విక్రముని "నేమిదూత" (సంఖ్య XVI) యందును, మేఘవిజయుని "మేఘదూతసమస్యాలేఖ" (సం. XXXIII) యందును, చారిత్రసున్దరగణికృత మగు "శీలదూత" (సం. XXXVI) యందును, జినసేనుని "పార్శ్వాభ్యుదయము" నందును గూడఁ జూడనగు.

XIV జైనమేఘదూతః— 6

మేరుతుఙ్గకృతము; ఇతఁ డచ్చలగచ్ఛనివాసి. క్రీ శ పంచదశశతాబ్దిలో విలసిల్లియుండెను. "ప్రబన్ధచిన్తామణి" (Translated into English by Prof. Tawney in the Bibliotheca Indica Series') మొదలుగాఁ గలగ్రంథముల రచించిన (Vide J. B. B, R. A. S. Vol. IX P. 147) మేరుతుఙ్గాచార్యకవివర్యునికంటె నీతఁడు భిన్నుఁ డని తెలియుచున్నది. ఇరువది రెండవ జైనతీర్థంకరుఁ డగు 'నేమినాథుఁడు' సంసారవిముఖుఁడై, తపోనిరతుఁడై యూబూపర్వతారణ్యములకు వెడలిపోయెను. దుర్భర మగుయావజ్జీవవిరహవేదనచే స్రుక్కి యాతనిసతి, పతి నైహికసుఖసుముఖునిజేసి తీసికొనివచ్చుటకై మేఘుని దూతగాఁ బంపుట యిందలియితివృత్తము. ఇందు నాలుగుసర్గలు గలవు; అందుఁ గ్రమముగా 50; 49; 55, 42, శ్లోకములు గలవు.

XV తులసీదూతః— 7

వైద్యనాథభట్టాచార్యునిచే, శా. శ. 1706 వ సంవత్సరమున రచింపఁబడెను. ఇందు 54 శ్లోకము లు గలవు. మధురానగరమున నున్న శ్రీకృష్ణుని

5. "ఆత్మానన్దగ్రన్థమాల"—సంఖ్య, 25, పరిశోధకుఁడు:- వల్లభదాసత్రిభువనదాసగాంధి, కార్యదర్శి—'జైనాత్మానన్దసభ'-భావనగరము. 1924.

6. "శ్రీజైనాత్మానన్దగ్రన్థమాల" సంఖ్య-76; భావనగరము. 1924

7. ఈకావ్యము యొక్క వ్రాఁతప్రతి కలకత్తా "సంస్కృతసాహిత్యపరిషత్తు"లో నున్నది

సన్నిధికి, బృందారణ్యములోని గోపికలు, (శ్రీమహావిష్ణువునకు) శ్రీకృష్ణుని కల్యాంతచేతోమోహప్రదాయక మగుతులసీదళము దూతగాఁ బంపుట యిట వర్ణితవిషయము.

✓ XVI నేమిదూత:— 8

విక్రమకవికృతము. పూర్వోపవర్ణిత "జైనమేఘదూత" యందలి యితివృత్తమే యీ కావ్యమునఁగూడ వర్ణితము. ఇందు 123 శ్లోకములు గలవు. పూర్వోల్లిఖిత "చేతోదూత" (సం. XIII) వలెను, మేఘవిజయుని "మేఘదూతసమస్యాలేఖ" వలెను (స. XXXIII) చారిత్రసుందరగణికృత "శీలదూత" వలెను (సం. XXXVI) జినసేనుని "పార్శ్వాభ్యుదయము" వలెను "నేమిదూత" యందుఁగూడ గాళిదాసీయ "మేఘదూత" యందలి చతుర్థపాదములతో సమస్యాపూరణచమత్కృతి చూపఁబడినది. ఇట నేమినాథుని యొద్దకు నాతనిసతీతిలకము పర్వతమును దూతగాఁ బంపుట వర్ణితము.

*Sriman Krishnamacharya opines in his "History of the Classical Sanskrit Literature" pp. 128-29:—

"Vikrama was the son of Sangama. He flourished in the square of our modern Ceded Districts about the first half of the 17th cy. His Nemiduta is a beautiful little poem of 124 (126?) stanzas. 'Nemi' of the 'yadu' race, longing for salvation, gave up his riches and in his wanderings, took shelter in an 'Asrama' the same as was the resort of the forlorn 'Yaksha' of Kalidasa. His wife followed him and seeing her husband entirely imbibed ascetic tendencies, asked a mountain to carry a message. The story keeps close pace with the 'Meghaduta' and what is most wonderful is that every last line of the latter work is kept unhandled and the three other lines are framed to suit the meaning and the context. The poet had apparently an exercise in समस्यापूराणम्."

—। ఈ కావ్యమునుండి కొన్ని శ్లోకముల నుదాహరించెద ।—

౧ శ్లో॥ ప్రాణిత్రాణప్రవణహృదయో బన్ధువర్గం సమగ్రం
హిత్వా భోగాన్ సహకరిజనై రుగ్రసేనాత్మజాం చ
శ్రీమన్నేమి ర్విషయవిముఖో మోక్షకామ శ్చకార
స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామగిర్యాశ్రమేషు. ౧

8. బొంబాయి "కావ్యమాల" II. గుచ్ఛము సంఖ్య. 7

౨. శ్లో. సిద్ధే స్సఙ్గాం సమభిలషితః ప్రాణనాథస్య నేమేః
సా తన్వఙ్గీ విరహవిధురా తచ్ఛిరోధిష్ఠితస్య
తత్సంమోహా ద్ద్రుతమనునయం శైలరాజం యయాచే
కామార్తా హి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు. ౫

3. శ్లో. ఏతత్తుఙ్గం త్యజ శిఖరిణః శృఙ్గ మఙ్గీకురుష్వ
ప్రాజ్యం రాజ్యం ప్రణయమఖిలం పాలయ స్బన్ధువర్గే
రమ్యే హర్మ్యే చిర మనుభవ ప్రాప్య భోగా నఖణ్డా
న్సోత్కణ్ఠాని ప్రియసహచరీసంభ్రమాలిఙ్గితాని. ౨3

౪. శ్లో. అస్మా దద్రేః ప్రతిపథమధః సంచర న్దానవారేః
క్రీడాశైలం విమలమణిభి ర్భాసురం ద్రక్ష్యసిత్వమ్
అన్తఃకాన్తా రతరసగలద్భూషణై ర్యో యదూనా
ముద్దామాని ప్రథయతి శిలావేశ్మభి ర్యౌవనాని. ౨౬

౫ శ్లో. తస్మిన్నుద్యన్మనసిజరసాః ప్రాంశుశాఖావనామ
వ్యాజాదావిష్కృతకుచవలీ నాభికాఞ్చీకలాపాః
సంధాస్యన్తే త్వయి మృగదృశ స్తాస్స్వచిత్రా న్విలాసాన్
స్త్రీణా మాద్యం ప్రణయవచనం విభ్రమో హి ప్రియేషు. 30

XVII పదాఙ్కదూత—9.

మహామహోపాధ్యాయ కృష్ణ (చన్ద్రకవి) సార్వభౌమప్రణీతము. ఈకవి సుగృహీతనాముఁడును, నవద్వీప(Nuddea in Bengal)ధినాథుఁడు నగు కృష్ణచన్ద్రమహారాజుయొక్క జనకుఁడగు రఘురామరాయమహోదయుని యాస్థానపండితుఁడు. ఈకావ్యము శా. శ. 1645 లోఁ బూర్తి చేయఁబడెను. బృన్దావనవాసిను లగుగోపికలు మధురాపురమున నున్న శ్రీకృష్ణునిసన్నిధికి శ్రీకృష్ణపదాఙ్కము (పదచిహ్నము; Footprint) నభ్యర్థించుట యిందలియితివృత్తము. కాళిదాసమేఘదూతకుఁ బిమ్మట వంగదేశప్రాచీనపండితు లీకావ్యము నే యతిమాత్ర మామోదింతురు.

9. (i) "కావ్యకలాపము" —హరిదాసహీరచంద్రప్రకటితము. (బొంబాయి;) 1874) పుట 53,

(ii) "కావ్యసంగ్రహము"—భువనచంద్రబసక్ ప్రచురితము. (కలకత్తా; 1874.) పుట. 197.

* (From "AD. C. S. MSS. in the Madras Got. Or. Mss. Libary Vol. XX. No. 11859, page 7935.)

"Padankadutam is a small poem by Mahamahopadhyaya Krisna Sarvabhauma. Contains 46 stanzas. Apparently composed in imitation of Magha. The substance of the poem—a certain Gopi finding Srikrsna absent from her, sends to him his footmark as a messenger."

మద్రపురప్రాచ్యలిఖితగ్రంథాలయపట్టికనుండి "పదాఙ్కదూతము"లోని కొన్నిశ్లోకముల నుటంకించెద —

శ్రీ

"శ్లో. గోపీభర్తు ర్విరహ(మ)విధురా కాచిదిన్దీవరాక్షీ
ఉన్మత్తేవ స్ఖలితకబరీ నిశ్వసన్తీ విశాలా
ఆర్తైర్వాక్యై ర్మురరిపురితి భ్రాన్తి దూతీసహాయా
త్యక్త్వాగేహం ఝటితి యమునామఞ్జుకుఞ్జం జగామ. ౧

శ్లో. అప్రాప్యైవ వ్రజపతిసుతం తత్ర కాలం కియన్తం
మూర్ఛాప్రాణా ప్రియతమసఖీ సఙ్గతా సఙ్గమయ్య
తస్యాపాన్తే కులిశకమలస్యన్దనాంగాదియుక్తం
పద్మాకారం మురహరపదన్యాసచిహ్నం దదర్శ. ౨

శ్లో. తస్మిన్నద్య స్నవజలధరధ్యాన మాకర్ణ్య భూయః
కన్దర్పేణ వ్యథితహృదయోన్మత్తతుల్యా యయాచే
ప్రజ్ఞాహీనం వచనరహితం నిశ్చలం శ్రోత్రహీనం
దౌత్యం కర్తుం మురహరపదో లక్ష్మణా పక్ష్మలాక్షీ. ౩

శ్లో. రమ్యం యావ న్మురహరపదే శోభతే తావదేవ
త్వ య్యప్యాస్తే కులిశకమలస్యన్దనాంగాఙ్కశాది
గోపీదౌత్యప్రకటనభియా సన్నిధౌ చక్రపాణే
ర్ధ్యానే ధీరప్రముఖముఖరో నూపురో నప్రహీతః. ౪

iii. "కావ్యసంగ్రహము"—I సంపుటము- పండితజీవానన్దవిద్యాసాగర భట్టాచార్య ప్రకటితము (కలకత్తా; 1888) పుటలు 507—530.

iv. "కావ్యసంగ్రహము" జాన్ హైబెర్లిన్ పండితప్రకటితము (కలకత్తా, 1847)

v. మఱియుఁ గవిరత్న శ్యామచరణనూరి దీనిని బెంగాలీలిపిలో, సంస్కృతవ్యాఖ్యానముతో వంగభాషానువాదముతోఁ బ్రత్యేకముగఁ బ్రచురించెను.

(Bengal Medical Library—Calcutta. Saka, 1826.)

కావ్యోపసంహారశ్లోకములు —

శ్లో. మూర్ఖా ఏవ క్షణిక మనిశం విశ్వమాహు ర్న ధీరాః
ఖేదోఽస్మాకం హరివిరహజః సర్వదైవాస్తి చిత్తే
నాన్యః శబ్దో వచన మపి యత్తాదృశం తస్య కిన్తు
ప్రేమైవాస్య త్రియతమకృతం తచ్చగోపాఙ్గనాసు. ౫

శ్లో. శాకే సాయక వేదషోడశ (1645) మితే శ్రీకృష్ణశర్మార్పయ
న్నానంద ప్రదనన్ద నన్దన పదద్వన్ద్వారవిన్దం హృది
చక్రే కృష్ణపదాఙ్కదూతరచనం విద్వన్మనోరఞ్జనం
శ్రీలశ్రీయుతరామజీవనమహారాజాధిరాజాజ్ఞయా

XVIII. పవనదూత—10ధోయీకవిరాజకృతము. ఇతఁడు గౌడ(వంగ) దేశాధీశుఁడు నభినవవిక్రమార్కుఁడు నగు లక్ష్మణసేనుని యాస్థానము నలంకరించిన పండితరత్న పఞ్చము(పంచకము)లో నొకఁడు. * ఉమాపతిధరుఁడు (పారిజాతహరణనాటకనిర్మాత?), జయదేవుఁడు (గీతగోవిందనిర్మాత), శరణుఁడు, గోవర్ధనుఁడు (ఆర్యాసప్తశతి కారుఁడు), శ్రుతిధరుఁడు, ధోయీ యనుకవిపండిత పఞ్చము లక్ష్మణసేనునిసభ నలంకరించెను. కాని శ్రీచిన్తాహరణచక్రవర్తి నిర్మిత "పవనదూత" పీఠికవలన శ్రుతిధరుఁ డని 'ధోయీ'కి బిరుద మనియు, లక్ష్మణసేనుని యాస్థానములో నయిదుగురుకవులు మాత్రము విలసిల్లి రనియుఁ దెలియుచున్నది. (Vide Pandit Chintaharana Chakravarti's 'Introduction to the Pavanadutam'—Pp. 2—4

జయదేవమహాకవి "గీతగోవిన్దము"లో "వాచఃపల్లవయ" తీత్యాది శ్లోకములో "ధోయీకవిక్ష్మాపతిః" అని వ్రాసియున్నాఁడు.

"పవనదూత" గద్యములో "ఇతి ధోయీకవిరాజవిరచిత"మ్మని యున్నది.

ధోయీకవి తన్నుఁగూర్చి "కవిక్ష్మాభృతాంచక్రవర్తీ" అని 101 వ శ్లోకములోను, "కవినరపతి" యని 103 వ శ్లోకములోను, "పవనదూత"లో

10 మొదట నీ కావ్యము "వంగదేశీయాసియాసమ్మేళనపత్త్రిక"(J. A. S. B., 1905, pp. 53—68) లోఁ బ్రచురితము. పిమ్మటఁ బ్రత్యేకముగా శ్రీమత్పండితచిన్తాహరణచక్రవర్తి చే, సవిమర్శక, చారిత్రకభూమికతోడను, సంస్కృతలఘుటీకతోడను, పాఠభేదములతోడను, "సంస్కృతసాహిత్యపరిషద్గ్రంథావళిలోఁ (సంఖ్య 18) బ్రకటింపఁబడెను. 1926.

వ్రాసికొనియున్నాఁడు. అందుచే ధోయీ "కవిరాజ" బిరుదాభిధానుఁ డని నిశ్శంకనీయముగఁ జెప్పవచ్చును.

బాలకవి, కవిరాజబిరుదభాజి యగు రాజశేఖరమహాకవి "కావ్యమీమాంస" యందు దశవిధకవుల నిట్టులు నిర్వచించెను. (9 వ పుట)

"దశచ కవే రవస్థా భవన్తి. తత్రచ బుద్ధిమదాహార్యబుద్ధ్యోస్స ప్తతిస్రశ్చ ఔపదేశికస్య తద్యథా. 1. కావ్యవిద్యాస్నాతకః 2. హృదయకవిః 3 అన్యాపదేశీ 4. సేవితా. 5. ఘటమానః 6. మహాకవిః 7. కవిరాజః — 8 ఆవేశికః 9. అవిచ్ఛేదీ 10. సంక్రామయితా చ. * * * యోఽన్యతరప్రబన్ధే ప్రవీణః స మహాకవిః. యస్తు తత్ర తత్ర భాషావిశేషే తేషు ప్రబన్ధేషు తస్మిం స్తస్మిం శ్చ రసే స్వతంత్రః స కవిరాజః,

ఇందు దశవిధకవులలో నారోహణక్రమమున నాఱవవాఁడు మహాకవి. ఏడవవాఁడు "కవిరాజు" బహుభాషాభిజ్ఞాతుఁడు, వివిధప్రబన్ధప్రణేత, రసభావనిరంతరకవితాదక్షుఁ డే "కవిరాజ" బిరుదార్హుఁడు. "కవిరాజు" మహాకవికంటె నధికుఁడు ధోయీ, రాజశేఖరోక్తకవిరాజలక్షణలక్షితుఁ డని మనమూహింపవచ్చును.* శ్రీచిన్తాహరణచక్రవర్తి మహాశయులు "పవనదూత" పీఠికలో ధోయీకవి కవితావైభవమును గూర్చి యిట్లు వ్రాసియున్నారు.

* "Judging from the available remnants of the works of Dhoyi, we can safely conclude that he was a poet of no mean order. In his 'Pavanaduta we find him using an elegant and easy going language interspersed occasionally with beutiful figures of speech. Though an imitation of Kalidasa's 'Meghaduta,' it still exhibits a good deal of poetic skill and in it, we meet with a good many specimens of really good poetry. ......... The verses attributed to Dhoyî in the 'Saduktikarnamrta,' testify to his uncommon poetic talents and amply justify his title.............. However, to do justice to ourselves, it ought to be stated here that Dhoyì, not unlike the multitude of Indian poets, is not free from conventionalism which sometimes seems to mar the beauty of his com-position. In the pathetic description which we get here of the heroine separated from her lord, we meet with a full display of poetic conventions. We have here the description of lotus-stems, sandal-paste, and all those usual things which poets have made a rule to describe as objects intended for the pacification of love.

fever. But he is found to have possessed the not very common power of being able to create quite a new and beautiful situation with the help of the most common place poetic conventions, which is apt to reveal the poet in him. Hence it is that the description of the love-pangs of the heroine to which thirty-one verses(63-94) are devoted by the poet,can surely be regarded as one of the finest products of Sanskrit Literature. The description is vivid, life-like and is full of pathos and does not consist merely of a useless jargon words. ...............His imitation of Kalidasa goes to the extent of his incorporating sometimes some of the very expressions used by the latter................But it must be said to the credit of Dhoyi that he is by no means a slavish imitator in as much as even in cases where there are palpable traces of his indebtedness to Kalidasa, he introduces something new and relishing which alone can entitle him to the rank of a great poet. *

లక్ష్మణసేనుఁడు ప్రాపంచికదిగ్విజయార్థము బయలుదేఱి, దక్షిణాపథముపై వెడలినపుడు, మలయాచలమున నివసించు 'కువలయవతి' యనుగంధర్వకాంత యాతనియం దతిమాత్రబద్ధానురాగయై, వసంతకాల మాసన్నముకాఁగా విరహవేదనను సహింపనోపక లక్ష్మణసేనునియొద్దకు వాసంతపవనుని దూతగాఁ బంపుట యీకావ్యమున నభివర్ణింపఁబడెను.

దూతకావ్యములలో నీకావ్యము ముఖ్యస్థానము నలంకరించుటచే దీనిం గూర్చి విశేషముగా వ్రాయఁబడినది.

*రసికాస్వాదనమునకై యీకావ్యసుధాబ్ధినుండి కొన్నిబిందువు లొసంగఁబడుచున్నవి—

1. శ్లో. అస్తిశ్రీమ త్యఖిలవసుధాసున్దరే చన్దనాద్రౌ
గన్ధర్వాణాం కనకనగరీ నామ రమ్యో నివాసః
హైమైః క్రీలాభవనశిఖరై రమ్బరం వ్యాలిఖద్భి
ర్ధత్తే శాఖానగరగణనాం యః సురాణాం పురస్య. ౧

2. శ్లో. తస్మిన్నేకా కువలయవతీ నామగన్ధర్వకన్యా
మన్యేజైత్రం మృదుకుసుమతో ఽప్యాయుధం యాస్మరస్య
దృష్ట్వా దేవం భువనవిజయే లక్ష్మణం క్షోణిపాలం
బాలా సద్యః కుసుమధనుషః సంవిధేయా బభూవ. ౨

క. భూరిప్రసాదమధురిమ, ధారాగుంభ(ము)ల సంతతస్ఫురదోజ
స్సారముల నభ్రమండలి, గారించు న్నవరసప్రకారపుఁ గవికన్. ౭౫

ఉ. జీవనమున్ హరించియును, జెల్వఁ గాపియు, జన్మకోటికిం
గేవలహానిఁ జేసియును, గేరు నిముం డరుగన్ ఘన [illegible]
జీవనవృద్ధి గైకొనుచుఁ జెల్వఁ గూడును జన్యసంతతుల్
రేవి వహించు రాజు ప్రతిష్ఠతఁ గాంచె నదీవిలాసినుల్. ౭౬

గీ. పటుఘనాఘనమండలి ప్రసరదసమ
వర్షధారానిరస్తసంజ్వరత గాంచుఁ
జాతకోఁ(డు)తద్గుణముఁ జెందు జగమునందు
విషమభావంబు గైకొను విస్ఫుటముగ. ౭౭

క. నవరసబంధుర మేరియు, నవిరళకర్ణాతికటురవాన్విత మయ్యెన్
*అవగతరసావకర్షం, బవునే యుత్స్పృష్టరసమహత్త్వంబు మొగుల్. ౭౮

క. ఘనమండలి యత్యున్నతి, గనుఁ †దొల్తం బిదపఁ గరకకలితకుసుమజా
లనవజలసేకములఁ దా, మొనయుంపుమ నీలకంఠముద మొనరించున్. ౭౯

చ. సరసఘనానుషంగమున సంతతతాపము మాని భూమి దు
ర్భరతరపంకమగ్నతఁ బాల్పడియుం బికింప నద్ది యే
కరము నిదానమౌ జగదఖండసుఖంబున కాదిమూలమై
పరఁగు నపారసాధుఫలభారసమృద్ధికిఁ జిత్రమెంతయున్. ౮౦

చ. పడమటివెట్టచేఁ గడు పభంగురవేదన గాంచెఁ జూచి తాఁ
జిరిముడి(పా)టుమై నిమురఁ జెందక నందకపాణి యప్పు డా
కడుసెకపేరడంగఁ దనకాన్పు సుఖంపఁగ రెండుకన్నులున్
బడలిక దీఱ జెల్వుగొన వారిధిఁ గూర్చు ఫణీంద్రశయ్యపై. ౮౧

క. ఉరుగర్జితవాద్యధ్వని, సురుచిరకేకానినాదశుభ(గీ)తంబుం
దరుణమయూరీనృత్యము; పరఁగన్నాట్యంబు మిగుల భాసిలఁ జుండున్. ౮౨

గీ. ఘనతగర్జ్జ జగద్రక్షకత జడత్వ
మార్ద్రత ఘటిల్లెఁ గావున నచట భత్వ
ముత్పరమా‡ఁచితమన్న యొఱపు మీఱఁ
బాదలి వర్షాభ్రములు చాల రోదలు సేయు. ౮౩

సీ. నిర్ఘాతగర్జితనిరుపమకోపప్రసాదవిహారోన్నస్ఫూర్తులు చాలఁ దొలుక
విద్యున్నటీలాస్యవిలసనంబులు మీఱ నాపారకారుణ్య మతిశయిల్లఁ

---

*అవితరసావకర్షం-మూ. †దొల్తటిపిదప-మూ. ‡నుచితకన్నె యొఱపు-మూ.

జాతకబర్హిణచతురార్ధు లలరంగ జాతు లామోదవిస్తార మెనయ
ఫలహేతుధర్మసంభరణశక్తి చెలంగ సంతాపవార్తలు శాంతిఁగొనఁగ
రాజహంసవిలాసంబు రాణఁదోలఁగ, సముశవర్తిల్లు చున్నతస్థాన మెనసి
ధరణిపాలించె ఘనుఁడుచిత్రంబుగాఁగఁ, బాక మొక్కటి యెక్కు వైపరఁగఁగా నీ
గీ. మానకృతమైనవిరహంబుఁ బూనన య్యెఁ, దరళనయవల కవ్వేళ ధరణిఁగోన
ఖనకసంపాదితద్రవ్యగౌరవంబు, సాధికరణంబు కర్ణధారాళి నయ్యె. ౮౫
క. కట్టువడె నేటికాల్నడ, బెట్టుగ వర్షములఁ గొనెను బేరముతోడన్
మిట్టమిఱ్ఱులుపల్లెలు, గట్టిగ మొనచూపసాగెఁ గఱ్ఱులతోడన్. ౮౬
ఉ. కాలువ లెల్ల బల్నదులకైవడిఁ గాంచె నదీలలామముల్
గేలి యొనర్పఁగాఁగడఁగెఁ గేవలమబ్ధి నతండు నీరమా
త్రాలయుఁడైనఁ దావికృతినందక యుండు వికారహేతువుల్
చాలమెలంగినన్ వికృతిసంగతిఁ గాంచునె ధీరచిత్తముల్. ౮౭

—। శరదృతువర్ణనము ।—

క. తరువాత శరత్సమయం, బరుదుగ ఘటియిల్లె నంబుజాతస్వాపా
పరనామకబహిరంగము, హరియింపఁగఁజాలు నంతరంగం బనఁగన్. ౮౮
గీ. వారివాహారసారంగవర్ధమాన, బహునదీపంకబాహుళ్యపాటనక్రి
యాతిదక్షిణరామనామాభిరాము, మై శరత్కాల మామోదములరనమరె. ౮౯
సీ. కాలవశాగతఘననీలతా స్థాయిభావభిదాదేశభద్రమూర్తి
సర్వనరిన్నిరసంపదనచ్ఛతాద్విగ్వానవాల్మీకిదీవ్యశక్తి(?)
రుచిరకేకివచోవిరుద్ధధిక్కృద్దోమనమునభినై ష్కసంశ్రయంబు(?)
సరసిజాహితబింబసత్త్వాశోభాతిశయహేతుహితపరిష్కారమహిమ
మూర్జితహరిప్రబోధగురూపదేశ, మఖిలహంసగణాకర్షణాఢ్యమంత్ర
మంబుజాతప్రభావ్యంజితాంజనంబు, దనరె నతయు శరదభిధానఋతువు.
క. సరసతరకల్మిఁ బ్రసాద, స్ఫురణంబున నదులు మెలఁగఁ జోద్యంబగు నే
విరసితభావము నందియు, నరుదారఁ బ్రసన్నభావ మందె నరుదుగన్. ౯౧
క. కలుషతఁ గడపెనుశరదృతు, వాలయఁగ సుఖపారవశ్య మొదువ న్నదికాం
తలపులినతటితటంబుల, నలరారఁగఁ బూని రమలహంసకగణముల్. ౯౨
గీ. అలకళాధరు నలరించి యవనిపంక, పటిమ వారించి యుద్యోగిబంధ మెడపి
శరము విడువక యాశరత్సమయ మెనయు, నేటిబోటులకలుషతమీఱెమెఱెయు.

క. ఆతటి నంతయు విమలం, బై తనరెం బ్రోషితాంగనాంబర మొకఁడున్
శ్రీతరుణీతోడుమై వి, ఖ్యాతిన్ వర్తిల్లునొక్కయుంకము కొదగన్. ౯౪

క. జీవన మంతయు లోకో, జ్జీవనమున కిడుచుఁ గార్యసిద్ధి వడసి పై
కేవలపలితంబుగఁ దా, బోవదె ఘనపాళి యకుపుంగవుదిశకున్. ౯౫

మ. పటుసంరంభవిలాస మొప్పఁగ జగత్ప్రాణుండు ప్రేరేప ను
త్కటగర్జాకృపణోక్తు లప్పతిల లోకత్రాణకై జీవనం
బటు వోవైచి యసారుఁడై ఘనజనుం డాహా వెలంబోయి దా
నటునిట్టున్ భ్రమియించు ఘుంకు సౌఖ్యం బబ్బునే స్వాస్యతిన్. ౯౬

క. రాజధనుస్సులు నిర్జర, రాజధనుస్సుల మెలంగు*రాణాంభాంధ
స్త్రీజనచంచలహృద యూం, భోజంబుల నీటికలఁక పూని వసించెన్. ౯౭

చ. నెలయనుమోము లక్షునను సిద్ధపుఁగస్తురిబొట్టుఁ జెంద వి
స్తులఘనకేశపాశము ప్రసూనవిభాసిత మై మెలంగఁగా
విలసదనూనతారకలవింతరుచుల్ దిశలం జెలంగఁగా
వెలయుచు నభ్రలక్ష్మి యతివేల మొనర్చు ముదంబు చూడ్కికిన్. ౯౮

గీ. మధురరసము ప్రసన్నత మూన కూని
మధ్యవృత్తులుగొనుచు నిమ్నగలు కృతుల
చెలువు గైకొని మోదంబు సేయఁ బూనె
ఘనముగఁ బత్త్రపక్షంబు గలుగునేని. ౯౯

గీ నీరసం బౌచు జాడ్యైకదూర మగుచు
సుప్రసన్నత గైకొని దీప్రవిష్ణు
పదమునందు మెలంగునప్పటిజలదము
పుణ్యపురుషునిభావంబు పొందు గొనియె. ౧౦౦

క. నెల ధీరలలితుఁ డయ్యెడు, నలనిర్జరపదవి రంగ మనదగుఁ దచ్ఛ్రీ
వెలుఁగునటియగును దారలు, లలితతదంజలివినిస్సరన్మృదుసుమములు. ౧౦౧

గీ. లలితమైతోఁచునట్టి కళాపదంబు, వింతయైతోఁచు† నేల యమాంతమైనఁ
దలఁపఁ జిత్రంబుగాదె ద్రుతప్రకృతికి, విషగుమై యుద్ది మిక్కిలి వెలయుచున్న.

క. మధురరససాధకంబై, యధిరాజసుహారణక్రియాబోధక మై
యధిగతరససంకరవా, ర్ప్రధిమం గొని యాశరత్తు ప్రౌఢిమ మెఱసెన్. ౧౦౩

క. ప్రకటితకాశాకాశా, వికలసవర్ణత శరత్తు విదితం బయ్యెన్
వికృతికిఁ బ్రకృతిత్వము గొని, ప్రకృతికి వికృతిత్వ మొందు భావన్నగుచున్

* రాణగొనుంబాం । ధారాచంచల – మూ† నె రమాంతమైన–మూ.

## —। హేమంతఋతువర్ణనము ।—

క. సర్వజగద్విజ్ఞానా, ఖర్వనిదానాబ్జమిత్రఘనరుచివిద్యా
సర్వస్వహృత్యవిద్యా, ధూర్వహమై మించుమంచు దూకొనె బిదరన్. ౧౦౪
ఉ. తమ్ములదాయ మేల్గనఁగఁ దాళక తమ్ములనేఁచ మంచు చి
చ్చు మ్మరియాదమీఱ వడిఁ జొప్పఁగఁ దమ్ములతోడ నాత్మ స
ఖ్యమ్ము భరించు కల్వలును గాఱియఁ జెందెను మిత్రవర్గమా
తమ్ము నెఱుంగఁడయ్యె నుచితస్థితిఁ గాంచ జడుండు నేర్చునే. ౧౦౬
క అహతాకారతఁ *గైకొనె, మిహికాసమయంబునందు మిగుల నెగడుచున్
మిహికాసముదయమంతట, రహి†సంసృతియనఁగ‡వింత ప్రాయఁగనగునే.
ఉ. నింగికిముట్టి తోడుతన నీటుతొలంచెడు వింధ్యశైలముం
జెంగఁగఁజేయ మంచుమల చిత్రముగా వడి రోదసుల్ గడుం
బొంగుచుఁ గ్రమ్మెనో యనెడుబుద్ధి జగంబుల గావహిల్లఁగా
భంగము లేక యెల్లెడలఁ బర్వె హిమాని నిరంతరంబుగన్. ౧౦౮
క. మంచు గిరితరుల ముంచఁగ, వంచకభిల్లుండు వెదకు వలిపులతోన్
ఎంచుకొనఁగడఁగి రమరు లుదంచితనిజనిలయనివసదామరతరులన్. ౧౦౯
క. అరూఢహిమ మడంపఁగ, నేరుపు గొనఁడయ్యె నినుఁడు నెఱిఁబగటను నీ
'హారమివభాస్కరఇతి', స్వారోపమ యొనర మిగుల జతనంపడియెన్
క. పదవర్ణస్ఫోటంబులు, గదియింపుచు ముఖపదముల ఘటియించఁ గడుం
బదిలముగ ధ్వనులు శాబ్దిక, భిదురధరస్ఫూర్తి హిమము పెంపుమిగులఁగన్.
గీ. ముఖపదోచ్ఛ్రయమున ధ్వనుల్ మొనయఁజేయఁ
జాల నెనయించు రూపకమీలనముల
హిమకవి యొనర్చుదృష్టాంతకములగరిమ
సమజగత్ప్రతియధరవ్రణములుగాని. ౧౧౩

## —♦ శిశిరఋతువర్ణనము. ♦—

గీ. దాసిపిమ్మట మార్తాండభానుచండ, భావసంస్తంభనావధప్రాభవంబు
సంగతహసంతికాదృఢాలింగనైక, ఘటనచేటంబు నగుశీతకాల మొదవె.
చ. చలి యిడు వేదనం బడఁగఁజాలక పద్మజశౌరిశంకరుల్
మెలఁతల నాననాబ్జమున మించునురంబున సామిమేనున

*కైకొని- †సంసృతి- ‡వింతరాయఁదగునే మూ-

న్నిలుపుచు నవ్వేతం గడవ నేటికిఁ బాయదు తత్ప్రదేశముల్
ఁజెలువలు గారవం బరుగఁ జేయుఁగ న*ద్దశకోర్వనేర్తురే. ౧౧౪

గీ. అగ్నిదివసాంతసమయవిన్యస్తమిహిర, పటుమహఃపూరసంపూర్ణబలుఁడుగాన
సంతతాత్మీయకేవలసన్నిధాన, కలన శీతంబు వారించుఁగా యొకింత.

ఉ. శీతముచేత బాధపడు చిత్రజగంబు భరింపఁగా జగ
త్ప్రీత దినేశుఁ డీశ్వరతఁ దాల్చుచు నంబరమధ్యసీమఁ దాఁ
జాతురి నేగుచు న్నిటలచంచదచంచలదృష్టి కించిదు
న్నీతము చేసెఁ గావలయు నిమ్మి ఘటిల్లి వారించుశీతముల్. ౧౧౫

క. కాంతభృశాలింగితధృఢ, కాంతాకుచకుంభమధ్యగతసూక్ష్మబిలాం
భ్యంతరము గని యనంగత, కెంతయునలసుచును మదనుఁ డెడ మ్ముంజలికిన్

చ. అరమెయినుండు నద్రిసుత యందపుఁ గౌఁగిలి లేక చిచ్చు క
న్నర కడు శీతలింపఁ జలి కడ్డము సేసెను గరనాళము
ర్భరగరవహ్ని మంచుమలరాయునియల్లుఁడు దేటచందమా
మరసిగలో విషాతిఖరమా బలుకొండలి లోఁగఁగట్టుచున్. ౧౧౭

క †చలికిన్లోఁగకఁ నిలిచిరి, వలివెలుఁగులు వెదలు చల్లువాఁ డొక్కరుఁడున్
విలసత్కాలాగరువా, వలిగుబ్బల నండగొన్నవాఁ డొక్కరుఁడున్. ౧౧౮

క. అప్పప్ప యేరికైనఁ, జెప్పంగా శక్యమా నె శీతముమహిమల్
నిప్పుల కప్పులకుం దాఁ, దప్పక యన్యోన్యసదృశతను ఘటియించున్.

గీ. మూర్తికౌటిల్య మెంతేని మొనయఁ జేయు, నధరశబ్దప్రచారంబు లసరఁ జేయు
శీతలరసాతిదూరతఁ జెందఁ జేయు, శిశిరకాలంబు దలఁప విచిత్ర మయ్యె.

శా. ఈరీతిన్ ఋతువుల్ విరాజిలఁగ నయ్యేణాక్షి పద్మేక్షణా
కారధ్యానరసానుభూతి ఘటితాఖండప్రమోదప్రవా
హారజ్యన్నిజవృత్తియై చు హృదయం బన్యక్రియాజ్ఞానమా
ర్గ్యారూఢం బయి యొప్ప నక్కజపునిష్ఠం బూని యుండెంగడున్. ౧౨౨

క. జగదండమండనోజ్జ్వల, భగవత్పదవాచ్యనామ ప్రణమజ్జనతా
సుగమ నిగమాంతమానస, ఖగరాజా రవితనూజకల్పమహీజా. ౧౨౩

గద్య ఇది శ్రీమద్రామచంద్ర చరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి మాధవ
యజ్వసముజ్జ్వలత్కృపోక్షిత కలాభ్యాసాదిత పాండిత్యాభరణ ప్రభంజనవం
శాబ్ధి రాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవనన్నయభట్టా
రక అహోబలపత్యాహ్వయకవి మహోపాధ్యాయభట్టారకప్రణీతంబై
న కాళిందీకన్యాపరిణయం బనుమహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

*నద్దెస-మూ. †చలికిలోఁబడక నిలిచిరి- మూ.

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

— పంచమాశ్వాసము. —

క. శ్రీపార్వతీసతీపతి, చాపవిలోపనపటిష్ఠ జలదాభలస
ద్రూపక జగత్ప్రదీపక, భూపకవరసార్వభౌమ పురుషలలామా. ౧

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

— కృష్ణుఁడు ధర్మరాజుం జూడఁబోవుట —

చ. జగములఁ బ్రోవఁగా మనుజజన్మముఁ జెందు పురాణపూరుషుఁ
డగణితభక్తి సత్యకసుతాదికయాదవు లంటికొల్వఁగాఁ
దగిలినప్రేమచేఁ దరలెఁ దన్నొకపెన్నిధిగాఁగ నెప్పుడున్
మిగిలెడుభక్తిచేఁ దలఁచు మేటి యమాత్మజు సానుజుం గనన్. 3

క. ఇంద్రారివైరి చనుచు మహేంద్రప్రస్థంబుచూచె నింద్రమహీభూ
సాంద్రసుమవిసరవిగళిద, తంద్రమరందైకపూరితస్ఫుటసరసిన్. ౪

సీ. సర్వభాషావచస్సంపన్నిధానంబు, సాధ్యసిద్ధవచోవిచారితంబు
శూరసేనాధారతారుచిమంతంబు, వ్యత్యయకారోవ్యపపత్యనుగత
మనుసృతభవికలాపాయోగసిద్ధంబు, రేఫోపహాతదృఢోల్లేఖితంబు
అన్యథాభావప్రహాణికారూఢంబు, సప్తాంగరూపప్రశస్తమహిమ
మైవిరాజిల్లు చట్టభాషావిశేష, సముదయముస్ఫూర్తి హాసియింపఁ జాలునట్టి
పురవరంబు హరిప్రస్థపుణ్యనామ, మచ్యుతానందమునఁ గాంచె నచ్యుతుండు.

గీ. అపుడు శ్రుతులకు నెప్పుడు నబ్బఁబోని
యసమబాణమహావీరునబ్బగాని
సవినసంప్రాప్తి యతిథివైభవము గాంచె
సుభగమహిమంపు సమవర్తిసుతుశ్రుతులకు. ౫

గీ. వెన్నునాగమనంబుఁ దా విన్నయపుడ, ధర్మతనయుఁడు హర్షోదరఁ దరలఁబనిచె
ఘనతరానందమగుతనమనసుతోడ, వాసవసుతాదిహితుల సేనాసహితుల.

ఉ. కూరిమిమీఱఁ దన్నెదురుకోఁ బవనాత్మజునాత్మవత్తుమం
జేరిసుఖించఁ పుణ్యములఁ జేరిచి నమ్రసరోత్తమాంగుఁ డై

ధీనుల నింద్రనందనుని దేవభిషక్తనుజన్ములన్ శుభా
ధారవచస్సుధం జిలికి ధన్యులఁ జేయుచు నేఁగి యంతటన్. ౯

మ. ఒకచో మాధురిఁ గుల్కుపల్కుఁ గనుఁ బింపొందంగ వేఁడొక్కచోఁ
బ్రకటప్రౌఢవచోనిగుంభనలఁ దీవ్రస్ఫూర్తివర్తిల్ల నే
కశదోషంబును లేక కావ్యమణి జోకం గాంచు వాస్థానిలో
వికచన్నాయకరత్నమై యనురుచస్ఫూర్తిం గాంతు నీక్షింపుమా.

చ. నతు లొనరించుపుణ్యులకు నారతసౌఖ్యవిధానదక్షమౌ
గతి ఘటియించు నప్పరమకారణతత్త్వము ధర్మసూతికి
న్నతి యొనరించెఁ బ్రాక్స్వజనినమ్రత సంప్రతి తన్నిరంతరో
న్నతి కగుఁ గారణం బని జనప్రకరంబు నుతుల్ ఘటింపఁగన్. ౧౦

క. చాఁగిలి మ్రొక్కి నయప్పర, యోగీశ్వరు గ్రుచ్చి యెత్తి యోగీశహృదా
భోగసమనిజభుజాంతర, యోగింగా ధర్మతనయుఁ డొనరించెఁ గడున్. ౧౧

మ. అల వేదాంతసరస్వతీసముపగూహం బేర్గైకొని య
బ్బలుతేజంబు తనంతఁ దానె నిజదోర్బంధంబునం జిక్క ను
త్కలితానందపయోధిఁ దేలుచు సజాతద్వేషి సన్నోబలుపు
ణ్యులు తేరంచు మదిన్ గణింపుచు వరేణ్యున్ శౌరిఁ బల్కెం దగన్. ౧౨

గీ. జఁ జనయున యిహాముత్ర ఫలవితాన, మూలకారణ మని మదిఁ జాల నమ్మి
నీకుపదభక్తి చేకొని నిలిచివాఁడ, నితరము నెఱుఁగఁగద యిట నీవె సాక్షి.

ఉ. అట్టిఁడివాఁడ నే నెటుల నంతటిదాత కపాపకామునన్
గట్టిగఁ గొన్న నీకు శుభకల్పనసేసెద నూరకుండఁగాఁ
గిట్టదు గాన నాదికవి(?)గెరర దుష్టుల్ద్రుంచి శిష్టున్
దిట్టముగాఁగఁ బ్రోచికొనుదేవర వై జగ మేలుమా చొగిన్. ౧౪

ఉ. లెక్కకు నిక్కుజన్మముల లేఁతకుఁ దక్కినభక్తి నే నతుల్
మిక్కిలి నీకొనర్చితి సమిద్ధగుణాకర తత్ఫలంబులై
దక్కెను *నాయనమ్రతయుఁ బావకనమ్రతయున్ సమానులన్
నిక్కము ధిక్కరించితిని నిస్తులపుణ్యయశస్సమృద్ధులన్. ౧౫

గీ. తమము వారియించి వస్తుతత్త్వంబుఁ దెలుప
నీవ కా కన్యదేవత నేర్పుఁ గనదు
దురితసంహార జగతి ఖద్యోతు మహిమ
యొనరు నేరీతిఁ దలఁప ఖద్యోతమునకు. ౧౬

---

* నాదనమ్రతయు–మా.

వ. ఇట్లుచితాశీర్వచనరచనాపురస్సరనిరస్సర ద్విపీతమూవృతామృతంబుల శ్రవఃకుహరంబులు పూరించుచు నుదంచితరోమాంచకంచుకితసర్వాంగుండై సర్వమంగళాయతననిజాంగసంగసంగతాభంగురసుఖం బెట్టకేలకు సడలి యమునతోఁ బుట్టువు గారాబుం బట్టి వేల్పురాకట్టు దిట్టఁ పుటాసనంబు వెట్టింపనం దధివసించి బ్రహ్మాండభూలోకజంబూద్వీపభూపాలపురహరిప్రస్థతన్నిలయతత్సభాతత్సింహాసనాశ్రయోత్తరోత్తరోత్కర్షనిష్కర్షతత్పరు లగు తత్రత్యకవులవాక్ప్రసారంబులు ససారంబులై వెలయ నుత్తరోత్తరసూక్తులం దత్కృతప్రశ్నప్రయత్నంబు సఫలంబుగా ననుగ్రహించి సహభోజనసహశయ్యాసహాసనసహసంభాషణాదిక్రియల యమాత్మజు సానుజుం గృతార్థుం గావించె నిట్లు కతిపయదివసంబులు గడువ నంతట నొక్కదివసంబున దివసేశ్వరునిమనుమనియనుమతంబున మృగయావిహారవిలాససమాలింగితాంతఃకరణుండై సత్యభామారమణుండు సత్యకాపత్యప్రముఖయాదవవీరులు చేరికొల్వ బలారినందనుం డనుసరింప గుణవృద్ధిసమాశ్రయత్వంబున నానాదేశవిషయతనిక్కృత్యాహారవర్ణసవర్ణత మెఱయు శిఖాగ్రసరులగ్రసరులై నను దేర సమానశబ్దప్రతిషేధ నిష్ఠాధారత "నిష్ఠాసంజ్ఞాయాం సమానశబ్దప్రతిషేధ" ఇతివార్తికోక్తి ననుసరింపుచుఁ దద్గుణవిషయతం గృతసర్వాదినిపాతనతవహించుట సర్వప్రాతిపదకంబు నవహసింపుచు(?) ద్వితీయవక్రతను ద్వితీయుక హవర్గచతుర్థవర్ణప్రతిపాదితనాదమేదురీకృత రోదసీకుహరంబు లగు కౌలేయకతల్లజంబులు మదికి నుల్లాసంబుగా వెన్నాడ వాగురజాలప్రముఖప్రధానసాధనసామగ్రీసము దగ్రు లగు నగణితమృగయాప్రకాండు లండఁ గొన నామలింగానుశాసనంబుకైవడి సింహాదివర్గ సంమిళితంబై మహారాజాస్థానపగిది నానావిధకవిప్రౌఢోక్తిసంకులంబై ప్రాకృతంబుకైవడి వల్మీకభవనిదానంబై తర్కంబుచెన్నున నతికర్కశప్రమేయంబై ఛందంబుభాతి మత్తేభశార్దూలవిక్రీడితలక్షణలక్షితంబై భరతంబురీతి సింహవిక్రీడితహారిణప్లుతకరిహస్తప్రసర్పితాకలితంబై యుత్తమకావ్యంబువడువున నవాచ్యమహిమంబై యలంకారంబు తెఱంగున ననువిషమవిన్యాసంబై మీమాంసకవిధంబున నానాగమప్రభూతశాఖాన్వై ప్రకాశంబై పాణినీయంబునువున వృద్ధాంగగోత్రాశ్రితంబై త్రిలింగభాషానుశాసనం

వశస్త్వా ద్వార మేన్ద్రి యార్థగహానాత్ —

భవరతి విషయస్పృహ లేక విమసుఃఖాపహము సుఖము సుశ్రేయం

బప్రస్వాశుభవము బొందఁగ, నవు శ్రీ వెల్లూరి వేంకటాచలరమణా. ౫౭

మోహం మార్జయ —

హరుఁగొలువక మమతను మది, సిరిగోరునమలునరుగులు చిలువలుజ్వాలల్

వెఱపులు తరగలు తిరములె, యరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా.

షట్కుద్వయనిరూపణము —

మనసు శశిధరుని గొలువక, ధనమేలాశా కోరు బుద్బుదము లూర్ములు మె

ర్పునదులు చిలువలు తిరములె, యనువుగ వెల్లూరి వేంకటాచలరమణా.

చేతశ్చిన్తయ మారమాం —

నరపభ్రూకుటి వేశ్యగు, సిరిఁ గోరక బొంతగప్పి చేతనె కాశీ

పురి భిక్షాన్నము దిన మే, లరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౦

అగ్రే గీతం సరసకవయః —

వెదుక నెదుటఁ బాహ్యములఁ, గన పీచోళులను గాణకవులుంతు సుఖం

పనవలె లేదె తపముసే, యనవలె వెల్లూరి వేంకటాచలరమణా. ౬౧

ప్రాప్తాః శ్రియః సకలకామదుఘా స్తతః కిం —

కలిమి గలిగి మిత్రుల ధని, కులఁ జేసి విరోధిసిరులు గొన నేటుగు మ

ర్త్యులతనువు లనిత్యము లై, యలరుచు వెల్లూరి వేంకటాచలరమణా. ౬౨

భక్తిర్భవే మరణజన్మభయం —

జనుఁడు మమకార ముడిగియు, ధనవికృతులు విడిచి శివుని దలఁచివనముఁ జే

రిన నింద్రపదవి నేమిటి, కనువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౩

తస్మాదనన్త మజరం పరమమ్ —

హరిహాయసుముఖపదవులు పే, దటికము లజరము వికాసిత మనంతంబై

పరఁగెను బ్రహ్మము సుకర, మ్మరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౪

పాతాళమావిశసి —

హరిదంతరము లతల మం, బర మిలఁజపలమునఁ దిరుగు మనుజులమనసే

మఱి నైన న్నిను దలఁపదు, హరసఖ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౫

కిం వేదైః స్మృతిభిః పురాణపఠనైః —

మనుజులు కోమటిబేరం, బున వేదపురాణశాస్త్రము లనుచు యాగా

లని బ్రమతురు నినుఁదెలియక, యవిశము వెల్లూరి వేంకటాచలరమణా.

యత్రో మేరు (శ్రీ)మాన్—
శరధు లిగుర మేరువు పడ, ధరసనఁ గరికర్ణచపలతనువులు తిరమా
నరు లేల మోహ ముడుఁగరో, హరనుత వెల్లూరి వేంకటాచలరమణా. ౬౭

గాత్రం సఙ్కుచితం—
వినక పలువదలి లాలై, కనరా కంగంబు వంగి గతిచెడి వృద్ధై
గను సఖసుతసతులొల్లరు, ననువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౮

వర్ణంసితం శిరసివీక్ష్య—
తలనరసిన వృద్ధుల నెమ్, కలుగలచండాలబావిగతిఁ జెల్వాలు ద
వ్వులఁ గాంచి పాసి పాయుదు, రలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౯

యావత్ స్వస్థమిదంశరీరం—
ఇల జర రుజ లేకింద్రియ, బలము గలిగి నపుడె తత్త్వభావజ్ఞుఁడు గా
కిలు గాల బావి త్రవ్వన, నలరునె వెల్లూరి వేంకటాచలరమణా. ౭౦

తపస్యన్తస్సన్తః—
పలుచదువులు చదువఁదపము, సలుపవదాన్యులను గొలువ జనులకుఁబ్రొద్దే
దిల పాయు వల్పతరమై, యలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౭౧

దురారాధ్యాశ్చామీ—
దొరలు చపలచిత్తులు మ, మ్మరుఁడు యముఁడు జరనివారకము సుఖములు దు
ర్భరములు జ్ఞానమె మేలౌ, నరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౭౨

మానే మ్లాయిని ఖణ్డితే చ—
సిరిలేక యర్థిఁగడపుచుఁ బాజనరహితుఁడయి (నప్పు) ప్రాలేయమహీ
ధరమాశ్రయింపఁగాఁ దగు, నరయఁగ వెలూరి వేంకటాచలరమణా. ౭౩

రమ్యాశ్చన్ద్రమరీచయః—
చెలిమోము వనము కావ్యము, నెలతళ్ళులు హితులు గాక నిర్వాణమెదం
దలఁచినదనికిను రమ్యము, లలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా ౭౪

రమ్యంహర్మ్యతలం —
విగరుదనిలచఁ దీపము, పగిది యనుచు గాని చెలులపాటల మేడల్
దిగవిడిచి వచులనిలుతురె, యగధర వెల్లూరి వేంకటాచలరమణా. ౭౫

ఆసంసారాత్త్రిభువనమిదం —
విననగనలేదేనాఁడై, నను విషయవశా*వివశమనఃకరిసిలుపం
† గను నాలానం బెవ్వం, డనియును వెల్లూరి వేంకటాచలరమణా. ౭౬

---

* గృహీత-మనఃకరి మూ † ఘనమగు నాలానంబెప । దనవలె-మూ

యదేతత్స్వచ్ఛందం—

కలుగు సుగోష్ఠింబుణ్యాము, ఫలమెన్న వశంబుగాదు స్వైరగుఁడా ని
శ్చలవిద్య శమము జ్ఞానికి, నలవడ వెల్లూరి వేంకటాచలరమణా. ౭౭

జీర్ణాఏవమనోరథాశ్చ—

తలఁపులు వయస్సు సుగుణ, మ్ములు వ్యర్థముపోవఁగాయముఁడురాఁగా మ
ర్త్యులకు శివుండే దిక్కగు, నలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౭౮

మహేశ్వరే వాజగతామధీశ్వరే—

జగదంతరాత్మకుఁడు హరి, జగదీశుఁడు శివుఁ డిరువురు సములైన శివుం
దగ భక్తి గొలుతు నను నొకఁ, డగధర వెల్లూరి వేంకటాచలరమణా. ౭౯

స్ఫురత్స్ఫారజ్యోత్స్నా—

కనదిందురుచిధవళసుర, ధునిపులినములందు బ్రాహ్మతోయాంబకుఁడై
ఘనుఁడు నిసి బలుకు శివహర, యనుచును వెల్లూరి వేంకటాచలరమణా. ౮౦

వితీర్ణేసర్వస్వే—

ధీరులు సాత్త్వికులై సం, సారముడిగి సంపదల విసర్జించి వనిక
శారదనిశ నెన్నుదు రహో, హరుఁడ వెల్లూరి వేంకటాచలరమణా. ౮౧

కదావారాణస్యాం—

ధరఁగౌపీనధరుండై, కరములు ముకుళించి కాశి గంగాస్థలి శం
కర పార్వతీశ యనుబుధుఁ, డరయుఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౮౨

పక్షద్వయనిరూపణము—

ఇలఁ గాశిని గంగాతట, ములఁ గోఁచి ధరించి కేలుమోడ్చి గిరీశా
యళికాక్ష యని దినము గడ, పలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౮౩

స్నాత్వాగాంగైఃపయోభిః—

ఇల గంగోదకముల సుమ, ఫలముల శివపూజ చేసి భక్తినగములక
నిలిచి భవ మెడలు నెపుడను, నలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౮౪

ఏకాకీ నిస్పృహశ్శాన్తః—

కరపాత్రుఁడు నిస్పృహుఁడై, హరుఁ దలఁచుచు శాంతుఁడై దిగంబరుఁడై క
ర్మరహితుఁడెపు డౌననిబుధుఁ,డరయును వెల్లూరి వేంకటాచలరమణా. ౮౫

పాణింపాత్రయతా—

భిక్షాన్నము కరపాత్రల, భక్షించి జగము తృణముగ భావించియు ఫా
లాక్షుదయఁ జిత్సుఖముగను, సక్షయ వెల్లూరి వేంకటాచలరమణా. ౮౬

కౌపీనం శతఖణ్డజర్జరతరం—
ఖలకంథాకౌపీనుం, డిలభిక్షాశి వనిశయుఁ డభీష్టగుఁ డౌని
శ్చలమతికి రాజ్యమేమిటి, కలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౮౭

బ్రహ్మాణ్డమణ్డలీమాత్రం—
ఘనుఁడు బ్రహ్మాండమాత్ర, మ్మున కేలానపడు మత్స్యాదులు గంతులిడన్
వనరాసులు చలియించునె, యనువుగ వెల్లూరి వేంకటాచలరమణా *౮౮

మహాశయ్యాపృథ్వీ—
నెల దివ్వె వితానము దివి, యిల తల్పము కేలు దిండు నీద సురటిగాఁ
జెలిమూర్తిగ దొరవలె యతి, యలరును వెల్లూరి వేంకటాచలరమణా ౮౯

పతద్వయనిరూపణము—
ఇల శయ్య దివ్వె శశి కరు, వలి చామర దిండు చెయిగఁ జాగ్రృపవలె ము
క్తిలలనఁ గూడి యతికర, మ్మలరును వెల్లూరి వేంకటాచలరమణా.† ౯౦

చణ్డాలః కిమయం—
యతియో (మాలఁడొ) శూద్రుఁడొ
శ్రుతిమంతుఁడొ ద్విజుఁడొ యనుచు మనుజులు పలుకన్
మతిభేదము నొందఁడు యతి
యతిపతి వెలూరి వేంకటాచలరమణా. ౯౧

జగతినహింసాసాధ్యము, లగుతృణవా(తాది)మెసఁగి యవనిఁ బరుండున్
మృగఘణులవలెను యతి యుల, రగధర వెల్లూరి వేంకటాచలరమణా. ౯౨

గఙ్గాతీరేహిమగిరి—
తలఁపు శివుఁ జేర్చి (హిమగిరి), శిలయోగి సమాధినిద్రఁ జెందిన మైపు
ల్గులురాచుకొనఁగ సుదినము, లలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౯౩

పాణిః పాత్రం పవిత్రం—
కరపాత్రభిక్షమన్నము, ధరతల్పము దిక్పటంబు దైన్యమసంగం
బిరకొన యతికివి ధర్మము, లరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా ‡ ౯౪

క. ధరభర్తృహరికృతంబై, పరఁగిన శ్లోకములు కందపద్యంబులుగా
§నరసింగకవిరచించెను, నరుసుగ వెల్లూరి వేంకటాచలరమణా.

---

* మాతర్లక్ష్మి భజస్వ—అను శ్లోకమునకుఁ బద్యము లేదు. † భిక్షాశీజనమధ్యసఙ్గరహితం—అను శ్లోకమునకుఁ బద్యము లేదు. ‡ మాతర్మేదిని తాతమారుత— అనుశ్లోకమునకుఁ బద్యము లేదు. § వెల్లాల క్షవినరసింగయ్య—జటప్రోలు—కొల్లాపురము అని యముద్రితగ్రంథ చింతామణియందు ఖములోఁ గలదు.

శ్రీరస్తు.

# భద్రగిరిశతకము.

## భల్లా పేరకవికృతము.

### సీసపద్యములు.

శ్రీజానకీమనోరాజీవషట్పద పదపంకజాశ్రితపద్మగర్భ
గర్భనిర్భేదసంగరబాణతూణీర నీరజబాణసన్నిభశుభాంగ
యంగజవైరిశరాసనభేదన దనుజవిద్వేష సుందరముఖాబ్జ
యజ్ఞబాంధవకులాధ్యక్ష నీరదవర్ణ వర్ణితామరపూనివరకలాప
పవననందనసన్ముఖభక్తపాల, పాలకడలిని విహరించుపద్మనాభ
భద్రగిరివాస శ్రీరామభద్రదాస, పోషబిరుదాంకరఘుకులాంబుధిశశాంక.

పద్మభవస్తోత్ర పావనచారిత్ర పంకజదళనేత్ర బహుపరాకు
దైతేయశిక్షణ ధర్మవిచక్షణ భక్తసంరక్షణ బహుపరాకు
వారిధిబంధన వరభక్తచందన భరతాదివందన బహుపరాకు
తాటకభంజన తాపసరంజన పరమనిరంజన బహుపరాకు
భద్రగిరినుండి వచ్చునీపౌరుషంబు, విశ్వవిఖ్యాతిసేయక విడువశంక
భద్రగిరివాస శ్రీరామభద్రదాస, పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక.

పదియురెండేండ్ల ప్రాయంపువాఁడవై మించి తాటక నెట్లు ద్రుంచినావొ
రణశూరు లగుదైత్యగణములఁ బరిమార్చి కౌశికుసవ మెట్లు కాచినావొ
తరములఁబట్టి యెత్తగరాని హరువిల్లు చెలఁకు కైవడి నెట్లు విఱిచినావొ
సంగరరంగవిశారదుఁ డైన భార్గవరాము నేరీతిఁ గడపినావొ
కాని తెలియదు యప్పటిక్రమముఁ దలఁపఁ
దురకదొర లన్నభీతిలి యుంటికుదొరవు
భద్రగిరివాస శ్రీరామభద్రదాస
పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక. 3

కాకంబుగాదు వేగమె బాణమెక్కించి కావుకా వనిపించి కాచి విడువ
నుదధిగా దవసిపై నుప్పొంగఁగాఁ జూచి బాణాగ్రమున నిల్పి భక్తిఁబ్రోవఁ
జిత్రమృగముగాదు సీతమెప్పులకు నై వెంటాడి వనవీథి నంటితఱుమఁ
బుడమి నెన్నంగబంధుఁడుగాఁడుభుజలబల్ నఱికిపాఱఁగనైన సరకుగొనక
నవసిఁ దురకల నెదురరా దనితలంచి, వలసపోతిరి మీసరివారునవ్వ, భద్రగి

ఖరదూషణాదుల ఖండించితి వటన్న యామిక మదిలోన నడఁచివైచి
మాయామృగంబును మర్దించితి మటన్న గర్వంబు మనసులోఁ గట్టిపెట్టి
వాలి నొక్కమ్మునఁ గూలనేసితి మన్న సాహసోక్తులు మదిఁ జక్కవిడిచి
రావణకుంభకర్ణనిశాచరులఁ బరిమార్చితి మను ప్రజ్ఞ మదిని విడిచి
యోడపై నెక్కి తురకలజాడఁ గాంచి
యుఱుకఁదగునయ్య మీావటి దొరల కెంక, భద్ర. ౫

సున్నతీలోగిఁ జేయఁ జూతురో యని వేగ మేలుకొంటిరి యింత మేలుగలదె
గుడుగుడీపాగలు పైకొనఁ జూతురో యని వలసపోతిరి సరివారు నగరె
ముసు పలావును దిను మనియుందురో యని పాఱిపోయితిరింత పాటిగలదె
లుడిపీ యఫీమూదు లిడఁ జూతురో యని యోడయెక్కితిరి మీారొగిధరిత్రిఁ
గులము గలిగిన నెందైన స్థానముగలద
టనుచు భక్తుండిగవాడి చనఁగఁ దగునె, భద్ర. ౬

చెప్పినట్టులు వినఁ జేయు నోపిక కొండచఱియలయందుండు చరియ దుంప
తూండులు దినుశక్తి వాఁడికోఱలు గల తులువమృగాలలోఁ మెలఁగుయుక్తి
జడలుఁ దాలుచు నేర్పు జడదారులనుగూడి యుషమఁ బమతాల్మి పనులందుఁ
బండకష్టతరంబు పర్ణశాలలయందుఁ గాపురములు సేయు క్రమము తొల్లి
తల్లి కోరికి చెల్లింప ధరణిలోన
నేర్చితి మటన్నఁ బలుమాఱు నెఱపఁదగునె, భద్ర. ౭

రఘువంశమున కెంతరట్టుఁ దెచ్చితి వరుసఁ బోలవరంబు వలసపోయి
సౌకుమార్యకల కెంతచులకన యైతివి వరుసఁ బోలవరంబు వలసపోయి
భక్తవితతి కెంతభయము పుట్టించితి వరుసఁ బోలవరంబు వలసపోయి
* * * * *
దశరథునిగర్భమునఁ బుట్టి దశశిరస్కుఁ
దునిమినటువంటి దొరకిది దొడ్డతనమె, భద్ర. ౮

కైకవరము జ్ఞాపకము వచ్చెనో మళ్ళ వనములఁ జరియింప వసుధలోన
నీలాద్రిపతిఁ జూచి నేరిచికొంటివో వలసలువోవ నీవసుధలోనఁ
బట్టినపతికిఁ జెప్పఁదలంచి పోతివో వలసపేరిడుకొని వసుధలోన
రాములదేవు కారణజన్ముఁ డని తోఁచి వరమీయఁ బోతివో వసుధలోన
లేక యిది యేమివింత ముల్లోకములను
జడిసి వేంచేసితి వటన్న జడుపుగాదె, భద్ర. ౯

సౌమిత్రికైనఁ దోఁచకపోయెనా యిల్లు పోవరాదని నీకు బుద్ధితెలుప
సీత నైనను మీకుఁ జెప్పలేదాయెనా యిల్లువెళ్ళుట మహాహీనమనుచు
హనుమంతుఁ డిపుడు మీయాజ్ఞకు వెఱచెనా యపుడు గాదని మిమ్ము నడ్డగింప
శిష్టరాజగు మీవసిష్ఠు లేఁడాయెనా యిక బుద్ధి గాదని యెఱుఁగ జెప్పఁ
భద్రగిరినుండి శ్రీవీరభద్రగిరికి, వలసపోవుట యిది యేమి వాంఛ యయ్య, భద్ర.
హనుమంతు నెచ్చోటి కనిపితిరో మీకు జడుపుపుట్టినయట్టి సమయమునను
సుగ్రీవుఁ డేవనిఁ జొచ్చియుండెనో మీకుజడుపుపుట్టినయట్టిసమయమునను
అంగదుఁ డేవంక కల్గిపోయెనో మీకు జడుపుపుట్టినయట్టిసమయమునను
జాంబవదాదు లెచ్చటనుండిరో మీకు జడుపుపుట్టినయట్టి సమయమునను
కపులు మీయొద్ద నుండిన రిపులకేల
యోడి వేంచేతురో మీర లోడయెక్కి, భద్ర. ౧౨
పట్టాభిషేక సంభవవియోగము జటావల్కలములు వనవాసములను
యతిపూజ గొనుటలు యతిగతిఁ దిరుగుట లాలిఁ గోల్పోవుట లడవులందు
సంచరించుటలు నిశాచరబాధలు చెందుయుద్ధమువిను లెంచ మొందె
మునుగూల్చుట యు దానవినిముక్కు గోయుట క్రోతి నేయుట బ్రహ్మకులజుఁ జంపు
టిల్లు వెళ్లుట లాదిగా నిచకులమున
నెనయ మీనాఁడె ధరఁ గల్గె ననరె జనులు, భద్ర. ౧౩
భరతశత్రుఘ్నులు వరశంఖచక్రములే సౌమిత్రి శేషుఁడు జనకతనయ
యిందిర కపులెల్ల బృందారకులటంచు స్మృతులెల్లఁ గొనియాడ నతివినోద
లీలలు గల్పించి చేలవై కేవలమానుష చర్యలు పూనె దకట
వలసలు మీకేల వనవాసములవేల వైకుంఠవాసిని వనుసతోడ
మీబలపరాక్రమము లెల్ల మీరెఱుంగక
తొలఁగి పోవచ్చునే తురకలకు జడిసి, భద్ర. ౧౩
ముసలిమానులతోడ ముచ్చటాడఁగలేక తురకల కెదురుగా నరుగలేక
మ్లేచ్ఛుల మన్నించి మెప్పు లీయఁగలేక పారసీకుల బాధ పడఁగలేక
యచ్ఛిద్రకర్ణుల యాజ్ఞ నుండఁగలేక యపసవ్యలిపుల తెన్నరయలేక
చేరిఖానులకుఁ దాజీము లీయఁగలేక మును నమాజుధ్వనుల్ వినఁగలేక
పాఱిపోవుట యిది యేమి ప్రజ్ఞ గొనుగు
నెఱిఁగి యేమొండ కాయుండ నిఁకఁగవలయు, భద్ర. ౧౪

తెలివితెచ్చుకయుండఁ దెన్నువీక్షింపక వాహనంబులమీఁద వాంఛ లిడక
ద్వారపాలకులకు దారి చెప్పక భక్తగణముల కెల్లను గనులఁబడక
సొమ్ములచందుగల్ చూడ నొల్లక కపి బలముల నెల్లను బిలువనీక
సౌమిత్రి కరిగెడి జాడ చెప్పక వేగ సీత నెత్తుక యతిశీఘ్రమునను
గలము పై నెక్కి మీవంటిఘనులు తొలఁగి
పోవఁ జేసెనె వలస లీపోలవరము, భద్ర. ౧౫

సొమ్ములు బీబీలసొగసు కప్పన చేసి వాహనంబుల నశ్వవాహనులకుఁ
బంచపాత్రలు సురపానవర్తనులకుఁ బళ్ళెరంబులు మాంసభక్షణులకు
శఠకోపములు విప్రశత్రులకు బంగారుతబుకులు బలుదునేదారులకును
గిన్నెలు వరుస నెంగిలిముచ్చులకుఁ బట్టుపీతాంబరంబులు పింగళాక్షు
లకు నొసంగియు భక్తుల వికలపఱుపఁ
బాఱిపోతిరి మీరున్నయూరు విడిచి, భద్ర. ౧౬

సంచరించిరిగదా సమదాపసవ్యులు విమలబృందావనవేదికలను
వీటఁబుచ్చిరిగదా విరులచేఁ జెన్నొందు ఘనమల్లికాపుష్పవనచయంబు
గలుచేసిరిగదా కళ్యాణమండపాగారవాహనగృహాంగణము లెల్లఁ
గొల్లలాడిరిగదా కోమలనవవీచికల నొప్పు దివ్యగంగార్ఝరములఁ
జూఱపట్టిరి పురమెల్లఁ జొచ్చి విప్ర
మందిరము లన్ని తురకలు మత్తులగుచు, భద్ర. ౧౭

సంస్కృతాంధ్రోక్తులసారంబు లుడివోయె నపసవ్యభాషల నమరె జగము
పౌండరీకాదులఁ బసుబంధనము దప్పి కటికిమేఁకల జపాల్గలిగెనూళ్ళ
కర్పూరచందనాగరుధూపములు వాసి గంజాయిపొగలచేఁ గప్పెఁ గుళ్ళు
వేదశాస్త్రంబు వెలయు బాఁపలపట్ల మొల్లాఖురానులు మ్రోగెనహహా
యేమి చెప్పుదు మీమాయ లెవ్వరెఱుఁగఁ
గలరు బ్రహ్మాదులకు నైన నలవి గాదు, భద్ర. ౧౮

ధర్మపేటనివాసు ధైర్యంబు విడనాడె వేటగోపాలుఁడు మాటలుడిగెఁ
బాలవంచపురీశు బలహీనత వహించెఁ గృష్ణసాగరపయ్యక్రిందుఁ జూచె
రామానుజవరపురాము లూరక యుండెఁ బిఱివెడిసామి యుబ్బరముగదిరెఁ
బన్నశాలేశుండు బహుభంగులఁ దపించె శ్రీరామగిరివాసుఁ జింతనొందె
భద్రకటనుండి శ్రీవీరభద్రుకడకు
వలసవెంచేయుఁదలఁచినవార్త వినియు, భద్ర. ౧౯

తురకలతో మైత్రి నెఱపలేవైతివి లోకత్రయము నెట్లు సాఁకఁగలవు
గర్నేలుగుండ్ల డాకాకోర్వలేవైతి యసురబలంబు నెట్లోఁపఁగలవు
నీస్థలంబున నీవు నిలువలేవైతివి భక్తుల నెట్లు కాపాడఁగలవు
మానవాధీశ్వరు మరువు సొచ్చినవాఁడ వమరారులకు నెట్టులభయమొసఁగ
దకట నిను మనమున నమ్మి పట్టి జనులఁ
దొలఁగి వేంచేసితివి తురకలకు జడిసి, భద్ర. ౨౦

శ్రీరామచంద్ర దీక్షితివి నీరసము దె "ఆశ్చద్యఖై"రను నచ్చులమరె
గోవి దశబ్దఖల్ గుజి మాలి "బాహసేణ యాహసే"ననుపల్కు లావహిల్లె
గరుడాశ్వగజరథవరవాహనములచే బరఁగువీధులఁ బీర్ల ప్రభలఁ జెందె
సత్రశాలాంగణల్ చలువ పందిరులు బబ్బరచి ఖానాలచప్పరములయ్యె(?)
మత్స్యమాంసాదికముల నమరెను గోద
రేవు లెచ్చటఁగన్న గోలీలనమరె, భద్ర. ౨౧

హనుమంతు ముట్టి సర్వాంగ మొంగిలి చేత మీరి పట్టెల మాయఁజమిరె నొకఁడు
గరుడాళువారి తెక్కలు ముక్కు చెక్కుల నొక్కి మండపము పై నెక్కె నొకఁడు
ఎంబెరుమన్నారు నింటిలోన నమాజు చదివి తాదసిబిసి సలిపె నొకఁడు
వరుసఁ బన్నిద్రాళువారి నొక్కుమక్కి డీకొక్కులాడించి డీకె నొకఁడు
మిగిలి పరికించి శాంతమేమిటికిఁ దలఁప
పరుస మీరలు తిరుపల్లెపట్టు నెడల, భద్ర. ౨౨

అతిరసంబులు గావు నారగించి పయారి కోరమీసంబులకొనలుదులుపఁ
దిరుపేసములు గావు తీరుగా భుజియించి పొరలి యాడుచుఁ జిన్ని బొజ్జనిముర
దధ్యోదనముగాదు తగినంత భక్షించి గఱ్ఱునఁద్రేన్చి బాగాలనమల
వడలుగావు నయోధ్యవాసులతోఁ గూడి ముచ్చటదెలుపుచు మొనసి మెసవఁ
జేయు పణ్యారములు గావు చిత్తగింపఁ
గినియుజాల్దుంగు...జంగీబలములు, భద్ర. ౨౩

పుట్లాది బియ్యంబు పులిహోరలు మెక్కువారికి రసము పై వాంఛగలదె
శర్కర యంగళ్ళఁ జరిగొన్నవారికిఁ బ్రాణంబుపైఁ నిచ్ఛపర్వకున్న
వైష్ణవసద్గోష్ఠి వర్తించువారలు తురకమ్మరులపై నులుకఁ గలరె
ఉభయవేదాంతసదూహనుండెడువారు మంత్రాంగశక్తుల మలుపఁ గలరె
దేవమానవశక్తుల తెరువు వదలి
తురకదొంగలన్న భీతిలియుటకు దొరవు, భద్ర. ౨౪

సొగసుకా శంఖచక్రగదల్ ధరించుట తడఁబాటు చతురహస్తమున వెలయు
ఘనతకా శరశరాసనములు దాల్చుట పురజనంబులకు నద్భుతముగాఁగ
హావుసుకా సూర్యపుత్రాదులాక్రోతిసేనల నేలుటలు సూర్యకులములోనఁ
బ్రజ్ఞకా పతితపావనబిరుదాంకంబు చూపుట లెల్ల బలోప్చద్యమాగను
యవనబలములు నల్గడ ల్గవిసిమిమ్ము
దోఁచుకొను వేళ శౌర్యంబు దాఁచితకట, భద్ర. ౧౫

శంఖంబు కడుబీదజంగంబుకడ నున్నఁ *బూరించి తన పొట్టపోసికొనును
జక్రంబు కమ్మరిసరసనుండిన వేడ్కఁ గూడలైనను జేసికొను రయమున
గద సుకాలీవానికడనున్న వేవేగ గోనె లైనను నెత్తుకొను ముదమునఁ
దగనాల్గుచేతు లుద్ధంసాకుఁ గల్గిన నిఁక నింతరాజ్యంబు నేలుకొనును
స్వామి మీ కేలయివి వృథా సరసముగను
వారివారికి దయసేయువరుసతోడ, భద్ర. ౧౬

సరసప్రబంధానుసంధానములు గావు మొల్లాఖురానులమ్రోఁత గాని
మహి మహీసురుల నమస్కారములు గావు మ్లెచ్ఛులుసేయు నమాజు గాని
తగ నర్చకులు సేయు తళిహాలుగావు లావు పొలావుడేకిసా ల్పొల్పగాని
చందనాగరుధూపసమితిగాదు గుడాకుగంజాయిపొగలసంఘంబుగాని
బలసి తిరునాళ్ళకే తెంచు ప్రజలు గారు
ఘనతరంబైన తురకలష్కరులు దెలియు, భద్ర. ౧౭

పన్నీరు నించిన పసిఁడికొప్పెలె మీకు సారాలు నిండు సీసాలబారు
దాసులు తెచ్చు తీర్థపుబిందెలే మీకుఁ బారసీకుల మద్యభాండవితతి
భువి భక్తులొనరించు భోగంబులే మీకుఁ దురకలు సేయు కందూరిచయము
కళ్యాణవేదికాగ్రమునుండు హోమకుండంబులే పీర్లగుండములు మీకుఁ
గాకయుండిన స్లేచ్ఛల కాఁకపుట్ట
దవనిఁ దురకలుండి దుచెండాడునపుడు, భద్ర. ౧౮

గజరథఘీంకారఘంటారవంబులు దగవిన్నఁ జెవులు చిందరలుగొనెనో
కంచుఫిరంగుల ఘనసినాదము విన్నఁ బెళ్ళున గుండియల్ జల్లుమనెనో
యవనాశ్వఖురపుటజవమునఁ దిశలెల్లఁ గదిసిన పెందూళి గప్పుకొనెనో
అరబుసిద్దీల పెళ్లాడు నోపఁజొచ్చి తొలుదొల్తఁ బదములు తొట్రుపడెనో

* పూజరియొక్కరుపొట్టనూ

కలముపైనెక్కి తిరిగి మీపాపఘనతవిడిచి
క్రమముచే నంగరమ్మైనఁ గట్టుకొమ్ము, భద్ర. ౩౦

భరతాదిసహజన్మవరులకు నీపాటి పారసీ చెప్పించు పంతముడిగి
వ్యాసాదిమునిగణప్రతతి నెలను ఖురానులు చదివింపఁగాఁ దలఁపుసేయ
పరఁగ నింద్రాది దిక్పాలకశ్రేణికి నెరినమాజులు సేయు నేర్పు నేర్ప
వారింపలేవు నాళ్వారాకులకు వేగ సున్నతీలప్రయత్న మెన్నఁజేయు
చేయుకొండినఁ దురకలు చెనుగువాంఛ
మాన్పవిడి వచ్చి రింకమీరాఁగలేరు, భద్ర.

సర్వాంగి తురకలు సవరించినా రింతె నీలికూసంబైన నెరిధరింపు
మణికిరీటము మ్లేచ్ఛఘనుని కిచ్చితి వింతె శోభితమైనను దాల్పు మేపుమీకుఁ
బావాలు యవనులపాలు జేసితి వింతె ముచ్చటైనం గాళ్ళ కిచ్చగించు
ఢిల్లీశ్వరునికూఁతు నిల్లాలిఁగా ముందయేలితి వింతె మీకెగ్గు లేల
మతము విడుచుటలెల్ల సమ్మతము మీకు
కాముకులకును బజ్జలు గలవె తలఁప, భద్ర. 3౧

గరుడధ్వజము లన్నకాఁకచే నుంటిరో డాలైన తగటుజెండాలు సూచి
తమనిత్యసేవవాద్యము లనుకొంటిరో యరబుబాజాల నెయ్యంబుఁ జూచి
తిరునాళ్ళ సంగళ్ళతీ రనుకొంటిరో సరిలేని దండుబాజార్లఁ జూచి
వరుసతోడుత భక్తవరు లనుకొంటిరో దరిలేని బలుసుబేదార్లఁ జూచి
కాక భువి నిభరాహీము ఖానుఁ డెంత
మేటి వానవులను గెల్చు మేటికరయు, భద్ర. 3౨

అప్రబైరో యని యాదరింతురుగదా తురకలతో మైత్రి నెరపవైతి
రామరాముమనుచుఁ దాజీము లిత్తురుగదా యూరినుండిన మిమ్మునూఅశించి
కదదిమిల్నా (?) యని కౌఁగిలింతురుగదా మొనరుగా నేగిన బెదరు లేక
కప్పురవిడెము ల్ ఘనత నిత్తురుగదా నజువట్టిన మద్దెనజురుగలిగి
కానిపని చేసితివి పోటుకానివలెనె
వరుసఁ దురకలపై నల్గిపలసవోయి, భద్ర. 33

అరబుసిద్ధిం దివ్యాజ్ఞలోవర్తించి చేరి మేఁకల జపాసేయు లేక
వరుసతో ధరియించు వరభూషణము లిచ్చి యుడుకునూ నెలఁజేయుచుంచ లేక
నెట్టికల్లీము వారిఁ జేయునిష్ఫంధంబు సొరిదిమీరాఆఁ గనులఁ జూడ లేక

తమగురుమూర్తి యనఁదగు నశ్వరాయుని కరుణమీఱంగను గాంచలేక
తొలఁగిపోతిరి మీవంటిదొరలనమ్మి
కొలువఁదగునయ్య దీనులుకొలఁదిమీఱ, భద్ర. ౩౪
విల్లునమ్ములుఁ గట్టి వెల్లులోఁ జొప్పవా వెదకిపోయెడి దొరబిడ్డలకును
చేతిచక్రము గాల్చిఁ జేర్పవా వెన్నిచ్చి పాఱిపోయెడినరపాలురకును
శాత్రధర్మము లెల్ల సరసిలోఁద్రొక్కవా తొలఁగిపోయెడియువకులజులకును
బంటువంతము లెల్లఁ బాథోధిఁగల్పవా వరుసఁ దప్పిన రఘువంశజులకు
అనుచు ఖేచరులెల్లమి మ్మెకతొల్లె
చెలఁగి సింహాసనంబున స్థిరుఁడవగుము, భద్ర. ౩౫
శంఖంబుకోసమై చాకీలనిలిపితే నేసీయనని పోవ నీతరంబె
చక్రంబుఁ దెమ్మని స్వార్లను బంపితే యది మల్పుకోను మీయయ్యతరమె
గదఁ దెమ్మనుచు వేగ గరిడీలఁ బంపితే తప్పించుకోను మీతాతతరమె
ఖడ్గంబుకోసమై ఖావందుమళ్ళితే తిరిగి పోరాడ మీదేవ్రతరమె
వరుసఁ దురకల గతిదెల్పి వలనవోయి
నిల్పితివి శాత్ర మీపాటినీకె చెల్లు, భద్ర. ౩౬
ఈపాటిదొర వాట యెఱిఁగి యామంథర కైకకు నుపములఁ గఱపె వేడ్క
నీపాటిదొర వాట యెఱిఁగి మీపినతల్లి వెఱవక మిము నిల్లు వెడలఁగొట్టె
నీపాటిదొర వాట యెఱిఁగి వేగ సుమిత్ర కొడుకును సాయంబు గూర్చి పంపె
నీపాటిదొర వాట యెఱిఁగి శూర్పణఖ రావణుతోడ నీస్థితి వరుసఁ జెప్పె
నెఱుఁగ కవనిజ మీవెంట నేఁగుదెంచి
చెఱనుబడియుండదే దైత్యవరునియింట, భద్ర. ౩౭
శంఖంబులోఁ గీర్తిచంద్రిక లిమిడెనో కనుపట్టవాయె సంగరమునందుఁ
జక్రంబులోన భూచక్రంబు దాఁగెనో బలమీయదాయె నిబ్బరముగదుర
గదలోన శాత్రంబు నొదిఁగెనో యరులపై రాణింపదాయె గర్వంబుదక్కి
కత్తిలోఁ గోపంబు నొత్తిగిలుండెనో తురకలపైఁ జొరనుఱుకదాయె
సామి యిదియేమి యింత మీసాహసంబు
లెందు వేంచేసె నరులపై యందగించి, భద్ర. ౩౮
ఈపాటిదొర వాట యెఱుఁగక మిమునమ్మి దేశస్థులెల్లరు దిగులుపడిరి
యీపాటిదొర వాట యెఱుగక మిమ్మునమ్మి భక్తులెల్లరు మ్లేచ్ఛబాధఁబడిరి

యీపాటిదొర వాట యెఱుఁగక మిముఁనమ్మి స్త్రీకల్లియ వారు మట్టమైరి
యీపాటిదొరవాట యెఱుఁగకమిముఁనమ్మి కుశ్వరాయఁడు భూపలాయనంబు
నొందె నీపాటిదొరవాట ముందెఱింగి
కదనమునకుఁ దురుష్కుఁడు గదిసెనహహా, భద్ర ౩౯

భుక్తాన్నశేషంబు పొసఁగ దాసులకిమ్మి దినములు గడుపుజగ్గన్నఘనుఁడు
తనుగానకుండ గంధముమేన నలఁదించుకొని నిమ్మనల్పు నప్పనవిభుండు
బీదసాదల దోఁచి పృథివి... కెన్న(?)నన్ను వేంకటపతినృపాలుఁ
డొడయఁడై మణిదెచ్చి ముడుగుపోఁపల జొచ్చిదాఁగియుండు నువరదనవరుండు
వార లెల్లను మీపాటివారు గారె
యొదిఁగియుండిరి యుగచర్య లూహచేసి, భద్ర. ౪౦

శబరివిందమ్మోనె నరభసంబున మీకు భావింప రామలదేవభక్తి
హనుమంతుఁడమ్మోనె యతిసాహసుండవుజోగిపంతులుయుక్తిఁజూడమీకు
సుగ్రీవుఁడమ్మోనె సొరిది గోయందొర కప్తానుఘనుఁడు మీకార్యమునకు
ఘనబుక్కయమాకమమ్మోనె రాజమాహేంద్రవరమున్న మీమనోవాంఛదీర్ప
గాక యుఁడిన నిచ్చటి రాకకేమి
కారణం బెన్న మీవంటిఘనుని కరయ, భద్ర. ౪౧

జోగిపంతులకు మెచ్చులు వట్టఁబోతివో యుగిరీజులప్రాపువిచ్చగించి
తురకరూపము దాల్చుశకటివద్వానోమ్లేచ్ఛసంహారమొనరింప జగమెఱుఁగ
శాఖామృగంబుల జతగూర్చ బుక్కయమాకముఁ జేరఁబోవుటోక్రమముతోడ
నన్నుధన్యునిఁజేయ నాచేతఁబన్నము ల్చెప్పింపఁబూనుటో యొకప్పుమీకుఁ
గాక యిదియేమివింత ముల్లోకములను
వలన వేంచేసితిరటన్న నలుసుగాదె, భద్ర. ౪౨

అరయంగ మీకు భద్రాచలం బమ్మోనె పోలుపుమీకుఁగ రాజుపోఁవరము
కోటవెలప్రాకారగోపురాలమ్మోనె తలుపు ఱలేదిక న్నదకవీళ్ళ
కళ్యాణమండపాగారంబులమ్మోనె సంతరామిళ్ళలోఁ జప్పరములు
భువినెన్నఁగా రథోత్సవమమ్మోనెమీకు వాహనరహితప్రవర్తనంబు
మేలు రాజ్యంబు తురకలపాలు చేసి
హారవృషభమధ్యమున నుండు టన్నాయకునె, భద్ర. ౪౩

గోవిందరాజులు గురులఘుత్వము మదిఁ దలఁపక మీ వెంటఁ దగిలె నెట్లు
రంగనాయకులు శ్రీరంగాధికారంబు నెఱుఁగక యేరీతి నేగుదెంచె
నరసింహుఁ డుగ్రంబు నట్టేటిలోఁ గల్పి వెడఁగుగా నెటువలె వెంట వచ్చె
క్షేత్రపాలకుఁడైన శ్రీరామలింగంబు ప్రమథులతో నెట్లు పాఱిపోయె
నహహా సావానగణము వీరందఱకును
సంభవించెను గాఁబోలు జగమెఱుంగ, భద్ర. ౪౪

బిబ్బీలసిబ్బెంపుబిగువుగుబ్బల నీకు వజ్రాలపతకముల్ వఱలవలెనొ
పారసీకాంతలపాపట్లయందు నీముత్యాలచేరులు మురియవలెనొ
తురకబిత్తరులపెందుఱుముల బంగారు మొగలిరేకులు వేడ్క ముదునవలెనొ
యవనాబ్జవదనల నవకంపుమేనులఁ బీతాంబరంబులు పెనఁగవలెనొ
కాకయిదియేమి నీసొమ్ములోక మెఱుఁగ
మానవులు వేగహరియించి మనఁగలరె, భద్ర. ౪౫

తూర్పునాఁటి తెనుంగుదొరతనంబులు గావు తోమాలెలందినసంతోషపడను
దక్షిణదేశపుఁ దమిళసాములుగారు వినియోగములు గొని వేడ్కఁజెంద
పశ్చిమమహారాష్ట్రప్రభువరేణ్యులుగారు పాదతీర్థంబున మోదమంద
నుత్తరదేశపుటోఢ్రరాజులుగారు దర్శనమాత్రానఁ దనివి నొంద
యవను లర్థాతురు లటంచు నవయెఱింగి
వస్తువాహనవిభవము ల్వదిలి తహహా, భద్ర. ౪౬

ధీమంతు లెల్లను దెప్పించుకొనక రారో మీస్థలానకు రూఢిమెఱయఁ
గొలుపంపించక కదబరో మీమొఖాసాలకెల్లను గడు శాశ్వతముగ
సనములు పుట్టక చనుదెంచరో యగ్రహారికు లెల్లమహాదరణల
వరుసతోడుత పరవానాలు లేక వేఁ చేయరో భూసురశ్రేణి కెల్లఁ
దురకలెల్లను మీత్రోవ ద్రొక్కకుండ
ధరణి తాఖీదులియ్యక తరలినారు, భద్ర. ౪౭

ద్వాత్రింశదాయుధోద్ధరణంబు గావించి నేఁ దుపాకులు పట్ట నేరవైతి
సకలదానవులను సంహరించుటెఱింగి తురకలతోఁ బోరనెఱుఁగవైతి
కుక్షిలో లోకముల్ కుదురుసేయుట నేర్చి వరుససొమ్ములు దాఁపనరయవైతి
పదునాల్గులోకముల్ పాలించుటయెఱింగి నీకు రాజ్యము గావనేరవైతి

వవనిఁ దెల్లనివెల్లఁ బాలనుచుఁ నమ్మి
మోసపోతిరి గర్వంబుమొదలఁద్రోచి, భద్ర. ౭౮

అగ్నివర్ణాదివీరాగ్రేసరులకంటె మిక్కిలే సోల్గాడు లక్ష్మణుఁగ
వృశ్చికరోమాదివీరుల కితఁడే సిఫనామేరుల సిద్ధిబలము
ఇంద్రజిదాదుల కెక్కుడే తలపోయ ధరణిలోపలఁ గుమ్భదాను లరయ
నవనిరాక్షసమూయాధికమే లెక్కింప మొగలాయుమర్గంబు మొగిఁదలంపఁ
బోనఁగఁ ద్రేతాయుగంబురక్షసులకంటెఁ
గలియుగమునాఁటితురకలు ఘనమెమీకు, భద్ర. ౭౯

కపులచేఁగ ఖపింపఁ జపలదైత్యులు గారు జెంజరీవాక్కాల చెడుగుదొరలు
ఆళ్ళచే నడిపింప రాక్షసావళిగాదు పడినెన్న ఖారుజవానుగములు
లగ్గలువట్టింప లంకాపురముగాదు మహిఁ జావరగడీను హాలుగాని
పిలిచికొల్వీయ విభీషణుండిలఁ గాఁడు బిగిగ్లుఅలియూరు బేగుగాని
చేసితివి మ్లేచ్ఛులతో పగచేసి ఖాఅప్పు
గఅపఁబూనియు వెఱచినక్రమముద్రోఁప, భద్ర ౮౦

పితృవాక్యమునకునై పినతల్లికోరికి గమపఁగా నేరీతిఁ గడగినావో
కడఁగినవాఁడవై ఖరదూషణాదిరాక్షససమూహము నెట్లు చదిపినావో
చదిపినవాఁడవై శాఖామృగశ్రేష్ఠు నేగతి బంటుగా నేలినావో
యేలినవాఁడవై యెటువలెఁ గపులలంఘన వార్ధినేత్రిఁ గట్టినావో
కట్టి లంకాధిపుని నెట్లు కొట్టినావో
యిట్టిధైర్యము గలదొరపట్టి వరయ, భద్ర. ౮౧

సోమకాసురునితోఁ జొచ్చిపాథోరాశి మత్స్యమైసుఖలీల మరగినావో
కూర్మరూపముచేతఁ గుంభినిఁజొరఁ బాతి వ్రేగుచే బైటికి వెళ్లలేవో
వరహా(?)వతారమై వసుధకోరాడిన సిగ్గుచే మూలలఁ జేరినావో
బాలునిపల్కువెంబడి వేగరా నుక్కుఁగంబంబులోడాఁగఁ గడఁగినావో
కాక నిజరూపమున నున్న ఖలులుసేయు
చేఁతలకు నూరకుంనువే చేయుముఅని, భద్ర. ౮౨

బలిచేత దానంబు ప్రార్థింపఁబోతివో కబ్జరూపముచేతఁ గుటిలబుద్ధిఁ
బరశువాస్త్రుడవై పార్థివావలిద్రుంచి ధరయేలఁబోతివో ధర్మరీతిఁ
మునుపటివనవాసమునఁ జెందియూగూనను మఫుకో బోతివోకుడుపుగొనక
తెడయుకి గొల్లబిత్తరుల నిత్తఱిఁ జేరి కదుణిఁపఁబోతివో కాముకేళి

సహాహా బొద్దుఁడవై ఖాను లాగడముసఁ
చేయుపను లన్ని చూచెదు సిగ్గెఱుఁగక, భద్ర. ౧౩
అవనిలో పలఁ గాలయువనునినాఁటి నీపాఱుఁబోతుగుణంబు పాయదయ్యెఁ
గోఁచిబాఁపండవై కోరిన బలినాఁటి ముంకిబిచ్చపుబుద్ధి మానదయ్యెఁ
బరఁగఁగఁ బితృవాక్యపరిపాలనమునాఁటిదాడుకుకట్టితనంబుతొలఁగదయ్యెఁ
బండాలచెంత దుర్భాషలాడెడినాఁటి పుణుమిమొుండితనంబు పోవదయ్యె
నేఁటికైనను నే నన్నమాట వినక
తొలఁగి యిల్లుండుటకు నేమితోఁచదకట, భద్ర. ౧౪
తాటిపండులఁదిని త సినవాసికి శాల్యన్నమున్న ముచ్చటను కాదె
దుంపతూఁడులు దిని దొరసనవారికిఁ బరమాన్నమున్న సంబరముగాదె
తపుడు రొట్టెలచేతఁ దపము చేసినవారి కతిరసాలన్న నెయ్యంబు గాదె
నారచీరలు గట్టినట్టివారికిఁ బట్టుపీతాంబరము లన్నఁ బ్రియముగాదె
చెంచుముద్దియువిఁ దారగించినట్టి
దొరకు రాజులవిం దన్న దొడ్డగాదె, భద్ర. ౧౫
క్రూరదానవులను జీరినచక్రంబు మొురవలు వోయెనో మొక్కవడెనో
పగతురశిరములు బ్రద్దలుగాఁ జేయు గద త్రుప్పువట్టెనో కమికెనొక్కొ
రావణాసురమీఁద రవణించు పెనువిల్లు నడిమికి విఱిగెనో నారితెగెనో
శత్రువర్గము నెల్ల సమయించు పెనుదూపు కాకంబు మ్రింగెనో కాలువడెనో
కాక యిదియేమి యువనులు కాకుచేసి
మండపాగారములు మట్టుమసలి రహాహా- భద్ర. ౧౬
తాటకపై నగ్రతరముగా వెడలిన బాణం బదెక్కడఁ *బాసెనొక్కొ
ఘనసుబాహునిబట్టి ఖండించి వైచిన శరమ దెచ్చోటికి నరిగెనొక్కొ
చిత్రమృగముమీఁదఁ జిందుచెండాడిన మార్గణం బెక్కడ మడిసెనొక్కొ
వాలిపై నవలీల వ్రాలి జీవము గొన్న యాశుగం బెచ్చట నడఁగెనొక్కొ
యవని యువనులు మీరాజ్య మాక్రమించి
యేలుకొనుచున్నతఱిఁ బాలుమాలితికట, భద్ర. ౧౭
అంగదసుగ్రీవహనుమదాదులకు లాల్గుడతాలు తొడిగించఁగ ఉతుమీఁఆ
జాంబవత్ప్రముఖాదిశాఖామృగమ్ముల గారడియాడించఁగాఁ దలంపు

* పాయనొక్కొ-మూ.

# కాకినాడ-పరిషత్కార్యాలయమున వెలకు దొరకు గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయకవి రు | 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... ... | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి ... | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్లపాక పెదతిరుమలార్యుఁడు ... | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు బి. ఏ., యల్. టి. ... ... | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి ... | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు ... | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ. రామయ్యపంతులు గారు, బి. ఏ., బి. ఎల్. ... ... | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి ... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రితగ్రంథసూచిక ... ... | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేకటరమణాచా | | | 0 |
| | ర్యులుగారు ... ... | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు ... | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు బి ఏ., బి. ఎల్. ... ... | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... ... | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... ... | 0 | 8 | 0 |
| 17 | Dravidian Lexicography ... ... | 0 | 4 | 0 |
| 18 | హ్రాస్వరంగములు-క్రొత్తపల్లి సూర్యరావుగారు... ... | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము ఉత్తరభాగము-హరిభట్టు ... | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాసవిలాసనాటకము—రంగాజమ్మ. ... | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయఁకుఁడు ... | 0 | 12 | 0 |
| 22 | కాళిందీకన్యాపరిణయము. (మొదటిభాగము) అహోబలపతి | 1 | 0 | 0 |
| 23 | రెడ్లనాటి రెండుశాసనములు (శ్రీ)నాథుఁడు ... | 0 | 4 | 0 |

Printed by M. Rangiah at the Cocanada Printing Works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**

---

సంపుటము ౧౮. { శుక్ల నామసంవత్సరము. శ్రావణభాద్రపదమాసములు. } సంచిక 3

---



కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

చందా { పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. 3. } { విడిసంచిక రు ౦-౮-౧

**1929**

## ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు, పరిషద్వ్యవస్థాపకులు.
కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు—ఉయ్యూరు జమీందారువారు.
శ్రీరాణీ వత్సవాయ వేంకట సుభద్రయ్యమ్మజగపతిబహద్దరుగారు—తుని రాణీగారు.
కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షుఁడు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

దర్భా వేంకటశివరామరాజుగారు బి. ఏ., బి. ఎల్.
కిడాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుఁడుగారు
డాక్టరు వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ. ఎల్. టి. PH D (కోశాధ్యక్షులు)
శ్రీత్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు
అనంతపంతుల రామలింగస్వామిగారు.
దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారు బి. ఏ.
తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు
ఆకెళ్ళ వేంకట్రామయ్యగారు
కోట వెంకటసుబ్బారావు నాయుఁడుగారు.
ఓలేటి వేంకటరామశాస్త్రిగారు
పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.
పిల్లారిసెట్టి రంగబ్రహ్మారావు నాయుఁడుగారు.

# విషయసూచిక.

# పరిషత్ప్రయోజనములు.

తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి :-

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట;

ii తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట;

iii ఆధునికశాస్త్ర గ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుటయు;

v సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్య పట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట ఇందు ప్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుగూడ నుండవలయును;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపకరించు నన్ని కార్యములను జేయుట.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

సంపుటము ౧౭. { శుక్ల నామ సంవత్సరము / శ్రావణ భాద్రపదమాసములు. } సంచిక ౩.

## బ్ర. శ్రీ. శే. వేదము వేంకటరాయశాస్త్రి స్మృతి.

ఆంధ్రవిద్యావాచస్పతి, దోమా వేంకటస్వామి గుప్తగారు, మదరాసు.

---

గీ. అస్తమించితివా? సమస్తాంధ్రదేశ
గతబుధమనోంబుజాత భాస్కరుఁడ! యొక
శాస్త్రపూర్ణ సద్బిరుదాభిరామ! సుజన
గేయ! వేదము వేంకటరాయశాస్త్రి !!

స. ఆంధ్రగీర్వాణ విద్యామహాంభోరాశి
కలశసంభవుభాతిఁ గ్రోలె నెవఁడు?
శృంగారనైషధ శ్రీనాథకృతిసుధా
వార్ధిమథాన మెవ్వానిప్రతిభ?
వేద మన్వయమున వెలసి, యన్వర్థకు
లాభిధానుండయి యలరె నెవఁడు?
అభినవమల్లినాథాఖ్య గౌరవమంది
వ్యాఖ్యాతృమణియనఁ బ్రబలె నెవ్వఁ?

గీ. ఉమరనాముక్త సూంల్యదోవారవస్తు
తారశాచలభినుమారుమారుఁ డెవఁడు?
మేఘదూతదూతయనంగ మించెనేని
ప్రజ్ఞ? అతఁ డేఁడి? వేంకటరాయశాస్త్రి?

మ. అవురా! "సర్వదిగంత పండితచమూవ్యాహారశుంభద్గతుల్
భవదీయాశయపంకజాత విగళద్వాఙ్మాకరందాదృతిన్
జవినింజెంది, మనోజ్ఞతం బొరయుహెచ్చె" యన్న సత్కీర్తి గా
రవమున్, వేంకటరాయశాస్త్రి! తగసర్వత్ర స్ఫుర ద్రీతిఁగం
టివి; త్వద్భవ్యయశశ్శరీరకము సదానిల్చుంగదా? యుర్వరన్.

సీ. నీవిమర్శన మహానిపుణతకుఁ బ్రసన్న
రాఘవకృతివిమర్శనము సాక్షి
నీనాటకరచన నిపుణతకుఁ బ్రతాప
రుద్ర సత్కావ్యచిహ్నదసాక్షి!
నీదు గీర్వాణవాఙ్నిపుణత కలమేఘ
దూతబోధనసువైఖరియె సాక్షి!
నీయాంధ్రవాఙ్మయ నిపుణతకు నైష
ధాదికృతివ్యాఖ్య లలరుసాక్షి!

గీ. నీయుపన్యాస నిర్ణిద్రనిపుణతకును
వీనులను నేఁటికిన్నిన్ను వినుచునున్న
నీదు శిష్యనికాయమే నెగడుసాక్షి!
రమ్యసత్కీర్తి! వేంకటరాయశాస్త్రి!!

శా. కాళీదాసముఖాది సత్కవులరంగత్సంస్కృతగ్రంథ రా
జీలీలాగతులల్లవాక్తరుణి సుశ్రీలాస్యముల్; వాని యు
ద్వేలానందము నొంది, పిమ్మట, "స్వయంతీర్ణః పరాంస్తారయేత్"
నాలోకోక్తిఁ జెలంగు రీతిజగతిన్ దన్మోదమున్ గ్రంథముల్
చాలన్ వ్రాసియుఁ బంచిపెట్టితివి ప్రాజ్ఞశ్రేణికిన్; మాట లిం
కేలా? నీవు సమస్తరీతులను నెంతేధన్యతంగాంచి నా
వోలిన్; వేంకటరాయశాస్త్రి! చనినావో స్వర్గసీమంగనన్??

శా. గీర్వాణాంధ్రకవిత్వసారమని సత్కీర్తింబొడంగన్న నీ
యుర్వీమాన్యవిశుద్ధప్రతిభపీయూషంబు స్వర్గంబునం
దిర్వారం దగుతత్సుధారసము గేరింతల్ పొనర్పంగ, ని
య్యుర్వీమండలివీడి నీవు చనినావా? నాకలోకానకున్??

శా. ఘంటాప్రోక్తిగఁ జెప్పవాఁడ, ననఘా! క్ష్మామండలిన్ బూని, యే
లుంటాకుల్ గొనిపోవఁజాలని శుభశ్లోకంబుతో నొప్పు ని
ష్కాంటక్యప్రభ నొప్పుగ్రంథరచనం గన్నావు సత్కీర్తి మి
న్నంటన్; వేంకటరాయశాస్త్రి! యెప్పుడున్ నాశంబు లేకుండగన్!!

శా. ఈమద్రాసున నిన్నినాళ్లుమని, యిస్సీ! పూర్వజన్మాఘపుం
బ్రామాణ్యమ్మున మిమ్ములం దరిసి, మీపజ్జన్ దగం బాల్చి, వి
ద్యామాధ్యద్భవదీయవాక్యమకరందంబుల్ వడింగ్రోలలే;
దీమైన్స్వర్గము నీవు గాంచ, నిటులెన్నేఁ బద్యగద్యంబులే
నీమేకొల్పుట ప్రాణవర్జితతనూ శృంగారమే కాదె? శా
నీమనస్వాంతరముం జిరంతనముగా నిండారు నాత్మద్వయీ
స్సీమంతిర్యపలాలనంబులు కరంబుల్లంబునంబొంగ నెం
తో మమ్ముం గరఁగించు, శాస్త్రిగుణి! వేదోదారవంశోద్భవా!!

శా. శాంతిన్, భూమినిపీడవారలమతుల్ స్వర్గంబునం గాంచ, సు
స్వాంతుల్ వారిహితుల్ తలంతు; రది యట్లౌఁ గాక; నీస్వాంతపున్
శాంతిం గోరియు మేము వేఁడవలెనే చయ్యన్ రమాకాంతు? సి
ద్ధాంతంబయ్యె "భవత్కృతామలకృతివ్యాలోలభావంబు; లే
చింతాదంతురితాంతరంగునయినన్ జిత్తార్తి నింబాపి యున్
సంతోషంబును జెందఁజేయు" నని, యాసత్కీర్తియే ప్రాపు;
శాంతాంఘ్రిద్వయ పంకజాతమధుపత్వప్రాశయోపేత! నై
రంతర్యాంచితతృప్తిమానిత! మహారాజన్యరాజద్భర
స్వాంతానోరుకిరీటరత్ననికరాంచత్పాదకంజాత; భ
వ్యాంతర్వాణివికాయగేయ! విలసత్పాండిత్యశౌండీర్య! యి
ట్లెంతో యొప్పుకుఁగాని లోకగతిగాహ్యస్పద్మశాంత్యాప్తి నీ
కెంతేఁ గోల్పడఁగ వేఁడువారమె యిఁక; ముక్తిందూపమాస్యామనః
కాంతా! వేంకటరాయశాస్త్రి! బుధలోకధ్యేయనారాయణున్!!

మ. సతతస్వీయకవిత్వవైభవజితస్వర్వాహినీ వేగుఁడం
చితదిక్పాలమండలాయుతశ్రీమూర్తి శ్రీనాథుఁ డీ
క్షితికిం బాసి, దివిఁ జనంగ 'నట' నర్థింబొఁబ్బుకవ్యగ్రణుల్
మతిఁ గోనంగడు భీతిఁ జెందియును "గింకర్తవ్యతామూఢులై
వితతప్రాభరులై, బృహస్పతికి వేవేవెన్కఁ జేరంగనై;
రతుల శ్రీయుతతత్త్వవిప్రభుకృతి వ్యాఖ్యాతృరత్నంబవై
వృతగన్ బండితమండలీవినమితప్రోద్యన్మహావైభవ
స్థితిమైనాకముఁ జేర, నాకకవులెంతేస్వాంతమందుం గలం
గి, తమోదేశములం గనం జనరె? సత్కీర్తిప్రభాయుక్తిభూ
షిత! శ్రీ వేంకటరాయశాస్త్రి! కవితాశ్రీమానితోద్యన్మతీ!!

# త్రిలింగము—తెలుఁగు—తెనుఁగు—ప్రతివాదము.

విక్రమదేవవర్మగారు.

ఆం: సా: పరిషత్పత్త్రికయొక్క ౧౮ వ సంపుటము ౨ వ సంచికయందుఁ బ్రకటింపఁబడిన విద్యాప్రవీణ శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి "త్రిలింగము-తెలుఁగు-తెనుఁగు" అను వ్యాసమునందు "మఱికొందఱు త్రిలింగమునుండి తెలుఁగు పుట్టలేదనియు ఉత్కలింగమునుండి యుత్కళము పుట్టినట్లే తలఃకళింగమునుండి తెలుఁగు పుట్టినదని చెప్పుచున్నారు. కాని దానిని విశ్వసింపఁదగిన ప్రమాణములు లేవు." అను వాక్యద్వయము గలదు. తలకళింగమునుండి తెలుఁగు పుట్టినదని చెప్పినవారు "మఱికొందఱు" గాక, నేనే యగుటవలనఁ దత్ప్రతివాదరూపముగా నే నీచిన్నివ్యాసమును వ్రాయవలసివచ్చెను. సహృదయులు సత్యము నారయుదురుగాక.

ఇప్పుడు నా కఱువదియేండ్ల వయస్సు. "త్రిలింగభవము తెలుఁగు" "త్రినగభవము తెనుఁగు" అనుపదముల బొబ్బరింత నాచిన్నతనమునుండియు నా చెవిసోఁకుచుండుటవలన నాకొకించుక చెవుడుగలిగెనవచ్చును. అట్లుండ విద్యాప్రవీణుఁడుగారు నిజవ్యాసమునందు నీపరీక్షితపదముల నర్థము నిరూపించుట నూతనవిషయముగాదు. కాని తెలుఁగుదేశముయొక్క దక్షిణసీమ మంథెన సమీపమునఁగల కాళేశ్వరమనియు నుత్తరసీమ గంజాము మండలమందలి ఛత్రపురమనియు నిరూపించుట నూతనవిషయమే యగును. అట్లెల్ల నిరూపించి తెలుఁగుదేశమును గుఱుచపఱచుట శోచనీయము. ఎల్ల నేర్పఱచుటకు విద్యాప్రవీణుఁడుగారికిఁ గావలసినవి యొకలింగము నొకకొండయును మాత్రమె కనుకఁ జిన్నకొండయును రామలింగేశాఖ్యగల లింగమును గలుగు రామేశ్వరము తెలుఁగుదేశపు దక్షిణసీమ యనియు, హిమాచలమును నందున్న కేదారేశాఖ్యగల లింగమును దదుత్తరసీమ యనియు నిరూపింపఁబడియున్నచోఁ దెలుఁగుదేశము సుదీర్ఘమై యొప్పియుండునుగదా! విద్యాప్రవీణుఁడుగారు బ్రహ్మాండపురాణమందలిదని యుదహరించిన "శ్రీశైలభీమకాళేశమహేంద్రగిరిసంయుతే"మను శ్లోకమునందలి భీమకాళేశులు కేదారేశరామలింగేశులెట్లగుదురని కొందఱు వింతనొంది యడుగుదురేని, విద్యాప్రవీణుఁడుగారు ద్రాక్షారామభీమేశునకును మహేంద్రగిరిపైనున్న గోకర్ణేశ్వరునకు నభేదము నర్పి సీమ నేర్పఱచుటవలన వారి యభేదసాధనమునే చేకొని భీమేశుఁడే కేదారేశుఁడు మఱి కాళేశుఁడే రామలింగేశుఁడని సమర్థింపవచ్చును. విద్యాప్రవీణుఁడుగారు గోదావరీమండలస్థిత భీమేశలింగమునకును గంజాముమండల

మందలి మహేంద్రగిరికిని ముడిపెట్టి యెల్ల నేర్పఱచుట మసిఁబూసి నేరెడుకా యసేయుటయె.

మహేంద్రగిరిగలదేశము కళింగమని సుస్పష్టముగాఁ జెప్పఁబడిన "స ప్రతాపం మహేంద్రస్యమూర్ధ్ని తీక్ష్ణం న్యవేశయేత్" అను శ్లోకమును రఘువంశకావ్యమునందును నాయుపన్యాసమునందును విద్యాప్రవీణుఁడుగారు పఠించియుందురుగదా. అట్లయ్యు వారుమహేంద్రగిరిని దెలుఁగు దేశాంతర్గత ము సేయుట యతివిచిత్రము! "శ్రీశైల భీమ కాళేశమహేంద్రగిరి సంయుత" మను శ్లోకము బ్రహ్మాండపురాణములోనిదని విద్యాప్రవీణుఁడుగారు సెల విచ్చిరి. అది తత్పురాణమున నుండునేని, శ్రీశైల భీమకాళేశమహేంద్రగి రుల కూరుపే దానిని బ్రక్షిప్తమని చెప్పక చెప్పుచున్నది.

మన పురాణములలోనున్న పెక్కుశ్లోకములు మాత్రమే కాక, పెక్కు-గాథలును బ్రక్షిప్తములనుట సుప్రసిద్ధము. "దేనియందు లేనిది బ్రహ్మాండపురాణముననుండు" నను సామెత యుత్తరశభాషయందుఁ గలదు. కనుక నుపరి కథితశ్లోకము నటుండ నిచ్చెదము.

అప్పకవియు నహోబలపండితుండును సీతారామాచార్యులును "త్రిలింగ" పదము ప్రకృతియనియు దాని వికృతియె "తెలుఁ" గనియుఁ జెప్పినంతనె వారిపలుకులను విజ్ఞులు విశ్వసింపరు. తెలుఁగుదేశమున నెన్నఁడును సంస్కృతము వ్యావహారికభాషగా నుండమిఁ దద్దేశము సంస్కృతసమాసయుక్తముగు "త్రిలింగదేశ" మని కాని "త్రినగదేశ" మని కాని వ్యవహరింపంబడియుండక, "తెలుంగునా" డని వాడఁబడుచుండెననుటయె యుక్తియుక్తము. కనుకఁ ద్రిలింగత్రినగపదములను బ్రకృతులనుట యనుచితము. కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుపంతు లూహించినట్లు "తెలుంగు" పదమునె ప్రకృతియనుట సమంజసము. ఆపదమే "తెనుంగు" అయి పిమ్మట "తెలుఁగు" మఱి "తెనుఁగు" అయ్యెను. "త్రిలింగ, త్రినగ" ములను రెండుపదములు నర్వాచీనాంధ్రపండితులు కల్పించిన వికృతులనియె యెఱుంగఁదగును.

"తెలుంగు" పదమునకుఁ బ్రకృతి "తలకళింగ" మయియుండునని నేనే యూహించితిని; మఱి నమ్ముచున్నాను.

"శ్లో. యేనామకేచదిహనః ప్రథయంత్యవజ్ఞాం
జానంతితే కిమపితాన్ప్రతినైషయత్నః
ఉత్పత్స్యతేఽస్తిమమకోపిసమానధర్మా
కాలోహ్యయం నిరవధిర్విపులాచపృథ్వీ"

# భాషానియమము.

వల్లాది రామకృష్ణశాస్త్రి చయనులుగారు.

వివిధభాషాభిజ్ఞులగునట్టియు ఆంధ్రభాషాభిమానము గలిగినట్టియు నాంధ్రదేశచిరవాస్తవ్యులగు ప్రాజ్ఞులకొక విజ్ఞాపనము.

దేశభాషల కన్నిటికిని వ్యాకరణములు తత్తద్దేశవాసులగు పురాతన పురుషులచే రచింపఁబడియున్నవి. వారికి పూర్వకాలమునఁగూడ నిట్టి నియామకగ్రంథములుండియుండును. భారతకాలమునఁగూడ దేశభాషలున్నట్లు విదుర యుధిష్ఠిరసంవాదమువలన తెలియనగును. తత్తద్దేశవాసులు వ్యవహారదశయందించుమించుగా వ్యాకరణవిరుద్ధశబ్దములను ప్రదేశభేదములబట్టి వ్యవహరించుచున్నను గ్రాంథికముగా భాష నుపయోగించునప్పుడు వ్యాకరణానుసారముగనె వాడుదురు. అట్టిభాషయే పండితగ్రాహ్యమగును. కర్ణాటకభాషయందు మైసూరుప్రాంతమునకు ధార్వాడాప్రాంతమునకు చాలా వ్యత్యాసముకలదు. వ్యాకరణనియమమునకుమాత్ర మందరుబద్ధులగుదురు. కూరుచుండవలెను. అనుమాటకు కూతుకోబేకు అని మైసూరుప్రాంతమునను కూడిబేకు అని ధార్వాడాప్రాంతమునను వాడుదురు. చోళదేశమున కావలెను అను పదమునకు వేండం అనియొక ప్రాంతమునను, వేణుం అని మరియొకప్రాంతమునను వాడుదురు. ఇట్లే అన్నిదేశములందునను ప్రదేశభేదములనుబట్టి యవాంతరభేదము కలదు మనయాంధ్రదేశము.

శ్లో॥ ఆన్ధ్రత్వమాన్ధ్రభాషా చప్రాభాకర పరిశ్రమః।
తత్రాపియాజుషీశాఖానాల్పస్యతపసఃఫలం।
అహోభాగ్యమహోభాగ్యమాన్ధ్రదేశ నివాసినాం।
వ్యత్యస్తవర్ణం గాయన్తిశివనామపదేపదే।

యని దేశాన్తరస్థులగు పండితులచేత, భగవద్భక్తి యందునను భాషాప్రాశస్త్యమందునను వన్నెగాంచినది.

యైర్దేశస్త్రిభిరేషయాతి మహతీంఖ్యాతింత్రిలింగాఖ్యయా । యేషాం కాకతిరాజకీర్తినివహైఃకైలాసశైలాఃకృతాః । తేదేవాః ప్రసరత్ప్రసాదమధురాశ్శ్రీశైలకాళీశ్వర। ద్రాక్షారామనివాసినః ప్రతిపదంత్వచ్ఛ్రేయసేజాగ్రతు॥

అని ప్రతాపరుద్రీయమందు చెప్పఁబడినవిధమున సుప్రసిద్ధపుణ్యక్షేత్రములెల్ల లు గాఁగల త్రిలింగదేశమను నామాంతరముగూడ దీనికి గలదు.

ఇట్టిదేశమందు జన్మించిన మనలోకొందరు భాషానియమములఁ బాటింపక యతిప్రాసనియమముల గమనింపక వ్యాకరణనియమముల నుల్లఘించుచు వ్యాసముల రచించుటయు, గ్రంథముల రచింపఁబూనుటయు దేశాంతరస్థులకు గూడ హాస్యాస్పదముకాక మానదు. భాషకు ఏకరూప్యము స్థిరతనిచ్చును గాని యవ్యవస్థితత్వము స్థిరత నీయఁజాలదు. దేశభాషలందు తెలుఁగులెస్స యని సకలభాషాభిజ్ఞుడగు కృష్ణదేవరాయలు నియమబద్ధయగుభాషను స్తుతించియుండును గాని గ్రామ్యమును స్తుతించియుండఁడు.

గాన ప్రాజ్ఞులందరు నేకాభిప్రాయముతో బ్రాచీననియమబద్ధయగు నాంధ్రభాషయందే దృఢాభిసంధికలిగియుండుట యుక్తము. సకలదేశీయులచేత బాటింపఁబడు దేశీయవ్యాకరణనియమములను మనముల్లంఘనము చేయఁబూనుట యసంగతము. సంస్కృతభాషయందుగూడ లేని యతిప్రాసనియములను ఆంధ్ర మహాకవులు తెచ్చిపెట్టి పాటించుటకు అతీంద్రియములగు హేతువు లుండితీరును. దేశభాషలందుగూడ సర్పవృశ్చికాది విషనిరాసకములగు మంత్రములు గలవు. వానిని యథానియమముగా నుచ్చరింపవలయును. అన్యథా ఫలజనకములు కావు. అటులనే భాషానియమము బాటింపక రచించిన గ్రంథములనర్థదాయకము లగును. బహుజ్ఞుఁడగు నప్పకవి యట్టి యనర్థముల కొన్నిటి నుదాహరించెను.

వృత్త్యనుప్రాసరూపమున కావ్యశోభ ప్రాసమునకు దృష్టఫలము. యతులకు నక్షరానులోమ్యము సూక్ష్మేక్షికచే గానవగును.

చోళీపయోధర ఇవప్రకటోనకామం నోగూర్జరీస్తన ఇవాతితరాంవిలీనః। అర్ధోగిరావ పిహితః పిహితశ్చకించిదాంధ్రీపయోధరఇవాతితరాంనమింధే. అని ప్రాచీనులు వర్ణించినవిధమున నాయాదేశవాసులవేషములు పూర్వకాలమున నియతములై యుండెను. ప్రస్తుతము విదేశీయవిద్యాభ్యాస ప్రాభవమున నుచ్ఛృంఖలులగుచు నాంధ్రదేశవాసులగు స్త్రీపురుషులు నితరదేశవాసులకంటె నధికముగా శిఖాదులందునను వస్త్రధారణమందునను మార్పుల నందుచున్నవారు.

ఇదియంతయు మన బుద్ధిదౌర్బల్యమువలననే కలిగినది. నాతిప్రయోజనకము. భాషానియమోల్లంఘనముగూడ నిట్టిదే. పురుషుఁడు గాజులు తొడగికొని చీరె గట్టుకొనినయెడల వానిఁజూచి సాటివారలు నగుదురు. అట్లే ఒక దేశమువాఁడు దేశాంతరవాసివేష మనుకరించినను హాస్యాస్పదమగును. పగటివేషమువారలు హాస్యరసపోషకులగుట కిదియేకదా కారణము.

ఇదిగాక శ్రీకృష్ణాద్యవతారములను వ్యాసాదిమహర్షులను వారిగ్రంథములను పరిహసించుచు విపరీతార్థముల వ్రాయు పురుషు లిదివఱకే పుణ్యభూమియగు నాంధ్రదేశమం దావిర్భవించినట్లు తోఁచదు.

చెట్టుచివరకు కుక్కమూతిపిందెలు బుట్టు ననుసామెత ననుకరించుచునట్టి యవతారములుగూడ మనదేశమం దావిర్భవించుచున్నయవి. ఇవియన్నియు నుత్పాతములు. అయశస్యములు. సకలలోకశ్లాఘనీయులును అణిమాదిసిద్ధిశాలురును పరమేశ్వరుని జ్ఞానశక్త్యవతారరూపులని యెంచఁబడిన మహానీయుల చరిత్రములందు మనబుద్ధిదోషముచేత నసంగతములున్నట్టు తోఁచినను తద్విద్యసమాగమముచేత నట్టి శంకల నివర్తింపఁజేసికొనుట యుక్తముగాని, వానిం గ్రంథరూపమున వెల్లడించి మతసిద్ధాంతరహస్యరూపముల నెఱుంగని సందిగ్ధచిత్తులగు పామరులఁ జెఱచుట లోకాపకారముగాక మానదు. ఇట్టి వాసనలు మనచిత్తములందు ప్రబలకుండునట్లు తగు విమర్శనముఁజేసికొనుట మన కర్తవ్యము. ఆంధ్రదేశనాయకులు ఆర్ష(?)భాషాఖ్యాతిని,ఆస్తికత్వప్రయుక్తమగు మతఖ్యాతిని వేషనియమఖ్యాతిని కాపాడుటకై బద్ధపరికరులగుదురుగాక. కొన్నిపత్త్రికలందును పుస్తకములందును ప్రాజ్ఞంమన్యులు చేయు నియమోల్లంఘనముఁజూచియున్నాను. దాని నామోదించువారును కొందఱుగలరట, ఉండియుందురు. గనుకనే (జాతోర్దైవాదుచిత ఘటనా సంవిధాతా విధాతా) యనునభియుక్తోక్తి కలదు. వారి కందఱకును ఇట్టికృత్యములు న్యాయ్యములు కావని వినయముతో విన్నవించుచున్నవాఁడను.

సర్వశక్తులుగల పరమేశ్వరుఁడు వీరికిట్టి స్థిరబుద్ధి నొసఁగి దేశాంతరస్థులవలన వీరికి సంభవింపఁబోయెడి యపమానపు నదొలఁగించుఁగాక.

# సంస్కృతదూతకావ్యోత్పత్తివికాసములు.

(గతసంచికావశేషము)

ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు.
(ఆంధ్రగీర్వాణసాహిత్యపరిషదధ్యక్షుఁడు; విజయనగరము.)

---

3 శ్లో. బాల్యే ష్వాలీష్వపి మనసిజం సాఽభివ్యఞ్జయన్తీ
పాణ్డుక్షామా కతిచిదనయత్ కాతరా వాసరాణి
గన్తుం దేశాన్తర మథమథా వస్యథైవ ప్రవృత్తం
గాఢోత్కణ్ఠా మలయపవనం సప్రణామం యయాచే. 3

కాఞ్చీపురము, చోళసీమన్తినులు, కావేరి యీక్రింది శ్లోకములలో నువర్ణింపఁబడియున్నవి.

4 శ్లో. లీలాగారై రమరనగరస్యాపి గర్వంహరన్తీం
గచ్ఛేః కాఞ్చీపుర మథదిశోభూషణం దక్షిణస్యాః
నక్తం యత్ర ప్రహరిక ఇవోజ్జాగరం నాగరాణాం
కుర్వన్ పాణిప్రణిహితధను ర్జాయతే పఞ్చబాణః. ౧౨

5 శ్లో. ఆభ్రం లీలావిహసితమివ శ్యావతామభ్యుపేతే
సద్యః ఫేనవ్యతికరమిషా దర్పయ త్యంశుకాన్తమ్
అమ్భః క్రీడాకుతుకరభసభ్రష్టచీనోత్తరీయే
యన్నారీణా ముఱసి సుబలావీచిహస్తైః సఖీవ. ౧౩

6 శ్లో. మన్యే మోక్షః కఠినసురతాయాసలబ్ధస్య తూర్ణం
దుష్ప్రాపస్తే పవన భవితా చోలసీమన్తినీభ్యః
కేవా తాసా మలకరచనా లీనసీలీననాథే
గణ్డాభోగే మలయజపయః పిచ్ఛిలేన స్ఖలన్తి. ౧౪

7 శ్లో. హిత్వా కాఞ్చీ మవినయవతీ భర్తరోధోనికుఞ్జాం
తాం కావేరీ మనుసర ఖగశ్రేణివాచాలకూలామ్
కాన్తాశ్లేషా దపిఖలు సుఖస్పర్శ మిన్దుత్విషోఽపి
స్వచ్ఛం భిత్వా ప్రవణమనసోఽస్యమ్బుయస్యా లఘీయః. ౧౫

ఈ క్రిందిశ్లోకములో నంధ్రదేశము, గోదావరి, కళింగనగరియుఁ జెప్పఁ బడినవి.

8 శ్లో. అన్ధ్రాన్ హిత్వా జనపదఃధూ గాఢగోదావరీకాన్
కాలిఙ్గస్యానుసర నగరీం నామతాం రాజధానీమ్
సమ్భోగాన్తే ముకులితదృశాం తత్ర వారాఙ్గనానామ్
అఙ్గగ్లానిం హర పరిపతన్ కేలివాతాయనేషు. ౨౧

ఈ క్రింది 3 శ్లోకములలో భిల్లస్త్రీలు, శబరకాంతలు, కేరళకాంతలు నుపవర్ణింపఁబడిరి.

9 శ్లో. స్వేచ్ఛారమ్యం విహర విహగవ్యాకులోత్తుఙ్గవృక్షే
విన్ధ్యోత్సఙ్గప్రణయిని వనే మానవత్యోఽపి యత్ర
సఙ్గాయన్తే రహసి కరిణాం క్రూరమాకర్ణ్య శబ్దం
భర్తుః కణ్ఠే ప్రణిహితభుజావల్లయో భిల్లయోషాః ౨౮

10 శ్లో. స్వైరక్రీడారసికశబరీసిక్తరోధోనికుఞ్జాం
గచ్ఛే రేవామభినవశుకశ్యామవంశీవనేన
మన్యన్తే యత్పరిసరభువి ప్రోషసీమన్తినీనాం
లీలామానగ్రహమపి రతే రన్తరాయం యువానః. ౨౯

“పవనదూత” యందు నాయికావిరహవేదనము ౩౧ శ్లోకములలో (64_94 శ్లో) వర్ణింపఁబడియున్నది. ఈశ్లోకము లతిలోకకవితావైభవవిలసితములు. ఇట నాశ్లోకరత్నములు కొన్ని విమర్శనికషోపలమునఁ బరీక్షింపఁబడుఁగాక.

11 శ్లో. కీదృక్ కాన్తః కథయ తరలే వర్తతే యస్తవాన్త
ర్యత్నాదిత్థం సుభగ బహుశః పృష్టయాలీజనేన
నిఃశ్వస్యోచ్చైః కధమపి తయా స్తమ్భితాశ్రుప్రవాహా
న్యస్తాదృష్టి ర్లిఖితమదనే భిత్తిభాగే గృహస్య. ౬౭

12 శ్లో. నోత్తంసత్వం దృశమపి నయత్యుత్పలే బద్ధకోపా
మాల్యైః క్లాన్తా నభుజలతికా మప్యసౌ సంవృణోతి
పద్మోద్విగ్నాహృదయనిహితా త్తాపసంపత్తిహేతో
రాలీనాస్త్రా దపిచ సహసా మీలితాక్షీ బిభేతి. ౬౯

13 శ్లో. ఆదాయాత్తో నయనపదవీం స్తమ్భయన్ పక్ష్మమాలాం
చుమ్బన్ గణ్డస్థలభువ మథో పీతబిమ్బాధరోష్ఠః
కుర్వన్ కణ్ఠగ్రహ మపి కుచోత్సఙ్గశయ్యాశయాన
స్తస్యాః స్వాప్నః కిమివ సఖిలు త్వద్వియోగే కరోతి. ౭౮

ఈ క్రిందిశ్లోకములు కవివృత్తాత్మకములు:—

14 శ్లో. దన్తివ్యాఘ్రం కనకలతికాం చామరం హైమదణ్డం
యో గౌడేన్ద్రా దలభత కవిక్ష్మాభృతాం చక్రవర్తీ
శ్రీధోయీకః సకలరసికప్రీతిహేతో ర్మనస్వీ
కావ్యం సారస్వత మివ మహామన్త్ర మేతజ్జగాద. ౧౦౧

15 శ్లో. గోష్ఠీబన్ధః సకలకవిభి ర్వాచివైదర్భరీతి
ర్వాసో గఙ్గా పరిసరభువి స్నిగ్ధభోగ్యా విభూతిః
సత్సు స్నేహః సదసి కవితాచార్యకం భూభుజాం మే
భక్తి ర్లక్ష్మీపతిచరణయో రస్తుజన్మాన్తరేఽపి. ౧౦౨

16 శ్లో. యావచ్ఛమ్భు ర్వహతిగిరిజాసంవిభక్తం శరీరం
యావ జ్జైత్రం కలయతిధనుః కౌసుమం పుష్పకేతుః
యావ ద్రాధారమణతరుణీకేలిసాక్షీ కదమ్బ
స్తావ జ్జీయా త్త్రవినరపతే రేష వాచాం విలాసః. ౧౦౩

17 శ్లో. కీర్తిర్లబ్ధా సదసివిదుషాం శీతలక్షోణిపాలా
వాక్సన్దర్భాః కతిచిదమృతస్యన్దినో నిర్మితాశ్చ
తీరే సమ్ప్రత్యమరసరితః క్వాపి శైలోపకణ్ఠే
బ్రహ్మాభ్యాసే ప్రయత మనసా నేతుమీహే దినాని. ౧౦౪

XIX పవనదూత:—11 సూరివాదిచన్ద్రనిర్మితము. ఈకవి క్రీ. శ. 17 వ శతాబ్దిలో విలసిల్లియుండెను. ఇందు 101 శ్లోకములు గలవు. ఉజ్జయినీ మహీపతియగువిద్యావరేనుఁడు విద్యాధరాపహృత యగుతనసతీమణి తార యొద్దకుఁ బవనుని వార్తాహరునిగాఁ బంపుట యిందలికథాసారము.

ఈ కావ్యకమలమునందలి మధువును రసికాళి యించుక యాస్వాదించునుగాక.

౧. శ్లో. రాజా రాజ్ఞీం ఖగపతిహృతాం నామతః శ్రీసుతారాం
ధ్యాయం శ్చిత్తే జగతి విదితాం శీలసౌభాగ్యభాగ్యైః

11 "కావ్యమాల" XIII గుచ్ఛము 2 సంఖ్య; (పుటలు 9—24) ప్రత్యేకముగా "హిందీజైనసాహిత్యగ్రంథావళి" (సంఖ్య3) ఉదయలాల్ కస్లీవాల్ చేఁ బ్రకటితము. "హిందీజైన సాహిత్యప్రసారక కార్యాలయము"—బొంబాయి. 1914

దూతం మోహా త్పవన మహ్నాదం ప్రాహిణో దశ్రునేత్రః
ప్రాయో మోహో భవతి భవినాం త్వహేతుః. ౧

౨. శ్లో. భీమాటవ్యా మమరవనితా స్పర్థియా పాభిమానా
వేణీబన్ధగ్రథితకుసుమా భూర్జపత్రావవస్త్రాః
గుఞ్జాయుక్తతృణమణిగలా యత్ర భిల్లాదినార్యః
తాస్త్వం పశ్యే ర్యది హి భవతో దృష్టిసృష్టిశ్చ దేవాన్. ౨౬

3. శ్లో. వార్యస్తారా మనుచ భువనే భాగ్యసౌభాగ్యవత్యో
వార్యస్తారా మనుచ భువనే శీలసంపన్నిగాసాః
వార్యస్తారా మనుచ భువనే భర్తృభక్త్యేకరాగా
వార్యస్తారామనుచ భువనే దీనదానప్రదాత్ర్యః 33

౪ శ్లో. సంస్పర్శ స్తే సురతసమయే పాదయో స్తేనట స్తం
సన్నహ్నైరైః శ్రితతనుదవం లీలయా నీలకణ్ఠమ్
తత్పక్షైర్వా తనుసుఖకరం స్వేదబిన్దుప్రమార్జం
కాన్తే రాత్రౌ కథమపి చిరా న్నేత్రయో ర్నైవ నిద్రా. 3౫

౫. శ్లో క్షీరం నీరం పిబతి జలధేః పఙ్క్తు మశ్నాతి భూమే
ర్నానాగ్రాహా న్గ్రసతి కఠినా న్వాడవాగ్నిః స్వశక్త్యా
ఏకం చన్ద్రం కిమితి సరసం దేహపిత్తాపహారం
దృష్ట్వాత్మానం భువి విరహిణో నైవ తం జన్మశత్రుమ్. ౫౯

౬. శ్లో అన్యస్త్రీణాం హృదయహరణే వర్ధితాత్మాభిమానః
కన్దారాయా మనఃఖగయో ముక్తలజ్జో వరాకః
భూమే రూర్ధ్వాన్తర మధివస న్భూధరస్యాపి కాకః
కిం వా జాయా త్పురగిరిశిరః క్షుద్రజీవాద్యగమ్యమ్. ౬౯

౭ శ్లో. గత్వా హంసీం కువలయదలం చక్షుషా నిర్జయన్త్యాః
శుభ్రత్స్వర్ణద్యుతిచయతనో స్సర్జితానన్తలక్ష్మ్యాః
భోః తారాయా విషము విరహే వైరిణాం బాణతుల్యే
మృత్యో ర్గేహం యది నహిగతః సత్త్వవ స్నేఽమరత్వమ్. ౭౫

౮. శ్లో. విశ్వం కుర్వ న్విధిరథవరం చన్ద్రిమధ్యే గృహీత్వా
చక్రే తారాముఖసరసిజం తేన ఛిద్రాణ్యభూవన్

తత్ర వ్యోమావనిజనగణై ర్దృశ్యతేచా పరస్థం
భూమేచ్ఛాయా సమ్యగశశకే నాపి దేహస్య భావః. ౭౫

౯. శ్లో. దృష్ట్వాతారాం ప్రముదితమనాః సంజహ స్త్రిజిసేశం
ధిక్కుర్వాణాం ఖచరవనితాం శీలరత్నప్రభాభిః
విద్యాధీశం స్మరశరవశం బన్ధవన్నానయ స్త్రి
చిత్తేభూయో విరహవిధురం స్వంపతిం చిన్తయ స్త్రిమ్. ౮౪

౧౦ పాదానత్వా జగదుపహృతా వర్ధసామర్థ్యవన్తా
విఘ్నధ్వాన్తప్రసరతరణేః శాన్తినాథస్య భక్త్యా
శ్రోతుం చైక త్సదసి గుణినా వాయుదూతాభిధానం
కావ్యం చక్రే విగతవసనః స్వల్పధీ ర్వాదిచన్ద్రః ౧౦౧

"The List of Skt. works supposed by the Nepalese Pandits to be rare in the Nepalese Libraries at Khatamandoo" లోనియాంశ వగ్రంథముగు "పవనదూత" పూర్వోల్లిఖిత కావ్యములలో (XVIII; XIX) నొకటియో లేక వీనికంటె విలక్షణమో తెలియలేదు

XX. పాన్థదూతః— 12

భోలానాథవిరచితము. 105 శార్దూలవిక్రీడితవృత్తపరిమితము. ఈకవి తికూరి (Tikuri) గ్రామవాసి యగు నొక వైష్ణవ బ్రాహ్మణుడు. మధురానగరమున నున్న శ్రీకృష్ణునకుఁ దన్నగరగమనోన్ముఖుఁ డగు నొకయాత్రికునిచే నొకానొకగోపిక 'స్మరసన్దేశము' (Love-message) ను బంపుట యిట నభివర్ణితము.

XXI పికదూతః— 13

ఇది 31 శార్దూలవృత్తపరిమితము. గోపికలు శ్రీకృష్ణునియొద్దకుఁ బికము (కోకిల) ను దూతగాఁ బంపుట యిందలి కథాబీజము.

XXII. భక్తిదూతిః— 14

కాళీప్రసాదప్రణీతము. ఇది యంతరర్థకథాన్విత మగు నొక కావ్యము.

---

12 "Catalogue of Skt. Mss. in the India Office Library" Vol. VII. No 3890.

13 దీనివ్రాఁతప్రతి యొకటి మదీయగ్రంథాలయమునఁగలదు.

14. "Notices of Skt. Mss Rajendralal Mitra, Vol III, P.27

* 'Allegory' అనఁగా నంతరర్థకథాన్విత మగు కావ్యము. ఇట్టికావ్యములు సంస్కృతసారస్వతమునఁ బెక్కులు గలవు. (1) అందుఁ బ్రథమ మసంపూర్ణముగా లభించిన 'యశ్శఘోష

ఇందు 23 శ్లోకములు గలవు. కవి ముక్తికాంతను వలచి యామెయొద్దకు భక్తిని దూతిగాఁ బంపుట యీకావ్యమునందలి వస్తువు.

XXIII భృఙ్గసన్దేశము:— 15

వాసుదేవవిరచితము. ఈకవి కుక్కుటక్రోడ (Calicut) ప్రభువు లగు రవివర్మ, గోదవర్మలయాస్థానములో నుండెడివాఁడు. ఈతఁ డీకావ్యమును రచించి యుద్దండకవియొద్దకుఁ బంపె ననియు దానికిఁ బ్రత్యుత్తరముగా నాతఁడు "కోకిలసన్దేశము" (సంఖ్య. V) ను వ్రాసె ననియుఁ గింవదన్తి. నిద్రావివశుఁ డగునొకఁ డొకానొక యక్షునిచే నపహృతుఁడై, తనకాంతయొద్దకు భృఙ్గమును సన్దేశహరునిగాఁ బంపుట యీకావ్యమునందలి యితివృత్తము. ఇది సంపూర్ణముగా నున్నది. ఇందు 192 శ్లోకములు గలవు.

* చిన్తాహరణచక్రవర్తి "సంస్కృతసాహిత్యపరిష"త్పత్త్రిక. (సం. VIII. సంచిక 10; పుట 379) లో నిట్లీ కావ్యముంగూర్చి వ్రాసెను.

"భ్రమరసన్దేశః—వాసుదేవకృతః. వాసుదేవోఽయం 'యుధిష్ఠిర' పురదహ'నాదికర్తా. "వాసుదేవవిజయ"విరచయిత్రా వా తుల్య ఇతి ననిర్ణీతమ్."

చెన్నపురప్రాచ్యలిఖితగ్రంథాలయపట్టికనుండి యీకావ్యశ్లోకములఁ గొన్నిటి నుటకించెద.

---

నినాటకము.' ఇందుబుద్ధి, కీర్తి, ధృతిమొదలగునవి పాత్రములు(Vide, Prof. A. B. Keith's "Sanskrit Drama" P 84) తరువాతఁ గృష్ణమిశ్రమహాకవి (క్రీ శ. 11 వ శతాబ్ది) యద్వైతవేదాన్తప్రతిపాదకముగఁ "బ్రబోధచన్ద్రోదయ మ"ను నాటకమును రచించెను. పిమ్మటఁ గ్రీ. శ. 12 వ శతకములో 3 యశఃపాలునిచే జైనమతప్రతిపాదక మగు "మోహరాజపరాజయము"ను నాటకము రచింపఁబడెను క్రీ. శ 13, 14 శతాబ్దులలో విలసిల్లియుండిన వేదాన్తదేశికకవితార్కిక సింహులు విశిష్టాద్వైతప్రతిపాదకముగ "సంకల్పసూర్యోదయము"ను నాటకమును విరచించిరి. క్రీ.శ. 16 శతాబ్దిలోఁ గవికర్ణపూరుఁడు "చైతన్యచన్ద్రోదయ" నాటకమూలమున విబుధలోకమునకుఁ జైతన్యచరితామృతమును బ్రసాదించెను. క్రీ శ. 17, 18 శతాబ్దులలో విలసిల్లిన యానన్దరాయమఖి "విద్యాపరిణయము" "జీవనన్దనము" అను శైవమతప్రతిపాదకము లగు రెండునాటకముల రచించెను. పిమ్మటగోకులనాథోపాధ్యాయుఁడు" అమృతోదయ మ"ను నాటకమును రచించెను, ఇట్టి కావ్యములు రూపకాతిశయోక్తిమూలకము లని యాలంకారికాభిమతము.

15. "D. C. S. Mss. in the Madras Oriental Library" Vol. XX No 11865. Page 7942.

1. కావ్యారంభము:—

౧ శ్లో. హర్మ్యే రమ్యే బహులవిలస చ్చన్ద్రికాయాం నిశాయాం
మన్దం నన్ద త్కుముదసురభౌ శీతలే వాతివాతే
లోలాపాఙ్గ్యా మనసిజకలాఖేలనాయాసితాఙ్గ్యా
సాకం నిద్రాం సుకృతిసులభాం కో౽పి కామీ సిషేవే.

౨ శ్లో. తం నిద్రాణం మదనవివశా కాచిదాలక్ష్య యక్షీ
హస్తే ధృత్వా మలయశిఖరే హన్త రన్తుం ప్రయాన్తీ
స్యానన్దారే నిజపతి ముపాయాన్త మాలోక్య భీతా
విన్యస్యైనం క్వచన విమనా స్తేన సార్థం ప్రయాతా.

3 శ్లో. మామాసీద ప్రియజనవియోగామయా త్తామయానా
యక్షీ సౌధా దపహృతవతీ ప్రస్వపన్తం భవన్తమ్
కాన్తా క్రాన్తా పిచ తవసఖే నాకదం ప్రాప దన్యాం
తద్గన్తవ్యం ద్రుత మితిదివః శుశ్రువే తేనవాణీ.

౪  మాధి మన్దో౽
ప్యస్తస్థైర్యా జ్జ్వరమధివహన్ గన్తు ముద్యుక్తచేతాః
ప్రాప్తాం మూర్ఛద్విరహిమిథునాం మాధవీం వీక్ష్య లక్ష్మీ
మార్తో భృఙ్గం కమపి పురతో వీక్ష్య మన్దం బభాషే.

ఉపసంహారశ్లోకములు:—

౫ శ్లో. ఇత్థఙ్కారం త్వయి వినిహితే సూక్తిపుష్పోపహారైః
దీనా మచ్ఛ ప్రియసహచరీం భ్రాతరామోదయేథాః
కి న్త్వస్మాకం స(మ)ముపగతం పూర్వ మేకత్రయాత్రాం
నైవేచ్ఛామి ప్రియసఖి నచే దస్తి కార్యాతిపాతః.

౬ శ్లో ఆపన్నిత్రం మమ హరిపదామ్భోజభక్తం దయాలుం
త్వా మారాధ్య వ్యసనవితతిః స్పష్టతాం దూరదూరే
భూయాదేవం ప్రియసఖి పునర్దర్శనాయావియోగః
స్వప్నే౽పి స్యాద్భవతు యువయోః సర్వమాఙ్గల్యలక్ష్మీః

---

ఈ కావ్యమే "J. R. A. S" 1884; P. 452 లో "భ్రమరసన్దేశ" మను నామముతో
వివరింపఁబడినది.

౭ శ్లో. సన్దేశేఽస్మిన్ కథమపి గురు శ్రీపదామ్భోజయుగ్మ
ధ్యానోద్ధూతప్రబలతమసా వాసుదేవేన బద్ధే
పూర్ణైర్దో (ర్ణైర్దో) షై రపి యదిగుణానాం కణాః సంప్రథేర
న్నైతాన్ ప్రీత్యా మనసి పరిగృహ్ణన్తు సన్తో మహాన్తః

*ప్రాచ్యవిద్యాప్రౌఢసరస్వతి యనఁదగు శ్రీయుత మానవల్లి రామ కృష్ణకవిగారు "మీమాంసకాచార్యుఁ" డగు 'పయ్యూరుభట్టేరి' పండితుని కుమారుఁ డగు 'వాసుదేవకవి' 'చకోరసన్దేశ' మనునొక కావ్యమును వ్రాసినట్టు లుల్లేఖించియున్నారు:—

"Vasudeva the son of famous Mimamsaka, Payyur Patteri devotes two lines for the description of the same place (ie. Svetaranya or Terunavay) in his Chakorasandesa"

"The quarterly Journal of the Andhra Histrical Research Society" Vol III. Part I. July 1928 "Literary Gleanings" P. 69.

'భృఙ్గసన్దేశ' కారుఁ డగువాసుదేవకవికంటె భిన్నుఁడా కాఁడా యను విషయము విమర్శనీయము.

XXIV భ్రమరదూత:— 16

రుద్రన్యాయవాచస్పతివిరచితము. ఈకవి విద్యానివాసపుత్త్రుఁడు, విద్యావాచస్పతిపౌత్త్రుఁడు. ఇతఁడు, నైయాయికగ్రన్థవార్త్తికాకారుఁడును విద్యానివాససూనుఁడు నగురుద్రన్యాయవాచస్పతి యనియే తోఁచెడి. మానసింహసూనునికొఱకు "భావవిలాసము" (కావ్యమాల, ద్వితీయగుచ్ఛము)ను విరచించిన రుద్రన్యాయవాచస్పతిజనకునిపేరు "విద్యావిలాసుఁడు" గాని (చూ. 'భావవిలాసము' 136 వ శ్లోకము) "విద్యానివాసుఁడు" గాదు. అందుచే నీతనికంటెఁ బ్రకృత "భ్రమరదూత"నిర్మాత భిన్నుఁ డని యూహింపవలసి యున్నది. 'భ్రమరదూత' లోని యితివృత్తము 'చన్ద్రదూత' (సం IX) లోని యితివృత్తమువంటిదే; కాని ప్రకృతకావ్యములో సందేశహరుఁడు 'భ్రమరుఁడు'

16. "Notices of Sanskit Mss."—Haraprasada Sastri—Vol. II, p. 153; "A Catalogue of Skt. Mss. in the library of His Highness the Maharaja of Bikaner"—R. L. Mitra—p. 229 Oppert పండితుఁడు పేర్కొనిన "భ్రమరదూత" ("List of Skt. Mss. in the Private Libraries of Southern India," No. 6104) పైఁ బేర్కొనిన (సం. XXIII; XXIV) కావ్యములలో నొకటియో, లేక వీనికంటె భిన్నమో తెలియదు.

# సంస్కృతభాష—ఆంధ్రభాష.

( విద్యాప్రవీణ, బులుసు వేంకటరమణయ్యగారు.

ప్రపంచమునఁగల భాషలలో నెల్ల మనభరతఖండమునంబుట్టి భాషలలో మిన్నయై పరఁగు సంస్కృతభాషయే యతి ప్రాచీనమైన దనియు, నతి పావనమైన దనియుఁ, దక్కినభాషలన్నియు సాక్షాత్తుగాఁ గాని, పరంపరగాఁ గాని సంస్కృతమునుండియే యేర్పడినవనియుఁ, బ్రాచ్యపాశ్చాత్య పండితప్రకాండు లందఱు నంగీకరించియున్నారు. కొందఱు స్వదేశైకాభిమానులు, స్వభాషామాత్రాభిమానులు నగు పాశ్చాత్యవిద్వాంసులు సంస్కృతభాషయే యితరభాషల కన్నింటికిని మూలమని యంగీకరింపక, సంస్కృతమునకును, దదితరభాషలకును గల సంబంధ మేకభాషాజన్యత్వమని (సంస్కృతమునకును దక్కినవానికిని సంబధము కనుపించుచుండుటచే, నొకదానినుండి మఱియొకటి యుద్భవించిన దని యంగీకరింపనప్పుడు రెంటను మఱియొకభాషనుండి యుద్భవించినవని సిద్ధాంతీకరించుట కొంతవఱకు నుచితమేగదా !) నిరూపించి, వీని కన్నింటికిని మూలమగు మాతృభాష (Mother Language) యొకటికల దని సిద్ధాంతీకరించిరి. వారట్లు చేసిననాఁడుకూడ సంస్కృతభాషకు మూలమగునిండో-యూరపియన్ మాతృభాష(Mother Language of the Indo-Europian family) యిప్పుడు వ్యవహారమున లేకుండుటవలనను, నాభాషయందు వ్రాయఁబడిన గ్రంధము లేవియు మనకు లభింపకుండుటవలనను, దత్స్వరూపమును నిరూపించుటయందు సంస్కృతమే యవలంబ మని దానినేగ్రహించి సంస్కృతమునకును మాతృభాషకునుగల సంబంధము మిక్కిలి సమీపమైన దని యంగీకరించి యున్నారు. కాఁగా నెట్లాలోచించినను సంస్కృతమే మిక్కిలిప్రాచీనమైన దనియు, భాషల కన్నింటికిని మూలభూత మనియు మన మంగీకరింపకతప్పదు.

భాషాశాస్త్రజ్ఞుల సిద్ధాంతములఁబట్టి సంస్కృతభాష యిండో-యూరపియన్ భాషాకుటుంబము (Family of the Indo-Europian Languages) లోఁ జేరిన యార్యన్ (Aryan) శాఖలోఁజేరిన దనియు, మనము వాడుచున్న

యాంధ్రభాష ద్రావిడభాషాకుటుంబము (Family of the Dravidian Languages) లోఁ జేరినదనియు మనము తెలిసికొనవలసియున్నది. ఇ ట్టియది పాశ్చాత్యసిద్ధాంతము. ఇ ట్లీరెండుభాషలును భిన్నభాషాకుటుంబములకు సంబంధించియున్నను, మూఁడువంతుల ముప్పాతిక తెలుఁగుసంస్కృతమునుండియే యుత్పన్నమైన దని చెప్పవలసియుండును. మఱియు సంస్కృతమునకును దెనుఁగునకును గల సంబంధము, సంస్కృతమునకును, స్వకుటుంబజన్య మగు మఱియే యిండో- యూరపియన్ కుటుంబభాషకును లేదని నిశ్చయముగఁ జెప్పవచ్చును. ఈసంబంధ మీభాషాద్వయికిఁ గల విశేషసంబంధమును విశదముచేయుచున్నది. తత్సమ-తద్భవ-దేశ్యభేదముల ముత్త్రివిధమగు నాంధ్రమునను దొలి రెండుభేదములును, సంస్కృతమును, దత్సంబద్ధ మగు ప్రాకృతమును మాత్రము సంబంధించి యేర్పడినవి † ప్రాకృతమునకు సంస్కృతము మూలమని యెంచఁబడుటచే ప్రాకృతమువలనఁ గల్గిన భేదములును సంస్కృతసంబద్ధము లనియే యెంచుట న్యాయ మగుచున్నది

1 సంస్కృత ప్రాకృతములకుఁ దెలుఁగు ప్రత్యయములు చేర్చినమాత్రముననే యేర్పడు నాంధ్రము తత్సమము.

| | |
|---|---|
| సం- రామః=రాముఁడు | ప్రా- అగ్గీ=అగ్గి. |
| " విద్యా=విద్య. | " జడా=జడ. |
| " వనమ్=వనము. | " గారవం—గారవము. |

తద్భవభాష సంస్కృతప్రాకృతములలోఁ గొంచెము మార్పుఁ గలిగించుకొని యేర్పడునది.

| | |
|---|---|
| సం- ఆకాశః=ఆకసము. | ప్రా- ఇంగాలో=ఇంగలము. |
| " సూచీ=సూది. | " అచ్ఛరా=అచ్చర. |
| " కుడ్యమ్=గోడ. | " అచ్ఛేరఁ=అచ్చెరువు. |

ఈ పైభేదములంబట్టియు, నుదాహరణములఁబట్టియు ననేకకారణములచే నాంధ్రమునకు సంస్కృతము మూలమైనదని నిరూపింపఁ బడినది.

మఱియు నన్నకవి మొదలగువారి మతమునుబట్టి ప్రకృతి సంస్కృతమనియుఁ, బ్రకృతినుండిపుట్టినవి ప్రాకృతములగుటఁ దెలుఁగుకూడఁ బ్రాకృతభాషాభేదమే యనియుఁ దెలియుచున్నది

† ప్రాకృతమునకు సంస్కృతము మూలమను ప్రాచీనులసిద్ధాంత మిచట ననుసరింపఁబడినది

తే. గీ. ప్రాకృతాదులు చెడి తజ్జ పదములగుచుఁ,
బలు తెనుంగులఁ దనలోనఁ గలిపియుండు
కత, నీయాంధ్రభాషయుఁ గలిమతంబు
నందుఁ బ్రాకృతభేదంబె యనఁగనొప్పు.

(అప్పకవీయము, ఆశ్వా 1 పద్య 75)

ఈరీతిని దెనుఁగునకు సంస్కృతమే మూలమై తదుత్తరభాషాధారకమైయున్నను, సంస్కృతభాష యొకకాలమునఁగాని భాషయనియు, వ్యర్థముకాని భాషయనియుఁ, గర్ణకఠోరమగు భాషయనియు, మృతభాషయనియు, భావశూన్యమగు భాషయనియు నిక్కాలమున బయలువెడలిన కొందఱు విమర్శకాగ్రగణ్యులు సభలలోఁగూడ వాకొనుట కడుంగడు శోచనీయము. ఈవిమర్శకులు సంస్కృతమెందులకును బనికిరాని దనిచెప్పి తెలుఁగునంగల మెఱుంగుల నగ్గడించుచుఁ దెలుఁగును మించినభాష జగతిని లేదని సిద్ధాంతీకరించుట వీరికిఁ గల గీర్వాణవాణీవాసనాలేశశూన్యత్వమును బ్రకటించుచున్నది. సంస్కృతమునే పలుతెఱుఁగుల నాధారముచేసికొని యుద్భవించి దానిలోని యలంకారములను దాఁదెచ్చిపెట్టుకొని గుణములను మ్రుచ్చిలి శాస్త్రవిషయములకుఁ బ్రతులను దింపి బయలువెడలిన తెలుఁగును బట్టి మూలమగు, పూతమగు, దేవభాషను ధిక్కరించుట-గర్హించుట, మాతృగర్భమునం జనించి, మాతృరక్తమాంసములను బీల్చి పిప్పిచేసి జీవికఁ గల్గించుకొని యాతల్లి కుత్తుకనే తఱుఁగుటకంటె నీచమైనది కాకపోదని నాతలంపు.

ఆంధ్రభాష సులలితపదబంధ బంధురమనియు, దీర్ఘసమాసరహితమైనదనియు, వారుతలంచి యందులకు "క. జిలిబిలిపలుకులఁ బలుముద్దులు గులికెడి తెనుఁగుబాసతో సరియగునే, తెలిసియుఁ దెలియక వీనుల నలయించెను వెట్టిమొట్టి యరవఱ బాసల్—తెలుఁగెఱుఁగని సంస్కృతంబు తెన్నే మెఱుఁగున్?" అను ప్రమాణముల నీయవచ్చును. కాని యాంధ్రభాష మధురభాషకాదని కాని, దేశభాషలలోఁ దీసిపోవునదియని కాని మాయాశయము కాదు. తెలుఁగునకు మూలమగు సంస్కృతముకంటె దెలుఁగు యొక్క యాధిక్యమేమియు లేదనియు, నదిసంస్కృతమును మించుట యసంభవమనియునే నాయభిప్రాయము.

సంస్కృతభాషను గీర్వాణులు (అనఁగా దేవతలు) వ్యవహరించుటచే దానికి గీర్వాణభాషయనియు, దేవభాషయనియుఁ బేర్లుకలిగినవనియు నది

మే యాదిభాషయనియు, మనప్రాచీనులందఱును జెప్పియున్నారు. ఇదియంతయు నిజము కాకపోవచ్చునుగాని యాదిభాషయని యిప్పటివారుకూడ నంగీకరించుచున్నారు. సంస్కృతభాష దేవభాష కాకపోయినను, నంతటి పవిత్రమైనదనియుఁ బ్రఖ్యాతమైనదనియు నెవ్వరైనఁ దెలియకపోరు. గీర్వాణభాషకుఁ గల్గిన యీగౌరవమిప్పటిది కాదు. సంస్కృతమును నిరసించుచుఁ బుట్టినయీ వాదము లీయిరువదవశతాబ్దపు మూఁడవదశయం దుద్భవించినవి కాని యంతకుఁ బూర్వము సంస్కృతమే మాననీయమని ప్రఖ్యాతిఁ బడసియున్నది.

సంస్కృతమునకుఁ గల్గిన యీగౌరవ మొక్క భారతీయుల వలననే గల్గినది కాదు; ఒక్క భారతవర్షమునందే గాదు. అనేకులు పాశ్చాత్యవిద్వత్ప్రకాండులు సంస్కృతము నెక్కువ గౌరవించి మన భారతీయులకంటె వేయిమడుంగు లెక్కువగ సంస్కృత గ్రంథసమూహమును జాగ్రత్తపెట్టుకొని విజ్ఞానమును సంపాదించుచున్నారు. వేయేల? మొన్న మొన్నటివరకుఁ బ్రబంధాములను రచించిన యాంధ్రకవీశ్వరులందఱును దొలుదొల్త కవిస్తుతిలో సంస్కృతము వారిని జేర్కొనిన పిదపఁ గవిత్రయము వారిని జేర్కొనుచున్నారు. దీనిబట్టి సంస్కృతమునఁ దెలుఁగువారికిఁ గల గౌరవాతిశయము విశదము కాఁగలదు.

తెలుఁగునకు సంస్కృతము పెట్టినదే భిక్ష. ఒక్క తెలుఁగునకే కాదు. భారతీయవాఙ్మయమంతటికి నని చెప్పవచ్చును. ఆంధ్రవాఙ్మయమునందే భాగమైనను సరే. సంస్కృతము నాదర్శముగ నుంచుకొనకుండ వ్రాయఁబడియుండలేదు. తెలుఁగునకు మూలపురుషులగు కవిత్రయమువారు చేసినది సంస్కృతభారతాంధ్రీకరణము. అది మొదలు మొన్న మొన్నటివరకుఁ గలవన్నియును సంస్కృతాంధ్రీకరణములే.

చూడుఁడు. తెలుఁగునఁ గల పురాణములు సంస్కృతమునకాంధ్రీకరణములు. పద్యకావ్యములు నట్టివే. ౧౯ వ శతాబ్దపు చరమావస్థవఱకును దెలుఁగున గద్యకావ్యములు † లేవనియే చెప్పవచ్చును. అలంకార గ్రంథములా

---

† 16 వ శతాబ్దమున సముఖము వేంకట కృష్ణప్పనాయకుఁడను దక్షిణాంధ్రకవి రచియించిన జైమినిభారతమను గద్యకావ్యము నాంధ్రసాహిత్య పరిషత్తువారు చాలదినములక్రిందటనే ముద్రించియున్నారు. ఇదియొక్కటియే మనకు లభించిన ప్రాచీన గద్యకావ్యము. బు. వేం. రమణయ్య*

ఇది సరికాదు, విజయరంగ చొక్కనాథుని మాఘ శ్రీరంగ మాహాత్మ్యములును, నంజరాజకృత హాలాస్య మహాత్మ్యమును, వీరరాజకృత భారతమును మొదలగునవి కలవు. Ed.

సంస్కృతమునకుఁ దర్జుమాలు. వ్యాకరణము లుసట్టివే. వేయేల సంస్కృతమునుం డి భాషాంతరీకరింపఁబడని యాంధ్రకావ్యము మన ప్రాచీన వాఙ్మయమున లేద నియే చెప్పవచ్చును. ౧౯ వ శతాబ్దపు చరమావస్థ నుండియు నాంగ్ల సాంప్ర దాయముల ననుసరించి గ్రంథరచనపద్ధతి మాఱినను సంస్కృతాంధ్రీకరణ ములు మాత్రము దినదినాభివృద్ధిని గాంచుచునే యున్నవి.

సంస్కృతముయొక్క ప్రాపుఁ గలిగించుకొననిచో నాంధ్రవాఙ్మయ మిం తటికంటె వేయుసుడుంగులు హీనదశయందుండవలసివచ్చును. భాషకు స్వతం త్రముగ నుండవలసిన ఛందోవ్యాకరణములు కూడఁ దెలుఁగునకు స్వతంత్ర ములైనవి లేక సంస్కృతసంబద్ధములైయే యున్నవి. ఆంధ్రభాషకి తవఱకు స మగ్రమగు వ్యాకరణమే లేదు. ఆంధ్రభాషకింతవఱకు వ్యాకరణము లేదనియే చె ప్పవచ్చును. సంస్కృతమునఁ గల యతిప్రాసములు తెలుఁగునం గూడ గ్రహిం పఁబడినవి. అట్లు తీసికొనివచ్చుటలోఁ దెలుఁగువారు వానికనుచితపు మార్పు లను గల్పించి, యర్థములను బాడుచేసి శోభనుం జెడఁగొట్టి లేపోని నియమ ములను దెచ్చిపెట్టుకొని మిక్కిలి కష్టపడిరి. ‡ ఈవ్రాంతలనుబట్టి యతి ప్రాస ములక్కఱ లేదని నామతమని సహృదయులు తలంపకుందురు గాక యనివేఁడు చున్నాను.

ప్రభుమిత్ర సమ్మితములగు వేదపురాణముల కంటెఁ గాంతాసమ్మిత మగు కావ్యరచనమునకుఁ గల కారణము రసముఁగూర్చియే కదా! ఆరసము మనకు శ్రవ్యములకంటె దృశ్యకావ్యములయందే కలుగునుగదా? రసమున కాలవాలమగు నాదృశ్యకావ్యములు ౧౯ వ శతాబ్దపు చివఱవఱకుఁ దెలుఁగు న రచింపఁబడకపోవుట నేమి యనవలసివచ్చును? దృశ్యపు ప్రపంచమునఁ బే రెన్నికకెక్కిన కాళిదాస మహాకవి శాకుంతలము ప్రపంచమునందుఁ గల య న్నిభాషలలోనికిని బరివర్తింపఁబడియుండఁ (చాల వత్సరములకు మున్నే) సం స్కృతమునే యాధారముగ జేసికొన్న యాంధ్రభాషయందా నాటకమీయిరు వదవశతాబ్దమువఱకు లేకుండుటకుఁ గల కతంబెద్ది? పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు మొదలగువారు శృంగారశాకుంతలాదులను బద్యకావ్యములలోనికి మార్పుచే

‡ ఈ విషయములం గూర్చియున్ముందు వ్యాసములఁ బ్రకటించెదను.

సిరికాని దృశ్యకావ్యములలోనికి మార్పుఁజాలకపోయిరి. కాన నాకాలమున దెలుఁగున దృశ్యకావ్యములే లేవనవచ్చును.

ఇన్ని విషయములం దసమగ్రమగు నాంధ్రవాఙ్మయము సంస్కృతవాఙ్మయముకంటె నుత్కృష్టమైనదనుట యెంతటి యుచితమో విచక్షణుల దృష్టికి గోచరముకాకపోదు.

ధ్వని ప్రధానములగు ఖండకావ్యము లాంధ్రమునఁ దీనవయుగమున నుద్భవించుచున్నవనియు, నాకవితాకళ నూతనజాతీయతను, వ్యక్తిత్వమును వెలువరించుచున్నదనియు, నందుచే నాంధ్రమున కొకవింతసొగసు సంస్కృతాది భాషాంతరముల కలవడఁజాలనిది కలుగుచున్నదనియుఁ, గొందఱు భావకవులు తలంపవచ్చును. కాని ఖండకావ్యము లాంధ్రమునకుఁ గ్రొత్తలు కాని సంస్కృతమునకుఁ గ్రొత్తవికావు. ధ్వనిలేని కావ్యము లధమకావ్యములని సంస్కృతాలంకార గ్రంథములన్నియుఁ జెప్పుచున్నవి. ధ్వనిగలకావ్యమే యుత్తమోత్తమము. పండితరాజాది ప్రాచీన కవిసార్వభౌములు రచించిన ఖండకావ్యము లెంతటి రసవత్తరములో, ఎంతటిధ్వని ప్రధానములో గీర్వాణసారస్వతమునందభిరుచిగలవారికిఁ దెలియకపోదు.

భాషాంతరీకరణములఁ గూర్చి కొంచెము ముచ్చటించెదను. ఒక భాషయందుఁ గలగ్రంథమును మఱియొక భాషలోనికిఁ బరివర్తించునపుడు మాతృకకంటెఁ బరివర్తనము రమణీయతరముగ నుండవలయుటయే యుత్తమము. కవియొక యాదర్శము నెదురుగ నుంచుకొను నపుడా మాతృకలోని బాగోగు లాతనికి గోచరించు చుండును. కాన నతఁడోగులను మార్చి బాగులను గల్పించి భాషాంతరీకరణమునకు వన్నెతెచ్చిపెట్ట వీలుకలుగును. మాతృకాకర్త కాదర్శమును లేకపోవుటచే బాగోగు లంతటివివరముగా నాతనికిఁ దెలియకపోవచ్చును. కాన భాషాంతరీకరణమున మాతృకకంటె విశేషములేమియు లేనపు డద్దానివలన నించుకంతయును బ్రయోజనములేదు. తక్కిన భాషాంతరీకరణముల మంచిచెడ్డలు నాకుఁ దెలియవుకాని సంస్కృతగ్రంథములకుఁ గల తెనుఁగింపులలో నించుమించుగా నన్నియును మాతృకకంటె రసవంతములుగను, సులభశైలికలవిగను లేవని నిశ్చయముగఁ జెప్పసాహసించుచున్నాను. తిక్కన సోమయాజి భారతభాగమును విడిచిపెట్టినచోఁ దక్కిన సంస్కృతాంధ్రీ

కరణములు మూలమంతటి రసవత్తరములుగను లేవని చెప్పవచ్చును. తిక్కన పలు తెలుఁగుల మెఱుఁగుఁ దీసికొనివచ్చి మూలమున యుక్తియుక్తముగ మార్పు చేయుట, అతనికొక యాదర్శముండుటవలననే గలిగినదికాని వేఱుకాదు. తక్కిన యాంధ్రీకర్తలట్లు మార్పులు చేయలేకపోవుట నాతనికంతటి ప్రఖ్యాతిఁ దెచ్చినది ఇట్లు నేను వ్రాయుట నాకుఁగల యాంధ్రభాషాభిమాన రాహిత్యమును గాని దురుద్దేశమునుగాని ప్రకటింపఁ జాలదని వచించుచున్నాను.

అనేకులగు నాంధ్రపండిత కవివర్యులు నన్నయ మొదలు నేటివఱకును సంస్కృతగ్రంథములను బలు తెలుఁగులఁ దెనిగించుచున్నారు. నిష్పక్షపాతబుద్ధితో నాలోచించినచో మాతృకకంటె భాషాంతరీకరణము బాగుగనున్నదని కాని, రసవిలసితమై యెక్కుడుశోభ నొనగూర్చుచున్నదనికాని యన వీలులేదని తెలియకపోదు. అట్లుంచ ఉభయభాషలయందును గొంత పరిజ్ఞానముకల వారేయొప్పలు. నేనుదాహరణముల నిచ్చుటకంటె వానిని విద్వద్వతంసులే చూచుకొనుట యొప్పని యుదాహరణము లీయమానితిని.

తెలుఁగు సంస్కృతముకంటెఁ దక్కువయైనచో "జిలిబిలిపలుకుల" అను నార్యోక్తి కుదురుట దుర్లభమని సందేహింపవీలుకలుగును. కాని యది దేశభాషావిషయకమైన దగుటచేత దేశభాషలలోఁ దెనుఁగే పలుముద్దులుగులికెడిభాసయగుటచే నేమియు భంగము కలుఁగబోదు. అదుచేతనే యాంధ్రసార్వభౌముఁడు నాంధ్రభోజుఁడు నగు శ్రీకృష్ణదేవరాయలు "తల్లి సంస్కృతభాష, దేశభాషలందుఁ దెలుఁగులెస్స" యని నుడివెను. తెలుఁగు సంస్కృతముకంటెఁ గూడ లెస్సయని యాతనికిఁ దోఁచినచో 'దేశభాషలందు' అని యనక "భాషలందుఁ దెలుఁగులెస్స" అనియే చెప్పియుండెడివాఁడు. ఇంకను "తెలుఁగుంబోలెడి రమ్యభాషకలదే? దేశీయభాషాళిలోన్" అను సూక్తియుఁబైసిద్ధాంతమునే దృఢీకరించుచున్నది. "దేశభాషలందుఁ దెలుఁగులెస్స" యని యనుట కందఱును దప్పక యంగీకరింపవలెను.

"తెలుఁగెఱుఁగని సంస్కృతంబు తెన్నెఱుఁగఁ" అను నీసూక్తి గీర్వాణము కంటె నాంధ్రమెక్కుడని తెలియఁ జేయఁజాలదు. తెలుఁగుభాసనెఱుఁగని గీర్వాణమునకు దారిలేదని దీనియభిప్రాయము కాదు. తెలుఁగు సంస్కృతముకంటె వేలకొలఁది సంవత్సరముల ప్రాచీనమై యున్నది. దేశభాషనెఱుఁగని మాతృభాషకు గౌరవహానికాని, మతహానియుఁగాని కలుగఁ

జాలదు. ఒకవేళ గీర్వాణవాణికి స్థైర్యముకొఱకు దేశభాషాసాహాయ్య మపేక్షణీయమే యైనచొ దెలుఁగుకంటె ననేకములగు దేశభాషలు ప్రాచీనములైనవి సంస్కృతమునకు సాహాయ్యమున నుపకరింపవచ్చును.

మీఁది యాక్షేపములబట్టి సంస్కృతము నెఱుఁగకుండఁ దెలుఁగునఁ గవనాదివిషయమునఁ గృషిచేయుట దుస్తరము. ఒక్కసంస్కృతము నెఱిఁగినమాత్రముననందే గ్రంథములు వ్రాసి వన్నెకెక్కిన మహాకవు లసంఖ్యేయులు. కావున సంస్కృత మెఱుఁగని తెలుఁగుతెన్నెమెఱుఁగున్" అని విపరీతముగఁ జెప్పుట యొప్పగును.

ఇఁకఁ బైసూక్తికిఁ గల యథార్థార్థ మేమో గుర్తింపవలెను. ఆంధ్రకవిత్వము చెప్పినపుడు కేవల తత్సమ (సంస్కృత) పదములను నేర్చినంతమాత్రమున లాభము లేదనియు, నచ్చతెలుఁగునుగూడ బాగుగా నేర్చియుండవలెననియు, నచ్చతెలుఁగు పదములు లేని సంస్కృతపదము లాంధ్రమున రక్తినొసఁగూర్పఁ జాలవనియు, మీఁది 'తెలుఁగెఱుఁగని సంస్కృతంబు తెన్నెమెఱుఁగున్" అనుసూక్తికి యథార్థమగునర్థము. కాన తెలుఁగుభాష నెఱుఁగని గీర్వాణము పయోగింపనేఱదనిమాత్రము సహృదయులు తలంపకుందురుగాక !

సంస్కృతభాష Dead Language అని పాశ్చాత్యనాగరకతావాసనగల కొందఱు మహానుభావుల యభిప్రాయము. మృతభాష యనఁగా నొకపుడు వ్యవహారమునఁ గూడ నుండి యిపుడు గ్రంథస్థమై మాత్రమే యుండి వ్యవహారమున నశించుభాష. సంస్కృతభాష యొకపుడు వ్యవహారముననుండి చెడిదని వారియాశయమై యుండవచ్చును. కాని సంస్కృతభాష యెల్లపుడును గ్రాంథిక (గ్రంథస్థ) భాషయే కాని వ్యవహారమున నెప్పుడునుండలేదు. సంస్కృత మొకపుడును వ్యవహారమున నుండకపోవుటచేతనే యీభాషకు సమగ్రమగువ్యాకరణము వ్రాయవీలుకలిగినది. వ్యవహారము దేశకాలాది భేదములచే మాఱుచుండు స్వభావముకలదియగుటచే వ్యవహారమునఁ గూడనున్న భాషకు నియమబద్ధముగఁ జేయ నవకాశము లేదు. కావున నేవ్యవహారమునందును, గ్రంథములందునుగూడ నున్న భాషలకు సమగ్రమగు వ్యాకరణము లేకుండఁ బోయినది.

వ్యవహారమున నున్న ప్రతిభాషకును లిపియవసరము. భాషకులిపి లేనిచో వ్యవహారము జరుగుట దుర్ఘటము. సంస్కృతము వ్యవహారమున లేకపోవుటచేతనే తక్కిన భాషలకువలె దానికి లిపి లేదు. సంస్కృతగ్రంథములన్ని

యు నన్యలిపులలోనే వ్రాయఁబడి ముద్రింపఁబడుచున్నవి. మఱియేవాఙ్మయమునిట్లన్య లిపులలో వ్రాయఁబడుచుండలేదు. ఒకపుడు సంస్కృతము వ్యవహారమున జీవించియుండినచో నిపుడు వ్యవహారము లేనందున నాశము కలిగినదని చెప్ప వీలగును. కాని యొకపుడును వ్యవహారమున నది లేదే? మొదటినుండియును వ్యవహారమునందే లేనిభాషకుఁ జావుపుట్టువు లేమి? కాన సంస్కృతమెన్నటికిని మృతభాష కాఁజాలదని యెఱుంగవలయును. అది యెల్లప్పుడును జీవించియుండు భాష. ఇప్పుడు వ్యవహారమున నున్న భాష లెప్పటికైనను వ్యవహారమునఁ జచ్చిన నెన్నిశతాబ్దముల కైనను జావ వీలుకలుగును. కాని సంస్కృతమునకు మాత్రమా చావుకలుగనేఱదు. అనేక వేల సంవత్సరములనుండియు వ్యవహారములో లేని భాష, గ్రంథస్థమై యనేక భాషలఁ గనిపెంచిన భాష, యింతటి దనుక నెట్టిమార్పును బొందక తొల్లిటిరీతినే యున్న భాష, గీర్వాణభాష మున్ముందు నామమాత్రావశిష్టమై యుండుననుట కాధారము లేమియు లేవు.

ఒకసభలో నొకభాషావిశారదులు సంస్కృతాంధ్రములకుఁ గలభేదములను ముచ్చటించుచు సంస్కృతము దీర్ఘసమాసభూయిష్ఠమై కర్ణకఠోరముగ నుండుననియు, నాంధ్ర మట్లు కాక సమాసరహితమై వినసొంపుగొల్పుననియు నుపన్యసించిరి. వారద్దాని కుదాహరణముగ దీర్ఘసమాసభూయిష్ఠ మగునొక సంస్కృతశ్లోకమును సమాసరహితమగు నొక తెలుఁగుపద్యమును జదివిరి. తెలుఁగుపద్యమునఁగల పదము లన్నింట మూఁడువంతుల ముప్పాతిక సంస్కృతపదము లేకలవు. అందుచే నచ్చతెనుఁగుల యల్లిక సమాసరహితమనియు, సంస్కృతరచన దీర్ఘసమాసయుత మనియుఁ గర్ణకఠోరమనియు వారియభిప్రాయము కాదనియు, సంస్కృతశ్లోకరచనము దీర్ఘసమాసయుత మనియుఁ, ద్రివిధమగు నాంధ్రముయొక్క రచనము సమాసరహితమనియు వారి తలంపని నేనిశ్చయించితిని. వారియభిప్రాయమునే గలిగినచో వారియభిప్రాయము యుక్తమైనది కానేఱదని మాత్రము విన్నవించుచున్నాను. పద్యముయొక్క మూఁడుపాదము లొకే సమాసమునుగలిగి, మధ్యనెయ్యెడను నిలుప వీలులేక చివఱ నొక తెలుఁగు ప్రత్యయముకల సంస్కృత సమాసములు తెలుఁగునందే కలవు. లెక్కకుమిక్కిలిగాఁ గలవు సంస్కృతశ్లోకము లందెంతటి దీర్ఘసమాసములున్నను రెండుపాదములకంటె మించియుండవు. ఆసమాసములను మొదటి

రెండుపాదములకుఁ గాని, చివఱి రెండుపాదములకుఁ గానియుండును. కాని రెండవపాదము, మూఁడవపాదము కలిసి సమస్తములై యుండుట సంస్కృతము నం దెచ్చటను లేదు. తెలుఁగున నిట్టి సమాసములు చాలచోట్లఁ గలవు.

భాషాంతరీకరణములఁ బరిశీలింపుఁడు. మూలమగు సంస్కృతమున సమాసరహితమై సుబోధకముగనున్నను, దానియందలిభావముల నిముడునట్లు దీర్ఘసమాసములఁ బెట్టుకొని సులభముగ నర్థమగునట్లు రచింపక మూలము కంటె భాషాంతరీకరణమే యర్థము చేసికొనుట కష్టతరముగనుండుట సర్వజనవిదితమైయున్నది. "తపనీయదండైక ధవళాతపత్త్రితోద్దండ తేజఃకీర్తిమండలుండు, నిర్మలనిజకథానిమిమకల్లోలినీఝాళితాఖిల జగత్త్రితయుండు.............." (శృంగారనైషధము) అను నీభాషాంతరీకరణము మూలముకంటె దీర్ఘసమాసములు కలదియో కాదో తెలియనగును. భాషాంతరీకరణములకంటె మాతృకలే రసవత్తరములుగ నుండునని యిదివఱకు నిరూపించితిని.

మఱియొక మహామహులు కొన్నిసభలలోఁ దెలుఁగునందుఁ దత్సమముగు సంస్కృతపదగుంభన యుండుటయుఁ బాగులేదనియు, నంతయు నచ్చతెనుఁగు కూర్పేయుండవలయు ననియు, నదియే ముద్దులొల్కుననియు, సంస్కృతము రసహీనమైనదనియుఁ జెప్పుచుండిరి. వారొసంగిన యుదాహరణమును వ్రాసికొంచెము విమర్శింతము. వారు "సహసానఖాంకచస్తన దత్తపరిరంభ మామూల పరిచుంబితాధరోష్ఠ" మను మనుచరిత్రమునందలి పద్యభాగము నుదాహరించుచు నిట్టి రచనము మిక్కిలి కష్టతరముగ నున్నదనిరి. వారు చదువునపుడుకూడ నొత్తక్షరములను, తక్కుంగల పదములను నొక్కినొక్కి పలికి తమనైపుణ్యమును జాలవఱకు వినియోగించి లేనికష్టతంగూడ దానియందుఁ గల్పించిరి. ఇవి కొంతకఠిన సమాసములే కావచ్చును. కాని దీనింబట్టిసంస్కృతమంతయు నిటులనేయున్నదని పలుకుట యుచితమా? అచ్చతెనుఁగైనంత మాత్రమున సమాసరహితమై సులలితమై యుండఁగలదా? తద్భవాదికమగు నాంధ్రమున నొకవిశేష నామవాచకమును దెల్పునెడ క్లిష్టత్వదోషము సామాన్యముగ నుండితీరును. చూడుఁడు. కమలాసనః=తెలిదమ్మిగద్దియఁగొలువుండురాయఁడు; హిరణ్యగర్భః=పసిఁడిపొట్టగారుబొక్కసముచేసినమేటి. ఇట్టియెడ గుణముమాటయటుండ దోషముంగ్రలుచున్నదే. వారు "సహసా........" అనుదానికి సరియగు నచ్చతెలుఁగు తర్జుమాచేసిరి. అది బాగుగనేయున్నది.

కాని యచ్చతెనుఁ గంతయు నట్లుండుట దుర్ఘటము బ్రహ్మాండభాండ మనుట కుఁ బలుకు వెలందియగని గుర్తుగమియనుట యెంతటివిరసముగ నున్నదో చదువరు లూహింపలేపోరు. ఈశృంగారఘట్టమున "సహసా..........."అను దీర్ఘసమాసఘటనము కేవల విరసమనియు, రసాపకర్షకమనియుఁ దలఁపరాదు. శృంగారరసవిషయమునఁగూడ దీర్ఘసమాసములుండవచ్చుననునంశము సర్వాలంకారికాంగీకృతమే. సమాసములకును శృంగారమునకును బాధ్యబాధక భావము లేదు. ఇచటరథసము వర్ణింపఁబడుటచే సమాసము యుక్తమే యగును. సహసా యను పద మావేగ సూచకము కాన సమాసమిచ్చోడ రాణించును మాఘుఁడుకూడ

హృదయమరిసధోదయాదుదూఢ
ద్రఢిమ దధాతు పునః పురందరస్య
ఘనపులకపులోమజాకుచాగ్ర
ద్రుతపరిరంభ నిపీడనక్షమత్వమ్॥

అని శిశుపాలవధమున శృంగారము నావేగసహితమును- గౌరి సమాసముతోఁ జెప్పియున్నాఁడు. కావున సంస్కృత సమాసము రసవత్తనియే నా తలంపు.

ఇట్లు నాశక్తికొలంది సంస్కృతభాష తెలుఁగుభాషను దీసివోఁజాలదని యుఁ, దెలుఁగుకంటె నుత్కృష్టమైనదనియు, నిరూపించితిని. కావున భాషాభిమానులెల్లరును యథార్థమును గుర్తెఱిగి సంస్కృతభాషను నిరసింపకుందురుగాక! ఆంధ్రభాష పనికిమాలినదని నాతలంపుకాదు. దేశభాషలలోఁ దెనుఁగునుమించిన భాష లేదనవచ్చును రచనము ముద్దులమూఁట గట్టుచుండును. అక్షరముల నన్నింటిని బలుకుటకు వీలుగల దేశభాష తెలుఁ గొక్కటియే. లిపి ముత్యాలకోవ. భావము గంభీరము. కావుననే ఆంధ్రేతర రాష్ట్రములందుఁ గూడ నాంధ్రోద్యమము ప్రబలి మిక్కిలి రాణించుచుఁ, బత్రికలను నెలకొల్పుచు భాషాసేవఁజేయుచు నాంధ్రవ్యక్తిత్వమును గాపాడుచున్నది. ఆంధ్రసోదరులందఱును గలకాలమునుండి వన్నెకెక్కి భాషాప్రపంచమున మేలుచేయివడసిన యాంధ్రవాణిని తదుత్కృష్టతకు మూలమగు గీర్వాణవాణిని సేవించుచు విజ్ఞానమును సంపాదింతురుగాక !

# తెనుఁగుకవిత.

జాస్తి శ్రీరాములుచౌదరిగారు.
ఉభయభాషాప్రవీణ

మ. విలసద్భావరసాద్యలంకృతులచే విప్పాటిగీర్వాణభా
షలకబ్బంబుల కెన్నిమంచితనముల్ సంధిల్లు నాచందమై
వళియుం బ్రాసము నంత కగ్గలములై వర్తిల్లు సత్కావ్యముం
దెలుఁగంచుం జెవిఁబెట్టవేమియుఁ బరం దేఁగ్గు నే మందిలన్.

తే. గీ. తెలుఁగు దేశభాష తెలియుఁబో మ్మనఁబోక
తెలియవలయు మించు తేటపడఁగఁ
దోషపుగాక పసిఁడిఁ దొడిఁగిన నొప్పునే
కనక మింట నెంత కలిగెనేని.

విన్నకోట పెద్దయకవి
కావ్యాలంకారచూడామణి.

ఆద్యంతములు తెలియరానిది ప్రకృతి. కాలమును నట్టిదయే. కాలము ముందా! ప్రకృతిముందా! యను ప్రశ్నకుఁగూడ సమాధానము లే దనుకొని యెద. కాలమున కాది ప్రకృతి ప్రకృతి కాది కాలము. కాలప్రకృతులరెంటికిఁ జెప్పనలవికాని విశేషసంబంధ మున్నది. కాలములేని ప్రకృతియుండదు. ప్రకృతిలేని కాల ముండదు. కాలచక్రము తిరుగకున్న ప్రకృతిరథముసాగదు. ప్రకృతి రథముపైనలేకున్న గాలచక్రము నిలువడదు. కాఁగాఁ గాలప్రకృతులు రెండు నాదిరహితములు నంతరహితము లనిగదా తేలినది. ఆద్యంతములు తెలియరాని యట్టి కాలప్రకృతులలో నేవేళ భాషలుపుట్టెనో? యందుల వాఙ్మయము బయలుదేఱిన ఘడియయేదో! నిశ్చయించిచెప్పుట కీపాటి యాపాటివారికి నలవిగాని పని యన్నపుడు నాబోటివా రందులకై పనిఁబూని యత్నించుట కూడనిపనియని యనక తీరదు. ఈ నా వ్యాసము తెనుఁగుకవితయను విషయమున నాధారపడియుండుటచే మున్ముందుగ నీతెనుఁగుకవిత యన నేమియో విచారింపఁబడును. తెనుఁగుభాషలో వ్రాయఁబడిన కవిత్వమునకుఁ దెనుఁగుకవిత్వ మనియుఁ దెనుఁగుకవితయనియు మన మందుము. తెనుఁగుదే

శప్రజలు వ్యవహరించుకొను భాష తెనుఁగుభాష. తెనుఁగుదేశ మననేమియో? నేదియో? మనమిప్పు డాలోచింపవలయును. తెనుఁగుదేశమునకు సరిహద్దుల నప్పకవి యీక్రిందివిధమునఁ జెప్పియున్నాఁడు.

కం. శ్రీక్షితిధరకాళేశ ద్రా
క్షారామంబు లనఁగ దనరారెడు నీ
త్రిక్షేత్రంబులలింగము లీ
క్షింపఁ ద్రిలింగసంజ్ఞ నెన్నిక కెక్కున్.

తే. గీ. తత్త్రిలింగనివాసమై తనరు కతన
నాంధ్రదేశంబుఁ దాఁ ద్రిలింగాఖ్యమయ్యె
దెలుఁగగుచుఁ దద్భవము దానివలనఁబొడమె
వెనుకఁ గొందఱు దానినే తెనుఁగు నండ్రు

అని త్రిలింగశబ్దమునుండి తెలుఁగు అనునది పుట్టెననియు, తెలుఁగు రూపాంతరమే తెనుఁ గనియు, త్రిలింగము లేవియనఁగా       లము, ద్రాక్షారామము, కాళహస్తి యనియు వీని మధ్యదేశము తెనుఁగుదేశ మనియు నప్పకవి చెప్పినాఁడు. ద్రాక్షారామము గోదావరీమండలమున నున్నది. కాళహస్తి చిత్తూరుమండలమున నున్నది. ఆప్రాంతముననే పడమటగా      శైల మున్నది. ఈమూఁడుచోట్లకు మధ్యనున్న భూమియే తెనుఁగుదేశ మని యప్పకవికాలమునకుఁ బ్రసిద్ధియుండినటుల మనకుఁ దెల్లమగుచున్నది. 1350 ప్రాంతమువాఁడగు విన్నకోట పెద్దయకవియు నీవిధముననే తెనుఁగుదేశలక్షణముచు జెప్పియున్నాఁడు కాని మనకాలమునకుఁ దెనుఁగుదేశ మేదియని పరికింప నప్పకవి చెప్పినలక్షణమును పెద్దయకవి చెప్పిన లక్షణముచు జాలవు. వీరిపక్షమున విశాఖపట్టణముమండలివారిని తెనుఁగువారు కా దనవలసివచ్చును. గంజాంమండలములోఁగూడఁ మనతెనుఁగువారు నివసించియున్నారు. కనుక గంజాంమండలము మొదలుకొని చిత్తూరు నెల్లూరు మండలములప్రాంతముల వఱకుఁ గల భూమిని తెనుఁగుదేశ మనియు, నిందలిజనులు వ్యవహరించుకొను భాష తెనుఁగుభాషయనియు మనము లక్షణమును గ్రొత్తగా గల్పింపవలసియున్నది. త్రిలింగశబ్దమునుండిగాక త్రినగశబ్దమునుండి తెనుఁ గనునదివచ్చినదని కొంద ఱన్నారు. తెనుఁగుభాషస్వరూపమును గొంతవఱకుఁ గాంచితిమి. ఇఁకను గవిత్వమన నేమియో తత్త్వ మెఱుంగవలయును.

కవియొక్క ధర్మము కవిత్వము లేక కవిత. అనఁగాఁ గవి చేయవలసిన పని. కవియన నెవఁడు? అప్పకవి చెప్పినలక్షణమును విలకింపుఁడు.

కం. ధరణీసురుఁడు ప్రశాంతుఁడు
గురుభక్తుఁడు శుచియుఁ గల్పకుఁడు పూర్వ కవీ
శ్వర శాస్త్ర యోగదక్షుఁడు
కరుణామతి యెవ్వఁ డతఁడు గవి యనఁబరగున్.

కవులలక్షణములలోఁ గవి బ్రాహ్మణుఁడై యుండవలయునను నియమ మప్పకవి క్రొత్తగా సృష్టించినటులఁ గనఁబడుచున్నది. బ్రాహ్మణులుదప్ప నితరు లెవ్వరును గవులుగా రను నభిప్రాయముగలవాఁ డగుటచేతనే అప్పకవి కృష్ణ రాయ రచితమగు నాముక్తమాల్యదను పెద్దన రచితమని జెప్పుటకు సాహసము చేసెను. ఇది యెంతయు నక్రమము. కనుక నప్పకవి చెప్పినదే లక్షణముగాదు. మహమ్మదీయుఁడైననుసరియు మహీసురుఁడైననుసరియు కవితాశక్తిగలవా రందఱు కవులే. కావున నేఁటి ఉమ్రా అలీషా మొదలగు మహమ్మదీయసోదరులు నయితము కవు లనంబరగుచుండిరి. అంతా కవులముగామా, అంతంతగ కంద పద్యమల్లగలేమా? యని వెను కెవరో యన్నట్లట్టి యతులకు జతలు గూర్చి పద్యము లల్లగలవా రందఱు కవులు గారు. సంస్కృతమున నాలుగు నిఘంటువులు తెనుఁగున నాలుగునిఘంటువులు దగ్గఱఁబెట్టుకొని గొప్పకయి యెవ రికిఁదెలియని పదిమూరుమూలపదములను గాగితములపై నెక్కించినవారును గవులు గారు కవు లనఁగా సమస్తశాస్త్రముల నెఱిఁగి యుండవలయును. విద్య లన్నిటియందును పారంగతుఁడై యుండవలయును. అన్నికళలను గుర్తెఱిఁగి యుండవలయును. ప్రకృతితత్త్వమును బాగుగా గనిపెట్టవలయును. అన్నిటను ననుభవశాలియయి యుండవలయును. తనమనోభావములను బాఠకుల మనో ఫలకములందు వ్రాసి దిద్దఁగల శక్తియుండవలయును. ముఖ్యముగా కవులైనవారు భావశాశక్తిని జూపించుట నేర్చుకొనవలె. ఉత్తమకవులలక్షణము లివి. ఇందుల కుదాహరణీయులు తిక్కన, పోతన, పెద్దన, శ్రీనాథుఁడు మొదలగు కవి మహాత్ములు. కవులలో మొదట లెక్కింపఁదగినవారు. ఇట్టివారు చేసిన పని యేదియో యయ్యది యుత్తమకవితయని లక్ష్యముని యెఱుఁగవలయును.

## తెనుఁగుకవితపుట్టుక.

మొట్టమొదటఁ దెనుఁగుభాష లోకమున వ్యాపించినపిమ్మట నందుఁ గవిత్వము ముందుగా పాటలరూపమునఁ బ్రారంభింపఁబడియుండవచ్చునని నాయూహ. అప్పటికి లిపిగూడఁ బుట్టియుండకపోవచ్చును. అప్పటి మనవారు కులాసాగా నున్న వేళలలో కూనిరాగములతో నవియో తమకువచ్చిన మాటలను నాలుగైదు కలిపి లయకుదురునట్లుగా పాడినట్లయిన నియ్యదియు నొకచిన్న పాటగా మారును. అప్పటికి యతిప్రాసముల నిర్బంధము లేదు. అయినను భాషయందు నొకశబ్దమువంటి వఱియొకశబ్దము వెంటనే బలుకుట యుచ్చారణ సౌలభ్యము, వినుట కింపునయియుండునుగదా ? కనుక నాకాలపువారికిఁ దలవని పనిగా కూనిరాగములతో పాటు తమపాటలయందు యత్యక్షరములు (మొదటఁ బ్రారంభించిన యక్షరములే మరల) పడియుండవచ్చును. అట్టి చిన్న చిన్నమాటలను మనవారిండ్లకడఁ గూరుచుండినవేళలలో నొకరి కొకరు చెప్పుకొనసాగిరి. అవియే నానాఁటికిఁ బెరిగి పెద్దలాయెను. తమపాట లట్లు పెద్దవయినను నాకాలమున కింకను యాంధ్రలిపి యుండనందున వారేమును వానిని వ్రాసికొనలేకపోయిరి. ఇప్పుడు మన మూఁకుడుకథల (పిట్టకథలు) నొకమారు విని జ్ఞాపక ముంచుకొనువిధముననే యాకాలపువారు పెద్దపాటలను నయితము మరచిపోవక జ్ఞాపక ముంచుకొనెడువారు. ఇందులకుఁ గొంతనిదర్శనము గననగును. మనయిండ్లలో స్త్రీలయందుఁ జదువురాని ముదుసలులు కొందఱు కుచ్చెలకథ, లంకాయాగము మొదలగు పెద్దపాటలనైనను ప్రారంభమునుండి చివరవఱకు నప్పజెప్పఁగల్గుటను జూచుచున్నాముగదా ! ఇంతయేల! జంగముపాటలు, వీరగీతములు, మొదలగువానిని దాసరులును పిచ్చుగుంటలును, పొలమునందు వరిమొక్కలనాటునపుడు మాలవనిత లూడ్పుపాటలు మొదలగువాని నారంభమునుండియు నంతమువఱకు నప్పఁజెప్పఁగలుగుటలేదా! వారి కక్షరములుసయితము రావుగదా! అట్టివారిని ప్రతిసంవత్సరమునను మనము చూచుచునే యున్నారము. కనుక లిపిపుట్టకపూర్వమే కవిత్వము లాలిపాట, పెండ్లిపాట మొదలగు పాటలరూపమునఁ బ్రారంభమయి యుండునని తోఁచెడిని. లిపివచ్చినపిమ్మట నిట్టిపాటలు గ్రంథస్థములయి సుస్థిరములగును. లాలిపాట, పెండ్లిపాట మొదలగువాని నప్పకవి ఛందస్సులోఁ గూడఁ జేర్చియున్నాఁడు. కొంతకాలమునకుఁ బాటలరూపముగ నున్న కవి

త్త్వము మారి మధ్యాక్కరలు మొదలైన యక్కరలలోనికిని సీసపద్యములు మొదలైన జాతులలోనికిని మారినది. అనాఁటికే యతిప్రాసముల నిర్బంధము కవిత్త్వమునకుఁ గల్గియుండవచ్చును. ఆతరువాతి కాలమునఁ గవిత్త్వము వృత్త ములలోనికి మారినది. కనుకనే వృత్తములను జేయుటకంటె జాతులను జే యుట సులువు. జాతులను జేయుటకంటెఁ బాటలను జేయుట మఱింతసులువు. నన్నయకాలమున కాంధ్రవాఙ్మయము వెల్లివిరిసినది పదిమందినోళ్ళఁ బడ్డది. నీచెల్లిని నేను నోకదానినుంటినని యాంధ్రభారతి సంస్కృతభారతి ముందట తప్పటడుగులు వైచుట సాగించిన దాకాలముననే. ఇంతియకాని నన్నయభట్టు నకుఁబూర్వ మాంధ్రవాఙ్మయము లేదనుమాట విమర్శనము లేనిది. భట్టాచా ర్యులకుఁ బూర్వమందు వ్రాయఁబడిన యుద్ధమల్లుని శాసన మొండు బెజవాడ యందుఁ బరిశోధకులు గాంచిరి. అందు మధ్యాక్కరలుగలవు. మఱియు నన్న యకుఁ బూర్వము నన్నెచోడుని కుమారసంభవము, బద్దెభూపాలుని నీతిసా రముక్తావళియుఁ గలవని విమర్శకులు చెప్పుచున్నారు. కనుక నన్నయకంటెఁ బూర్వము చాలకాలమునుండి తెనుఁగు కవిత్వ మారంభమైయుండెననుట నిర్వివాదాంశము. వాగనుశాసనుఁ డను బిరుదము నన్నయభట్టున కాంధ్రవా ఙ్మయమునకు మొట్టమొదటివాఁడగుటచేత రాలేదు. ఆంధ్రశబ్దచింతామణియ ను దెనుఁగు వ్యాకరణము చేయుట కారణమున నాతనికాబిరుదము వచ్చియుం డవచ్చును.

## భారత కవిత్త్వము.

"తిన్నా గారెలే తినాలి, విన్నా భారతమే వినాలి" అని మనతాత ముత్తాతలు చెప్పుకొనుచుండఁగా మన మెల్లరము వినియే యుందుము. నిజ ముగా గారెవంటిదే భారతము. భారతకవిత్త్వమువంటి కవిత్వ మిప్పటికిని బుట్టియుండలే దనుట సత్యదూరము కాదు. భావకవిత్త్వము, భావకవిత్త్వము అని ఘోషించు పరమాధునిక కవులలోఁ గూడ నెవ్వరును భారతము కవిత్వ మువంటి భావకవిత్త్వమును జెప్పియుండలేదు. విశేషించి నన్నయ, ఎఱ్ఱాప్రగడ లకవిత్త్వముకన్న తిక్కనకవిగారి కవిత్త్వము మిగుల భావభూయిష్ఠమైనది నిగూఢము. భావకవిత్త్వమనునది యిపుడు పుట్టెనని మనము తలంచుచున్నార ము. కాని యయ్యది మొదట తిక్కనగారికంట కలముక్రిందనే పుట్టిపెరిగినది. తిక్కన కవిమత్రుఁడేగదు. రాజ్యాంగములన్నియెఱిఁగినధీశాలి, మంత్రిపుం

గవుఁడు. లోకానుభవముగల సుప్రసిద్ధుఁడు. పాఠకుల మనోఫలకములందు దన మనోభావములను వ్రాసి ప్రకటించువాఁడు. ఆంధ్రకవితావధూటిని బెట్టి పోషించినతండ్రి. ఈతనికవిత్వమందు సంస్కృతభాషకంటెఁ దెనుఁగు భాష యెక్కువగా వాడఁబడినది. తెనుఁగులోనైనను గేవలము కఠినభాషగాక యాకాలపు జను లాడుకొను వ్యవహారభాషయే ప్రయోగింపఁబడినది. మధ్యమధ్య సందర్భానుసారముగ నందరెఱిఁగియుండిన చిన్నచిన్న లోకోక్తులు చొప్పఁబడి యున్నవి. సంస్కృతాలంకారికులు చెప్పిన కావ్యములందుఁ జేయఁదగిన వర్ణనముల నీతఁడు పాటించినట్లగపడదు. వానిఁ బాటించినట్లయిన నిజముగా తిక్కనకవి వంటివాని కవిత్వముగూడఁ గథాశుచిత్వము చెడిపోయి యింత ప్రశంసాపాత్రము కాకపోవునేమో ? యని నాసందేహము. తిక్కనయొకఁడే యైనను దనకవిత్వమందన్ని పాత్రములను ధరించివివిధవిధములుగాఁ గన్పడును. ఇందులకాతని యుద్యోగపర్వమంతయు సాక్షియే. ఇఁక భారతమునందలి యుద్ధపంచకము నేసందర్భమున దీసి చదివినను వీరరసావేశముచేఁ బరవశులమగుదుము. మనచేతిలోని భారతము, మనమనస్సులను, గూడమఱచిపోవుదుము కన్నులయెదుట భారతవీరులు యుద్ధము చేయుచున్నట్లే గాంచెదము. వీరరసమునఁబడి మునుకలువైతుము. రక్తప్రవాహమునఁదడియుదుముః మేనుజలదరించును. ఒక్కమారుగా నావేశపరవశుల మగుదుము. తరువాత నేమిజరుగునో? యనియుబుకులాట. వీరెట్లుపరాక్రమింతురో? యనియబ్బురము. ఈభావనాశక్తినిఁ గన్నులఁగట్టి భారతవీరులచే యుద్ధముచేయించి చూపునది యెవరు ? తిక్కన మహాకవి. ఈకవికే యిట్టి సంపూర్ణభావనాశక్తిగలదు. కనుకనే తిక్కన మహాకవులకు మొదటివాఁడని మొదటనేఁ బేర్కొనియుంటిని. తిక్కనకవిత్వమందున్న భావగుంభనము నన్నయకవిత్వమందు లేకున్నను నాంధ్రవాఙ్మయమున కాదిభూతుఁడుగ కాన్పించుటను నన్నయ, తిక్కనవలెనే పూజ్యుఁడును జెప్పుకోఁదగినవాఁడును. వీరిద్దఱి మహాకవులమధ్యఁ జేరియుంటచే "తన్మధ్యేపతితంతద్గ్రహణేన గృహ్యతే" యనువైయాకరుణులన్యాయమున నెఱ్ఱాప్రెగ్గడయును గౌరవనీయుఁడే యగును. ఎట్లయినను నీముగ్గురి మహాకవుల కవిత్వము ఆంధ్రవాఙ్మయమునకు మొదటఁ బెట్టిన బిచ్చము.

## శ్లేషకవిత్వము.

శ్లేషయనుశబ్దము మొట్టమొదట నలంకారములలోఁ బుట్టినది. అలంకారములలో శ్లేషాలంకారమని యొకభేదము. ఈశ్లేషాలంకారము శబ్దశ్లేష, అర్థశ్లేష, ప్రకృతిశ్లేష, అప్రకృతిశ్లేష, యని యిట్లనేక యవాంతరభేదములచే నొప్పారినది. సంస్కృతాలంకారికులు శ్లేషాలంకారమును గూర్చి యనేకాభిప్రాయములు పడియున్నారు. వాని కన్నిటి కిదిచోటుగాదు. కవులు మొట్టమొదట నీ శ్లేషాలంకారమును దమ పాండిత్యప్రభావప్రదర్శనమునకయి కావ్యములందుఁ దఱుచుగా వాడసాగిరి. రానురాను గవులు శ్లేషయందు రెండర్థములందును దుల్యబలముంచి కావ్యమంతయు శ్లేషతోనే చెప్పసాగిరి. వీనిని శ్లేషకావ్యము లందుము. ఇట్టిశ్లేషకావ్యములం దొకయర్థము ప్రకృతమనియు, వేఱొకయర్థ మప్రకృతమనియుఁ జెప్పరాదు. రెండును బ్రకృతములే. ప్రతియొక్కొకపద్య మందును రెండర్థములతో రెండుకథాభాగములును నడచుచుండును. ఇట్టి శ్లేషకావ్యములు మొట్టమొదట సంస్కృతమునఁ బుట్టుకఁగాంచినవి. 9 వ శతాబ్దమువాఁ డగు కవిరాజను నాతఁడు రాఘవపాండవీయ మను శ్లేషకావ్యమును వ్రాసెను. వేములవాడ భీమకవి దానిని జూచి తెనుఁగున రాఘవపాండవీయమను కావ్యము రచించెను. అయ్యది యాంధ్రులనిర్భాగ్యవశమున నాంధ్రలోకమునకు లభింపదయ్యె. ఈవిషయమునే మరల రాఘవపాండవీయమును రచియింపఁ దలఁచిన పింగళి సూరనకవి తనగ్రంథపీఠికయం దిట్లు చెప్పెను.

ఉ. "భీమనతొల్లి చెప్పెనను పెద్దలమాటయె గాని యందునొండేమియు నేయెడ
    న్నిలుచు టెవ్వరుగాన రటుండనిమ్ము......................................"

తెనుఁగులో శ్లేషకావ్యములకు ముందుఁబెట్టిన భిక్ష యీరాఘవ పాండవీయము. దీనిరచయితపింగళి సూర్యనార్యుఁడు. కృష్ణరాయ యాస్థానకవి యగుట నీతనికాలము 1500 వ ప్రాంతమనినిర్ధారితము. కవితయందు భావనాశక్తిని జూపుటలో నీసూరనార్యుఁడు తిక్కనగారి యవతారుఁడని జెప్పవచ్చును. పాలకైరాలు మోసెడు విధమున రెండర్థముల కావ్యమును జేయవలయునను నియమమును బెట్టుకొనినవాఁడగుటచే నీరాఘవపాండవీయమున మాత్రము కవి భావనాశక్తిని జూపలేక పోయెను. కానియీతని కళాపూర్ణోదయకవితయందు మాత్రము భావనాశక్తి సంపూర్ణముగ గలదు. ప్రకృతి

వర్ణనము కన్నులఁగట్టినట్లగపడును. అట్లని రాఘవపాండవీయమునఁ గవిత్వము బొత్తిగా నీరసమును జెందియుండలేదు. కథాసందిత్వము చెడనీయలేదు. రాఘవపాండవీయమునఁ గవిత్వము కఠినము, నిగూఢమును గాక సరళముగా సుధాప్రవాహమువలెఁ బరువెత్తినది. రామాయణభారతార్థములలో నే దాని మన ముద్దేశించి చదువుదుమో స్పష్టముగా నాకథార్థమే స్ఫురించుచుండును. అందుల కుదాహరణము స్థాలీపులాకన్యాయమున నీ పద్యమును జూడుఁడు—

చ. ధరణిపుఁ డుండెనంత బహుధాముని సన్నుతహాయమానుఁడై
పరమ సమృద్ధిఁ బర్వెడు విభావసునందను రూపకాంతి ని
ర్భరుఁ గొదలెల్ల దూరముగఁ బాయ సభాజన గౌరవానము
త్తరు ఘనునొక్కనిం బ్రమదగౌరవ మొప్పఁగఁ గాంచి సన్నిధిన్.

శ్లేషకవిత్వముతో బయలుదేఱిన కావ్యములలో రెండవకుసుమము హరిశ్చంద్ర నలోపాఖ్యానము. దీనిని రచియించినది వసుచరిత్రము వ్రాసిన రామరాజభూషణకవి. ఈతని కాలము 1560వ ప్రాంతము. తెనుఁగున శ్లేషకవిత్వమునం దుఁబ్రసిద్ధిఁగన్నవియుఁ బ్రథమములైనవియు నీరెండే. వీనికిఁ దరువాత ఎలకూచి బాలసరస్వతి యనునాతఁడు "రాఘవ యాదవ పాండవీయ"మను నొక కావ్యమును వ్రాసెను. ఇయ్యది మూఁడుకథలతో నడుచుచుండును. కవియెవరో తెలియదు గాని తెనుఁగున "నల యాదవ రాఘవ పాండవీయ" మను మఱియొక శ్లేషకావ్యమున్నట్లు వినియున్నాను. ఇయ్యది నలునికథ, యాదవునికథ, రాఘవునికథ, పాండవకథ, యను నాలుఁగుకథలతో నడుచును గాఁబోలు! ఎంత యసంబద్ధము! తెలుఁగుకవులు పద్యము లల్లునపుడు యతిప్రాసముల నిర్బంధమువలననే కొన్ని అసంగతములు, అపభ్రంశములు, అనర్థములు, నైన పదములు పడుట తప్పదు. అట్టితఱి మూఁడు నాలుగర్థములతోఁ బద్యములు చెప్పఁదలఁచుకొనెడి వారి కవితయం దెన్ని యపభ్రంశములు అనర్థములు నైన పదములు పడునో వేఱే చెప్పవలయునా? ఇట్టి శ్లేషకవిత్వముతోఁ గూడుకొనిన కావ్యము లాంధ్రవాఙ్మయమున కెక్కువ యుపయోగ్యములు కావని చెప్పుట సాహసముగా దని నామతము. తెనుఁగుకవిత్వమందు శ్లేషకవిత్వ మనునది యొకరస్తా, రెండవరస్తా అచ్చతెనుఁగు కవిత్వము.

## అచ్చతెనుఁగు కవిత.

అచ్చతెనుఁగు కవితను గూర్చి చెప్పఁదలంచు కొన్నపు డచ్చతెనుఁగన నేమియో కొంత యోచింపవలయును. చిన్నకోట పెద్దయకవి యీయచ్చతెనుఁగును గూర్చి యిట్లు చెప్పెను.

కం. ఈమూఁడు తెలుంగులలో
నేమిటనుం దొరలకున్న నెల్లజనులకుం
లో మిగులఁ దేటపడియెడు
నామాటల నచ్చతెనుఁగులన నెగడొందుం.

చ. ఎనుములు గుఱ్ఱముల్ మొదవులెడ్లులు బండులు పందు లుప్పవ
ప్పునుములు కొల్లలాముదము లాకులు పోఁకలు నేయునూనె యే
పునఁ బెరుపొందు విశ్వవిభుపోల ననందగు చిన్నవారికిన్
మనమునఁ దేటగాఁ దెలియు మాటల యచ్చతెనుంగునాఁ జనున్.

అని యీమూఁడనఁగా వెనుక తత్సమ, తద్భవ, దేశ్యముల, లక్షణములను జెప్పియున్నాఁడు. కనుక నామూఁటికి విభిన్నములయి నిత్యము మనగృహములలో వాడుకొను పదము లేవియో యవియే యచ్చతెనుఁగుపదములనెను. అచ్చతెనుఁగులు దేశ్యములకంటె భిన్నములని యీతనిమతము. కేతన ఆంధ్రభాషాభూషణమున "ఆంధ్రదేశపురస్థాయులైన సకల జనములకును మఱుంగుదేశంబు లేక తేటతెల్లమిగాఁ బల్కుమాటలెల్ల నవని శుద్ధాంధ్రదేశ్యంబులనఁగఁబడు" నని చెప్పియున్నాఁడు. కాని వీనికి విరుద్ధముగ సుమారు నూరు సంవత్సరముల క్రితమువాఁడగు చిన్నయసూరి బాలవ్యాకరణమున "సంస్కృతసమేతరమైన యీభాష యచ్చయనంబడు" నని సూత్రించి తత్సమేతరమైనదెల్ల అచ్చతెనుఁగనే చెప్పెను. అనఁగా వీరిమతమున "ఆకసము, చందురుఁడు, మొదలగు సంస్కృతభవశబ్దములును, అగ్గి, గారవము, మొదలగుప్రాకృతసమములును, అచ్చర, అచ్చెరువు, మొదలగు పాకృతభవపదములును, ఊరు, పేరు, ఇల్లు, ముల్లు, మొదలగు దేశ్యపదములును, తవర, తీవి, తేవ, తావు, థాక, మొదలగు నన్యదేశ్యములును నచ్చతెనుఁగుభాషలోఁ జేరును." మనకు లభించిన యచ్చతెనుఁగు గ్రంథములలోఁగూడ నీసూరి మతముచొప్పుననే యచ్చతెనుఁగు భాషవాడఁబడినది. చిన్నకోట పెద్దయకవి నాఁటికిఁ గేవలమచ్చతెనుఁగుతో వ్రాసిన గ్రంథములు లేవని కావ్యాలంకారచూడామణిలోని యీపద్యమువలనఁ దెలియుచున్నది.

తే. గీ. పరగసంస్కృతంబుపైఁ దెనుంగు విభక్తు
లునుపఁబడి పొసంగి యుండెనేని
తత్సమంబు నాఁగఁదగు సంద్రుసుకవులు
తద్భ

ఈవఱ కచ్చతెనుఁగు కవిత్వము లేదనిగదా యీపద్యాంత్యచరణము వలనఁ దెలియుచున్నది. ఈకవిత్వమునకు మొట్టమొదటివాఁడు పొన్నగంటి తెలగన్న. ఇక్కవి కేవలము శుద్ధాంధ్రదేశ్యభాషలో "యయాతిచరితము"ను వ్రాసెను. ఈతని కాలము 13 వ శతాబ్దమనియాంధ్రవాఙ్మయ చరితమున వంగూరిసుబ్బారావుగారు స్థిరపఱిచిరి. సుబ్బారావుగారి వ్రాఁతయే వాస్తవమైనచో 1350 వ ప్రాంతమువాఁడగు విన్నకోట పెద్దయకవి 13వ శతాబ్దమువాఁడగు తెలగన్న వ్రాసిన యయాతి చరితమును జూడక "తద్విహీనకావ్యతతియు లేదు." అనిచెప్పియుండెననియనవలయు. లేదా పొన్నగంటి తెలగన్నకాలము సుబ్బారావుగారు చెప్పినట్లుగాక 14వ శతాబ్దమనియైననిశ్చయించుకోవలె. ఎట్లయిననేమి? అచ్చతెనుఁగు కావ్యము 13_14వ శతాబ్దములమధ్య బుట్టియుండవచ్చును. అచ్చతెనుఁగులోని రెండవకావ్యము "అచ్చతెలుఁగురామాయణము". ఇత్యాది కవిసార్వభౌముఁడు కూచిమంచి తిమ్మకవిది. ఏతత్కవిరచితములగు గ్రంథము లనేకములుగలవు. అందు 'నీలాసుందరీపరిణయము' "అచ్చతెనుఁగురామాయణము" అనునవి కేవలము శుద్ధాంధ్ర దేశ్యభాషతో వ్రాయఁబడ్డవి. ఈతిమ్మకవి 1715 వ ప్రాంతమువాఁడు. ఉత్తమకవులలో లెక్కింపఁబడకున్నను నీతఁడు భాషాస్వాతంత్ర్యముగలవాఁడనియే చెప్పవలయును. అచ్చతెనుఁగు బాస బాగుగా నెఱిఁగినవాఁ డగుటచేతనే యందు రెండుగ్రంథములను వ్రాయఁగలిగెను. వీని యందుఁ దత్సమపదము లెచ్చటను వాడియుండలేదు. అట్టి నియమమును బెట్టుకొనినవాఁ డగుటచేతనే యిక్కవి కవిత్వముగూడఁ జెడిన దనకతీరదు. ఈతఁడు 'వాల్మీకి, శూర్పణఖ, అగస్త్యుఁడు, మొదలగు సంస్కృతనామములనుగూడ నచ్చ తెనుఁగుభాషలోనికి మార్చినాఁడు.

గాలిమేపరుల నట్టు పుట్టువమేటి తపసి= వాల్మీకి.
మఱువకందుజోగి తెఱవాయిమొకము    అగస్త్యయోగిసింహము.
మంచి మెడకోనద్రిమ్మరిమన్నెగాఁడు — సుగ్రీవుఁడు.

అని యిట్లు కొన్నిసంస్కృతనామముల కర్థముఁబోనీయక తెనుఁగులోని

కి మార్చెను. కొన్ని సంస్కృతనామముల ననర్థకములైన తెనుఁగు పదముల లోనికి మార్చెను. శూర్పణఖను సుప్పనకయనెను. శూర్పణఖ యనఁగా చేట గోళ్ళది యని యర్థమున్నదిగాని సుప్పనక, యనిననర్థమేది. కనుక శూర్పణఖ తద్భవమగు ''సుప్పనక'' యనుపదమునకుఁగూడ నాయర్థ మున్నదని చెప్పుకొనవలయును. శ్లేషకవిత్వమువలెఁ గేవల మచ్చతెనుఁగు కవిత్వమును నాంధ్రవాఙ్మయమున కంతగా నుపయుక్తము కాదనుకొనియెద. అచ్చతెనుఁగు కావ్యములు పాఠకులమనముల కింపునింపవు. కాని యచ్చతెనుఁగు భాష మృతి నొందకుండుటకుఁ గారణములగును. ఈయచ్చతెనుఁగు భాషకు ''ఆంధ్రనామ సంగ్రహము'' మొదలైన నిఘంటువులుగూడఁగలవు.

### వచనకావ్యములు.

కేవలము పద్యమువ్రాయుటయే కవిత్వముగాదు. అనన్వయములేక నాలుగుమాటలు పొందికగా నొకచో వ్రాసినను కవిత్వమేయగును. కందము వ్రాసినవాఁడే కవి. పందిని బొడిచినవాఁడే బంటను లోకోక్తినిబట్టి కవికిలక్షణము పద్యమువ్రాయుటేయని యనరాదు. నిర్వచనోత్తరరామాయణము మొదలగు నెవియో కొన్నిగ్రంథములందప్ప మొదటినుండియు మన యాంధ్రవాఙ్మయమునఁ బద్యకావ్యములందు వచనము వచ్చుచునేయున్నది. కేవలము వచనముతో వ్రాయఁబడ్డ గ్రంథము 15 వ శతాబ్దములోఁ బుట్టెనని యాంధ్రవాఙ్మయము చెప్పుచున్నది. 15 వ శతాబ్దమున "ఎల్లకవి నరసింహుఁడనువాఁడు భారతసావిత్రి యను వచనగ్రంథము నొకటి వ్రాసెనఁట. ఆ తరువాతినుండి గద్య గ్రంథము లాంధ్రవాఙ్మయమునఁ బ్రబలినవి. రావుబహదూర్ కందుకూరి వీరేశలింగము పంతులుగారి కాలమునుండి యిప్పటివఱకుఁ దఱచుగా బయలుదేఱుచున్న గ్రంథములు గద్యగ్రంథములే. నవలారూపములగు గ్రంథములెల్ల వచన గ్రంథములే గదా?

### ద్విపదకావ్యములు.

వచనగ్రంథములవలె నంతయు ద్విపదలోఁ జెప్పిన గ్రంథములును మనకు మొదటినుండియు నున్నట్లు తెలియరాదు. ద్విపదకావ్యములలో మొదటిది బసవపురాణము. తరువాతరంగనాథరామాయణము, పల్నాటి వీరచరితమును వెలువడినవి. వీనిపిమ్మట ననేకద్విపదకావ్యములను మన తెనుఁగుఁ దల్లి కనినది. ప్రతివత్సరమునను దసరాయుత్సవదినములలో బడిపిల్లలు పాడుకొను "అయ్యఁ

వారికిఁజాలు అయిను వరహాలు." మొదలగు పాటలుసయితము ద్విపదలతోనే వెలసియున్నవి.

దండకము.

వచనద్విపద గ్రంథములవలె నంతయు దండకముతో వ్రాయఁబడ్డ దండకగ్రంథము లేమియు నాంధ్రవాఙ్మయమున మొదట నుండినట్లగపడదు. కాని పురాణములు మొదలైనవానియం దీశ్వరుఁడు ప్రత్యక్షమైనపుడును కాళి ప్రసన్నమైనపుడును స్తుతిరూపమున నీదండకములు కవులు వ్రాయఁజొచ్చిరి. కాని ప్రస్తుతకాలమున "ఆంజనేయ దండకము, అశరమ్మదండకము" మొదలైనదండకగ్రంథము లనేకములు భూతవైద్యులదగ్గఱకు రాఁ జొచ్చినవి.

ఆశుధారాకవిత్వము మొదలైనవి.

తెనుఁగుకవిత్వమున నాశుధారాకవిత్వము, శతావధానము, అష్టావధానము, అని మఱికొన్ని భేదములు గలవు. ఆశుధారాకవిత్వమనునది యాదినుండియు వచ్చుచున్నది. శతావధానము, అష్టావధానము అనునవి యిటీవలవి. ఆశుధారాకవిత్వ మనాలోచితముగఁ జెప్పవలయునుగాన దీనియందు రసౌచిత్యము, కథాశుచిత్వము, భావనాశక్తి, మొదలగు కారణములుండుటకుఁ గారణము గనుపట్టదు. శతావధానమందును నష్టావధానమందును గవి కనేకవిధములుగ మనస్సుండవలయును గాన నాపద్యములును నెక్కువరసవంతములు కావేమో?

అట్లని యాశుధారాకవిత్వము మొదలగువానిని జెప్పఁగూడదనికాదు. అట్లు చెప్పినకవిత చప్పనైయుండుననియే నాయాశయము.

తే. ఆశుధారా కవిత్వంబులందు శయ్య
లుపమ లుత్ప్రేక్షలును లేక యుండుఁగాన
నెంత యోజించినను పద్య మంతసార
వంతమగుఁగాన నిలుకడ వలయుఁగృతికి.

అప్పకవి.

ఈకాలపు భావకవిత్వము.

ఇదమిత్థమని నిర్ణయించుటకు వీలుకాని దీకాలపు భావకవిత్వము, "భిన్నరుచిర్హిలోకః" అన్నట్లు ఒకరికవిత్వ మొకరికి నచ్చదు. ఒకరు భావకవిత్వమని తలంచినది వేఱొకరు పాడుకవిత్వముగా దలంతురు కొంద ఱు నం

డూరి సుబ్బారావుగారి యెంకిపాటలలో భావమున్నదనిరి. మరికొందఱు రాయప్రోలు సుబ్బారావుగారి గీతములలో భావమున్నదనిరి. ఇంకొకరు విశ్వనాథ సత్యనారాయణగారి కిన్నెరసాని నడకలలో భావమున్నదనిరి. వేఱొకరు అర్థములేక భావము తెలియని కవిత్వమందే భావమున్నదనిరి. ఏది భావకవిత్వమైనను, యెవ్వరిది భావకవిత్వమైనను నీకాలమునందలి కవులలో "భావకవిత్వము, భావకవిత్వము" అని ఘోషలుమాత్రము బయలువెడలినవి. కనుక మన మనసునకు నచ్చి యెద్దానియందు భావనాశక్తియున్నదని మనకు స్పష్టమగునో యాకవిత్వమును భావకవిత్వమునుగాఁ దలఁపవలయును. అంతియగాని యిత్యాదియు భావకవిత్వముని యందఱుఁ జెప్పుట వెఱ్ఱిపనియని నాయూహ. ఈభావకవిత్వమును రెండువిధములుగా మనము విభజించుకొనవలయును. శుద్ధగ్రాంథికభాషలో వ్రాయునది యొకటి, శుద్ధగ్రామ్యభాషలో వ్రాయునది యొకటి. మొదటిదానికి రాయప్రోలు సుబ్బారావుగారి గీతములుదాహరణములగును. రెండవదానికి "ఎంకిపాటలు" మొదలగునవి యుదాహరణములు కావచ్చును.

ఈరెండువిధములయిన భావకవిత్వముకన్న తిక్కనగారి భారతభాగమందె యెక్కువభావమున్నదని నాయాశయము. చదువగనే రసమును జిలుకరించుచు భావములను మనములకెక్కించి ప్రతిబింబములను గన్నులఁగట్టి ప్రపంచమును మురపించునది భావకవిత్వము. ఇద్దానికి తిక్కనభారతభాగము పెట్టిన పేరు. ఇట్లని ఇప్పటివారి కవిత్వమందు బొత్తిగా భావములు లేవనిగాదు. కొందఱికవితలున్నవి. అవ్వారి కవిత్వములందలి భావరసములు దృఢమనస్కుల గట్టిమనములను సయితము మిగురుపెట్టింపఁగల సామర్థ్యము గలవియే. కాని వారిని గొనియాడుట కిదిసమయముగాదు. ఇయ్యది చోటునుగాదు.

## తెనుఁగుకవిత యందలివిశేషము.

ఆంధ్రకవితయందు మఱియొకవిశేషము చెప్పవలసియున్నది. సంస్కృతభాషను తదితరభాషలను గూడ దీనియం దనుకరింపవచ్చును. మధ్యమధ్య సంస్కృతము ననుకరించిన తెనుఁగుపద్యములను మనము తఱచుగాఁ జదివి వినుచునే యున్నారము. పెద్దనకవి యీ తెనుఁగుపద్యమున హిందూస్తానీభాషను గూడ నెంత సొగసుగాఁ జొన్పెనో చూడుఁడు.

మ. సమరక్షోణిని గృష్ణరాయుల భుజాశాతాసిచేఁ బడ్డను
ద్గమదోర్దండ బెడఁదకోట యవనవ్రాతమ్ము సప్తాశ్వ మా
ర్గమునం గాంచి "సెబాసహాశ్ హరిహరంగా ఖాభుకో డాకితే
తుము కీభాయిల భాయిదేములికి" యంచుర్విం టికిన్ బోవుచున్.

కవితాఫలము.

కవితాఫల మందఱినోటను నూడిపడునది గాదు. చేతిలో నదృష్టగీత లుండవలె ముఖమున బ్రహ్మ వ్రాయవలె. అట్లని కవిత్వముచేయుటకుఁ గడంగ కుండుటయు మంచిది కాదు. "యత్నేకృతే యది నసిధ్యతికోఽత్రదోషః" పూర్వవాసనలేక యున్నను యత్నించినట్లయినఁ గవిత్వము సిద్ధించున నియే దండికవి చెప్పియున్నాఁడు "నవిద్యతె యద్యపి పూర్వవాసనా గుణానుబంధి ప్రతిభానమద్భుతం, శ్రుతేనయత్నేనచ వాగుపాసితాధ్రువంకరోత్యేవకమప్యనుగ్రహం"అని ప్రయత్నించి పెనగులాడి యెట్లోయతులకు జతపెట్టి చెప్పుకవిత్వమునకును, బ్రయత్నింపక స్వతస్సిద్ధముగాఁ బుట్టు కవిత్వమునకును భేద మున్నది. చెట్టుననే పండినపం డెంతరుచిగా నుండునో ? పచ్చికాయకోసి మాగవేసినపండెంతరుచిగా నుండునో ? మనకెల్లఱకుఁ దెలిసిన విషయమే గదా ! "వనితయుఁ గవితయుఁ దానై చనుదెంచుట గలుగునేని సరసంబగు" అని అప్పకవి. "నైసర్గికీచ ప్రతిభా శ్రుతంచ బహునిర్మలం అమందశ్చాపి యోఽగోఽస్యాః కారణంకావ్య సమ్పదః " అనిదండి.

కవులను వారికవిత్వమును గొనియాడుటకు సంస్కృతమున "సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్" అను మొదలగు లోకోక్తులును, దెనుఁగున "కవిగా నని చో రవిగానఁడే కదా" యను మొదలగు లోకోక్తులును, ననేకములు గలవు. వేయేల! భగవానుఁడగు కృష్ణుఁడు సయిత మర్జునునకు గీతలను బోధించు సందర్భమున ''కవయోఽ ప్యత్రమోహితాః" అనినాఁడు, అనఁగాఁ గవులుఁ గూడ నీవిషయమునఁ బొరవడిరని గదా యీభగవానుని గీతాభిప్రాయము. దీనిచేఁ గవుల గొప్పతనము ఘనతకెక్కదా ?

ఈవఱకే వ్యాసము చాల విరివియయినది. కాన నీశ్లోకముతో విరమించుచున్నాఁడను.

శ్లో. స్వస్థానవేషభాషాభిమతాస్సంతో రసప్రలబ్ధధియః
లోకే బహుమన్యన్తే వైకృతకావ్యాని చాన్యదపహాయ.

# విభీషణశరణాగతి

కరి నారాయణాచార్యులుగారు.

(ఆంధ్రగీర్వాణ సాహిత్యపరిషత్తు)

(విభీషణుఁడు సుగ్రీవునకుఁ దనవృత్తాంతముఁ దెల్పుట.)

మ. వినుమోయీ ప్లవగావతంస! నను నావేదింపుమీ ప్రేమమీ
రనయజ్ఞుండగు రామచంద్రునకుఁ గ్రూరాచారుఁడౌ రావణుం
డను రక్షఃపతికేను దమ్ముఁడను మాహాత్మ్యుండ నన్ను న్విభీ
షణుఁ డంచున్ సరి రక్కసుల్ పిలువ దోషాటుండనై యొప్పితిన్.

శా. ఆదుష్టుండగు రావణుండు జనకక్ష్మాధీశపుత్రిన్ సుమ
ర్యాదాతిక్రమమేవగింపకను భర్తం బాపి కొంపోయి పెం
పేదఁ గ్రూరనిశాచరీపరివృతిన్ [illegible]ల్ల గోష్ఠంబుగా
సౌదామిన్యుపమాంగి లంక నిడి యేచన్ సాగెఁ గీశాధిపా.

కం. అదిగాంచినది మొదలుగా। మది నోర్వఁగలేకయుండి మసలక నేనా
పదితలలరక్కసింగని। పదిలముగా మాటలాడఁ బనిఁ బూనియటన్.

మ. ధరలో సంభవమొందు జీవతతికిన్ ధ్యాతవ్యుడుం దండ్రియౌ
మురజిద్దేవునికంటె వేయిమడుగుల్ పూజార్హయుం దల్లియౌ
ధరణీపుత్రినిగొన్న పాపమతితో దైతేయుతోఁ బల్కితిన్
వరసందర్భసహేతుసద్ధితములౌ వాక్యంబులీరీతిగన్.

శా. ఆకర్ణింపు దశాస్య! మత్సుహితవాక్యంబుల్ మహాశ్రద్ధతో
సాకేతాధిపుపత్ని సీతను మదిన్ సామాన్యబుద్ధిన్ మను
ష్యాకారంబుగఁ జూడఁబోకు రమయే సాక్షాత్తుగా రాముఁడున్
వైకుంఠుండయటంచు నిశ్చయముగా స్వాంతంబునన్ నమ్ముమీ!

ఉ. రాముని ధర్మపత్నిని జలంబులఁ బాపిన మీను కైవడిన్
రామునిబాపి తెచ్చితివి రావణ! నీకిది న్యాయమే? పరం
ధామునిసొమ్ముఁ గ్రమ్మఱఁ దదర్పణసేయుము పాపశాంతికై
రాముని రామచెంగటను బ్రార్థనఁ జేయుము భక్త్యుదారతన్.

ఉ. కాలికిమ్రొక్కు మద్రిజనకప్రభునందనకున్ సుమాంగికిన్
బాలకురంగలోచనకు భాగవతోత్తమ హృత్సరోజ మ
త్తాలికి రామచంద్రపద తామరసాత్తమరందపాన మ
త్తాలికి నేలచూలికినటంచు వచించితి వానరోత్తమా !

ఉ పాదకుశేశయంబులకు భక్తిని వందనమాచరించి మ
ర్యాదను మాతరో ! మదపరాధము లెల్ల క్షమించి కావుమీ
యాదటనంచు వేడుకొను మంటిని నాహితవాక్యరాశిలో
నాదరభావ మొక్క యణువంతయుఁ జూపకపోయెః గీశపా !

గీ. ఆదరముఁ జూపకున్నను నఖిలజీవ। కులు శ్రీయఃపతికి శరీరభూతములు క
నుకదశాస్యుఁడుభగవంతుని కనుకూల।ముందవలెనని యుగఁడనిట్లంటి వినుము.

మ. దనుజేంద్రా ! రఘురాముసన్నిధికి సీతన్ వేగఁగొంపోయి య
ర్పణభక్తిన్ శరణొందిచేసివయొకన్ రాముండు నీనేరముల్
వెనుకంబెట్టి త్వదర్పితక్షితిసుకన్ స్వీకారముంజేసి నిన్
'దనుజా ! రక్షణఁజేతు భీతిల'కమన్ దథ్యంబహూ కావుతన్.

ఉ రాముని భక్తకిల్బిషవిరాముని భూమిలనామణీప తా
రాముని దుష్టదానవవిరాముని భాగవతోత్తమాళిహృ
ద్రాముని ముక్తిదాదిపురధాముని లోకతమోహ్ను తాకళా
సోముని భానువంశనదసోముని భక్తిని నాశ్రయించుమీ.

కం. అనినేనిటు వల్లగ రా। వణు డవి యుహితంబులనుచుఁ బవరిదురాత్మా
విను రాము నీమనీవిఁక।ఘునముగ నాయెఁగుటఁ బొగడఁ గడగకుమెపుమన్.

శా. ఓరీ ! రాత్రిచరాధమా! యిబుల నీవ్రవ్యన్నుతుల్ సేయుటల్
సారెన్ మానుము మాధవాబ్జభవహృజ్జారి జంభారులె
వ్వారు న్నాకెనగారు రాఘవుఁ డనన్ వాఁ డెంత ? ఘోరాజికై
వే రానిమ్ము మదీయబాహుబలమున్ వీరత్వముం జూపెదన్.

ఉ. కింబహునా ? మదీయకరకీలితకర్తృశఖడ్గతీవ్రఘా
తంబున శత్రుసైన్యమును దాశరథిన్ బటుభీష ణోద్ధము
ద్ధంబున సంహరించెద వృథాకథనంబులవేటికిఁక రో
లంబసమానకుంతల నిలాసుతఁ గ్రమ్మఱనీయనమ్ముమీ.

మ. అని యాకండు కఠోరయుక్తులుగ నే నాలించి సామోక్తులం
దనుజుండింతయు ధర్మముం గనఁడు కానన్ రాముఁడాజంబునన్
దనుజవ్రాతముఁ గెల్చుటల్ నుడివి భీతస్వాంతుఁ గావింతు నీ
తనియుంచున్ మగుడన్ వచించితి మహాధైర్యాన నీరీతిగన్.

సీ. నరమాంసలౌల్యసంచరిత శృంగాటకన్ ఘనలలాటకఁ దాటకను వధించె
ఘోరమాయావేష ధారణదక్షునిన్ మారీచ దనుజుని మన్నిగొనియె
బాహులసద్బల సాహసికుండౌ సుబాహు పలాశిని వధయొనర్చె
విపులబాహాకాండ విజితగదాదండుఁడగు విరాధునిరూప మడఁగఁజేసె

గీ. నట్టి యుద్ధపటిష్ఠులౌ జెట్టులెల్ల । నెందఱో తమబలముల నెల్లపీడి
రాముబాణాహతిని జచ్చి రంతకంబు। నధికమా? నీదుదోర్బల మసురనాథ.

సీ. గర్వవిక్రమకళా ఖర్వశౌర్యాఖిలున్ ఖరరాక్ష సాగ్రణిఁ గండడంచె
దూషితసత్త్వునిం దురితప్రసక్తునిం దూషణదైతేయుఁ ద్రుళ్ళడంచెఁ
గతినాట్టహాససంభ్రమిత వేధోండునిఁ ద్రిశిరునియసువులఁ దీసివైచెఁ
గందరసంకాశ కంధరుం డగునాకబంధ పలాంధునిన్ బట్టిచంపె

గీ. నిన్ను జంకఁబెట్టి నీరథుల దెల్ల । ముంచి యసమునిముచు కాంచనాంగు
వాలినొక్కకోలఁ దూలనేసిచెలంగె । రాముమించు శౌర్యరాశికలఁడె ?

కం. ఈవిధముగ నేఁ జెప్పినఁ । దావికృతాకృతినిబూని దారుణతరకో
పావిలమానసుఁడై । పారావారధ్వనినిఁ బల్కె గ్రక్కున నిటులన్.

శా. ఛీ దుర్మార్గ! ఖలాగ్రణీ! తులువ! యక్షీణామరారాతివం
శోదన్వద్బడబాగ్ని! పుణ్యజనసంక్షోభక్రియాదక్ష! నీ
వాదోద్దేశమురూహముల్ దెలిసె సర్వంబున్ వెసన్ బొమ్మిఁకన్
గాదేని న్నినుదండ్యుఁ జేసి మఱి నీగర్వం బడంతుంజుమీ.

చం. అని యతఁ డట్లు దాసువలె నత్యవమానితు నన్ను జేయఁగాఁ
గని సహియింపలేక నిజకాంతను బుత్త్రులనెల్లనా పురం
బునఁ ద్యజియించి రామునెడఁ బూర్ణదృఢాధ్యవసాయబుద్ధితోఁ
డనుశరణొందవచ్చితిని దాసునిఁ దెల్పుముకీశనాయకా!

చం. పురమును మిత్త్రులం ధనసమూహమును న్నిజదారసంతతిన్
వరరథపంక్తియుం దురగవర్గమునుం గరిసంతతిన్ లస

త్తరనిలయంబుఁ గా విడిచి దాశరథిం శరణొందవచ్చితిం
గరమనుకంపతోడఁ బ్లవగాధిప! తెల్పుము నాదుదైన్యముల్.

(సుగ్రీవుఁడు విభీషణుని రాముని సన్నిధికిఁ దోడ్కొనిపోవుట)

ఉ. భీతిచెలంగ నిట్టుల విభీషుఁ డాత్మచరిత్రఁ దెల్పఁ దా
నాతనివల్కులం దలి యథార్థములన్ సువిమర్శఁ జేసి సం
ప్రీతిగ నీయకొంచు వెస శ్రీరఘురామపదాబ్జరేణుసం
పూతునిగా నొనర్ప నల భూరమణేంద్రునిమ్రోలఁ జేర్చినన్.

(విభీషణుఁడు రాముని శరణుజొచ్చుట.)

మ. శరణార్తావన! రక్షకా! శరణు! శశ్వద్రక్షణాదక్షితా!
శరణాదిత్య సమాన తేజ! శరణా శాధీశసంపూజితా!
శరణు జొచ్చితిఁ గావుమంచుఁ దనదౌచారిత్రమంతం దెల్పుచుం
జరణద్వంద్వమునంటి భక్తునిమనస్తాపంబుఁ జల్లార్చుచున్.

(రాముఁడు విభీషణున కభయ మొసఁగుట)

ఉ. రాముఁడు రాక్షసేశ్వర! దురాత్ములు నిన్ గనఁజాలరంచుఁ దా
బ్రేముడి రావణానుజుని బేరురమందునఁ జేర్చి నీకికన్
భాములు కల్గబో వమలభావమునందుము వేయిఁ కేల? సు
త్రాముని రీతిభోగములఁ దద్దయు నందెదవంచుఁ బల్కుచున్.

(విభీషణ పట్టాభిషేకము)

శా. శ్రీరాముం డభయంబొసంగి యనుజున్ క్షీరాబ్ధిపత్తోయముల్
దేరంబంపఁగ లక్ష్మణుండు వెసఁ దత్తీర్థంబుఁ దే నంత లం
కారాజ్యంబు విభీషణాఖ్యునకు సంకల్పించి మోదానవి
శ్వారాధ్యాతి శుభంబుగా నొనరిచెం బట్టాభిషేక క్రియన్.

# అలంకారవిషయము.

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు, కొవ్వూరు.

లక్ష్యప్రపంచము పలువిధముల వెలసి శాఖోపశాఖలతో విస్తరించుచుండుపట్టున దానియం దెక్కువయనుభవము గలపరిశీలకులచే లక్షణగ్రంథములు నిర్మింపఁబడుచుండును. లక్షణవిజ్ఞానము లక్ష్యప్రపంచానుభవము శీఘ్రముగను సులభముగను గలిగించుటకు సుసాధనమై యుండును. చిరకాలము లక్ష్యపరిశీలనము చేసి యలవరించుకొను జ్ఞానమును లక్షణసూత్రముం గ్రహించినంతనే విద్యార్థి పడయఁగలఁడు.

ఛందోలక్షణములు, కావ్యనాటకలక్షణములు, అలంకారలక్షణములు నాయికానాయకలక్షణములు, రసభావాదులలక్షణములు, వాస్తులక్షణములు భాషాలక్షణములు (వ్యాకరణములు) మున్నగునవి పెక్కు. వీనియం దెల్ల యివి యిట్లు చేయవలె నని కొన్నిఁటిని విధించుటయుఁ గొన్నిఁటిని నిషేధించుటయుఁ గలిగియుండు.

మాటలు లయతోఁ బల్కఁబడుటలోని యందమును గమనించిన విమర్శకు లాయందము నవిచ్ఛిన్నముగా భాషలోఁ బాదుకొల్ప నెంచి వృత్తములకు లక్షణములఁ గట్టిరి. వానిలో యతిప్రాసములు సంస్కృతములో లయకుమాత్ర ముపయోగించునవియై యుండిన వర్ణావృత్తిరామణీయకపక్షపాతవశీకృతమతులైనయాంధ్రకవులచే శబ్దాలంకారములలోనికిఁ దీసికొనఁబడి యక్షరనియమమునకుఁ దావులైనవి. కాని పద్యములుగనే వ్రాయవలె నని లాక్షణికులు పట్టుపట్టక గద్యకవనమునకుసైత మవకాశము ననుగ్రహించి యుండుటంబట్టి యీఛందోలక్షణములచే శృంఖలాబంధము కవులకుఁ దయారుచేయఁబడలేదు.

కావ్యములనుగూర్చి వేనవేలు లక్షణములు గలవు గాని యవి యన్నియుఁ గావ్యములయందమును గూర్చిన విభిన్నాభిప్రాయములను సూచించుచు సత్కవికి సెలవిచ్చి వానిప్రజ్ఞ స్వైరవిహార మొనరించుటకుఁ గొంత యవకాశమును సృజించినవిగ నున్నవి గాని కవిమనోయాత్రకు దారిలో నిఱుకుఁ గలిగించునవిగ లేవు. ఇష్టార్థాలంకృతపదావళి కావ్య మన్నను, రమణీయార్థకశబ్దము కావ్యమనినను, నిర్దోషసగుణశబ్దార్థములు కావ్యమనినను, రసాత్మకవా

క్యము కావ్య మనినను వారిరుచిభేదములను దెల్పెడినిగాని కవియాలోచనకుఁగాని సరసదృష్టిప్రచారమునకుఁ గాని సంకోచము గల్గవలసినయావశ్యకత గన్పట్టను గదా.

నాటకలక్షణమును దశరూపకమున ధనంజయుఁడు విపులముగ వ్రాసెను. ధనికుఁడు దానికి వంతఁబాడి గ్రంథమును బెంచెను. అందు నాంది, ఆముఖ విశేషములతోఁ గూడి భారతీవృత్తి కాశ్రయ మైనస్థాపన, విష్కంభాదులైన యర్థోపక్షేపకములు, అంకములలోని యసూచ్యకథావస్తువు, మున్నగువాని నెల్ల నొక్కదానినైన వదలకుండ నవయవశః విభజనము చేసి లక్షణశ్లోకము లేర్పఱుపఁబడినవి. కవి నాటకము వ్రాయువలె ననుకొని కలమును గాకితమును దీసికొని నాంది వ్రాయఁబోవుచున్నాఁ డనుకొనుఁడు. అప్పు డతఁడు నవనవోన్మేషశాలిని యగుప్రతిభతో నే దేని గ్రొత్తరకమును గల్పనలతోనో మఱిదేనితోనో సృష్టించి విద్యార్థిలోకము కృతజ్ఞతకుఁ బాత్రుఁ డగుటకును, బూర్వ చమత్కారనిర్మాత యగుటకునుఁ బ్రాప్తి లేదు.

అష్టపదనాందియాః ద్వాదశపదనాందియాః శంఖచక్రములు అబ్జములు చంద్రుఁడుం బద్యములో వచ్చిరాః యని తాతలనాఁటినుండియు వచ్చుచున్న సాగసులు సమకూర్పఁ బాటుపడవలెను. అట్లు నిర్మితమైననాంది ప్రాఁతరకములోఁ జేరక యపూర్వరచన యెట్లు కాఁగలదు వాఙ్మయమునకుఁ గ్రొత్త వింత విలాసపుసొమ్ములును యెట్లు తయారు గాఁగలవు. నూతనప్రియు లగులోకులహృదయముల నాకర్షించి యప్పటప్పటి కావశ్యకము లగుచుండు నూతనోద్బోధములను జేయుట యనువిధియం దెట్లునాటకములు కృతకృత్యములు కాఁగలవు. నాంది యైనపిమ్మట స్థాపకుఁడు ప్రవేశించి రంగప్రసాదనమునో రంగప్రసాధనమునో చేయవలె నని ధనంజయుఁడు విధించుచున్నాఁడు. శ్రుతి బాగుగ నున్నది. సంగీతము బాగుగ నున్నది. మద్దెల బాగుగ నున్నది. యని చెప్పుటయే యిది యనికొంద ఱుదాహరించుచున్నారు. ప్రపద్యపుగణముల లోనో వారుచెప్పినవి వెనుకటివానికన్న కొంచెము విలక్షణముగనో అట్లో వ్రాయుటయే కదా కవి పని. ఇఁక నీతనిప్రతిభకుఁ బ్రయోజన మేమి. అడ్డులు లేని నిరామయాకాశమునఁ గొంతసేపు దూరముగ దృష్టి నిగుడించి సృష్టిలో వస్తుప్రకృతులయందు నిగూఢములై యుండురహస్యముల నుద్ధరించి తనసోదరు లగులోకులకుఁ బంచిపెట్టెడిభాగ్య మెప్పుడు సమకూడును? భారతీవృత్తి నాశ్రయించుట యని స్థాపకుని పని యొకటి.

అనఁగా—సభ్యుల నిచ్చకఁపుమాటలతో సన్ముఖులను జేయుట, వీథ్యంగములను బ్రహసనాంగములను బ్రదర్శించుట, కథోద్ఘాతము ప్రవర్తకము ప్రయోగాతిశయము ననెడి యాముఖాంగములలో నొకదానిచేఁ బ్రదర్శింపఁబోయెడి కథను సూచించి విరమించుట. ఈప్రస్తావనలోని యాముఖాంగము లనువవి ధ్వనిప్రధానములుగను శ్లేషప్రధానములుగను నుండి యొక్కొకరీతి చమత్కారము నొసఁగుచవిగనే యుండెడివి. కాని యట్టి పద్ధతులను జూపి కవి యిట్టి చమత్కారములను గ్రంథము కోలుపోకుండునట్లు జాగరూకుండు కావలెనని సలహానిచ్చుటలో లాక్షణికులు విరమించి యుండిరేని నర్తకవి తనకాజన్మసిద్ధమగుసంస్కారము ననుసరించి యేదో క్రొత్తపోకడకుఁ బ్రాకులాడుట తటస్థించుచుండెడిది. అప్పుడు క్రొత్తక్రొత్తఫలములను గవితావృక్షశాఖలపై మనము గాంచఁగల్గెడివారము. అప్పుడే పాడినదే పాటగాఁ గవితాప్రణాళిక విసుపు గల్గింపకుండెడిది.

కథకు మొదట బీజమును, జివర ఫలమును, ఎల్లలుగాఁ దీసికొని యీలోపలికథ నైదు భాగములు చేసికొనవలె ననినారు. ఈయయిదు భాగములకును నైదుసంధు లనిపేరులు పెట్టినారు. మొదటిది ముఖము. రెండవది ప్రతిముఖము. మూఁడవది గర్భము. నాల్గవది విమర్శము. ఐదవది నిర్వహణము. వీనిలోఁ బర్యవసానమైనఫలమునకుఁ గారణము లయినయైదంశములను అర్థప్రకృతులని చెప్పి కథారంభమునుండియు ఫలసిద్ధి యెట్టియెట్టిపరిస్థితులతో సూచితమగుచున్నదో ఆపరిస్థితులను, అర్థావస్థలను గాఁ జెప్పిరి. ఒక్కొక్కయర్థప్రకృతి యొక్కొక్కయర్థావస్థతోఁ గలసిన నొక్కొక్క సంధియగు. అవాంతరప్రయోజనములను జూపించుచు నైదుసంధులను బూర్తి చేయుటచే నుపక్రమోపసంహారములు సూత్రంపట్టినట్లుండి శ్రోతలకు విశ్రాంతి గల్గుచు, ఆకాంక్షాపూర్తియగుచుఁ బైకథపైఁ గుతూహలము గలుగుచుండునని లాక్షణికులభిగింపు. ఈరచనానైపుణి యిట్టినిబంధనములవలనఁ గవి కేర్పడునది గాదు. బహువిధలక్ష్యగ్రంథరామణీయకపరిశీలనమున కలవాటుపడినవానికి జన్మాంతరసంస్కారము గలిగి కావ్యజ్ఞశిక్షను బొందినసుకవి కుపక్రమోపసంహారముల నేకరేఖమీఁద నడపింపఁగల శక్తి యలవడును.

ఇంకను విచిత్రము కలదు. నాటకకథ నైదు భాగములుగ విభజింపఁబడినదాని నేఁబది చిల్లుతునకలుగా నఱికివైచినారు. అవి సంధ్యంగములు.

ఈపేలికలను సరిగ నంటించుకొనుచు సంధియను గంతను బూర్తిజేయుచుండు కవి నాటకమునఁ గావలసినయంశములను గూర్చుటయు గోప్యము లగువానిని బ్రచ్ఛన్నములు సేయుటయుఁ బ్రకటన సేయఁదగువానిం బ్రకాశింపఁజేయుటయు రక్తియుఁ జమత్కారమును గథ పెరుఁగుటయు న్యాయముగ నెలకొనఁ గలవని చెప్పి మనకు మార్గదర్శులై లక్షణగ్రంథకర్తలు కృతజ్ఞతాపాత్రు లగుచున్నారు. కాని యిది మఱింత యస్వాభావికముగా నున్నది. ఒకసంధిలో వీని వరుసను మన మనుసంధానము చేసితిమేని యిది తెల్ల మగు.

ముఖసంధిలో—బీజన్యాసము, బీజబాహుళ్యము, బీజనిష్పత్తి, గుణాఖ్యానము, ప్రయోజననిర్ధారణము, సుఖప్రాప్తి, బీజముమరలవచ్చుట, సుఖదుఃఖములు గల్గుపని, అద్భుతావేశము, గూఢమగువిషయమును బ్రకటించుట, ప్రకృతము మొదలిడుట యనునివి కవి కూర్పవలసిన సంధ్యంగములు. ఏద్రావిడప్రాణాయామములచేతనో వీని కాయాయిపుస్తకములలో ధనికుఁ డుదాహరణములు సూపియుండెను ఈపేర్ల కర్థములు గూడ బలాత్కారముగ లక్ష్యముల నన్వయింపఁ జేసికొనవలసినవే. ఏకాళిదాసాదులైన నీజాబితాను ముందుంచుకొని నాటకాదులు వ్రాసినవా రున్నారేమో యని చూతమన్న శాకుంతలాదులలో నెచ్చటను వరుసగా నీచిఱుతపేలికల కట్లు కన్పట్టవు. ధనంజయుఁడు గారును గొన్ని రత్నావళిలో గొన్ని వేణీసంహారములో గొన్ని మఱొకచోటను అక్కడక్కడ నుదాహరించెను గాని యొక్కచోటఁ బ్రణాళికగాఁ జూపలేదు.

ఈసంధ్యంగములదాఁకఁ బోనేల? సంధులే సుప్రసిద్ధనాటకము లైన యుత్తరరామచరితాదులసరిగాఁ గన్పట్టవు. రామాయణకథలో సుగ్రీవకథయు విభీషణకథయు బతాకాప్రకరులక్రిందఁ గన్పట్టుచున్నట్లు ఏశాకుంతలములోఁ గన్పట్టుచున్నది? ముద్రారాక్షసమున రాక్షసవిరాధగుప్తసంభాషణము పతాక యని వ్యాఖ్యాతలు విఱిచినను ఏమిసరసముగా నున్నది? వేణీసంహారములోఁ గర్ణాశ్వత్థామలకలహముకన్న వృషసేనయుద్ధముకన్నను బతాక యనఁదగిన దేదికలదు ?

ఉత్తరరామచరితములో బీజకార్యములనుగా వేనిని నిర్ధారణ సేయ వలనుపడెడిని? సీతాప్రాప్తి ప్రథమాఙ్కారంభమునుండియు నాయకునకు సిద్ధమై యుండు నది కార్య మగునా! దాని కొకబీజమును వెదకికొనవలెనా? రత్నా

వళిలోఁ సాగరికా రాగమును బీజమనియు యౌగంధరాయణ యత్నమునుఁ బీజమనియు ధనికుఁడనును. బిందువు ప్రతిసంధినిం బ్రతియంకమున నన్వయించును. ఇవి యన్వయింపని తావుల రక్తికిని జమత్కృతికిని సహృదయహృదయాకర్షణమునకును గొఱంత యేమి వాటిల్లియున్నది. ఉత్తరరామచరితములో స్థాపనయందలి స్థాపకుఁడే యయోధ్యలోనివాఁడైపోయి శ్రీరాములవారినగరున వైతాళిక కృత్యములో సికిఁ దిగినాఁడు. వేణీసంహారములో స్థాపకుఁడున్నట్టేయుండి శ్రీకృష్ణులవారి హస్తినాపురాగమనోత్సవములో మేళగాండ్రలోఁ జేరుటకు విదురాజ్ఞను దనవారితోఁ జెప్పుచుఁ గథలో వాఁడగుచున్నాఁడు. ఇవి యన్నియు లాక్షణికులు గిరిగీచి నట్లు నడచు కవులచెయ్వులా? ఈ నిబంధనములు మార్గదర్శనము కొఱ కేర్పడిన వని గురుశిష్యసంప్రదాయములలో నుపదేశప్రణాళిక యవిచ్ఛిన్నముగా వచ్చియుండిన నవనవోన్మేషశాలికవిప్రతిభావిలాసములచే నింక నెన్నిప్రయోగాతిశయము లెన్నిచిత్రగతులతో నాటకసృష్టిలో నేర్పడియుండునో యెన్నిరకముల కథోద్ఘాతను లుద్భవిల్లియుండునో మఱియు నెన్నిక్రొత్తరచనలు వీనితాతలవంటివి కవికోకిలరుతములై యుండెడివో.

అలంకారలక్షణములు:—ఏయలంకారముల లక్షణము లెక్కడ నన్వయించునో ఆయలంకారము లచ్చటఁ గలవని చెప్పుకొనుచుఁ దృప్తిపడుట మనవిద్యార్థుల కలవాటు. లక్షణములు సమన్వయించినంతమాత్రమున నలంకారము లెల్ల సమానములు కావు. అనేకకవుల కల్పనలలోని తారతమ్యములం బట్టి యందము లెచ్చుతగ్గులఁ గాంచుచుండును. అట్టియందములు మనస్సుల కెక్కినప్పుడే చదువరిచదువు సార్థక మగు. ఆచమత్కారము ననుసంధానము చేయఁగలుగువాఁడే మరలఁ దనరచనలో నయ్యందము నప్రయత్నముగఁ బడినదానిని గాంచఁగలఁడు. చమత్కారజనకత్వ మలంకారసామాన్యలక్షణ మనునిరూపణమునకు ఫల మప్పుడే కలుగును. ఉపమాదులు కాళిదాసాదుల సూక్తులలో నుండును. సాధారణకవులమాటలలోఁ గూడ నుండును. లక్షణములు సమన్వయించును. అంతమాత్రమున నివియు సమము లగునా?

కొన్నియలంకారములు లోకోక్తిరూపములై యత్యంతహృద్యము లగు. వానివలె నప్రసిద్ధములైనవియు గ్రంథమాత్రదృష్టములు నైనవియు మంజుళములు కావు.

| | |
|---|---|
| హరిఁ జూడం బడసి లోచనము లమృతం బానినమాడ్కి...... నెట్టన నిట్టియట్లు మదిఁ దల్పితి రక్షసతాల్చి(జి)... డిం గట్టిన యట్లు | ఉత్ప్రేక్ష |
| కౌంతి యింతకుఁ బనుగ్గు పాలలోఁబడిన బల్లి విధం బున నుండకుండునే? | ఉపమ |
| ఈ యున్న రాజులందఱు ! వాయుసుతున కొక్క యొత్తు వాఁడలిగిన శూలాయుధుఁడు వడఁకు | అతిశయోక్తి |
| పాండు కుమారులు నీతోఁ బొత్తు మని యెదమునఁగా (శ్రీ)రామా కాలొడ్డిన వాఁడి విధము కాదె? | ఉపమ |
| ఇల్లలికినఁ బండు గఁసె బొంగ లాసల్ పొడిచినఁ గోకల్ విడుతు రె? | అప్రస్తుత ప్రశంస |

వీంయందము వేఱు. "సింగం బాకటితో గుహాంతరమునం జేడ్పాటు మైనుండి మాతంగస్ఫూర్జితయూథదర్శనమహోత్సాహంబుతో వచ్చునోజం గాంతారని వాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వచ్చెం గుంతీసుతమధ్యముండు" హంసీవ కృష్ణ తేక్ర్రి స్వర్గంగా మవగాహతే.

అను నుపమలవంటి యలంకారములయందములు వేఱు. కావున నలంకారవిశేషలక్షణములను సమన్వయింపఁజేయుటచేతనే విద్యార్థులపరిశ్రమము సమాప్తినందక చమత్కారజనకత్వ మనుసామాన్యరూప మెచ్చట నేరీతిగ భాషించుచున్నదో పరిశీలించి గ్రహించునంతకుం బ్రసరించినఁగాని కవితా తారతమ్యనిర్ధారణమున స్వాతంత్ర్యావస్థనొంద జాలనలేక పోవుదు రేమో యని భీతి. దీనికి లక్షణప్రపంచ మనపేక్షితనిగానుటచే సంకోచమందవలసి యుండునేమో?

రసభావాదులలక్షణములు :— విభావానుభావసంచారిసంయోగము వర్ణించినంతనే క్రౌంచపక్షిచావుచూచి కలంగిపోయిన వాల్మీకివలె నార్ద్రహృదయుఁడు గానివానిపలుకుల రసము పొసగనట్లు రసభావలక్షణములు రోజనము లన్నదప్పేమి? రసనిరూపణము ప్రస్తుత శృంగారమునకుఁ బోలె రసాంతరమునకుఁ బట్టాభిషేకముఁ జేసినట్లు గన్పట్టదు. మానస మనుపదార్థముయొక్క మార్పులు మున్నగువానిని బాగుగఁ బరిశీలించి మానసవికారములనఁ బట్టి కల్గెడి కాయికవాచికవికృతులను వివరించునది యీరసవిమర్శము.

కాని శృంగారములోని విశేషములను జెప్పినట్లు వీరాదులలోని భేదములను మనలక్షణకర్తలు నిరూపింపరైరి. సంచారిభావముల ననుభావములను జెప్పి యుఁ బునరుక్తిం బోలునట్లు హావభావాదులు మున్నగువాని నెన్నిప్రణాళిక లతోడనో వివరింతురు. ముఖ్యముగ నిది గమనింపుఁడు. ధీర మున్నగునాయి కలు ఇతరనాయికలఁ బ్రేమించి సాపరాధు లగునాయకులమీఁద నెట్లు కోప పడుదురో రతికేళుల నెట్లుందురో అనువిషయముల నాలంకారికులు నాయికా నిరూపణమునఁ జెప్పుదురు.

ఖండితుల ననునయించుపట్ల నాయికానాయకుల చెయ్వులను బ్రపం చింతురు. వీనికన్న నాయికలకు లోఁతిసేఁత లేమియు నుండవా? అట్టిచేష్ట లెల్ల నాయికాస్వభావపరిశీలనముపట్టున నుపయోగింపవా? శృంగారావస్థ లలో మాత్రము నాయికానాయకులను తెగవర్ణించియుంట కేవలభోగపరా యణు లగురాజుల యాస్థానములకు దాసులై యుండుట యనెడి కవులదుర్ద శను వారివిమర్శస్వాతంత్ర్యము నపహరించిన దానిని సూత్రకారులకాలములో వలె స్వతంత్రపరిశీలనగ్రంథముల నిర్మాణమును భరతఖండములోఁ గల్గకుండఁ జేసినదానిని సూచింపదా?

కం. వేఁడికొని కృపణులై కను, పోఁడిమి యదియేల? రాజపుత్త్రులు దమకై
వాఁడిమిఁ దప్పిన నిప్పులు, వేఁడిమి సెడినట్లు జనులు విని యులుకుదురే.

గీ. కొడుకుఁగాంచు రాచకూఁతు రెద్దానికి, నట్టిపనికి నుచితమైన సమయ
మొదవెఁ దడయు టింక నొప్పదు జనములు, నట్లుగాని పురుషు లనరుమిమ్ము.

కం. భుజబలమున జీవించుట, నిజధర్మము మెత్తఁబడుట నింద్యము మాద్రీ
ప్రజలకుఁ జెప్పుము ద్రుపదా, త్మజఁగార్యంబనుగుమనుము తగనందఱితోఁ.

అని కొడుకులకుఁ జెప్పింపుచోఁ గొంతి యేనాయికగా నుండెనో వివరింపవలదా? ఈక్రిందిచోట్ల ద్రౌపది మాట లేభావముల నెట్లు సూచిం చెడినో నిర్ధారణసేయవలదా.

"అంతనయూళులేపురకు నైదు సుయోధనుఁ డిచ్చునొక్కొ యీ
కంతకృపావిహీనమతి నాతఁడు నొంచునె? యన్నదమ్ములఁ."

చ. తనమునుపడ్డబన్నములు దమ్మునిపైఁ గలకూర్మిపేర్మి నీ
జనపతి సైఁపకున్నె యదినక్కున రాజ్యము పాలులేకతీ

ఱన కొడుకుఁబాటు గల్గిన నెఱుంగమి వెట్టరె చాలనైరి పీ
రనరొకా నానతేమి యని యాడరె లోకమువారు కేశవా!
“అచ్చోటన సంగరంబు లగుచోప్పుఁడు పుట్టినన్నైనఁ బాండవుల్
పోటున కిచ్చగింతురొకొ పోదునొ కానలనుండ నచ్యుతా.”

చ. అరయమిఁ జేసి కోడలన కప్పుడు దాసిగఁ జేసె నమ్మహా
పురుషునిపాలికిం బతులు పోవఁగ వీరలతోన యేచు జె
చ్చెరఁజని కోటకంబు దగఁ జేయుదునో యటుగాక పాడిమై
వరవుడ మోసి చేయుదునొ వారికి మాధవ! నిర్ణయింపుమా!

సత్యభామ నరకాసురయుద్ధములో నెట్లు మాటెను. అయ్యవస్థ యెట్టిదని నాయికాలక్షణగ్రంథకర్తలు గ్రంథములు వ్రాయవలదా?

తెలుఁగులో సంస్కృతముం జూచి కావ్యరసభావనాయికానాయకాదుల లక్షణములు వ్రాయనమకట్టినవారిని విన్నకోట పెద్దనను మూర్తికవిని మనమెఱుంగుదుము. వీరు మతింత యాస్థానదాసులు, రసముయొక్క సిద్ధించుటను గూర్చి సంస్కృతమున వేనవేలు విమర్శములు గన్పట్టుచుండఁ గావ్యాలంకారచూడమణిలోఁ గాని కావ్యాలంకారసంగ్రహమునఁ గాని తాదృశవిమర్శములు మందునకైనఁ గన్పట్టవు. వ్యంజనావృత్తి యావశ్యకమా? కాదా? యనుగాఢవిచారణ ధ్వని, ఆలోకము లోచనము కావ్యప్రకాశిక రసగంగాధరము సాహిత్యదర్పణము మున్నగు పొత్తములలో సంపూర్ణముగఁ గన్పట్టుచుండ వాని విచారణ లేశమైన నరసభూపాలీయ కావ్యాలంకారచూడామణులలోఁ గన్పట్టకుండుట మిక్కిలి శోచనీయము.

దశరూపక మీమధ్యకాలమున నాంధ్రీకృత మయ్యెను ఏతాదృశదశకే పాత్రమైనది.

చతుర్థప్రకాశములో ‘విరుద్ధైరవిరుద్ధైర్వా’ అను శ్లోకమును స్థాయిభావలక్షణముగా ధనంజయుఁడు వ్రాసెను. ధనికుండు దనయవలోకమున విపులముగ విమర్శించి విరుద్ధభావసమావేశమునం దెట్లు బాధ్యబాధకభావనిర్వాహమునఁ గవి సమర్థింపవలెనో అవిరుద్ధములగు భావములు గలసినపు డంగాంగిభావముతో నెట్లు సంతరించుకోవలెనో సమానాలంబనవిభావవిరోధము ఆనంతర్యవిరోధము మున్నగునవి యేసందర్భమున నెట్లు పొసఁగింపవలెనో తె

లిపినారు. ఈప్రశంసయే తెలుఁగుదశరూపకమునఁ గన్పట్టదు. మఱియు "వాచ్యాప్రకరణాదిభ్యోబుద్ధిస్థా వా యథా క్రియా వాక్యార్థః కారకై ర్యుక్తా స్థాయిభావ స్తథేతరైః" అనురసవిచారణపట్టున కావ్యనాటకాదులలో రససిద్ధి వ్యంజనాధీనమా తాత్పర్యాధీనమా? ఏలకాదు? అనువిషయములు పూర్వపక్షసిద్ధాంతములతోఁ జక్కఁగా విమర్శింపఁబడినవి. చివరభావ్యభావకభావసంబంధము కావ్యరసముల కని మీమాంసతోడి నిర్ధారణతో విచారణ పూర్తి కావింపఁబడినది. ఇది యించుకయుఁ దెలుఁగుదశరూపకమునఁ గన్పట్టదు.

ఇట్లు విచారణావిహీనములై బంధక, లక్షణవిధానములచేత మాత్రమే పూర్తియగుచున్న లక్షణగ్రంథములు తెలుఁగున నేర్పడుట మఱింత హానికరము. మూర్తికవి గాని చిన్నకోట పెద్దనగాని కృతినాయకుల వర్ణనలయందుఁ దత్పరులైనట్లు కావ్యాలంకారలక్షణ నిర్మాణమున దత్తదృష్టులు కారు. కృతిభర్తలను వర్ణించుట యనుపనిపెట్టుకొని యప్రధానముగా నలంకారాదుల లక్షణములను బ్రతాపరుద్రీయమును జూచి చెప్పుటకుఁ బ్రారంభించినవారీకవులు. వీరియస్పష్టలక్షణముల సమన్వయించుకొనుటయందలి క్లేశ ముపాధ్యాయలోకమున కవిదితముకాదు. ఇట్టిలోపములు తెలుఁగువాఙ్మయమునఁ గవులకుఁ గట్టువాఱుగ నుండక మార్గదర్శిత్వమున వికలములు గాని లక్షణగ్రంథము లేర్పడుటచే దీఱఁగలవు.

ప్రాథమికల్పికులగు వారలకు (అభ్యాసావస్థలోనివారికి) లక్షణగ్రంథములు చేయరాదు. అట్టివారి కాగ్రంథముల యాశ్రయము గోల్పోఁదగినది కాదు. అభ్యాసావస్థను దాటినశబ్దబ్రహ్మవేత్తలు మహాకవు లనంబడుదురు. శబ్దబ్రహ్మవేత్తృత యనఁగా, ఏశబ్దము లేసందర్భమున నేయర్థములో నుపయోగింపఁబడి యెట్లు రసభావవ్యక్తిస్థానములు కాఁగలవో యెఱింగినవారు "యం బ్రహ్మాణ మియం దేవీ వాగ్వశ్యేవా న్వవర్తత" అని భవభూతియు "హఠాదాకృష్టానాం కతిపయపదానాం రచయితా జనః స్పర్ధాలుశ్చే దహహ కవినా వశ్యవచసా." అని బాణుఁడును "యేన మాద్యంతి ధీమంతో మధునేవ మధువ్రతాః" అని దండియు, "శబ్దబ్రహ్మవిదః కవేః పరిణతాం" అని మురారియు "యత్సారస్వతవైభవం గురుకృపాపీయూషపాకోద్భవం తల్లభ్యం కవినైవ" అని మఱియొకరును బరిశీలించి చూచి చెప్పియుండిన యొకమహాకవిపీఠము కలదు;

దానినధిష్ఠించినవారే మహాకవులు. వారే కవీశ్వరులు - ఈశ్వరపదముం జూడుఁడు. కవులనేస్థానముననిల్పెడినో వీరివాక్కులే యౌచిత్యాదిసంపన్నములై లోకము నాకర్షింపఁగలవిగ నుండును. ఇట్టివారికి లక్షణము లాశ్రయణీయములు గావు. దేశకాలములనుబట్టి పరిష్కరణీయము లైనఁ గావచ్చును. ఇట్టిమహాకవు లెప్పుడును బుట్టుచుందురు. ప్రాచీనులలోనే మహాకవులుండి యిప్పటివారిలో లేరనుకొనవలసిన పనిలేదు. "పురాణ మిత్యేవ నసాధు సర్వం నచాపి కావ్యం నవమి త్యవద్యం" అని కాళిదాసుఁ డనెను. కొందఱు మహాకవులకుఁ గూడ లక్షణబంధము లడ్డుకొనుచుండవలె నందురు. అట్టి సిద్ధాంతసంప్రదాయమును నవీనలోకము నిరసించుట దోసఁగు కాదు. సర్వసామాన్యముగా లక్షణనిరసనము కార్య మనుట హానికరము. లక్ష్యవిషయబాహుళ్యరూపమునఁ బ్రవేశము లక్షణములయూఁతలేక యొదవదని మనవిచేసియుంటిని. ఒక మహాకవి యిట్లు చెప్పుచున్నాఁడు. "ప్రవేశఫలమ్ములు చిన్నిచిన్ని వ్యాకరణపుఁ బొత్తముల్ గొణిగి కయ్యము పెంచకుఁడయ్య వాగ్విదుల్."

కాలిలో విఱిగినముల్లుఁ దీసివేయుటకు మఱొకముల్లును కైకొనవలెను. ముల్లు పైకివచ్చిన పిమ్మట రెండుముండ్లను దూరముగఁ బాఱవేయవలెను. వేదాంతమునఁ జెప్పుచుండెడి యియ్యుదాహరణము ప్రకృతమునఁ గూడఁ బనికి వచ్చునట్లున్నది. లక్ష్యప్రపంచపరిచయము దార్ఢ్యము నందునంతకును లక్షణముల నుపాసించవలెను. లక్ష్యప్రవాహమున గాలూని నిల్వఁడఁ గాంచిన పిదప లక్షణప్రామాణ్యదృష్టి యనుబంధమును వదల్చుకొని స్వతంత్రుఁడై వాఙ్మయ స్రష్టయై కవిబ్రహ్మ యనిపించుకొనవలెను. వాఙ్మయమును బట్టి జీవలోకయాత్ర మాఱుచుండును. కాన వాఙ్మయస్రష్ట లోకస్రష్ట యగుచున్నాఁడు. కనుక కవిబ్రహ్మ యనఁబడెడి. అట్టిబ్రహ్మత్వము దేశకాల పరిజ్ఞానపురస్సరముగానే కాలమున కెట్టివాఙ్మయ మెట్టిరీతులతో నవసరమో కనిపెట్టి గ్రంథనిర్మాణకార్యభారమునఁ బాల్గొనినఁగాని సార్థకము కాదు కదా చూడుఁడు. మమ్మట భట్టుగారు వ్రాయుచున్నారు. "నియతికృత నియమరహితాం హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం..........................నిర్మితి మాదధతీ భారతీ కవేర్జయతి.

సారాంశము: ప్రాచీనలక్ష్యములలోని యందములను సంగ్రహముగను సులువుగను దెల్పుట కేర్పడినవి కాన లక్షణగ్రంథములు భావిలక్ష్యప్ర

పంచ నిర్మాతలగు కవుల స్వాతంత్త్ర్యము నపహరించునది గాక మార్గదర్శకమై యుండవలయును. ఔచిత్యవిదులగు బహుసద్గ్రంథకర్తలయు మహాకవులయు గొప్పపండితులయుఁ బోకడలు లక్షణ పరిష్కరణక్షమము లౌకప్పుడు కావచ్చును. తెలుఁగున లక్షణగ్రంథములు తక్కువ. సంస్కృతప్రతాపరుద్రీయ సాహిత్యలక్షణగ్రంథములు, కావ్యాలంకారసంగ్రహము, కావ్యాలంకార చూడామణి, వేపను వేంకటరామశాస్త్రిగారి కావ్యాలంకారమును గలవు. కాని సంపూర్ణములు కావు. కాన సంస్కృతమునుండి యాంధ్రులు లక్షణగ్రంథములను దీసికొనవలసినవారై యున్నారు. ఇట్టియెడ సంస్కృత లక్షణములను దూచాపోకుండ నాంధ్రీకరించుకోవలసినదా? సంస్కృత లక్షణగ్రంథముల నవలంబనములుగఁ జేసికొని క్రొత్తపద్ధతులతోఁ దెల్గున లక్షణములు నిర్మించుకోవలెనా? అని పరిశీలనము చేయవలయును. కావున దశరూపకము మున్నగు నాటకలక్షణములలోనను గావ్యాలంకారాదుల లక్షణములం దెల్పెడి లాంతిగ్రంథములయందును గొన్ని చేకొనవలసినవియుఁ గొన్ని వీడఁదగినవియుఁ గన్పట్టెడిని. వానిని బరిశీలించి విచారణలమీఁద నేదోపద్ధతిని నిర్ధారణ చేసికొని యాంధ్రవాఙ్మయమున సముచిత గ్రంథనిర్మాణమునకై కవులు గడంగవలయు ననుకొనుచున్నాను. నానేర్చుకొలఁది లక్షణ గ్రంథములలో స్వల్పముగఁ జేసినపరిశీలనమున హేయోపాదేయ విషయ విభాగము నాకుఁ దోఁచినట్లు మనవిచేసికొనుచున్నాఁడను. దీనిపర్యవసానమేమనఁగా- ఆంధ్రవిశ్వవిద్యాలయ సంస్థల ననుసరించి దేశభాషలలోఁ బరీక్షలును బాఠ్యగ్రంథములును నిర్ధారణ చేయవలసివచ్చినపుడు సాహిత్యలక్షణ స్థానమున నెల్లప్పుడును ముద్రణాదిలోపములవలనఁ దప్పులతడకలుగా నుండి లక్షణవిశదీకరణమునకై వ్రాయఁబడియుండని యేకావ్యాలంకార చూడామణినో యేనరసభూపాలీయమునో తేపతేపకును బెట్టి విద్యార్థులతోఁపాటుపాధ్యాయులనుగూడ విసికించెడి దుర్దశ మనకుఁ దొలగున ట్లాంధ్రకవులు లక్షణ నిర్మాణము చేయవలయును. అట్లు చేయునప్పుడు సంస్కృతములోనివాని నెల్ల దెచ్చిపెట్టక ద్వీపాంతర సాన్నర్గాదులచే బహువిధవిజ్ఞానముల కాటపట్టులైన మేధావుల కనుమతములగు సంస్కారములఁబడసి పురోభివృద్ధి కడ్డునదిగాక యుండు లక్షణసంస్కారములచే నాంధ్ర భాషాయోషకు సొగసుసేయుదురుగాత యాంధ్రలోకాభిమానులు అని-

# గ్రంథస్వీకారము.

1. స్వప్నసందర్శనము—కర్త- కవిభూషణ కవిరాజ రాజా వత్సవాయ వేంకటనీలాద్రిరాజుగారు, తుని.

వెల రు 0-2-0 చిన్నపొత్తము. చక్రనిబోధ. మచ్చునకు రెండుపద్యములు.

చ. నిగమపథంబు సద్గతికి నిచ్చెన దానికి మెట్లు నాలుగై
తగుఁ; దగ మూఁడిట న్నడచి తత్వమసీత్యుపదేశవాక్యమై
మిగిలి తనర్చుచున్న తుది మెట్టువయిం బదమూఁది యెన్నఁడుం
మగుడనిచోటు గానఁదగు మానవులై జనియించువారికిన్.

ఉ. వేయును మాటలేల? కలవిత్తము చిత్తము నప్పగించి నా
రాయణపాదపద్మ శరణాగతి సేయుఁ డటన్న నంత కృ
ష్ణాయని పాఱుతెంచి గగనంబునకేగె విహంగరాజమ
త్యాయతసవ్యపక్షమున నల్లన వంగి పునఃప్లుతంబునన్.

2. త్రిపురసుందరీస్తవము—కర్త- సత్యవోలు సుబ్బారావుగారు, ప్రకాశకులు- కేసాప్రగడ సూర్యనారాయణగారు.

సుమారు 30 పద్యములుగల చిన్నిపొత్తము మచ్చునకు రెండుపద్యములు.

చ. ఇల నినుఁగొల్చువారలకు నెప్పటికైనను నీకు సత్కృపం
గలుగక పోవునా సుగతి క్రన్నన నింతకు నీప్సితార్థముల్
నిలుచును మంచిచెడ్డలును నిల్చునె ధాత్రి ధనంబు మేను ల
జ్జలఁగను మమ్ము యోత్రిపురసుందరి శాంకరి యోమహేశ్వరీ.

ఉ. స్నానము సంధ్యయుం దపము సత్యము నిత్యము తీర్థయాత్రలుం
బూని యొనర్చు పుణ్యులకు మోక్షము నిత్తువుగాని యేలనీ
ధ్యాన మొకప్డునుం సలుపనట్టి జడాత్ముల కెందుకిత్తు వీ
క్షోణిని మోక్షమో త్రిపురసుందరి శాంకరి యోమహేశ్వరీ.

3. శ్రీవేంకటాద్రీశ్వరశతకము—కర్త- సత్యవోలు సుబ్బరాయకవిగారు,
ప్రకాశకులు- బుద్ధవరపు జగ్గరాజుగారు.

శార్దూలములు మత్తేభములుఁ జేర ౧౦౯ పద్యములు. రెండుమచ్చుపద్యములు.

మ. స్థిరతం గీర్త్యపకీర్తులేఁ బలుచుఁ బృథ్విన్ దేవ యెవ్వానికిన్
మరి కర్మల్ నెరవేర్పఁగాఁ దగిన జన్మ బద్ధి యుద్దాపరై
సిరియున్ సంతతి బంధుమిత్రులెపుడున్ జేరంగరా రేరు సు
స్థిరమా నీపదభక్తి, ముక్తి, నిడుమా శ్రీ వేంకటాద్రీశ్వరా. ౨౮

శా. ఈవే రాముఁడవా ధనుర్ధరులయం దీవే మృగేంద్రుండ వా
దీవే పావకుఁ డీవె పర్వతములం దీవే గనన్మేరువా
దీవే మత్స్యములందు మేల్మొసలివా దీవే గదామన్మథుం
డీవే వాసుకి బండితుం బవనుడీవే వేంకటాద్రీశ్వరా.

రెండుపుస్తకములలో నచ్చుతప్పులు మెండుగఁ గలవు.

ఈపుస్తకములు కాకినాడలో కవిగారియొద్దనే దొరకును.

---

4. ఆంధ్రమేఘసందేశము—కర్త- వడ్డాది సుబ్బరాయకవిగారు, (1931 సం॥ బి. ఏ. పరీక్షకుఁ బఠనీయము.) ఇందు మొదట (1) కీ॥ శే॥ వేదము వేంకటరాయశాస్త్రిలుగారును (2) కీ॥ శే॥ సత్యవోలు సోమసుందరకవిగారును, (3) కీ॥ శే॥ వన్నాల సీతారామబ్రహ్మశాస్త్రిగారును నీపుస్తకముం గూర్చి వ్రాసిన సదభిప్రాయములు గలవు. మొదటిపద్యము.

మ. ఒకయక్షుండు ప్రమత్తుఁడౌటను నిజోద్యోగంబునం దద్విభుం
డొకయేఁ డింతినిబాసి యుండు మన, శాపోద్వృత్తిఁ బొందెడి జా
నకి నీరాడిన పుణ్యవారి సురపున్నాగావనీజాళి దృ
ష్టికిఁ బాత్రం బగు చిత్రకూటమున నుండెం దద్వనివాటులన్.

వెల రు 0-8-0 కవిగారియొద్ద రాజమహేంద్రవరములో దొరకును.

---

5. అచ్చతెలుఁగు ఋతుసంహారము—కర్త చింతపల్లి రామకృష్ణమూర్తిశాస్త్రిగారు (ఈమని-గుంటూరుజిల్లా) దీని తరువాయిని వచ్చు 6, 7, పుస్తకములును నీకవిగారు రచించినవియే. ఇది సంస్కృతఋతుసంహారశ్లోకముల కచ్చతెనుఁగుపద్యముల పుస్తకము—రెండుమచ్చుపద్యములు.

ఉ. విరిగయిసేఁతలన్ వలపువెల్లువ గుబుల్కొను కీలుగంటులున్
గరముఁ దనర్చు నల్పగరుగందము నెల్లెడఁ బూయు మేనులున్

బరఁగు మిటాక్షురే మొదల మాటికి మబ్బుల నద్దు లాలకిం
చురవడిఁ బెన్నవా రిరవుచుండి తొలంగిరి సెజ్జగేముకుర్. వర్షర్తు- ౮౦

చ. అదటున బద్ధకంబుగల యల్ల మిటారపుఁదీఁగెఁ బోండ్లచేఁ
గుదురగు కారుగుబ్బలను గుంకుమపూవుఁ బ్రేంకణంబుచేఁ
బదనుగ స్రావపఱ్పనను బన్నదుపంబను మేలికస్తురిన్
గదిసిన మంచిగంధముఁ దగన్ గులుకంబడుచుండె నంతటన్. వసంతర్తు-

విపులార్థసంస్కృతభావములను పరిమితశుద్ధాంధ్రపదములలోనికిఁ దెచ్చుట యిక్కాలమునఁ బొగడఁదగినవిషయము. వెల రు 0-8-0

---

6. ఆంధ్రస్తోత్రమణిత్రయి. ఇందు (1) శ్రీలక్ష్మీనృసింహస్తోత్రము (2) గోవిందద్వాదశమంజరికాస్తోత్రము. (3) గోవిందచతుర్దశమంజరికాస్తోత్రము ననునవి మూఁడుగలవు. శ్రీలక్ష్మీనరసింహస్తోత్ర మంతయు నకారప్రాసయుతము లగు 25 ఉత్పలములు. అందొక్కపద్యము.

ఉ. అఖిలేంద్రియాహ్వయ మహాబలచోరులచేత రాగసం
ధానత నంధుఁ డౌటను హృతప్రవివేకమహాధనుండ న
జ్ఞానదురంధనంతమసనక్తి మహావినిపాతితుండ ల
క్ష్మీనరసింహ నాకొసఁగుమీ మహనీయకరావలంబనమ్.

తక్కినరెండును దేటగీతములతో నిండినవి. మచ్చునకు-

గీ. ఎవతెనీ కాంతనీపుత్రుఁ డెవఁడునీవు, నెవరు? యెటనుండివచ్చితి యిందియుడుగులఁ
జిత్రతరమైనసంసృతి చెడకశ్రద్ధ, లోన తత్త్వంబెఱుంగు భ్రాంతుఁడవు కాక
మరణకాలము రా దుష్కృతాకారణమింత, బ్రోవదచ్యుతుభజియింపు మూఢబుద్ధి!
(ద్వాదశమంజరి.)

గీ. అగ్నిరవుల గ్రపృష్ఠంబులందుఁ గలిగి, చుబుకయుతజానుఁడై రాత్రి నొక్కచున్నఁ
గరతలపుభిక్ష వాసంబు తరుతలమున, నైననాశామహాపాశ మతనివిడదు.

ఈపుస్తకము వెల రు 0-2-0  సుబోధుఁడు.

7. ఆంధ్రబాలరామాయణము- కర్త-పైవారే- వాల్మీకిరామాయణము లోని మొదటి యధ్యాయమునందలి సంక్షేపరామాయణమున కిది తెనుఁగు. అన్నియు గీతపద్యములలో నిముడ్చిరి. మచ్చుచూడుఁడు.

గీ. యౌవరాజ్యాభిషేకత నలరఁజేయ, నిచ్ఛయించెను దశరథనృపతిప్రీతి
నటు జరుగుటెంచి సతి దేవి యైనకైక, రామునభిషేకసంభారరాశిఁజూచి
పూర్వపరిదత్తవరయాట బూనితాను, దశరథేశ్వరుఁగనియీవిధమునఁగోరెఁ
జనుట రాముఁడువనవివాసంబుసేయ, భరతునకునభిషేకంబుజరుపుట" యని

వైమూఁడుపాత్రములను సంస్కృతశ్లోకములతోఁగూడఁ బ్రకటించి యుండినచోఁ జదువుకొనువారికి భాషాంతరీకరణాదులు సులభముగ బోధపడుచుండెడివి.

8. ఆత్మార్పణము—కర్త- తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు. కావూరు, గుంటూరుజిల్లా. ఇందలికథ భారతము శాంతిపర్వములోని లుబ్ధకకపోతచరిత్రము- ఇది యొకప్పుడు భారతీపత్త్రికలలోఁ బ్రకటింపఁబడినది. దానిని ప్రత్యేకముగాఁ బుస్తకరూపమునఁ బ్రకటించిరి. ఇదివఱలో నీకథ ననేకులనేకవిధములఁ బద్యరూపమున రచించిరి. వారిలో వీరి దొకత్రోవ. చక్కని కాగితములమీఁద మంచియచ్చున ముద్రింపఁబడినది గాని, పద్యములపేళ్ళుగాని, సంఖ్యగాని చూపఁబడకపోవుట కొంతపాఠకులకు శ్రమను గల్గించును. మాకుఁ బంపినప్రతిలో ముద్రణమునందు గొన్నిసవరణ లున్నవి. ముఖపత్త్రము లేదు. వెల లేదు. దీనింబట్టిచూడ నింకను బుస్తకములు ప్రచురింపఁబడలేదని తోఁచుచున్నది. కవిత్వము ధారాళముగానున్నది. సాధ్యమైనంత నిర్దుష్టముగానున్నది ఒక్కపద్యము చూడుఁడు.

సీ. శబ్దార్థములభంగిఁ జంద్రికాచంద్రుల ట్లనోన్యస్యమైత్రి నొప్పారుచున్న
మనకాఁపురంబుఁ గన్గొన మాలవిధికెంత కన్నుగుట్టెనొ జగత్కంటకునకు
అడవి మేఁతల మేసి పడియనీళులఁ ద్రావి పరులసొమ్ముల కాసపడక యొరుల
కొకకీడుఁజేతయు నొనరింపక మెలంగు మనజీవితము దైవమున కదెంత
భార మయ్యెనొ పావంబు పండెనిట్లు
విధివిధానంబు నెదిరించువిధము గలదె
కటకటా నేఁటి కెట్టిసంకటము వచ్చె
నెట్లు దీని భరింతు దిక్కెవ్వ రబల.

9. శ్రీవైష్ణవతిరుమాళిగ-కర్త- శ్రీ॥ శే॥ ఎ౯-సూరత్తాళ్వారు అయ్యంగార్-(తిరిచినాపల్లి సెంజోసెఫ్ కాలేజి తెలుఁగుపండితుఁడు) "ఇదియొక భారత సంప్రదాయగ్రంథము. ఇందు యజమానుని దినచరి, ఇంటియందలివారలు తనయిష్టానువర్తిగ నడచునటులఁ జేయుట, విద్యాభివృద్ధి స్త్రీబాలవృద్ధవివక్షత లేక అందఱును సకాలక్రమముగ నధ్యయనముచేయుట మొదలగువిషయములచే మృదుమధురశైలియందు వ్రాయఁబడియున్నది. భారతవిలక్షణమును దెల్పును. ఇది భారతీయు లందఱుఁ జదువఁదగిన గ్రంథము. అందఱికి సాక్షుగలదు" అని ప్రకాశకులు వ్రాసిరి దీనివెల రు 0—2—0 ఎ౯. కే. పక్షుళాభరణముగారు, 22 పచ్చయప్ప మొదలివీథి, కోమలేశ్వరముపేట, చెన్నపురిలో దొరకును.

---

10. పతివ్రతావిభవము- ఇదియును బైకూరత్తాళ్వార్ అయ్యంగారిచే రచియింపఁబడినదియే. వెల రు 0-6-0 "ఇది మహాపతివ్రతామహాత్మ్యము. ఇందు పతిభక్తిని ప్రధానముగా గొని ఆవ్రతమును వీలోపములేక ఆముక్త్యంతము జరిపి స్త్రీపురుషుల కిరువురకును బ్రహ్మలోకపదవిని ప్రాపించిన యిరువదినాలుగు పతివ్రతలచరిత్రలను శబ్దకాఠిన్యము వదలించి అన్వయకాఠిన్యమును, కష్టము లగు సంధులను మాన్పి నవరసభరితము లగు శబ్దాలంకారములతోను ప్రసిద్ధలఘుసమాసములతోను దీర్ఘసమాసములను దప్పించి చదువువారికిని రుచికరముగాను మనోహరముగాను విరచింప యత్నించితిని...ఇందు శబ్దదోషములు సాధ్యమైనంతవఱకు రాకుండునట్లు సమర్థింపఁబడును... ఇందలి చరిత్రలు వేదవేదాంతభారతరామాయణపురాణగ్రంథములనుండి యేర్చికూర్చబడినవి" అని కవిగారు తెల్పిరి.

11. బ్రహ్మసూత్రసారసంగ్రహవిమర్శనము:—శ్రీ॥ శే॥ ముట్నూరి గోపాలదాసుగారిచే రచియింపఁబడినది. దీని పీఠికలో గోపాలదాసుగారు "శ్రీవేదవ్యాసవిరచిత బ్రహ్మసూత్రములకు శ్రీశంకరయతీంద్రులవారును, రామానుజాచార్యులవారును భాష్యమును వ్రాసియున్నారు... వేదాంతతీర్థ వేదాంతవాచస్పతి...శ్రీమాన్ కందాడై శేషాచార్యులుగారును, రాయబహదర్ శ్రీముద్దల్లూరి జగన్నాథరావుగారును సరి అయిన ఆంధ్రవ్యాఖ్యానము వ్రాసియున్నారు. వాటిని నేను కొంతవరకు చూచినాను. అందు రామానుజాచార్యులవారు

వ్రాసిన వ్యాఖ్యానములో వదిసర్వోపనిషత్తులచేతను పరబ్రహ్మమని ప్రతిపాదింపఁబడి అద్వైతులచేత కొనియాడబడుచు అనేక గ్రంథరాజములందు వ్రాయబడియున్న ప్రత్యగ్భేతన్యమును చేతనుడైనను అనంతదుఃఖములకు పాత్రుఁడై దాదాపుగా ఒకమిడుగుడుపురుగువలె ఉపమాన మిచ్చి, ప్రత్యగ్భేతన్యమునకు పరబ్రహ్మమునకును సంబంధములేదని వ్రాసినారు. జీవేశ్వరులకుగల భేదశ్రుతు లన్నియు యీప్రత్యగాత్మపరమాత్మలకు సమన్వయించి వ్రాసినారు. చాలావిపరీతము తోచబడి నేను యీసూత్రములకు తగిన అర్థమును శ్రుతిస్మృతుల చేతను వ్రాసియున్నాను." అను మొదలైనవి లిఖించిరి. గోపాలదాసుగారు తమరు రచియించిన యీగ్రంథము ముద్రణములో నుండఁగనే కాలధర్మమునొందుటకు మేమెంతయు చింతిల్లుచున్నాము. కాకినాడ ముట్నూరి చిదంబరశాస్త్రిగారియొద్ద దొరకును. దీనివెల రు 0—8—0.

12 రామనిర్యాణము- నాటకము. గ్రంథకర్తలు బ్ర॥ రామకృష్ణసుబ్రహ్మణ్యకవులు. (గారావర్ప్యుల రామకృష్ణశాస్త్రిగారు, అక్కపెద్ది సుబ్రహ్మణ్యశాస్త్రిగారును) వీరు తిరుపతి వేంకటేశ్వరకవుల శిష్యులఁట. వీరిలో సుబ్రహ్మణ్యకవిగారు సంగీతసాహిత్యములను, అవధానప్రజ్ఞను గడించినవారు, చిత్రపుకాగితపుబనులు, అర్ధోదయములు, వేణుగానము, మొదలగునవి గురుశుశ్రూష చేయకయే నేర్చిరఁట.ఎంతటికఠినపద్యమైనను వినినంతనే మరలఁ జదువఁగలనేర్పుగల్గినవారఁట. ఇట్టి మేధాశాలి కీర్తిశేషులయినట్లు తెలియుచున్నది. ఈనాటకము 5 అంకములు గలది. ప్రత్యంకమున రంగవిభజనము చేయఁబడినది కథ పేరువలననే తెలియవచ్చును. ఉత్తరరామాయణము. ఇంద్రాదిదేవతలు శివుఁడు మొదలగువారు రాముని వైకుంఠమునకుఁ గొనిపోవ యత్నించుట. యముఁడు మునివేషమున రామునికడకువచ్చి బ్రహ్మరహస్యమును జెప్పుట. ఆమాట లితరు లెవ్వరు వినఁగూడ దని ముని చెప్పుట. రాముఁడు—

చ. శరణని దేవదేవుపదసారసయుగ్మకు నంటుగాక సా
గరమునఁ గ్రుంకుఁగాక సురకాండమె యుద్ధము వచ్చుఁగాకమే
మిరుపుర మాకుమాటయి నొకించుక విన్నను గన్నవాని మ!!
త్సరనిశితాసిధారలను ఖండనఁజేతు దయానిధీ వరా.

అని ప్రతిజ్ఞ చేసి లక్ష్మణుని ద్వారముకడ నెవ్వరును రాకుండఁ గాపుంచుట. అంతలో దుర్వాసముని వచ్చి రాముని జూడఁగోరుట, లక్ష్మణుఁడు మునికోపమునకు వెఱచి రామునొద్దకు రహస్యసమయములో నేగుట మొదలుగాఁగల కథ యిందువర్ణింపఁబడినది. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించిన సందర్భోచితములగు కీర్తనలు తుట్టతుదఁ జేర్చినారు. కవిత్వము సందర్భోచితముగ నున్నది. "పాటలాధరరంభఁ బంపఁగావలె నాకుపడకకనుచు" రాక్షసుఁ డన్నను మోటుగానే కనఁబడుచున్నది. "తనవిడిదికి రంభ ననుపవైతి" అని కిగ్గాడియసుర చేత సూరన్నగారు గూఢముగాఁ బల్కించిరి. అభిప్రాయభేదము లుండవచ్చును. శ్రీరామనిర్యాణము విషాదాంతము కాకపోదు.

ఉ. తమ్ముఁడవైతి పుట్టుకను దాసుఁడవైతివి సేవచేతఁ గా
ర్యమ్మొనరించుపట్లఁ బరమాప్తుఁడవైతివి రాజనీతి వా
క్యమ్ముల నాలకించుతఱి నైతివిశిష్యుఁడ వట్టినీదుకం
ఠమ్మును జేతులార నకటా వధియించి సుఖింపనేర్తునే.

ఇందుఁ గంఠమ్మును వధియించి యనుటకంటె "తెగవ్రేసి" అనుటయుక్తమేమో.

మ. హరకోదండవిఖండనోద్భవజయశ్యామామనోహారిభా
స్వరహస్తగ్రహణోత్సుకాయ విభవే సద్భక్తహృద్వాసినే
ధరణీజాకుచకుంభలిప్తవిలసత్కస్తూరికాసౌరభో
త్కరసంవాసితవక్షసే నమ ఇదం కల్యాణసుధాయినే.

చ. వయసు గతించె నీధరణిభారముఁ దాల్పఁగశక్తిలేదు ని
ర్దయ నిదె మృత్యుదేవత కరాళము విప్పి గ్రసింపనుండె నా
ప్రియమగు తమ్ముఁడా మడసెఁ బెద్దలుగూడ నసించిరింకనో
నయవిదులార యేలఁదగు న్యాయము దప్పక కోసలావనిన్.

మ. అదియే కోసలదేశభూషణ మయోధ్యాపట్టణోత్తంస మ
ల్లదియే రామనివాససౌధ మవె రథ్యల్ వాంలే పౌరు ల
ల్లదె మత్తేభతురంగగోష్ఠ మదె క్రీడారామ మయ్యారె నా
కిది దర్శింపుటకన్న భాగ్యమిఁక వేఱేలేదు తర్కింపఁగన్.

"బలిమి ధన్వంత్రిని బాధించు" "ఏఘనురాత్రిఁ బవళ్లు ప్రశంస సేతురు" ధన్వంతరి యనియు రాత్రిందివములు అనియు నుండినబాగని తోఁచుచున్నది- "కరాళమువిప్పి గ్రసింపనుండె" కరాళమును విశేషణముగాఁ జేయుట మాకిష్టము. "మత్తేభతురంగగోష్ఠము" మత్తేభములను దురంగములను గట్టునవి గోష్ఠములనుట ప్రౌఢమేమో కాని స్థలోచితముగానుండునా! "తారకలే రసబుద్లుగాఁగ" ఇందుఁ బ్రమాదముండవచ్చును.

కవులు "మేమీపొత్తమును వ్రాసినవెంటనే యచ్చొత్తింపుట తటస్థించినది. దానిచే దీని నితరకవులకుఁ బండితులకుఁ జూపి లోపాలోపములను సవరించుకొను నవకాశము లేకపోయిన దనిరి. కావున మాకు సందేహములుగానున్న తావులు సూచించితిమి.

ఈగ్రంథము కావలసినవారు గుంటూరుజిల్లా, అనంతవరము, రామకృష్ణ సీతారామకవులకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

వెల 0—12—0.

# విజ్ఞాపనము.

ఈసంచికతోఁ బాఠకులకు 18 వ సంపుటములో మూఁడుసంచిక లందియుండును. దయచేసి తాము పంపవలసిన చందాలను వెంటనె పంపుదురని కోరుచున్నారము. అందఱుకుగూడ నొక్కొక్క సంవత్సరముచందా తప్పక పంపినచోఁ దత్కాలమునఁగల యిక్కట్లుగొన్ని పాయును. పాఠకులభాషాభిమాన మీసమయమున విశదము కావలయును.

కా॥ అ॥

ముసలముద్గరశూలములు మాన్పి చకుమకీ బందూఖులుధరింపఁ బాటిసేయు
పరుస గీర్వాణము ల్వదలించి వేవేగఁ దురకమాటలు నేర్పు కళకు మీఱి
మీరు దేవత్వము వహించి మీ(ఱలేరు)
*మీరలునునొండు విధమున రాదు, భద్ర. ౬౮

సూకరరూపంబు సూచనవినిగదా విడిచిపెట్టిరి మిమ్ము వెరవెఱిఁగి
బలి బిచ్చమెత్తిన బాఁపండ వని కదా విడిచిపెట్టిరి మిమ్ము వెరవెఱిఁగి
డిల్లీశ్వరునకైన యల్లుండ వని కదా విడిచిపెట్టిరి మిమ్ము వెరవెఱిఁగి
పాఱిపోయెడివారిఁ బట్టరాదని కదా విడిచిపెట్టిరి మిమ్ము వెరవెఱిఁగి
కాకయుండినఁ దురకలఁ గడచిపోవ
గలరె మీవంటివారలు క్రమముతోడ, భద్ర. ౬౯

శేషావతారవిశేష మెక్కడఁబోయె లక్ష్మణార్యునకు సలక్షణముగ
శంఖచక్రాన్వయసజ్జ యెచ్చట జెల్లె భరతశత్రుఘ్నుల కరయ భువిని
లోకమాత్రాఖ్య యేలోకంబులకుఁ జేరె భూపుత్త్రికిని నెన్న భూమిలోన
నాదినారాయణాహ్వయ మదెందులకేగె రామాఖ్యగల మీకు రమణతోడఁ
దురకలెల్లను దొరవని సరకుగొనక
మండపాగారముల మట్టుమసలి రహహా, భద్ర. ౭౦

చెక్కులం నిమురక సీతోర్మిళాదులఁ గని యూరకుందురే మనసునిలిపి
పాఱిపోవఁగనైనఁ బట్టెలు నాకక విడుతురే వైష్ణవవితతినెల్ల
బందూకులు బుజాలపై నిల్పి కొనిపోక (యరుగ) నిత్తురె వసిష్ఠాదిమునుల
ముక్కులుగ ఱవనీ మును మొనగట్టి పోనిత్తురే కపినాయకోత్తములను
మొగలుబచ్చాల కగపడఁదగదటంచుఁ
దొంగిపోయితి రిఁక నేటిదొరతనంబు, భద్ర. ౭౧

పురలక్ష్మి నురవడిఁ జెఱవట్టి గిడులో వనలక్ష్మి కరపల్లవములు నులిమి
గంగను గదిసి వేగమె ధైర్యలక్ష్మిఁ జేకొని ధనలక్ష్మి చెట్టవట్టి
రాజ్యలక్ష్మిని సంగరమునఁ బెండిలియాడి ధాన్యలక్ష్మిని సరదార్ల కిచ్చి
ఘనగజాంతలక్ష్మి గైకొని వేవేగఁ గీర్తికాంతకుఁ గులగిరులొసంగి
నట్టి "దంసాను" శిక్షింప నలవిగాక
యడుగుకొంటివి నృపతులఁ గడుపుకొఱకు, భద్ర. ౭౨

*మీరలను యొండువిధమున ననరాదు. -మూ.

హరువిల్లు విఱువక వరపుత్రి నియనన్న జనకరా జేమి విచారపడెనో
పరశురాముని భంగపఱుపఁగా నొచ్చిన దశరథుఁ డేరీతిఁ దల్లడిలెనో
మిముఁ గాపుచేసి యాగము పూర్తిచేసిన కౌశికుఁ డేమివ్యగ్రతగొనియెనో
వనరాశిఁ గట్టి రావణుఁ ద్రుంచఁగఁ బిన విభీషణుం డేరీతి వెగడుపడెనో
తురకబలకోటి(గాంచి) యూతురతఁ బోల
వరము వేంచేసినట్టిదుర్వార్త వినిన, భద్ర. ౬౩

వరుసఁ గోడలి దురవస్థలు విన సారెఁ గౌసల్య యేగతి గాంచెనొక్కొ
మీశ్రమ మెల్ల సుమిత్ర యాలించి గాసిలి దుఃఖవారాశిఁ జేరెనొక్కొ
కలకాల మీరీతిఁ గడపఁగాఁ గాలంబు విని విందు లేమని వెఱచిరొక్కొ
గతకాలమునఁ బండ్లు కానుక లిచ్చిన శబరి యేగతిఁ జింత సలిపెనొక్కొ
యహహ భద్రాద్రినుండి మీరరిగి పోల
వరము వేంచేసినట్టి దుర్వార్తవినియు, భద్ర. ౬౪

ఆదిభిక్షునిఁ బెండ్లియాడిన పార్వతి కన్నవస్త్రముల కేమాపదయ్యెఁ
గోరి బావనిఁ జేసికొన్న సరస్వతి కిడుమలు వచ్చెనే యిల్లు లేక
కాళ్ళు లేనిఫణీంద్రుఁ గట్టికొనిన యుర్వి కూరు లేదాయెనే యుండుటకును
దనువు లేని వయారిఁ దగిలిన రతిదేవి సుఖపడ దాయెనే సురలు మెచ్చ
బళిరె మీవంటిప్రభు చెట్టపట్టి సీత
సకలవెతలకు లోనయ్యె నరవిలోన. భద్ర. ౬౫

పొరుగిండ్ల వెంబడిఁ దిరుగుచునుండులక్ష్మీదేవి కేమపకీర్తివచ్చె
సభలలో నెప్పుడు సంచరించుచునుండు వాణి కేమపవాద వచ్చెజగతి
వేలార్లు మనువుల కాలయమైయున్న భూదేవి కేమితప్పులు ఘటిల్లె
శివునిఁ బాసి సముద్రుఁ జెందిన పార్వతిసవతి కేమాడిక ల్సంభవించెఁ
దోడు నీడయి మీ వెంట గూడియున్న
సీతదురవస్థ లేమని చెప్పఁదరము, భద్ర. ౬౬

జనకుఁ డిచ్చిన బన్నసర మటంచును జూపి తెల్పు సీతామహాదేవి యిష్ట
జనులతో నూర్మిళ తనతల్లియొసఁగిన పచ్చలతాళని పల్కుఁ బ్రాణ
సఖులతో మాళవి సరవిఁ గెంపులనత్తు గని మురియు, బంధు
వర్గంబులో జాళువావల్వ శ్రుతకీర్తి మేనమామయొసంగె మిధిలయందు
ననుచుఁ గొనియాడుఁ బుట్టినింటిఘనత మెఱయ
వారి నేరీతి నోదార్చ వశము మీకు, భద్ర. ౬౭

గుజరాతికెంపులకుండెల్లు చెవుల ధరించదా మోఁ గదయ్య వాంఛదీర
వరుణదేవుఁ డొసంగు వజ్రాలకమ్మలు పెట్టదా మోఁ గదయ్య ప్రేమదీఱ
నలకుబేరుఁడొసంగు నద్దాలఅవికపైఁ దొడుగదా మోఁ గదయ్య యొడలునిండ
గట్న మింద్రుఁ డొసంగు గంటల మొలనూలుకట్టదా మోఁ గదయ్య కాంతదీఱ
వేడ్క దినముల నడవులవెంట (మీరు)
ద్రిప్పితిరి సీత నూరకె తప్పులేక, భద్ర ౬౮

తెచ్చితికీర్తిఁ గీర్తివిశారదులగు నిక్ష్వాకువంశోద్భవఘనులకెల్ల
నేలితి వవనిలో నెలమి శంకరగిరి హానుబాదాలు మహాత్మ్యతముగఁ
దోలితి వరుల హద్దులు దప్పిరాకుండ భక్తకోటికి ముక్తభావ మలర

ఏమి వర్ణింతు మీచారిత్ర మేమనంతు
లోకులెఱుఁగంగ నీమూడు శ్లోకములను, భద్ర. ౬౯

అలపాకశాసను నైనను యాచించి చేయించు ముత్యాలచేరుచుక్క
రమణతోడుత ధర్మరాజుకు దయపుట్ట నడిగి చేయించు ముత్యాలనత్తు
వరుణదేవునినైన వరుసతోఁ బ్రార్థించు కలకొద్దిఁ జేయించుఁ గమ్మజోడు
రాజరాజును (వేఁడు) తేజంబుతోడను నిప్పించు నవరపుఁ గొప్పు ముంచు
పేరపోణుకు లివిమైనఁ బెట్టకున్నఁ
జూపరులకెల్ల నత్యంతచులకఁదనము, భద్ర. ౭౦

ఇల్లు నప్పులగంప యిల్లాలు చలచిత్త పాన్పు నాగులపుట్ట వదినె జెట్ట
గొల్ల పెంపుడుతల్లి కోడలు తాఁగ కూఁతురు పాయుఁబోతు నాతురుఁడు సఖుఁడు
మనుమఁడు తంత్రి కాముకుఁడు కుమారుండు క్షయరోగి మఱఁది వంచకుఁడు తండ్రి
యన్న పానఘనుండు నరయనిష్టుఁడు పేఁడి వేసదారివి నీవు వేయునేల
యిన్నియును నాదు నెమ్మది నెఱిఁగియుండి
కొలిచితిని మిమ్ము విశ్వాసగుణముదలఁచి, భద్ర. ౭౧

పన్నీరుసీసాలఁ బరఁగ నించినరీతి నెనయఁగప్రపుమూ రెత్తుభాతి
వరుసముత్యాలకోవలు గ్రుచ్చినక్రమంబు మల్లెపూసరములు మలఁపుమాడ్కి
విరజాజిపై సుధావృష్టి దోఁగినగతిఁ గస్తూరి వీణెయల్లలుపుపోల్కి.
పరఁగనవదాతు (?) గంపలు పంపినవిధంబు తేనె బానలు తెరల్దీసినట్లు

నీదు నామామృతంబు నానేర్చినంత
గొల్లలాడెద భక్తులు నుల్లసిల్ల, భద్ర. ౭౨

సర్వమొఖాసాలు చాలని మీ కిలఁ గట్టడి నేరీతిఁ గడచెనయ్య
బహ్వవసరముల భక్షించు మీ రెట్టు లొక్కప్రార్థన కోర్చి యుంటిరయ్య
సంగీతసాహిత్యసద్గోష్ఠిగలవార లొంటి మీ రెట్లొదిఁ గుంటిరయ్య
తిరువీధు లెడపక తిరిగెడు మీ రెట్లు కడపదాఁటక ప్రార్థనగడపితిరహా
వాహనంబులపై నుండువారి కకట
రోడపై నెక్కఁగా నెట్లు గూడెనయ్య, భద్ర. ౭౩

పదియు రెండేఁడుల ప్రాయంబువాఁడవై మించుతాటకను శిక్షించు టెఱిఁగి
రణశూరు లగుదైత్యగణములఁ బరిమార్చి కౌశికు జన్నంబు గాచు టెఱిఁగి
తరములఁబట్టి యెత్తఁగరాని హరువిల్లు చెఱకుకైవడి నట్లు విఱుచు టెఱిఁగి
సంగరరంగవిశారదుఁడైన భార్గవరాము నవలీలఁ గడపు టెఱిఁగి
దూఱితిని మిమ్ము రోషంబు దొట్టి రిపుల
మదమడంగించునట్టి సమ్మదమెలర్ప, భద్ర. ౭౪

ప్రారబ్ధ మనుభవింపనిభక్తజనముల యాతనల్ త్రుంపఁగ మీ తరంబె
కారణహేతువికారము ల్తప్పించి యధికులఁ జేయ మీ కయ్యతరమె
మిముఁ దొల్లి పూజించి మీవరంబులు గొన్న ధంసాను గెల్వ మీ తాతతరమె
గతజన్మమునఁ బెట్ట గతిలేకపుట్టిన దీనులఁ బ్రోవ మీ దేవుతరమె
యనుచు జనులెల్ల మిము నాడ వినఁగ లేక
దూఱితిని నాదు నేరముల్ దొలఁగఁ జేయు, భద్ర. ౭౫

ఈతనా ధంసాకు నెదిరి పోరఁగ లేక పాఱిపోయిన రామపార్థివుండు
ఈతఁడా యరికి వెన్నిచ్చి పోలవరంబు దారిఁ జూపిన సుమిత్రాతనూజుఁ
డీబిడా కలసొమ్ము లిచ్చి మ్లేచ్ఛుల బాధ పతికిఁ దప్పించిన పడఁతి మిన్న
యీతఁడా పగదళం బిదె వచ్చె నని చూపి భయముపుట్టించిన పావనియని
పల్లుదురు సామి మిముఁ జూచి ప్రజలు కార్య
పరున మెఱుఁగక కోపింప వలదు తండ్రి, భద్ర. ౭౬

పిఱికివాఁ డంటేఁగా కఱకుదానవులను గర్వ మడంచిన ఘనుఁడ నిన్ను
లోభివాఁ డంటేఁగా లోకంబు లెఱుఁగంగ లంకదానము సేయు రాజ నిన్ను
బలహీనుఁ డంటేఁగా బలిమి సముద్రుని బాణాగ్రమున నిల్పు జాణ నిన్ను

వెట్టివాఁ డంటిఁగా వెరవెఱుంగని క్రోఁతిగములచే వారిధి గట్టివట్టి
మిమ్ము లోకోపకారార్థ మెన్నఁబూని,
దూఱితిని గాక మీవంటి దొరగలండె, భద్ర. ౭౭

అలరుచేలుని చేరఁ డటుకులు భక్షించి సంపద లొసఁగిన సరసగుణుఁడ
గజరాజు మొసలిచే గాసిలి మొఱవెట్టఁ గాచి రక్షించిన కమలనాభ
కలఁడన్నఁ బెన్నుక్కఁగంబంబులోనుండి వడలి బాలుని గాచువీరవరుఁడ
తలఁచిన ద్రౌపదితలఁపువెంబడి మానభంగంబు గాచిన ప్రభువరేణ్య
లోభివంటిని బగరకు లోఁగితంటిఁ
బిఱికి వంటిని నేరక యుఱికితంటి, భద్ర. ౭౮

వగతుఁడై బహుఫణార్భటిఁ జేర వచ్చిన కాళీయుదైత్యుని గావలేదె
సీతను జెఱగొన్న పాతకాగ్రేసరుననుజుని శరణన్న మనుపలేదె
మీశరణార్థియై మెలఁగి కావు మటన్న కాకాసురునితప్పు గడపలేదె

* * * * * * *

పృథివి శరణాగతత్రాణ బిరుదుగలుగు
దొరవనుచు మిమ్ముఁ బలుమాఱు దూఱినాఁడ-భద్ర. ౭౯

పితృకార్యమునకునై పినతల్లి కోరికి వెఱవక తీర్చిన వేల్పు నిన్నుఁ
బదరేణువ నహల్య పాపంబులెడఁబాపి విభునిఁగూర్చిన సత్యవిభుఁడ నిన్ను
దగఁ గన్నఁ బగవానితమ్ముని లంకలోఁ బట్టంబు గట్టిన ప్రభుఁడ నిన్ను
ఘను సుబాహుని బట్టి ఖండించి కౌశికుసవముఁ గాచిన సర్వసముఁడ నిన్ను
భక్తలోకోపకారార్థపరుఁడవగుచు
దూఱితిని నాదు నేరంబుఁ దొలఁగఁజేయు-భద్ర. ౮౦

చిలుకకు మాటలు చెప్ప రామాయని చేడియ మోక్షంబు చెందలేదె
వరుస దారులఁదోఁచి వాల్మీకియు మరమరాయని మీకృపఁ బ్రబలలేదె
పతిశాపగతినుండి పాదరేణుప్రసక్తి పాషాణమింతియై పరఁగలేదె

* * * * * * *

పృథివి శరణాగతత్రాణబిరుదు నీదె
కాక యితరుల కెందైనఁ గలుగఁ గలదె-భద్ర. ౮౧

కందెనేమో నాదుకఠినచిత్తమునందు నిలిపిన నీపదనీరజములు
అంటెనేమో నాదునఘలేశ మాత్మలో సంచరింపఁగ మేనఁ జమటలూరి

సోఁకెనేమో నాదుచుఱుకులోఁజూపులఁ జూచుచుండఁగముఖసుందరంబు

*      *      *      *      *      *      *

సామి యిఁక నేరములు నీరసంబు చేసి
కాచి రక్షించు నత్కృప గడలుకొనఁగ-భద్ర. ౧౨

బొల్లలాడితినని కోపింపఁ బోకుఁడీ యవని మీదివ్యనామామృతంబు
వీఁటి.బుచ్చితినని వింతగాఁగనకుఁడీ కృతులందు మీగుణకీర్తనములు
కాడుచేసితినని కంటకపడకుఁడీ మీాటి మీదివ్యకథారసంబు
ఎఱుఁగఁబల్కితినని యెగ్గుగాఁ గనకుఁడీ మహిని మీామర్త్యకర్మంబులెల్లఁ
బంచి పెట్టితి నని కోప గించవద్దు
సరస మీపద్యముల్ చెప్ప సంతతంబు-భద్ర. ౧౩

వేయికన్నులుగల్గు వేల్పుతేనికి నైనఁ గనుఁగొనరాని శృంగారరూప
వేయినోరులుగల్గు పేరులకంటికైన వచింపరాని యనంతనామ
వేయిచేతులుగల్గు వేఁడివేల్పునకైనఁ (బోల్ప) రా నబ్బని పుణ్యమూర్తి
వేయిరీతులుగల్గు వేదంబులైనను బ్రస్తుతిసేయ నేర్పడని చరిత*
తగుదు నని నాదు మూఢచిత్తమున నిన్ను
నిల్ప శక్యంబె నావంటి యల్పునకును-భద్ర. ౧౪

పనిపెట్టితేనొక్క పవనసూడు చనుదెంచి యరిబలంబులను జక్కాడలేదె
సెలవిచ్చితే నొక్కబలిమిచి నీలుఁడు నని విరోధులఁ దెగటార్పలేదె
యానతిచ్చిన నొక్కయంగదుఁ డాసురేఁగి పగతురయసువులు పాపలేదె

*      *      *      *      *      *      *

స్వామి సాత్త్వికరూప విచక్షవరుల
†నోర్చితిరిగాన తురకల యుదుట దొంత-భద్ర. ౧౫

నలనీలకుముదసేనానాయకోత్తముల్ బలసి ముంగల బరాబరులు సేయ
హనుమయు జాంబవదంగదాదులు నిల్చి యంచలంచలను జోహారులిడఁగ
వరుస సుగ్రీవగవయగవాక్షాకలు నొరసి మిన్నంటి చామరలువీవఁ
బరమభాగవతఖేచరసిద్ధచారణుల్ జయజయశబ్ద...ములు నుడువ
సురలు విరులు గురియఁ బోలవరమునుండి
భద్రగిరి కేగు వేడ్కను బ్రస్తుతింప-భద్ర. ౧౬

*నాల్గవ చరణము—నిష్ఠ మతికైన రాని బ్రాజమువులసుతుకైనను నెన్నడనిచరిత్ర- అని.
†యోర్చితిరిగాక తుర్కుల యెదుటికెల్ల-మూ

అంగ వంగ కళింగ బంగాళ నేపాళరాజుల కెల్ల శ్రీరాములాజ్ఞ
గూర్జరకర్ణాట కురుకొంకణచోళరాజులకెల్ల శ్రీరాములాజ్ఞ
చోటసింధుసురాటలాటమత్స్యవిదర్భరాజులకెల్ల శ్రీరాములాజ్ఞ
పాంచాల సౌరాష్ట్ర బర్బరమగధాంధ్రరాజుల కెల్ల రాములాజ్ఞ
దివ్య తిరునాళ్లకు సమస్తదేశవరులు
రావలయు నంచుఁ జాటింపఁగా వలయును. భద్ర. ౪౭

శ్రీరామచంద్రులు సీతాసమేతులై వచ్చిరి భద్రాద్రివాసయనకు
జయనామవత్సర చైత్రశుద్ధాష్టమి తరవాతిదినమందుఁ దగవివాహ
మరయమార్గమునందు నెరయసత్రములుబల్చలువపందిరులు వెచ్చనీజలములు
శీతోదకంబులు చిక్కని మజ్జిగల్ ముష్టపండ్లరసంబు నిరుచల్ల
లాదిగాఁగల్గుద్రవ్యంబు లమరఁజేయ
వలయునని వేగఁబంపుఁడీ వాయుసుతుని, భద్ర. ౪౮

తిరిగి రాముఁడు భద్రగిరికేగువార్త లాలించెనా వజ్రితాళీలోసంగు
నవనిజాధిపుఁడు భద్రాద్రిఁ జేరుట వినఁగల్గెనా జముఁడు చౌకట్లోసంగు
దశరథాత్మజులు స్వస్థానంబు కరుగుట వినియెనా వరుణుండు మణులొసంగు
భరతాగ్రజులు నిజపురము కేతెంచుట లెఱిఁగెనా ధనదుఁధనేశుఁ డొసఁగు
ననుచు నలనీలజాంబవదాంగదాదు
లమరి యున్నారు శుభవార్తలరసిచెప్ప, భద్ర. ౪౯

కలిమిచే విబుధులఁ గానరనివారి వారించు గుణశాలి వదినెగారు
నెఱిఁ బేదనైనను నిల్చి చేపట్టియు ధీరునిఁ జేయుపత్నీలలామ
పతితాత్ముఁనైనను బావనుగాఁజేయు గుణవతి ముద్దులకూఁతు రరయ
నవివేకునైన విద్యావంతునిగఁ జేసి గురురూప మొసరించు కోడలెన్న
నిట్టిసంపత్తి గల మిమ్ము నెఱిఁగి భక్తిఁ
గొలిచితిని వేగ నాకేమి కొదవయింక, భద్ర. ౫౦

దయశాలితల్లి యుదారసాహసుఁ డప్ప భూభారకుఁడు శయ్య పుష్పబాణుఁ
డరియఁబుత్తుఁడు శీతకిరుఁడు మఱంది వాసవసూను డిష్టుఁ డైశ్వర్య మూతుఁడు
నెచ్చెలి దేవమౌని దలంప మనుమఁడు రత్నాకరం బిలు రమణ నెన్న
రణశూరుఁ డన్న సారసనేత్రి వర్ణింప నవతారమూర్తి పీవవనిలోన
నిట్టి మిముఁగొల్చునామది కితరబుద్ధు
లమరనేర్చునె యెన్నిజన్మములనైన, భద్ర. ౫౧

వరుస విద్యలు చెప్ప వచ్చె సరస్వతి నాయమ్మ ప్రియయసేమ నన్నయాజుఁడు
ముదమిమ్మ యనక త్రయాలు మేనత్తలు మాకిష్టమిడఁ జందమామమామ
యురసి పాపముఁ బాప నక్క దివిజగంగ యైశ్వర్య మొసఁగ శ్రీహరుఁడు బావ
మాతల్లి ముల్లోకమాత కల్మషదీనపోషకుఁడవు తండ్రి పొసఁగ నీవు
ఇన్నియును నింట గలుగఁగ నేటి కింక నితర
దైవములఁ వేడనేల దైవరాయ, భద్ర. ౯౨

బలుసాకు వ్యక్తి ద్రౌపదిచేతి వనముకోఁ బాండవావలిని గాపాడినట్లు
సరవిఁ దెచ్చినవస్త్ర నారంబు భుజించి చెంపమద్దియును రక్షించినట్లు
అడిగి తెచ్చిన ముక్కులటుకులు భక్షించి చెలఁగి బాఁపని ధన్యుఁ జేసినట్లు
పెట్టఁగానని తొలిరొట్టెకు బతిమాలి ముసలియవ్వకుఁ గీర్తి యొసఁగినట్లు
పూసపాటినృపాలుఁ గ్రోవఁ దలఁచి
తెచ్చుకొంటిరొ మీఖర్చు వెచ్చములకు, భద్ర. ౯౩

గోత్రికు లని పాలు కొట్టిపోలేక మీయంశభూతులటంచు నడిగినావొ
పేరుమోసినకట్న మారసికొంటివో శూరులనుచు నంతఁ జేరినావొ
మీనాఖులలోన మాకె పట్టుఁ దెచ్చె నని చూపిన్యాయమున కలిగినావొ
స్థలము వంశంబు మీ రొకనిపోలికెఁ బలుకష్టసుఖంబులఁ దెలిపినావొ
యెట్టు దయచేసిరయ్య మీపట్టు మీకుఁ
బూసపాటికులోద్భవు బాసమెఱిఁగి, భద్ర. ౯౪

రవికులోత్తమ దశరథరాజనందన తాటకామదవిమర్దన మునీంద్ర
మఖపరిపాలన, మారీచహర, యహల్యాశాపమోచన, హరశరాస
నవిభంగ జానకీనాయక భార్గవరామ గర్వాపహార సుగుణాఢ్య
పితృవాక్యపాల విపినశైలసంచారక కురంగభంగక కపిపపాల
వాలిమదభేద వారిధిబంధన......
దశముఖకులవనదావ త్రిదశవంద్య, (?) భద్ర. ౯౫

సద్ధర్మచారిత్ర..............శ్రీధరపుణ్యగాత్ర సీతాకళత్ర
కరుణాలవాల శ్రీకరభక్తపాల సన్నుతమానిజాల యంచితసుశీల
పరమపవిత్రశంబరవైరిచిత్ర వాసరమాన్యగోత్ర విశాలనేత్ర
రఘుకులదీప నిర్గళితశంకర చాప సుందరరూప నిశ్రుతప్రతాప
రణజయాలాప దైత్యమర్దనకలాప
మౌనిమానససారసమత్తమధుప- భద్ర. ౯౬

రణభీమ దైత్యమారణహోమ పుణ్యకారణనామ వినుతచారణలలామ
వనచార కతితపావనశూర మానిభావనపూర వీరరావణకుఠార
జనరక్ష కృతపుణ్యజనశిక్ష వరభక్తజనపక్ష సత్ప్రయోజననిరీక్ష
జితదోష మానిపూజితశేషశయన వారధిశోష పార్థసారథ్యవేష
సరసగుణధామ రవికులసార్వభౌమ
దశరథసుపుత్ర దేవ సీతాకళత్ర, భద్ర. ౯౭

వరరూపలావణ్య వైభవార్తశరణ్య దేవాగ్రగణ్య పార్థివవరేణ్య
ఘననీరదనిభాంగ ఖగనాయకతురంగ విజితహేమకురంగ వృజినభంగ
మానిమానసభృంగ మథితఘోరభుజంగ పరిపాలితప్లవంగ ప్రణుతగంగ
భక్తవనజమిత్ర పావనచారిత్ర శతముఖస్తోత్ర కౌసల్యపుత్ర
ధర్మగుణసాంద్ర రఘుకులతారకేంద్ర
సవనసంరక్ష యాశ్రితజనసుపక్ష, భద్ర. ౯౮

జలజాక్ష ఘనరాక్షసవిశిక్ష మునిపక్ష రణశూర వనచార రఘుకుమార
వారిశోష మునివేష సురపోష మృదుభాష రఘుపుంగవ భుజంగరాజభంగ
శరచాపధర పాపహార భూపకులదీప రతిరాజజయతేజ హితసమాజ
మురభీమ సురసోమ వరనామ గిరిధామ సురపుంగవశుభాంగ సుప్రసంగ
భక్తపరిపాల గుణజాల భవ్యలీల
దివ్యమంగళవిగ్రహ దీనరక్ష, భద్ర. ౯౯

శరణు త్రిలోకరక్షణ మానిసన్నుత శరణు సద్భక్తరంజనచరిత్ర
శరణు విశ్వామిత్ర సవనసంరక్షణ శరణు గౌతమపత్నిశాపహరణ
శరణు మారీచభంజన వార్థిబంధన శరణు ప్లవంగపోషణముకుంద
శరణు వైకుంఠవాస విశాలలోచన శరణు ఇక్ష్వాకువంశజ మహాత్మ
శరణు వాసవనుత శేషశయన శరణు
శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గహస్త, భద్ర. ౧౦౦

రామదాసాదుల రక్షించినట్టులు నెలమితోడఁ గుచేలు నేలినట్లు
ప్రహ్లాద నారద ప్రభృతిఁ బ్రోచినయట్లు సరవితో ముచికుందు సాఁకినట్లు
అలద్రౌపదికి వల్వలాదుకొన్నట్టులు గజరాజు నవనిలోఁ గాచినట్లు
శబరివిందుకు సంతసమ్ము నొందినయట్లు మహిఁ ఘంటాకర్ణు మనిచినట్లు

నన్ను దయసేలు నేరము లెన్న కవని
మూఢచిత్తుఁడ నవివేకములు హరించి, భద్ర. ౧౦౧

సర్వధారను పేరిసంవత్సరమునను ధంసాకు వెఱచి యిద్దరికి వచ్చి
పోలవరంబులోఁ బాలుపొంద నైదేఁడ్లు వనవాస మొనరించి వరుసతోడ
శాక్తేయమతయుతు సంహార మొనరించి మంత్రాంగశక్తి యిమ్మహినివెలయఁ
దగఁ బూసపాటి సీతారామరాజు విజయరామరాజుల సరసముగను
విజయసంవత్సరంబున విజయముగను
భద్రగిరికేగి తౌనయ్య భద్రముగను, భద్ర. ౧౦౨

మొదలఁ గావ్యము లేశమును బఠింపఁగలేదు శబ్దజాలముల వాసనయెఱుంగ
ధరవిభక్తిజ్ఞానసరణి యేమియులేదు లక్షణశక్తి చాలదు తలంప
గ్రంథశోధకుఁడను గాను వ్యాకరణసూత్రము లవలేశమాత్రము నెఱుంగ
నవని నీదివ్యనామామృతాసక్తిచేఁ బూనితి నీకావ్యబూటకంబు
మున్ను నన్ను మరామరాయన్నఘనుని
బగిది దయఁ జూడవలయు నాపదలు ద్రోలి, భద్ర. ౧౦౩

నదులు మున్నీటకై యదనిచ్చి పాఱుచో నదురేగు మీనము ల్గుములుగూడి
వనవసంతాగమదినములఁ గోయిల ల్మొగమిచ్చి పల్కును పగలు గులుక
నరవి మేఘోత్పత్తిసమయంబున నెమిళ్ళు పురివిచ్చియాడు నంబరముగాంచి
సిరిగల్గువేళలఁ బరమదయాళులై పురిబంధుజనములు పూజచేతు
రితరకాలంబులను వార లెగ్గుసేతు
రేమి వివరింతు మాయల సామినేఁడు, భద్ర. ౧౦౪

రమణతోడుత నిభరాహిముఖానుని నేల పుట్టించెనో యిలను బ్రహ్మ
పుట్టించెఁ గాక యీపుడమిలోపల నేల షాజిలబేగని వల్లఁజేసెఁ
బల్లఁజేసినవాఁడు కదవిచాలయొసంగి లీల జాల్గుంగు పేరేల తెచ్చెఁ
దెచ్చినవాఁ డేల దృఢచిత్తుఁగాఁజేసి ధంసా యను కితాబు ధరణి నొసఁగె
నొసఁగి మిముగెల్వ సాహస మొనర నేల
చేసెనో యని మదిఁ జింతసేయవలదు, భద్ర. ౧౦౫

రమణఁ గౌండిన్యగోత్రపవిత్రుఁడను లింగనకుఁ బౌత్రుఁడను పెద్దనకును బుత్ర
వరుఁడఁ బేరయనామధరుఁడ భల్లావంశ వార్ధిసోముఁడ బుధవర్గ మలర

వలన వేంచేసిన వసుధ యాస్పదముగా మదిలోన భావించి ముదము లర్ప
ఘనత వ్యాజస్తుతిగా నొనర్చితి నీపైశతక మష్టోత్తరశతము గాఁగఁ
జిత్తగింపుము హంసంబు క్షీరములను
గ్రాహ్యమొనరించుచందంబు గడలుకొనఁగ, భద్ర. ౧౦౬

కేశవ మాధవ కృష్ణ హృషీకేశ నారాయణ ముకుంద నారదనుత
పద్మనాభాచ్యుత ప్రద్యుమ్న శ్రీధర వామన గోవింద వాసుదేవ
విష్ణ్వనిరుద్ధ త్రివిక్రమాధోక్షజ నారసింహ జనార్దన మధుసూద
నయుపేంద్ర సంకర్షణ పురుషోత్తమ హరే దామోదరానంత దానవాంత
యఖిల లోకైకనాథ దివ్యాంఘ్రిపద్మ
ములకుఁ బ్రణమిల్లెదను ముదములర నేను
భద్రగిరివాస శ్రీరామభద్ర దాస
పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక. ౧౦౭

జయ రఘుకులదీప జయ దశరథపుత్ర జయ భరతాగ్రజ జయ ముకుంద
జయ తాటకాంతక జయ మఖపరిపాల జయ యహల్యాపోష జయ యుపేంద్ర
జయ హరధనుఃఖండ జయ జానకీనాథ జయ భృగుసుతభంగ జయ కృపాబ్ధి
జయ వనసంచార జయ వాలిమర్దన జయ వార్ధిబంధన జయ మురారి
రావణాంతక సాకేతరమణ నీదు
వలన శతకము వినువారి వలస లుడుగు
భద్రగిరివాస శ్రీరామ భద్ర దాస
పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక. ౧౦౮

# వరదరాజశతకము.

—( కృష్ణకవి ప్రణీతము )—

రేఫప్రాసయుతచంపకమాలావృత్తములు.

సురనుత మంజుభాష వరసుందరవేష స్వభక్తపోష యా
సురమదశోష సర్వగుణశోభితభూష కృపావిశేష నే
శర ణని వేఁడిన న్వినవు సాహసమా చలమా యిదేమి మం
దరధర కుందసుందరరదా వరదా మురదానవాంతకా. ౧

హరిహయుఁ డాదియౌ సురల కందనివాని విరించి మానులు
స్మర లిడువాని దాసజనముఖ్యులఁ గొల్చెడువాని దీనులన్
సరగునఁ బ్రోచువాని నిను సన్నుతిసేతును నన్నుఁ బ్రోవు మం
దరధర కుఁదసుందరరదా వరదా మురదానవాంతకా. ౨

స్ఫురదరవిందనేత్ర యతిశోభనగాత్ర గిరీశమిత్ర సా
గరతనయాకళత్ర వరగర్వమదాసురజైత్ర భారతీ
వరనుతవక్త్ర యోగిజనవందితపాత్ర సువర్ణవస్త్ర మం
దరధర కుందసుందరరదా వరదా మురదానవాంతకా. ౩

గరుడతురంగ శత్రుజనగర్వవిభంగ రమాంతరంగ నే
మొరలనిడంగ నీ కదియు ముద్దా భుజంగశయాన నీకు నేఁ
బరుఁడనె మానిసంగ రిపువద్మతంగజ దోషహారి మం॥ ౪

నరసఖ దైత్యమర్దళన నారదసన్నుత యప్రమేయ శ్రీ
ధర కరుణాపయోనిధి సుదర్శనసాయక వాసుదేవ సా
దరమతి నన్నుఁ బ్రోవఁగదె తాపసహృత్కమలాంతవాస మం॥ ౫

కరకరిఁ జూడ మేర యదిగాదు దయాపర నీదునామ మే
నిరతము సంస్మరించెదను నిర్మలుఁ డం చని ప్రోవకుండినన్
వరదుఁడ వన్నమాట కదివైపగునే తగునే రమేశ మం॥ ౬

సరసిజనాభ వామన ప్రసన్న నిను స్మరణంబు వేఁడినం
బరమకృపాకటాక్షమునఁ బారఁగఁజూడ వదేమిచోద్యమో
హరిహరి నీదుమానసము హా శిల యౌట యెఱుంగనైతి మం॥ ౭

కరముల నొగ్గి వేఁడి పదకంజము లే మది నమ్మియుండి యీ
చరితము లాలకించుచును శౌరి యటంచని పాటపాడుచుం
స్థిరమతిఁ గొల్చియున్న మదిచింతలు వావ వదేసె బాసు మం. ౮

నరినరి చాలురా యిటులు సాహసమేలర నమ్మినానురా
విరసము మానరా యిఁకను వేఱుగ నెంచక ప్రోవవేమిరా
సురనుత రార నామనవి సొంపుగ వింపుగ నాలకింపు మం. ౯

చిరమతినై భజింప నను జిక్కులఁ బెట్టియు స్రుక్కఁ జేసితే
స్థిరమతి నెవ్వరయ్య యిఁకఁ జేరిచి ప్రోచెడు వార లక్కటా
దొర వని నిన్ను నమ్మితిని దోసిలియొగ్గితి నేలుకొమ్ము మం. ౧౦

వరగుణసాంద్ర యోగిజనవందిత భోగసురేంద్ర నీపదాం
బుజయుగంబు నమ్మినను బ్రోవక వంచన నెంచఁబోకు శ్రీ
హరిహరి నీకిదే యిడెద నంజలి చేకొను మేరుధీర మం. ౧౧

గురుఁడవు తల్లి దండ్రి పతి కూరిమిబంధుఁడు దేవుఁ డంచు నే
నిరతము నమ్మియున్న నిఁక నీ విటునేయుట పాడియౌనె యో
వరద పరాత్పరా దురితవార్ధి మునుంగకయుండఁ బ్రోవు మం. ౧౨

పరసతులన్ హరించితిని పాత్రమెఱుంగక విక్కి త్రుళ్లితిం
బరధనము న్స్వవం గొనితి బ్రాహ్మణముఖ్యుల నిందచేసితిం
బరహిత మెంచలేని బహుపాపిని నెట్టులనైనఁ బ్రోవు మం. ౧౩

మురుగులు గొల్సులుం బతకము ల్గొలత్రాళ్లును నుంగరంబులు
న్సరిపెణలుం గిరీటములు సాలువు లుత్తరజన్నిదంబులు
న్నరభుజకీర్తు లే నడుగ నొక్కట నీపదభక్తి నిమ్ము మం. ౧౪

హరులను గోరలేదు బిరుదావళు లిమ్మని వేడలేదు నే
నరదము లిమ్మటంచు నిను నడ్డముగా నరికట్టలేదు నా
మొర విని ప్రోవుమంటి నిఁక మోనము చేయకుమీ యటంటి మం. ౧౫

మరణము నొందు నానమయ మందునఁ గాలుని కింకరాళి నా
నరసను నిల్వ రోగములు చాలఁ బెనంగఁ గఫ ముగ్గట్ట నే
స్మరణ యొనర్తునో సలుపఁజాలనో యిప్పుడె చేతుఁ బ్రోవు మం. ౧౬

శిరము సుదర్శనాయుధుఁడుఁ జిందము గేరు గళంబు నచ్యుతుం
డురము గదాధరుండు భుజయుగ్మము నాహరి నాభిఁ బంకజో
దరుఁడును పాదయుగ్మము ముదంబున శ్రీధరుఁ బ్రోవఁ జేయు మం. ౧౭

పురములు సంచరించు నెడ భూములు గ్రుమ్మరువేళ గ్రామముల్
దిరిగెడువేళఁ బల్లెలను దీవ్రముగాఁ జనువేళ రోగముల్
గుఱుకొనఁగం బిశాచగణక్రూరమృగాదులఁ జేరనీకు మం. ౧౮
దురితవిదూరుఁ డంచు మది దుఃఖములెల్లను ద్రుంతువంచు న
న్గరుణనుఁ బ్రోతువంచు నిఁకఁ గష్టముఁబెట్ట వటంచు నమ్మితి
న్నితరము దానుపై నెపుడు నీకృపనుంచు బిరానఁ బ్రోవు మం. ౧౯
హరుఁ డసురారికి న్వరము నర్ధివేఁడ నొసంగి హస్తముం
శిరమున నుంచిచూతునన శీఘ్రమె పర్విడి దొండకాయలోఁ
జొరఁబడ దానవుం దునిమి శూలినిగాచిన రీతిఁ బ్రోవు మం. ౨౦
సరసిజగర్భుకై సకలసంపద లెల్లను మాని యుంచవై
సరగున సృష్టికారణము సాహస మేర్పడ బోధసేయు నీ
చరితము లెన్నఁగాఁ దరమె శౌరి మురారి హరీయఘారి మం. ౨౧
పరమదయాకరుండవఁట భక్తజనావళిఁ బ్రోతువంట నీ
కరుణకు లోకము న్మనులఁ గాచుకయుండెదరంట వేదము
ల్వరుస నుతించునంట యిటువంటి మహాత్ముని జేరికొల్తు మం. ౨౨
మొర వినలేవొ నీచెవులు మూసుకయుందువొ లేక వింటివో
కరుణఁ దలంపవో దురితకర్ముఁడు వీఁడని యెంచుకొందువో
మఱపున నుందువో తనదుమర్మముగందువొ సాధ్యమౌర మం. ౨౩
సరగున రావదే నను ససంభ్రమ మొప్పఁగఁ జూడవే మదే
నిరతము వాదె నాపయిని నేర మదే జగదేకవీర దే
వరకును దాసుఁ డంటి గదె వైరమదే మదిరాదె ప్రోవ మం. ౨౪
దొరతనమా నమామి యని దోసిలి యొగ్గియు నిన్ను వేఁడినన్
గరుపతనమ్ము ప్రోవఁ దఱి గాదని యుండు టిదేమి క్రోధమా
బిఱబిఱరమ్ము నాయెడల భేదము కౌస్తుభధామ రామ మం.
వరుఁడవు గానురా యిఁక నెపం బిడఁగ న్నను గావవేమిరా
విరసము మానరా యిటులు వేడుక చూచుట పాడిగాదురా
సరసత నేలుకోర యిదె సాఁగిలి మ్రొక్కెదరా సుధీర మం. ౨౬
మఱుజనకా పరాక యిఁక మన్ననఁ జూడక రాక వేడుకా
విరసముకా సరేకదర వేఁచుటకా ననుఁబ్రోవకుంటిగా
మఱచుటకా నిరంతరము మర్మము చూచుటకా చిరాక మం. ౨౭

త్వర నిటు రమ్ము నాయనవి తత్క్షణమే కృపఁ గొమ్ము వింతగా
దురితము లెల్లఁ జిమ్ము నను దుష్టుఁడటం చనఁబోకు సుమ్ము నే
నరులను వేఁడ నమ్ము నిను నాసకలం బనియుండు లెమ్ము మం. ౨౮

శరణని యంటి నెల్లపుడుఁ జక్కనిభక్తిని వేఁడుచుంటి నీ
కరుణకుఁ బాత్రుఁడంటి నిఁక గాసిని బెట్టకు మంటి నిన్ను నే
మఱిమఱిఁ బాడుచుంటి నను మానము మానుమటంటిఁ బ్రోవు మం. ౨౯

పరుగున రా వదేమి నను బాధలఁ బెట్టుటిదేమి పిల్వఁగా
మొఱ వినవేమి ప్రోవకను మోసము చేసెదవేమి శౌరి నా
సరసకు రా వదేమి నెఱసాహస మేమిర ప్రోవవేమి మం. ౩౦

గరుడునిపై వసించి వరకౌస్తుభహారముఁ దాల్చి గట్టిబం
గరువలువల్ ధరించి సొబగైనకిరీటము నుంచి చక్రముల్
దరము నమర్చి దాసుని ముదంబునఁ బ్రోవఁగ వచ్చి నిల్వు మం. ౩౧

త్వర ననుఁ బ్రోవకుండినను దాక్ష్యని యాన ఫణీంద్రు నాన నీ
పరమపదంబు నాన సిరిపంట వెలందుల యాన యింకనీ
చరణములాన ద్వారకుల జంటల యాన నిజంబు నమ్ము మం. ౩౨

కరుణను జూడరా బిరుదు గట్టితి వల్లది కల్లగాదురా
యరమర మానరా కలుషహారివి నాదురితంబు మాన్పరా
నిరతము నమ్మినార నను నేరము లెన్నకురా సుధీర మం. ౩౩

మఱవకు నన్ను సద్గుణుఁడ మ్మైసి ద్రోహిని నీచకృత్యుఁడం
బరధనదారలం గొనెడు పాపిని గోపిని నీపదాబ్జమే
యిరవని నమ్మినాఁడ మది నిష్టము చేసుక ప్రోవుమయ్య మం. ౩౪

వరమునిగేయ సర్వసురవందితకాయ సునామధేయ నీ
వరమరసేయు నెవ్వరిఁక హా నను జేరఁగఁ దీతురయ్య నా
మొఱ వినదాయెనా యిటులు మోసము చేయకు భాగధేయ మం. ౩౫

బాలునిఁ గృతార్థుఁ జేసితివి యబ్జజుసం ఘనుఁ జేసి తౌర యా
హారిహాయు కోర్కెఁ దీర్చితివి యందఱికన్నను నన్ను నొక్కన
న్నరసియుఁ బ్రోవవయ్య బిరు దప్పుడు చెల్లును దేవరాయ మం. ౩౬

*గురుతర మీనమై జలధి గొబ్బునఁ జొచ్చియు సోమకాసురుం

---

* ఇక్కడనుండి దశావతారవర్ణనము.

బరువడి వ్రచ్చి వేదము లపారకృపామతిఁ దెచ్చి ధాతకున్
సురలునుతింప నిచ్చిన యశోనిధి నిన్ను నుతింపనేర మం. ౩౭
సుర లసురుల్ మహానగము సొంపుగఁ దెచ్చి సుధాబ్ధినుంచి వే
సరకను ద్రచ్చుచుండ నది సంద్రము నందు మునుంగఁ గూర్మమై
సరగున నద్రి వీఁపున వెసన్ ధరియించి సురాళిఁ బ్రోచు మం ౩౮
వరబలమత్తత న్విబుధవర్గము భీతిలుచుండఁ గ్రూరుఁడై
ధరణిని ముచ్చిలించుకొని ధైర్యముతోఁ జను హేమనేత్రునిం
ద్వరను వరాహరూపమున దైత్యుని ద్రుంచి విధాతఁ బ్రోచు మం. ౩౯
కరుణ యొకింత లేక సుతుఁ గాసిలఁ జేయుచు నున్న దానవున్
ధరనిఁక నుంచరా దని ముదంబునఁ గంబము నందు శ్రీనృకే
సరివయి పుట్టి రక్కసుని జంపియు బాలుని గాచినట్టి మం. ౪౦
సురపతి రాజ్యసంపదలఁ జూఱగఁ గొన్న బలీంద్రు చెంతకు
న్సరగున నేగి వామనుని చందము తోడఁ బదత్రయంబు వే
సరకను వేడి కైకొని రసాతలమందున వానిఁ ద్రొక్కు మం. ౪౧
పరశుధరించి సర్వజనపాలుర నెల్లను భీకరంబుగా
నిరువదియొక్కమాఱు వధియించి పితాళ్లకుఁ బ్రీతిసేయు నీ
వరబలమెంతు నే భువనవందిత భార్గవవంశరామ మం. ౪౨
ఖరకరవంశజాతుఁ డయి కౌశికుయాగము గాచహల్య శా
పరహితఁ జేసి రుద్రువిలు భగ్నమొనర్చియు సీతనెలి యా
సురులను రావణుం దునిమి సొంపుగరాజ్యము నేలురామ మం. ౪౩
కరకమలంబునన్ హలముఁ గ్రక్కునఁబూనియు దానవావలిం
బొరిగొని హస్తినాపురము బోర్లఁబడంగను బెల్లగించు నీ
వరబల మెన్ననాతరమె వారిజనేత్ర ప్రలంబహంత మం. ౪౪
సరసిజనాభ యోగిజనసన్నుత యాదవవంశమందు నీ
వరమరలేకపుట్టి వ్రజకులాంగనల న్రమియించి దుష్టులం
బొరిగొని కంసునిం దునిమి పుణ్యులఁ బ్రోచిన మద్దుకృష్ణ మం. ౪౫
సరగునఁ బూతనం గెడపి చక్రముఁ దన్ని తృణాసురు న్వడిం
బొరిగొని ధేనుకాసురుని పొంక మడంచి ప్రలంబుఁ డాదియౌ
సురులవధించి గోపకుల సుందరుల న్రమియించినట్టి మం. ౪౬

బు చెలువున నున్నిద్రప్రాణికంబై యత్యద్భుతం బగు నొక్క కాళిందీతీరకాంతా
రంబు ప్రవేశించి. ౧౭

—శ్రీకృష్ణుఁడు వేఁట సలుపుట—

క. నలుదెసలఁ గాపు లునిచెన్, బలియుల మృగయులను వీరబలశాసనుఁ డా
జలజాతపత్త్రనయనుఁడు, బలశాసనతనయుఁ బిలిచి పటువేగమునన్. ౧౮

గీ. అతులచాతుర్య మొదవంగ నమ్మహాత్ముఁ
డమర ఘటియించె నపుడు పూర్వాదులందు
సంభవత్తత్త్వమయసంజ్ఞ*నరగఁ జేసి
సకలవిబుధులు వినుతింప సద్వ్య(వ)స్థ. ౧౯

క. దిక్కులఁ గ్రమ్మి భటుల్ రొదలొక్కుమ్మడిఁ జేయ మృగము లురవడి బెగడన్
మిక్కుటపుసు‡విపాక్షులఁ, బెక్కండ్రవినీతకవులు బెదరెడుమాడ్కిన్. ౨౦

క. జలజాక్షునకుఁ దిమ్ములు, బలుమృగముల వెదకి వెదకి పడఁజేసిరి దో
ర్బల మలర శాబ్దికోత్తము, లలయపశబ్దముల నెమకి హరియించుక్రియన్.

గీ. అలసనత్వంబులన ములఁ గ్రియా †వ
రాశయముల స్వరాదుల నవ్యయములఁ
దా నిపాతంబులుగఁ జేసి ధరఁ దదంత
సంగ్రహాయత్తమతి యైనసాధుమౌళి. ౨౨

గీ మాన్యుఁ డైనట్టి యాధ్వనిమార్గవేది, లక్ష్యమూలంపుధ్వని నవలంబనంబు
చేసి హరియించె మిక్కిలి వాసిగాంచు, తనకృతిత్వము మర్మవేత్తలునుతింప.

క. కరమరుదు కృష్ణమేఘం, బురుతరశరవర్షవైభవోదగ్రముగా
ఖరవైశ్వానరకీలలు, విరళతలే కన్నియెడల వే కననయ్యెన్. ౨౪

గీ. అవ్యయప్రకాశ మ‡విభక్తికోజ్జ్వలం, బగళితోరుసత్త్వ మంతకార్య
కరము నాఁడు మెలఁగె సురుచిరతద్ధిత, కృద్గణంబు దహనకీలితంబు. ౨౫

వ. ఇటు మృగయావిహారంబు కొంతప్రొద్దు గడపి చాలించి యమ్మించుమాయ
లాఁడు రాజాస్యంబు లగు నామిషంబులతోఁ బరివారంబు హరిప్రస్థంబున
కుఁ బోవఁ బంచి విశ్రాంతివ్యాజంబున నర్జునానుచరుం డై కమలాసనవర
మహాంసనీలకంఠసంసేవితం బై శుకముఖసుకవినికరసముపభోగయోగ్యం బై
తనుభవశ్రాంతిసర్వస్వాపహరణప్రవణం బై శరద్రాకాశశాంకాకలంకచ్ఛా

*లలరజేసి-మూ †పరాశ్రియములు-మూ. ‡విభక్తిమోజ్జ్వలం-మూ.

యాచోరప్రభాభరంబై తెలిదీవివైఖరిం బరిహసించు నొక్క కాళిందీనదీ సుందరపులినతలంబున విశ్రమించి ౨౬

క. కనియెం బద్మదళాక్షుఁడు, కననివిననిమేలుసుషమఁగల ప్రియురాలిం
గనికనఁగరాని చంచలఁ, దనులత యుచలంపుఁబోఁడిఁ దల మనుదానిన్ ౨౭

—శ్రీకృష్ణుండు కాళిందిని జూచుట—

క. ఉపమానభావమును దన, కపకారముగాఁగఁ దలఁచు నఘన మగుచుం
దపముఁ బలు *కాఁకఁ దనకై, తపియింపుచునుండునట్టి తపనతనూజన్.

క. కనికని నిరతిశయానం, దఃధిత్వ(ము) గాంచియేని కమలదళాక్షుం
డెనలేనిముదముఁ గొనుచున్, మనమునఁ గాళిందిరూపమహిమను బొగడున్.

గీ. ఏతదవఘనసంగతి నెట్టిముదము, †విషయివర్గంబుఁ గైకొని వెలసె దానిఁ
గాంచుఁబున రేతదంగసంఘటనగలుగ, భాగ్యమెన్నఁటికబ్బునప్పటికిమగుడ.

చ. సరసిరుహాసనంబుఁ గొని సన్ముఖసీమ గృహీతవాచమైఁ
బరఁగఁగ శ్రోత్రియత్వమునఁ బాటిలి పూర్ణతపంబుసేయఁగా
సరసిజగర్భ! యీయువిదచక్కఁదనం బొనగూర్చునేర్పు నీ
కరుదు ఘటిల్లెఁ గా కరయ నల్పతపంబున నిట్టి దబ్బునే. ౩౧

ఉ. సారసగంధిమధ్యమము సంఘటియింపఁగ యోగ్యవస్తుసం
భారము లేమినో యిది యభావముచేసితె పద్మజాత నీ
నేరుపు నెట్టు లెన్నికొన నేరఁగనయ్యెద దానిమీఁదటం
జేరి వసింపఁజేసితివి సిబ్బెపుగుబ్బలు గొప్ప‡క్రమ్మడిన్. ౩౨

గీ. ప్రస్ఫురద్వ్యక్తిసంబంధబలముకలిమి, నుల్లసించె నలంకృతు లెల్లఁ గాన
లలనయుత్తమకావ్యంపులక్ష్మి యనుచు, నవనిరసికులుగొనియాడుటరుదుగాదు.

గీ. అమథనావిలసింధుమధ్యప్రభూత, పద్మవాసిని యాశరత్పద్మనయన
వ్యక్తిసుందరర్గ§తాన్యకృతాఖిలోరు, భూషణత ముఖ్యకృతిలక్ష్మిఁబోలునింతి.

సీ. ఇది మన్మథౌన్నత్యహేతు వౌటఁ దలఁప మదికిఁ బులొనరించుమరుసిదంతి
దంతిగా దిది మృదుత్వంబు చాలఁ జెలంగ మరునిచేతమెలంగు విరులబంతి
బంతిగా దిది కంమపట్టుగా మెఱుంగ సోఁలీనెడు మేలుసోగమెఱపు
మెఱపుగా దిది సిల్కడొఱపుమైఁ దనరారమానసప్రియభావ మూనునంచ

*కాంతి-మూ. †విషయ-మూ. ‡క్రొమ్ముడిన్-మూ. §తాన్యకృతా-

యంచగా దిది ఘనరుచినందికొనఁగ, మధురనాదానువృత్తిచే యాస్యపికము
పికముగా దిది తెలికంటి బెళుకు లెనయు, నతులసౌందర్యదివ్యరత్నాకరంబు.

వ. మఱియుఁ గబరీజలధరమాలికయు నలికచంద్రరేఖయు నిరీక్షణచంచరీకావ
ళియు భ్రూమనోరమయుఁ గపోలశోభావతియు నాసికాకనకమాలయుఁ
గర్ణశ్రీకలితయు నధరమధుసుతియు హాసకౌముదియు సుముఖశాలినియుఁ
గంధరామత్తకోకిలయు వాగమృతధారయు దంతమౌక్తికమాలయు బాహాకు
సుమితలతయు హస్తాంబురుహయుఁ గుచబంధురయుఁ దనుమధ్యాంచితయు
రోమాళిభుజంగవిజృంభితయు నాభీవిపులయు జఘనక్షమాభిరామయు నూ
రుదండకమండితయు జంఘాప్రభోపరంజితయుఁ బాదలలితయు నంగలతా
చపలయు గుణమణినికరయు నగుచు వృత్తరత్నాకరకృతి నగుచున్న ది
క్కొన్నమెన్నొ, యేముద్దుగుమ్మ కైన వసన్నుగా *నమ్మమ్మ యని మనమ్మున
ఘనంబుగాఁ గొనియాడుచు నక్కితవయాదవుండు దండనుండు నాఖండల
నందను వీక్షించి యిచ్చంచలాక్షి యుదంతం బాద్యంతమ్ముఁ దెలిసి రమ్మా
పొమ్మా యని వినోదంబున ముదంబుగాఁ బలికిన. ౩౬

—శ్రీకృష్ణుండు కాళిందికడ కర్జునుని బంపుట —

క. సిరికి నలవడనిశోభా, భర మీయింతికి నెసంగుఁ బద్మాక్షునకే
తరుణి యిది గృహిణి గాఁదగు, నరునా శిరమెక్కి యుండు టబ్బు ఘటిల్లన్.

గీ. ఇట్టిసౌందర్య మొనరించు నట్టిధాత
కమరు సత్కీర్తి యీయింతి హరికిఁ గూర్చు
మిక్కుటంబుగ జగములో మెఱయుఁ గాని
యన్యునకుఁ గూర్చ నయశోబ్ధి నదియడంగు. ౩౭

క. ఈగతి నద్భుతరసనం, యోగిహృదంతరములోన నునిచి పొగడుచున్
†భోగిశతల్పునుపున, నాగుణధుర్యుండు వేగ నరుగుచు నచటన్. ౩౮

సీ. సభయందుఁ బండితసంస్కృతవాణికైవడి మహాసరసిలోపలను హంసి
వలె నభఃస్థలమున జిలుగుఁజందురుపోఁగవడువున నవమేఘపటలి మెఱపు
చెన్నున నాలయసీమఁ బ్రదీపంపుఁ గళికవైఖరి బోదె నలరుతీవె
చెలువునఁ దనువున ఫలశాఖపోలికఁ, ‡బరమకావ్యంబున వ్యక్తిమార్గిఁ

* దమ్ము-మూ. † భోగిపర్యంకుపనుపున-మూ. భోగిపరియంకు అని కవిభావమేమో. అది యసాధువు. ‡ బరము-మూ.

పులినతలమున మెలఁగెడుపొలఁతిఁ జేరి, తరళలోచనవలనిసత్కార మంది
తుందిలానందమునఁబొంది సుందరదన, వదనమీక్షించి మాధుర్య మొదవఁబలికె.

క. కలికి నీనామ మెయ్యది, జలజానన కన్నవారిసజ్జను లెవ్వ
క్కలు హేతువేమి నీ వీ, పులినంబునఁ దపము సేయఁబూనెడు మతికిన్. ౪౧

గీ. తేఁటియంటనికుసుమంబు తేట దోఁచు
నీమరూపంబు గనుఁగొన్న నిర్మలాంగి
యర్హవరకాంక్ష దేవతాప్రార్థనంబు
సేయుచుండెద వని నాదుచిత్త మొదవె. ౪౨

గీ. తన్వి యిచ్చటఁ బరమసాధనతఁ గాంచఁ
దనువిలాసంబె యితరసాధనము లేల
యరసి చూడుము పండితురాలవైన
ఘనఫలావాప్తి *బోధనకన్నఁ గలదె. ౪౩

క. నా విని తమ్ములనేలెడు, దేవునిగాఁ దాపుఁబట్టి తేటమొగమునన్
లేవి నునునగవుసిగ్గులు, తావుకొని మెలంగ నింద్రతనయుని కనియెన్. ౪౪

గీ. †జ్ఞాతృతాధర్మమున కధిష్ఠాన మరయ
నీమరూపంబు ‡గాకున్న మేదినీశ
యాభిమాన్యప్రసిద్ధమాహాత్మ్యమునకు
నధికరణ మౌట మాననీయత వహించు. ౪౫

ఉ. కావున నాయుదంత మవికారగుణాకర చిత్తగింపు మే
దేవుఁడు సాయగేస్తుఁడయి తెల్వి జగంబుల కెల్ల §నేను న
ద్దేవుఁడు నన్నుఁ గన్నతఁడు దీమనిపాలిరమాధినాథునిన్
దేవునిగా వరించుకొను ధీ కొని యిట్లు వ్రతంబు నల్పెదన్. ౪౬

గీ. అసితరుచి యగునీనది కధిప నేను, జన్మదేశైకతనె సహజన్మగాను
నామధేయంబుచే నేని నరవరేణ్య, తత్సహోదరిఁగా నన్నుఁ దలఁపవయ్య.

గీ. సర్గిమిత్రదయాంభోధి నీరజాక్షుఁ, డనఁగ నెఱనమ్మి మదిలోన నతని నునిచి
నాయథాశక్తిఁ గొల్చుచున్నాను నేను, భాగ్యమెట్లున్నదో కానిపార్థివేంద్ర.

క. ఎన్నఁడు పద్మాక్షుండు ప్రసన్నుండయ్యెడునొ కోర్కె సఫలతఁగాను టెం
కెన్నఁటికో తెలియదు నిన్, గన్నారం గంటిఁ గంటిఁ గన్నా సుఖముల్.

* జోదన-మూ. †జ్ఞాతతా-మూ. ‡గాకున్న-యూ. §నీమ.

గీ. అనుచుఁ గన్నీరు నించుచు నాననంబు, మిగుల వాంచిన యాతివ మెఱపుఁ బోఁడిఁ
జూచి తలయూఁచి యానందవీచిఁ దేలి, ప్రాణదారబిడ్డ యా *చైత్రరోచి కనియె.
గీ. నిరతిశయ మైన నీమేని నెఱి మెఱుంగు, నిర్మలంబైన నీభక్తి నిష్ఠఁ గూడి
రయము మిగులంగఁ దక్షరగ్రహముఁ గూర్పఁ, దక్షరగ్రహములవ సునక్షత్రులకు.
కం. అని పల్కి కలికి యానుమతి, గని తూఁకుపువాఁటి వేల్పుఁ గని నయుదారుం
డనితర లబ్ధామోదం, బని తలయూఁచుమను వేగ హరిఁ గనవచ్చెన్. ౯౨
కం. †వచ్చిన నచ్చెలు వచటికి, వచ్చి(న) కార్యంబు రూపవైఖరి మదిలోఁ
బొచ్చెంబు లేని భక్తియు, ముచ్చటపడి యుడుగ సకలమును వినుపించెన్.
చం. దెలికల వార్త యిట్లతఁడు చెప్పినఁ దప్పక యాలకించి యా
జలరుహపత్రలోచనుఁడు చక్కఁగ లేనగుఁ బువ్వుఁ బిఱ్ఱిచే
నలఁతఁ దొలంగు ప్రేమమున నాననపద్మము కన్నుదోయి మే
లొలయఁగ నింతిఁ జూడ మది కొప్పగునం పొగి నేగి యచ్చటన్. ౯౪

—శ్రీకృష్ణుడు కాళిందిం గొనిపోవుట—

కం. శృంగారైకాశ్రయమాం, నంగన నెమ్మేను చూచి హరి నవరసపా
రంగత ‡మగుననుభూతిచె, లంగఁగఁ దా మెలఁగె నబ్బురంబు దలంపన్.
సీ. నీలాభ్రమునఁ జాలు నెఱికప్పు జిగి జాలు మేలు నవ్వఁగఁ జాలు మేనివానిఁ
జలతలేక లసించు తొలినాఁటి బలుమించు నొప్పు నేరము లెంచు నొల్లెవానిఁ
దొలుత వేళ నెసంగు జలజాతములరంగు గలకన్నుల బెడంగు గనెడువాని
నమృతధారలు చిల్కు నట్టిచందురుకుల్కు, నగవు నవ్వుల తళ్కు మొగమువాని
లచ్చిపే రాదిగల పేరుమచ్చ వానిఁ, గౌస్తుభ కిరీటముఖ పరిష్కరణవాని
సుడికి నీడగు నొకవాలు వడయువానిఁ, బిందుకన్నాన నన్నగోవిందుఁ గనియె.
గీ. కనియు ననితర హృద్ధ్యానఘటితసర్వ, దేశసంతతదివ్యతదీయదివ్య
రూపజాలంబులోనఁ దద్రూపమపుడు, మిళితముగఁ గొంత సేపింతి మిన్నకుండె.
కం. అంతటఁ గాంతకు లక్ష్మీ, కాంతుని నిజరూపగరిమ గనవయ్యెఁ దదే
కాంతి(క)దృష్టిప్రభావత, శాంతఁ బురందరుని కట్టి పోనఁగుటచేతన్. ౯౮
చం. హరినిజరూపమాత్మ ముదమారఁగఁ గాంచిన కాంచనాంగికిం
బరిచితిఁ జెందవయ్యె నభివాదనవార్తలు సంస్తవక్రియల్

*చిత్రరోచి. †వచ్చి యచ్చెలువ యచటికి ‡ మగువనుభూతి ననితర-మూ.

కరము మనంబులోపల నఖండితభక్తి కుదుర్పఁ జక్కన్
హరిహరి యంచుఁ గవనిచుట్టికచాకచి సంఘటిల్లఁగన్. ౫౯

గీ. వెలఁది "యభ్యాగతః స్వయం విష్ణు"రితి వి
చారసాంగత్య మొనరఁగఁ జలదపాంగ
వీక్షణాంభోజమాలి కావిసరములను
బూజ యొనరించె నాజగత్పూజితునకు. ౬౦

గీ. కృష్ణఘనరుచి దనచెంతఁ గీలుకొనఁగఁ
జామముఖచంద్రుఁ డప్రకాశత వహించె
నిమదక్రేఁగంటిచూపులు నీలవేణి
రుచివిలాసంబు దన్నేత్రరుచి గొనంగ. ౬౧

గీ. అంబుజాననదనుఁజకోరాక్షి యనుట, నిజముగాఁ జేయఁదలఁచి యానీరజాక్షు
వదనచంద్రునిఛాయ కవ్వారిగాఁగ, ఛాయకొనఁజేసెఁ దనదృక్చకోరకముల.

చ. అపుడు ముకుందుఁ డింతిఁ గని యంబుజమిత్రతనూజ నీవు ని
త్తపము ఫలించె రమ్మనుచుఁ దప్పుల లేనగుమోము గ్రమ్మఁగాఁ
* దపనతనూభవం జెమట తద్దయుఁ గ్రమ్మ రథంబుమీఁదఁ దాఁ
గృపనిడుకొంచు ధర్మజునికేళిపురంబున కేఁగె నెమ్మిగన్. ౬౩

క. అచ్చట నారాజున కమ్ముచ్చట దెలియంగఁజేసి భూపతిమదిలో
ముచ్చట దీరఁగఁ గొన్నాళ్ళచ్చపుఁ బ్రేమమున నిలిచి యనుపతియంతన్.

క. పురమున కేగుతలంపున, నరవరునానతి గ్రహించి నలువారఁగ న
న్నరుఁ దోడ్కొని చనువేళన్, పురణింపఁగ డాయఁజేరి భూపతిఁ బలికెన్

గీ. అనఘకృతి యపార్థ మగునేని పండిత
హృదయమునకుఁ బోలె హితము గాదు
నామదికి నెపుడు నరుఁ బాపు మటుగాన
నన్నుఁ బంపి రాఁగ నరవరేణ్య. ౬౬

వ. ఇట్లు పావనుగు తోవకొమ్మతోలంగుడు బావబిడ్డబిడ్డనిచే †సోమాసుల
పెట్టుంజెట్టుపట్టి తనవెనుకటిరాకకు నానతివడసి యనంతు రా‡నయ్యొడ్డ
కేద్గోరబిడ్డ ప్రామిత్రసొమ్ముబరణి గన్నకన్నెఁ గొని నిజపరివారపరివృ
తుండై కదలి సంభ్రంపుటగడిత పడయు బెడంగుప్రోలుమేలుబంతికిం జని

* తపనతనూజభవకా జలు ను. సూ. † సోమాసుల ‡ నయ్యాంపకేడ్డా, బిడ్డ

యెంతయు సంతోషంబార నయ్యుదంతంబు నిజాంతరంగులకు నెఱింగించి తదనుమతి రిక్షనుడువులఁ దెలియం బ్రోడతొలిపుట్టువుజన్నిదంపువారలఁ బౌరుల రావించి నిరస్తదోషతిమిరంబును సుగుణవర్తియు సుగ్రహాన్వీహంబు నగు నొక్కసుప్రకాశ వివాహముహూర్తం బేక *వ్యాసరభాసురం బని నిశ్చయింపించి సర్వజనులం దహఃస్వనంబునకు రా నియమించి మీఁదటి †తక్కచక్కరవఁతిం బిలిపించి తత్పురాలంకారంబునకు నియోగించిన. ౬౭

గీ. అన్నివింతల కాస్పదం బగుపురంబు, నందు నేవింత ఘటియింప నతఁడు నేర్చె
నయిన నత్తఱిఁ బౌనరుక్త్యం బొనర్చె, నతులచాతురిఁ గొన్నిపదార్థములకు.

వ. అంత. ౬౮

సీ. వేవెలుంగులు గల్గు విన్నాణి వేలుపు తుపోఁడుములు నిల్చు గొప్పగద్దె
ముత్తెంటిపలుకులు మొనయు వేసము వాఁడు తమ్ములనగియించుతళ్కుటేఁడు
సుడివాలు పేరింటిపులుఁగునేదునొయూరి పండ్రెండురూపులబలిమికాఁడు
కడలియిల్లటపల్లు బెడఁగుబల్లుడికన్ను పగలుగావించునేర్పరులమేటి
లెక్కపేరింటిగుబ్బుంబుదక్కుజోదు, చుట్ట మంతటి కనఁ దగుదిట్టసామి
చాయకైవడి వెన్వెంటఁ జాయ రాఁగఁ, గూఁతుపెండ్లికిఁ జనుదెంచెఁ గూర్మిమిగులఁ.

గీ. పెండ్లియఖిలప్రమోదంబుఁ బెనుచుజగతి, సఖిలజగములతండ్రిపెండ్లామనసఁగఁ
బిలువకున్నను బిలిచిన నెలమి రాక, యుండువారు జగంబుల నుండు టరిది.

క. పంకజలోచనునప్పురి, సంకోచాభావ మొనర సర్వజనంబుల్
పొంకముమీఱి మెలంగఁగఁ, బంకజనాభోదరంబుభాతిం గనియెన్. ౭౦

సీ. చతురాగమానూనసారస్వతస్ఫూర్తి లోకచోట నానంద మొదవఁజేయఁ
‡చతురాతితతినదర్శనఘోషవైఖరు లొక్కచో మోదంబు నిక్కఁజేయఁ
జతురుదాత్తకవిత్వసాధుసస్వానంబు వీనుల కొక్కెడ విందు యొసఁగఁ
జతురభినయసమంచన్మేదురధ్వాను లొకవంక సంతసం బొప్పఁజేయఁ
జతురనల్పమహావాద్యవితతినాద, మంజిమం బొక్కదిక్కున ముదికు నర్ప
నద్దిరద్దిర యోహోహొ హెయనాంభళిర, యపుడు నాదాత్మకబ్రహ్మమయ్యె బురము.

క. అతుకవ్యక్తులకైవడి, నకృతాఖిలదోషయోగ మయి సుగుణంబై
తుకవులవక్కులు ముదమిడె, సకలజనులకిచట బ్రహ్మసదనత నేమో. ౭౨

*ద్వ్యసుర. †తక్కచక్కెరకతిక. ‡జతురతికతినదర్శఘోష——మూ.

ఉ. సందడి జాఱి భూ(ష)వరసంతతభూషణపద్మరాగముల్
పొం దగునందుఁగుఁ జివురుబోఁడె లటంచు గజంబు లూని యీ
సొం దుచు మీఁదికింబఱుప నూర్ధ్వశలంబున నిల్చె నవ్వి రా
నంకులు లేక తర్ప్రచుల సాఁకును రక్తవితానరోచులన్. ౭౬

సీ. వితతవజ్రోపలావిరళకీలితములు మున్ను వీథులు పంకమునకుఁ జొరవు
బహుళమహాదారభద్రేభదానవారాపగాపూర్ణంబు లయ్యె నిపుడు
బహుళమహోదారభద్రేభదానవారావగల్ పయిగ్రమ్మ సమితనృపతి
సంబాధహేతుకసంఘర్షణచ్యుతచారుసౌవర్ణభూషణరజంబు
లెనయ నవి పంకమై *నెరెటేర్లఁబోలఁ, దత్క్షణంబునఁ దద్వృత్తఁ దాల్చెవీథు
లంతటనపంకతవహించె నమిత †జన్మి, బహుళసమ్మర్దజనితోష్మబలముకతన.

గీ. లక్షణాఢ్యగుణస్థూలలక్షులందుఁ, దనరె స్వసమర్పణము పరార్థంబుగాఁగ
నఖిలకృతలక్షణులయందు నధివసించెఁ, జెన్నుగ స్వసిద్ధికై పరాపేక్షమచట.

క. చిత్రవ్యక్తుల నట వ్యా, క్చిత్రాభి‡వ్యక్తు లేమి చిత్రం బగునే
చిత్రవ్యక్తులఁ జిత్రము, చిత్రధ్వనిమయత నర్థచిత్రత మెఱయన్. ౭౮

— శ్రీకృష్ణుని మంగళస్నానము. —

ఉ. అంతట గర్గముఖ్యు లగునట్టి మహీసురు లెల్ల వచ్చి శ్రీ
కాంత సమీపవర్తి యయి కానఁగనయ్యె ముహూర్తవేళ మీ
రింతట జాగు మానఁ దగు నిచ్చ శుభార్థపుమజ్జనంబుపై
నింత వసింపఁ జేయు మన నీహిత మొప్పఁగ మాధవుం డొగిన్. ౭౯

క. అంజనగిరితుల్యుండు ని, రంజనుఁడు జగంబు లెల్ల నంజలు లిడఁగాఁ
గుంజరగతి వచ్చుచు న, భ్యంజనమున కతులపీఠి నాశీనుఁడుగన్. ౮౦

ఉ. వన్నెలుమీఱఁ గొన్న చెలువం గొని పొంగుచు నస్మదాదులం
గన్నయనాదిపూరుష యఖండమహోదయ యిట్టిపెండ్లి నీ
కెన్నఁగఁ దన్మహామహిమనే కద గాన భరింపు మామె నం
చన్నలినోద్భవాదిసుర లచ్యుతునొఁదలఁ బెట్టి రక్షతల్. ౮౧

చ. దరము దరంబు నిచ్చు రొదఁ దాల్చును దా నరిగాదు ఫీణ వ
ల్లరియుఁగ మేళవింప నగు నస్ఫురితాక్షర మద్ది సాటియే
సురుచిరవర్ణసన్మధురసూక్తిగళంబుల కంచు నెంచ న
ప్పురముని చెంత నంగనలు పాటలు పాడిరి నెర్పుమీఱఁగన్. ౮౨

* నెరెటిగ్గ(బో)మాల. † జన్మ. ‡ వ్యక్తిలేమి.

# కాకినాడ-పరిషత్కార్యాలయమున వెలకు దొరకు గ్రంథములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయకవి | రు | 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... | ... | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | ... | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్లపాక పెదతిరుమలార్యుడు | ... | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు బి. ఏ., యల్. టి. ... | ... | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శేషు సర్వశాస్త్రికవి | ... | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు | ... | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ. రామయ్యపంతులు గారు, బి ఏ., బి. ఎల్. ... | ... | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి | ... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రితగ్రంథసూచిక ... | ... | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | ... | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు | ... | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు బి ఏ., బి. ఎల్. ... | ... | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... | ... | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | ... | 0 | 8 | 0 |
| 17 | Dravidian Lexicography ... | ... | 0 | 4 | 0 |
| 18 | ప్రహస్వరంగములు-క్రొత్తపల్లి సూర్యరావుగారు... | ... | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము ఉత్తరభాగము-హరిభట్టు | ... | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాసవిలాసనాటకము—రంగాజమ్మ. | ... | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయకుడు | ... | 0 | 12 | 0 |
| 22 | కాళిదీకవ్యాకరణయము (మొదటిభాగము) అహోబలపతి | | 1 | 0 | 0 |
| 23 | రెడ్డనాటి రెండుశాసనములు (శ్రీ)నథుః | ... | 0 | 4 | 0 |

Printed by M. Rangiah at the Cocanada Printing Works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**

సంపుటము ౧౮, { శుక్ల నామ సంవత్సరము. ఆశ్వయుజ కార్తీకమాసములు. } సంచిక ౪.



కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచే పరిషత్కార్యాలయమునఁ
ప్రకటింపఁబడినది.

చందా { పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. 3. } { విడిసంచిక రు ౦-౮-౦

1929

# ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు, పరిషద్వ్యవస్థాపకాధ్యక్షులు
కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు

# ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు—ఉయ్యూరు జమీందారువారు.

శ్రీరాణి వత్సవాయ వేంకట సుభద్రయ్యమ్మ జగపతిబహద్దరుగారు—తుని రాణిగారు.

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు

# ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

## అధ్యక్షుడు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

## కార్యదర్శులు.

దర్భా వేంకటశివరామరాజుగారు బి. ఏ. బి. ఎల్.

కిడాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఎ బి. ఎల్.

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్‌బహాదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు.

డాక్టర్ వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ. ఎల్. టి. PH. D.

(కోశాధ్యక్షులు.)

శ్రీత్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు

కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు

అనంతపంతుల రామలింగస్వామిగారు,

దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారు బి. ఏ.

తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు

అక్కిరాజు వేంకట్రామయ్యగారు

కోకా వెంకటసుబ్బారావు నాయుడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు

పిళ్లారిసెట్టి రంగబ్రహ్మరావు నాయుడుగారు.

# విషయసూచిక.

# పరిషత్ప్రయోజనములు.

తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసఁగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి :—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట;

ii తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట;

iii ఆధునికశాస్త్ర గ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుటయు;

v సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట ఇందు బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుగూడ నుండవలయును;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపకరించు నన్ని కార్యములను జేయుట.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

సంపుటము ౧౫. { శుక్ల నామసంవత్సరము
ఆశ్వయుజకార్తికమాసములు. } సంచిక ౪.

## అక్కన్నమాదన్నలు.

— జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. యల్. —

అక్కన్నమాదన్నగార్ల పేళ్లు తెలియనివారు తెలుఁగుదేశములో లే రనియే చెప్పవచ్చును. ఎవరయిన నిద్దఱు కలసి మెలసి స్నేహముగా నున్నయెడల వా రక్కన్నమాదన్నగార్లవలె నున్నా రని చెప్పుదురు. కాని యీ యక్కన్నమాదన్న లెవ్వరో చక్కగాఁ దెలిసినవా రరుదు. వారిసమకాలికుఁడైనట్టియు వారిని స్వయముగా నెఱిఁగినట్టియు "హ్యావర్టు" (Havart) అను డచ్చిదేశస్థుఁడు, తనపేరటఁ బ్రకటించుచుండిన "హ్యావర్టు" అనుపత్రికలో నీసోదరులవృత్తాంతము కొంత వారిప్రతిబింబములతోఁగూడఁ బ్రకటించెను. దాని సారాంశము రాజకీయశాసనాధికారిగారు 1914-15 వ సంవత్సరపుఁ గార్యనివేదనములోఁ బ్రకటించిరి. దీని యాంధ్రానువాదము తెలుఁగువారికిఁ దెలియుటకై యీక్రింద నుదాహరించుచున్నాఁడను.

హ్యావర్టుగారు చెప్పిన దేమనఁగా:—

అక్కన్న మాదన్న లన్నదమ్ములు. తొలుత మిక్కిలి బీదవారలు. గోలుకొండనవాబు అబ్దుల్లాకుతుబ్ షా అను నతఁడు రాజ్యముచేయుచున్నప్పుడు, వీరిరువురును నవాబుగారి మంత్రియు, మీరుజుమ్లా యను సుప్రసిద్ధబిరుదము గలవాఁడును నగు సయ్యదు ముస్తఫా యనునతనియొద్ద క్రీ. 1666 వ సంవత్సరములో నెలకుఁ బది "గిల్డర్లు" (Gilders) జీతముమీఁద "మరాబులు"గాఁ బ్రవేశించి క్రమక్రమముగా వృద్ధిలోనికి వచ్చిరి. మాదన్నకు సూర్యప్రకా

శరా యను నామాంతర ముండెను. ఈతఁడు తెలివిగలవాఁడు. అక్కన్న యశ క్తదుర్జనుఁడు. వీ రుచ్ఛస్థితికి వచ్చినకాలములో వీరియజమానుఁ డయిన మీరు జుమ్లా పదభ్రష్టుఁ డయ్యెను. దీని కీయక్కన్నమాదన్నగార్లే కారకు లేమో యని కొంద ఱనుకొనిరి. మాదన్న క్రమముగా నవాబుగారియొద్ద సన్నిధానవర్తియు సర్వకార్యధురంధరుఁడు నయ్యెను. నవాబుగారు రాజ్యభా రమంతయు మాదన్నయం దుంచి తాను జీవనార్థము 75000 డాలర్లధనము తీసికొనుచుండెను. మాదన్నకు హిందూస్థానీ పారసీకభాషలయందును దేశ భాషలయందును పాండిత్య ముండెను. ఆయన రాజవైభవ మనుభవించుచుం డెడువాఁడు. ఆయన బంగారు పల్లకి యెక్కి వీధులవెంట వెళ్ళునప్పుడు జను లెక్కడివార క్కడ నిలిచి యాయనను గౌరవించుచుండెడివారు. ఆయనకు దచ్చి వారియం దధికాదర ముండెడిది.

అబ్దుల్లాకుతుబ్షా (క్రీ 1611-22) యనంతరము అబుల్హసన్ అను నతఁడు రాజయ్యెను. ఈతనికి తానీషా యను బిరుదము గలదు. ఈతనియొద్దఁ గూడ నీయక్కన్నమాదన్నలు గొప్పయుద్యోగములలోనే యుండిరి. క్రీ 1685 వ సంవత్సరములో ఢిల్లీచక్రవర్తియైన ఔరంగజేబు గోలకొండపైకి దండెత్తి వచ్చి ముందుగా మాదన్నయిల్లు చూఱగొనియెను. పట్టణములోని ప్రజయం తయు భయభ్రాంత మయ్యెను. మాదన్న రాజద్రోహము చేసి ఔరంగజేబునకు తోడ్పడె నని ప్రవాదము కలిగెను. కొందఱు జనులు రాజానుమతిని బొంది యంతదనుక రాజుగారి యంతరంగమిత్రులుగా నుండిన యక్కన్నమాదన్నలను వీధులవెంట నీడ్చికొనిపోయి పరిభవించి చంపిరి. వారి తలలు నఱికి మాదన్న తలను ఔరంగజేబునకుఁ బంపి, అక్కన్నతలను, ఏనుఁగుకాలిక్రిందఁ బెట్టి త్రొ క్కించిరి. ఢిల్లీసేన గోలకొండపట్నము క్రీ 1685 వ సంవత్సరము అక్టోబరు నెల డి 29 తేదీని ప్రవేశించెను. అక్కన్నమాదన్నగార్లహత్య యాదినముననో లేక యానెల 30-31 తేదీలలో నో జరిగియుండును. 1687 వ సంవత్సరము లో తానీషానుపట్టుకొని దౌలతాబాదుకోటలోఁ జెఱలో నుంచిరి.

ఇంతవఱకు హ్యూపట్టుగారు చెప్పినవృత్తాంతము. అక్కన్నమాదన్నలు తెలుఁగువారనియు, రామదాసుచరిత్ర కథానాయకుఁడును రామదా సను నపరనామముగలవాఁడు నగు కంచెర్ల గోపన్నకు మేనమామ లనియు నొకవ దంతి తెలుఁగుదేశమునఁ గలదు. కాని, దీనికిఁ దగిన యాధారములు కనఁబడ

లేదు. గోలకొండదేశములోని వరంగలుపట్టణము (ఏకశిలానగరము) లో, పింగళి నరసింహారావు పింగళి అక్కన్న అను మహారాష్ట్రులు గలరు. వీరికి "దేశముఖు" లను బిరుదము గలదు. వీరు అక్కన్నమాదన్నల వంశమువా రని ప్రతీతి గలదు.

౧౩౬౦ వ శకసంవత్సర ప్రాంతమందు, కర్ణాటరాజ్యమును పాలించిన దేవరాయల మంత్రులు- లక్కన్నమాదన్న లనువారిద్ద ఱుండెడివారు. వారును అన్నదమ్ములే. బొమ్మాయమ్మ యనునామె కొడుకులు. విష్ణువర్ధనగోత్రులు. వారికి కన్నడమందు "హెగ్గడెదేవగళు" (ప్రెగ్గడదేవులు) అను బిరు దుండెడిది. వీరు వేఱు, గోలకొండమంత్రు లైన అక్కన్నమాదన్నలు వేఱు నని వేఱే చెప్ప నక్కఱ లేదుకదా.

(ఈ మాదన్నగారి ప్రతిబింబమును మాకు ఆంధ్రపత్రికాధిపతు లొసంగిరి. అక్కన్నగారి ప్రతిబింబము ముందు లభించినపుడు ప్రచురించెదము.)

# త్రిలింగము-తెలుఁగు-తెనుఁగు.

## ప్రతివాదవిమర్శనము.

సాహిత్యవిద్యాప్రవీణ- బులుసు వేంకటరమణయ్యగారు, విజయనగరము.



క్రిందటి యాంధ్రసాహిత్యపరిషత్పత్రికాసంచికయందు శ్రీవిక్రమదేవవర్మగారు నా "త్రిలింగము- తెలుఁగు- తెనుఁగు" అనువ్యాసమునకుఁ బ్రతివాదమును బ్రకటించిరి. శ్రీవిక్రమదేవవర్మగారు పెద్దలు. సుప్రసిద్ధాంధ్రపండితులు. బహుగ్రంథద్రష్టలు. అట్టివారికి బాలుఁడ నగు నేను దిరిగి సమాధాన మిచ్చుట సాహసమే యగును. కాన శ్రీవిక్రమదేవవర్మగారు క్షమించి నాయీ సమాధానమును బరికింతురుగాక !

నేను నావ్యాసమున "మఱికొందఱు..............తలకళింగమునుండి తెలుఁగు పుట్టిన దని చెప్పుచున్నా" రని వ్రాసితి ననియుఁ, దలకళింగమునుండి తెలుఁగు పుట్టిన దని చెప్పినవారు "మఱికొందఱు" కాక శ్రీవిక్రమదేవవర్మగారే యనియు వారి ప్రతివాదమునఁ గలదు. నేను "శ్రీవిక్రమదేవవర్మగారిట్లనుచున్నా" రని వ్రాయకుండుట తప్పే యగును. కాని వారు సాహిత్యపరిషత్పత్రిక 16 వ సంపుటము 2 వ సంచికలో వ్రాసిన "కళింగదేశవృత్తాంత" మనువ్యాసమునందలి "ఉత్కళింగమే యుత్కళముగాను, తలకళింగమే తెలుఁగుగాను మాఱిన దని కొందఱయభిప్రాయము. అట్టియభిప్రాయ మగ్రాహ్యము కాదు." అనువాక్యద్వయముం బట్టి నాత ప్వంతగా లే దేమో యని యనుకొనుచున్నాను. ఇప్పటి శ్రీవిక్రమదేవవర్మగారి వ్రాఁతలంబట్టి యట్టియభిప్రాయము కలవారు వా రొక్కరే యని తేలుచున్నది.

నేను బ్రతిపాదించిన విషయమునఁ గొంత ప్రాచీనమును గొంత నవీనము నుండవచ్చును. గంజాముమండలమునఁ గొంతభాగము తెలుఁగుదేశ మనుటచే శ్రీవిక్రమదేవవర్మగారికిఁ గోపము కలిగి యుండవచ్చును. కాని నాయూహ కేవలము నిరాధారము కాదని నాశక్తికొలఁది నొసంగిన ప్రమాణములు చెప్ప గలవు. తమకుఁ బ్రతికూలము లగుప్రమాణము లన్నియుఁ బ్రక్షిప్తము లనియు నసందర్భము లనియుఁ బలికినచో నికఁ బ్రమాణముల నీయవలసిన యవసరమే లేదు.

ఒక్కలింగమును, ఒక్కపర్వతమును గలమాత్రమున నయ్యది తెలుఁగు దేశపుసరిహద్దు కాఁగల దని మాత్రము నాయాశయము కాదు. త్రిలింగము

నుండి తెలుఁగు పుట్టిన దని యామూఁడులింగములను నిర్ణయించిన మనప్రాచీనాంధ్రశ్లాఘనీకులయుండును శ్రీవిక్రమదేవవర్మగారి యాక్షేపణ కవకాశ ముండదు. అప్పుడును గాణేసు లన రామలింగేశు లని యనుకొనవలసియుండును. అయ్యది సముచితయుక్తియా ?

నేను ద్రాక్షారామభీమేశునకును, మహేంద్రగిరిపైనున్న గోకర్ణేశ్వరునకును నభేద మెచ్చటఁ జెప్పలేదు. నామతమున ద్రాక్షారామము నొకయెల్లయే కాదు. నే నాయెల్ల నంగీకరించినపుడు గదా యభేదతా సమర్థనపర్యంతానుధావనము సంభవించుటకు- నావ్యాసమునందలి యేవాక్యము భీమేశగోకర్ణేశుల కభేదము చెప్పుచున్న దని శ్రీవిక్రమదేవవర్మగారు నుడివిరో తెలియకున్నది. మఱియు వారు "విద్యాప్రవీణుఁడుగారు గోదావరీమండలస్థిత భీమేశలింగమునకును గంజాముమండలమందలి మహేంద్రగిరికిని ముడిపెట్టి యెల్ల నేర్పఱిచిరట" అని లిఖించిరి. కాని నావ్యాసమును బాగుగఁ బరికించినచో నేను ముడిపెట్టినది మంథెనకాళేశ్వరమునందలి భీమేశ్వరునకును, గోకర్ణేశ్వరునకును గాని, వా రనుకొనినట్లు కాదని తెలియకపోదు.

మహేంద్రగిరి కలదేశము కళింగదేశము కావచ్చును. అంతమాత్రమున మన కేమియు విరోధము లేదు. తారానాథుఁ డనుబౌద్ధగ్రంథకర్త యాంధ్రదేశమునకుఁ ద్రిలింగ మనునామాంతరము కల దనియుఁ, గళింగము త్రిలింగములోని యొకభాగ మనియుఁ జెప్పియున్నాఁ డనునానుడిని శ్రీవిక్రమదేవవర్మగారు క్రిందటివ్యాసముననే తిలకింపఁగలరు.

శ్రీవర్మగారు వ్రాసిన "కళింగదేశవృత్తాంతము" నందుఁ గూడఁ దద్దేశపరిమితివిషయమై పెక్కు భిన్నాభిప్రాయములు కల వని వారే నిరూపించిరి. అయ్యవి పరస్పరవిరుద్ధములై కూడనున్నయవి. అనఁగా- కొన్నిమతములంబట్టి యుత్కళమును,- మఱికొన్నిమతములంబట్టి యాంధ్రమును లోపించుచున్నవి.

"ఏతే కళింగాః కౌన్తేయ! యత్ర వైతరణీ నదీ"

అనునీమహాభారతవచనము ప్రస్తుతకాలమున నుత్కళదేశముగ వ్యవహరింపఁబడుచున్న వైతరణీనదీపరిసరభాగము కళింగ మని నిరూపించుచున్నది. ఈవైతరణీనది కటకమహానగరమునకు నావలఁ జాలదూరముగఁ గలదుకదా!

"ససాగరం సమాసాద్య గంగాయాః సంగమే నృప
నదీశతానాం పంచానాం కృత్వా చక్రే సమాప్లవమ్॥
తత స్సముద్రతీరేణ జగామ వసుధాధిపః
భ్రాతృభి స్సహితో వీరః కళింగాన్ప్రతి భారత."

అనుమహాభారతారణ్యపర్వమునందలి శ్లోకద్వయమువలన గంగాసాగరసంగమమునఁ గేవల సముద్రతీరమునఁ గళింగదేశ మున్నట్లు సూచితమగునని శ్రీవిక్రమదేవవర్మగారే నుడివిరి. ఈ యుపరినిరూపిత ప్రమాణద్వయముం బట్టి యుత్కళదేశము లోపించి వంగదేశానంతరము కళింగదేశమే యని తెలియుచున్నదిగదా !

"జగన్నాథా త్పూర్వభాగా త్కృష్ణాతీరాంతరం శివే
కళింగదేశ స్సంప్రోక్తో వామమార్గపరాయణః"

అను నర్వాచీనతంత్రగ్రంథములలోని దగు శక్తిసంగమతంత్రమందలి శ్లోకమువలన జగన్నాథక్షేత్రముయొక్క పూర్వభాగము మొదలు కృష్ణానదీతీరమువఱకుఁ గళింగదేశ మయినట్లు తెలియు ననియును, కళింగదేశముయొక్క దక్షిణసీమ ద్రావిడదేశ మని కొంద ఱందు రనియును, శ్రీవిక్రమదేవవర్మగారి వ్యాసమునందే చూడనగును. ఈ ప్రమాణద్వయముంబట్టి యాంధ్రదేశమే లోపించినదిగదా !

ప్రతాపరుద్రదేవగజపతికిఁ బ్రతినిధిగ రాజమహేంద్రవరమున రామరాయానందుఁ డుండి పాలించుచుండినట్లు చైతన్యచరితామృతమునఁ జెప్పఁబడియుంటవలనను "గంగాగోదావర్యో ర్మధ్యే కళింగదేశే" అని యుత్కళులు సంకల్పనమయమున నుచ్చరించుచుంటవలనను గంగానది మొదలు గోదావరి వఱకును గళింగదేశ మైనట్లు కొందఱభియాశయ మని శ్రీవిక్రమదేవవర్మగారు వ్రాసిరి. ఈమతమున నుత్కళమునకే కాక విహారము మొదలగు భాగాంతరములకును లోపము సంభవింపవచ్చును. ఈవిధమున వింతవింత లగునభిప్రాయముల కాలవాలమగు కళింగదేశముయొక్క పరిమాణము నిదమిత్థమ్మని నిర్ణయించుట దుర్ఘటముకదా !

తారానాథవచనముంబట్టియు సుప్రసిద్ధు లగు శ్రీశేషాద్రిరమణకవులు "నిజాంరాష్ట్రాంధ్రప్రశస్తి*" యం దిచ్చిన "జగన్నాథా దూర్ధ్వభాగం.........తావ దంధ్రాభిధో దేశః" ఈ మొద లగు ప్రమాణములంబట్టియు నిది యంతయుఁ దెలుఁగుదేశమే యనియుఁ, గళింగ మాంధ్రమునందలి యొకభాగ మనియుఁ దెలియవచ్చుచున్నది. కానఁ బ్రమాణములకొఱకే వరుగులిడినచో ననేకరీతుల ప్రమాణములు లభింపఁగలవు. అవ్యవస్థిత మగుకళింగదేశపరిమాణముం బట్టి "కళింగదేశమునందలి మహేంద్రగిరిని దెలుఁగుదేశాంతర్గతము చేయుట యతి

*హైదరాబాదు శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయరజతోత్సవమున వెలువడిన రజతోత్సవ పంచిక (నెం.౭.) యందీవ్యాసము చూడనగును.

విచిత్ర మనివ్రాయుట సాహసము. ఒకవేళ మహేంద్రగిరి కళింగదేశస్థమే యైనను ఆంధ్రము-కళింగాంధ్రము—అనువ్యవహారములు నేఁటికిని ప్రసిద్ధములగుట నది కళింగాంధ్రముయొక్క యెల్లయైనం గావచ్చును. ఆంధ్రము వేఱు రాజ్యము కావచ్చును. కళింగము వేఱు కావచ్చును. కాని త్రిలింగమునకును గళింగమునకును వైరుధ్యము లేదు. కళింగదేశమునం గూడఁ గొంతవఱ కాంధ్రభాష మాటలాడుచుండుటంబట్టి యైనను మహేంద్రగిరినిసరిహద్దుగా నేర్పఱుచుట (త్రిలింగమునకు) తప్పిదము కానేరదు.

లింగమును, నగమును గల ప్రతిచోటు నెల్ల యని నే ననలేదు. అట్లుండి—యాదేశమునఁ దెలుఁగుభాష వ్యవహారమున నుండవలెను. కాననే నేను తెలుఁగువారు వసించుతావనియుఁ దలఁపలేదు. తెలుఁగువారు వసించుతావే యైనచో ఖరగపురాదివిహారవంగప్రదేశములందు మనవారు నివసించుచుండుట నయ్యవియుఁ ద్రిలింగాంతర్భూతములు కావలసివచ్చును. కాఁగా శ్రీవిక్రమదేవవర్మగారు "లింగయుక్తనగమునే యెల్లగా గ్రహించినచో సేతుహిమాద్రులకు ముడిపెటవీలగు"నని యధిక్షేపింప నక్కఱలేదు.

బ్రహ్మాండపురాణమునఁ గల ''శ్రీశైలభీమకాళేశ—

అనుశ్లోకమునందలి శ్రీశైలభీమకాళేశమహేంద్రగిరులకూరుపే దానిని ప్రక్షిప్తముగాఁ జెప్పక చెప్పుచున్న దని శ్రీవిక్రమదేవవర్మగారు వ్రాసియున్నారు. కాని యెట్లు ప్రక్షిప్త మని నిరూపించునో యించుకంతయు నాకు బోధపడకున్నది. దూరదూరమున నున్నవానికూరుపు ప్రక్షిప్తములైనచో నెల్లలను నిరూపించునన్నియుఁ బ్రక్షిప్తము లనియు, నసందర్భము లనియు ననవలసివచ్చును.

తలకళింగమునుండి తెలుఁగు పుట్టిన దని వాదించు శ్రీవర్మగారు తలకళింగపుటెల్లలను గాని, తద్విషయమును మఱి దేనినిగాని చెప్పియుండలేదు. శ్రీవర్మగారు త్రిలింగమునుండి తెలుఁగుపుట్టిన దనుటకంటెఁ దలకళింగమునుండియే పుట్టిన దనుట యధికతరయుక్తియుక్త మని వ్రాసిరి. అందులకు వారు నిరూపించిన కారణములఁ గనుఁడు. "చెప్పఁబడిన మూఁడులింగములును సృష్ట్యాదిసంభవములు గాని, యేకకాలప్రతిష్ఠితములు గాని కావనుట నిశ్చయము. ఆలింగముల ప్రతిష్ఠకు మునుపు తన్మధ్యదేశము నామశూన్యముగ నుండె ననుట యసమంజసము." అని వారియూహము. కాని యిది యుక్తము కాదు. ఆమూఁడులింగములు సృష్ట్యాదిసంభవములో కావో మనము నిరూపింపఁజాలము.

అక్ష్లే యయ్యవి యేకకాలప్రతిష్ఠితములు కా వనుటలోఁ గూడ యుక్తి లేదు. ఒకవేళ నవి యేకకాలప్రతిష్ఠితములు కాకపోయినను, మూఁడులింగములును దయారయిన యనంతరమే యీ త్రిలింగవ్యవహారము వచ్చి యుండవచ్చును. ఆలింగములు లేకపూర్వ మీదేశము నామశూన్య మై యుండనక్కఱ లేదు. వ్యవహారాంతరము కల దనినచో నష్టమును లేదు. ఆవ్యవహారముతో మనకుఁ బ్రసక్తియును లేదు.

తలకళింగోద్భవమే యైనచోఁ దెలుఁగుదేశము బళ్ళారిమండలమువఱకును బ్రాఁకిపోవుట యుచితమా ? కళింగాధినాథాదులను బెక్కండ్ర నోడించి యంధ్రమహాసామ్రాజ్యాధిష్ఠాపకుఁడును, ఆంధ్రభోజుండును, "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యను సూక్తి నెలకొల్పినవాఁడును నగు కృష్ణదేవరాయసార్వభౌముఁడు వాడిన దీతలకళింగమునుండి యుత్పన్నమైన తెలుఁగేనా? కాఁగా కృష్ణదేవరాయలు తెలుఁగు(తలకళింగము)రాయలా ?

వీరిమతముచొప్పున నీరీతినే యుత్తకళింగమునుండి యుత్కళ మేర్పడినచోఁ గ్రీస్తుశకము ౧౨౩౧—౫౭ నడుమఁ బరిపాలించిన నరసింహదేవునకుఁ గల "ఉత్తలకళింగసామ్రా"ట్టను బిరుదమున కౌచితి పొసఁగుటెట్లు ? కాక యది యనాలోచితముగ నొసంగఁబడిన బిరుదమని శ్రీవర్మగారు తలంతురా?

"తెలుఁగుదేశమున నెన్నఁడును సంస్కృతము వ్యావహారికభాషగా నుండమిఁ దద్దేశము సంస్కృతసమాసయుక్త మగు త్రిలింగదేశ మని కాని, త్రినగదేశ మని కాని వ్యవహరింపఁబడియుండక తెలుఁగునాఁ డని వాడఁబడుచుండె ననుటయె యుక్తియుక్తము. కనుకఁ ద్రిలింగ త్రినగపదములను బ్రకృతులనుట యనుచితము................త్రిలింగ త్రినగములను రెండుపదములర్వాచీనాంధ్రపండితులు కల్పించిన వికృతు లనియె యెఱుంగఁ దగు" నను శ్రీవిక్రమదేవవర్మగారు తాము తలకళింగమునుండి తెలుఁగు పుట్టిన దని వాదించునపుడు మాత్రము తెలుఁగుదేశమున సంస్కృతభాష వ్యావహారికభాషగా నుండె నని వాదింతురు కాఁబోలు ? తలకళింగపద మపు డర్వాచీనపండితకల్పిత మగువికృతి కాదు కాఁబోలును.

తాఁ జేసినపని యెట్టిదైనను దానియందు నమ్మకము పోఁజాలదు. కావుననే నేను మఱల నీవ్యాసము వ్రాయనుపక్రమించితిని. కాని శ్రీవర్మగారు తమవ్యాసము చివఱవ్రాసినశ్లోకమే నేనును వ్రాయవలసివచ్చును. కాని యంతటి సాహసము నాకు లేదు. ఇఁక విరమింతును.

# పద్యాంధ్రవ్యాకరణము.

— ( పరవస్తు చిన్నయసూరి ) —



ఉ. శ్రీమహిమాఢ్యదివ్యమహిషీనయనోత్పలచారుదీధితి
స్తోమ మనారతం బగుచుఁ జొక్కునఁ బర్వట నాఁగ మేచక
శ్రీ మెయిఁ దోఁప నొప్పలరు శేషధరాగ్రనికేతనుండు భ
క్తామరపాదపోత్తమ ముదారఫలప్రతిపాదిగావుతన్. ౧

గీ. ఆద్యభాషకు నేఁబది యక్కరములు, ప్రకృతికవి పది యాఱనఁ బలుకు లిందు
మువ్వదాఱగుసవియన్యములనుశబ్ద, యోగవశమునఁబిఱుఁదామ్చునదధికయున
ఆదులుపదాఱుస్వరములు కాదికములు, ముప్పదియు నాల్గువ్యంజనంబులనఁదనరు
బిందువువిసర్జనీయంబు వెలయువ్యంజ, నములు ననవాద్యభాషఁ బన్నగనగేశ.

కం. ఋౠఌౡములు నాల్గు వక్రత,ము ములు ఙఞశషాక్షరములు మానిన నవశి
ష్టములగు నలువదివర్ణము, లమరు ద్వితీయప్రకృతికి నగధరనిలయా. ౩

గీ. అత్వ మాత్వ మిత్వం బీత్వ ముత్వ మూత్వ
మెత్వ మేత్వ మొత్వం బోత్వ మైత్వ మౌత్వ
మర్థపూర్ణబిందువు లచ్చు లయ్యె వికృతి
కంజనాభార్యమందిర కంజనాభ. ౪

గీ. అమరుఁ దెనుఁగునకును వ్యంజనములు కగచ
జయుగటడణతదనపబమయరలవస
హాళము లిరువదిరెండు మంగాంగనాహృ
దంబురుహమిత్ర జలదవిడంబగాత్ర. ౫

గీ. తక్కుఁగలయట్టివర్ణము లత్సమాన్య, దేశజగ్రామ్యశబ్దయుక్తినిఁ బొసంగుఁ
గాన నలుదెఱఁగగు భాష గానవచ్చు, నక్షరములెల్ల నేఁబదే సజ్జనాథ. ౬

కం. ఋౠఌచతుష్టయము విసర్గమును ఙఞఘకారములను గణుతింపఁగఁ ద
త్సమభాషయందఁ గనఁబడుఁ,గమలాహితమిత్రనయన కమలాకమనా. ౭

గీ. హ్రస్వవక్రము ల్దంత్యచజాక్షరములు, ఖండబిందువు సాంస్కృతికములు గావు
తత్సమముల నొకానొక తావునందుఁ,దంత్యచజలర్ధబిందువు దనరు శౌరి. ౮

కం. అమరు ననుస్వారము సి,ద్ధము సాధ్యము ననఁగ నిరువిధంబులచే సి
ద్ధము నానగు సహజము సా,ధ్యము నా లాక్షణిక మంజనాద్రినిశాంతా.

గీ. అట్టిబిందువు లోకఁ డొక్కఁ డర్ధమనఁగఁ
 బూర్ణమన రెండుదెఱఁగులఁ బొలు చునండ్రు
 వర్గములఁదొలిమూఁడవవర్ణములకు
 దాపటన బొట్టు వికృతిని దనరు శౌరి. ౧౧

గీ. సిద్ధసాధ్యవిభేదసంసిద్ధములగు,నర్ధబిందులు నుడితొలిహ్రస్వమునకుఁ
 గలుగ వ్రాక్కైడమును వ్రాయి పొలిసెనేని, నెలయు నందర్ధబిందువు నీలవర్ణ.

గీ. అఁట యను కిలార్థశబ్దంబునం దిఁక నిఁగ,నను నితఃపరార్థములగు నట్టిపదము
 లందుఁ దొలికుఱుచకుమీఁద నర్ధబిందు,వార్యసమ్మత మండ్రు దేవాదిదేవ.

గీ. హ్రస్వమునకుఁ బరంబగునట్టిఖండ,మునకుఁబూర్ణంబువగుదీర్ఘమునకు మీఁదఁ
గలుగు నేనియా బిందువుఖండమయుని, మెఱుఁగఁదగు నంజవాభూమిభృన్నిశాంత.

క. కరికింతు రార్యులిరువగ, యరలవవర్ణకములు లఘువులలఘువులును నా
 దొరకొను లాఁతులు పెఱవ్యా,కరణంబుల నిందు రేఫ క్రాలు నిరువఁగన్.

గీ. యశ్రుతియకారమును బ్రథమాంతమునకుఁ
 బయిపకారమునకు వచ్చు వత్వము నిట
 లఘువు లండ్రు మనీషులు లాఁతి యవల
 లఘువు లటండ్రు శేషశైలాధివాస ౧౬

గీ రలడలకు బహువచనపరంబులకును,వచ్చెడుళవర్ణ మలఘువుపరములఘువు
 రార్ణభేదంబు తత్ప్రకృతినరయవలయు, నయినఁ గొండొక దెలిపెద నబ్జనాభ.

గీ. ప్రథమభాషను బ్రాకృతభాషయందు,శకటరేఫంబు లేమిఁ దత్సమములందుఁ
 దద్భవములందు నెందును దద్ అవర్ణ,మిరవుకొనదండ్రుబుధులహీధరనిశాంత.

గీ. కొఱకువర్ణక మొకఁడు దక్కువగ వఱలు, ప్రకృతివికృతిసాధారణవర్ణకముల
 నెనఁగునట్టి రవర్ణంబులెల్ల లఘువు,లండ్రు విబుధులు మంగామనోజ్ఞమిత్ర.

గీ. సంఖ్యఁదెలుపునట్టి శబ్దంబులకు మహా,దర్థమందువచ్చునట్టి ప్రత్య
 యములరాలు లఘువు లగు నిద్ద అనుశబ్ద,మందు రేఫ ద్రిక్క నహీధరేశ.

గీ. క్రియలతుదలనున్నరివర్ణకంబులు, వారు వీరు మీరు తారులోను
 గాఁ గలట్టినుడులఁ గలుగు రేఫంబులు, లఘువు లిందిరాకళత్ర శౌరి. ౨౨

గీ. ఆంగాగమస్థదార్థపరతమ,త్వార్థకాదివర్ణకాన్వితములు
 యుష్మదర్థమగుచు నొప్పు రువర్ణంబు,పరఁగు లఘువు లగుచు ధరనిశాంత.

గీ. ధాతుశబ్దములకుఁ దనరు నాదేశంబు,లందు రాలు లఘువు లండ్రుబుధులు
 కలిసశిక్రియార్థభాజులౌ నాదేశ,ములను లఘువుగాదు జలజనేత్ర ౨౩

గీ. తాలు కోలకు ఱికం బనఁగాఁ దనర్చు, వర్ణకములందు గుఱిచినా వఱలుదాన
నందఱిం దఱుందలుకొందఱుం దోలనఁగఁ, గానకనునవియులఘుప్రాంజనేత్ర॥

క. ఆదిగతయవర్ణముఘా, తాదిద్వ్యోతియగు నట్టియుత్వంబును నిం
దేవంతము గొందఱు బుధు, లాదియకారంబు గలుగ దంస్థ రమేశా. ౨౫

గీ. బృహతిడోలావిభూషణాభిఖ్యలందుఁ, గలుగుమధ్యయత్వంబు త్రిక్షంగనందు
గలుగనేరదు మధ్యయకారమునకు, వాదివక్రంబు శేషధరాధివాస. ౨౬

గీ ఉత్వయుక్త మోత్వయుక్తంబు నుడితొలి, వత్వమునకుఁ గాఁబడవు వోష్ఠ్య
ముఖ్యశబ్దములను బొలుచుఁ గొన్నింటఁద, త్సమములందు శేషధరనివాస॥

గీ. అచ్చుమీఁదనున్న యచ్చుయస్త్రితయగు, నద్విలఘుయకారమం త్రుబుధులు
లఘ్వలఘువులయిన లాఁతులు వైథర్మ్య, మొందు వేఫు రేఫ తొంను శౌరి॥

క. ద్వివిధము లగు రేఫములకుఁ, దవులు మిగుల దోషమగుటఁ దలఁపక యొవ్వం
డువదించుఁ గలియ నట్టిఁడ, భువి దుష్టవి యంత్రు బుధులు భూభృన్నిలయా॥

గీ. ప్రాతిపదికంబు నామంబు ప్రత్యయంబు, వర్ణకంబు ధాతువు క్రియస్వరము లెల్లఁ
బ్రాణములు వదపడి యేర్పవక్రమైచ్చు, వక్రతమము నానగు రమాప్రాణనాథ॥

గీ. అత్వ మాత్వ ముత్వం బూత్వ మొత్వ మోత్వ
మౌత్వ మెనసిన చజలు దంత్యములు వెఱలు
తాలుజము లగుఁ దొలియచ్చు దాఁకనంగ
బహుళముగఁ బూర్వవృత్తంబు వడయుశౌరి. ౩౧

గీ. అగు ననుస్వార బిందువు వ్యంజనంబు, లన్ని ప్రాణులు కచటతపాక్షరంబు
లాఱుపఱను గ్గజడదబాక్షరంబు, లాఱు సరళంబు లంజనాహార్యగేహ॥

గీ. వెలయు స్థిరములనఁగ వింత లిర్వదినాల్గు, వార్ణమునకుద్రుతసమాఖ్యయొప్పుఁ
బడయు బుత్వ 'మిట రివత్వము' ప్రాసాదికములబహుళముగనుగాంచుశౌరి॥

క. గలలగములోలిహవసం, జ్ఞలఁ జొప్పడు హనలు సూర్యసంజ్ఞానంబుల్
నలనగసలభరతలు భా, సిలు నింద్రాఖ్యంబు లగుచు క్షితిభృన్నిలయా॥

క. ద్విలఘుమఖవర్ణపంచక, ములు గమఖాక్షరచతుష్టములు చంద్రాఖ్యం
బులు మగము త్రిక్షఁగా నగుఁ, గలశపయోరాశికన్యకాహృదయేశా. ౩౫

గీ. పాదమందు మొదలివర్ణంబు వళియయ్యె, నవలిప్రాయి ప్రాస మనఁగ నొప్పుఁ
బ్రాస మొక్కఁ డన్నిపాదంబులను వళి, స్వస్వపాదనియతి వఱలుశౌరి. ౩౬

క. వళియోగ్యస్థానంబుల, వళిమిత్రము లనుకఁ జెల్లుఁ బ్రాసస్థానం
బుల మూఁటనొకఁడు నొక్కట, నిలుపం దగుఁ దత్సఖంబు నీరదవర్ణా. ౩౭

క. అత్వము వృద్ధియు మిత్రము, లుత్వయుగళి మొత్వ మోత్వ మొందు సఖిత్వం
బత్వ మవశిష్టములు మి, త్రత్వము వాదించు శేషధరవరనిలయా. ౩౮

గీ. హాయుల సత్వవద్భావంబు నందు నెపుడుఁ
దద్యుతవ్యంజనములు ఋత్వంబుఁ గూడ
వ్యంజనములు ననత్వవద్భావ మొందు
వలసినప్పుడు వళివిధి వార్ధిశయన. ౩౯

గీ. వక్రమునకు నకారంబు పరముగాఁగఁ, బూర్వపరముల నాదేశముగ నెసంగు
వక్రమునకు నత్వము మిత్రభావమందు, నబ్జనిభగాత్ర దురితతమోబ్జమిత్ర.

గీ. అత్వమున కేచ్చు పరముగా నంతమునకు, నాదికిని నెలకొనియెడునట్టి వృద్ధి
వక్రవద్భావమును వికల్పంబుగాఁగఁ, గాంచు నంజనాహార్య నికాయ్యశౌరి.

గీ. నిదుదయుక్తపరము నెఱసున్న గలది వి, సర్జనీయయుతము స్వరము లేని
హల్లుకంటెఁ బూర్వమందున్న యదియును, గురువులౌఁ దిలఘువు పరమపురుష.

గీ. వికృతిపదచరమార్ణంబు ద్విత్వయుక్త, వర్ణము కతంబునను గురుత్వంబు గాంచు
నద్రుచు విస్రుచు నా మొదలగు నట్టి శబ్ద, ములగురుత్వ మాదికి లేదు జలజనయన.

గీ. గణముగాఁగ మూఁడచ్చులు గలుగునట్టి
యక్షరవ్యూహ మందు రయ్యాది మయరస
తజభనాహ్వయంబుల నష్టధావిభక్త
మగుచు నొప్పారు నం ద్రంజనాద్రిగేహ. ౪౪

గీ. అవ్యయములు సుప్తిజంతముల్ క్త్వాతుము, న్నంతములును గలుగ నవికృతంబు
లనుకరణమునందు నగును వాక్యంబును, బరమపురుష వృషభధరనివాస

గీ. అనుకరణవిహీనమయ్యు నసంకీర్ణ, వాక్యమిందుఁ గూర్పవచ్చు నండ్రు
కొందఱార్యు లిట్లు గూర్పనౌ నవికృతి, పదము సత్ప్రయుక్తివలన శౌరి. ౪౫

క. వలసినచోఁ గడద్రుతములు, దలసూపని పదము లెల్లఁ దగుఁ గళలన లాఁ
తులు దనరు ద్రుతప్రకృతిక, ములునా మాగామనోబ్జపూషసువేషా. ౪౬

సీ. బహువచనక్రియాపదములు మధ్యమపురుషక్రియాపదములును జాది
వర్ణకాంతక్రియాపదములు యొక్క షష్ఠీవిభక్తియుఁ బ్రథమావిభక్తి
కర్మప్రవచనీయకంబులు కయిపట్టి యనువిభక్తులు కించిదర్థకములు
నంతావచిత్రప్రశంసాయదాతదాకర్హ్యాధునార్థప్రకాశకములు
కెలకిమేవతూష్ణీక్త్వార్థములు మొదలగు, నట్టిశబ్దంబు లెల్లఁ గళాహ్వయంబు
లన్యములు ద్రుతప్రకృతులటండ్రు బుధులు, విమలకరుణారసావేశ వేంకటేశ. ౪౭

---

(ఇంతవఱకే లభించినవి — ఎవ్వరియొద్దనేనున్నఁ బంపినచో నంతయుఁ జేర్చి ముద్రించెదము.
వ. అ.)

# ఊరుభంగము.

—:పిలకా గణపతి గారు. విజయనగరము.:-

ఇది యొకప్రాచీననాటకము. సంస్కృతనాటకకర్తలందఱికంటెను ప్రాచీనుఁడని యెంచఁబడుచున్న భాసమహాకవి యీకృతికిఁ గర్త. ఈతఁడు క్రీ. పూ. నాలుగవశతాబ్దిలోనివాఁడని భాసనాటకచక్రోద్ధారకు లగు త. గణపతి శాస్త్రిగారు నిర్ణయించిరి. భాసకృతి యగు "ప్రతిజ్ఞాయౌగంధరాయణ" మందలి కథాసంవిధానమును క్రైస్తవశకప్రారంభమున కొకశతాబ్దము పూర్వమున నున్న భామహుఁడు విమర్శించుటచేతను సీతనినాటకములలోని ప్రయోగము లపాణినీయములు నార్షప్రయోగములు నగుటచేతను, సీతని ప్రతిజ్ఞాయౌగంధరాయణమందలి యొకశ్లోకమును క్రీ. పూ. నాలుగవశతాబ్దమున నున్నచాణక్యుఁడు తనయర్థశాస్త్రమున లిఖించుటచేతను, నీమహాకవి క్రీ. పూ. నాలుగవశతాబ్దములోనివాఁడయియుండవచ్చు నని త. గణపతిశాస్త్రిగారు వ్రాసిరి.

భాసమహాకవి 13 నాటకములను వ్రాసెను. వానిలో నీయూరుభంగ మొకటి. ఇది యేకాంకనాటకము. భీమదుర్యోధనులయుద్ధమును భీముఁడు దుర్యోధనునియూరుభంగ మొనర్చుటయు నిందలి వస్తువు. ఇది దుఃఖాంతనాటకము. ఈనాటక మిట్లంత మగుచున్నది. దీనిని బట్టి పాఠకు లిది దుఃఖాంత మగునో కాదో నిర్ణయింపఁగలరు.

రాజా—(దుర్యోధనుఁడు)—పరిత్యజన్తి మే ప్రాణాః ఇమేత్రభవన్తశ్శాన్తనుప్రభృతయో మే పితృప్రపితామహాః। ఏతత్కర్ణ మగ్రతః కృత్వా సముత్థితం భ్రాతృశతమ్। అయ మప్యైరావతశిరోవిమర్దః కాళవత్యుధరః కృద్ధోఽభి భావతే మా మభిమన్యుః। ఇమా ఊర్వశ్యాదయోఽప్సరసో మామభిగతాః ఇమే మూర్తిమంతో మహార్ణవాః। ఏతా గంగాప్రభృతయో మహానద్యః। ఏష సహస్రహంసప్రయుక్తో మాం నేతుం వీరవాహీవిమానః కాలేన ప్రేషితః అయమహ మాగచ్ఛామి (స్వర్గం గతః)

ధృతరాష్ట్రః—యా మ్యేష సజ్జనధనాని తపోవనాని
పుత్రప్రణాశవిఫలం హి ధిగస్తు రాజ్యమ్.

అశ్వత్థామా—యాతోద్య సౌప్తికవధోద్యతబాణపాణిః ద్రాంపాతునో నరపతిః శమితారిపక్షః। "దీనినిబట్టి యిది దుఃఖాంతనాటక మని చెప్పకతప్పదు.

ఇట్టివిలక్షణమగు దుఃఖాంతనాటకము సంస్కృతములోని కెట్లు వచ్చి నదో యూహింప శక్యము గాకున్నది. ఈనాటకమునకుఁ బీఠిక వ్రాయుచు త. గణపతిశాస్త్రిగారు పీఠికలో "ఊరుభంగే దుఃఖాంతత్వం విశేషః" అని వ్రాసిరి. దీనినిబట్టి యాయనకూడ దీనిని దుఃఖాంతమనియే నమ్మెను. కాని పైవిషయ మేమియుఁ జర్చింపలేదు. కారణము తెలియదు. ఈవిషయమును బండితాగ్రగణ్యులు చర్చించి సత్యమును వెల్లడింతురుగాక !

ఈనాటకమును గొన్నితావుల వేణీసంహారకర్త యగుభట్టనారాయణుఁ డనుకరించిన ట్లగపడుచున్నది. వేణీసంహారమందలి దుర్యోధనుని స్వభావమును, నూరుభంగమందలి దుర్యోధనుని స్వభావమును నొక్కపోలిక నున్నవి. మఱియు నూరుభంగమందలి—

"భీష్మద్రోణతటాం జయద్రథజలాం గాంధారరాజహ్రదాం
కర్ణద్రౌణికృపోర్మినక్రమకరాం దుర్యోధనస్రోతసమ్
తీర్ణః శత్రునదీం శరాసనసికతాం యేన ప్లవేనార్జునః
శత్రూణాం తరణేషు వః సభగవా నస్తు ప్లవః కేశవః"

అను నీశ్లోకమును,

"ప్రతిజ్ఞావసితే భీమే గతే భ్రాతృశతే దివమ్,
మయిచైవం గతే రామ విగ్రహః కింకరిష్యతి"

అను నీశ్లోకమును భట్టనారాయణుఁడు వేణీసంహారమున,

"తీర్ణే భీష్మమహోదధౌ కథమపి ద్రోణానలే నిర్వృతే
కర్ణాశీఃషభోగిని ప్రశమితే శల్యేచ యాతే దివమ్
భీమేనప్రియసాహసేన రభసా త్స్వల్పావశేషే జయే
సర్వే జీవితసంశయం వయ మమీ వాచా సమారోపితాః"

అను నీశ్లోకమునను,

"హతే భీష్మే గతే ద్రోణే కర్ణే చ వినిపాతితే
ఆశా బలవతీ రాజన్ శల్యో జేష్యతి పాండవాన్"

అనునీశ్లోకమునను గ్రమముగా ననుకరించిన ట్లగపడుచున్నది.

ఈమహాకవి కవిత్వము మృదుమధురమై యుండును. వికటాన్వయములు గాని కటుపదములు గాని యిం దగపడవు. ఈతని పాత్రపోషణసామర్థ్యము నిరుపమానము,

మొదట విష్కంభకమున మువ్వురు యుద్ధభటులు ప్రవేశించి యుద్ధ వర్ణన మొనరింతురు. అం దొకభటుఁడు—

"శ్లో. వీర్యాలయో వివిధరత్నవిచిత్రమౌళి
ర్వ్యక్తోఽభిమానవినయద్యుతిసాహసైశ్చ,
వాక్యం వద త్యవహస న్నతుభీమ, దీనం
వీరో నిహన్తి సమరేషు భయం త్యజేతి"

అని దుర్యోధనుని వర్ణించును. దీనిని బట్టి దుర్యోధనుని ధార్మికత్వ మును వీర్యాతిశయమును మనకు స్పష్టమగుచున్నవి మఱియు దుర్యోధనుఁడు భగ్నోరుభాగుఁడై—

"పూర్వం నజానామి గదాభిఘాతరుజా మిదానీంతు సమర్థయామి
య న్మేప్రకాశీకృతమూర్ధజాని రణం ప్రవిష్టాన్యవరోధనాని"

అని చెప్పును. దీనిఁబట్టి యాతఁ డభిమాని యని మన మూహింప వచ్చును. మఱియుఁ దనభార్య తన్నుఁజూచి విలపించుచుండ నామెతో—

శ్లో. భిన్నా మే భ్రుకుటీ గదానిపతితై ర్వ్యాయుద్ధకాలోత్థితై
ర్వక్షః స్యుత్పతితైః ప్రహారరుధిరై ర్హారావకాశోహృతః
పశ్యే మా వ్రణకాంచనాంగదధరౌ పర్యాప్తశోభౌ భుజౌ
భర్తా తేనపరాఙ్ముఖో యుధి హతః కిం క్షత్రియే రోదిషి"

అని చెప్పును. దీనినిబట్టి యాతనియభిమానిత్వము కవిచే సంపూర్ణ ముగఁ బోషింపఁబడిన దని మన మనుకొనవచ్చును. అశ్వత్థామ యాతనితోఁ బాండవులఁ జంపెదనని చెప్పును. దుర్యోధనుఁడు వలదనును. అప్పుడశ్వత్థామ—

"సంయోగే పాండుపుత్రాణాం గదాపాతకచగ్రహే
సమమూరుద్వయే నాద్య దర్పోఽపి భవతోహృతః?"

అని ప్రశ్నించును. అప్పుడు దుర్యోధనుఁడు—

మామైవం,మానశరీరా రాజానః,మానార్థమేవ మయానిగ్రహో గృహీతః"

అని ప్రత్యుత్తరమిచ్చును. పూర్వోక్తవాక్యముచే నాతనియున్నతభావ మెట్లు కవి సువ్యక్తము చేసినాఁడో తెలియఁగలదు.

ఈకవి రసపోషణమునను కథాసంధానమందును మిక్కిలి నేర్పరి. దుర్యోధనునిఁ జూచుటకు రాణులును బుత్రుఁ డగుదుర్జయుఁడును రణరంగము నకు వత్తురు. అప్పుడు వారిరువురిసంభాషణ మీ క్రిందివిధమున నుండును.

రాజా—పుత్ర, కిమర్థమాగతః ?

దుర్జయః—తువం చిరయసి త్తి(త్వం చిరయసీతి.)

రాజా—అహో, అస్యా మవస్థాయాం పుత్రస్నేహో మాం దహతి.

దుర్జయః—అహంపి ఖు దే అంకే ఉపవిశామి (అహమపి ఖలు తేంకే ఉపవిశామి.) (అంక మారోహతి)

రాజా—(నివార్య) దుర్జయ, దుర్జయ, భోః కష్టం—

"హృదయప్రీతిజననో యోమే నేత్రోత్సవః పురా
సోయం కాలవిపర్యాసా చ్చంద్రో వహ్నిత్వ మాగతః.

దుర్జయః—అంకే ఉపవేశనం కిం నిమిత్తం వారయసి ?

రాజా—"త్యక్త్వా పరిచితం వత్స యత్ర తత్ర త్వయాస్యతాం
అద్యప్రభృతి నాస్తీదం పూర్వభుక్తం తవాసనమ్.

దుర్జయః—కుత్ర ను ఖలు మహారాజో గమిష్యతి.

రాజా—భ్రాతృశత మనుగచ్ఛామి.

దుర్జయః—మామపి తత్రనయ.

రాజా—గచ్ఛ వృకోదరం బ్రూహి

ఇట్లు గవి బాలుని మౌగ్ధ్యమును దుర్యోధనుని యవస్థను జాల సుందరముగాఁ జిత్రించెను.

ఈకవి సామర్థ్యమును బ్రకటించునట్టి సందర్భము లింకను గొన్నిగలవు. వాని నిట విస్తరభీతిచే విడుచుచున్నాను.

ఈనాటకమున నచ్చటచ్చటఁ గొన్ని పునరుక్తములు గలవు—

"వీతద్రణాహతగజాశ్వనరేన్ద్రయోధం
సంకీర్ణలేఖ్య మివ చిత్రపటం ప్రవిద్ధమ్
యుద్ధే వృకోదరసుయోధనయోః ప్రవృత్తే
యోధా నరేన్ద్రనిధనైకగృహం ప్రవిష్టాః.

అను నీశ్లోకమందలి "సంకీర్ణలేఖ్య మివ చిత్రపటం" అనువాక్యము కవి మాటల రెండుమూఁడుమాఱు ధ్వనమించెను. ఆశ్లోకముల నిట విస్తరభీతిచే విడుచుచున్నాను. మఱియు

"హృతంమే భీమసేనేన గదాపాతకచగ్రహే,
సమ మూరుద్వయే నాద్య గురోః పాదాభివందనమ్".

అను శ్లోకమందలి "హృతం మే భీమసేనేన గదాపాతకచగ్రహే" అనువాక్యము ను మఱియొకచో బునరుక్త మొనరించెను.

ఇట్లిచ్చటచ్చట నల్పమైన దోషము లున్నను నీకవికవిత చాల సొంపుగానుండును. మచ్చునకు రెండు శ్లోకముల నుదాహరించి యింతటితో విరమించెదను.

"మాల్యై ర్ధ్వజాగ్రపతితైః కృతముండమాలం
రక్తైకసాయకధరం రథినం విపన్నమ్-
జామాతరం ప్రవహణాదివ బాంధవార్యో
హృష్టాః శివా రథముఖాదవతారయంతి.

"ఉద్వృత్తాంజలయో రథద్విపగతాశ్చాపద్వితీయైః కరై
ర్వ్యస్తైకాదశవాహినీనృపతయ స్తిష్ఠన్తి వాక్యోన్ముఖాః
భీష్మో రామశరావలీఘనకవచ స్త్రాతశ్చ యోద్ధారణే
వ్యక్తం గర్జితవేవ సోఽప్యతిరథః కాలేన దుర్యోధనః"

# నైషధరచనాతత్త్వము.

—( ఇవటూరి సుందరయ్యగారు — అమలాపురము )—

శ్రీమత్పరమేశ్వర లీలావిలాసజనితం బగు నీసకలచరాచర భూతకోటి యందును మానవజన్మము దుర్లభము. ఆహారాదిధర్మములందు మానవుఁడు పశుతుల్యుఁడే యైనను నాతనికి యుక్తాయుక్తవివేకద మగుబుద్ధి యొండధికము. ఆబుద్ధిని వినియోగించుకొని మానవుఁ డీజన్మమందే జన్మరాహిత్యము కలిగించుకొనవలసియున్నది. దానికి జ్ఞాన మావశ్యకము. ఆజ్ఞానము రెండు తెఱఁగులు. ఐహికము, నాముష్మికము. అన్యోన్యవిరుద్ధవస్తువులతో నిండియున్న యీదృశ్య మాతనికి వెఱఁగు కలిగించినది దీనియాథార్థ్యమునే గ్రహింపకినిచో దీని కాధార మగుతేజోరూపము నాతఁ డెట్లు తెలిసికొనఁగలఁడు? ఈద్వివిధజ్ఞానమునకు నుపదేశమే శరణము. అట్టి జ్ఞానోపదేశమునకు భగవంతుఁడు వేదముల నేర్పఱిచి గురురూపమున నవతరించి యుపదేశ మొనరించినాఁడు. కాలవైపరీత్యముచే మానవునకు విషయలోలుపత్వ మధిక మైనది. భగవదంశాసంభూతు లగునుపదేష్ట లాయవతారములఁ జాలించినారు. వేదోపదేశము మానవునకు భయజనక మైనది. అంగరూపమున శాస్త్రము లుత్పన్నము లైనవి. పురాణరూపమున బోధ ప్రారంభ మైనది. మనుష్యమానస మాయుపదేశమును లక్ష్యపెట్టలేదు. విషయభోగలీలావిలాసాభిలాష మెండైనది. అంగనాజనవిలాసాలాపలీలాసముప్రాదుర్భావము లగుకావ్యాలాపముల మూలముననే యుపదేశ మొనర్పవలసిన యవసరము తటస్థించినది. విద్యానాథుఁడీయంశముననే యీక్రిందిశ్లోకమున సూచించినాఁడు.

శ్లో. యద్వేదా త్ప్రభుసమ్మితా దధిగతం శబ్దప్రధానా చ్చిరం
యచ్చార్థప్రవణా త్పురాణవచనా దిష్టం సుహృత్సమ్మితా
త్కాంతాసమ్మితయా యయా సరసతా మాపాద్య కావ్యశ్రియా
కర్తవ్యే కుతుకీ బుధో విరచిత స్తస్యై స్పృహాం కుర్మహే॥ దీనికిఁ దెలుఁగు.

శా. వేదంబుల్ ప్రభుశాసనంబులు సుహృద్విజ్ఞాపనంబుల్ పురా
ణాదిగ్రంథము లంగనాజనవిలాసాలాపలీలాసము
ప్రాదుర్భావము లౌర కావ్యములు కర్తవ్యోపదేశక్రియా
వాదప్రక్రియ నెన్నఁగా వ్యమహిమల్ వర్ణింపఁగా శక్యమే. భట్టుమూర్తి.

అల్పబుద్ధులకుఁ జతుర్వర్గఫలప్రాప్తి కావ్యములమూలమునఁ దప్ప వేఱొంట దుర్లభమైనది.

శ్లో. చతుర్వర్గఫలప్రాప్తిస్సుఖా దల్పధియా మపి
కావ్యాదేవ యతస్తేన తత్స్వరూపం నిరూప్యతే.
వేదశాస్త్రేభ్యో నీరసతయా దుఃఖాదేవ పరిణతబుద్ధీనా మేవ జాయతే
పరమానందసందోహతయా సుఖాదేవ సుకుమారబుద్ధీనా మపి పునఃకా
వ్యాదేవ ఇత్యాది-

సదుపదేశ మొనర్చి మానవమానసము నావరించుకొని యున్నతమస్సును నివర్తింపఁజేయుటకు, రోగికి రోగనివారణమునకై యావలసిన కటుకౌషధమును సితశర్కరానుపాన మొనర్చి ప్రయోగించునట్లు లలితసుకుమారభావోపేతరసప్లుతములగు కావ్యాలాపములమూలమున వేదశాస్త్రములం దున్నధర్మముల బోధింపనెంచి యనేకవిధప్రపంచవ్యాపారేంద్రజాలవిధిసాధకపింఛికాయమానసర్గక్రియాదక్షుం డగునట్టి భోజసూతి వాల్మీకిముఖమున ఛందోరూపయగుభారతిని నిర్గమింపఁజేసినాఁడు. తదాధారమున నాతఁడు కావ్యకల్పన మొనర్చి ధర్మబోధన మొనరించినాఁడు. వ్యాసుఁడును వాల్మీకి ననుసరించి తనకావ్యమున వాల్మీకికంటె విశేషముగఁ జతుర్వర్గఫల సాధనధర్మములను జొన్పి భారతమును రచించినాఁడు. అయ్యది మానవచిత్తాకర్షకమును, విషయోపభోగలీలావిలాసభాసురమును గాకుండుటయు, విస్తృతమగుట యుఁ జూచి కాళిదాసాదిమహాకవు లెందఱో కేవల కాంతాసమ్మితము లగుకావ్యముల నెన్నిటినో రచించి ధర్మోపదేశ మొనర్పఁజూచిరి. ఒకరిని జూచి యొకరు కావ్యముల రచింపఁబూనిరి. అందుఁ గొన్ని కేవలశబ్దచిత్రప్రధానమాత్రములు రసహీనములు ధర్మవిహీనములు కాఁజొచ్చెను. "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అని పెద్దలాక్రోశ మొనర్పఁదొడఁగిరి.

పిమ్మట సూత్రప్రాయముగ నున్న కావ్యలక్షణములను జర్చింప సాగిరి. కావ్యమునకును స్వరూప మిట్లు చెప్పఁబడినది. "శబ్దార్థౌ శరీరం, రసాదిశ్చాత్మా, గుణాః శౌర్యాదివత్, దోషాః కాణత్వాదివత్, రీతయో అవయవసంస్థానవిశేషవత్, అలంకారాః కటకకుండలాదివత్"—ఇత్యాది కావ్యస్వరూపనిర్ణయమైనపిమ్మట వానికుత్తమమధ్యమాధమత్వములు గూడ నేర్పడినవి. ధ్వనిప్రధానమైనదే యుత్తమకావ్యముగా నిర్ణయింపఁబడినది. కావ్యమున కాత్మ

రూప మైనరసమునకై యత్నప్రారంభ మైనది. భావవిశేషాదులచే నేర్పడుకావ్యరస మానందసందోహజనక మగుటచే నావిషయము మనమం దుంచుకొని కవు లెందఱో యలంకారశాస్త్రానుసారముగ సరసవ్యంజకభావోపేతముగ "పరివర్ధతే విజ్ఞానం సంభావ్యతే యశో విసర్పంతి గుణాః । శ్రూయతే సుపురుషచరితం కిం తద్యేన నహరంతి కావ్యాలాపాః" అను న్యాయ్యము ననుసరించి మహాపురుషచరిత్రాత్మకములుగఁ గావ్యనిర్మాణ మొనర్చిరి.

పవిత్రవాహినీతీరముల నాశ్రమముల నిర్మించుకొని నిసర్గమనోజ్ఞము లగుతపోవనసీమలఁ దపోనిష్ఠాగరిష్ఠులై నిత్యాగ్నిహోత్రసత్పాత్రగకలాపులై, సకలకలాపరిపూర్ణులై నివసించుచుఁ దముజ్ఞానతేజఃప్రకాశమున శిష్యగణములం దరింపఁజేయు మహర్షిసత్తములతోడను, పారలౌకికసుఖాభిలాషులై ధర్మబద్ధులై పుణ్యశ్లోకులై న్యాయపరిపాలన మొనర్చురాజర్షిసత్తములతోడను విరాజిల్లు తపోయుగము కాలగర్భమున నిమగ్న మైనది. పుణ్యాశ్రమసౌభాగ్యము కంటెఁ బట్టణసౌభాగ్యమే శోభావహ మనుకొనుకాల మేర్పడినది. సౌధములు, ఉద్యానవనములు, స్వర్ణాభరణములు, చీనిచీనాంబరములు కృతకపరిమళములు, మనుజుల కింపులైనవి. రానురాను నాముష్మికచింతకంటె నైహికభోగవిచార మధిక మైనది. భోగలాలసత్వముచే దేశము విశీర్ణ మైనది. తపస్త్యాగశమదమాదు లడుగంటినవి. విద్యావైశద్యము కూడ క్షీణదశకు వచ్చినది.

కావ్యములందుఁ గ్రథితముగఁ గానంబడు శాస్త్రవిషయములు తన్మూలమునను మానవహృదయమునఁ జొరలేకపోయినవి ఇది యంతయుఁ జూచి చింతామణిమంత్రసిద్ధుండు, షట్తర్కచక్రవర్తి, ఖండనగ్రంథసంగ్రథనకర్కశబుద్ధి, కవికులాధృష్యాధ్వగమనాధ్వనీనుండు, సర్వజ్ఞుండు, శ్రీహీరకులకలశాబ్ధిశశిరకరుఁడు నగుభట్టహర్షుండు ప్రౌఢవాక్పాటవమున నాలంకారికశాసన మతిక్రమింపకుండఁ బురాతనపుణ్యశ్లోకరాజర్షిచరిత్రాత్మకంబుగఁ గీర్త్యాది లాభజనకంబుగఁ జతుర్వర్గఫలప్రాప్తిహేతుభూతంబుగ, "సంసారవిషవృక్షస్య ద్వేఫలే, అమృతోపమే, కావ్యామృతరసాస్వాదః, సల్లాప స్సజ్జనై స్సహ" అను న్యాయానుసారమున సంసారబాధానివారకమును సజ్జనసల్లాపమనోహరంబును నగునట్లుగ నామస్మరణమాత్రఁ గలికల్మషహరం బగు నలమహారాజదివ్యచరిత్రంబు నైషధం బనుపేర మానసోల్లాసిరసభాసురం బగుమహాకావ్యముగ నిర్మించినాఁడు. ఈకావ్య మీతఁడు రచించుటలో శాస్త్రవిషయము నుపదేశించుటయే ముఖ్యోద్దేశ మైన ట్లీక్రిందిశ్లోకముల సూచించినాఁడు.

శ్లో. అధీతిబోధాచరణప్రచారణై ర్దశాశ్చతస్రః ప్రణయన్నుపాధిభిః
చతుర్దశత్వం కృతవాన్ కుతస్స్వయం నవేద్మి విద్యాసు చతుర్దశస్వమ్
లేఖాభిరాఖ్యా గణనాదినాఖ్యా ద్వాత్రింశతాద్యంతమయాభి రంతః
చతుష్షష్టాకర నాత్రవిద్యా జ్యోతీంషి సంతీతి కళాంశ తేధాః.

ఇందీ బహువాఙ్మయముగా చెప్పఁబడు విద్యలందున్న విషయము దాను గూర్పఁ దలఁచినను, నాయావిద్యలం దధీతిబోధాచరణప్రచారణసామర్థ్య మీ కావ్యకథానాయకులకునఁ నాయకునికిఁ గలుగవచ్చునని యు సూచించుటయే గాక "అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః। పురాణం ధర్మ శాస్త్రంచ విద్యా హ్యేతాశ్చతుర్దశ। ఆయుర్వేదో ధనుర్వేదో గాంధర్వశ్చే త్యనుక్రమాత్" అని చెప్పఁబడు 18 విద్యలందే గాక యితిహాసాది చతుష్షష్టిగా నేర్పడిన కళలందు గూడఁ బ్రావీణ్యము పాత్రకు కలవడఁగల దనునంశ ముకూడ సూచించినాఁడు. ఆతఁడు చూపించిన శాస్త్రవిషయములు.

శ్లో. అజస్ర మభ్యాస ముపేయుషా సమం ముదైవ దేవః కవినా బుధేనచ
దధౌ పటీయాన్ సమయ న్నయన్నయం దినేశ్వరశ్రీ రుదయం దినేదినే.
ఇందు జ్యోతిశ్శాస్త్రవిషయము సూచితము.

శ్లో. పరిఖావలయచ్ఛలేన యా న పరేషాం గ్రహణస్య గోచరా
ఫణిభాషితభాష్యఫక్కికా విషమా కుండలనా మవాపితా
శ్లో. క్రియేత చేత్సాధు విభక్తిచింతా వ్యక్తి స్తదా సా ప్రథమాభిధేయా
యా స్వౌజసాం సాధయితుం విలాసై స్తావత్క్షమానామపదం బహుస్స్యాత్.
ఇందు వ్యాకరణశాస్త్రవిషయము సూచితము.

శ్లో. స్వర్గాపగాహేమమృణాలినీనాం నాలామృణాలాగ్రభుజో భజామః...
యశో యదస్యాజని సంయుగేషు కండూలభావం భజతా భుజేన...
కలశే నిజహేతుదండజః కిము చక్రభ్రమకారితాగుణః
సతదుచ్చకుచౌ భవన్ ప్రభా ఝరచక్రభ్రమ మాతనోతి యత్"—
తర్క మిందు సూచితము.

అన్యోన్యసంగమవశాదధునా విభాతాం తస్యాపి తేపి మనసీవికసద్విలాసే ..
అధోవిధానా త్కమలప్రవాళయో........
పతులా విషయే తవాకృతి ర్నవచో వర్త్మని తే సుశీలతా...
ఇందు సాముద్రికము సూచితము.

శ్లో. శశాక నిహ్నోతు మయేతి తత్ప్రియా మయాం బభాషే కుదళీకవీక్షితామ్
సహాజయే వాలపితాసు వైణికై ర్మమూర్ఛయ త్పంచమమూర్ఛనాస్వపి
ఇందు సంగీతశాస్త్రవిషయము సూచితము.

శ్లో. మృషావిషాదాభిన యా దయం క్వచి జ్జుగోప నిశ్వాసతతిం వియోగజామ్
విలేపనస్యా ధికచంద్రభాగతా విభావనా చ్చాపలలాపపాండుతామ్.
(కర్పూరస్యాతిశైత్యా త్తదాధిక్యే శరీరరక్తం శుష్కీభవతి)
స్మారం జ్వరం ఘోర మపత్రపిష్ణోః స్విగ్దాగదంకారచయే చికిత్సా
నిదానమౌనా దవిశద్విశాలా సాంక్రామికీ తస్యరుజేవలజ్జా-వైద్యవిషయము

శ్లో ప్రియాసు బాలాసు రతిక్షమాసు చ ద్విపత్రితం పల్లవితంచ బిభ్రతం
స్మరార్జితం రాగమహీరుహాంకురం......... వృక్షశాస్త్రవిషయము.

శ్లో. అథాంతరే ణావటుగామినా ధ్వనా నిశీథినాథ స్సుమహా స్సహోదరైః
నిగాళగా ద్దేవమణే రివోత్థితై ర్విరాజితం కేసరకేశరశ్మిభిః-అశ్వశాస్త్రము.

ఇట్లే నను స్తశాస్త్రవిషయములను నిందుఁ జొప్పించియున్నాఁడు. గ్రంథవిస్తరభీతిచే నుదాహరింపలేదు. సాధారణముగాఁ బ్రతిపద్యమందును నేదో శాస్త్రప్రశంస యుండియే యుండును. కాని కావ్యమున నీశాస్త్రవిషయములఁ జొన్పి యుత్ప్రేక్షలతో నింపినాఁడు గాని స్వభావమనోహర మగుకావ్యసౌందర్యమును దిలకించినాఁడు కాఁడందురేమో. శాస్త్రవిషయములఁ జెప్పుటకే యీకావ్యమును రచింపనెంచినను స్వభావమనోహర మగువర్ణనములు భావములు లేకపోలేదు. మఱియుఁ గేవలము నుత్ప్రేక్షకోసము చెప్పినశాస్త్రవిషయ మొందున్నను నంతమాత్రముచే శాస్త్రవిషయోపదేశ మెట్లు పూర్తి కాఁగల దందురు కాఁబోలు. ఒకవిషయము ధ్వనిగా నుండునట్లు చెప్పినపిమ్మట నావిషయమునకు సంబంధించిన సంగతు లన్నియుఁ దెలిసికొనక తప్పదు గదా, అందుచే నేశాస్త్రవిషయము వచ్చినప్పుడు దానిపూర్వాపరసందర్భములతో నావిషయ మంతయుఁ బాఠకుఁడు గ్రహింపఁగలఁడు. కేవలము ప్రతివిషయము విరివిగాఁ జెప్పనవసరము లేదు. కేవలశాస్త్రవిషయములఁ దెల్పుటకీకావ్యము రచించి యున్నను గావ్యలక్షణములను గావ్యమునకుఁ బ్రాణభూత మగురసమును వీడియుండలేదు.

ఇంకఁ గావ్యమునకుఁ బ్రాణభూత మైనరసము విభావాదిభావములచేఁ బోషింపఁబడునుగదా! ఆరసము శృంగారాది తొమ్మిదిభేదములతో నొప్పుచుం

డును. చతుర్వర్గములయందు సర్వప్రాణిసులభ మగుతృతీయపురుషార్థమునకు హృదయంగమమైన దగుటచే శృంగారము మొదటఁ జెప్పఁబడినది. మిగిలిన వితరవర్గపోషకములు. శాంతము చతుర్థపురుషార్థసాధక మగుటచేఁ జివరఁ జెప్పఁబడినది. సర్వజనహృదయంగమ మగుటచే శృంగారరసముఁ బ్రధానముగాఁ గైకొని సమస్తపురుషార్థసాధకము లగువిషయముల నాయారసమిళితములఁ జేసి కావ్యరచన మొనర్పవలెను. మన శ్రీహర్షుఁ డట్లే చేయఁబూనినవాఁడు. శృంగారము విప్రలంభ మనియు సంభోగ మనియు రెండుతెఱఁగులు. అందు మొదటిది మరల రెండువిధములు. అయోగము, విప్రయోగము. అయోగము వివాహాత్పూర్వము (వినుకలిచేత) కలిగెడు పరస్పరప్రేమవశంగత మైనది. దీని కభిలాషాచింతాదులు లక్షణములు. మనకవి యీకావ్యమునఁ దొలుదొల్త నీయయోగశృంగారమునే కనుపఱిచినాఁడు. విభావాదులచే నేర్పడు రసమున కాలంబనము నాయకుఁడు. అట్టినాయకుఁడు ధీరోదాత్తుఁడై యుండవలెను. అతనిగుణములు శోభాదులు. శాస్త్రజాతములకుఁ గూడ సత్పురుషాశ్రయత్వముచేతనే మిక్కుట మైనలోకాదరము కలిగినది. అందుచేతఁ బ్రబంధములకు మహాపురుషవర్ణనము బంగారమునకుఁ దావి యబ్బినట్లగును. ఆచార్యదండ్యాదు లిట్లే వచించినారు. శ్లో. ఆదిరాజయశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయం తేషా మసన్నిధానేపి నస్వయం పశ్య నశ్యతి" భోజమహారాజును నిట్లుచెప్పినాఁడు. శ్లో. కవేరల్పాపివాగ్వృత్తి ర్విద్వత్కర్ణావతంసతి నాయకో యది వర్ణ్యేత లోకోత్తరగుణోత్తరః" అందుచేతఁ దాను రచింపఁబూనిన మహాప్రబంధమునకు శ్రీహర్షకవీంద్రుఁడు లోకోత్తరగుణోత్తరుఁ డగు నలుని నాయకునిగాఁ జేసినాఁడు- నలునియం దీమహాకవికిఁ గేవలము నీశ్వరత్వబుద్ధియే యున్నట్లు తోఁచుచున్నది.

మొదట దేవతానమస్కారరూప మంగళమును నెలకొల్పి పిమ్మటఁ బట్టణాదుల వర్ణించుట మొదలగునవి వాడుకయై యుండఁగా నీతఁ డామంగళమును నాయకవిభూతిమంగళమును జెప్పుటచేతనే నెఱవేర్చినాఁడు. ఇతఁడు తొల్త-

శ్లో. నిపీయ యస్య క్షితిరక్షిణః కథా స్తదాద్రియంతే నబుధా స్సుధా మపి...
పవిత్రమత్రాతనుతే.........దిగీశబృందాంశ...............

ఇందు "క్షితిరక్షిణ, బుధ, సుధ, మహసాంమహోజ్జ్వల" ఇత్యాది శబ్దములచే నలస్మరణము విష్ణువుయొక్కయు, దేవతలయొక్కయుఁ బ్రసాదముచే

నమృతత్వము లభింపఁజేసి, కీర్తిప్రకాశముతో వర్థిల్లఁజేయు ననియు, వ్యాపన శీలమును, జ్ఞానస్వరూపమును, అమృతస్వరూపమును, తేజోమయమును, నగు పరబ్రహ్మస్వరూపమును సాక్షాత్కరింపఁజేయు ననియు నైహికాముష్మికసుఖప్రాప్తిని సూచించినాఁడు. ఇది గ్రంథమునకు మొదటిశ్లోకము. 3 వశ్లోకమున స్మరణమాత్రముచేతనే లోకములను బవిత్రీకరించునపు డతనిచరిత్రము కావ్యరూపమున సేవించునపుడు సమస్తపాపములను బోఁగొట్టి నిరామయ శాశ్వతానందసౌఖ్యము లొసంగుట కేమి వింతయని తనయీకావ్యనిర్మాణ ఫలమునుసూచించినాఁడు. "ఏకో దేవో సర్వభూతేషుగూఢః...అణోరణీయాన్మహ మేవతద్వ...ఏక యేవయతో లోకాన్ విసృజామి...... పరిత్రాణాయ సాధూనాం......ఇత్యాది సూక్తులననుసరించి ధర్మసంస్థాపన మొనర్చి లోకపాలనముచేయుటకు రాజుగాఁ బుట్టినను నలుఁడు కామాదివికారముల వీడి దేవతారాధనాదులచే జ్ఞానమును సంపాదించినవారికి సచ్చిదానందసంధాయకుఁ డగుపరమేశ్వరస్వరూపుఁడేయనియుఁ బైని వ్రాసినయొకశ్లోకమునఁగూడ సూచించినాఁడు. మఱియు రాజుగానున్న నలుఁడు.

శ్లో. దధతో బహుశైవలక్ష్మతాం ధృతరుద్రాక్షమధువ్రతం ఖగః
   స నలస్య యయౌ కరం పునః సరసః కోకనదభ్రమాదివ.

బహుశైవలక్షణములు గలిగి రుద్రాక్షమాలాలంకృతము లైన యవయవ సంస్థానవిశేషములు గలమహాశైవుఁ డని యు సూచించి యున్నాఁడు. మఱియు
శ్లో. పురోహతాక్షిప్తతుషారపాండర......అంతఃపురాంతస్యవిలోక్య బాలాం.
   దోర్మూల మాలోక్య............నేక్షేతాక్షం వనగ్నాం స్త్రీం.........

అనువారోక్తి ననుసరించినవాఁడును, పరస్త్రీపరాఙ్ముఖుఁడును గా సూచించినాఁడు.రాజాసయజ్వా...దారిద్ర్యదారిద్రకిణౌఘవర్షే...అర్థినామపూరితాఖిల లోమా......తానుయజ్వయై శ్రోత్రియుల పాలుచేసిన సంపద గలయీమహామహుఁడు, అధ్వరాజ్యోపమముగా రాజ్యమును విబుధవ్రజాధీనముగానించి దేతల నారాధించిన కర్మఠచక్రవర్తి యనియు, అర్థులకు అకు దారిద్ర్యవిదారక మగు ద్రవిణవర్షము వర్షించుటలో నమోఘమేఘవ్రతదీక్ష వహించి, యర్థి యని విన్నంతమాత్రమున రోమాంచము వహించెడు మహాదాత యనియు "నాభ్యయాయి భవతేదం రోహిణీరమణవంశభవేన" ఇత్యాది, సత్కులీనుఁ డనియు, అథారి వక్షేషు తదంఘ్రిణా గణాః స్వతచ్ఛయచ్ఛాయలవోపిపల్లవే.........

# సంస్కృతదూతకావ్యోత్పత్తివికాసములు.

(పూర్వపత్రికావశేషము)

—: యీ. వేఙ్కటవీరరాఘవాచార్యులుగారు. :—

[అధ్యక్షులు-'ఆన్ధ్రగీర్వాణసాహిత్యపరిషత్తు'-విజయనగరము.]

---

XXV. మనోదూత:—18. విష్ణుదాసవిరచితము. ఇతఁడు వంగదేశీయుఁడును, వైష్ణవమతసంస్థాపకుఁడును శ్రీచైతన్యస్వామికి మేనమామ(?) ఇందు 101 మాలినీవృత్తములు గలవు. ఇతఁడు తాను "విష్ణుదాసకవీన్ద్రుఁడ" నని వ్రాసికొనెను. తనభక్తివిశేషముం దెలుప నితఁడు తనమనస్సును శ్రీమహావిష్ణునవిధమునకుఁ బంపుట యీకావ్యమునందలి వస్తువు.

ఈకావ్యమునుండి కొన్నిశ్లోకములు ప్రదర్శించెద.

1. శ్లో. నిర్వర్ణ్యతాని రహసి స్వయ మర్జితాని
భూయ స్స్మరాణి దురితాని సుదుఃసహాని

మహామహోపాధ్యాయహరప్రసాదశాస్త్రి 'బృహద్వృత్తగ్రంథభూమిక' పుట 4; "భావవిలాస" కారుఁడును, "భ్రమరదూత" కారుఁడు నొకఁడే యని-ఆచార్యసతీశచన్ద్రవిద్యాభూషణుఁడు "హైందవన్యాయశాస్త్రచరిత్రములో" (పుటలు416—17) వ్రాసియున్నాఁడు.

18. "Çatalogue of Skt. MSS. in the Indian office Library" Vol.VII Nos.౧౪౨౭—౧౪౪౪. ప్రారంభశ్లోకము, గద్యముకూడఁ గవినామాంకితములు. కలకత్తా "సంస్కృత సాహిత్యపరిషత్తు"లోని వ్రాఁతప్రతులలో నీకావ్యముయొక్క యసమగ్రప్రతి యొకటి గలదు. రాజేన్ద్రలాలమైత్రపండితుఁడు "Notices of Sanskrit MSS." (Vol. II. No. 613) లోఁ బేర్కొనిన "మనోదూత"యు, విష్ణుదాసకృత "మనోదూత"యు నొకటియే యని తోఁచెడి. ఏలన రాజేన్ద్రలాల్ మైత్రుఁ డుటంకించిన కావ్యాంతిమశ్లోకమును, విష్ణుదాసుని కావ్యములోనితుదిశ్లోకమును "వసన్తతిలకా" వృత్తములే కాని మొదటికావ్యముయొక్క గద్యము కవినామాన్వితము. దీనిప్రథమలిఖితప్రతి—మాతృక—లోపించుటచే నాద్యశ్లోకము కవినామాన్వితమో కాదో తెలియదయ్యె.

* విష్ణుదాసుని "మనోదూత" శ్రీచిన్తాహరణచక్రవర్తి (M. A.) మహోదయునిచేఁ బ్రకృతము కలకత్తా "సంస్కృతసాహిత్యపరిషత్" పత్త్రికలోఁ బ్రచురింపఁబడుచున్నది.

(a) "సంస్కృతసాహిత్యపరిషత్తు" XII సంపుటము 3 సంచిక. జూలై 1929; 105—112 పుటలు; భూమిక; 1—27 శ్లోకములు.

(b) "సం. సా. ప." XII సం. 4 సం. ఆగష్టు 1929; 28-62 శ్లో.

(c) "సం. సా. ప." XII సం. 6 సం. అక్టోబర్ 1929. 63—88 శ్లో.

శ్రుత్వాచ కాలవిహితాన్యవశేన్ద్రియాణాం
దఃఖాన్యచిన్తయత వశ్చనవిష్ణుదాసః. 1

2 శ్లో. ఇష్టార్థనైః శమదమాదిభిరేవ యోగః
జ్ఞాత్వా తపోబహువిధం భ్రమతశ్చతీర్థమ్
తత్త్రింకరోమి వికలోఽహ మితః క్వయామి
త్వేయం విలక్ష్య శరణం హరి మాలులోచే. 2

3. శ్లో. యత్పాదతామరసలాలసమానసాస్తే
ఽప్యుత్పి కర్ణపదవీం ననయన్ని సన్తః
బృన్దారకప్రకరమౌలికిరీటకోటి
రత్నాంశురఞ్జితపదం పదమామరేన్ద్రమ్. 3

4. శ్లో. ఏకం త్వమిన్ద్రియగణస్యమనోపరీయః
పారనథా జగదుపైతి తవప్రశక్త్యా
ఇత్యర్థయే ప్రణతిపూర్వక మానుకూల్యం
నోచేత్కరోషి మమతాదృశమేవ కర్మ 8

5. శ్లో. సర్వానపాస్య విషయాన్ క్షణమేవతావ
చ్చేతోఽవధేహి కరుణాకణికాం విధేహి
ఆర్తస్తతఃకతికయాని నివేదయామి
నోచే దరణ్యరుదితం కిమిదం కరోమి. 9

6. శ్లో. జాతః స ఏవ సుకృతీ సఫలం జగత్యాం
తేనైవ రత్నజననీ జగతీజనేన
ఏతద్యఏవహి నభఃకుసుమోపమేయం
గేయం కుధీభి రవధార్యపరంపరేతి. 13

7. శ్లో. నవ్యాహతః క్వచనతే విషయస్త్రిలోక్యా
మధ్యానమాబ్ధికముపైషి నిమేషతోఽపి
జానాసి మద్వ్యవసితాని మనోవినాత్వా
మాత్రేన కః కథయ మాతపదేనిరోజ్యః. 15

8. శ్లో. ప్రాయఃక్షమాతిశయమానవతీ నరూఢ
ప్రేమాప్రయాతి పునరస్థిరతాం నవోఢా

తస్మాద్విధేయమిదమేవమనః ప్రయత్నా
ద్విశ్లేషలేశమపి నేయముపైతియస్మాత్. 24

9. శ్లో. కింవర్ణమస్యచరణం శ్రవణం శరీరం
నేత్రం మనోఽపి చిరతాజ్జగదేకచిత్రాత్
పశ్యైనమగ్నమివ జీర్ణమనేకశంకే
యత్నాన్మనాగపి సముద్ధృతిమానయన్తు. 37

10. శ్లో. కృష్ణం తమాలతరుకజ్జలభాసి యస్యాః
స్మేరామ్బుజే వయసి సంహృతమమ్బుజాక్షమ్
గోవృశ్చికేణ పరితః పరిలోభయన్త్యః
స్పర్శానుజాతపులకై రయమిత్యవేయుః. 49

11. శ్లో. కర్ణైరికోమలదళోపరిజృమ్భమాణ
మల్లీశికీషకరికల్పితచామతల్పే
ఉద్బద్ధముగ్ధకుసుమావలిమాకరన్ద
గన్ధభ్రమద్భ్రమరఝఙ్కృతిసంభృతేఽపి. 64

12 శ్లో. లీలాశ్రమామ్బుచయచుమ్బిత కృష్ణగౌర
తన్వోస్తయోరభిముఖం హరిగోపవధ్వోః
అన్యోఽన్యదేహరుచిరప్రతిబిమ్బయోగా
ద్గౌరో హరిః కిమపి గోపవధూశ్చ కృష్ణా. 66

18, శ్లో. యాసాంకరేషు కర మీక్షణ మీక్షణేషు
గణ్డేషు గణ్డ మధరేషు తథాధరఞ్చ
వక్షస్తటేషు హృదయాభిర్లీయవక్షః
సమ్మానయన్మనసిజం విజహార కృష్ణః. 70

14. శ్లో. ఈహామహే నహి మహేన్ద్రపదం ముకున్ద
స్వీకుర్మహే చరణదైన్యముపాగతం వా
ఆశాం పునస్తవపదాబ్జకృతాధివాసామ్
ఆశాస్మహే చిరమియం సకృశా యథాస్యాత్. 82

XXVI మనోదూతః—19. తైలిఙ్గవ్రజనాథుని విక్రమశకము 1814 (క్రీ. శ. 1758) లో రచియింపఁబడెను. ఈకావ్యమునకు "సహృదయ

19. "కావ్యమాల xiii గుచ్ఛము; సంఖ్య 8; (పుటలు 84—187.)

హృదయాహ్లాదన"మని నామాన్తరము గలదు. దుర్యోధనాస్థానమునకుఁ గేశాకృష్టయై లాగికొనిపోఁబడునట్టి యనన్యశరణ యగు ద్రౌపది తనమనస్సును శ్రీకృష్ణునియొద్దకు దూతగాఁ బంపుట యిందలి వర్ణితవిషయము.

* శ్రీమాన్ కృష్ణమాచార్యులవారు తమ ''సంస్కృతసారస్వతచరితము"న నిట్టులు వ్రాసియున్నారు. (పుట 128)

"Vrajanatha was the son of Ramakrishna. He was a Tailinga Brahman of the N. W. Provinces. He wrote his 'Manodutikavya' in A. D. 1758 at Brindatavi. It describes the devout reflections of Draupadi on Krishna during the scene of her outrage at Duryodhana's court. The poem closes with the description of the endless expansion of Draupadi's apparel and the consequent disgrace to the Kaurava princes. The plan of the poem was undoubtedly suggested by the Meghaduta, but it is no bare imitation of Kalidasa's work, nor is it written in the same metre. The ideas are fanciful and appealing, but the style is not so amusing as Kalidasa's."

ఈకావ్యమున 202 శిఖరిణీవృత్తములు గలవు. వ్రజనాథుఁడే యీకావ్యమునకు ''మఞ్జుభాషిణి" యను నొకటీకను వ్రాసికొనెను. ఈ వ్యాఖ్యాపీఠికాశ్లోకము లొండురెండు ప్రకృతోపయోగములు.

"శ్లో. స్వయంకృతే మనోదూతకావ్యే భవ్యేసమాసతః
వ్యాఖ్యా బాలావబోధాయ క్రియతే మఞ్జుభాషిణీ.
శ్లో. భూయోభూయః ప్రణమ్యాహం యాచే బద్ధాఞ్జలి ర్బుధాన్
బాలభాషిత మిత్యేవ క్షమధ్వం చాపలం మమ."

వ్యాఖ్యారంభము:—అథ 'కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే। సద్యఃపరనిర్వృతయే కాన్తాసంమితతయోపదేశయుజే' ఇత్యాద్యుక్తం కావ్యఫలం ప్రశ్నన్ సహృదయహృదయాహ్లాదకై రద్భుతకరుణశాన్తరసప్రధానైః సహృదయానాం భగవద్భక్తిరసికానాం మనసి సద్యః సహజానన్దసముల్లాసప్రవణం మనోదూతాఖ్యం కావ్యం చికీర్షు స్తస్య నిర్విఘ్నసమాప్తయే శిష్టాచారపరిప్రాప్తం స్వేష్టదేవతాస్మరణగర్భం వస్తునిర్దేశాత్మక మాశీర్వాదాత్మకం చ మఙ్గల ముపనిబధ్నాతి:—

1. "శ్లో. దధ ద్వాసః పీతం సజలజలదశ్యామలరుచి
ర్ముదా పూర్ణాం కుర్వ న్నధరసుధయా సన్మురలికామ్
సమన్తా దాభీరీజనపరివృతో భానుతనయా
తటాన్తఃసంచారీ మమ హరతు హారీ హరి రఘమ్. 1

2. మీమాంసాప్రమేయమాహ:—

శ్లో॥ శ్రుతిం లిఙ్గం వాక్యం ప్రకరణ మథస్థానక మహో
సమాఖ్యాం జానన్తః కలితపరదౌర్బల్యవిధయః
లిఙ్గర్థం ధాత్వర్థం త్రివిధవిధిరూపం చ నిగమా
నరూపం మన్వానాః క్రతుసదసి మీమాంసకవరాః. 59

3. వ్యాకరణస్వరూపమాహ:—

శ్లో॥ సముద్భూతం యత్ర జగదుపకృతౌ పాణినిముఖే
ర్ముఖామ్భోజాత్ కాత్యాయనకృతవిశేషార్థకలనమ్
భుజఙ్గేన్ద్రాధీశోద్భవగహనసద్భాష్యవివృతి
ప్రకృష్టార్థం శాస్త్రం సదసి కథయన్తోఽతిసుధియః. 60

4 అథ తర్కశాస్త్రవిషయమాహ—

శ్లో॥ వితణ్డా జల్పాద్యైర్విరహితసువాదోద్ధురగిరః
ప్రమాణైః ప్రత్యక్షాదిభి రపిచ మేయక్రమవిదః
అభావార్థవ్యాప్తి స్ఫుటలసితహేత్వచ్ఛవిలస
న్మతిప్రౌఢా వైశేషికమతవిశేషప్రణయినః 61

5. తదానీ మనన్యశరణా (ద్రౌపదీ) సా భగవత్ స్మరణం కృతవతీతి కథయితుం
కవి ర్మనసో దూతత్వం పరికల్పయ్య కథాం రచయతి.

శ్లో॥ విచారం చాకార్షీ ద్దహహ నపితా నాపి దయితా
నపుత్రా నభ్రాతా శరణ మిహ మేఽద్యాస్తి నగురుః
ఋతే భక్తాధీనా ద్యదుకులవతంసా దపర ఇ
త్యథో స్మారం స్మారం మురరిపుమహం యామి శరణమ్ 133

6. అథ శ్రీకృష్ణం వర్ణయతి:—

శ్లో॥ దుకూలం హేమాభం నిజకటితటేఽసౌ పరిదధ
త్సుకాఞ్చ్యా రత్నానాం నిబిడ ముపనద్ధం యదుపతిః
దధానః శ్రీవత్సం హృది సువిలస త్కౌస్తుభమణి
ర్మహానన్దామ్భోధి ర్నయనపథమాయాస్యతి స తే. 158

7. భగవచ్చరణచిహ్నాన్యాహ:—

శ్లో॥ ధ్వజచ్ఛత్రామ్భోజాఙ్కుశకులిశసత్కుమ్భసుధను
ర్గదాశక్త్యఙ్గుష్ఠస్థితయవసుచక్రాదిలసితౌ

సఖేద్గుజ్యోత్స్నాభి ర్విధుత సబిసఖ్యాన్తనిచయే
హృదిధ్యాతే భక్తై ర్హృదయచరణౌ ద్రక్ష్యసి హరేః. 159

8. న కేవలం కథామాత్ర మిదమ్. ఉపదేశోఽప్యయం సర్వేషా మిత్యాహ-

శ్లో. ఇతి స్మారం స్మారం తవగుణగణా న్మాదవపతే
మనోదూతం యోఽత్ర స్వయి నిజకృతే ప్రేషయతి చేత్
న మే ఇచ్ఛాస్థానం తత్ప్రణయరసనాశ్రుక్షలితహృ
ద్విభో భక్తాధీశః శ్రుతిశిఖరమృగ్యోఽపి భగవన్. 195

9 అథగ్రన్థే గుణాలంకారరసాద్యభావేఽపి భక్తానాం రుచి ర్భగవద్గుణవర్ణనా
సక్తానాం సహృదయానాం భవిష్యత్యే వేత్యాహ—

శ్లో. గసందర్భే ప్రౌఢి ర్నచగుణసమూహో నకవితా
పరీపాకః కశ్చిత్పదసుఘటనాఽప్యత్ర నతథా
తథాపి శ్రీకాన్తప్రగుణకథనేనా త్రసుధియాం
భవే చ్చిత్తాసక్తి ర్యది ఫలవతీ స్యా త్కృతి రియమ్. 200

10 భగవత్పరాయణై స్తచ్చరితామృతశ్రవణలుబ్ధైరిద మవశ్య మాదరణీయమే
వేతి ప్రార్థయతే:—

శ్లో. యది ప్రద్యుమ్నాగ్రజచరణరాజీవమధుపః
సమాస్వాదాసక్తో భవతి భవతాం చిత్తమధుపః
కథాయాం వా తుచ్ఛీకృతసురసుధాయాం మధురిపో
ర్మనోదూతం కావ్యం శృణుత సరసం భక్తిరసికాః. 201

11. భఙ్గ్యన్తరేణ కావ్యోత్పత్తి మాహ:—

శ్లో. స్థితాద్బృన్దారణ్యే తరణితనయాతీరలహరీ
పరీరమ్భాదమ్భః పృషతయుజి వంశీవటతలే
నకాన్తా చ్ఛ్రీకాన్తా దధిగతవతీ సంగ మసఘా
మతిర్మే ప్రాసూత ధ్రువ మిహ మనోదూతతనయమ్. 202

12. ఉపసంహారశ్లోకములలో మొదటిది ప్రకృతోపయోగము—

శ్లో. వేదేన్దువసుశీతాంశు (1814) మితేఽబ్దే మార్గశీర్షకే
సితాష్టమ్యా మిదం కావ్య మర్పితం హరిపాదయోః."

ఇతి శ్రీమత్తైలఙ్గాన్వయ శ్రీభూధరభట్టాత్మజ శ్రీరామకృష్ణతనయ పఞ్చనదాన్వయవ్రజనాథవిరచితం మనోదూతాభిధం, సహృదయహృదయాహ్లాదనాపరనామధేయం కావ్యం స్వకృతమఞ్జుభాషిణ్యా టీకయా సమేతం సమాప్తమ్.

XXVII. మనోదూత:—20. కృత్యాదిశ్లోకములవలనను గద్యమువలనను నీకవినామము రామరామకవి యనియు, నితఁడు చైతన్యుని మేనమామయగు విష్ణుదాసవంశీయుఁ డనియుఁ దెలియుచున్నది. ఇతివృత్తము తుల్యమైనను నిది విష్ణుదాసకృత "మనోదూత" కంటె భిన్న మని తెలియునది. ఇందు మొదటిరెండుశ్లోకములు మాత్రము శార్దూలవృత్తములు, తక్కిన వన్నియు శిఖరిణీవృత్తములు.

XXVIII. మనోదూతికాకావ్యము:—21. ఇందు దూతకావ్యవ్యాజమున జీవాత్మపరమాత్మలసంబంధము వర్ణింపఁబడినది.

XXIX. మనోదూత:—22. ఇది జైనకావ్యమని తోఁచెడిని. అందుచే నామసామ్యము గలపూర్వోల్లిఖితకావ్యము లన్నిటికంటె నీకావ్యము విలక్షణమైన దని యూహింపనగు.

XXX. మయూరసన్దేశము:—23 రంగాచార్యరచితము.

* XXXI మయూరసన్దేశము— కవిపేరమృగ్యము. ఇందుఁ బ్రియుఁడు తనప్రాణప్రియకు మయూరముచే మదనసందేశము నంపుట వర్ణితము. పూర్వోక్తరంగాచార్యనిర్మిత 'మయూరసన్దేశము' కంటె నిది విలక్షణమా యను విషయము విమర్శనీయము. మద్రపుర ప్రాచ్యలిఖితగ్రంథాలయపట్టిక (A Triennial Catalogue of Manuscripts' collected during 1919–'20 to 1921—1922 for the Govt. Oriental MSS. Library, Madras. Vol. No. IV. Part I. Skt. A., Page 4298; R.No. 2963.) లో నుట్టంకింపఁబడిన 'మయూరసన్దేశము' లోని శ్లోకముల నుదాహరించెద.

కావ్యారంభము:—

'శ్లో. అవిరతమదధారాధారణాద..............
న్నదమధుకరమాలాకూజితోద్ఘోషితాశమ్
మమమనసిసమిద్ధాం (ద్ధాం) సిన్ధురేన్ద్రాననంత
త్రిమపి కనకశైలప్రస్థసచ్ఛాయమోజః.

---

20 'వంగీయసాహిత్యపరిషత్తు'—కలకత్తా. "Sanskrit Manuscripts No. 1282

21. "Catalogue of Skt. MSS. in the Raghunatha Temple Library of His Highness the Maharajah of Kashmir"—M. A. Stein- p. 70; 287; Introduction, page xxv.

22. "జైనగ్రంథావళి" ('జైనశ్వేతాంబరసమ్మేళనము,' బొంబాయి.)

23. "A Preliminary List of Sanskrit and Prakrit Manuscripts in the Adyar Library"—Madras, p. 130.

శ్లో. శ్రీకణ్ఠోర్వీపతిబహుమతం మారచేమన్త్రికాఖ్యం
మారస్యాస్త్రం మహిత మధికృత్యాధునా సాధుబద్ధమ్
హృష్యన్త్వల్లీమధురమధు’ష్యన్దిసన్దేశకావ్యం
నవ్యం విద్వత్కవిప’షదామస్తు కర్ణాతిథేయమ్.

శ్లో. స్వర్గారామద్రుమనవలతాసూనసౌరభ్యలాభ
గ్రామం (మే) పుష్పన్ధయకలకలధ్వానవాచాలితాశే
సౌధే సాధీయసి (ప)రిలసచ్చన్ద్రిపాదాభిరామే
రేమే వ్యోమస్పృశి మధితయా లాలితః కోఽపి కా(మీ)

శ్లో. కుర్వన్నిచ్ఛావిహృతి ముమయా సజ్జకః స్ఫాటికాద్రా
వాస్తేఒల్లీచలనకణికాక్లప్త.............స్థః (?)
శ్రీకణ్ఠోఽయం స్వయమితిధృతభ్రాన్తిరేనం కదాచిత్
ప్రక్రాన్తో...............తిముఖః ఖేచరాఘు స్సిషేవే

శ్లో. హాహన్తాసౌ హతవిధివిపర్యాసితాత్మా తదీయం
దృష్ట్వా జాడ్యం ముహురపిమిల ద్ధస్తతాలం జహాస
సేయ న్నారీభవదసునమో మానమాసేతిరు
శాపంప్రాదాన్మహ(ద)వమతిః కస్యనాత్రింప్రసూతే.

శ్లో. తేనావాసో మమ మధుజిత స్సన్నిధౌ వ్యాపిపుణ్యే
క్షేత్రేస్యాది త్యధనవినయం ప్రార్థ్యమాన స్తథేతి
ప్రాప్యప్రాయాదయమపి సమైః క్లిష్టనద్య స్సుదూరే
స్యానన్దూరే విగలదయుతా దీన(మా)త్మానమేవ.

శ్లో. దైత్యారాతిం దలితశతమన్యూపలోదారశోభం
పశ్యన్నేనం భుజగశయనే కల్పితస్వాపసౌఖ్యమ్
తాపోద్రేక న్దధదపిముహుః ప్రేయసీవిప్రయోగా
దచ్ఛశ్వాస క్షణమివ శనైరేష సంజాతసంజ్ఞః.

శ్లో. సోఽయం కాన్తావిరహజలధౌ వీతపారే నిమగ్నః
స్వం వృత్తాన్తం సరసిజదృశో హన్త సన్దేష్టుకామః
విద్యుద్వల్లీకవచితనవామ్భోదనీరన్ధ్రితాశే
కాలే కాన్తం కమపి శిఖినం సమ్పతన్తం దదర్శ.

* * * * *

# మల్కాపురశాసనము.

— జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్. —

---

ఈ శాసనము గుంటూరుమండలములో గుంటూరుతాలూకాలోఁ జేరిన మల్కాపుర మను గ్రామము పొలములో నొక పాడుదేవాలయమునెదుట నున్న రాతిస్తంభము మీఁదఁ జెక్కఁబడి యున్నది. ఈ స్తంభము 14 అడుగుల 7 అంగుళముల యెత్తును 2 అడుగుల 10 అంగుళముల వెడల్పును 2 అడుగుల 8 అంగుళముల దళసరియుఁ గలది. అశోకశాసనస్తంభములు గాక యింత పెద్ద శాసనస్తంభము నే నెక్కడను జూచియుండ లేదు. 1915 వ సంవత్సరములో నేను జూచినప్పు డీస్తంభము నిలువఁబడియుండక నేలపైఁబడియున్నది. పిదప రాజకీయాధికారులు దానిని నిలువఁబెట్టి పీఠము కట్టించినారు.

స్తంభము మూఁడుప్రక్కల శాసన మున్నది. తొలిప్రక్కను 90 పంక్తులును రెండవప్రక్కను 79 పంక్తులును మూఁడవప్రక్కను 31 పంక్తులును వెరసి 200 పంక్తు లున్నవి మొదటివైపు 72 పంక్తులు మాత్రమే మొట్టుశాసనములోనివి. తక్కిన 18 పంక్తులు పెద్దశాసనమునకు సంబంధించినవే యైనను శాసనభాగములు కావు. అవి పెద్దశాసనము చెక్కినపిదపఁ జెక్కఁబడినట్లు కనఁబడుచున్నది. మూఁడవప్రక్కను పెద్దశాసనముక్రింద నిటీవలఁ జెక్కఁబడిన మఱికొన్ని తెలుఁగుశాసనములు గలవు.

గ్రామసీమావివరణము తెలుఁగులో నున్నది. తక్కినశాసన మంతయు సంస్కృతపద్యరూపముగా నున్నది లిపి యాకాలపు తెలుఁగులిపి. అక్షరములు పెద్దవిగాను స్పష్టముగాను నున్నవి. వ్రాఁతతప్పులు కొంచె మున్నవి. భగవాను (I-7) సముపాలయతు (I-30) ప్రక్రీడతు (I-37) ఇత్యాది శబ్దములయందుఁ దుదిహల్లున ఉకారము చేర్పఁబడినది. ఇది పొరపాటు. తెలుఁగుభాగములోఁ దప్పు లెక్కువగా నున్నవి.

1183వ శకసంవత్సరమునకు సరియైన దుర్మతిసంవత్సర చైత్రబహుళాష్టమీశుక్రవారమునాఁడు కాకతిగణపతిదేవమహారాజు మందరమనుగ్రామమును, ఆదినమందే గణపతిదేవునికూఁతురగు రుద్రమదేవి వెలఁగపూఁడి యనుగ్రామమును విశ్వేశ్వరశంభు వను శైవాచార్యున కిచ్చిరనియు, విశ్వేశ్వరశివుఁ డీరెండు గ్రామములుం జేర్చి విశ్వేశ్వరగోళకి యనుపేర నొకయగ్రహారమును బ్రతిష్ఠించి యందు విశ్వేశ్వరశివాలయము, మఠము, సత్రము మొదలగునవి

నిలిపె ననియుఁ జెప్పుట యీశాసనముఖ్యోద్దేశము. కాకతీయరాజచరిత్రము, గోళకీశైవమతసంప్రదాయము, పూర్వగ్రామనిర్మాణపద్ధతి యను నీమూఁడువిషయములకును సంబంధించిన విశేషాంశములు పెక్కు లీశాసనమువలన విశదమగుచున్నవి. వాని నీక్రింద సంగ్రహముగాఁ దెలిపెదను.

— కాకతీయరాజచరిత్రము. —

ఈశాసనమందు కాకతీయవంశము సూర్యవంశములో నొకశాఖ యైనట్లు వర్ణింపఁబడినది. కాకతీయులు క్షత్రియులే కా రని నామతము. ఈవిషయమును గుఱించిన వాదప్రతివాదములు పరిషత్పత్రిక పదియవ సంపుటమునఁ జూడఁ దగును. అందలి నావ్యాసములో గణపతిదేవుని యనంతరము పుట్టినశాసనములలో నెక్కడను కాకతీయులు సూర్యవంశపురాజు లైనట్లు లేదని యున్నది. ప్రస్తుతశాసనము గణపతిదేవుని కాలమందుఁబుట్టినట్లే యూహింపవలసి యున్నది. దీని కుపపత్తి ముందుఁ దెలిపెదను.

గణపతిదేవుని పితామహుఁడగు ప్రోలరాజు వంశకర్తగా నీశాసనమందు వర్ణింపఁబడినాఁడు. ఇతరశాసనములను బట్టియుఁ బ్రతాపరుద్రీయమును బట్టియు, కాకతీయవంశక్రమ మీక్రిందివిధముగా నున్నట్లు కనఁబడుచున్నది.

ప్రోలరాజు
|
త్రిభువనమల్ల బేతరాజు (కొడుకు)
|
రెండవప్రోలరాజు (కొడుకు)
=ముప్పమదేవి
|
౧ రుద్రదేవుఁడు ౨ మహాదేవుఁడు
|
గణపతిదేవుఁడు—(కొడుకు)
=సోమలదేవి (ప్రతాపరుద్రీయము)
|
రుద్రమదేవి (కూఁతురు)
|
ముమ్మడంబ (కూఁతురు)
|
ప్రతాపరుద్రుఁడు (కొడుకు) రుద్రమదేవిస్వీకృతపుత్త్రుఁడు.

రుద్రమదేవి గణపతిదేవుని భార్య యను నొకవాద మున్నది. కాని ప్రతాపరుద్రీయమందును, ఇదివఱలోఁ బ్రకటింపఁబడిన కొన్నిశాసనములందును నామె గణపతిదేవునిపుత్త్రిక యనియే యున్నది. ప్రస్తుతశాసన మీవాదమునే స్థిరపఱుచుచున్నది. కావున రుద్రమదేవి గణపతిదేవుని భార్య యనువాద మిఁక శాంతించునుగాక.

ప్రస్తుతశాసనమందు "యస్యాః కాకతివంశమౌక్తికమణేః శ్రీరుద్రదేవస్సుత స్తస్యాః కిం కథయామ వైభవ మతః శ్రీరుద్రదేవ్యాః పరం" అని యుండుటచేత, ప్రతాపరుద్రుఁడు రుద్రమదేవికొడుకే గాని దౌహిత్త్రుఁడు గాఁడని కొందఱూహించుచున్నారు. కాని, యీయూహ సరియైనది కాదు. ప్రతాపరుద్రీయనాటకప్రకరణమందు స్వయంభూదేవుఁడు రుద్రమదేవితో "స్వీకృతే పుత్త్రభావేన దౌహిత్త్రే ప్రాగ్యమాజ్ఞయా । అస్మిన్నిధేహి ధారేయే గుర్వీ ముర్వీధురాం" (పూర్వము నాయాజ్ఞచే నీవు పుత్త్రభావముతో స్వీకరించిన దౌహిత్త్రుఁడును, ధురంధరుఁడు నగునీతనియందు బరువైన యీమహీభారము నుంచుము.) అన్నట్లున్నది. దీనినిబట్టి ప్రతాపరుద్రుఁడు రుద్రమదేవికి దౌహిత్త్రుఁ డనియుఁ బుత్త్రుఁడుగా నామెచే స్వీకరింపఁబడె ననియు స్పష్టపడుచున్నది. శాసనములోని సుతశబ్దమునకు స్వీకృతపుత్త్రుఁ డని యర్థము చెప్పికొనుట కభ్యంతర మేమియు లేదు.

ఈశాసనమువలన విశేషాంశ మొక్కటి తేలుచున్నది. గణపతిదేవుఁడును రుద్రమదేవి యు నేకకాలమందే దానములు చేసినారు. ఆకాలమందు రుద్రమదేవి రాజ్యము చేయుచుండెను. (చూ. మొదటివైపు 43-48 పంక్తులు) శాసనాంతరమువలనఁ గూడ గణపతిదేవుఁడు శ. స 1120 మొదలుకొని 1182 వఱకు నలువదిరెండేండ్లు రాజ్యపాలనము చేసినట్లును శ. 1182 సంవత్సరమునందే రుద్రమదేవి రాజ్యమునకు వచ్చినట్లును గనఁబడుచున్నది. కావున దానకాలమందు రుద్రమదేవియే రాజ్యము చేయుచుండె ననుమాట తథ్యము. అట్లయినచో గణపతిదేవుఁ డాసమయమున దానము చేయుట యెట్లు పొసఁగె ననుసంశయము పొడముచున్నది. దీనికి సమాధానము గణపతిదేవుఁడు చిరకాలము రాజ్యముచేసి యవసానకాలమందు రుద్రమదేవికిఁ బట్టాభిషేక మొనర్చి తాను పైనుండి యామెపేర వ్యవహరించుచుండె నని చెప్పవలసినట్లు తోఁచుచున్నది. రుద్రమదేవి స్త్రీయగుటచేఁ దనయనంతర

మాయె. రాజ్యాధికారమునకు శత్రువులవలన భంగము కలుగునేమో యనుభయము గణపతిదేవున కుండినట్లు కనఁబడుచున్నది. కావుననే కాఁబోలు నామెను కొడుకుఁగాఁ గొంతకాల మాతఁడు భావించి వ్యవహరించెను. "ఏవంమానుష శంభునా గణపతిమహారాజే నాభ్యంతర స్వానుభవమహిమ్నః సదృశమత్ర పుత్ర ఇతి వ్యవహారః కృతః। తదనుగుణాచ రుద్ర ఇత్యాఖ్యా"మాను షశంభుఁడైనగణపతిమహారాజుచేత తనపుత్త్రికయొక్క భావికాల మాహాత్మ్యమును దెలిసికొను తనయంతఃకరణప్రవృత్తికిఁ దగినట్లు పుత్త్రుఁడని వ్యవహారము చేయఁబడినది. తదనుగుణముగా రుద్రుఁ డని పేరుకూడఁ బెట్టఁబడినది. అని ప్రతాపరుద్రీయము. దీని కనుగుణముగా రుద్రమదేవి రాజ్యారంభమునఁ గొంతకాల మువఱకు రాజుపేరు రుద్రదేవుఁ డనియే కనఁబడుచున్నది. గణపతిదేవుని యనంతరము తనరాజ్యమును నిలుపుకొనుటకై రుద్రమదేవి యత్యధికప్రయత్నము చేసికొనవలసి యుండినట్లు "వెలుగోటివారి వంశావళి" యన వ్రాఁతపుస్తకములోని యీక్రిందిభాగమును బట్టి స్ఫురించుచున్నది.

"నాఁటికి నాత్మవల్లభుని నాఁటియుగా నొనరింప బ్రహ్మయున్ ।
"నేరఁడు రుద్రమాంబ ధరణీసతికిన్ బతిగా నొనర్చె దు ।
"ర్వారవిరోధిమండలిని గర్వ మడంచితి వార మేటివై ।
"వీరప్రసాదనాంక యరివిక్రమ సీకొరులీడ చూడఁగన్ ॥

"అప్రసాదిత్యుండు కాకతిగణపతిదేవరాయలు చనితే అతనికొమార్తె "రుద్రమదేవిని పట్టముగట్టి కాకితరాజ రాజ్యస్థాపనాచార్యబిరుదున్ను రాయ "పితామహాంక బిరుదున్ను డెబ్బైయొద్దుర నాయంకుల గా నొనరించి భైరవ "వరప్రసాదలబ్ధ బగువచ్ఛధరించి నెగడె మహిని."

ఈహేతువు లన్నింటినిబట్టి గణపతిదేవుఁడు తాను జీవించియుండఁగానే రుద్రమదేవికిఁ బట్టాభిషేకము చేసినట్లు కనుపట్టుచున్నది. గణపతిదేవుఁడు జీవించియుండఁగానే ప్రతాపరుద్రదేవుఁడు యౌవనారంభదశలోనికి వచ్చినట్లు కూడ సీశాసనము తెలుపుచున్నది.

—: గోళకీశైవమతప్రశంస :—

ఈమతము గంగ నర్మదానదీ మధ్యమం దున్న దహాలమండలమందు సద్భావశంభు వను శైవాచార్యునిచేఁ బ్రతిష్ఠింపఁబడినది. ఈయాచార్యునకు యువరాజదేవుఁ డను కలచురిరాజు మూఁడులక్షలగ్రామములు గలదేశము

భిక్షగా నొసంగఁగా నీయన యాభిక్షను గోళకీమఠమున కర్పణము చేసెను. సద్భావశంభుశిష్యుఁడు సోమశంభువు. ఈయన సోమశంభుపద్ధతి యను శైవాగమగ్రంథము రచించెను. ఈయనశిష్యుఁడు వామశంభువు. ఈయనశిష్యప్రశిష్యులు కొందఱు కడచినపిదప శక్తిశంభువచ్చెను. ఆయనశిష్యుఁడు కీర్తిశంభువు. ఆయనశిష్యుఁడు కేరళదేశజాతుఁడైన విమలశివుఁడు. ఆయనశిష్యుఁడు ధర్మశివుఁడు. ఆయనశిష్యుఁడు గౌడరాఢాదేశమందలి పూర్వగ్రామనివాసి యగు విశ్వేశ్వరశివుఁడు ఈతఁడు కాకతీయగణపతిదేవుని దీక్షాగురుఁడును ప్రకృతశాసనములోఁ జేర్కొనఁబడిన దానప్రతిగ్రహీతయు. దహాలమండలమనునది చేదిదేశమున కపరనామధేయము. దీనికి రాజధాని యైన ప్రస్తుతము తెవారి యనువ్యావహారికనామము గల త్రిపురాంతకపట్టనమందుఁ బూర్వము గోళకీమఠ ముండెడి దఁట గోళకగిరి యనుకొండమీఁదఁ గట్టుటచే దానికాపేరువచ్చిన ట్లగపడుచున్నది. ఒక్క కాకతీయరాజే గాక యీయనకుఁ జోళరాజు, మాళవరాజుఁ గూడ శిష్యులుగా నుండిరి. గణపతిదేవుని యాస్థానమం దీతనికిఁ బలుకుబడి యధికముగా నుండినట్లు కనఁబడుచున్నది. గణపతిదేవునకు శివదేవయ్య యనుమంత్రి యున్నట్లు సోమదేవరాజీయమువలనను ప్రతాపచరిత్రము *వలనను గనఁబడుచున్నది. విశ్వేశ్వరశివుఁడును శివదేవయ్యయును నొక్కరే యైన ట్లూహింపఁదగియున్నది. ఈయననుగుఱించి తిక్కన సోమయాజి గణపతిదేవునితో "వసుమతినాథ యీతఁ డీశ్వరుఁడు గాని । మనుజమాత్రుండు గాఁడు పల్కులు నితని । యనుమతింబున నీవు రాజ్యంబు నెమ్మి। నేలు" మని చెప్పినట్లు సోమదేవరాజీయమం దున్నది. ఈతఁడు చేసినదానములు గూడ గణపతిదేవుఁ డీతనికి వశవర్తి యై యున్నట్లు సూచించుచున్నవి.

—: పూర్వకాలపుగ్రామనిర్మాణపద్ధతి :—

తనకు దానముగా నొసంగఁబడిన మందర, వెలంగపూఁడిగ్రామములు రెంటిని జేర్చి విశ్వేశ్వరగోళకి యనుపేరుతో నొకయగ్రహారమును, అందు విశ్వేశ్వరాలయమును, సత్రము మొదలగునవియు విశ్వేశ్వరశివుఁడు ప్రతిష్ఠించెను. అఱువదియంది ద్రావిడబ్రాహ్మణుల రప్పించి యీగ్రామమందు నిలిపి వారి కొక్కొక్కరికి రెండేసిపుట్లవంతున భూమి యిచ్చి మిగిలినభూమి మూఁడుభాగములు చేసి యందొకభాగము విశ్వేశ్వరునకును, నూతనముగా స్థాపింప బడిన

*. చూ. ఆం. సా. ప. ౯ సంపుటము.

శుద్ధశైవమతమునకును విద్యార్థులకును గలిపి యొకభాగమును మూఁడవభాగము "ప్రసూత్యారోగ్యశాలలకు"ను సత్త్రమునకు నిచ్చెను. క్రొత్తగాఁ బిలిపింపఁబడిన ద్రావిడబ్రాహ్మణులు వీరశైవమతావలంబు లనియు నామతమువా రాంధ్రభూమిలో లేకపోవుటచేత ద్రావిడులు రప్పింపఁబడి రనియుఁ దోఁచుచున్నది. ప్రసూత్యారోగ్యశాలలు రెంటిలో నారోగ్యశాల యనఁగా సామాన్యరోగులకుఁ జికిత్ససేయుశాల ప్రసూతిశాల యనఁగా గర్భవతులగు స్త్రీలు సుఖప్రసవ మగుటకుఁ గా నేర్పడినశాల. ఈరెంటికి నిప్పు డాంగ్లేయభాషలో General Hospitl, Maternity Home అని పేరులు. ఇట్టియారోగ్యశాల లాకాలమందుఁ గూడఁ గల వని యిప్పటి నవీననాగరకు లెఱుఁగుదురుగాక! అన్నసత్త్రములో బ్రాహ్మణులు మొదలుకొని చండాలురపర్యంతము వచ్చినవా రందఱకు నన్నము పెట్టుటయును నుండినది. నేఁటినిమ్నజాత్యుద్ధారకు లీవిషయము గ్రహింతురుగాక! పైని స్థూలముగా సూచింపఁబడిన దానముల వివర మీక్రిందఁ జూపఁబడుచున్నది.

ఋగ్యజుస్సామవేదాధ్యాపకులు ముగ్గురు; పదవాక్యప్రమాణసాహిత్యాగమవ్యాఖ్యాతలు ఐదుగురు; వైద్యుఁ డొకఁడు; కరణ మొకఁడు; ఈపదిమందికి నొక్కొక్కనికి రెండుపుట్లు చొప్పున నిరువదిపుట్లభూమి. దేవాలయములో నాట్యముచేయు వేశ్యలు పదిమంది; మద్దెల మొదలగువాద్యములు వాయించువా రెనమండ్రు; ఈపదునెనిమిదిమందికి 1 కి పుట్టెఁడుభూమి ప్రకార మిరువదియేనుపుట్లభూమి. ఈపదునెనిమిదిమంది పేళ్లును శాసనస్తంభము మొదటిప్రక్క యందుగన వ్రాయఁబడియున్నది. ఈక్రిందఁ బేర్కొనఁబడిన:—1 కాశ్మీరదేశీయుఁడు, 14 పాటకత్తెలు, 6 జేగంటలు (కరడలు) వాయించువారు, 2 వంటబ్రాహ్మణులు, 4 పరిచారకబ్రాహ్మణులు, 6 మఠసత్త్రములందుండు నితరబ్రాహ్మణులు, 10 వీరభద్రు లను గ్రామరక్షకులు, 20 వీరముష్టు లనుభటులు, 6 బంగారు, రాగి, పాషాణము, వెదురు, ఇనుము వీనితోఁ బనిచేయువారు. 1 కమ్మరి, 1 స్థపతి, 1 కంసె (కారుఁడు) 1 మంగలి, 1 శిల్పి యను డెబ్బదినలుగురకు డెబ్బదినాలుగుపుట్లభూమి.

తోఁటనిమిత్తము నివర్తనముభూమి లీయఁబడెను అవవంతు. గ్రామవ్యయము లెక్కించుటకై నియమింపఁబడిన విశ్వేశ్వరశివుని స్వగ్రామమగుపూర్వగ్రామనివాసులును, సామవేదులును శ్రీవత్సగోత్రులు నగుబ్రాహ్మ

ణులకు ముప్పదిపుట్లభూమి కూడ నీయఁబడినది. ఈభూమియంతయుఁ జేరి 150 పుట్లయినది. ద్రావిడబ్రాహ్మణుల కిచ్చిన 120 పుట్లును, తోఁట కిచ్చినభూమియుఁ జేరి గ్రామముఁగడికట్లు 270 పుట్లు పైచిలుకైనది.

పైనుదాహరింపఁబడిన గ్రామరక్షకు లను "వీరభద్రులు" బీజచ్ఛేద శిరచ్ఛేద కంఠచ్ఛేదాది కర్మలు చేయువా రనియున్నది. వీరకైవృలలోఁ గొందఱు పుణ్యము వచ్చునని తమతమ యవయవముల ఛేదించుకొనునాచారము పూర్వముండినదఁట. అంతసాహసము చేయువారు కావుననే గ్రామరక్షణమునకు సమర్థులని యూహింపవలయునా కాక యాగ్రామరక్షకులు గ్రామములోఁ దప్పుచేసినవారికి రాజుచే విధింపఁబడిన శిరచ్ఛేదాదిదండనకార్యముల నిర్వహించువా రని తలంపవలయునా? ఈవిషయ మింకను విచారింపవలసి యున్నది.

ఈప్రకారము వృత్తులను బొందినవా రందఱును దమతమనియతకార్యముల యథావిధిగా నొనర్చుచుఁ దమతమవృత్తుల శాశ్వతముగా ననుభవింపవలయును పురుషులు లేనప్పుడు స్త్రీలు తమకార్యముల నితరులచేతఁ జేయించుచు వృత్తుల ననుభవించునది. ఈయేర్పాటు నంతను బరిపాలించుటకై సంవత్సరమునకు నూఱునిష్కములజీతము (ఆచార్యభోగము) మీఁద నొకస్థానాచార్యుఁడు నియమింపఁబడెను. ఈతఁడు తనపని సరిగాఁ జేయకపోయెడల స్థానపతులు వేఱొకని నాపదవికి నియమింపవలయు నని యున్నది. ఇచ్చటనే కాక యనేకములైన యితరస్థలములందుఁ గూడ విశ్వేశ్వరశివుఁడు శివాలయములు సత్రములు ప్రతిష్ఠించినట్లు శాసనము చెప్పుచున్నది

# మల్కాపురశాసనము.

— మూలము. —

మొదటివైపు.

౧ స్వస్తిశ్రీః వితరతు భగవా నసౌ శ్రియం వః కరివ
౨ దనో హారనీలభాసి యస్య । ద్యుతి వరసరసిస్ఫురత్త
౩ రంగ శ్రియ మధికా మళివక్త్రయో వహంతి॥ జయ
౪ తీందోః కలా ఖేలతు గంగాంభఃకణదంతురైః। కరైః కరోతి యాశ
౫ ంభో ర్మూర్ధ్ని ముక్తావలిశ్రియం ॥ హరిరవతు కిరితను ర్వో
౬ (భు)వ ముద్ధృత్య గతస్య వరుణపురీం । యస్యాఖిలజలధిజ
౭ లం పాదాభ్యామభూ దఙ్ఘ్రీణాయ॥ జయతి భగవాను స్వయ
౮ ంభూ ర్గణపతినృపతే ర్మాదిస్థిత స్సంతతం । యత్కారుణ్యకటా
౯ క్షై ర్వృద్ధిం ప్రాప్తాంధ్రదేశశ్రీః॥ అస్తి స్వస్తిమతీశతు ర్భగవతో
౧౦ దేవస్య తస్యాస్ఫురన్నాభిపంకజసంభవస్య భుజగో భూవల్లభాజ
౧౧ జ్ఞిరే। తేషాం తిగ్మరుచి సంతతిభువో యే దుర్జయాః క్షత్రియా స్తేషా
౧౨ మస్తి కులం కలంకరహితం శ్రీకాకతీభూభుజాం॥ వీర స్తత్రా ద
౧౩ జని రజనీనాథవద్దుగ్ధసింధోః కీర్తిర్జ్యోత్స్నాభరితభువనః ప్రోలభూపాల
౧౪ నామా । రాజ న్వత్యస్తి న్నమపి నృపతిం రాజశబ్దాభిధేయ న్నైవాస్త్రా
౧౫ మ్న త్రిజగతి వినా యామినీకామినీశం । కీర్తిర్యస్య హిమేందు
కుందవిశ
౧౬. దామూర్తి ర్జనానందినీ దానం విశ్వజనార్తిహారి చరితంగంగావయః
౧౭ పావనం । చిత్తం శంభుపదారవిందయుగళ ధ్యానామృతక్షాళితం శౌ
౧౮ ర్యం విద్విగరాతి దుర్మదహరం ధామాపి ధామ శ్రియః॥ రుద్ర
౧౯ దేవ స్తతో జాతో యత్కీర్త్యా భూ రలంకృతా । ప్రతిపక్షమహీపా
౨౦ లయశోనక్షత్రోల్ముక్షతి॥ రాజానః కతివా న సంతి సుభటాక్ర
౨౧ ంక్రాంతవిక్రాంతయా స్తేతిష్ఠంతు త మేకమేవ శృణుమ శ్శూరేషు రుద్ర
౨౨ ంనృపం । యస్యాసీ దసిదారితారినృపతిశ్శ్రేణీశిరః కందుకక్రీడాంప్రేషి
౨౩ తవిక్రమా యధిజయశ్రీః ప్రేయసీ స్థేయసీ॥ వీరవధశుర్యో యద్రుద్రదేవోమ

౨౪ హీభుజాం। సురేశ్వరాణాం సర్వేషాం పినాకీవ ధనుష్మతాం ॥ అథానుజ
౨౫ స్తస్య మహీశశాస ధీరో మహాదేవనృపో మహౌజాః। ప్రతాపదీపః
౨౬ ప్రతిపక్షభాజాం శామ్యంతి యత్కార్యకథానిలేన॥ కుందేందుచందన
౨౭ సఖః కుముదస్య మిత్రం స్వస్సింధుసింధురతురంగరుచాం సనాభిః।
౨౮ కర్పూరహారహరహాసపయఃపయోధిబంధుర్విభాతి యదుదార
౨౯ యశోవిలాసః॥ తస్యాయం తనయస్త్రయీమయతనోర్దేవాద్భవానీపతేః
3౦ (భః) క్ష్మాం సమపాలయతు గణపతిః క్ష్మాపాలచూడామణిః। యస్మి
3౧ న్విస్మయకారి విక్రమకథా ధారాముచి క్రీఘనే పృథ్వీదుష్టదురీశదావదహ
3౨ నప్రాప్తాం రుజం ముంచతి॥ దర్పే ధన్విని మత్సరో రణజయే థామ్నె(?)ం ద్విషారో
33 హణే। క్రౌర్యంశౌర్యవిదా తురంగదమనే చాపల్య మాశాయుధి। క్రోధోదుష్ట
3౪ జనే భయం ద్విజధనా లోభశ్చ ధర్మార్జనే పూజాకర్మణి శాంకరే గణపతిక్షోణి
3౫ పతే రాగ్రహః॥ కోదండోచ్చండవేగవ్యథితకరిహయవ్రాత పృథ్వీశసైన్యం కింబ్రూమ
3౬ శ్చండిమానం గణపతినృపతే ర్బాహుదండద్వయస్య। అద్యాప్యుద్దామ దర్పా దుపర
3౭ తపృతనాకోటికంకాలకూటప్రక్రీడత్ప్రేతయూథవ్యతికరవిషమభూ
3౮ మయో భీషయంతే॥ కతికతి నసంతి భూపాః కతికతి గుణగణాభ
3౯ రణాః। గణపతినృపతిస్త్వేకో నరపతికతపోమకః క్షోణ్యాం॥ నిస్సాణరవ
౪౦ సంత్రస్తాః తూణాద్గణపతే నృపాః॥ అపిత్యజంతి దుర్గాణి నదారానేవ కేవ
౪౧ లం॥ రుద్రదేవీసముదభూ త్పుత్రణ్యా త్సర్వభూభృతాం। గంభీరాన్మహత
౪౨ స్సస్మాల్లక్ష్మీరత్నాకరా దివ॥ సర్వోర్వీశకిరీటకుట్టిమతటీవిన్యస్తపాదాంబుజా శ్రా
౪3 స్త్యేషా చతురంబురాశిరశనాం శ్రీరుద్రదేవీ భువం। యస్యా జన్మమహోత్సవో

౪౪ గణపతేః క్ష్మాపాలచూడామణే ర్విఖ్యాజ్ఞత్తలిఖితాలకలక్ష్మ(ధా)ధ్వాం
తౌఘ

౪౫ తేజోనిధేః॥ సాంబ్రాజ్యే ఖలుజ్జితం విరచితే శ్రీరుద్రదేవ్యాస్వయం
చాతుర్వ

౪౬ ర్ణ్యాన్నిజస్థితి ర్విజయతే విద్రాతికాలః కలిః * ధర్మ్మాసౌ భగవాన్ స్వ
భాతి దురితం

౪౭ దూరే ద్విజానాం ద్విష స్తన్నామగ్రహభీషితా నిజపురాన్నిర్యాంతి
పర్యాణు

౪౮ లాః॥ ఆక్రామంతి తరత్తరంగవిగళద్దుగ్ధాబ్ధిఫేనావలీ రాచామంతి శరత్ప్ర

౪౯ శాంకవి సద్ద్యోత్స్నప్రవాహామృతం। ఆకర్షంతి సురేంద్రదంతిదశన

౫౦ ప్రాగ్భారలగ్నాం శ్రియం మ్ముక్తాహారలతాయితాః ప్రతిదిశం రుద్రాంబికా

౫౧ కీర్త్తయః॥ శ్రీవిశ్వేశ్వరదేశికేంద్ర శివహస్తా*సిదోర్వ్విక్రమ త్రిక్షోణీశ

౫౨ జగద్వశః ప్రతిబలప్రధ్వంసి జన్మోత్సవః। యస్యాః కాకతివంశమాకక

౫౩ మణే శ్రీరుద్రదేవస్సుత స్తస్యాః కింకథయామ వైభవ మత శ్రీరుద్రదేవ్యా

౫౪ ఃపరం॥ అస్తి విశ్వంభరాసారః కమలాకులమందిరం। భాగీరథీ నర్మ్మద

౫౫ యో ర్మ్మధ్యం దహాలమండలం॥ ఉగ్రం తత్ర తపశ్చర న్నియమయ

౫౬ న్బాహ్యేంద్రియక్రీడనం। సాంద్రానందమయే సమాధసమయే

౫౭ చిత్తేన లీనశ్శివే। నీత్వా కాల మనంత మంతకజయీ సద్భావశంభు

౫౮ గ్గుర్వోరు ధ్రువానసోన్వయసంభవ స్సుచరితః ప్రాబుద్ధపుణ్యా న్నృణాం॥
శైవానా

౫౯ ం ప్రథమాయ శంకరపదధ్యానామృతాంభోనిధిక్రీడాంబ్రేడనకర్మ్మనిర్మ్మ

౬౦ లతరస్వాంతాయ శాంతాత్మనే। తస్మై నిస్పృహచేతసే గళచుక్ష్మాపాళచూ

౬౧ డామణిగ్రామం గాంయువరాజదేవనృపతిర్బ్బాహుం త్రిలక్షీందదా॥కృత్వా

౬౨ నశైవముని రద్భుతశీలమూర్త్తి శ్రీగోలకీమఠముదారముదాత్తచిత్తః

౬౩ (త) న్యాకరస్సృపదశికమార్త్తికానాం వృత్తిం చకార సకలామపి తాం

౬౪ ॥ప్రాచీనపుణ్యపరిపాకవశాత్ప్రజానామావిర్బభూవ భగవానిహ సో

౬౫ మశంభుః। నామ్నా నిజేన సకలాగమసింధుసేతుం యః పద్ధతిం కరుణ

---

*శివహస్తాసి యన్నచో నొకగుర్వక్షరము లోపించినది.

౬౬ మూ ప్రతిమాం బబంధ॥ అథనృపకశేఖరమాలా లాలితపాదోత్ర వామళ
౬౭ ంభురభూత్। అద్యాపి కలచురీణా యచ్ఛరణా రాధకాః ప్రశస్యంతే॥ లబ్ధ
౬౮ దేశికపదా మనోహరా భూరిదానకరితోషితార్థినః। యత్రమత్తకరి
౬౯ ణోపి కుర్వతే పాశభేద మిహ భద్రజాతయః॥ తస్మి న్మతే తస్యగురో
ర్బభూవు
౭౦ శ్శిష్యాః ప్రశిష్యాశ్చ పరస్సహస్రాః॥ విగ్రహీతుం నమనుగ్రహీతుం క్షోణీ
౭౧ శ్వరా న్నక్షకటాక్షపాతైః॥ ఇత్థం కాలే యాతిసత్సంప్రదాయేసంతానేస్మి న్న
౭౨ ర్ణి సంతానకల్ప శ్శంభోర్ధే శ్శక్తిశంభో ర్పదారా ద్ధిష్య(శ్శ్రీ)మా న్విశ్వే
శ్వరశంభు ర్బభూవ॥
౭౩ చిల్పి ఆచార్యుల శాంతోజు కొమరు ప్రోలోజునకుఖ౨ అక్షరాలబైచ్చ్యా
౭౪ పోజు కొమరు ప్రోలోజురకు ఖ౧ (శ్రీ)మతు రాచగురుదేవార ఆనతిక్రను
మున (శ్రీ)మ
౭౫ తు కాళేశ్వరశివా అయ్యంగరు సాని ప్రిత్తుంలు పెట్టిన వైయినము॥ ప్రో
లాండి సెట్టికుం తులు కామ్మల అక్క
౭౬ సానికి ఖ౧ తుం౧। వల్లదేవిసెట్టి కుంత్తులు నలమరాసానికిఖ౧తుం౧। నమ
యమంత్రికుంత్తు
౭౭ లు విశ్వేశ్వరమణిభ్యానకు ఖ౧ తుం౧। ఆడవికుంత్తులు గోళగిరిమణిఖ్యా
నకు ఖ౧ తుం౧।
౭౮ వీరభద్రపై ఋరగి ఆండరికి ఖ౧తుం౧। సంకు(వె)న్నజీయకుమలకు తుం౧।
వేమన
౭౯ జియునికుంతులు కొమననికి ఖ(౧) తుం౧। ప్రోలెబోయకుంలు కొమసా
నికి ఖ౧ తుం౧। త్రుట్టు
౮౦ (పా)ము కొమ్ముసానికి ఖ౧ తుం౧। త్రుట్టపాము గుడ్డసానికి ఖ ౧
తుం౧। (వెన్న) సానికూంతు
౮౧ లుతల్లసానికి ప్రిత్తి ఖ౧ నం౧। నడపల్లె మల(న) మనుమలుంలు పాత్రట
సాని
౮౨ కి ఖ౧ నం౧। సూర్యదేవని కూంతులు తిరుమత్తసానికి ఖ౧ నం౧।
వెలంకపాండి

౮౩ శ్రీసోమనథదేవరకు ఖ౨ ఆస్తనపదిత్రిపుర। ఏయుసిల్లప్రదిండిదిన గణేశ్వ
రునికి న ౩

౮౪ శ్రీవిశ్వనథదేవర గుడిపనిచేసి కా

౮౫ సె ఆ(సో) జునకు ఖ౧ పన్నపోజు

౮౬ నకు ఖ౧ పొన్నోజునకు ఖ౧

౮౭ ......ండికూంత్రులు మొదలమకు గోకననోం

౮౮ ......కవ న౧౦ శ్రీవిశ్వనాథదేవర

౮౯ ......మాండికి కేసరి ఖ౧ విరిగొ

౯౧ ......నికి కేసరి ఖ౧ లోకో

—। రెండవవైపు ।—

౧ ప్రణామవ్యాలోలత్తలచురిమహీపాలవరిమ త్తిరీటప్రక్రీడత్తిరణకలికాలా

౨ లితపదాః। యశఃపూరస్ఫార స్తబకితదిశః కేరలభవా స్తటః పద్మావాసా
విమ

౩ శశిపపాదా స్సుభవా। నివ్వైర ముప్యాం కలికాలమధ్యే స్థాతుం
పదాభ్యా(o)

౪ కుతుకీవ ధర్మః। శిష్యః కృపాకందలితాంతరాత్మా తేషా మభూ ద్ధర్మ
శివోమునీ

౫ ంద్రః। యం కృపానిధి ముదారవైభవం ధర్మశంభు మఖిలార్తిభంజ
నం। ఏకవ

౬ క్త్రకమలం సదాశివం సంకాథాసుకృతినః ప్రచంక్షతే। అధ్యేతా నిగ
మస్య ధర్మతన

౭ య శ్రీగాడరాఢోల్లస త్పూర్వగ్రామశిఖామణి గ్గణపతిక్ష్మాపాల
దీక్షాగురుః

౮ క్షీరాబ్ధేరివ చంద్రమాః శ్శశికలామాలే ర్యథా షణ్ముఖః శ్రీవిశ్వే
శ్వరశంభురు

౯ ద్గతవన్ శ్రీధర్మశంభోరభూత్। చిరంపృథ్వీపాలావలీమకుటఘృష్టాంఘ్రి
కమలద్వయో

౧౦ విద్యావల్లీవలయకలనాకల్పకతరుః। సదా దాంత స్స్వాంత స్థిరతరోల్లస
ద్దూర్జటీ

౧౧ మహాశాంతః శాంతోజయతి భువి విశ్వేశ్వరశివః। శ్రీసోమేశ్వరసూరేశ
౧౨ క్షితిపతీ రాజన్యచూడామణీయత్పాదస్యాకిమకః పరాంగణపతిక్ష్మోణీపతిర్యస్యా
౧౩ త్మజః సప్తాఙ్గస్య ముదే సదేశికవర శ్రైవాగమాంభోనిధి శ్రీవిశ్వేశ్వర
దేశికః శల
౧౪ చరిత్రాపాలదీక్షాగురుః। గాఢాః పూర్ణమనోరథాః కతికతి ప్రాప్తాశ్రయా
౧౫ స్తాపసా। స్సంతుష్టాః కవిపుంగవాః కతికతి ప్రత్యస్తపాపా నృపాః
యేతస్మిన్
౧౬ గణపత్యధీశగురుతాసింహాసనాధ్యాసిని శ్రీవిశ్వేశ్వరదేశికే శివపురీ విశ్రా
౧౭ ణవశ్లాఘిని। త్వాంగత్రింగజటాకిరీట ముదయస్మేరారవిందాననం ముక్తా
కుండల
౧౮ తాడితాంసశిఖరం హారైర్మనోహారిణం। విద్యామండపవర్తినం గణప
౧౯ తిక్ష్మాపాలదీక్షాగురుం। శ్రీవిశ్వేశ్వరశంభు మీక్షితవతాం తే చక్షుషీ
చక్షుషీ
౨౦ లోహాః కోయం శకస్యాబ్దే సమ్మితే వత్సరే శుభే। చైత్రే సితేతరాష్ట
మ్యాం వా
౨౧ రేశుక్రాభిధానకే।విషయే వెలినాడాఖ్యే కంద్రవాట్యాం విశేషతః।యముత్త
౨౨ రేణ వహతి కృష్ణవేణీ మహానదీ। శ్రీవిశ్వేశ్వరశంభవే గణపతిక్ష్మోణీ
శ్వరేణా
౨౩ దరాద్గ్రామం మందరనామధేయమఖిలై ర్వ్యర్ణతమాయైస్సమం।తత్పు
౨౪ త్రీ తదనుజ్ఞయా పశుపతేః శ్రీరుద్రదేవీ పుర్యః ప్రాదాద్గ్రామ వెలంగపూండిస
౨౫ హితం సీమాష్టకేనావృతం॥ అష్టస్వామ్యైవ సహితం ధారాపూర్వంనక
వర్ణకం కృ
౨౬ ష్ణవేణీనదీమధ్యగతయా లంకయా సహ॥ తస్యగ్రామస్య సీమానః కథ్యం
౨౭ తే పూర్వతః క్రమాత్। పరిజ్ఞానాయ సర్వేషాం భాషయాంధ్రయా
స్ఫుటార్థయా
౨౮ యా। పూర్వస్యాం। పెదుంబాక డిక్కు నుడవిలుపుం గాల్వ పొలమెర। ఆ
౨౯ గ్నేయ్యాం। తాండివుండి వచ్చిన మద్దిమడ్గు కాల్వ పొలమెర।దక్షిణస్యాం

---

24, 25 పంక్తులలో ప్రాదాద్గ్రామ అనునది ప్రాదాద్గ్రామం అని యుండవలయును. వెలంగపూండిసహితం అనగా వెలుగుపూండి నామసహితం అని యర్థమైనట్లు తోఁచుచున్నది.

౩౦ ం। కృష్ణంగొమ్మకాల్వ పొలమెర। నైరుత్యాం। ఉప్పలపాటిచెఱువు వమమ
౩౧ టిగొమ్మ రావిపూండి వెలంగపూండి పొలమునందు పొలమెర। పశ్చి
౩౨ మాయాం। మందరామకూను వెలంగపూండికిని వమమటిరావి
౩౩ పూండి పొలములోని నల్లంచుమ్మ ఉత్తరము పెరుంబడి ను పొలము
౩౪ నందు పొలమెర। వాయవ్యాం। పెరకమ్మనుండి వెళ్లిన ఇమ్ముంగాలి కాల్వ
౩౫ తలపొలమెర।అది మొదలు ఈశానపర్యంతము కృష్ణవేణియే పొలమెర।
౩౬ ఐశాన్యాం। కృష్ణవేణినుండి పెనుంబాకరడ్డి త్రవ్వించిన కాల్వతలపొలమెర।
౩౭ రావిపూండికి ఐశాన్యము। మందరామకూను వెలపూండికిన్ని వాయవ్య
౩౮ ము పెరకమ్మనుండి వచ్చినపాయేటి తలవమమటి సీమగాను మందర
౩౯ పురంకి॥ శ్రీవిశ్వేశ్వరదేవ మింమకలికాచూడం మఠం శాశ్వతం సత్రంవి
౪౦ శ్వజనాగ్రహారసహితం సుస్థాప్యనితోర్జితః। శ్రీవిశ్వేశ్వరగోళకీత్యభిధ
౪౧ యా తంగ్రామ మత్యాదరాత్ శ్రీవిశ్వేశ్వర స్సముయుజ త్ప్రీగాఢచూ
౪౨ డామణిః॥ నానాగోత్ర సముద్భూతా ద్రావిడా యేద్విజోత్తమాః। పరస్ప
౪౩ రం ప్రమాణానాః క్రయవిక్రయ మాదికం॥ షష్టిసంఖ్యావిశిష్టేభ్యః ప్రత్యేకం
౪౪ పుట్టికాద్వయం। పెరుంబాక ప్రసిద్ధేన మానదండేన సమ్మితం స్థిత్యాపాధిమ
౪౫ దాత్తేభ్య శ్రీవిశ్వేశ్వరదేశికః॥ ఏతత్తుక్షేత్రంతు పుట్టినాం వింశత్యాభ్యధికంశ
౪౬ తం। వెలంగపూండిసహితం దత్తం మందరనామకే॥ త్రిధా విభజ్య తత్సి
౪౭ ష్ట మేకం భాగం పినాకినే। విద్యార్థిభ్యో పరం భాగం శుద్ధశైవమఠాయ
౪౮ చ। ప్రమాత్యారోగ్యశాలాభ్యాం విప్రసత్రాయ చేతరం। ప్రాదాద్విశ్వేశ్వరశి
౪౯ వ శ్శైవసిద్ధాంతపారగః॥ ఋగ్యజుస్సామవేదానాం సమ్యగధ్యాపకాస్త
౫౦ యః పదవాక్యప్రమాణానాం సాహిత్యస్యాగమస్యచ॥ పంచవ్యాఖ్యాకృ
౫౧ తో వైద్యకాయస్థా ద్వా విచక్షణా। దశానామపి చేతైషాం ప్రత్యేకం పుట్టికా
౫౨ ద్వయం॥ శ్రీవిశ్వేశ్వరదేవస్య వర్తనకోర్థేదశసంఖ్యయా। ముఖరీద్వయ సంయుక్తా

౫౩ అష్టౌ మద్దలవాదకాః॥ అష్టాదశానా మేతేషాం ప్రత్యేకం నార్థపుట్టికావి
౫౪ కః కాశ్మీరదేశీయో గాయిన్య శ్చతుర్దశ. కరటావాదనాద్యేషు కృత్యే
షు రస
౫౫ సంఖ్యయా। పాచకా ద్వా ద్విజన్మానా చత్వారః పరిచారకాః॥ తత్రైవ
మట్సగా
౫౬ ఖ్యాతా బ్రాహ్మణా మఠసత్రయోః। చాతుర్వర్ణ్యస్య సత్రే మ్యాఖ్యాతా
జటిలాశ్చోడదే
౫౭ శజాః॥ బీజచ్ఛేద శిరచ్ఛేద కర్తిచ్ఛేదాదికర్మభిః। విరత ధసమాఖ్యా
తా దశ గ్రా
౫౮ మస్య రక్షకాః॥ భటాస్స్యు రమీ భక్తా వింశతి స్వర్ణముష్టయః। సువ
ర్ణ్ణతామ్ర
౫౯ పాషాణ వంశాయస్కుంభకారకాః॥ ఏతే స్థపతి సంయుక్తాః కారునాపిత
౬౦ శిల్పినః। దశ స్వకృత్యం కుర్వాణా భటాస్స్యు స్స్వర్ణముష్టిభిః॥ త్రిసప్త
తి ర్మనుష్యా
౬౧ ణాం కల్పితా స్త్వేకపుట్టికా। ప్రత్యేకం పూర్వముక్తానా మారామా
ర్థం చ సర్వ
౬౨ తః॥ ప్రాదాత్ షోడశకం భాగ న్నివర్తన మితక్షితేః। గాఢకక్షిణరా
ఢీయపూ
౬౩ ర్వగ్రామ సముద్భవాః॥ శ్రీవత్సగోత్రిణో యేస్యు బ్రాహ్మణా స్సామ
వేదినః
౬౪ ఏతేభ్య స్త్రింశతం పుట్టి రదా ద్రాజగురు స్తథా॥ ఏతా ఏతే ప్రభుంజానా
౬౫ గ్రామన్యాయవ్యయాదికం। అనుసందధతాం సర్వం సమ్య గ్లేఖనపూ
౬౬ ర్వకం॥ ఇత్యాహత్య శతం సార్ధం పుట్టికానాం ప్రకల్పితం। తిష్ఠతా
మేవస
౬౭ ర్వేషాం స్వే స్వే కర్మణి వృత్తయః॥ భవం త్వాచంద్రతారార్క మస్య
థా నభవంతి వా
౬౮ పుత్రాభావే స్త్రియో హ్యేషాం కులాచారసమన్వితాః। కారయంత్య
స్వకర్మాణి హే

౧౯ త్రారామాది భుంజతాం॥ క్షేత్రాణి శిష్టాన్యఖిలాని దేవదేవాంగభోగాలయ
౨౦ ముఖ్యకృత్యై। ఉపేయుషాం శైవతపోధనానాం కాళాననానాం శివశా
సనానా
౨౧ ం॥ విద్యార్థినాం పాశుపతవ్రతానా మప్యన్నవస్త్రాదిసమర్పణాయ॥ఆ
౨౨ రథ్య విప్రాననివారితానాం చండాలపర్యంత ముపాగతానాం॥ అన్న
౨౩ ప్రదానాయచ సర్వకాల మకల్పయ ద్రాజగురు ర్మహాత్మా। ...
సత్ర
౨౪ స్య మఠస్య తస్య గ్రామస్య సర్వస్యచ సోధికారీ॥ యోగి శకీవంశ్య
కృతాభిషే
౨౫ క శ్శాంత శ్శుచి శ్శైవరహస్యవేదీ। శైవాగమానా మపి పారగామీ
సంతాన
౨౬ పాల స్సముల్లోష్ట హేతు॥సర్వాణి భూతాన్యనుకంపమానస్సమస్తవిద్యా
౨౭ సుకృతావగాహః।మహీసురశ్శీలవతాం పురోగో భవత్తరాం నైష్ఠికదేశి
౨౮ కేంద్రః॥ విశ్వేశ్వరశివాచార్యో ధీమా న్రాజగురు స్స్వయం। ఏనమా
జ్ఞాప
౨౯ యద్ధీర శ్శైవాచార్య శ్శతైర్వృతః॥ ఆంధ్రేషు స్థానపతయః షట్త్రి
మ్శాణ స్తపోధనా।

—మూడవవైపు—

౧ సాంతానికాశ్చ సర్వేత్ర సాక్షిభూతా భవంతు తే॥ శ్రీవిశ్వేశ్వర
గోళక్యా
౨ మాచార్యత్వే ప్రతిష్ఠితః।ఏతత్సర్వం సదాచారః పరిపాల్యోర్జితం
౩ సదా॥ నిష్ఠానాం శత మాచార్యభోగం భుంజీత దేశికః॥ ఉపే
౪ క్షకే స్సి దుర్వృత్తై ప్రజ్ఞా * * భక్త * క్తు * * స్సం పరిత్యజ్యసా
౫ ంతానిక మథాపరం। ద * * * త * * తా * * హాయూరక్షకా
౬ స్తథా॥ సర్వతీర్థఫలం సర్వజపహోమఫలం తథా। సర్వదేవా
ర్చన
౭ నఫలం ప్రాప్నువం త్వత్ర మానవాః॥ విరుద్ధా విఘ్నకర్తారః క్షేత్రద్ర
౮ వ్యాపహారిణః॥ త్రిసప్తకులజై స్సార్ధ మన్నపానాద్యభావతః॥ దరి

౯ ద్రాః ప్రేత్య రౌద్రీశ్చ ప్రాప్య్పష్టాదశ దుర్గతీః । దుఃఖా న్యనుభవిష్యంతి

౧౦ మహాంతీతి మహాతపాః॥ విశ్వేశ్వరశివాచార్య స్సదాచారై స్తపోధ

౧౧ నైః।బ్రాహ్మణై రవ్యసంఖ్యైయై ర్గ్రస్తై స్వభావేనునా రవా।కృష్ణవేణ్యామ్మ

౧౨ హానద్యాం స్నాత్వా చమ్యశివాపతః। ఏవం పాపకృతాం శాపం ప్రదా
త్పుణ్యకృతా

౧౩ ం వరం॥ కృత్వా కాళీశ్వరాఖ్యే పురే ఉపలమఠం పౌన్నగామాగ్రహారం
క్రీత్వా

౧౪ విశ్వేశ్వరశివ ఉరుధీ ర్దత్తవాన్ సర్వ్వసాక్షి । నిమ్మాయసాఖ్యలింగ
మ్మఠ మపి

౧౫ నగరే మంద్రకూటాభిధానే మానేపల్యాట్టువల్లిద్వయ మదదత సద్దేవస

౧౬ త్రద్వయాయ॥ నామ్నా స్వేన నచంద్రవల్లినగరే లింగం ప్రతిష్ఠాప్యసత్
కంచం

౧౭ కల్లితటాకసేతుమధికం కృత్వార్గ్య మస్మా అదాత్। కృత్వానందపదే స్వ
వామనగ

౧౮ రం ప్రతిష్ఠాప్య చాప్యానందం ముఃకూటమప్యథపురం దేవస్య భక్త్యా

౧౯ అదాత్॥ శామ్యగ్రామే స్వాఖ్యలింగప్రతిష్ఠాం కృత్వా త్రింశత్ఖారి
మానాం మ

౨౦ హీం సః। నిమ్న క్షేత్రం పంచఖారీ మితంచ ప్రాదా ద్దేవా యోంగరం
గోపభు

౨౧ క్త్యై శ్రీశైలేశాన్య లీశ్వరపురీనమఠం చ పోతశాపరకం। అకరో త్తచ్ఛి
ష్యో దాద్రా

౨౨ మం గణపతి రవాటిసత్రాయ॥ విషయే పల్లివాడాఖ్యే కంద్రకోటాభిధాన

౨౩ కం। ఆచార్య్య దక్షిణారూపం తస్మైభక్త్యా సమార్పయత్॥ లింగ
స్నివృత్తౌ ని

౨౪ మ్మాయ తద్వోల్లాలాంతరస్థలిం। దుద్యాలగ్రామవన్యాంశం పూసూరుగ్రామ

౨౫ మప్యదాత్॥ ఉత్తరసోమశిలాయాం లింగం వైశ్వేశ్వరం ప్రతిష్ఠాప్య
ఐత్రపోల్నా

౨౬ మానం గ్రామం ప్రాదా త్సదేశికశ్రేష్ఠః॥ సామాన్యోయం ధర్మసేతు
 ర్నృపాణా
౨౭ ం కాలే కాలే పాలనీయో భవద్భిః। సర్వానేతా న్భావినః పార్థి
 వేంద్రా న్భూ
౨౮ యోభూయో యాచతే రామచంద్రః॥ స్వదత్తాం పరదత్తాం వా యోహ
౨౯ రేత వసుంధరాం। షష్టిం వరుషసహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమి
౩౦ ః॥ అస్య సర్వస్య ధర్మస్య పాలకస్య కరద్వయం। విశ్వేశ్వరశివాచా
 ర్యస్యవహ త్యన్య
౩౧ ం సహాత్యలం। మంగళమహా శ్రీ శ్రీ.

(41) రసమంజరి — గ్రం. సం 165.

గుడిపాటి కోదండకవి రచించినది. మూఁడుగుచ్ఛములు మాత్రము గలవు. నడుమనడుమం గొన్నిపత్రములు లేవు. ప్రతిగుచ్ఛమునను బ్రథమ కుసుమము ద్వితీయకుసుమము అష్టాదశపద్యదళంబుల తృతీయకుసుమము నని భాగము లున్నవి.

సీ. శ్రీకరనందవరీకాగ్రగణ్యుండు వహిమించు గుడిపాటివంశభవుఁడు
బిరుదుగా నవఘంటసురధాణి పేరంది మహితుఁడౌ వెంగళమంత్రిపౌత్రుఁ
డతులితుం డగురంగయామాత్యతనయుండు వీరమాంబానందవృద్ధికరుఁడు
సింగనవెంగళశ్రీవిభు లనుజులై భాసిల్లు కోదండపతి ఘనుండు
సరసకవితాచమత్కారసార్వభౌముఁ, డవని శ్రీరంగధామదయాశ్రితుండు
ఎలమిరసమంజరినిరచియించెనందుఁ, బ్రథమగుచ్ఛంబు యూర్ధ్వకఫణితినమరు.

ఈవంశావళి వివరముగా మొదట నిచ్చియున్నాఁడు, గాని, పూర్తిగా లేదు. అక్కడక్కడఁ గొన్నివిషయములు:—

స్వాధీనపతిక:—అష్టవిధనాయికలయందు స్వాధీనపతిక యనునది యెల్లప్పుడును దనయింగిత మెఱింగి తనయాజ్ఞకు లోనుగా నడిచెడు పతిగలయది. ఈస్వాధీనపతికకు వనవిహారాదులు మదనమహోత్సవములు మదాహంకారములు మనోరథావాప్తులను జేష్టలుగాఁ గలిగియుండు. లక్షణము.

చ. గరిమ కుచంబులం గ్రసిమ కౌనునఁ గాంతిమ యంగకంబులం
బిఱుఁదుల మిక్కిలిం బ్రథిమ స్ఫీతిమ నవ్వుల వాక్పటుత్వమున్
వరనటన స్మరప్రతిమ వక్రిమ చూపుల మందయానమున్
మెరవడి లేకయున్న సతి మిక్కిలి చూడ ని దేమి చిత్రమో.

2. అభిసారిక:—తాను నాయకుని గూర్చి యభిసరించునదైన నాయకుని నభిసరింపఁ జేయునదైన నభిసారిక యనందగు, నీనాయకకీచేష్టలు సమయోచితమైన భూషణములు ధరియించునదియు, శంకయు, బుద్ధినిపుణతయుఁ గపటము, సాహసమును లక్షణములు, స్వీయాభిసారికా పరకీయాభిసారికలకుఁ బ్రకృత మొక్కటే యుండును.

ఇందు ముగ్ధాభిసారిక, మధ్యాభిసారిక, ప్రౌఢాభిసారిక, జ్యోత్స్నాభిసారిక, దివసాభిసారిక, స్వీయాభిసారిక, సామాన్యాభిసారిక లనుభేదములు గలవు. అందు స్వీయాభిసారికాలక్షణము.

చ. కులుకుచుఁ దారహారములు గుబ్బల వెన్నెలగాయ నందియల్
ఘలుఘలుఘల్లుమం చనఁగఁ గాంచి ఝుళంఝుళ లుప్పతిల్లఁగా
నలయఁగ ధక్క ప్రాయ యభిసారికవైతి మతేల తెల్పుమో
సొలయుచు మిక్కిలిన్ బెదరి చూచెద వెంతటిమాధురాలవే.

3. సకలనాయకులయందును సమమైన సహజానురాగము గలవాఁడు దక్షిణనాయకుఁడు.

ఉ ముందఱ నున్నవారు పరిముగ్ధవిలోచన లెందఱైన నే
నిందఱియందు నక్షియుగ మేక్రియనిల్పెద నంచు నెంచి తా
నందము మీఱ మీలితదృగంచలుఁడై మధుసూదనుండు నిం
పొందఁగ మేనఁ గ్రొంబులక లూరఁగ నిల్చె దరస్మితుండునై.

ఈరసమంజరి కరూరిలో శ్రీపతికుల సుధాకరులైన గానవిద్యాపారంగతులైన కోనుకోలు వేంకట్రాయలవారి తనుజునికొఱకు తిరుమలస్వామి వ్రాసి యిచ్చినది.

ఈపుస్తకములోనె మొదట (మువ్వగోపాలపదములు) క్షేత్రయపదములు గలవు. దానికి మొదటఁ బదములపట్టిక యీయఁబడినది. ఇందు 184 పదములున్నవి.

కొంత సాహిత్యలక్షణము గలదు. గణలక్షణములు సాహిత్యరత్నాకరము, సాహిత్యచంద్రోదయము, అలంకారచూడామణినుండి కొన్నిశ్లోకము లిచ్చియున్నాఁడు. పంచమస్థానమందు కకారవిషయాతురం యేలూరి శేషయ్యయుంచి చెప్పినకవిత—

చ. మునుపొకకేల రావణుఁడు మోదమునన్ రజతాద్రి నెత్తినం
తనె హరుఁ డప్పుడే తనపదంబునఁ ద్రొక్కి మదం బడంచెఁ గా
మనమయగారి తుక్క సచివా నెలశ్రీగిరి గడ్డపాఱలం
గనలుచుఁ ద్రవ్వి సర్వమును గైకొన నీకును నాతఁ డోపఁడే.

కొన్నిపత్రములు, సంగీతరత్నాకర మని సంస్కృతముగలదు.

శ్లో. సప్తాధ్యాయాత్మకం గ్రంథం శార్ఙ్గసూరిస్వమాతనోత్
శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గీతరసం ఫణి
అజ్ఞాతవిషయా గోపాల మురళీశబ్దశ్రవణాత్ దూరరూపగోచరాత్। అగత్యపరితో గావః పిబన్తి సుషిరామృతమ్ । వ్యాళగ్రాహికగా నేన స్థితా అహి,

కావ్యదండవత్ । నిర్భిద్య శ్లోకముద్ధృత్య పిబన్తి స్మ స్వరామృతమ్
అస్తిస్వస్తి గ్రహం వంశే శ్రీముక్తాక్షీరసంభవమ్
యజ్వభిర్దక్షభి ర్ధుర్యైః వేదసాగరపారగైః
తత్రాభూ ద్భాస్కరః ప్రఖ్యో భాస్కర స్తేజసాంనిధి
అలంకర్తు ర్దక్షిణాశాం యశ్చక్రే దక్షిణాయనమ్.
తస్యాభూ త్తనయః ప్రభూతవినయః శ్రీసాఙ్గశః ప్రౌఢధీః
యేన శ్రీకరణప్రవృద్ధవిభవాభావల్ల......
ఇట్లసంపూర్ణముగా నై దాకులుకలవు.

(42) గజారణ్యమాహాత్మ్యము. గ్రం. స. 167.

ఇది యొక వచనకావ్యము. కవి పేరు తెలియదు. గ్రంథము పూర్తిగా లేదు. చిట్టచివర కవిపేరు వేసికొనియుండును. ఇదియును దక్షిణదేశప్రతియే దాక్షిణాత్యులందఱును సంస్కృతభక్తినే యధ్యాయములుగా రచించి కొన్ని యధ్యాయముల కొక్కయాశ్వాసముగాఁ దెనుఁగురీతి ననుసరించువారు. వచనము చక్కనిది పద్మపురాణంబున మధ్యమఖండంబున ఉమామహేశ్వరసంవాదంబున నూటముప్పదిరెండవ యధ్యాయమునుండి ప్రారంభింపఁబడినది. 142 వ యధ్యాయము దాఁకఁ గలదు. కొంతశైలికై చూపుదు. 139 అధ్యాయములో-

"తదనంతరంబ లోకపితామహుండైన సురజ్యేష్ఠుండు ఫాలాక్షునికిం బ్రత్యక్షంబుగావించి నమస్కరించి బహువిధంబులం గొనియాడిన భగవంతుండైన యమృతేశ్వరుండు విరించి స్తోత్రంబునకు సంతసించి కమలగర్భా నీతపంబునకు మెచ్చితి వలయువరమ్ము లొసంగెద వేఁడు మనుటయుఁ జతుర్ముఖుండు పంచముఖుఁ జూచి దేవా నీవేసరోవరంబున నావిర్భవించితి వానరస్సు బ్రహ్మపుష్కరిణి యనం బ్రసిద్ధిఁ గాంచవలయు బ్రహ్మపుష్కరిణి తోయంబున మునింగిన మనుజులు దురితవిముక్తులై భవదీయసాయుజ్యంబు నందవలయు- దేవా! ధ్వజారోహణంబు సేయించి నేటిమొదలు నీకు నుత్సవంబు సేయించెద నీయుత్సవం బాచంద్రార్కంబుగాఁ బ్రతిసంవత్సరంబు నడువవలయు, నానక్షత్రంబైనరోహిణియందు రథారూఢుండవైన నిన్ను సేవించి నీతోడంగూడ నవభృథస్నానంబు సేసిన నరులకు సాయుజ్యంబు గలుగవలయు ననిన"... అమృతేశ్వరుండు నలువపలుకు లాలించి...మాఘమాసంబున మృగశిరానక్షత్రం

బున నుత్సవంబునకు నారంభించి ఫాల్గునమాసంబున రోహిణియం దవభృథ స్నానంబు...ఈయిరువదియేనుదినంబులును నాగమోక్తవిధానంబున శైవాచారసమన్వితుండవై—సేవింపు మని యానతిచ్చిన..."

దీనికిఁ బ్రారంభ మెట్లుండునో తెలియదు. ఉన్న దాని మొదటనే "అంకితంబుగా నాయొనర్పంబూనిన గజారణ్యమాహాత్మ్యంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన" యని మొదలిడినాఁడు. ఈపుస్తకము గరిమల సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచ్చినది.

(43) ఆంధ్రరసమంజరి—గ్రం. నం. 148.

ఈగ్రంథమును పుదుక్కోట గరిమల సుబ్రహ్మణ్యశాస్త్రిగారొసఁగినదియే. ఇందు మొదట శ్రీభానుదత్తమిశ్రవిరచిత మైనసంస్కృతరసమంజరి కలదు. అది రాక్షసనామసంవత్సర వర్షరుతు శ్రావణబహుళత్రయోదశిస్థిరవారం-పచ్చిమిరియం ఆదిప్పయ్యగారి మనుమడైన వీణకుప్పణ్ణయ్యగారి కుమారుఁడు వీణసుబ్బయ్య వ్రాసినది. 20 పత్త్రముల గ్రంథము పూర్తిగాఁ గలదు. తరువాత నాంధ్రరసమంజరి కలదు. ఈరసమంజరి పుదుక్కోటసంస్థానప్రభు వగు కోటి రాజగోపాలభూపవిజయరఘునాథవసుమతీవిభుని సభలోని నారాయణయ్యంగారు రచించినది. సమగ్రము. ప్రారంభము-

క. శ్రీరంగస్థలవక్షః,స్ఫార శ్రీవత్సకౌస్తుభప్రభలంతమ
సూ్సరులఁ గేరు స్త్రీకుక్, శ్రీరంగస్థలపతిని భజింతును భక్తిన్

ఉ వల్లభు నుల్లమందుఁ గృతవాస యగుం దనదివ్యదేహము
త్ప్యల్లసితద్యుతి న్వెలికిఁ దోఁచె ననం దదురస్థలంబునం
జెల్లువడి న్నిరంతరము చేరి వసించు సరోజపాణి యు
త్తల్లి యభీష్టసిద్ధి సతతంబు నెసంగ నొసంగు నెంతయున్.

క. వినతియొనరింతు మలయమ్మల్లునికి నటనచలితమకుటలుఠదమరధునీ
ఘనతరతరంగబింబిత,వనజారికలానహస్రవల్గనగతికిన్.

క. కేవలకాంచనకటకవి,ధావిష్కృతియుతులు కాళిదాసాదికవుల్
భావింప రత్నకటకము,హావిభవులు నన్నయాదు లాంధ్రకవీంద్రుల్......అని

వ. ఎద్దియేని యొకనరసకృతి చమత్కృతి కృతసమున్నతిగ రచియింప మతిఁబూనియున్న సమయంబున,

సీ. కోటివంశాంభోధికుముదినీరమణుండుకువలయానందైకగుణగణుండు...
కలితనిజ బాహుబోధిత కాంతివిభవ, సమరసాహసపత్యవాక్రమసమాన
శీలపురుషుఁడు రాజగోపాలభూప, విజయరఘునాధవసుమతీవిభుఁడుమహిని.

మ. ప్రసరచ్ఛాత్రుని నప్పయార్యవరసత్పౌత్రుఁ ద్విషన్నీరద
శ్వసనస్ఫూర్తిని జిమ్మ వేంకటమహాచార్యాత్మజుఁ విశ్వవి
శ్వసనీయు స్మరగోపయోగికరుణాసంప్రాప్తసారస్వత
స్వపనాథుఁ ద్వయపూర్వవాక్యముఖమద్వర్ణప్రసిద్ధాహ్వయున్.

మ. ...ప్రతిభోదంచితకావ్యకల్పను భరద్వాజీయగోత్రుఁ జగ
న్నుతచారిత్రుని నన్నుఁ జూచి పలికెన్...............

మ. సుకవీంద్రుండవు మన్గురుండవు జనస్తుత్యుండ వత్యాదరుం
డకళంకాత్ముఁడ వాంధ్రసంస్కృతకవిత్వాగ్ర్యాంకవిఖ్యాతుఁ డౌ
సకలోర్వీనుతరీతి నీవొక కృతిన్ సంతుష్టుఁడై చేసి వే
డుకఁ గావింపు మిల న్మదంకితము ప్రౌఢోక్తిన్ సుధీంద్రాగ్రణీ.

క. శీలితబుధమానసముదు, పాళి రసాసంగహేతువై యలరఁగ వా
క్కేళిని నేరసమంజరి, బాళిఁ బ్రకాశింపఁజేసి భానుఁడు జగతిన్.

క. ......ఆ,రసమంజరి తెలుఁగొనర్పు రసికులు పొగడన్

వ. అని రాజుపలుకఁగా నీకవి యాంధ్రీకరించెను. కృతిపతివంశావలి విశే
షముగ వర్ణించియున్నాఁడు. నాలుగాశ్వాసములు- ప్రత్యాశ్వాసాంతము
నను గద్యము, పద్యరూపమున రచించెను. చిట్టచివర-

శా. వన్నెల్మీఱఁగ నుల్లసిల్లిన భరద్వాజీయగోత్రార్ణవో
త్పన్నశ్రీఁగొనుసూరిచంద్రుఁడు దలిర్ప న్వేంకటాచార్య శ్రీ
మన్నారాయణసత్కవీంద్రుఁ డొనరింప న్రమ్యమై యాంధ్రమై
యెన్న న్నారసమంజరీకృతిఁ జతుర్థాశ్వాస ముప్పొందగున్.

వ. అనియున్నది. "నవసాలపురమునను౦డే పడమటినగరధోరపై యంకితము
గా శ్రీమన్నారాయణయ్యంగారు జేసిన రసమంజరి యను గ్రంథము-"
దీనినిగూడ వీణె సుబ్బయ్య యే రాక్షసనామ సం॥ శ్రావణశు॥ షష్ఠికిఁ
బూర్తిగ వ్రాసెను. దీనితరువాతను సంగీతరత్నాకర మను సంస్కృతగ్రంథ
ము కొంత కలదు.

"భరతాఖ్యసుధాసింధుసంభూత ఇవ కౌస్తుభః
రఘువీరపదాంభోజమిళిందశుచిచేతసా
గోవిందనామ్నా సంగీతశాస్త్రః స. క్షేపతోచ్యతే" ఇట్లు —

28 పత్రములుగలవు. కడపట- ద్విసప్తతిశతమే భేదే రసికప్రియనామకమ్ తజ్జాతం రసమంజర్యా రాగద్వయమితీరితం ద్వి..ప్తతిశతమే వాశ్చజాతం రాగః ప్రకీర్తితాః" శ్రీరామజయం అనియున్నది.

(44) హాలాస్యమాహాత్మ్యము. గ్రం. సం 170.

ఇది యొకవచనకావ్యము దక్షిణమధురాక్షేత్రమాహాత్మ్యము. 71 యధ్యాయము. 8 ఆశ్వాసములుగ రచియింపఁబడినది. అధ్యాయాంతంబుల "ఇతి శ్రీస్కాందే మహాపురాణే హాలాస్యమాహాత్మ్యే... అధ్యాయః" అనియున్నది. ఆంధ్రీకరించినకవి- శ్రీపతి రామభద్రకవి- అతఁడు తనగద్యము నీక్రిందివిధమున వ్రాసికొనియెను.

ఇతి శ్రీమీనాక్షీసుందరేశ్వరసాంద్రకృపారసలబ్ధ కవితామాధురీధురీణ కాశ్యపగోత్రాశ్వలాయనసూత్ర శ్రీపతికులపవిత్ర చరిత్ర శ్రీగిరియమాంబాసత్పుత్ర సూరయామాత్యపుత్ర కవిరామభద్ర ప్రణీతంబైన హాలాస్యమాహాత్మ్యంబునందు వచనకావ్యంబున... ఆశ్వాసము."

కవి దక్షిణదేశస్థుఁడు. పుస్తకమును దక్షిణదేశమునుండి వచ్చినదియె- వచనము సంస్కృతజటిలముగ నున్నది. వ్రాఁతపొరపాటులు గలవు. ఉభయభాషలయందును యమకములు తఱుచుగాఁ గనఁబడును. కొన్ని పంక్తు లుదాహరణమునకై చూపఁబడును.

"అశ్వినీదేవతలు మొదలి యిది యపరిహార్యం బనిన నిరుద్యోగులై జాగులైరి. తద్రోగపరిహారార్థంబుగా నొక్క యుపాయంబు దేవరానతీయవలయు ననిన వరుణముఖావలోకనంబుచేసి వానప్రుండు వినుమోసంబు లే దనిసుధాసారసమానవచనంబులు పలికినపుడు- ఏమహావ్యాధిపీడితులై పాపకృత్యులై యపమృత్యుపీడితులై కాలమృత్యువశులైనవా రెవ్వరో వారందఱు సుందరమూర్తి సందర్శనంబునఁబునీతు లగుదురు గావున మనోవాక్కాయపరిశుద్ధుఁడై యాయభిషేకపాండ్యరాజాగ్రణి భక్తిప్రభావంబును, ఆదేవుని మహిమాతిశయంబును నీవు లెస్సఁగఁ బరీక్షించి తెలిసి తల్లింగార్చనంబు గావించితి వామెనా నీరోగంబు తొలఁగు నిందుకు సందియంబు లేదు. అనిన శక్రునివాక్యంబులు విని

వరుణుండు చొక్కమని యాచొక్కనాథుని శోధింపఁ దలఁచి గ్రక్కున లేచి యతనికి మ్రొక్కి మక్కువతోడ మిక్కిలి యెక్కువైన హర్ష పరవశుఁడై చక్కఁగఁ దనపురంబునకుఁ జని యంత నొక్కనాఁడు- ఆరాజును సుందరరాజును జక్కన శోధింపఁదలంచి వరుణుఁడు సముద్రుని బిలిచి సముద్రగ నిద్రలేచి నీయందుఁ గలజలచరపరివృతుఁడవై యనేకతుంగతరంగావృతంబుగ నామధురానగరం బుఁగబళింపు మనిన-"

పరిషత్పుస్తకభాండాగారములో నంజరాజకృత మైనహాలాస్యమాహాత్మ్యవచనముఁ గూడ నున్నది.

ఈరామభద్రకవిగ్రంథము "గర్భపురీక్షేత్రనిత్యనివాసులగు బ్ర॥ శ్రీ లక్ష్మీనృసింహసూరినప్త్రిండును శ్రీలక్ష్మీనృసింహార్యపౌత్రుండును శ్రీరామార్యవర్యుల పుత్రుండు నగు నెందవగోత్రాశ్వలాయనసూత్రుండు నగు శ్రీసీతారామయ్యది." అని మొదలఁగలదు. వ్రాఁతచక్కనిది. మంచిస్థితిలోనున్నది.

(45) హరివంశము. గ్రం. సం. 4534.

ఎఱ్ఱాప్రెగడరచించిన పూర్వోత్తరభాగములతోఁగూడిన యొకతాళపత్రగ్రంథము. ఇందుత్తరభాగమున, చతుర్థాశ్వాసము తరువాత 5, 6, 7 ఆశ్వాసములు నేమానిభైరవికవి రచియించినవిగలవు. ముద్రితప్రతులలో నివిలేదు. 8 వ యాశ్వాసము, ఎఱ్ఱాప్రెగడ పంచమాశ్వాసముక్రిందను లెక్కింపఁబడు చున్నది. ౨౦౯ పత్రము మొదలు పంచమాశ్వాసము ప్రారంభమున- ఈ మీఁదట నేమానిభైరవావధానికవిత్వము" అనికలదు. ౨౬౬ లో నాల్గవపంక్తిలో "యీమీఁదట యర్రయకవిత్వము" అనియున్నది. ప్రారంభము-

ఉ. శ్రీరమణీయకౌస్తుభశుచిప్రభలందున బింబితాంగియై
శ్రీరమణీలలామ తనచెక్కిటఁ జెయ్యిఘటింపఁగాంచి య
త్తోరపుటల్కఁ దీర్పలెఁతఁ దొయ్యలిపాదములంటి యంటి వే
మాఱును మారుకేళి బతిమాలెడువెన్నుఁడుఁ మమ్ముఁబ్రోవుతన్.

చ. వరగుణశాలి కోటగిరివంశభవుం డగుశ్రీనివాసభూ
వరుఁ డతిభక్తితోడ హరివంశకథాశ్రవణైకచిత్తుఁడై
యరయుచుఁ బారిజాతహరణాదికథావళి లేకయున్నచో
సురుచిరదృష్టిచేత ననుఁజూచి దయామతితోడ నిట్లనున్.

గీ. ఎఱ్ఱనార్యుండు తెలిఁగింపఁడేలనొక్కొ, తెలుఁగుఁ జేసినపిదపను దొలఁగెనొక్కొ
యీకథలునీవు దెలిఁగింపుమింపుమీఱ, బ్రకటనేమానిభైరవసుకవిచంద్ర

క. వేంకటభర్తకు నీకృతి, నంకితముగ సేయు నేతయగు నాతని హే
మాంకితరుచిదేదీప్య, త్త్రకంకణగత మైన కెంపుకరణిం బొలుచున్.

వ. అనిపలికి, తాంబూలాంబరజాంబూనదాగ్రహారాదిప్రదానంబుల నాదరించినఁ బ్రహృష్టాంతరంగుండనై షష్ఠ్యంతములం జెప్పెద-

అని షష్ఠ్యంతంబులు రచించెను. పైదానింబట్టిచూడ నీకవి పారిజాతాపహరణాదికథ లింకఁ జెప్పి చేర్చియున్నట్లు తేలుచున్నది. భైరవకవి తనమూఁడవయాశ్వాసము పూర్తిచేయలేదు. చివర-

క. "హరిగరుడారూఢుండై, సురనగరీతులితభద్రశోభాంకితమై
మెఱసిన తద్ద్వారవతీ,పురమంతటఁ జూచె నపుడు భూపతితిలకా."

ఇట్టి భైరవకవికడపటిపద్యమును,

వ "అట్లుగాంచి భగవంతుండైన హరి మణిపర్వతయంత్రంబులను క్రీడాగృహంబులును-" ఇత్యాది యెఱ్ఱాప్రెగడ వచనముతో సంబంధము కలిపెను. పైలికై రెండుపద్యములు-

ఉ. ఆతతకీర్తి కాశ్యపవరాన్వయజాతుఁడు తొట మీరు మ
ద్భ్రాతలు దేవపుణ్యజనభాసురదివ్యవిమానవాహని
ఖ్యాతము లైతి రేకద సురాళికి శత్రుహ కార్యసాధనం
బీతఱిఁ జేయఁగావలయుఁ జేయుఁడు కూడదు మంత్రభేదమున్.

మ. హరిపై చేన్ దివిజారినాథుపయిఁ గోపాటోపమే పాఱఁగా
నిరవద్యామితకాంతిదర్శనదశాంధీభూతభూచక్రమున్
శరణార్థీంద్రముఖామరావనలసత్సౌలభ్యనిర్వక్రమున్
వరధారాహతఘోరరాక్షసవిభాస్వన్నక్రమునుం జక్రమున్.

ఇక్కవి గద్యము. ఇది శ్రీమత్కల్యాళిగారిచరణసరసిజషట్పదాయమానమానసోభయకవితాసార్వభౌమబిరుదాంక వేంకటభట్టారకపౌత్ర సూర్యనారాయణ సోమయాజిసత్పుత్ర నితుందినసగోత్ర.పవిత్ర నేమానిభైరవాపధాని ప్రణీతంబైన హరివంశంబునందు......ఆశ్వాసము.

"ప్రమోదూతనామసంవత్సర శ్రావణబహుళ ౧౦ శుక్రవారము వరకు రాజశ్రీ రావు రామయ్యగారికుమాళ్లు వెంకయ్యగారు హరివంశము యిరవైమూడాశ్వాసాలు రాజశ్రీ కోటగిరి శ్రీనివాసరాయణింగారి ప్రతిని సంపూర్ణంగాను వ్రాయించిరి-" ఈపుస్తకమును, పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారొసంగిరి.

పరువున నేగి యొక్క చెలి పయ్యెదఁబట్ట నదల్చినంతలో
సరసములాడుచుం గురుకుచంబుల రెంటిని గేలుదోయిచే
నరగునఁబట్టి మోవిగొని సాహసమేర్పడఁ గ్రోలినట్టి మం. ౪౭
కర మనురక్తి నొక్కసతి కాంచన రమ్యఘటం బమర్చితాఁ
బెరుఁగు మథించుచుండఁ గని పెల్చన నేగి పిఱుందఁజేరి వే
కరములు చాచి చన్నుఁగవ గట్టిగఁ బట్టఁ దలంచినట్టి మం. ౪౮
పురుషుఁడు నిద్రవోవుతఱిఁ బోయి పెన న్నుఁగంబు వానిపై
న్నురమునఁ బెట్టి వాఁడదరి హాయని పాఱఁగ నందు చిక్కి నం
చురవడి వానితోయ్యాలిని నొప్పఁగ మన్మథకేళిఁ గూడు మం. ౪౯
సరసిజపత్రనేత్ర యొకసందున జల్లులాడుచుండఁగా
బిఱబిఱ నేగి పిల్లలను బింకముగఁ గూర్చుక గేలిచేయుచుం
గరములఁ దట్టుచు న్సతిని గన్నులుమూసియుఁ గౌఁగిలించు మం. ౫౦
తరుణి యొకర్తు పెన్నకడఁ దద్దయుఁ జేయుచు వంగియుండఁగా
సరసకు నేగి పన్నగము సాహస * *
* * * *
సరసిరుహాక్షి యొక్కతె పెనక్
* * * *
నిరతము నిట్లు చేయఁ గని నీరజగంధులు పల్వు రత్తఱిన్
వరుసఁగఁ గూడి వాఁడిటకు వచ్చిన బట్టుద మంచు నుండఁగా
నరమర లేకపోయి యట నండఱసిగ్గులుఁ గొల్లలాడు మం. ౫౩
వెఱచినవాని కైవడిని వేఱొకగోపికపుత్రు వేణికిన్
మఱియొక బాలు పెన్నిగకు మర్మముగా ముడిపెట్టియంత బా
లుర గుమిగూడి నవ్వుచు నులూఖలమెక్కుక నృత్యమాడు మం. ౫౪
త్వర నొకగోపభామిని ముఁదంబునఁ బాముచుఁ జల్లచేయఁగాఁ
బరువులుపట్టుగా నరిగి బాన కెగంబడి జుట్టుకోఁగనా
తరుణి యదల్ప నాకరము దానిముఖాబ్జమునందు రాయు మం. ౫౫
సరసని నాటకుం జని పెనక్ జలకంబుల నాడుచుండఁగాఁ
బరువడిఁ బోయి చేలములుఁ బట్టి జరీయుత కంచుకంబులుం
దరుణు లెఱుంగకుండఁ గొని తత్క్షణమే సురపొన్న నెక్కు మం. ౫౬

కరిగమన జ్జలంబుల వికాసమునంబులఁ గేలిసల్పి వే
గిరమున గట్టుఁ జేరి యిటు కృష్ణుఁడు వచ్చునటంచుఁ జేలముల్
బిఱబిఱఁ జూడ లేమి గని బెగ్గలమొందఁగ వేణువూఁదు మం. ౫౩

కరముల నెత్తి మ్రొక్కు లిడఁ గంచుక చేలము లెల్ల మీకు నేఁ
* గరుణ నొసంగువాఁడనని గట్టిగఁ బల్కిన [illegible]రలట్లవి
స్మరణ మటంచు మ్రొక్కిన వెసం గృపఁ జేలము లిచ్చినట్టి మం. ౫౪

మఱియును నొక్క గోపసతి ముద్దులుగుల్కఁగఁ బాటపాడుచు
న్నఃసుఁడు రాఁడటంచు మదిఁ జాల విరాళిని బొందుచుండఁగాఁ
బరువడి నేగి యాచెలిని పాయముతోడ వరించినట్టి మం. ౫౪

మఱచియు నిద్రపోవుతఱి......

నరసఖ శైశవక్రియల నందఱు మెచ్చఁగఁ గ్రీడసల్పుచున్ ౫౯
నిరతము గోపికామణుల నెయ్యముఁ దీర్చి కుచాగ్రసీమపైఁ
బొరలుచు మోవియానుచును బొందుగ నుండెడి నిన్ను నెంతు మం. ౬౦

* * * *

సురవరపద్మసంభవత్రిశూలులు మెచ్చి నుతింప నవ్వడ
వ్వర త్రితయాంగనామణుల బొంకఁగఁ జేయను బుద్ధరూపవై
తరుణుల మానముల్గొనిన తండ్రివి నీకు జొహారు ప్రోవు మం. ౬౧

ధరఁ గలిరాక్షసాదుల వధం బొనరింపను గల్కి రూపమై
కరముల ఖడ్గఖేటకముఖాయుధముల్ ధరియించినట్టి శ్రీ
హరి యిదె నీదు దాసుఁడను నంజలి చేసెద నప్రమేయ మం. ౬౨

*ధరఁ జనియించు వెల్లఁ బరదారధనంబులఁ గోరునందుకా
తెరువునఁ బోవువారలను దేఱి కనుంగొని మోహమందనా
విరసములాడి పెద్దలను వృద్ధుల గొట్టుట కాసుతుండు మం. ౬౩

వరుసగ లేసిదంతములు; వాదులు మెచ్చనికల్లు సున్నముల్
మఱచెడువాని విద్య; పలుమాఱును దెప్పెడు వానివిందు బల్
దురుసుల నాడు సోదరుఁడు; ద్రోహిసఖుండిలఁ గూడదండ్రు మం. ౬౪

* ఇక్కడనుండి నీతిమార్గపద్యములు.

తరుణిని బాలు సర్వమును దాసుని దండనసేయకుండినం
బొరుగులకేగు వ్యాజ్యములు బోరనఁ దెచ్చును గ్రిందఁద్రోయుఁ జేఁ
పురుసటనుండి తెమ్మను సపోహముగాను నిజం బిదెల్లమం. ౧౯
గురగురలాడునోరు, పతికోపము చేయ నెదిర్చి మిక్కిలి
న్విరసములాడు భార్య, సుకవీంద్రులు మెచ్చని యాకవిత్వముం
బొసగున నప్పుఁ గుత్సి కులపాం దతిహీనత కూడదండ్రు మం ౨౦
నిరతము ధర్మహీనులకు నీతియొకప్పుడుగద్ది పెద్దలన్
గురులఁ గవీంద్రుల న్నరసి కొంచెము గొప్పయొనర్తురించునే
మరణము నొందు సద్విషయముంకునసే మఱి గర్వ లివ్వమం. ౨౧
సరసుఁడు మెచ్చనట్టి సతి, సంభ్రమచేష్టలు, విత్తహీనుల
న్నరగినవేశ్య, ద్రోహమునుమంత్రిని నుంచినరాజు, పుత్రుపైఁ
గరుణము లేని తల్లి తుదిఁ గష్టముఁ దెచ్చును వెస్టవచ్చు మం. ౨౨
వరకవికివ్వనట్టి ధనవంతుని సంపద యేటియొడ్డునం
బెరిగిన మ్రాను నోడమున పెన్తటాకమునందునీరు నీ
ధరనిలువంగఁబోదు కరిదా భుజియించు కపిత్థమట్లు మం. ౨౩
దురితము చేయరాదు సతితోఁ గలహింపఁగరాదు పెద్దల
న్విరసము లాడరాదు పరవిత్తములన్ గ్రహియింపరాదు మీఁ
దరయక త్రుళ్ళరాదు భువి నల్పులసఖ్యము చేయరాదు మం. ౨౪
నరపతి లేనివాఁడు హరినామము చింతన లేనివీను తా
నరయనితోఁడు పాదమున కబ్బనిజోడు భుజించుమాత్రనే
ధర మృతిఁ బొందు కూనును యథార్థముకూడదు కీడటండ్రు మం ౨౫
హరిగుడి లేని పేఁట జనులందఱకొల్వడ లేనిబాటఁ గ
మ్మరియుబులేని వీట మతిమంతునిపాలనలేని కోటఁ నే
విరులును లేని తోఁట నభివృద్ధికిరా వట నుండరాదు మం. ౨౬
తరుణుల నమ్మరాదు తనుదాన మహాత్ముఁ డనంగరాదు తాఁ
బరిపరిత్రోవలం దిరిగి బాధల నొంది కృశింపరాదు నే
మఱి కనుమూయరా దడవి మధ్యను జాలము సేయరాదు మం ౨౭
తిరిపము వెత్తువారిఁ గని దిగ్గున లేచి పటంబుఁగట్టి తా
సరగున వచ్చి దంతములు సారెకు గీటుచుఁ గంట నిప్పులం
గురియుచు హుమ్మటంచు నిటఁ గూయుట పొమ్మను దుష్టుఁ జంపు మం ౨౮

సిరి యిదె చాలునంచు భ్రమ సింధుర మొట్టులు క్రొవ్వి యొట్టులం
గరుణను జూడక న్నిగుల గర్వము నొంది తిరస్కరించు నా
దురితులు ముక్తిహీనులయి తూలుదురా నరకంబునందు మం. ౭౯

హరిని మహానుభావుఁ డని యచ్యుతుఁ డవ్యయుఁ డప్రమేయుఁ డీ
శ్వరుఁ డని పాటపాడుచును శాంతము నొంది ధరాతలంబుపైఁ
దిరుగుచునున్న సజ్జనులఁ దిట్టెడు దుష్టులఁ గొట్టుమయ్య మం. ౮౦

హరిభజనల్ సహింపక యహర్నిశముల్ ధనకాంక్ష చేసి యే
వెరవున నైనఁగాని యిల విత్తము నార్జనచేసి ధర్మము
న్మఱచు దురాత్ములం గలయ నుంకువు చేఁదు మోక్షమందు మం. ౮౧

దొరలతో జాడి చెప్పుచును దుష్టచరిత్రము చాలఁ జేయుచు
న్నరులకుఁ గాలివాఁ డగుచు నైజగుణంబులు మానకుండఁగా
విరసములాడు మానవుల వెంగలిబుద్ధులు మాన్పరయ్య మం. ౮౨

నిరతము నిన్ను నెన్నకయు నీపదభక్తులఁ జేరకుండఁగం
బరువడి దానధర్మము లపారదయామతిఁ జేయకుండఁగం
బరులకుఁ గీడుసేయుచు నెపంబిడు దుష్టుల రట్టుసేయు మం. ౮౩

కురకురలాడి భక్తజన కోటుల దూఱి హసించువానినీ
చరణయుగంబు నమ్మి నుతిసల్పుచు నుండెడు వారి కావవల్
త్వర సమకూర్పవచ్చి పతితాత్ముని త్రుళ్ళడఁగింపుమయ్య మం. ౮౪

పురుషుఁడు క్షత్రియుం డగుచు భూమిని యున్నతి పుట్టఁగావలెన్
ధరను మహాత్ముపాదములు తద్దయు భక్తిని బట్టఁగావలెన్
దురమున శూరుఁడై రిపులఁద్రుంచి యశంబును బొంద మేలు మం. ౮౫

గురువులఁ దల్లిదండ్రులను గోవులఁ బూజయొనర్పఁగావలెం
బరహితము న్మది న్నిలిపి భక్తిని బెద్దల కన్నమిచ్చి తా
వరుసభుజించి పుణ్యుఁ డనువార్త వహించుట మేలుగాదె మం ౮౬

* నిరతము నిన్నుఁ గాంచుటకు నేరక సద్గురుఁ గానఁబోక యే
తెరువుఁగనంగలేక తనదేహము సుస్థిరమంచు నమ్మి యీ
ధరనటియించువారలకుఁ దారకయోగమదేల నయ్య మం. ౮౭

* ఇంతటినుండి జ్ఞానమార్గము.

పరమగురూత్తముం గదిసి పాదయుగంబును బట్టి భక్తినా
పురుషుఁడు చూపుమార్గమును బొల్లక లోనిప్రపంచమెల్లసా
దరముగఁ జూచువారలకు దబ్బిలియీదెలిగాధశేల మం. ౮౮

స్థిరమతితో రహస్యమగు సిద్ధప్రదేశమునందుఁ జేరి స
ద్గురువరు నాజ్ఞచొప్పునను గూర్మితోడుత నొక్కపాదము
న్సరగునవంచి యామడనుఁ జక్కఁగమూలముఁ జేర్పమేలు మం. ౮౯

అరమర లేక వాయువును నంతట స్తంభన చేసి తిన్నగా
నెఱుకను దొల్తనుండు గిరి నెక్కిగజాననుఁ గాంచునట్టి యా
పురుషుఁడు పుణ్యుఁడౌ నతనిఁ బోలరు మానవు లంటివయ్య మం. ౯౦

సరగున దాని దాఁటి తన సాహసమేర్పడ స్వాధిష్ఠానమ
ద్గిరి నివసించి యచ్చటను సేవలభక్తిని దమ్మిచూలిని
వ్వరుసనుగాంచి మ్రొక్కు బుధవర్యుఁడు శ్రేష్ఠుఁ డటంటివయ్య మం. ౯౧

మఱి మణిపూరకాఖ్యముల మారుతవేగముతోడనెక్కి యా
గిరినివసించు నచ్యుతుని సేవలభక్తినిగాంచిమ్రొక్కి శ్రీ
ధరజయ మొందినట్టి సుకృతాత్ములు పెద్దలటంటివయ్య మం. ౯౨

వరుసగ దాని కావలను వాసి యనాహతకొండఁ జేరి యా
హరునటఁ గాంచి మ్రొక్కి వినయంబున నంజలిచేయువారలే
పరమకృతార్థులౌదురని పంకజలోచన తెల్పితౌర మం. ౯౩

పరువడి నావిశుద్ధమును పర్వతమెక్కి మహేశుఁగాంచి యా
పురుషునకుం బ్రదక్షిణముఁ బాటిగఁ జేసి నమస్కరించు నా
నరసులు ముక్తులౌదురని చాటుచుఁ బల్కవె దేవదేవ మం. ౯౪

త్వర నదిదాఁటి యాజ్ఞయను దొడ్డగిరీంద్రము నెక్కి యచ్చట
న్వరుసగ నానదీత్రయము వాంఛను గాంచి నలక్ష్యమార్గులై
పరువడిషణ్ముఖుం గనిన భవ్యులు నావలె నంటివయ్య మం. ౯౫

వరగుణశాలివై సకలవాంఛల నెల్లను మాని ముందు స
ద్గురుకృప వేయిశృంగముల కొండను జేరి ప్రచండమూర్తివై
హరి నినుఁ గాంచువాఁడె ఘనుఁడౌ గురుఁడౌనని పల్కలేద మం. ౯౬

సరగున షణ్ముఖాంజనము సాహస మొప్పఁగఁ గంటఁబెట్టిలోఁ
గురుతులఁ జూడ మార్గములఁ గొండలుఁ బల్లెలు దండ్రిగ్రామముల్
చెఱువు లరణ్యము ల్గనిన సిద్ధుఁ డనన్గునంటివయ్య మం. ౯౭

విరివిగ శాంభవాంజనము విక్రమలీల ధరించి యంతట
స్సరసిజమిత్రమండలముఁ జందురు మండల మగ్నిమండలాం
తరములఁ జూడవచ్చునని తద్దయుఁ బల్కెడి ముగ్ధులయ్యా మం. ౯౮

నరనతఖేచరాంజనము సాహస మొప్ప ధరించి చూడఁగా
పరమర లేక ముక్తి నిలయంబు న నుండెను శోభనాంగి పే
రురమునఁ జేరవచ్చు నని యుద్ధతిఁ బల్కెడి చిద్విలాసమం ౯౯

సురనుత భూచరాంజనము సొంపుగఁ దాల్చిన నెల్ల వేడుకల్
సొరిదిఁగనంగవచ్చు ఘటశోధకుఁడై వెలుఁగంగవచ్చు నే
మరక ప్రపంచము స్సకల మర్త్యులుం గన నానటంటి మం. ౧౦౦

ఈసుగుణశాలురై వడిగ నుత్తరశాంభవిముద్రతోడ భా
సురముగ సర్వజంతు సముశోభితహృత్కమలంబునందు నా
హరిహరు లబ్జగర్భ సురలాది పరాత్పరుఁ గాంతురంద్రు మం. ౧౦౧

వరమతి నై మనోవిజయ వైభవుఁడై కరణక్రియంబులం
గలకలఁ గ్రోధవాసనలఁ గాలిచి శత్రుల గెల్చునంత నీ
చరణసరోజము ల్గనుట సత్యము సిద్ధ మటంటి వయ్యా మం. ౧౦౨

అరుదుగఁ జిమ్మచీఁకటిని నబ్బరపాటును బొందకుండఁగా
మెఱపులగుంపునై వడిని మెండగు దివ్య వెలుంగు నందు నీ
వరరుచిరప్రమూర్తిఁ గను వారలు నిత్యులు ముక్తులంద్రు మం
దరధర కుందసుందరరదా వరదా మురదానవాంతకా. ౧౦౩

వరగుణశాలి బాలయకు వారిజలోచనలక్ష్మమాంబకే
వరతనయుండఁ గృష్ణ కవి వైభవ మొప్పఁగ వృత్తపద్యము
ల్సరవి రచించితి న్సుకవిసంఘము మెచ్చఁగఁ బ్రోవు నన్ను మం
దరధర కుందసుందరరదా వరదా మురదానవాంతకా. ౧౦౪

ప్రభవనామసంవత్సరమార్గశిరశు ౧౧ తరిమెల అప్పలాచార్యులవారి కుమా
రుఁడు రంగాచార్యులు వ్రాసిన ప్రతినిబట్టి.

# పరశురామశతకద్వయము.

పరశురామపంతుల రామమూర్తి.

―――

## — ఆటవెలఁది-గీతపద్యములు —

శ్రీశు నీశు భారతీశు భజించి విఘ్నేశుఁ గొలిచి కవుల నెంచి యొక్క
గీతపద్యశతము గీర్తింతు వినుమురా, పటుగుణాభిరామ పరశురామ. ౧

హరిహరాత్ములగు మహాదేవగురులింగ, మూర్తిపాదకమలములకు మ్రొక్కి
తన్నెఱుంగుయుక్తి తగ నెఱింగింతురా, పటుగుణాభిరామ పరశురామ. ౨

ధరణి లోకశాస్త్రతనువాసనాబద్ధుఁ, డగుచు విహితకర్మ మాచరించు
సద్ద్విజుండ ననెడి జనుఁడు మూఢుండురా, పటుగుణాభిరామ పరశురామ.

కాయ వాఙ్మనములు గలిపి సాత్త్వికవృత్తి, నీశ్వరార్పితముగ నెల్ల క్రియలు
సలుపునిర్మముండు సాధువిప్రుండురా, పటుగుణాభిరామ పరశురామ. ౪

విష్ణుమూర్తిరతుఁడు విష్ణుకథార్చన, ధ్యానకీర్తనామృతాతురుండు
పరమ విష్ణుభక్తిపరుఁ డుపాసకుఁడురా, పటుగుణాభిరామ పరశురామ. ౫

గురులనాశ్రయించి కోరిస్థానాంగభా, వాత్మసేవ లార్తి నాచరించి
పావనాత్ముఁ డతఁడు పరమభక్తుండురా, పటు. ౬

భక్తిగలుగ సకలపాపంబు లణఁగును, పాప మణఁగఁ గలుగు భావశుద్ధి
భావశుద్ధిగలుగఁ బరమార్థ మబ్బురా, పటు. ౭

బహుప్రపంచకాంక్ష పరిహార మొనరించి, పారమార్థికేచ్ఛ ప్రబలమైన
ధీరుఁ డాగురూపదేశ యోగ్యుండురా, పటు.

మంత్రమర్మ మెఱిఁగి మంత్రోపదేశతంత్రం బెఱింగి శిష్యధర్మ మెఱిఁగి
తదుపదేశ మిచ్చు ధన్యుఁడే గురుఁడురా, పటు. ౯

తన్నుఁ దా నెఱింగి తనరూప మొకరికిఁ, దెలియఁజెప్పనేర్పు దెలిసి కరుణ
బోధసేయువాఁడె పో సద్గురుండురా, పటు. ౧౦

తనువు నిజముగాదు తా నిజంబని మది, నెఱిఁగి పారమార్థ మిచ్ఛయించు
సజ్జనాశ్రయుండు శ్రవణాధికారిరా, పటు. ౧౧

ఇహసుఖంబు లిచ్ఛయింపక వర్జించి, పరసుఖంబు లాసపడక మించు
సజ్జనాశ్రయుండు శ్రవణాధికారిరా, పటు. ౧౨

కరణమతుల గెలిచి కర్మంబువరమించి, యోర్పుశ్రద్ధ గలిగి యుక్తిఁ దగిలి
సజ్జనాశ్రయుండు శ్రవణాధికారిరా, పటు. ౧౩

అన్యపదవు లొంద నభిలాషసేయక, యమృతపదవి నొందనాసపడెడి
సజ్జనాశ్రయుండు శ్రవణాధికారిరా, పటు ౧౪

సద్గురుండు నిట్టు సచ్ఛిష్యవరునకు, బోధసేయు తత్త్వబోధ నీకు
నెఱుఁగ వరుసతోడ నెఱిఁగింతు వినుమురా, పటు. ౧౫

మును యమాదియోగములు సాధ్యములుగావు, సాధ్యమైనమహిమ సంభవించు
మహిమలబ్బ ముక్తిమార్గంబు దప్పురా, పటు. ౧౬

తనకుఁ బరున కెద్ది తాదాత్మ్య మొందించు, నదియె రాజయోగ మదియుఁ ద్రివిధ
మయ్యె సాంఖ్యతారకామనస్కము లనఁ, బటు. ౧౭

చిత్తచలన ముడుగఁ జిత్కళా నాదసం, ధాన మందఁ జేయుఁ దారకంబు
పొసఁగ సాంఖ్యమునకుఁ బూర్వాంగ మదియురా, పటు. ౧౮

స్వానుభవము గలుగ సంసారదుఃఖోప, శాంతి నొందఁ జేయు నదమనస్క
యుక్తి సాంఖ్యమునకు నుత్తరాంగంబురా, పటు. ౧౯

అట్లుగానఁ దారకామనస్కములకు, ముఖ్యమతిశయంబు మోక్షదంబు
సాంఖ్య మదియు మొదల సాధింపవలయురా, పటు. ౨౦

పుడమి నొక్కజనుఁడుఁ బుట్టక మునుమున్నె, బొడము జనము నమసిపోవు
దుదినిదిక్కుమాలి యొక్కదేవుఁడే యుండెరా, పటు. ౨౧

అతఁ డేకమనెడి యాగమార్థంబుపై, వెలసిసృష్టిమొదట వేద్యుఁడయ్యె
శాస్త్రమున నఖండ సత్యాదిరూపుఁడై, పటు. ౨౨

ఏక మయ్యె సముఁడు లేకుంట సేవకా, ర్థమయ్యెవిషముఁ డబ్బకుంట
నద్వితీయుఁడయ్యె నగుణుఁడై యుండుట, బటు. ౨౩

ఇదియు నదియు నట్టి దిట్టి దింతింతని, పలికి చెప్పఁ జూపఁ దలఁపరాని
బ్రహ్మమగుచుఁ దాన పరిపూర్ణుఁ డగునురా, పటు. ౨౪

దేశకాలములకుఁ దెగక వస్తువులగు, భూతభౌతికముల పొలుపులేక
నిండియుంటఁ దానఖండరూపుండురా, పటు. ౨౫

ప్రకృతిభూతములను బ్రహ్మాదిసురులును, జనమ్మగాదు లెల్ల నమసిపోవ
నమయకుంటఁ దాన సత్యరూపుండురా, పటు. ౨౬

సీ. రమణీయనాయకరత్నంబు నంటంగ హేమవల్లికి వేళ యిదె యటంచుఁ
జంద్రరేఖకు నబ్బసాంద్రాంధకారాభచికురముల్ దెరలించు చేగయంచుఁ
గృష్ణమేఘముచెంతఁ గీల్గొని మెలఁగంగ విద్యుల్లతకుఁ జాలువెర వటంచు
నిదె సర్వమంగళాస్పదనాదలంటంగ మందాకినిమె నేస్పఁ జెందు నంచు
విధుని సేవింపఁగ సుదార విత్త యనుచు, నీలవేణిమె గోవిందు నెలవటంచు
నంబుజాక్షులు నర్మోక్తులాడుకొనుచుఁ, గడుముదం బొప్ప మధువైరిఁ గ్రమ్ముకొనఁగ

సీ. స్నిగ్ధంబులై మించి చెంతలచూపులు రమణ నీలాబ్జతోరణము లనుప
*సేదనీరొగిఁ గ్రమ్మి చెన్నారు నెమ్మోము సమరందపంకజచ్ఛాయఁ బూన
ననవిల్తుపల్లఁ బోలిన వీఁపుపై వాలుచంద మొందుచుఁ గీలుజడ చెలంగ
బిగువుకంచుక(ము)లో బెడఁగు దిట్టమెఱుంగు జన్నుమిట్టలొకింత చలనమొంద
హారములు దూఁగఁ గా నసియాడఁ దొడఁగ
వలచునూర్పులు పెంపెక్క వళులు నిక్కఁ
గంకణధ్వను లలతాళగతుల నెనయ
శౌరితల యంటె నొకత †మహోదారజఘన. ౮౪

వ. ఇట్లు యదుకుంజరుండు సాభ్యంజనుండై యొక్కకుంజరయాన కైదండ యొసంగఁ గ్రొమ్మెఱుంగు వండగొను ఘనాఘనంబునవున ధరాధరశృంగోన్నతం బగు నవగాహనగేహంబుఁ బ్రవేశించి యొక్క మించుఁబోఁడి వలపులు నించు మంచిగంధంబు‡టటకలిం బెన్నెరుల నూనియ సిగ్గు§దగ్గఁ జేయ మఱియొక్కకొమ్మ కమ్మతావు లూరు జలంబుల జలకం బార్ప నొక్కరంగులాఁడి బంగరురంగుల తెఱంగుల మఱుంగుపడఁ జేయు దువ్వలువకట్ట యొసంగ నుత్తరాధరాంగంబుల ధరియించి కొందఱు మందయాన లమందానందంబున నెడనెడ మంగళారాత్రికంబు లొసంగ వాసంతికకుసుమ విచిత్రాస్పదంబును జంపకమాలోత్పలమాలికాభ్రమరవిలసితలసితంబును మంజుభాషోర్వశీసుముఖీమనోహరంబును నానాపదార్థసమృద్ధంబును బ్రసన్నంబు నతిమధురధ్వనిసమాలింగితంబు నస్పృష్టదోషలేశంబు ననుగతాఖిలాలంకారంబు నగుచు మహాకావ్యంబుతో నెక్కసక్కెంబు లాడు వివాహవేదిం దా నాయకరత్నం బగుట నధివసించి కొంద ఱిందువదనలు కురుల తడియార్చి సంస్కారధూపంబు దీర్చి జలార్ద్రానిలంబులం దేర్చి సురభిళకు

*సేదనిరోని-మూ. † మోహాదార-మూ. ‡ టలకంబున- § దంగంజేయు-మూ.

౩౬ కాళిందీకన్యాపరిణయము.

సుమమాల్యంబులం జేర్చి యంతరేకాంతపరిపూర్ణతా బహిరుదీర్ణసత్త్వ గుణవైభవభ్రమంబు నవగమించు దివ్యచందనలేపనం బమర్చి యమూల్య రత్నకలాపంబులు తత్తదుచితస్థానంబులఁ గుదిర్చి యా కాళిందీముఖారవింద * దర్శనాదర్శనం బీయాదర్శనంబు దర్శింపు మనుచు మనోభవప్రతీతిదర్శన ప్రదర్శితబింబప్రతిబింబైక్యంబై తద్దర్శననిశ్చితంబుసేయం దగు నచుచనో యొక ముకురకపోల యొకనిద్దంపు నిలువుటద్దంబుఁ దెచ్చి ముందట నిడ నయ్యవసరంబున నచ్చంపునెలదాల్పు నబ్బాచులయొకిమీనికిం బ్రాతిభ ట్యంబు వాటించి యఖండచండకిరణమండలంబు దాల్చెనోయన నలరారు మణికిరీటంబుగల శిరంబును గచప్రచయసజలజలదపరిగళన్ముక్తాఫలజాలం బుపోలిక వెలుంగు తెలిమ్రానిపువ్వులబాసికంబును దద్గంధాస్వాదనలోలు కబంభరడింభంబులవిడంబించు నలకంబులు గలయలికంబును దావితామర పువ్వుమ మదిఁగదురఁ బఱతెంచి కదలకనిల్చు తేఁటికూనలేమనఁబొలుచు కమ్మకస్తురిచుక్కబొట్టుగల నెమ్మొగంబును నిజాంతేవాసులం బ్రోవ మనవి కేతెంచి కర్ణాంతికంబుల నిలుచు వేలుపుతొలువేలుపాజ్జలనుజ్జగించు నాణి ముపాణిముత్తియంబుటొంటులు గలకర్ణద్వయంబును సకలంకాపూర్వశశాం కశకలశంక నంకురింపఁజేయు వివాహనక్షత్రోచితకజ్జలబిందువు పొందుఁ గొను కపోలతలంబును గంధరాభిధానబంధురకంబునిరర్గళసర్గలమౌక్తికమణి రాజరాజులో యనఁ బురణించునుదంచన్ముక్తాహారభేదంబులు నంతరనవకాశ బహిఃప్రకాశద్ర(వ్య)విషయకానురాగంబు పెంపుఁదలపించు కౌస్తుభనామ మణిసార్వభౌమంబును గల శ్రీవత్సవనమాలికామనోహరవిశాలదోరంత రంబునునవికలమణికీలితబలభిదుపలస్తంభజృంభణసంభావితంబులగు చిరత్న రత్నకీలితకేయూరాంగదవిలసితభుజాద్వయంబును మణిబంధప్రభావలయం బన నలరారు మణివలయంబుల నలరుకరంబులును నిజోదరాంతరావసదనం తవనజజాండభాండస్థైర్యకార్యార్థంబనా నిబద్ధమణిమేఖలం బగు కటిప్రదే శంబులును చెలినీటియేటి†తమ్మియెమ్మె నా మగరాల తేటనీటు లఘ్ఘా టించు కటకంబులు గలపదద్వయంబును గలిగి లక్ష్యాలక్ష్యపదార్థజీవితం బగునమ్మహాపురుషునకు నిట్టియలంకార్యత యబ్రమే యనుచు నార్యులెన్న వెలుంగుచుండె నప్పుడు. ౧౫

* దర్శనంబియాదర్శనంబు. † తెమ్మె.

గీ. కంజనేత్రుండు బహుపరిష్కారయుక్తిఁ, ద్రిగుణసంబాధభవ్యతఁ దేజరిల్లు
నపుడు సత్ప్రతితో మైత్రి నందికొనియె, నొకయదోమతత్వజ్ఞుఁ డయ్యెఁ గాని.

క. మును హారునికంటె నెకలం, జెనసిన యొకమదనుఁ గనియె శ్రీకాంతుఁడు దాఁ
గన వింతపెండ్లికొడుకై, మరుచు ననంఖ్యాకసుతమదనులఁ గనియెన్.

వ. అంత. ౮౮

ఉ. ఐనువరాంధ్ర హంసతనయామణి క్షీరపయోధిపీఠికా
వాదరదానదక్షిణత నల్వగు మేల్వజిరంపురాలబ
త్వేదిక నిల్పి నన్నుదుటఁ బ్రేరి కెంజిగిమించు నతుకల్
వాదనలేని పీణెనఁ బాటలనీటుల *కొల్చు లొప్పఁగన్. ౮౯

క. ఈమగు వెలపిల్ల దేనకి, కొడుకిప్పుడు నీకుఁ బెండ్లికొడుకై యమరెం
గొడుకగుచు నీకు మనదుం, డుమగర లందఱు సుమన కుని మా వింటే.

గీ. అనుచుఁ జెలియలు మధురోక్తు లాడుచున్నఁ
బడఁతి యొక్కర్తు మిగుల నేర్పరి సుగంధ
తైలమున వింతితల యంటి తార్చి తీర్చి
నూనెయుడి సంఘటించెను నూనెయుడికి. ౯౧

గీ. కులుకుమడిగూడనిద్దంపుఁ గురులసొంపు, గుంపుగనుపట్టినవ్వేళఁ గుందరదకుఁ
దాళతల్యంబుమీఱఁగఁ దైలరసము, వఱపిదిద్దినమరునికృపాణి యనఁగ.

గీ. మచ్చెకంటులు మోదంబు హెచ్చి వచ్చి, పసుపునలుఁగార్చినప్పుడప్పడఁతి మేను
దీపయొప్పారెఁ గాఁకలుదేరి †మెఱుఁగు, జొకఁ గైకొన్న పైఁడిశలాక యనఁగ.

చ. అలకలఁ గొప్ప మీఱు కుటిలాలకయొక్కతె దివ్యచందనా
మలకము నూనె నిగ్గునడిమానఁగఁ బెట్టెను మేలుతావులం
జిలుకునవాంబుపూరములఁ జెల్వ మఱొక్కతె చెన్నుమిన్నఁగా
జలక మొనర్చె నొక్కచెలి చక్కఁగ మైతడి యొత్తుచుండఁగన్. ౯౪

గీ. వనిత యొక్కర్తు మేలుపువ్వలువఁ దెచ్చి, సాదిఁ గట్టఁగనప్పుడు సూర్యజాత
నప్రసాదశరజ్జాతజలదపటల, ‡రేజితాకార యగుచంద్రరేఖఁ బోలె. ౯౫

క. చెలియొకతె చెలువయాఁదలఁ, గలతడి యుడిగింప నొక్కకలికి సుగంధో
జ్జ్వలధూపధూమ మొసఁగెన్, జలముగ్ధూమములు జన్యజనకము లనియో.

*కొల్చు—మూ. †మెలఁగు—పా. ‡దేజితా—మూ.

—। కాళిందిని జెలు లలంకరించుట । —

ఉ. ముచ్చటగాఁగ నొక్కచెలి మోహనగాత్రికిఁ గొప్పు దిద్దఁగాఁ
బొచ్చెము లేని మేల్వలపుఁబువ్వులదండల గొప్పుకొప్పఁగన్
మెచ్చుగ నిల్పె నొక్కచెలమీనవిలోచన సాటి గైకొన
న్వచ్చు సరాతులం బఱప వచ్చిన కీర్తులమూర్తులో యనన్. ౯౭

చ. కుటిలములైన ముంగురులఁ గూడి మెలంగెడు కామినీమణీ
నిటలమునందుఁ గస్తురిని నెచ్చెలియొక్కతె బొట్టుఁబెట్టెఁ దాఁ
గుటిలతమాన ఫాలమయి కోమలచంద్రుఁడు వంకపూనుచుం
జటిలకలంకముం గుటిలసంగతి మిక్కిలిఁ గాంచెనో యనన్. ౯౮

క. పంకజముఖి కొకనెచ్చెలి, పొంకపుసీమంతవీథిఁ బొందుగ నిలిపెం
గుంకుమచూర్ణం బహితా, తంకముగాఁ గబరి వీరతం దాల్చెనన్. ౯౯

చ. నడుమ మహేంద్రనీలమణి నాయకమౌ మకరాల బొట్టుచేఁ
గడునలరారు ముత్యపుఁజొకాటపు బొట్టు నెలంత కొప్పెడున్
విడువక పేర్చి నెచ్చెలులు వెంబడి జాల్గొనరా మహాభయం
బడి ముఖచంద్రుఁ గొల్చుటకు వచ్చిననిందుశశాంకుఁ బోలుచున్. ౧౦౦

గీ. కంటఁ *గాటుకఁ దీర్చె నొకలికి యొకర్తు, సరసిజాక్షికిఁ గనుదోయి †సామ్యసాక్షి
దళన మొనరింపఁ గోరినఁ దాదృగీషు, కల్గుసిద్ధాంజనముఁ బెట్టుకరణి తోఁప.

గీ. ముద్దులాఁడికి నొకబోటి ముత్తియంపు, మేలిముంగర ముక్కున ‡మెఱపొనొప్పె
నధరమాధుర్యమాసింప నవతరించు, చెంతమెలఁగెడు నమృతంపుఁ జినుకనంగ.

క. శ్రీకారసామ్యమాకృతి, నేకాదర్శప్రకాశ నేనియుఁ గలదన్
జోక(ను)వీనుఁ(న)తులా, లోకపునవరత్నకుండలములు దైవాఱెన్. ౧౦౩

క. అంజనరుచితీవ్రాసిత, మంజులతరపలదపాంగమంజరి మిగులం
గంజాక్షి గండతలమున, నంజస §రుచిరంపుబిందు వందముఁ జెందెన్. ౧౦౪

క. అరుణాధరయరుణద్యుతి, శరణాధరసీమఘటితసమ్యగలక్తా
స్ఫురణంబుఁ గనక యొకచెలి, తిరుగన్ ఘటి(యి)ంపఁదలఁచి తెలివిన్ మానెన్

గీ. తొలఁగకుండు సువర్ణబింబువులఁ జెంది, మధురబంధంబు గాంచి సమ్మదమునించి
సాధువాగ్రీతిఁ గైకొన్న చారుకంచు, కంబులోఁ జన్నుఁగవ వ్యంగ్యగతిఁ జెలంగె

* కాటిక- † సామ్యసాక్షి-మూ. ‡ మేరనొప్పె-మూ. § రుతంపుబిందు-మూ.

చ. ఉరుకరిరాజకుంభములయుద్ధతి మానిచి తజ్జయార్జిత
స్ఫురితయశస్సితం బగుచు శోభిలఁ దానికిఁ దద్వినిస్సర
ద్గురుతరమౌక్తికావళులఁ గూడుట యబ్రమె యంచు నెన్న న
త్తరళమ్ముగా చన్నుఁగవ దాలిచె గంధపుఁబూఁత హారముల్. ౧౦౭

ఉ. నీలపురాలకాంచికయనిందితరోచులు క్రిందఁ బర్వమన్
మేలగురోమరాజిరుచి *మేకుచ(మ్రుంకుట)నాభినామకా
వాలములో మెలంగెడు నవారితనీలరసంబుమించి యు
ద్వేలముగాఁ దనుచ్ఛ్వసితధీ నిరువంకలఁ జేయు నింతికిన్. ౧౦౮

క. చారుకరపల్లవాంకిత, హైరాజిలుబాహులతిక నతివకునమరెన్
హీరమయకంకణాములు, సారలతాంతములమీఁదచాయం గనుచున్ ౧౦౯

క. మదదంతిగామినీమణి, పదపంకేరుహములందుఁ బాయక నిలిచెన్
మృదుమధురనినాదంబులు, †పాదలఁగఁ హంసకములతులపూర్ణద్యుతులన్

గీ. ‡సహావసత్ప్రతికరత నే సవతి గాదు, పంకజావాస కీశరత్నద్వయన
నిరుపమావేలసౌందర్యనిత్యపదత, నేని యల్లక్ష్మి సవతియయ్యెందు వదన. ౧౧౧

చ. ముదు(గుఁ)దనంబు(వ)క్రతయు మోయుటమాని ససూక్ష్మవృత్తితన్
వదలుచు వృశ్యతం గొనుచు వాసివహించినఁ జిత్రరేఖ దాఁ
బొదలుచుఁ §గాత్రికతుణదఁ బూని మెలంగిన యద్ది సాటిగా
మది మదమావహిల్లుఁ జెలిమ్రుండితపేశలదేహయష్టికిన్. ౧౧౨

గీ. కమలలోచనపాణిసంగ్రహణకారి, నిరతిశయభాగ్యవర్ణాళిసీటుఁ గాంచి
సలలితాకృతి ఫాలదేశంబునందు, భామ కలరారె ముత్యాలబాసికంబుల్.

—॥ వివాహవర్ణనము ॥—

క. అప్పుడు మహీసురోత్తము, లిప్పుడె సుముహూర్తవేళ యెడలే దనఁగా
రప్పించిరి తెరమఱుఁగున, కొప్పులకుప్పను ముద బు లొప్పులు గుప్పన్.

చ. వలితెలిపచ్చడంపుఁదెర పర్వినచెచ్చలిమోము దాఁగనెన్
హరిసయిదోడు శారదఘనాంతరపూర్ణనిశాకరుంబలెం
గలికివరాననాంబుజము గన్గొనఁగాఁ దమకించియుం దదా
కలన భరింపదమ్యోఁ బుఱు గ్రమ్మెడు దట్టపుసిగ్గుబత్తెరన్. ౧౧౪

*మాగు-మా †పాదలకహంసకలము-మా ‡సహావసత్ప్రతికర-మా §కాత్రికతుణతపూన-మా

క. మధుపవ్రాత్యాపచారము, లధిగతపరమాత్మతత్త్వేందుకుచు నొనర్చెన్
మధువైరి కన్నుఁ దతఁడుగఁ, బ్రధితమహాభాగ్య మొదవుబలువేలు పొగఁ.
చ. జలరుహరాగనీలమణిసంగతహీరసమంపుఁబాత్రలో
జలరుహనాభపాదజలంబులు భక్తిప్రసిక్తి వారిధా
(ర)లఁగడిగెన్ దివాకరుఁడు రాణి యొసంగఁగఁ దన్మణిప్రభా
కలనఁ ద్రివేణికాజలము కైవడి పాత్రజలంబు కైవడిన్. ౧౧౮
గీ. సాత్త్వికస్వేదమకరందసహితముఖవ, హారికరాబ్జంబు ధౌతోదకాతిసిక్త
మగుచు వాస్తకరస్పర్శ వతిశయిల్ల, వాతి రవియిచ్చె బ్రహ్మార్పణమ్మటంచు.
ఉ. చేతనమాత్ర *విజ్ఞగతి (శ్రీ)పతిగా మదినిల్పి యాస్తసం
జాత నొసంగువాఁడు నిజజాతిసముల్లసనప్రదాయి నా
నీతటి నాదిదేవునకె యింతినొసంగినయర్కుఁడుం డవి
ఖ్యాతిగ లోకదీపకత గాంచఁడె యంచు నుతించి రుత్తముల్. ౧౧౯
క. తెర దొలఁగ వరుఁడు చెలిపా, తెరసోగచూపు గనఁగ మెలఁగఁదీవ్రపుమరువా
తెరగలుగు(?) తెలుప సిగ్గుల, తెర తమిమిగులంగ మదిని దెరలన్సాగెన్.
గీ. శుభగుణాస్పద మైనయాసుదతికంఠ, మునకుఁ దద్రత్నదవ్వాను గనినకంబు
వెల్లు సరియగునను రీతి వింత†కొలికి, విభుఁడు పొందుగ ఘటియించె శుభగుణంబు
చ. చిలుకుగతేటల న్నిగుల (శ్రీ)విరువొందిన ముత్తియంబు లా
నెలవొర యింతియాఁదలను నిల్పిన వావృతి వైరమూని య
క్కటిమొగులంచు వచ్చి పయిఁ గ్రమ్మిన మించులు నా మెలంగనై
యొలపుల‡తీఁగనై మెలఁగి యొప్పగు మొగ్గలనిగ్గు నిగ్గుచున్. ౧౨౨
క. వరమాణమధ్య (శ్రీ)హరి, శిరమున ముత్యాలప్రాలు చేదోయి నిడెన్
హరి(తను)వు తత్సితంబై, కరమరుదుగ నపుడు పుష్పఘనమై యొప్పెన్ ౧౨౩
సీ. సరబశివారిహేచ్చరికెమాటలు తేటమాటలాఁడుల§తేటనీటుపాట
లఖిలానవద్యవాద్యారావములు సామముఖవేదరవములు భూరిశాస్త్ర
వివదముల్ దచ్చువనేర్పుఁబల్కులు హాసమధురధ్వనుల్ వస్త్రమస్తరములు
స్ఫీతభూషాకణఝంఝితంబులు వందిబద్ధముల్ మాగధస్వానములును
సకలసురమానిమనుజసంస్తవయుక్త
జయజయధ్వానములు నొక్కసమయమునను

*నజ్జగతి- మూ. †కొలికి-కంఠము? ‡తీగనై- మూ. §తోటలనీటు-మూ.

గలసికొన నైన యవ్వింతకలకలంబు
చాల దీపించె దోయింటి ప్రాలవేళ. ౧౨౪

క. పువ్వులదోయిటికయ్యం, బవ్వనితావరుల నలరఁ *నందించెఁ గడుం
బువ్వులరువ్వులకయ్యము, పువ్విలుతుని నపుడు నలరఁ బొందింపంగన్. ౧౨౫

వ. అంత. ౧౨౬

ఉ. వేలిమివేళయందు నరవిందదళాయతలోచనామణుల్
వేలిమిపాట రాగములు వింతలువింతలుగాఁగఁ బాడ సం
దోలి నడంగె నారదముఖోర్జితనిర్జరగాయనప్రవే
కాళికరాబ్జసంవసదంచితమంజువిపంచికార్భటుల్. ౧౨౭

గీ. ఇంతిహృదయావనచ్చిరమేఘమాన, మదనదావానలజ్వాలమద మణంగ
బహిరవిరహితవైవాహపవనమిత్ర, ధూమకీలలు మిగుల నుద్దామములుగ.

క. ఇద్దఱు వేలిమివేది, స్నిగ్ధపువజిరంపుఁబీఁట నెఱిఁగదియంగా
నిద్దఱికిఁ గూర్చువాఁడై, యిద్దఱిసంధున మరుండు నిఱికి వసించెన్. ౧౨౯

చ. పొగ సొగయంగ ముద్దుచెలిపొందికకాటుకకంటికోనలన్
దిగియెడునశ్రుబిందువులు దీర్ఘరుచుల్ దలపించు నీలపుం
జిగిబిగిఁగాంచు ముత్తియపుఁజిప్పలలోపలనుండివచ్చు హే
తుగుణములై(న)ముత్యముల దూకొనుకప్పు మెఱుంగుపొంగులన్. ౧౩౦

క. పొగ నెపమున నొకవంకకు, సొగసులనెమ్మోము నిలిపి చూచెను నపలా
పొగరుకఱిచాయచూపుల, మగని తెలుపుటొంట్లు నీలమణులై తనరన్.

ఉ. కమ్మలవచ్చరాపయిఁడికాంతులు చూపులతెల్పుకప్పులో
క్రమ్ముడిఁ బాదపల్లవమహోజ్జ్వలకాంతులఁగూడి పంచవ
ర్ణమ్ములముగ్గునిడ(దన)నాథుని వెంటఁ బ్రదక్షిణమ్ము
క్రముగఁ జేసెఁ బద్మహితుగాదిలికూఁతురు నీటిచూలికిన్. ౧౩౨

మ. సనక్రోల్లోకేశువేళఁ బద్మముఖి యంచత్పాద మాద్యత్త్రరం
బునఁ బట్టింపఁగఁ గృష్ణమానసమునన్ మోదాతిరేకంబునం
గనకాంగీమణి కబ్బుసౌఖ్యమహిమం గంజాస్త్రవీరాగ్రణీ
కనదేకాంతవిభుత్వవైఖరులు లెక్కల్ సేయఁగా శక్యమే. ౧౩౩

*బొందించె- మూ.

క. నీలపణిమయపుసరిక, ల్బాలామణి ద్రాౘెశౌరిపరతంత్ర(త)చే
జాలఁ గొనుసడుగులచులను, నీలోపల మజ్జరాగనింద యొనర్చన్. ౧౩౪

ఉ. మోదముతో సుభద్ర చెలిముద్దులగండతలంబునందు సా
మోదనిశాకకర్దమము పొందుగ నించెను నవ్వులాటకై
నీదుకపోలభాగమున నిండి తొలంకెడు తేటమిన్న యో
కా దిపు డేనొసంగుసిరికాంతులు మేలె యటన్నకైవడిన్. ౧౩౫

చ. హరినను జెక్కుటద్దమున నద్భుతమందన సత్యభామినీ
విరచితసంజ్ఞ పూర్వకృతశిక్షకమైత్రియు హెచ్చరింపఁగా
స్ఫురదరుణంపుఁ గుంకుమము పూసినఁ దచ్ఛవి యొప్పెఁ దేటి (దే)
హరుచిఁగనంగ మోము గను నద్భుతరాగము నీడయో యనన్. ౧౩౬

చ ముసిముసినవ్వు తేటలను మూత్యపుఁ బావటచేసుచాయలం
బనగలముక్కుమాత్రిమపు బల్లిగియున్ గుమిఁగూడి ధారవై
మనలుచుఁ బోయి మింటికొన మంచిరుచిం దనరన్ వసిష్ఠుతోఁ
బొసగెడు నైదువం గనయెఁ బుణ్యచరిత్ర మునంగ మ్రొక్కుచున్. ౧౩౭

గీ. పురుషతల్లజు పెండ్లి నిప్పుడుభుజించు
మధురచతురాన్నములు మీఁద మనకుసబ్బుఁ
బేర్మిఁ కృష్ణుని కింకొక్క పెండ్లియైన
దిరుగ నదెంచు పుణ్యంబు దీరదేని. ౧౩౮

క. అనియెన్నుచురుచులానుచుఁ, గొనకొనెనమయంబులెన్నగొనుఁడాయనుచుం
దినఁదినఁగ వింత లమచున్, జనత తదన్నానుభూతిఁ జాలం దనిసెన్. ౧౩౯

సీ. మంచిభోజన మబ్బె మాగధక్షితిపాలనలలితపరిణయోత్సవమునందు
నవి చెప్పనేటికి నంతకంటెను మేలు వెలయుకాశీశేశు పెండ్లిబంతి
యాబంతికత యేమి యంతకు(మి)క్కిలి బంగాళపతిపెండ్లిబంతికూడు
ఆకూటిపస యేమి యంతకంటెను బాగు వంగేశు పెండ్లిలో వంటకంబు
అవివచింపంగ నహ్యమా యంతకంటె, నెక్కుడై చక్కనై నాల్కసాక్కఁజేసెఁ
* బోల్కి లేనిదిహరిపెండ్లిబోనమనుచు, జనులుమృష్టాన్నములఁదృప్తిగొనిరిచాల.

గీ. ప్రోలుసొరఁబడి వెడలుచుఁ బురుషచంద్రుఁ
డురుతరోజ్జ్వలమణిసుయుతో త్తమాంగ
మభినవలతాంతవిశదంబు నగు(టఁ)బాఁప
పాన్పునగియెడు పెండిలిపాను వెక్కె. ౧౪౦

---

* పోల్కి-చెనిడీ-మూ.

# కాకినాడ-పరిషత్కార్యాలయమున వెలకు దొరకు గ్రంథములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయకవి | రు | 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... | ... | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | ... | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్లపాక పెదతిరుమలార్యుఁడు | | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు బి. ఏ., యల్. టి. | | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి | ... | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు | ... | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ. రామయ్యపంతులు గారు, బి. ఏ., బి. ఎల్. ... | ... | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి | ... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రితగ్రంథసూచిక ... | ... | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | ... | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు | ... | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు బి ఏ., బి. ఎల్. ... | ... | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... | ... | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | ... | 0 | 8 | 0 |
| 17 | Dravidian Lexicography ... | ... | 0 | 4 | 0 |
| 18 | ప్రహస్వరంగములు-కొత్తపల్లి సూర్యారావుగారు... | ... | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము ఉత్తరభాగము-హరిభట్టు | ... | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాసవిలాసనాటకము—రంగాజమ్మ. | ... | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయఁకుఁడు | ... | 0 | 12 | 0 |
| 22 | కాళిందీకన్యాపరిణయము. (మొదటిభాగము) అహోబలపతి | | 1 | 0 | 0 |
| 23 | రెడ్లనాటి రెండుశాసనములు శ్రీనాథుఁడు | .. | 0 | 4 | 0 |

Printed by M. Rangiah at the Cocanada Printing works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య

# పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**


సంపుటము ౧౮. { శుక్ల నామసంవత్సరము. మార్గశీర్ష-ఫాల్గునమాసములు. } సంచిక ౫-౬.





కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా { పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. ౩. } { విడిసంచిక రు ౦-౮-౦

1930

## ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు, పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

శ్రీరాణీ వత్సవాయ వేంకట సుభద్రయ్యమ్మజగపతిబహద్దరు గారు-తుని రాణిగారు.

కి. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షుఁడు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

దర్భా వేంకటశివరామరాజుగారు బి. ఏ. బి. ఎల్.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఎ. బి. ఎల్.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్‌బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు.

డాక్టర్ వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ. ఎల్. టి. PH. D.

(కోశాధ్యక్షులు.)

శ్రీత్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు

అనంతపంతుల రామలింగస్వామిగారు,

దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారు బి. ఏ.

తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు

అళక్కి- వేంకట్రామయ్యగారు

కోకా వెంకటసుబ్బారావు నాయుఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు

పిళ్లారిసెట్టి రంగబ్రహ్మారావు నాయుఁడుగారు

# విషయసూచిక.

# పరిషత్ప్రయోజనములు.



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి :—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట;

ii తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట;

iii ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుటయు;

v సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట- ఇందు బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుగూడ నుండవలయును;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపచరించు నన్ని కార్యములను జేయుట.

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్త్రిక.

సంపుటము ౧౮. | శుక్ల నామసంవత్సరము మార్గశీర్ష-ఫాల్గునమాసములు. | సంచిక ౩-౬.


## త్రిలింగము-తెలుఁగు-తెనుఁగు.

### ప్రతివాదవిమర్శనమును గూర్చి కొన్నిపంక్తులు.


—( శ్రీవిక్రమదేవవర్మగారు-విశాఖపట్టనము )—


అనావశ్యకవాదప్రతివాదములను బెంచుట నాస్వభావము గాకపోయినను, నా ప్రతివాదమును ఆం॥ సాహిత్యపరిషత్పత్త్రిక ౧౮ వ సంపుటము ౪ వ సంచికయందు సాహిత్యవిద్యాప్రవీణ-శ్రీబులుసు వేంకటరమణయ్యగారనుచితముగా విమర్శించి యుండుటవలన నా ప్రతివాదమండనముగాఁ గొన్నిపంక్తులను మాత్రము వ్రాయవలసి వచ్చినందులకుఁ జింతించువాఁడను.

"గంజాముమండలమునఁ గొంతభాగము తెలుఁగుదేశ మనుటచే శ్రీవిక్రమదేవవర్మగారికిఁ గోపము కలిగియుండవచ్చును." అని సాహిత్యవిద్యాప్రవీణుఁడుగారికిఁ దోఁచెను. కొంతభాగమును మాత్రమే కాక, సమగ్రమగుగంజాముమండలమును దెలుఁగుదేశ మనినను, నా కించుకంతయుఁ గోపము లేదనియు నాకోపము నాయుపన్యాసమునకును బ్రతివాదమునకును గారణము గాదనియు నిశ్చయముగా నుడువువాఁడను. గంజాముమండలమును దెలుఁగుదేశముగా నిరూపించుటకె సాహిత్యవిద్యాప్రవీణుఁడుగారు నిజవ్యాసమును వ్రాసియుందురు కాఁబోలు !

త్రిలింగమధ్యదేశము "తెలుఁ" గనియుఁ ద్రినగమధ్యదేశము "తెనుఁ" గనియు సాహిత్యవిద్యాప్రవీణుఁడుగారినిబోలుపండితులు సెలవిచ్చుచుండుటవలనను, త్రిలింగదేశముయొక్క యుత్తరపుమేర భీమేశ్వరలింగముగాను ద్రినగదేశ

ముయొక్క యుత్తరపుమేర మహేంద్రగిరిగా నేర్పడుటవలనను, మంథనకాళేశ్వరమునందలిలింగము భీమేశ్వరాఖ్యతోఁ గాక కాళేశ్వరాఖ్యతోడనే యొప్పుచుండుటవలనను, "తెలుఁగు" "తెనుఁగు" అనురెండును బర్యాయపదము లగుటవలనను నా ప్రతివాదమునందు "విద్యాప్రవీణుఁడుగారు గోదావరిమండలస్థిత భీమేశలింగమునకును గంజాముమండలమందలి మహేంద్రగిరికిని ముడిపెట్టి యెల్ల నేర్పఱుపుట......" అని యుండుటకును, "శ్రీశైలభీమకాళేశమహేంద్రగిరుల కూరుపే దానిని (బ్రహ్మాండపురాణస్థ మని చూపఁబడినశ్లోకమును) ప్రక్షిప్త మని చెప్పక చెప్పుచున్నది." అని యుండుటకును గారణము రెండుదేశములును భేదరహితము లగునపుడు వాని పొలిమేరలును భేదరహితము లయి యుండవలదా ? "త్రిలింగకలితదేశము త్రిలింగదేశ" మని యెవరయిన నిప్పుడు చెప్పవచ్చును. కాని యుపర్యుక్తపండితులు "త్రిలింగమధ్యదేశము తెలుఁ" గని నిరూపించుచుండుటవలనను బ్రహ్మాండపురాణమందలి దని యుదాహరింపఁబడిన శ్లోకము మఖలింగేశగోకర్ణేశాదిముఖ్యము లగు పెఱలింగములను జేర్కొనక లింగత్రితయము నే పేర్కొనుటవలనను "త్రిలింగమధ్యదేశము తెలుఁ" గనునర్థమే సమంజస మని సహృదయు లనక మానరు. ఆమూఁడులింగములును సృష్ట్యాదిసంభవము లని కాని, యేకకాలప్రతిష్ఠితము లని కాని ననుఁబోలు నజ్ఞులు నమ్మరు; సాహిత్యవిద్యాప్రవీణుఁడుగారిని బోలుపండితులు నమ్మిన నమ్ముదురుగాక. తెలుఁగుదేశపుజనులను బట్టియె భాషకుఁ దెలుఁ గనుపేరు గలిగె ననుట నిర్వివాదవిషయము.

తారానాథుఁ డనుబౌద్ధగ్రంథకర్త కళింగము త్రిలింగాంతర్గత మనెనో త్రిలింగము కళింగాంతర్గత మనెనో యావిషయము మారయుటకుఁ బాళీభాష రాని నే నసమర్థుఁడను. కాని, కళింగదేశమునుగూర్చి నే నిచ్చియున్న ప్రమాణవచనములను దారానాథునికంటెఁ బ్రాచీనులు నుడివియుండుటవలన వానిన గౌరవించి స్తోక మగు "త్రిలింగము" సువిశాల మయినకళింగములోని యొక భాగ మని నమ్ముదును.

సుబలపాలకులనుబట్టి దేశము వృద్ధి గాంచుచుండుటయు దుర్బలపాలకులనుబట్టి దేశము క్షీణించుచుండుటయు సువిదితవిషయ మగుటవలనఁ గళింగదేశముయొక్క యెల్ల లెప్పుడు నొకరీతి నుండక మాఱుచుండె నని భావించినచో నాయుదాహృతవచనములకు విరోధ ముండదు. త్రికళింగశబ్దవ్యవహార

ము వలనను, క్రీ. ద్వితీయశతాబ్దమునందు రోమకయాత్రికుఁ డయిన ప్లీని "ముడోకళింగ" లేక "మూడోకళింగ" యని వాడియుండుటవలనను, క్రీ॥ శ॥ పంచమశతాబ్దమునం దుండినభవదేవగుప్తునకు "త్రికళింగాధిపతి" యను బిరుద ముండుటవలనను మదుదాహృతప్రమాణచయకథిత మయినట్లు గంగానది మొదలు కృష్ణానదివఱకును వ్యాపించిన కళింగదేశము కాలవశమున మూఁడుభాగము లయ్యెను. కాళిదాసమహాకవికాలమునకు ముందె మహానదికుత్తరమున నున్నయుత్కళింగభాగము "ఉత్కలము" గాను, గోదావరీకృష్ణానదులకు నడుమనున్న తలకళింగభాగము "తెలుఁగు" గాను మాఱియుండుటవలన నడిమిభాగము "మధ్యకళింగ" మని వాడఁబడు నక్కఱ లేక "కళింగ" మనియె వాడబడుచుండినట్లు మదుదాహృతరఘువంశశ్లోకమువలనఁ దెల్లమయ్యెడిని. మధ్యకళింగము కళింగాఖ్య నొందినపిమ్మటఁ గ్రమక్రమముగా క్షీణించి యిప్పటి గంజాము విశాఖపట్టణము జిల్లాల పరిమితి మాత్రము గలదయ్యెను అందలిజనులు జ్ఞానశూన్యు లయిరి అట్లు కొంత కాలము గడచినతరువాత నుత్తరమునుండి యుత్కలులును దక్షిణమునుండి తెలుఁగువారును దన్న-డలద్వయమున కేగి తన్నివాసు లయిరి. కళింగాంధ్రపదప్రయోగము కేవలాధునికము. మధ్యకళింగమునకు దక్షిణమునఁ దెలుఁగుదేశమును బశ్చిమమున నాంధ్రదేశము నుండెను. "జగన్నాథాదూర్ధ్వభాగం......తావదాంధ్రాభిధో దేశః" అని సాహిత్యవిద్యాప్రవీణుఁడుగా రుదాహరించిన శ్లోకచరణద్వయ మాంధ్రదేశము మధ్యకళింగమునకుఁ బశ్చిమముననుండినట్లే స్థిరపఱుచుచున్నది. బంగాళాఖాతముయొక్క యొడ్డున నున్నజగన్నాథమునకు మీఁదిభాగము పశ్చిమదిశ గాక మ ఱొకదిశ గాదు కదా. ఆంధ్రులరాజధాని నాసికకడ నుండె నని యూహింపఁబడుచున్నది. వారిశాసనము లన్నియుఁ బ్రాకృతభాషలోనె యుండుటవలన వారిభాష ప్రాకృతమే యని తెలియందగును ఆంధ్రులు గొంతకాలము పశ్చిమోత్తరరాష్ట్రాధిపత్యము సలిపిరి. వారిలోని కొందఱు తెలుఁగుదేశమందలి యాదిమవాసులను నిర్జించి తద్దేశవాసు లయిరి. ఆంధ్రసాంగత్యమువలననే తెలుఁగుబాస తత్సమతద్భవశబ్దభూయిష్ఠ మగుచు వృద్ధి నొందుటయే కాక, దానికిఁ బర్యాయవాచకము సైత మయ్యెను. జేనేఁడు నింగ్లాండునందలి యాంగ్లేయు లమెరికాఖండమందు నాస్ట్రేలియాఖండమందును గ్రిక్కిఱిసి "ఫీజీ" మొదలగు ద్వీపములందు వ్యాపించియుండఁగా నాంధ్రులు లేక తెలుఁగువారు

దత్తమండలములందు వ్యాపించి యుండుట లోకవింత గాదు.

సాహిత్యవిద్యాప్రవీణుఁడుగారు పేర్కొనిన నరసింహదేవుఁడు కళింగోత్క లదేశములను జయించి "ఉత్కలకళింగసామ్రా" ట్టను బిరుదమును గ్రహించి యుండెనేని యాబిరుదము సార్థకమే యగును. సమగ్రముగా జయింపక దానిని గ్రహించియుండెనేని యది నేతిబీఱకాయ వంటిదియె. అతని బిరుదముతో డను గృష్ణదేవరాయలు "తెలుఁగురాయలా ? కర్ణాటకపురాయలా ?" అను చర్చతోడను మన కిక్కడఁ బ్రసక్తి లేదు.

నిష్పక్షపాతబుద్ధితో నీపంక్తులను జదువునపుడు సాహిత్యవిద్యాప్రవీ ణుఁడుగారి "ప్రతివాదవిమర్శన"ము గూడఁ జదువఁ బాఠకమహాశయులను బ్రార్థించుచు నీమీమాంస నింతటితోఁ గట్టిపెట్టువాఁడను.

(ఈవ్యాసముపై వాదప్రతివాదము లింకమీఁదఁ బరిషత్పత్త్రికలోఁ బ్రకటింపఁజాలము - స॥ అ॥)

# నైషధరచనాతత్త్వము.

ఇవటూరి సుందరయ్యగారు—అమలాపురము.

---

(గతసంచికావశేషము.)

ఔజ్జ్వల్యయుతుఁ డనియు "అముష్యవిద్యారసనాగ్రవర్తికీ...ఇత్యాది" మహాభాగ్యవంతుఁ డనియు, "తదోజస స్తద్యశస స్థితావిమౌ" ఇత్యాది తేజస్వి యనియు, "అధీతిబోధాచరణప్రచారణైః...ఇత్యాది, వైదగ్ధ్యము కలవాఁ డనియు, మొదలగునర్థములచే ధీరోదాత్తుఁడగు లోకోత్తరనాయకుఁడనియు, సూచించియున్నాఁడు.

ఇట్టిలోకోత్తరగుణోత్తముని నాయకునిగాఁ జేసి తొలుత, "అయోగశృంగారమును నెలకొల్పినాఁడు. ఇట్టినాయకగుణములు వందిజనులవలన విని దమయంతి నలునియందు బద్ధానురాగయై-

శ్లో. అహో అహోభిర్మహిమా హిమాగమే ।
  వ్యతిప్రపేదే ప్రతితాం స్మరార్థితా.........

ఇట్లు చింతాజాగరావస్థను బొందినది. నలునివంటి లోకోత్తర గుణోత్తరనాయకుఁడు మెచ్చుకోఁదగిన గుణసంపదయు దమయంతియం దున్నది. కనుకనే యాతఁడు- "స్వకాంతికీర్తివ్రజమౌక్తికస్రజః..." దమయంతిగుణముల విని యిట్లు ప్రేమమూనినవాఁడు.

శ్లో. అపహ్నువానస్యజనాయయన్నిజామధీరతామస్యకృతంమనోభువా—

ఇట్లు ప్రేమమూనినయతనికి ఘటిల్లినవిరహావ్యథచేఁ గలిగిన యధీరతను జాగరదుఃఖసాక్షు లగునిశయు శయ్యయుఁ దక్క నితరు లెఱుఁగకుండ సమాశ్వాసించుకొనినాఁ డఁట—ఇట్లుభయుల నుత్తముల నేరి యయోగశృంగారమును బ్రారంభమునఁ బ్రదర్శించుచుఁ "నగరార్ణవశైలర్తుచంద్రార్కోదయవర్ణనమ్" ఇత్యాదిగా మహాకావ్యలక్షణములుగా నిర్ణయించిన యాలంకారికశాసనమతిక్రమింపకుండఁ గొన్నివర్ణనములతోఁ గావ్యరచన మొనర్చినాఁడు. ఇంకను గలగుణములఁ దెల్పఁబూనినచో గ్రంథవిస్తర మగు నని విరమించినాఁడను.

కాని యితనికి వాల్మీకికాళిదాసాదుల నిర్మలకవితాధర్మము పట్టలే దనియు వారు వియోగశృంగారమును సరసముగ వర్ణించినా రనియు నీతఁ డట్లు

చేయక సంభోగశృంగారమును మాత్రమే వర్ణించి యూరకున్నాఁ డని యు విశేషించి శాస్త్రప్రశంసలు నుత్ప్రేక్షలు పెక్కు కావ్యమునందుఁ జొప్పించినాఁ డనియు దేశము యవనాక్రాంత మైనది మొదలు జనులకు రాజులకు భోగాపేక్ష హెచ్చుపెఱుగుటచే వారిని సంతోషపెట్టుటకై యిట్లు సంభోగశృంగారమును మాత్రము వర్ణించి యూరకుండె ననియు నానాభోగవర్ణనము కూడఁ బచ్చిపచ్చిగఁ జేసి పూజ్యనాయకులగు నలదమయంతుల నధఃపతితులఁ జేసినాఁడనియుఁ బతివ్రత యగుదమయంతి శయనాగారమున జారత్వద్యోతకములగు తారాశశాంకుల చిత్తరువులు మొదలగునవి యున్నట్లు వర్ణించినాఁ డనియు, బువ్వపుబంతి యనుపేరుపెట్టి యందనభ్యములగు సల్లాపములు జరిగినట్లు వర్ణించినాఁ డనియు దీని కంతకును గారణము దేశ మన్యాక్రాంత మై యుండుటచే దారిద్ర్య మనుభవించు నీకవి యప్పటిరాజులు సంతసించునట్లు కావ్యరచన చేసి వారిదయకుఁ బాత్రుఁ డగుట కిట్లొనర్చినాఁ డనియు సువర్ణము కలవాఁడగుటచే దానిమీఁది భ్రాంతిచేతనే హంసమును "సువర్ణమయీం తనుః" "సువర్ణశైలా దవతీర్య" యని వర్ణించినాఁ డని యు, నవియును గాక ధనాశ కలవాఁ డగుటచేతనే "తాంబూలద్వయ మాసనం చ దధతే యః కాన్యకుబ్జేశ్వరాత్" అని రాజు రెండుతములపాకు లిచ్చినందులకును, గూర్చుండు మనుటకును సంతసించి గొప్ప చెప్పుకొన్నాఁ డని యు నారాజు సువర్ణహస్తములనుండి జాఱినతృణము మహామేరువుగా భావించినాఁ డని యుఁ గాళిదాసు తనరఘువంశకావ్యమం దగ్నివర్ణకథాసందర్భమున శృంగారము పచ్చిపచ్చిగా వర్ణించినాఁడు కాని తుద కగ్నివర్ణుని నధఃపతితుని జేసి యావర్ణనాదోషము సర్దుకొన్నాఁ డనియుఁ గుమారసంభవాష్టమసర్గమందు సంభోగశృంగారము వర్ణింపఁబడి యున్నది, గాని, యది కాళిదాసు రచించినది గా దనియు మొదలగునాక్షేపములు సేయుచుఁ గొందఱు విద్యాశేఖరు లీనైషధకావ్య మధమకావ్య మని నిరూపించుచు దీనిని దెనిఁగించిన శ్రీనాథకవీంద్రుఁడుగూడ మూలముకంటె మఱింత గ్రామ్యము స్ఫుట మొనరించి తన బులుపు తీర్చుకొన్నాఁ డనియు వ్రాసియున్నారు.

వారు వ్రాసిన ట్లీకావ్యమునందు శాస్త్రప్రశంసలు మెండుగా నున్నమాట వాస్తవమే కాని యాతఁ డీగ్రంథ మనలు శాస్త్రవిషయములు బోధించునుద్దేశముతోనే రచించియున్నాఁ డని యిదివఱకే నిరూపించియున్నాను.

కావున వేదశాస్త్రధర్మముల బోధించుటకు రచించిన యీగ్రంథముపై వారు చేసినయీయాక్షేపమునకు సమాధాన మనవసరము. శాస్త్రప్రశంస కావ్యములందుఁ బ్రవేశింపఁజేయ మొదలిడినతర్వాతనే నిర్మలకవితారూపము నశించినది. షట్ఛాస్త్రములందును బ్రవీణులైనవారు కవిశ్వయునకుఁ గడఁగిరి. కాళిదాసభవభూతుల నిర్మలకవితారూపము వీరికి బొడకట్టలేదని యాక్షేపము. కాళిదాసుఁడును భవభూతియుఁ గూడ షట్ఛాస్త్రపండితులే. వారికావ్యములందును శాస్త్రప్రశంసలు లేకపోలేదు. ఉత్ప్రేక్షలు మొదలగువిషయములును లేకపోలేదు స్వభావవర్ణనములు సలుపఁదగినచోట్ల శ్రీహర్షుఁడును స్వభావసిద్ధముగా నుండునట్లే రచించినాఁడు. వాల్మీకి, కాళిదాసు మొదలగువారు చొప్పించినశాస్త్రవిషయములు నుత్ప్రేక్షలు చూడనివా రుండరు గనుక గ్రంథవిస్తర మగు నని నే నుదాహరింపలేదు.

ఇఁక నీకవి సంభోగశృంగారమును మాత్రమే వర్ణించి యూరకున్నాఁడనుకొనుటకు వీలులేదు. తొలుత నయోగశృంగారము వర్ణిత మని యిదివఱకే చెప్పియున్నాను. వియోగశృంగారమును గూడ శ్రీహర్షుఁడు చెప్పియే యుండును. ఆతఁడు తనగ్రంథమునకు "నైషధ" మని కదా పేరు పెట్టినాఁడు. అట్టిపేరిడినవాఁడు నలునిచరిత్ర మంతయుఁ జెప్పకవివాహమువఱకే చెప్పి యూరకుండఁడు వివాహమువఱకే చెప్పఁదలంచినచో "నలపరిణయ" మని కాని "దమయంతీస్వయంవర"మని కాని పేరుపెట్టి యుండును. మఱియు నీ దమయంతీవివాహముతో సంబంధింపని కలిని దెచ్చిపెట్టఁడు. కలిని దే నవసరమును లేదు. వివాహ మైనతరువాతఁ గలి వచ్చి చింతించి యీదంపతుల నెట్లయిన నెడఁబాపక మాన నని ప్రతిజ్ఞ చేసి నలుని యుద్యానమున నొక విభీతకవృక్షము నాశ్రయించి యానలదమయంతుల నెడఁబాపుటకు రంధ్రాన్వేషణము చేయుచున్నట్లు చెప్పియున్నాఁడు. తరువాత నందు దొరకినప్పుడు వారి నెడఁబాపినాఁ డని వారివియోగమును జెప్పియే యుండును. అట్లు చెప్పఁదలఁచుకొనిచోఁ గలిని దీసికొనియే రాఁడు. కాని మన కావియోగమును వర్ణించినభాగము లభించియుండకపోవచ్చును. కావున నప్పటిరాజులను సంతోషపఱుచుటకు సంభోగశృంగారమును జెప్పి వదిలివేసినాఁ డన్నయాక్షేపము నీరసము.

ధనాశచే నీకవి పీడింపఁబడుచు నప్పటి తనయాశకుఁ దగినట్లే హంసముకు "సువర్ణమయీ తనుః" "సువర్ణశైలా దవతీర్య" అని వర్ణించినాఁడని యాక్షేపము. అట్లు వర్ణించుట యర్థలుబ్ధుఁడై కాదు. సువర్ణమయ మైనదనఁగా మనోహర మైన దని యర్థము. లోకములో నుత్కృష్టతకు బంగారును వాడుట యాచారము. "నాబంగారు తండ్రి, వానిగుణములు మేల్మిబంగారువంటివి" ఇత్యాది ప్రయోగములఁ దిలకింపుఁడు. వ్యాసుఁడు త్రెక్కలుమాత్రము సువర్ణమయము లని చెప్పినాఁడు. అప్పటికే దారిద్ర్యము వచ్చియుండుటచే, ఱెక్కలుమాత్రము సువర్ణ మయము లని చెప్పినాఁ డందురు. అందుచే నతఁ డర్ధార్థలుబ్ధుఁడు. శ్రీహర్షుఁడు పూర్ణార్థలుబ్ధుఁడు. "ప్రాసాదై రత్నవికృతై" "చిత్రామష్టాపదాకారాంవిమానగృహశోభితాం" "కాంచనప్రతిమైకాగ్రం మణివిద్రుమతోరణం మేరుశృంగసమం సూతో రామవేశ్మ దదర్శహ" అని రాజప్రాసాదములను సువర్ణమయములుగాఁ జెప్పుటయు సీతకుఁ గనిపించిన లేడి రత్నశృంగములు, రత్నఖురములు సువర్ణమయశరీరమును గలిగియున్నట్లు వర్ణించుటయు జరిగించినవాల్మీకి యెట్టిలుబ్ధుఁ డగునో? "తాంబూలద్వయమాసనంచ దదతే యః కాన్యకుబ్జేశ్వరాత్" అని చెప్పుకొని ప్రభువులసువర్ణహస్తముల నుండి జాతిసత్కృణము మహామేరువుగాఁ దలపోసిన యాతఁ డర్థలుబ్ధుఁ డేలకాఁడు? రాజు కూర్చుండు మన్నందులకును రెండుతములపాకు లిచ్చినందులకు గొప్ప చెప్పుకొన్నాఁ డందురేమో! అట్లు రాజు తన్నుఁ గూర్చుండు మన్నందులకును రెండుతములపాకు లిచ్చినందులకు నుబ్బి కాదు. కాలమహిమచే ధర్మ మడుగంటి స్రక్చందనతాంబూలాదిప్రదానమునకు లీలావతులు మాత్రమే యర్హ లనుకొను నీకాలమునఁ గూడ విద్వాంసులఁ బూజించు రాజసత్తము లున్నారని సూచించుటకుఁ గాఁ జెప్పినాఁడు. ఇతఁడు కేవలము నిరంకుశుఁడు. నిర్లక్ష్యమును గలవాఁ డందురు. అది యును గాక పైశ్లోకములోనే "యః స్సాక్షాత్కురుతే సమాధిషు పరం బ్రహ్మప్రమోదార్ణవం" అని చెప్పికొని యున్నాఁడు. అనఁగా సమాధిస్థితుఁ డై పరబ్రహ్మానందసముద్రమును సాక్షాత్కరింపఁజేసికొన్నాఁడు; అనఁగా "బ్రహ్మానందసముద్రమున నోలలాడువాఁడు" అని కదా భావము. ఇట్లు బ్రహ్మానంద మనుభవించుసమాధినిష్ఠుఁ డగునీయనయం దాశారోపణము సమంజసమా! బ్రహ్మానందసాగరమున నోలలాడుసమాధినిష్ఠ గల తాను రాజసన్మానమున కుబ్బుచున్నట్లు చెప్పికొన్న

చో లోకము నవ్వ నసిమైనను దోఁపదా ? కావున నట్లతఁడు తనుజులపాకు లిచ్చుట చెప్పికొనుట యుబ్బి కాదని తేలుచున్నది. మఱియు నిరంకుశుఁడు, నిర్లజ్జుఁడు నన్నందుల కితఁడు తండ్రిని జయించినప్రతిపక్షిని జయించె నని చెప్పుకథలే తార్కాణము.

బువ్వపుబంతియం దనభోక్తుల నింపినాఁ డని యాక్షేపము. ఆబువ్వపుబంతిలో నలుఁడు గాని, దమయంతి గాని, అట్టియుత్తములు గాని యున్నట్టు కానరాదు. పెండ్లికై వచ్చినకొందఱు యువకులభోజనపుబంతి, చేటికలు వడ్డించుచున్నారు, బందుగు లగు (కందారాజులు) యువకులు, షరాబులు, సేనాపతులు మొదలగువారు భుజించుచున్నారు. అచ్చట వారికి జరుగుసంభాషణములు హాస్యరసయుక్తములు; వారిహాస్యరససంభాషణములఁ దెలుపుట కాతఁ డట్లు చెప్పియుండును. విటపీఠమర్దాదినాయకు లీతెగలోనివారు. అందుచేతనే చేటికాదులతో వారి కాసల్లాపములు వర్ణింపఁబడియుండును.

దమయంతీకేళికాగారమునందుఁ దారాశశాంకుల ప్రేమబంధమును దెలుపునట్టియు నహల్యాసంక్రందనవిలాసమును దెలుపునట్టియు, ఋషు లప్సరస్త్రీలఁ బ్రేమించినప్పటిస్థితినిఁ దెలుపునట్టియుఁ జిత్తరువులు, శుకశారికలు కామశాస్త్రపారాయణము చేయుచుండుట మొదలగు కామోద్దీపకవర్ణనములు వర్ణితము లన్నమాట వాస్తవమే. అది కేళికాగారము గాని దేవతార్చనాగృహము కాదు గదా ! అచ్చట శుకశారికలు కామశాస్త్రపారాయణము చేయక వేదాంతశాస్త్రపారాయణము చేయుట సరసమా ! పుణ్యాశ్రమము లందలిశుకాదులు వేదాంతాదిశాస్త్రపారాయణము చేయునట్లే సంభోగాగారమందలి యవి కామశాస్త్రపారాయణము చేయుచుండుట సరసము. ఇఁక నాచిత్తరువులు జారులవి గదా యట్టి వుండవచ్చునా యందు రేమో! అవి గాఢ మగుప్రేమను సూచించుటకును సుందరమిథునసందర్శనమునకును నేర్పడినవి గాని వారిజారత్వ మచ్చటఁ బ్రధానము కాదు. అట్లయిన సీతారామాదిమిథునచిత్రముల నునుపరాదా యందురేమో ! వారిప్రేమము బహిర్గతము గాదు. ఇచ్చటఁ బ్రేమ బహిర్గత మగుచుఁ జిత్తరువునఁ దోఁచుచుండవలెను.

సంభోగశృంగారము పచ్చిపచ్చిగా వర్ణించుచుఁ గేవలము దంపతుల కాయికసురతము గూడ వర్ణించి యుత్తము లగునలదమయంతుల నధఃపతితులఁ జేసినాఁ డనియు నిట్టివర్ణనము లుండఁగూడ దని కొందఱాలంకారికులు

శాసించినవారనియు నీతఁడు దానిని మీఱినాఁ డనియు నాక్షేపము. కాళిదాసు "జగతః పితరౌ" అని చెప్పి యట్టిజగత్పితల సంభోగశృంగారమును వర్ణించియే యున్నాఁడు. రఘువంశమం దగ్నివర్ణునికథపట్టునను వర్ణించియే యున్నాఁడు. కాని అగ్నివర్ణునికథపట్టున నట్లువర్ణించియున్నను దుద నాతని నధఃపతితుని జేసినాఁడు కావున నచ్చట నది యుచితమే యనియుఁ గుమారసంభవాష్టమసర్గమున వర్ణించిన వర్ణన మాతనిది కాక ప్రక్షిప్త మనియుఁ జెప్పెదరు. కాళిదాసు "కుమారసంభవ" మని కదా తన కావ్యమునకుఁ బేరు పెట్టినాఁడు. కుమారసంభవ మగుటకు సంభోగము లేఁదే యెట్లు పొసఁగును? అయిన నాతఁడు కాయికసురతమును వర్ణింపక మృదువుగా వర్ణించియున్నాఁడు. కాయికసురతవర్ణన మొనర్చుశ్లోకము లాతనివి కావందు రేమో! ఆ సర్గ చూచినచో నట్లు ప్రక్షిప్తముల క్రిందఁ గొన్నిశ్లోకములు తీసివేయుటకు వలనుపడలేదు. అందుచేత నన్నిశ్లోకములును నాతనివే. అతఁడును గామశాస్త్రప్రశంస తెలియుటకై యట్లు వర్ణించియుండును శ్రీహర్షుఁడు-

శ్లో. "జాతిస్వభావగుణదేశజ ధర్మచేష్టా
భావేంగితేషు వికలో రతితంత్రమూఢః
రతిశాస్త్రపరిజ్ఞానవిహీనా యే నరాధమాః
తేషాం రతిః శ్వానవత్స్యా న్నరతే సుఖ మశ్నుతే
రతే స్సుఖస్యజ్ఞానార్థం కామశాస్త్రం సమభ్యసేత్
జ్ఞాత్వా కర్మణి కుర్వీత తత్రానందో భవేద్ధ్రువం
అన్యథా పశువత్తేషాం రతికర్మ సునిష్ఫలం
నచానన్దో నచసుఖం దుఃఖస్యైవతు కారణం
సంసారే సురతం సారం సర్వలోకసుఖప్రదం
తన్నకుర్వంతి యేమూఢా స్తేనరాః పశవస్మృతాః"

అను నట్లు పురుషుఁడు, జాతిస్వభావగుణచేష్టాదు లెఱింగి కామశాస్త్రోక్తరీతిని చుంబనాదులతో బాహ్యమునను బంధనాదులతో నాంతరమునను గృతార్థుఁడైనచో స్త్రీపురుషులకుఁ బ్రేమము వీడరాని దగు ననియు సత్సంతానప్రద మగు ననియు నీవిషయానందము సంసారమున సారమే యనియుఁ గామశాస్త్రపరిజ్ఞానహీనుఁడై భోగించువాఁడే పశుతుల్యుఁ డని తచ్ఛాస్త్రమునఁ జెప్పఁబడి యుండుటచేతను, సర్వేంద్రియసమష్టిగాఁ గలుగునీవిషయానం

దమునే బ్రహ్మానందమునకు ద్రాష్టాంతికముగ వేదాంతశాస్త్రవేత్తలు వచించుచుండుటచేతను, తదర్థపరకై యాతఁ డావిషయముల నంతవివరముగా వర్ణించియుండును. అయినను నతఁ డాపట్టుల గంభీరపదజాలము నుపయోగించి గూఢముగ నుండునట్లే వర్ణించినాఁడు. కాని యాక్షేపకు లావిషయమును గ్రామ్యభాషతో వాడి బొత్తిగా నీచముగాఁ దోఁచునట్లు చెప్పియున్నారు. సురతవర్ణముకట్టున-

శ్లో. అస్తివాహ్యభర మస్తికౌతుకం । సాస్తిషుర్జల మస్తివేపథు
అస్తిభీతిరత మస్తివాంఛితం । ప్రావదస్తిసుఖరుస్తిపీడనమ్.

అని యెంతగంభీరముగఁ జెప్పినాఁడో చూడుఁడు.

మఱియు వాల్మీకియుఁ గొన్నిపట్టుల నాయకులఘనతకుఁ దగనిపదముల వాడియున్నాఁడు. "కదాను చారుబింబోష్ఠం తస్యాః పద్మమివాననం ఈషదున్నమ్య పాస్యామి రసాయనమి వాతురః। తస్తాస్తు సంహితౌ పీనౌ స్తనౌ తాళఫలోపమౌ। కదానుఖలు సోత్కంపౌ శ్లిష్యత్యామాం భజిష్యథ॥-ఈమాటలే గ్రామ్యభాషలోఁ జెప్పిన నెంతయసహ్యముగా నుండునో యాలోచింపుఁడు. ఇట్లే మనశ్రీహర్షుఁడును కుచాదివర్ణనములఁ జేసియున్నాఁడు వెయ్యేల యెచ్చట నీలాటివిషయము చెప్పవలసి వచ్చినను గంభీరపదజాలముతోనే చెప్పియున్నాఁడు. సీతావిషయమున రాముఁ డన్నట్లే దమయంతియువయవవిషయమున నలుఁడే పలికినాఁడు మఱియు వాల్మీకి "దర్శయంతి శరన్నద్యః పులినాని శనైశ్శనైః నవసంగమసవ్రీడా జఘనానీవ యోషితః" ఇత్యాదిగా వర్ణించినాఁడు కాఁడా! "న్యస్య మంత్రిషు స రాజ్య మాదరా। దారరాధ మదనం ప్రియాసఖః" అనియు "దివానిశమ్" అనియుఁ బలికినాఁడు. నలునివంటి యుత్తమనాయకుఁడు పగలు రాత్రి లేకుండఁ దృతీయపురుషార్థమున మునిఁగి క్రీడాలంపటుఁడై రాజ్య మింటుకొలకు మంత్రుల కొప్పగించినాఁ డని వర్ణించినాఁ డని యాక్షేపము. అందు లంపటత్వ మేమున్నది. ఆయుత్సవదినములలో రాజకార్యములకు వ్యవహారపరిష్కరణభంగము వాటిల్లకుండ మంత్రుల కప్పగించి తాను గామోత్సవ వసంతోత్సవాదు లొనర్చుచు దమయంతితో నుచితకాలముల నానందమునం దేలుచుండె నని భావముకాని మఱియొకటి యెట్లగును? అట్లయినచోఁ గాల్యకృత్యములు తీర్చి మధ్యాహ్నము శివపూజయు, విష్ణ్వారాధనమును స్తోత్రములను జపించినాఁ డన్నవిషయములకు గతియేమి?

“యజ్వా భార్యా శ్రమేధాశ్రలింగాలింగి పరాంగతాం । దృష్ట్వాచష్ట నకర్తారం శ్రుతే ర్బ్రాడ సుపండితః।” అనువిషయము కావ్యమునందు వర్ణించి నాడు. ఇట్టివర్ణనము సెంతనిర్లజ్జుడు కాకపోయినం జేయునా యని యాక్షే పము. ఈవిషయము శ్రౌతవిషయము దీనిని జూచి నీచు లగుకల్యాను లాక్షే పించినారు, కాని, యిది యాక్షేపణవిషయము కాదని చెప్పుటకై చెప్పినాడు. ఇట్టిది వాల్మీకియుం గౌసల్యయెడల గంభీరముగాం జెప్పియే యున్నాడు. కావున నది యొకదోష మని యెంచుట భావ్యము కాదని నాయభిప్రాయము. ఇంకను గొన్నివిషయములు సాముద్రికశాస్త్రవిషయములు వర్ణించియున్నాడు ఆవిష యము- సీతాంగము తాళఫలసదృశ మని రాముడు పలికినచో నట్లే పలికి నాడు కాని కవి చెప్పినట్లు చెప్పలేదు. కాబట్టి వేదశాస్త్రార్థములం దెల్ల పుట కాతం డీవిధముగం గావ్య మొనర్చినాడు.

సంభోగశృంగారము వర్ణించి యున్నను, కరుణరసాదు లంగాంగికము లుగా నందంముం బొందుపర్చియే యున్నాడు.

శ్లో. మదేకపుత్త్రా జననీ జరాతురా। నవప్రసూతి ర్వరటా తపస్వినీ
గతి స్తయో రేష జన స్తమర్దయ। న్నహో విధే త్వాం కరుణా రుణద్ధినో
ముహూర్తమాత్రం భవనిందయా దయా। సఖాస్సఖాయ స్స్రవదశ్రవో మమ
నివృత్తి మేష్యంతి పరం దురుత్తర। స్త్వమేవ మాత స్సుతశోకసాగరః
మదర్థసందేశమృణాలమంథరః। ప్రియః కియద్దూర ఇతి త్వయోదితే
విలోకయంత్యా రుదతో థ పక్షిణః। ప్రియే స కీదృగ్భవితా తవక్షణః
కథం విధాత ర్మయి పాణిపంకజా। త్తవ ప్రియా శైత్యమృదుత్వశిల్పినః
వియోక్ష్యసే వల్లభయేతి నిర్గతా। లిపి ర్లలాటంతపనిష్ఠురాక్షరా
అపిస్వయూథ్యై రశనిక్షతోపమం। మమాద్యవృత్తాంత మిమం బతోదితా
ముఖాని లోలాక్షి దిశా మసంశయం। దశాపి శూన్యాని విలోకయిష్యసి
మమైవ శోకేన విదీర్ణవక్షసా। త్వయా విచిత్రాంగి విపద్యతే యది
తదస్మి దైవేన హతోపి హాహత। స్ఫుటం యతస్తే శిశవః పరాసవః
తవాపి హాహా విరహాత్క్షుధాకులాః। కులాయకూలేషు విలుఠ్య తేషు తే
చిరేణ లబ్ధా బహుభి ర్మనోరథై। ర్గతాః క్షణే నాస్ఫుటితేక్షణా మమ
సుతాః కమాహూయ చిరాయ చుంకృతై। ర్విధాయకం ప్రాణిముఖానికంప్రతి
కథాసు శిష్యధ్వ మితిప్రమీల్యస। స్రుతస్య సే కాద్భుబుధే నృపాశ్రుణః.

దీనికిఁ దెలుఁగు నాచప్పిడిమాటలతో వ్రాయుటకంటెఁ గవిసార్వభౌ ముని యాంధ్రీకరణపద్యములఁ బొందుపఱిచినఁ బాఠకుల కాహ్లాదముగా నుండు నని వాని నీక్రింద వ్రాయుచున్నాను.

సీ. తల్లి మదేకపుత్త్రిక పెద్ద కన్నులు గాన విప్పుడు మూఁడుకాళ్ళముసలి
ఇల్లాలు కడుసాధ్వి, యేమియు నెఱుఁగదు పరమపాతివ్రత్యభవ్యచరిత
వెనుకముందర లేరు నెవరైన మఱ్ఱాఁకు లేవడి యొంతేని జీవనంబు
గానక కన్నసంతానంబు శిశువులు జీవనస్థితి కేది తావలంబు
కృపఁ దలంపఁగదయ్య! యో నృపవరేణ్య!
యభయ మీవయ్య! యో తుహినాంశువంశ!
కావఁగదవయ్య! యర్థార్థికల్పశాఖి!
నిగ్రహింపకువయ్య! యో నిషధరాజ!

వ. అక్కటా! దైవంబ! నీకంటికిం బేఁగిజయుం బెద్దయయ్యెనే! జననీ! ముదిసి ముప్పుఁగాలంబున సుతశోకసాగరం బెబ్బంగి నీఁదఁగలదానవు? ప్రాణేశ్వరీ! యేచందంబున మద్విరహవేదనాదవానలంబునం దరికొనియె దవు? సఖులార! యేప్రకారంబునం బుటపాకప్రతీకాశంబైన కరుణరసం బునఁ బురపురం బొక్కెదరు? బిడ్డలార! యేలాగున నతిక్షుత్పిపాసాకులం బులై కులాయకూలంబులం గులగులం గూసెదరు? అని విలాపంబు సే యుచు దృగ్గోళకంబుల వేఁడికన్నీరు వెడల గోలుగోలున నేడ్చినం గృపా ళుండై యాభూపాలుండు హస్తపల్లవంబులు వదలి రాజహంసంబ! పొమ్ము సుఖం బుండు మని విడిచి పుచ్చె ననంతరంబ"—

ఈవిధమున మానవహృదయమును ద్రవింపఁజేయుచు విన్నంతమాత్ర మునఁ గన్నుల నీరు వచ్చునట్లు కరుణరసమును నెలకొల్పిన ప్రతిభాశాలి. ఉత్తరరామచరిత్రమున భవభూతి నెలకొల్పిన దానిని గూడ మించియున్నది.

స్వభావవర్ణనము.

శ్లో. అధునీత ఖగస్సనైకధా తను ముత్ఫుల్లతనూరుహీకృతామ్
కరయంత్రణదంతురాంతరే వ్యలిఖచ్చంచుపుటేన పక్షతీ.
అయ మేకతమేవ......స్ఖలనక్షణయేవ......నగరుదఁగ్నమూర్ధ్వమూర్గ్రీవః...
మనుజేతనుకంపునఃడితః...... అయమేకతటానీడజైః......ఉపడీనుకవై
కృతాక్షరగ్రహాజాదన్యనికస్వరస్వరైః.

సీ. చిక్కించికొని యున్న ఱెక్కమొత్తముతోడి యొడలుజాడించి నవ్వడివిసుర్పుఁ
జేదోయి యొత్తునఁ జేసి నెత్తురులైనయవయవంబుల నోర సవరఁ జేయుఁ
గుటిలచంచూపుటకోటికుట్టనములఁ దనుకీటములనిరోధంబు మాన్పుఁ
దాఁడను జుంజుఱుమేనిదుర్వికారంబునఁ బులుఁగుఁజుట్టాలఁ బిట్టులియఁ జేయు
నూర్మిపంక్తుల నుయ్యాల లూఁగియాడుఁ
దివ్రుటఁ దియ్యని తమ్మిపూఁదేనెఁ గ్రోలుఁ
బ్రమదమున వాచుఁదీఁగెజొంపములఁ దూఱు
నరుగుఁ గేళికులాయశుద్ధాంతములకు.

శ్లో. అథావలంబ్య క్షణ మేకపాదికాం। తదానిదద్రా వుపపల్వలం ఖగః
స తిర్యగావర్జితకంధర శ్శిరః। పిధాయ పక్షేణ రతిక్లమాలసః
సనాళ మాత్మానననిర్జిత ప్రభం। హ్రియా సతం కాంచనమంబుజన్మ కిమ్
అబుద్ధ తం విద్రుమదండమండితం। సపీత మంభః ప్రభుచామరంచ కిమ్.

సీ. విలుళితజంబాలపులినభాగమున నుద్దండపద్మాతపత్రంబునీడఁ
గమలకాండకఠోరకంటకాంకురపంక్తి నొయ్యనఁ గంధరం బొరసికొనుచు
నొంటికాలన నిల్చి యూర్మిమారుతములఁ జిఱుఱెక్కలతేఁకు లెగయుచుండ
నిరళమై పక్షతిద్వితయంబు వెసజాఱ జంచు లోకించు కాకుంచితముగ
వరుణరాజున కిడినచామరము వోలె, బాడవ్రు మిగిలిన పొందమ్మిపువ్వువోలె
నిబిడముద్రాభిముద్రితనేత్రమైన, రాజహంసంబుఁ గాంచె నారాజసుతుఁడు.

ఇంకను గలిపురుషభటాదిరూపవర్ణనాదులు స్వాభావికవర్ణనములు. రస విశేషములు మున్నగుగుణము లెన్నియేనిఁ గలవు.

చతుష్షష్టికళాభిజ్ఞుఁడైనంగాని సర్వజ్ఞుఁడు గాఁడు. అందుకనియే శంకరుని వంటి సన్న్యాసికూడఁ గామశాస్త్రమును నేర్చికొనెనని ప్రతీతి యున్నది. ఈకవియే కళాభిజ్ఞుఁ డనిపించుకొనుటకు మామిడితాండ్రతోనో పోఁకపాత్తులతోనో చెప్పులు కుట్టినాఁ డందురు. అందుకనియే కామశాస్త్రవిషయములు కూడ వివరముగాఁ జెప్పియుండును.

శ్రీనాథమహాకవీంద్రుఁడు దీని నాంధ్రీకరించుటలో "ఔచిత్యం బాదరించియు ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబునఁ జెప్పఁబడినది" అని వచించి యున్నాఁడు. అందుచే నచ్చటచ్చట ననివార్యముగ నొండురెం డనౌచిత్యము లున్నవనియే యెంచవలసియున్నది. కవిసార్వభౌముఁ డిట్లు

ప్రతిజ్ఞ చేసినను "యజ్వాభార్యా" అనుచోటఁ దెలిఁగించుటలో వికస్వరత్వాదులు చేర్చి తనబుఱుపు తీర్చికొన్నాఁడని యాక్షేపించినారు అది శ్రోతవిషయము. వాల్మీకి రామాయణమునందును శ్రీహర్షుఁ డిచ్చటను జెప్పియున్నారు. అందుచే దానిని సార్వభౌముఁడును నాంధ్రీకరించినాఁడు. ఆయాంధ్రీకరించుటలోఁ దేటమాటలతోఁ గాక గంభీరముగఁ జెప్పినాఁడు అనౌచిత్యములైన వానిని బరిహరించియే యున్నాఁడు చూడుఁడు.

"ప్రియాసు బాలాసు రతక్షమాసు చ । ద్విపత్రితం పల్లవితం చ బిభ్రతం
స్మరార్జితం రాగమహీరుహాంకురం । మిషేణ చంచ్వో శ్చరణద్వయస్య.

(ఆసన్నయౌవనలును, యువతులును నైనప్రియురాండ్ర విషయమున మన్మథుఁడు సంపాదించిన రాగమహీరుహాంకురము, ద్విపత్రితమును బల్లవితము నైనవిధమును జంచువును జరణద్వయమును నను మిషచే ధరించిన రాజహంసమును నాతఁడు చూచెను.) దీనిని శ్రీనాథుఁడు తెనిఁగింపలేదు.

దీనియందు ధ్వనితమైన విషయమును నింతకంటె విపులముగాఁ దనవిక్రమోర్వశీయమందుఁ గాళిదాసు వర్ణించియున్నాఁడు.

శ్లో. అగ్రే స్త్రీనఖపాటలం కురవకం శ్యామం ద్వయోర్భాగయోః
రక్తాశోక ముపోఢరాగసుభగం భేదోన్ముఖం తిష్ఠతి
ఈషద్బద్ధరజఃకణాగ్రకపిశా చూతే నవా మంజరీ
ముగ్ధత్వస్య చ యౌవనస్య చ సఖే! మధ్యే మధుశ్రీ స్థితా.

ఉ. క్రేవలఁ జామనై నడుమ స్త్రీనఖపాటలమయ్యె గోరటల్
కావిమెలర్చ నున్ముఖవికాసము లయ్యె నశోకముల్ రజో
ల్లావరణంబునం గపిశమయ్యె సమంజసచూతమంజరుల్
గావున బాలయుం బనుచుగా కలరుక్ మధులక్ష్మి నెచ్చెలీ. వ. సు.

శ్లో. శృణ్వన్ సదార స్తదుదారభావం హృష్య న్ముహుర్లోమపులోమజాయాః
పుణ్యేన నాలోకత నాకపాలః ప్రమోదనే త్రావృతనేత్రమాలః
సా పీవ్వరే శృణ్వతి తద్గుణౌఘాన్ ప్రసహ్య చేతో హరతోర్ధశంభుః
అభూ దపర్ణాంగుళిరుద్ధకర్ణా । కదా నకండూయనకైతవేన
అలంనజన్ ధర్మకథో విధాతా । రుణద్ధి మానస్య మిషేణ వాణీం
తత్కంఠ మాలింగ్య రసస్య తృప్తాం । న వేద తాం వేదజడ స్స వక్రాం
శ్రియ స్తదాలింగనభూ ర్నభూతా । వ్రతః క్షతిః కాపి పతివ్రతాయాః

నను స్తభూతాత్మతయా నభూతం । తద్భర్తు రీర్ష్యా కలుషాణునాపి
సంజ్ఞాప్యసస్వధ్వజభృత్యవర్గాన్ । దైత్యారి రత్యుజ్ఝితలాస్యనుత్యై
తత్సంకుచన్నాభిసరోజపీఠా । ద్ధాతుర్వ్యలజ్జం రమతే రమాయాం"

(ఇంద్రుఁడు శచీదేవితోఁ గూడియున్నప్పుడు నలుని యుదారభావమును విని యానందబాష్పావృతనేత్రసమూహము కలవాఁడై సకలతమున నలగుణశ్రవణముచేతనే రోమాంచము నొందినశచిని నామెభాగ్యవశమునఁ జూడలేదఁట. మనోహరమైన నలగుణపరంపరను శివుఁడు వినుచుండఁగా, నర్ధాంగియైన యుమ కర్ణ కండూత్యపనోదనమిషమునఁ గర్ణముల మూసికొన్నదఁట. బ్రహ్మదేవుఁడు ధర్మాసక్తుఁడై స్వభార్యయు వర్ణాత్మికయు నగువాణిని మౌనవ్రతమిషచే నిరోధించినాఁడు కాని వేదజడుఁడై నయతఁడు నలునికీర్తము నాలింగనము చేసికొని రసతృప్త యగుటను దెలిసికోలేదఁట—విష్ణువు తనధ్వజమైనగరుఁడునకు భృత్యులమైన (హంసలు) మమ్ము నలునిముఖపద్మవినుతికై వినియోగించి (మేమాతనిముఖసరోజమును నుతించుటచే లోకములోని కమలము లన్నియు మోము ముడుచుకొన్నవి.) తననాభికమలము ముడుచుకొని పోఁగా బ్రహ్మ దానియందుఁ దిరోహితుఁడైనాఁడని (సందుచూచుకొని) అతనిసమక్షమందే సిగ్గును వీడి లక్ష్మితోఁ గ్రీడించినాఁడఁట) పైశ్లోకములభావ మిది.

ఈశ్లోకములు కవిసార్వభౌముఁ డాంధ్రీకరింపలేదు. మూలములోని సొబగును దెచ్చిపెట్టినాఁడన్నసంగతి నే నిదివఱ కుదాహరించిన హంసవిలాపాదిపద్యములఁ జూడనగును. తాను శపథము చేసినట్లే యౌచిత్యమును గ్రహించి యనౌచిత్యమును బరిహరించియే యున్నాఁడు. కాని తనబులుపు తీర్చుకొనుటకుఁ గ్రొత్తయసభ్యవర్ణనములఁ జేర్చియుండలేదు. శ్రీనాథుఁ డన్నఁ బ్రతిమానవునకును లోకువ. లోకములో నెవ్వరేయసభ్యపదములతోఁ బద్యమల్లినను శ్రీనాథుని కంటఁగట్టుటకును, శ్రీనాథుఁడు జారుఁ డనిపలుకుటకును వెనుదీయరు. మఱియు నెవ్వరెట్టియసభ్యవర్ణనములు తమగ్రంథములలోఁ జొన్పినను వారిని జారు లనరు కాని యెక్కడనో యెవ్వరో చెప్పిన చాటువు లాతనికంటఁగట్టి యాతని శీలమును నిందింతురు. చూడుఁడు:- శ్రీహర్షుఁ డసభ్యవర్ణనములఁ జొన్ప వ్రాసినాఁడనువారు వానిచే నాతనిశీలమునకు లోపము చెప్పరు కాని యాతనిమూలమునే తెనిఁగించిన శ్రీనాథుఁడు మాత్ర మీవిషయమున బులుపు గలవాఁడఁట. దీని కేమి, దాని

కాతనిభక్తిరసప్రధానము లగు గ్రంథములే తార్కాణములు. మఱియు నెవ్వ రేమనుకొన్నను నాతఁ డెప్పుడు వినఁడు. విని జవాబు చెప్పువాఁడు లేనప్పు డెవ్వ రేమనుకొన్నను జెల్లును.

ఇంతకును గొన్నిలోపము లుండు ననుతలంపుతోనే దోషశాంతికై కాఁబోలు, ప్రాయశ్చిత్తముగా శ్రీహర్షుఁ డీవిధముగఁ జెప్పియున్నాఁడు.

శ్లో. పవిత్ర మత్రాతనుతే జగద్యుగే । స్మృతా రసక్షాళనయేవ యత్కథా
కథం న సా మద్గిర మావిలా మపి । స్వసేవినీ మేవ పవిత్రయిష్యతి.

ఇం “దావిలా మపి” అనుపదము చేత నదేదోషము కలుగు ననియే యతఁడు శంకించియుండును. అటులు శంకించుటచేతనే యిట్లు చెప్పికొని యుండును.

“నైషధం విద్వదౌషధమ్” అను నార్యోక్తి యూరక బయలుదేఱదు. ఇది యనేకశాస్త్రవిషయములను బోధించి విద్వాంసులకుఁ గూడ నప్పటప్పటికిఁ గలుగుమనోవ్యాధి (అజ్ఞానరూపమును) ని దొలఁగించుటకుఁ గేవలము మందువంటిదే. మహానుభావు లగువిద్వత్కవులభావముల రహస్యము సాధారణముగా నాబోటియల్పబుద్ధులకు గోచరము కాకపోవచ్చును. తెలియనప్పుడు గుణము దోషముగాను దోషము గుణముగాను గనఁబడును. లవణంబును గర్పూరంబును నొకేయాకారమం దున్నప్పుడు తెలిసినవారు తెలుపనప్పుడు తాను రుచిచూడలేనప్పు డేది లవణమో యేది కర్పూరమో తెలియక తాఱుమాఱుగ భావింప నగును. ఒకవేళ విశేషణగుణరాశిలో నొకదోష మున్నను దెలిసిన విజ్ఞులైన వారు దాని నభిధాపూర్వకముగాఁ జెప్పరు. అటుగాక మనవా రసహ్యమును గలిగించు గ్రామ్యపదములతో నాయాసందర్భముల నాక్షేపించియున్నారు.

ఇంక నెన్నియో గుణరత్నము లీప్రబంధమునం దున్నవి. వాని నెల్లఁ బరీక్షించి ప్రకాశింపఁజేయుటకు నాకువ్యవధియు శక్తియుఁ జాలవు. నే నొకప్పు డొకమాసము సెలవుమీఁద నున్నప్పుడు స్థాలీపులాకన్యాయముగా దీని జదివియున్నాను. అప్పు డీప్రబంధమే నాకుఁ గాలక్షేపము చేసినది. అప్పుడు —

మ. కలివిధ్వంసనకారణంబు విలసత్కల్యాణసంధాయి సౌ
ఖ్యలతాదోహద మైననైషధమహాకావ్యంబు వాదోడుగాఁ

దలిమంబందు శయించి రేవగలు సిద్ధాహ్లాస్యముం బొంది యుం
దలపన్ దుర్గదనీచపాలకకృతాత్యంతావమానక్రియల్.

అను పద్యమును గూడ రచించియున్నాను. అల్పుడనైన ప్రథమమహాకావ్యరచనాశక్తి యిదిగదా యని యూహించినాఁడను. నాయూహ సరి కాకపోవచ్చును. నాకుఁ దోఁచినయభిప్రాయము చప్పిడిమాటలతోఁ జెప్పినాఁడను. రుచిలేని మాటలతో సరియైనవి గాని యూహలతో నిండిన యీవ్యర్థోపన్యాసముచే మమ్ములను విసిగింపనేల యని శ్రోతాగ్రణులను పళపర్చుకొన్నట్లు మూఁడుభాషలను గరతలామలకము గావించుకొనియున్న త్రిమూర్త్యాత్మకు లగు విద్వత్ప్రకాండులు నాయందుఁ గినుకవహింపకుందురుగాక యని ప్రార్థించుచున్నాఁడను. వాఙ్మయవృక్షమునకుఁ బట్టినగ్రామ్యపుఁజీడను దులిపి సంకోచము నొందిన శబ్దపత్రముల నల్లపిల్లువట్లొనర్చుటకు విశ్వప్రయత్న మొనర్చిన శ్రీ జయంతి రామయ్యపంతులుగారిమూలముననే గదా యీవిద్వద్విజబృందము మావృక్షచ్ఛాయకుఁ జేరఁగలిగె నని సంతసించుచు నాయనకు సర్వేశ్వరుఁడు నిరామయాయుర్దాయ మొసఁగి రక్షించునుగాతమని ప్రార్థించుచు నింతటితో విరమించుచున్నాఁడను.

# ౧౨ స్వీకారము

(1) కొండపల్లిముట్టడి:—శ్రీ శేషాద్రిరమణకవులు రచియించిన చరిత్రాత్మకమగు నవల. ఏలూరు, వేంకటరామ్ అండుకో వారు ప్రకటించిరి వెల0 8-0. మ॥ రా॥ మద్దిరాల రామారావు బి. ఏ, యల్. టి., గారు దీనికి పీఠిక వ్రాసిరి. ఇందు పీఠికాకారులు "చరిత్రాధారములను జరిత్రదృష్టితో సమన్వయించి కథాకాలమునాటి పరిస్థితుల గమనించి జాతీయతాసూచకముగ వ్రాయబడిన యాఖ్యాయికలలో నీకొండపల్లిముట్టడి యొకటి. విజయనగరసామ్రాజ్య నిర్మాణమున త్యాగధనులగు రాయలు తిమ్మరుసు మాధవవర్మ లోనగు చారిత్రకపురుషులే కాక రామభద్రుడను లోనగు కవిరాజు లేవిధముగ సేవజేసినదియు గృహకార్యపరతంత్రలగు సుందరి మున్నగు విద్యాసుందరు లెట్లు పాటుపడినదియు నీపొత్తమున సమంజసముగా నభివర్ణింపబడియున్నది." అనియును,

"పదునాఱవశతాబ్దమున స్వాతంత్ర్యము యేతెఱగున రగుల్కొనినదనియుం ద్యాగమూర్తులు రాజ్యశుభార్థులై యందుకుమిక్కి యేవిధముగ నంతర్హితమైనది యీపొత్తమున మనోహరముగ వర్ణింపబడినది.........గ్రంథకర్తలు స్వయముగ పరిశోధనలు గావించుచు కథాస్థానములు స్వయముగా దర్శించినవారగుటచే నీపొత్తమునందలి కథాస్థానములు దృశ్యగ్రంథములందలి రంగస్థలములవలె హృదయరంజకముగానున్నవి" యనియు వ్రాసిరి. ఈమాటల చేతనే గ్రంథవిషయము స్పష్టము గుచున్నది.

(2) కలగూరగంప:—శతావధానులు తిరుపతి వేంకటేశ్వరకవులపుడపుడు సందర్భానుసారముగా రచియించిన పద్యములు "నానారాజసందర్శనము" వలెనే యొక్కచోట జేర్చి పుస్తకరూపమున, కాత్యాయనీగ్రంథమాల చతుర్థపుష్పముగా కాకినాడలో శ్రీయుత దివాకర్ల వేంకటావధానిగారును, తంగిరాల జగన్నాథశాస్త్రిగారును సంపాదించిరి. వెల చందాదారులకు రు 0-12 ఇతరులకు రు 0-14 ఇందు ఆదిశంకరులు, వివేకానందస్వామి, రవీంద్రనాథఠాకూరు, జర్మనీయుద్ధము, దాదాభాయినౌరోజీ, హంటరుదొర ప్రిన్సిపాలు, మల్లాదిసత్యలింగము, జిబ్బెరుదొర-యానాము, మొదలగువారి

మీాఁదఁ జెప్పఁబడిన పద్యములు, రసాభాసప్రహసనము, ఆంధ్రకవులు, అశ్వత్థస్తోత్రము మున్నగునవి గలవు.

ఈక్రింది యాఱు పుస్తకములు శ్రీకాకుళనివాసులు, హైస్కూలు తెలుఁగుపండితులు, శ్రీ దివ్యశాస్త్రి ఈశ్వర సత్యనారాయణశాస్త్రిగారిచే రచియింపఁబడి వారిచేతనే పంపఁబడినవి.

1. శ్రీకూర్మక్షేత్రమాహాత్మ్యము, కూర్మనాయకాష్టకమును. వెల రు 0-1-6. శ్రీకూర్మక్షేత్రమాహాత్మ్యము పద్యగద్యాత్మకమగు చిన్నపుస్తకము. అష్టకములోనియొక్క పద్యము:—

ఉ. పాపములూపుమాపి, యపవర్గము చేకుఱువారిఁ జూపి, సం
తాపము తొలఁ జోపి కుజనంబుల సంగతి దూలనాపి, నీ
రూపముఁ జిత్తవారిక సరోరుహమందున దాఁపి, ప్రేమనీ
పాపిని నన్నుఁ గావుము కృపారసవారిధి! కూర్మనాయకా.

ఇది శ్రీకాకుళము సి. యం. బి. స్కూలు హెడ్మాస్టరు మ. రా. ఎ. తవితయ్యనాయుఁడుగారివలన పారమార్థికోద్దేశముతోఁ బ్రకటింపఁబడినది.

2 శ్రీ అరసవిల్లిక్షేత్రమాహాత్మ్యము:—57 పుటల పద్యకావ్యము. ఈక్షేత్రమాహాత్మ్యము శ్రీబలరామక్షేత్రమాహాత్మ్యములోఁగలదు. గంజాము మండలములోని శ్రీకాకుళసమీపమునంగల అర్కోహరి, హర్షవల్లి, అరసవెల్లి, అరసవల్లి యను నామాంతరముల నొప్పుగ్రామములో వెలసిన సూర్యభగవానుని, ఆక్షేత్రమును గూర్చిన చరిత్రమిందుఁ గలదు. చాలఁ బురాతనక్షేత్రము. ఇందుఁ బంచప్రతిమలు గలవు. భాస్కరనక్షత్రమాల గలదు. ఒక్కపద్యము శైలికై—

మ. అనుడుం గోపపరీతుఁడై మఘవుఁ డుద్యద్వజ్ర సంధానముం
బొనరింపం గని మించి వచ్చెనని సంభూతక్రుధ న్నందియుం
గనుమీా వజ్రము గిజ్రమెవ్వరికి లక్ష్యంబల్ల యాత్సెక్కనో
యనుచున్ హుంకృతి సల్పుచుం బొడిచె వృత్రారి న్వడిన్ జెబ్బపై.

3. శిశువ్యాధులు:—(బిడ్డల అనారోగములు) వెల రు 1-0-0. ఇందు శిశువులకుఁగలుగు సమస్తరోగములకుఁ జికిత్సలు జెప్పఁబడినవి. త్రివిధబాలురు, స్తన్యాభావమందు మేకపాలు, అవుపాలు, దుష్టస్తన్యలక్షణములు, శిశు

వేదన నెఱుంగు నుపాయములు, దంతోత్పత్తికాలజములగు రోగములు, కా
య్యగండలు, నాభివ్రణము, దానికిఁ జికిత్స, గ్రహచిత్సలు, శాంతులు మున్న
గునవి విపులముగ వ్రాయఁబడినవి.

4 పుత్రవతీహితోపదేశము:—100 గీతములు. పిల్లలతల్లులకు హి
తోపదేశము. పిల్లల నెట్లు పోషింపవలయునో చక్కఁగఁ జెప్పఁబడినది. ఈ చిన్న
పుస్తకమును గోరువారి కుచితముగఁ బంపెదరు. మచ్చునకుఁ గొన్న—

ఉష్ణదేశస్థులము గాన నురక భ్రాంతి। పొంది దేశాంతరాచారములకు లోఁగి
చెడకు నీబిడ్డఁ జెఱుపకు శ్రేయమరసి। చెప్పువారెల్లవత్తురు చిన్నతల్లి!
నీకుబిడ్డకుఁ గాఫి తేనీళ్ళు మప్పి। బుద్ధిపూర్వకముగ రోగములను దెచ్చి
పెట్టకుము! యింతయేలయే వేఁడెదను। వినని చ్చోట యారోగ్యహానితల్లి
రొట్టెలుం బిస్కత్తులారోగ్య మొసఁగు। ననుట భ్రమము సుమ్ము యవి జీర్ణాశయమ్ము
రేఁగఁగాఁ జేసి జాఠరరోగములను। గలుగఁజేయును జంటిబిడ్డలకు దల్లి.
పెద్దలకె జీర్ణకోశమ్మురద్దు చేయు ఇత్యాది-

5. పండుగకట్నము- సుభద్ర- వెల 0—4—0 ఇది సోంపేట డిస్ట్రిక్టు మునసబుగానుండిన కీ. శే వేపా కృష్ణమూర్తిపంతులుగారి "పొంగల్ గిఫ్టు" అను నింగ్లీషుకథకుఁ దెనుఁగు- గీతపద్యములు. మచ్చునకు-

ధనముగల్గుటే సౌఖ్యమా ధనముగాదు, మనకుఁగల విత్తమే చాలుమా సుభద్ర
కెల్లసుఖములఁ గూర్పఁగా నింతె కాక, శ్రీధరుఁడు మనయల్లుఁడై చెంగ నేని
చేవ యెట్లగు? ననినంతఁ బెల్లుకినుక, తన్ను రేపఁగ నిది తమతప్పు గాదు
కుడువఁగూడును నుండఁగాఁ గొంకులేని, మేనయల్లుని పటుంబు నూఁకలుక
నెత్తుదిక్కు నగాదొకో నీటికంటె, ననుచుఁ గడవ్రేటు సతివేయఁగ నెయతండు
నెంతమాటాడినదియని చింతనొంది, యే మొకయుననుండె

6. ఆంధ్రీకృతశార్ఙ్గధరత్రిశతి:—౩౩౦ పద్యములు- రు 0—10—0

దేవరాజసూనుఁ డగు శార్ఙ్గధరుఁ డను వైద్యకంకితుఁడు సంస్కృతమున రచించినాఁడు. దానికిది యాంధ్రీకరణము. తెనిఁగింపఁబడిన యీ త్రిశతిని దమతండ్రిగారగు సీతారామశాస్త్రిగారి కంకితము చేసిరి. ఈపని చేయుటకై వీరిని మొదట భిషగ్రాజ పండిత మండలీక వేంకటేశ్వరరావుగారు ప్రోత్సహించిరఁట. పద్యములు నిరర్గళధారతో నొప్పుచున్నవి. వ్యర్థపదములు లేవు. సంస్కృతపరిచయము లేని తెనుఁగు వైద్యులిట్టి గ్రంథముల యాధారముం గొన్నచోఁ

జాల లో కోపకారముచే యొఁగలదు. మచ్చునకై కొన్ని భాగములు చూపఁ బడును.

సీ. అభ్యసించితిని వైద్యాగమంబున గల్గుకంటుపల్ నాతండ్రిగారికడను
త్రిదశభాషను నేర్చితిని పట్టమై భళ్ళయూడి శ్రీదక్షిణామూర్తి చెంతఁ
గవితారహస్యము ల్గాంచితిని జయంతి భావనారాయణపండితుకడ
(స్వవిషయము)

క. కన్నబిడ్డ తగతి బట్ట. గన్నాథుని గాంచి విద్యగఱపి భౌవి
ద్వన్నత! మాకుం బోలి న్ని, స్నెన్నికదా పిడపదేవు నెన్నుట...
(తండ్రిగారి వాత్సల్యము)

గీ. పెలికిఁజన్న్యయు లోపల వేఁడి తెప్పు, గనఁగ శ్వానము, దేహంబు గాల్చినట్లు
తాటయును నానవాళ్ళు లోనమరియుండు, నదిగడించు నంతర్దాహమనెడు సంజ్ఞ
(అంతర్దాహసన్నిపాతలక్షణము.)

చ. అసిశము వెల్లయుల్లి గొని యావులు నేతనో నూనెతోడనో
యిరఁ దగదయించు వేళ భుజియించినచో విషమజ్వరంబుఁ గ్ర
ఘుత్తరవాతదగ్గులఁ గ్రక్కున బాపి నరుల్ బలిష్ఠుఁగా
మనసిజరూపుగాఁ జేయు నమృతరసాయనమాత్ర దానికే.
లశునప్రయోగము.

ఇందనేకములు జ్వరాదులకు ప్రార్థనలు, దానములు, ప్రదక్షిణములు, అభిషేకములుం జెప్పఁబడినవి.

---

(౪) మాతృపూజ. (ప్రథమభాగము) రాజోలు బోర్డు హైస్కూలులోని యుపాధ్యాయులు శ్రీయుత గార్లంక వీరవేంకటసత్యనారాయణ బి. ఏ. ఎల్. టి గారిచే రచియింపఁబడినది. ఇందు "న మాతుః పరదైవతమ్" అను వార్యోక్తి ననుసరించి పదాఱు ప్రమాణములతో మాతృపూజ గావింపఁబడినది. మృదుమధుర గీతపద్యముల నీపూజ యిమిడినది. మచ్చునకై రెండు మూఁడు పద్యములు.

పూజనీయులలో నెల్ల పూజనీయుఁ, లెవరనియనంగ భగవంతు నెన్నితొలుతఁ
బిదపఁ దలిదండ్రులనుగాదె పేర్కొనంగ, వలయును కృతజ్ఞతగలట్టి వారికెలను
తల్లిదండ్రులజంటలోఁ దల్లి హెచ్చొ, తండ్రి హెచ్చో యటన్నమదిలి కొకద
"జనకునకు మాత దశగుణ"మని వచించు, స్మృతులవాక్యము సాత్యపద్ధతిదలంప
ప్రకటముగఁ దనయుత్తరరామచరిత, నాటకమున జాతూకర్ణి వాతిమున్నఁ
దల్లినొక్కానెనెస్మరించి తనరినట్టి, కవివరుని భావమిది గాకకలదె యొంతు.

(4) ధర్మపాలుఁడు—రెండుభాగములు. పిఠాపురము, ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల ౬౦-౬౧ పుష్పములు. రాఖాలదాస బంధోపాధ్యాయవిరచిత వంగభాషానవలను-డి సాహితీసమితిసభ్యులు శతావధానులు వేమల సత్యనారాయణకవిగారిచే నాంధ్రీకరింపఁబడినవి వెల భాగము 1 కి రు 1—8—0

(5) సంగీతపార్వతీపరిణయము;— సకలానందగ్రంథమాలిక 10 వ పుష్పము. బాణకవిసంస్కృతనాటకమునకు, శ్రీయుత సత్యవోలు రాధామాధవరావుగారు కావించిన తెనుఁగు. ఇందక్కడక్కడఁ గొన్నివృత్తములు రాగతాళయుక్తముగఁ బాటుట కుపయోగించునట్లు సంగీతస్వరములను గల్పించి చేర్చియుండుటచేతనే దీనికి సంగీత పార్వతీపరిణయ మనుపేరు పెట్టఁబడినది. భాషాంతరీకరణము ధారాళముగానున్నది.

ఉ. ఆదిని ప్రేమచేత నరుపై హరునింగన లోలమై మదో
న్మాదభరాతి ఘూర్ణితమునై పొగయున్నివ మీలితంబునై
సాదృశతన్ బతీక్షణలసద్గతి సంభ్రమమై శుభాప్తిమే
లీదగు పార్వతీపరిణయేక్షణ మెయ్యెడ మమ్ముబ్రోవుతన్.

ఉ. ముందుగ దక్షభూపతికి పుత్రికయై జనియించి యవ్వలిం
పొందఁగ శైలరాజునకుఁ బుట్టెను గౌరియనంగ నామె నా
నందముగా మహోత్సవమొనర్చుచునుండు మహేశుఁగూర్పఁగా
నందుల కేగుచుంటి దివిజావళికోర్కె ఫలింపఁజేయఁగన్.

(ఇది తెనుఁగుకూర్పు.)

శ్లో. జననితావక నామ వదామ్యహం, సతతసేవకరక్షణతత్పరే
భవతితే చరణం సతతం భజే,నిరుపమాన సుఖంకురు పార్వతి.

(సంస్కృతముకూర్పు.)

ఉత్సాహవృత్తము—హంసధ్వని.

భూరిలోకరక్షకులుగఁ బొల్చుమీకునెప్పుడీ,
తీరుగా పరస్పరంబు దివ్యరక్తి వెలయుతన్
గాగపాపనీనినినస గారిసాసనీపపా,
సానిపాగ పాపనీనిపాపగారి గాగసా
తారకాసురున్ హరింపదగిన శక్తియుక్తుఁడై,
మీరఁగలకుమారమౌళి మీకుఁ గల్గుఁగావుతన్.

(ఇది సంగీతముకూర్పు.)

దీని వెల రు 0-8-0 కావలసినవారికి, కవిగారియొద్ద, కొత్తపల్లిలో, (పిఠాపురం డివిజన్) దొరకును.

(౫) ఆంధ్రవీరశైవరు — ఇది యొక చిన్నకన్నడవ్యాసము. హైదరాబాదు నివాసులు ప్రస్తుతము శ్రీకాశిలోనున్న పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు వ్రాసినది. ఇం దాంధ్రులలోఁగల వీరశైవులనుగుఱించి విశేషముగ వ్రాయఁబడినది. జనాంగస్వరూపము, జంగములు, బలిజలు, శీలవంతులు, ఆరాధ్యులు, గానుగలవారు, స్థలపతిజంగములు, దేవాంగులు, కర్ణిభక్తులు, వీరముష్టులు, మాలజంగాలు, పండితులు, కవులు, మహాత్ములు, సంఘసంస్కారులు, మఠములు, కొలనుపాక, విశేషములు, ఉపసంహారమునను శీర్షికలక్రింద వారివారి విషయము చాలవ్రాయఁబడినది. వారివారి నివాసస్థలములు, వృత్తి, ఆచారవ్యవహారములు నిరూపింపఁబడినవి. "ఉన్నతిం బొందుచున్న కన్నడ వీరశైవులమైన మనము యోగ్యకర్తవ్యమును నిర్ణయించికొని గాఢనిద్రయందున్న సోదరాంధ్ర వీరశైవులను హెచ్చరించుకార్యమును నిశ్చయముగఁ గైకొందుమని నమ్ముచున్నాను...పాఠకమహాశయులారా! నేను అనుభవముగలమట్టుకు సామాన్యముగ ఆంధ్రవీరశైవులను దిగ్దర్శనముగఁ జూపియున్నాఁడను. పరిసరములలోని తక్కినవారినిగూర్చి వ్రాయలేదు." ఇత్యాదిగా నాంధ్రవీరశైవులంగూర్చి వ్రాసినారు. ఆంధ్రవీరశైవులంగూర్చి చాలవిమర్శనతో వ్రాసినారని చెప్పఁగలము. పూర్వాచారములు నవీనాచారములుం దెల్పిరి. దేవాంగులనుగూర్చి వ్రాయుచు, శైవ వైష్ణవ స్మార్తభేదములుగలవా రున్నా రని తెల్పుచు వారిలో విద్వాంసు లున్నారు, దేవాంగజ్యోతియను పత్త్రికయొక్కటి కొన్నినాళ్ళు ప్రకటింపఁబడినది, గంజాం, గోదావరి, కృష్ణా గుంటూరుమండలములలో వీరుముఖ్యనివాసముగా నున్నారనియు వీరివృత్తి నేఁతయనియు జెప్పిరి. కాని, "సంగీతసరస్వతి యనఁదగిన శ్రీత్యాగరాజు దేవాంగజాతికిఁ జేరినవారని ప్రతీతి. వీరి తెనుఁగుకృతులు, పదములు, దక్షిణభారతదేశమునందలి సంగీతవిద్వాంసులందఱు నవశ్యము నభ్యసించుచున్నారు." అని వ్రాసిరి. ఇది పొరపాటు. త్యాగరాజుగారు తంజావూరు సమీపమునందుగల పంచనదములో నుండెడు ములికినాటి స్మార్తబ్రాహ్మణుఁడు. ఆయన యన్నగారి మనుమ లిపుడున్నారు. ఆప్రతీతి వీరెక్కడ వినిరో తెలియదు.

బదులు వ్రాసితిని. శ్రీ తమ్మయ్యగారింకను దృష్టిచేసక విభవ సం॥ మార్గశీర్షపు ష్యముల పరిషత్పత్రికలో నొకవిపులమైన ఖండనమును బ్రకటించిరి. తొలు దొల్త మతిగోచరము లయినవిషయములతోఁ బీఠిక వ్రాసి ఖండనవ్యాసము ప్రకటింపఁబడినయనంతరము దానిని దగినప్రమాణములతో సమాధానకలుప విశేషాంశములను జేర్చితిని నేను. తొలుతనే తమకుఁదోఁచినయాక్షేపముల నెల్లఁ బ్రకటించి నాసమాధానము చూచినపిదపఁ బూర్వోక్తులతోడనే మరల నవతరించినవారు శ్రీ తమ్మయ్యగారు, కాఁబట్టి వారియీవ్రాఁతలకు సమాధానము వ్రాయ నక్కఱయే లేదు. కాని నాసేకరించిన కొన్నివాస్తవాంశములను బ్రకటించుటకును నింతతో నీవాదోపవాదముల ముగించుటకునే నా యీప్రస్తుతప్రయత్నమని సహృదయులు గ్రహింతురుగాక.

విమర్శకున కాధారములు స్వల్పముగానే లభించును. వాని నూఁతగాఁ గొని తనమనీషాబలమున నాతఁ డొకయపూర్వసిద్ధాంతమును బ్రకటించును. ఆధారములు బహుళముగా లభించునపుడు విమర్శనాపేక్ష లేక వాస్తవమే యెల్లరకు గోచరించునుగదా? విమర్శన మొకప్పుడు తప్పుత్రోవఁబడుటయు వేఱొకపుడు మంచిత్రోవను సాఁగుటయు విదితమే కదా? సుప్రసిద్ధవిమర్శకు లగు కీ. శే. గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారి కవిజీవితములనెల్ల రా. బ. కీ. శే. కం. వీరేశలింగము పంతులుగారు ఖండించిరికదా? శ్రీ వీరేశలింగముపంతులుగారిసిద్ధాంతముల నిప్పుడెందఱెన్నివిధముల ఖండించుచుండలేదు? నాచనసోమునివిషయమై శ్రీ నడకుదుటి వీరరాజుపంతులుగారును శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు నెట్లు భిన్నభిన్నమార్గములఁ ద్రొక్కుచున్నారో చూచితిరికదా? ఎప్పుడైనను దమతమమనీషావిశేషమునం జేసి విశేషాంశముల సాధించుట మాత్రమే విమర్శకుని పని గాని నిరాధారమైనను దనవాదమే నెగ్గవలె నని పెనఁగులాడుట యాతనికి సరికాదు. అభిమానగ్రస్తుఁడు మాత్ర మట్లు పెనఁగులాడకమానరు. శ్రీ తమ్మయ్యగారభిమానగ్రస్తులనుట వారివ్రాఁతలే సూచించుచున్నవి. అవతారికాభాగమునందలి యప్రౌఢపదబంధమును నత్యధికదోషములను జూచి బ్ర. శ్రీ. కుప్పుస్వామయ్యగారు బాల్యకవిత యనిరి. అందుఁ గవిసార్వభౌమబిరుదము పేర్కొనఁబడుటచే నవసానకవితయే యని శ్రీ వీరేశలింగముపంతులుగా రనిరి. మొదటివారు కవిసార్వభౌమబిరుదమును రెండవవారు దోషాధిక్యమును గణింపలే దనితో

లేక గ్రహింపవలె దనిరో చెప్పక తప్పదుగదా ? సుప్రసిద్ధులగువీరి యిరువుర ప్రమాదములను సవరింపఁదగినది నేను సూచించిన మూఁడవమార్గము దక్క వేఱు గానరాదు. కావుననే నేను మూఁడవమార్గమును బ్రకటించితిని. పైని జెప్పినయిరువురు గాక శ్రీ. వెం. లక్ష్మణరావుగారు, జయంతి రామయ్య పంతులుగారు మొదలగుపండితు లనేకులు నాపీఠికను జూచియుండిరి. ఎవ్వరును నావాదము నాక్షేపింపలేదు. నావాద మప్రమాణమే యైనచో నిందఱు మహాపండితు లుపేక్షింతురా ? యని నేను సంశయించుచున్నాఁడను. వాస్తవము పరమేశ్వరున కెఱుక.

ఇంతవఱ కీయవతారికాభాగము నాధారముగాఁ గొన్నవా రైదుగురు మాత్రమే. మొదటి శ్రీసుబ్బస్వామయ్య వీరేశలింగముపంతులుగార్ల వాదము సుందోపసుందన్యాయమున నిరుపయోగమై నామార్గమునకు బలము చేకూర్చినది. మూఁడవవా రగునడకుదుటి వీరరాజుపంతులుగా రేదో యొకప్రయోగమునకై దీనిని బ్రమాణముగా గ్రహించిరి. వారి కాప్రయోగప్రామాణ్యమే కావలసినది కాని యది శ్రీనాథరచిత మైనను గాకున్నను వారికిఁ బనిలేదు. కావున వా రది శ్రీనాథరచితమే యని నమ్ముట కాధారము లేదు. నాల్గవవా రగు బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రస్తావమున శ్రీనాథప్రణీతమే యని వ్రాసిరి. కాని వా రీవాదోపవాదములవిషయమై యేమియు నభిప్రాయము నీయలేదు. వారు నొకకార్యమునకే దీనిని గ్రహించిరి. ఇది శ్రీనాథరచితము గాకున్నను వారివ్రాఁతలకు హానిలేదు. కావున వారు దీనిని బరమప్రమాణముగా నంగీకరించి రన వీలులేదు. ఐదవవారు పరిశేషన్యాయమున శ్రీబండారు తమ్మయ్యగారు మాత్రమే. వారే యిది సర్వథా శ్రీనాథకృతి యని వాదించువారు. వారొక్కరే నావాదము నాక్షేపించుచున్నట్లు విదితము. శ్రీ తమ్మయ్యగారికి నాకు నేకాభిప్రాయము దుర్ఘటము. “స్థితస్య గతి శ్చింతనీయా” యనున్యాయమున నున్నతిప్పలతడికనే యూఁతగొనువారు వారు. మహాపండితు లిరువురభిన్నాభిప్రాయముల నూఁతగాఁ గొని నూతనమార్గమునఁ బోయినవాఁడను నేను. శ్రీతమ్మయ్యగారు తగినప్రమాణములఁ జూపిన నాయభిప్రాయము మార్చుకొనుటకు సిద్ధముగా నున్నవాఁడను నేను; నేనేమివ్రాసినను నేప్రమాణములఁ జూపినను దమపట్టు వీడనివారు శ్రీతమ్మయ్యగారు. కృతిపతిశాంతయ విషయమున నాకు ద్వేష లేశ

మేమి లేదని వ[illegible]సాలు [illegible] ప్ర[illegible] మాటివి. ఇప్పుడు నట్లే మనవిచేయుచున్నాను. నాకు [illegible] మీద ద్వేష ముండుటకు హేతు విసుమంతయుఁ గానరాదు. కాన నా వ్రాతలు ద్వేషపూరితములన వలనులేదు. శ్రీతమ్మయ్యగారన్నట్లు వీరశైవులు. [illegible] వీరశైవమతాధిపతిశిష్యుఁడు దానం జేసి వారి కాతనిమీద నభిమానముండుట తప్పి[illegible]. అభిమానము లేదని వ్రాయుట సుకరమే కాని యట్లు [illegible]భిమానత్వమును బ్రకటించుట దుష్కరమే కదా ? శ్రీనాథునకు లింగధారణాది శైవదీక్ష నొసంగుటకు శ్రీతమ్మయ్యగారు పడినపాటునుసమే వా[illegible]భిమానమునకు [illegible] క్షరలుగ జాలును. ఇట్టిమతాభిమాన[illegible]ద[illegible]భి[illegible] గారు[illegible] గారి[illegible] విట్లు లోకమును బ్రకాశింపఁజేయుట [illegible]

శ్రీతమ్మయ్యగారు వివాదాస్పద మగుటచే నతాంకారభాగము నాలంబించి తమకు గ్రంథాధారమే కలదనియు నేనే యితరాధారములఁ జూపవలసియున్న దనియు వ్రాయుట వారివాదధోరణిఁ జూపుచున్నది. పలువురకు భ్రమ ప్రమాదాదులఁ గల్పించిన వివాదాస్పద మగుతడికను సమర్థింప నదియే ప్రమాణ మగుట యీవాదమందెక్కడనెక్కడను గనము. ఇది శాస్త్రీయ వాదపద్ధతి కానేరదు. తమ్మయ్యగారి హితబోధ చాలవిచిత్రము. “స్థితస్య గతిశ్చింతనీయా” పెద్దలను గిరిశేషులను దూషింపరాదు” అనునది. ఎవరు పెద్దలను దూషించిరి? శేఖరులు వీరిమతమునఁ బెద్దలును గిరిశేషులును గారా ? వారికిమాత్ర మీపాతకమెట్లంటు[illegible]? నేనొక్కనికి[illegible]ముమును జేసితిని నేవీరనేకులు[illegible] జేయుచు[illegible]మాత్రము నాపైనే వేయుచున్నారు.

బ్రహ్మాండమంత సూతనాధారము నొకదాని నిప్పుడు చూపినారు శ్రీతమ్మయ్యగారు. భారతి మొదటిసంపుటము మూఁడవసంచిక ముప్పదియవ పుటలోని శాంతలింగముపిన[illegible]ను నే నుదాహరించితిని. నే నుదాహరించినది నాఁడు నేఁడు నట్లే భారతియందున్నది. అది యెట్టివిపరిణామము నొందలేదు. వలసినవారు చూడనగును. దానిని స్వవాదసమర్థనమున కవకర్షించిన తమ్మయ్యగారివింతచర్య [illegible] గమనింపఁదగును. శాంతలింగము విషయము మొఱుంగగోరి వారు శ్రీ [illegible] సో[illegible]శేఖరశర్మగారికి వ్రాసినారంట. కాన నప్రతిష్ఠాత శాంతయ్యకొడుకు లింగయ్య కాని శాంతయ్య కాఁడని వారుత్త

రించిరంట. కులక్రమము పరిశీలింప లేదంట. పరలు సంపాదించి పంపెద మని యింతవఱకుఁ బంపనే లేదంట. ఇంతవఱకుఁ గార్యాంతరప్రసక్తియే నంట. ఇది చిత్రము గాదా? ఇట్టిది వాస్తవము గా దని నే నన జాలను. అయినను స్పష్టమైన సంగతులనే ప్రకటించినఁ గొంత బాగుండు నని మనవి. శాంతయ్య కొడుకు లింగయ్య యనుశాస్త్రిగారి యప్రకటవాక్యమునకును ముద్రితమై ప్రకటితమైన శాంతలింగ మనుమాటకును బలాబలములు పాఠకులే నిర్ణయింతురుగాక.

సహృదయులు ముఖ్యముగా గమనింపవలసిన వీక్రిందిమూఁడుమాటలు:- శ్రీనాథుఁడు గ్రంథము నవసానకాలమున రచించి యేకిని కృతి యొసంగకుండనే పరమపద మొందఁగా జనకహీన యగు కృతికన్యక నప్రౌఢకవిచే నవతారికారచనపూర్వకముగాఁ దన కంటఁగట్టించుకొన్నాఁడు శాంతయ్య యని నావాదము. శ్రీనాథుఁడు శాంతయకుఁ గృతి యిచ్చినపిదపనే శివసాన్నిధ్య మొందె ననియుఁ దర్వాతఁ గొంతకాలమున కాయవతారికాభాగము గొంతకొంత నష్టముగాఁగా శాంతయ్యవంశములోనివారో వారి శిష్యకోటిలోనివారో దానిని బూరించిరో పూరింపించిరో యుందు రనియు నాపూరించినవా రించుక యప్రౌఢు లనియుఁ బైఁగా నిప్పటివఱకుఁ బ్రతులువ్రాసికొన్న లేఖకులవలనఁ దప్పు లధికముగాఁ దూఱిన వనియు శ్రీశమ్మయ్యగారి వాదము. నావాదము నిరాధార మనియు వారివాదము ప్రబలాధారవిశిష్టమనియుఁ గూడఁ దమ్మయ్యగారివ్రాఁత. సహృదయు లేది మంచి దని తోఁచిన దానినే గ్రహింతురుగాక. నావాదమునకు బాధకము లగు ప్రమాణము లధికముగ దొరకినపుడు నాయభిప్రాయమును వెంటనేమార్చుకొందునని నామనవి.

ఈకథకు మూల మేదియనునది వారివ్యాసమునందలి రెండవభాగము. నేను గాశీఖండమందలి గుణనిధి చరిత్రమే యంటిని. శంకరసంహితలో నీకథ యానుపూర్వికముగానే కలదని వారివాదము. నావాదమును నేను సమర్థించియే వ్రాసితిని. వారూహాగానము చేయుచున్నారు. శంకరసంహితను నేను జూచితిని. నాకీకథ యెందు నగపడలేదు. వాస్తవముగ నం దీకథ లేనే లేదు. శంకరసంహితలో నీకథ యున్నదన్నవా రెందున్నదో యెట్లున్నదో చూపుట విధిగదా? ఏది, యట్లు చూపరేల? వారికడ శంకరసంహిత లేదా? దానిని వారు పరిశీలింపలేదా? అం దీకథ లేదా? ఇం దేది లేదో, యన్నియు లేవో

వారుస్పష్టముగఁ జెప్పినఁ జిక్కొకింతదీఱును. మహాశైవులై శంకరసంహితలో నీ విషయము గలదని వాదించుచుఁ గూడ నావిషయమునఁగూడ నీతడికనే ప్రమాణముగాఁ జూపుట పాడియగునా? వీరు లెక్కలమీఁద లెక్కల గుణించి నావాదమును ద్రోసిపుచ్చుటకుఁ "దానసార్వభౌము"లను నొకపద్య ముదాహరించిరి. ఆపద్యమువలన నావాదమునకు బాధ యేమియు లేదు. దానిశైలి యప్రౌఢమై యశ్రీనాథీయమే యని రుజువు చేసికొనుచున్నది. అందలి "సదా" అవ్యయమా? శివునకు విశేషణమా? శివరాత్రి యనుప్రసిద్ధి గన్నపర్వమునకు సదాశివరాత్రి యని వ్యవహార మెందేని కలదా? "దోషావహ్నాతిక్రమంబు" ఏసమాసము? అర్థ మేమి? శ్రీతమ్మయ్యగారు దేనికైనను నిందే ప్రమాణములఁ జూపుట నేనవి యెల్లఁగా దనుట పరిపాటియైనది. అవతారికయం దీశానసంహితయని యుండ నిందు శంకరసంహిత యని కలదు. ఈశానశంకరపదములు పర్యాయవాచకములే యైనను సుప్రసిద్ధ మగు శంకరసంహితయం దీకథ లేమింజేసి యీపద్య మనర్థకముగా నున్నది.

మూఁడవభాగ ముపలబ్ధగ్రంథసమగ్రతాసమగ్రతలం గూర్చినది. తొలుదొల్త నీగ్రంథము పరిషత్పత్త్రికలోఁ బ్రకటింపఁబడునపుడు గ్రంథ మసమగ్ర మనియు నొక్కయాశ్వాసగ్రంథ ముండవలయు ననియు నేనే పత్త్రికాముఖమునఁ బ్రకటించియుంటిని. ఎంతకాలమునకు నావిషయ మించుకయు నుపలబ్ధము గాకుండుటచే నాయభిప్రాయమును బీఠికారచనావసరమున మార్చుకొంటిని. మార్చుకొనుటకుఁ దగినహేతువు లుండుటచేతనే మార్చుకొంటిని. ఆహేతువులను బ్రకటించియే యుంటిని. శ్రీతమ్మయ్యగారిపట్టునఁ గూడ నూహాగానమునే యాలాపించుచున్నారు, గాని, ప్రమాణములఁ జూపఁజాలకున్నారు. ఆశ్వాసాంతపద్యములే శ్రీనాథునివి కావనుచున్నపుడు వానితరువాతిగద్యములు శ్రీనాథునివని నన్ను నమ్మించుట సరసమేనా? కావున నీ విషయమునఁగూడఁ దమ్మయ్యగారు చరితార్థులు కా లేదని మనవి

విమర్శకులు గావింపవలసినది యుపలబ్ధము లగు నాధారములతోఁ దమకు నమ్మిక గలిగిన మార్గమును లోకమున వెల్లడిసేయుట గాని పరమతఖండనమును బరదూషణమును మాత్రమే కాదు. పరమతమునందు దోషము లుండి వానిని ఖండింపఁదగిన ప్రమాణములు దనకు లభించినపు డావని మం

చిచే. ఏయాధారములు లేక గగనారవిందమున కాశించుటదగదు. కేవలహఠశఠవాదములకే పూనినచో నెవ్వరును వెనుదీయురు? ఒకవేళఁ దనవాదము దప్పైనచోఁ బ్రబలప్రమాణముల కాతఁడు బద్ధుఁడై యే యుండును. సత్యము గోచరించినపుడు దనవాదమును మార్చుకొనుట యాతనికి విధియే యగుచు. శ్రీతమ్మయ్యగారీవఱకుఁ గావించిన విమర్శనమున నాయభిప్రాయము మార్చుకొనఁదగిన హేతువు లేవియు సూచించియుండలేదు. ఈవిషయమై యింక వారితో నేవిధమగు వాదమును జేయఁజాలను. నాకుఁ గావలసినది సత్యనిర్ధారణము. దానికై నాకిపుడు లభించిన ప్రమాణముల నీక్రిందను దాహరించెదను. నా సేకరించిన ప్రమాణములవలన నావాదము ప్రమాణమును శ్రీతమ్మయ్యగారి వాదమప్రమాణము నైనది. అయినను శ్రీతమ్మయ్యగారు కేవల నిరాధారముగ వ్యక్తిందలకును నపసిద్ధాంతప్రకటనమునకును గడంగుటచే వారి యుక్తుల ఖండించుటకు మాత్రమే యింత వ్రాయవలసి వచ్చినది.

ఈగ్రంథమునకు మూలము శంకరసంహిత కాదు. ఈశానసంహితయే. ఆనామముతోడనే యది యిపుడుపలబ్ధమయినది. దానియం దీకథామూలము నూఱుశ్లోకములు మాత్రమే కలవు. దిఙ్మాత్రముగ నున్నకథను విపులముగాఁ బెంచి వ్రాసినాఁడు. వర్ణనాంశముల నవేలముగాఁ గాదంబరినుండి యాంధ్రీకరించినాఁడు. ఇంకనొక్కయాశ్వాసము గ్రంథముండవలసినట్లే మూలమువలనఁ గూడఁ దోఁచుచున్నది. ప్రకృతగ్రంథమువలన నట్లు దోఁచుటచే నేను దొలుత నసమగ్రమనియే ప్రకటించియు బహుకాలమువఱకు నావిషయమించుకయుఁ దెలియరాకుండుటయు సమగ్రమే యనుటకు నూహములుఁ బ్రేరించుటయుఁ గారణములుగ నాపూర్వాభిప్రాయమును మార్చికొంటిని. ఇపుడు సత్యము గోచరించుటచేఁ బూర్వాభిప్రాయమునకే తిరిగి వచ్చినందులకు సహృదయులు మన్నింపవేఁడెదను. మూలము నాలోచించిన నొక్కయాశ్వాసముండవలయు నని తెలియుచున్నది. ఇంతవఱకును నీగ్రంథమునకుఁ బ్రత్యంతరము గాని లుప్తమగు నాశ్వాసము గాని లభింపలేదు. ఎవ్వరికిని గోచరము గాలేదు. ఆచివరిభాగము నాతఁడు రచింపకయే కాలగతి నొందెనో రచించినను నాభాగమే కాలగర్భమున లీనమయ్యెనో నిర్ణయింప ననువుగాదు. అచిరకాలమున నాగ్రంథముగూడ లభించి యాంధ్రమహాజనుల నానంద

పీఠికలం దెల్పుటగాక యానిపరమేశ్వరు వేడుచున్నాఁడను. మద్గురువర్యులగు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చెన్నపురినుండి ది 15-2-28 తేదీని నాకీవిషయమై యుత్తరము వ్రాయుచు నందీవిషయమై యిట్లు వ్రాసిరి. “శివరాత్రిమాహాత్మ్యమును సంస్కృత ఈశానసంహితాంతర్గతమును చదివితిని. 100 శ్లోకములకు గ్రంథము నిప్పుడు లబ్ధమయినంత గ్రంథముగా బెంచినాఁడు. ఇంక నొక్కయాశ్వాసము గ్రంథ ముండవలెను. మీద శివరాత్రిమాహాత్మ్యప్రతిపాదకవిషయములు ప్రధానముగా నున్నవి. తెలుగుపుస్తకము సంస్కృతముతో జతగూర్చి చదివి నోట్సు వ్రాసినాను. మీ రీతూరి వచ్చినపుడు చూపెదను.”

సహృదయపాఠకులారా! ఈశివరాత్రిమాహాత్మ్యమును గూర్చి యిది వఱకుఁ బెద్దపెద్ద చర్చలు సాగినవి. కాని వానివలన నిసుమంతయు వాస్తవము గోచరింపక కాలహరణమే ఫల మైనది. ఇప్పటి నా వ్రాఁతవలన నించుక ఫల ముండునేమో యని యూహించుచున్నాఁడను. *ఏమైనను మంచి ప్రమాణములు లభించినదాక నింక నీవిషయమై యెవ్వరును వ్యర్థకాలయాపనమును గావింప రని నమ్ముచు నీవిషయమున కింతటితో స్వస్తి చెప్పుచున్నాఁడను.

*ఈవాక్యమునే నేనును మరలఁ బలుకుచున్నాను.— ప॥ అ

# సంస్కృతదూతకావ్యోత్పత్తివికాసములు.

యీయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు,
ఆంధ్రగీర్వాణసాహిత్యపరిషత్తు-విజయనగరము.
(గతసంచికావశేషము.)

---

శ్లో. ఆశ్చర్యాణా మతిశయవతాం జన్మభూమి స్త్రిలోక్యాం
ఖ్యాతః శ్వేతచ్ఛదతటగిరా సౌమ్య తే గమ్యదేశః
కామ స్వాత్మాభిమతఘటనాసాహసత్యక్తమూర్తేః
ప్రీత్యా నిత్యం నివసతి పురే యత్ర శైలేన్ద్రకన్యా.

ఉపసంహారశ్లోకము:—

శ్లో. విశ్లేషార్తాం మమసహచరీ మిత్థమాశ్వాస్య యుక్త్యా
పశ్చా దచ్ఛాశయపరివత భ్రాతరాశా మభీష్టామ్
స్మర్తవ్యోఽహం ప్రియసఖపున స్తత్ర తత్రాన్తరేతే
మాభూ త్కాన్తావిరహఘటనా కిఞ్చ జన్మాన్తరేఽపి.*

* XXXII మానససందేశము—: 25. స్వర్గీయ శ్రీమ ద్వింజమూరి వీరరాఘవాచార్యరచితము. ఆంధ్రగీర్వాణముల నీయన ప్రచండకవికోవిదులు; బహుగ్రంథనిర్మాతలు 'భరతాభ్యుదయ' ప్రబన్ధనిర్మాతలు, నాంధ్రగీర్వాణ పండితకవిచక్రచూడామణులు, విద్యా నభినవపండితరాయబిరుదభూషితులు నగుస్వర్గీయ శ్రీమన్మాడభూషి వేంకటాచార్యులవారును వీరును గలసి విద్యావినోదములఁ జాల్గొనుచుండెడివా రఁట. వీరరాఘవాచార్యులవారి యితర గ్రన్థములలో నాకుఁ బ్రస్తుతము జ్ఞాపకమున్నవి. 1. భ్రమరగీతాతత్త్వసారము. 2. శ్రీమద్వేదాంతదేశికచరిత్ర.

'మానససందేశము,' రాయబహదూరు, ఆనరబుల్, విద్యావినోద బిరుదవిరాజితు లగుశ్రీమత్పనప్పాకం అనంతాచార్యుల (C. I. E.) వారి యాజ్ఞచే రచింపఁబడినట్టులు ముద్రితగ్రన్థమునఁ గలదు. ఈకావ్యము మన్దాక్రాన్తావృత్తమయము. ఇందు రెండుసర్గలు గలవు. అందు I. సర్గలో 51 ను II సర్గలో 58 శ్లోకములు గలవు. ఇందలి యితివృత్తముంగూర్చి కవియే 'గ్రన్థారంభము'నకు ముం దిట్టులు నుడివియున్నాఁడు:—

శ్లో. జ్ఞానీ జడభరతాఖ్యో భగవద్ధ్యానార్థినాం స్తుతిం వ్యాకార్షీత్
క్రియతే మయాద్య 'మానససన్దేశా'ఖ్యేన కావ్యరూపేణ.'

---

25.. చెన్నపురీ 'వైజయంతీముద్రాక్షరశాలా' ముద్రితము. 1902.

జ్ఞాని యగుజడభరతకృత మగు [illegible] ధ్యానాత్మిక మగుస్తుతియే యీ కావ్యబీజము. ఇందలి శ్లోకరత్నములు [illegible] విమర్శకులచే పలవట్టికపై బరీక్షింపఁబడుఁగాక.

1. శ్లో. కశ్చిద్యోగా ధ్ధరిణశిశునా పోషితే నాంబుమధ్యా
దానీతేన ప్రచలితమనా లాలితే నాంకమధ్యే
భూతశ్చక్రే పులహమునినా ధిష్ఠితేషు స్వవాసం
యోగీశేన ప్రథితతపసా పావనే ష్వాశ్రమేషు. I స. 1 శ్లో.

2. శ్లో. తస్మిన్ స్థానే సమృగకలినా భ్రామ్యమాణో మహాన్తం
భ్రష్టః కాలం విషయరుచినా మానసే నాత్మయోగాత్
నీత్వా ధృత్వా పతితసులభం జన్మ సారంగయోనా
పశ్చా దార్తో భవ దతితరాం జ్ఞానయోగప్రణాశాత్. ౨

3. శ్లో. జాతం వంశే విధివిరచితే వేదనేత్రాత్మకానాం
తత్త్వానాం త్వాం ప్రథమగణితం వేద్మి సర్వేంద్రియాణాం
తేనార్థిత్వాం త్వయివిధివశా న్నష్టభక్తి ర్గతో౽హం
యాచ్ఞా మోఘా నభవతి సతా మగ్రతోహి ప్రభూణాం. ౬

4. శ్లో. జ్యోతిష్మంతం నిబిడరుచయో నిర్మలం నిత్యశోభాః
భక్త్యున్మేషం నిరతభజనాః కాంచనం కాంచనాఢ్యాః
చిత్రీభూతం నవమణిచితా భాస్వరం భాస్వరాభాః
ప్రాసాదాస్త్వాం గుణసమతయా మిత్ర మానన్దయన్తి. II. స. 1. శ్లో.

ఫలశ్రుతిః.

5. శ్లో. యోగో భక్తి ర్ద్వయ మపి ముదా దర్శితం యఃపరేణ్వా
సాక్షాద్భూతం భరతమునినా మానసప్రేషణేన
విష్ణౌ భక్తిః పరమపరమే శాశ్వతీ సన్నిధత్తే
జన్మారణ్యాతుతి రపి భవే న్నిర్భరానన్దహేతుః. II స. 58 శ్లో.

శ్లో. ప్లవసంవత్సరే శాకే వేదనేత్రగజేన్దుకే
కృతం కావ్య మిదం దివ్యం వీరరాఘవసూరిణా.

"శ్రీమ త్కౌశికగోత్రపవిత్ర శ్రీ శ్రీనివాసాచార్యవర్యపుత్త్ర శ్రీమ ద్రామానుజాచార్యగురువర్యపదాంబుజాసక్తచిత్త సచ్ఛాత్ర వింజమూరి వీరరాఘవాచార్యరచిత మగు 'మానససన్దేశము' సమాప్తము."

చమత్కృతియుతములు, సుప్రచురము నగు మనోవిషయకశ్లోకరత్నము స్మృతిపథమున లభించుచున్నది.

"శ్లో. నపుంసక మితి జ్ఞాత్వా ప్రియాయై ప్రేషితం మనః
తత్తు తత్రైవ రమతే హతాః పాణినినా వయమ్"

మనస్సు నపుంసక(నపుంసకలింగ)మని పాణిన్యాచార్యులు చెప్పుటచే దానిని నా ప్రియురాలికొఱకుఁ బంపితిని. ఆమనస్సు అక్కడనే రమించుచున్నది, పాణిని మాకొంపతీసె నని భావము.*

*XXXIII మానససన్దేశము:—26 (దీనికి గురుస్తవ మనియు నామాన్తరము.) స్వర్గీయ మహామహోపాధ్యాయ యమ్ లక్ష్మణసూరికృతము. వీరు బహుగ్రన్థనిర్మాతలు వీరిజీవితమును గుఱించియుఁ, దన్నిర్మితగ్రన్థముల గూర్చియు ముమ్ముందు వివరింపఁబోవు "విప్రసన్దేశ"మను వ్యాసభాగమునఁ జూడ నగు. 'మానససందేశము'న నితివృత్తము శ్రీశంకరాచార్యులవారి శ్రీశాలివాటీపురయాత్రోత్సవవర్ణనము. "పరమహంసపరివ్రాజకాచార్యజగద్గురుశృఙ్గగిరిమఠాధీశ్వర శ్రీమదభినవసచ్చిదానన్దనృసింహభారతీంద్రాభిధాన శ్రీశఙ్కరాచార్యస్వామినా శ్రీశాలివాటీపురం ప్రతి యాత్రోత్సవవర్ణనమ్.*

*XXXIV మారుతసందేశము:—27 కవినామము మృగ్యము. ప్రియుఁడు ప్రియురాలికి మారుతమును దూతగాఁ బంపుట యిట నుపవర్ణింపఁబడి యున్నది.

చెన్నపురిప్రాచ్యలిఖితగ్రంథాలయపట్టిక ('A Triennial Catalogue of Manuscripts' collected during 1919—'22. Vol. iv. part i. Skt, Page 4300; R. N. 2964 )లో నుల్లేఖింపఁబడిన 'మారుతసందేశ' శ్లోకముల నిట నుట్టంకించెద.

1. "శ్లో. ఆనన్దాఢ్యా సహ దయితయా కో౽పి ఖేలద్విలాసీ
హర్మ్యే రమ్యే సురభిసమయే మన్మథాజ్ఞానువర్తీ
ఈర్ష్యావేగా దివ కుచతటా త్తూర్ణ మాకృష్య తస్యాః
నిన్యే దూరం కనకకటకం నామ శైలం నియత్యా. ౧

26. Catalogue of Sanskrit works of M. Lakshmanasuri. (attached to his 'Bhishmavijaya')

27. 'A Triennial Catalogue of Mss'—1919-22. Vol. iv, part i. Skt. R. No. 2964.

5. శ్లో. తత్పూర్వాంత ర్జ్ఝటితివిరహః కాన్తయా సమ్ప్రయాత
స్తస్మి న్వాస న్నికటతరువృతే సఞ్చర న్నద్రికుఞ్జే
భూయస్సా సా కబళితధృతి శ్చిన్తయా క్లాన్తచేతాః
మన్దం వాన్తం మలయమరుతం చైత్ర మిత్రం దదర్శ. ౫

6. శ్లో. గన్తవ్యా నో వసతి రముతో మన్నియోగం వినా తే
కార్యార్థై ర్వ స్థితి రపి సఖే యావ దేష్యా మ్యహం త్వామ్
తుభ్యం భద్రం భవతు కృతి నే మాత్ర తే ద్వాపరోఽభూ
దిత్యాభాష్య త్రిదివవసతి ర్యాం దివఞ్చోత్పపాత. ౬

7. శ్లో. యాతవ్యా తే పునరిహ పురీ కామదత్తాభిధానా
సాధత్తానాం భువనవిదితా వాసభూమి ర్నృపాణాం
యస్యాం ప్రీత్యా హిమగిరిసుతాపూర్ణవామాఙ్గభాగో
నిత్యం దేవ స్త్రిపురవిజయీ విశ్వనాథాఖ్యయాస్తే. ౭

కావ్యోపసంహారము:—

8. శ్లో. ఆనన్దో త్థా నథ కజలయన్ శీతలా నశ్రుబిన్దూ
న్నవ్యస్మిత్యా సురభిలతనుః స్మేరవక్త్రానవాయాః
కామాన్వృచ్ఛ్య త్వమ పి విచర స్వేచ్ఛయా దేవలోకాన్
భూయ శ్చాయుం జన మనుగృహా ణాత్మసౌభాగ్యలక్ష్మ్యా. ౮

XXXV మేఘదూత :—[28]. కాళిదాసకవికులగురుకృతము.

సకలదూతకావ్యనిర్మాతలకు నుపజీవ్యమైన కాళిదాసకవిచక్రచూడామణికృత 'మేఘదూత' మన్నిదూతకావ్యములయందుఁ బ్రాచీనతమ మనుట

---

28 విశేషాఖండమునను, భారతవర్షమున నీకావ్యము బహువారము విద్వద్వతంసులచేఁ బ్రచురింపఁబడెను. ముద్రితపరిశ్కృతప్రతులలో నీక్రిందిప్రతులను త్తమములు (i) క. బి. పాఠకసంపాదితప్రతి. ('Oriental Book Supplying, Ageney, Poona. 1916.) (ii) హుల్ట్ష్‌పండితునిప్రతి. (Dr. Hultzsch; 'Royal Asiatic Society,' London, 1911.) (iii) మోరేశ్వరరామచంద్రకాళేపండితుని ప్రతి. (M. R. Kale, B. A., 2nd edition, 1926; Published by P. S. Rege, Esq., at Khanderao Buliding Khota's Wadi, Girgaum, Bombay.) (iv) స్వర్గీయమహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రి మహోదయులు 1902 లో సర్వోత్కృష్టాంధ్రటీకా వ్యాఖ్యాపదప్రయోజనాన్వితముగఁ గలారత్నాకర ముద్రణాలయమునుండి ప్రచురించినప్రతి, చెన్నపురి. నిఖిలలోకమునానందార్ణవమున దోలాయమానముగావించిన యీసర్వోత్కృష్టకావ్యమున

నుస్ఫుటము. కాళిదాసనిర్మిత మగు 'మేఘదూత'మను దివ్యభవనముమీఁదనే తక్కినదూతకావ్యశిల్పులు వివిధకవిత్వచిత్రముల రచించిరి. మేఘదూత మూలమునఁ గాళిదాసప్రసాదిత మగుకవితాకనకముతోడనే తక్కినదూతకావ్యకవిశిల్పులు తమతమయుపజ్ఞానుగుణముగ వివిధము లగుచిత్రవిచిత్రకావ్యాభరణముల రచించిరి. ప్రసన్నకవితాకౌశలముచేతను, భావభాషాసమావేశనైపుణ్యముచేత నీకావ్యరాజము సురభారతీకవితాసామ్రాజ్యమున కధీశ్వరత్వము వహించుచున్న దని ఘంటాఘోషమునఁ జెప్పవచ్చును.

ఒకానొకయక్షుఁడు స్వకార్యాకరణదోషముచే నొకవత్సరము నిజకాంతావిరహ మనుభవించునట్టులు శపింపఁబడి రామగిర్యాశ్రమమునఁ గాలయాపన మొనర్చుచుండెను. ఆషాఢప్రథమదివసమున నీతఁ డతిమాత్రకామోన్మత్తుఁడై చేతనాచేతనజ్ఞానవిహీనుఁడై యలకానగరిలోఁ బ్రియపునస్సమాగమలాభ మెన్నఁ డెన్నఁ డని దివసగణనాతత్పరమై విరహవేదనం గుందుచున్న తనప్రాణప్రియసవిధమునకు దూతగా వెడలు మని యాచ్ఞాదైన్యమును వహించి మేఘు నభ్యర్థించెను. ఈయితివృత్తబీజమే కాళిదాసునికవితాదోహద

---

కేఁబడివ్యాఖ్య లున్నవని Aufrecht పండితుఁడు "Catalogus Catalogorum" అను "లిఖితగ్రంథప్రణాళిక" లో వ్రాసియున్నాఁడు. అందుఁ గొన్నిమాత్రమే ముద్రింపఁబడి యున్నవి. వల్లభదేవుని వ్యాఖ్య "హాల్ట్జ్" ప్రచురించినప్రతిలో ముద్రితము. దక్షిణావర్తనాథుని "ప్రదీపము" అనంతశయనగీర్వాణగ్రంథావళిలో స్వర్గీయమహామహోపాధ్యాయ, మహామహోధ్యాపకగణపతిశాస్త్రి మహోదయునిచేఁ బ్రచురింపఁబడెను. పూర్ణసరస్వతికృత "విద్యుల్లత" స్వర్గత ఆర్. వి. కృష్ణమాచార్య విద్వద్వర్యునిచే "శ్రీవాణీవిలాసగ్రంథావళి" నెం 15—శ్రీరంగము. 1909, లోఁ బ్రకాశితము. మల్లినాథుని "సంజీవిని" బహువిద్వజ్జనానుమోదమువడసిన దగుటచే ననేకప్రతులలోఁ బ్రకటింపఁబడినది. అందు కే. బి. పాఠక (Prof. K. B. Pathak) పండితుని ప్రతి ప్రశస్తము. "మేఘసందేశ" విమర్శగ్రంథములలో నింకెంటిని పేర్కొనవలసియున్నది 1. నిశితధిషణాధురంధరుఁడును, ప్రౌఢపాండితీవల్లభుఁడు నగు "రావుబహాదూర్" ప్రొఫెసర్ మాలూరు రంగాచార్యమహోదయుని "మేఘసందేశరసాస్వాదనము" (A critical Appreciation of Kalidasa's Meghasandesa P. 103 A Lecture delivered by Rao Bahadur Prof. M. Rangacharya, M. A., Prof. of Sanskrit and Comparative Philology, Presidency College, Madras. Printed at the Brahmavadin Press,- Madras for the 'Sanskrit Association' of the Presidency College, 5th December 1910) 2. ఆర్. వి. కృష్ణమాచార్యవర్యుని (M. A.,) "మేఘసందేశవిమర్శనము" (కావ్యవిమర్శినీగ్రన్థావళి) ఈవిమర్శము గీర్వాణభాషలో వ్రాయఁబడియున్నది. శ్రీవాణీవిలాసముద్రాలయము. శ్రీరంగము

ప్రభావముచే నసదృశకావ్యకల్పకమై విరాజిల్లెను. జనానుమోదకముపడసిన యన్నికావ్యములవలెనే "మేఘదూత"యుఁ బ్రక్షిప్తములచేఁ బుష్టినొందినది. వల్లభదేవుని వ్యాఖ్య ననుసరించి హుల్ట్ష్ (Dr. Hultzsch) పండితుఁడు 'మేఘదూత'లోఁ గాళిదాసనిర్మితశ్లోకములు 111 మాత్రమే యని నిర్ధారించెను. కె. బి. పాఠకపండితుఁడు "పార్శ్వాభ్యుదయము" ననుసరించి, కాళిదాసీయశ్లోకములు, 'మేఘదూత'లోనివి, 121 యని నిర్ణయించెను. దక్షిణావర్తనాథుని "ప్రదీపవ్యాఖ్య" వలన నిందలి కాళిదాస శ్లోకములు 110 యనియు, మహామహోపాధ్యాయులును, వ్యాఖ్యాతృసార్వభౌముఁడు నగుమల్లినాథసూరి "సంజీవినీ" వ్యాఖ్యమువలన 118 శ్లోకములనియు, బూర్ణసరస్వతికృత "విద్యుల్లత" వలన 110 శ్లోకములనియుఁ దెలియుచున్నది.

* కాళిదాసునకును నితరకవులకును గలతారతమ్యము "శబ్దమందేమి యర్థమందేమి, రసమందేమి, త్రిభువనవిధాతృఘటనిర్మాతృతారతమ్యము వంటిదే * * * * * * కాళిదాసునికవనము ధ్వనిప్రధానము; బహిరన్తఃస్ఫురద్రసము, కవనమునకెల్ల, అందునుం బ్రధానముగా శృంగారకవనమునకు పరవడి. ఇతనికవనము నందనోద్యానముగా నుండిన, ప్రాయికముగా నితరులది సాధారణోద్యానంబుగా నుండును. ఈయనసూక్ష్మముగా సూచించినవిషయములను వానియవాంతరభేదముల నితరకవులు విస్తరింతురు. ఈయన వ్యంగ్యమర్యాదగాఁ జెప్పినవిషయములను ఇతరులు లక్ష్యవాచ్యభంగులం బ్రకటింతురు. ఈయన యుపమాప్రధానుండునుం గదా. "ఉపమా కాళిదాసస్య" అనుసూక్తి సార్వలౌకికము.

"ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమికాభేదాన్
రఞ్జయతి కావ్యరఙ్గే నృత్యన్తీ తద్విదాం చేతః."

...ఉపమా సైవోక్తిభఙ్గీభేదే నానేకాలంకారభావం భజతే...తదిదం చిత్రం విశ్వం బ్రహ్మజ్ఞానాది వోపమాజ్ఞానాత్ జ్ఞాతం భవతీత్యాదా నిరూప్యతే నిఖిలభేదసహితా సా' అని "చిత్రమీమాంసా" కారుల యనుశాసనము. దానింబట్టి పరికింపఁ గాళిదాసుఁ డుపమయం దద్వితీయుం డగుట నలంకారమందెల్ల నట్టివాఁడే. దానంజేసి కవనమాత్రమందే యద్వితీయుఁ డని యేర్పడుచున్నది. ఇతని ప్రతిభావిశేషమును, అలంకారములచేతను, అనన్యసామాన్యలోకస్వభావవ్యవహారాభిజ్ఞతను, ఇతరకవి నాదలభ్యవస్తుస్వరూపవర్ణనలచేత

ను లోకోత్తరార్థాంతరన్యాసాదులచేతను, ఆత్మసంస్కారోత్కర్షను ఉదాత్తవస్తురచనలచేతను వివేకు లెఱుంగుదురు... * * * * * అమోఘవర్షమహీనాథునిగురువు జైనమహాకవి జినసేనుఁడు మేఘసందేశము నావేష్టించి "పార్శ్వాభ్యుదయ" మను మహాకావ్యమును రచించినందునను, భవభూతి "(29)మాలతీమాధవము"లో నవమాంకములోఁ గతిపయశ్లోకములలో లఘువుగా "మేఘసందేశము" ననుకరించుటచేతను, బిల్హణకవి "విక్రమాఙ్కదేవచరితము"న XIII సర్గలో వర్షర్తువర్ణనలో కాళిదాస "మేఘసందేశము"ను తద్దయుఁ బఠితలతలంపునకుం దెచ్చుటచేతను, ఈవలివిద్వాంసులు పలువురు ఇంచుమించుగా మేఘానువాదముగా, అనేకులు వృత్తము నయితము మార్పక "ఉద్ధవసందేశము" "ఉద్ధవదూతము" "హంససం" హంసదూ" "పదాంకదూ" అను గ్రంథములను మేఘప్రకారముననే రచించుటచేతను, మేఘసందేశప్రభావము తెల్లమగుచున్నది. ఈతనిగ్రంథములపై విద్వాంసులచే వ్రాయఁబడిన వ్యాఖ్యల బహుత్వముచేతఁ గూడ వానియుత్కర్ష తెలియుచున్నది... ............కావ్యములలో "మేఘసందేశము" నకు సాటి రాఁగలవి "సౌందర్యలహరి (శంకరభగవత్పూజ్యపాదనిర్మితము,) "అమరుకము" ఇట్టివి, ఒకటిరెండు దక్క మఱి లేవు. "మేఘసందేశము" లోకములోని శృంగారప్రబన్ధసర్వస్వమునకుఁ బ్రభవమయిన యూటబుగ్గ యనం జెల్లును." (30.)

కాళిదాసుని "మేఘసన్దేశము" కవివృత్తాన్తాత్మక మని (Auto-biographical) కతిపయవిమర్శకచూడామణుల యాశయము. శ్రీయుత పండిత అఖిలచన్ద్రిచటర్జీ మహోదయులు స్వవిరచిత మగు "కాళిదాసకవితాశేముషీవిచారము"న నిట్లువ్రాసియున్నారు.

" According to Dr. Bhan Daji, the argument of the Meghaduta is nothing but a faithful picture of the poet's own feelings caused by separation from his dear wife and home. Dr. Bhan Daji, however, appears to have pushed the analogy too far. Like the Sonnets of Shakespeare, the poem may possibly have some auto-biographical significance, and may be taken 'to express the poet's own feelings in his own person.' In fact although the poet has tried his best to keep his own personality in the back-

29 "కచ్చిత్సౌమ్యే"త్యాది; "దైవాత్పశ్యేర్జగ"తీత్యాది.

30 శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి మేఘసందేశపీఠికనుండి 5—9 పు.

ground, still he has at times unconsciously betrayed himself in the exuberance of his emotion; and the deep under-current of pathos, which runs through Yaksha's address to the cloud, seems to bear every mark of being the expression of a real sentiment."(31)

'మేఘసందేశ' మ'ను నీకావ్యనామము గూడ వి-

విపులవ్యాఖ్యార్థమై విరాజిల్లుచున్నది. కాళీదాసునకు స్వనామమే యీకావ్యనామమును స్ఫురింపఁజేసియుండు నని యఖిలచంద్రచటర్జీపండితుని యభిప్రాయము. ఏలనఁ, 'గాళీ'శబ్దమునకు మేఘమాల(నవాంబుదశ్రేణి)యనునర్థము నిఘంటుసిద్ధము. నైఘంటుకప్రమాణముం జూపెద:—'శ్లో. కాళీ నవాంబుదశ్రేణ్యాం భవానీమాతృభేదయోః' —నానార్థరత్నమాల. II కాం. 407 శ్లో. 84 పు. ఈపదము నీయర్థమునఁ 'గాళీ'దాసుఁడు ప్రయోగించియున్నాఁడనిచటర్జీపండితుఁ డీశ్లోకము నుల్లేఖించెను.

శ్లో. తాసాంచ పశ్చాత్కనకప్రభాణాం 'కాళీ'కపాలాభరణా చకాసే
బలాకినీనీలపయోదరాజీ దూరం పురః క్షిప్తశతహ్రదేవ.' కుమా VII

కాని యీవిషయములు విమర్శనీయములు. కాళిదాసుని మేఘదూతనామాలచూడము కరించిన నీకావ్యము కవివృత్తాంతాత్మకమనియు యక్షుడు కాళీదాసుఁడనియుఁ దత్పత్ని కాళీదాసప్రాణప్రియ యనియుఁ దప్పకతోఁచును.

"శ్లో. కాళిదాసగిరాం సారం కాళిదాస స్సరస్వతీ
చతుర్ముఖోఽథవా సాక్షా ద్విదు ర్నాన్యేతు మాదృశాః"

అని పదవాక్యప్రమాణపారావారపారీణ, మహామహోపాధ్యాయ, వ్యాఖ్యాతృసార్వభౌమమల్లినాథసూరి కాళిదాసకవితాకౌశలముంగూర్చి వల్లియుండ, 'మాఘే మేఘే గతం వయః' అను తదీయసూక్తి చొప్పున నాతని వయస్సు నెల్ల నాక్రమించిన యీమేఘసందేశరసాస్వాదనావసరమునఁ గించి

[illegible]

31. From Prof. Akhil Chandra Chatterji's (M. A., B. L.,) 'Kalidasa, His Poetry and Mind.' pp. 6—237. Printed by Nrisimha Prasad Bose at the 'Kohinoor Printing Works,' 154, Cornwalli's St., Calcutta and published by S. K. Lahiri & Co., 54, College St., Calcutta. 1910.

కాళిదాసుని 'కున్తలేశ్వరదౌత్యముం'గూర్చి మున్ముందు వ్రాసెదను. దీనిం గూర్చి "భారతి" [Vol. VII. No. i; జనవరి 1930]లో నేను వ్రాసిన వ్యాసముం జూచునది.

ఆంధ్రీకృతమేఘసందేశములు.

మేఘసందేశాంధ్రీకర్తల నామముల నుదాహరించెద. ప్రకృతము స్ఫురించినవానిలోఁ,(i) గొట్టికలపూడి వేంకటకృష్ణసోమయాజి, 32. (క్రీ. శ. 1790) కృతాంధ్రీకరణము ప్రాచీనతమము. (ii) స్వర్గత మహామహోపాధ్యాయక కల్లూరి వేంకటరామశాస్త్రిగారు గూడ దీని నాంధ్రీకరించిరి. (iii) వసురాయకవీంద్రులు గూడ దీని (క్రీ. శ. 1884) నాంధ్రీకరించిరి. (iv) కవిరాజు వత్సవాయి నీలాద్రిరాజుగారు కూడ దీనిం దెనిఁగించిరి. (v) లోకనాథకవి యనువాఁడు గూడఁ దీని నాంధ్రీకరించెను. [పైగ్రంథములలో ii—v వఱకు రాజమహేంద్రవరమునందలి 'గౌతమీగ్రంథాలయము'నఁ గలవు.] ఇంకను (vi) త్రిపురాన సూర్యప్రసాదరాయకవి సీసపద్యాత్మకముగా దీనిం దెనిఁగించె నని విని యున్నాను. (vii) మామిత్రు లగువజ్ఝల జగన్నాథకవి (B. A.) గూడ నీనడుమ నీకావ్యము నాంధ్రీకరించె నని వింటిని. (viii) నెల్లూరు 'వేంకటగిరి రాజావారి కళాశాలాంగ్లేయోపన్యాసకు లగు శ్రీగుఱ్ఱము వేంకటసుబ్బరామయ్యగారు కూడ దీని నాంధ్రీకరించి ప్రచురించినట్లులు "భారతి'లోఁ [7 సం. 2 సం. ఫిబ్రేవరి 1930; 347 పు.] జూచియున్నాను. ఇంకను మాస్మృతిపథగతములుగాని యాంధ్రీకృతులు పెక్కులు గల వనియే మాసమ్మతము. వీని నన్నిటిం గూర్చి కాలాంతరమున విపులముగ మనవిచేసికొందును*.

మేఘదూతయందలి శ్లోకరత్నములు రసికనికషోపలమునఁ బరీక్షింపఁబడినవియే గానఁ జూపలేదు.

XXXVI మేఘదూతః—33. మన్త్రివిక్రమనిర్మితము.

XXXVII మేఘదూతసమస్యాలేఖః— 34. మేఘవిజయవిరచితము.

ఇతఁడు కావ్యవ్యాకరణన్యాయజ్యోతిషగ్రంథము లనేకములు రచించెను. ఇతని "హైమకౌముది"యే భట్టోజీదీక్షితుని "సిద్ధాంతకౌముది"కి

32 "ఆంధ్రకవులచరిత్రము" III భాగము, 214 పు—1911.

33. "జైనగ్రంథమాల." (జైనశ్వేతాంబరసమితి, బొంబాయి, 332 పు.)

34. 'ఆత్మానందగ్రంథమాల' 24వసంఖ్య; ప్రకాశకుఁడు, వల్లభదాసత్రిభువనదాసగాంధి, జైనాత్మానందసభ, భావనగరము; 1914.

నాదర్శగ్రంథ మని కొందఱు పండితు లభిప్రాయము. (35) "హైమకౌముదీ" రచనము, వి. శ. 1725 (క్రీ. శ. 1669)లోఁ బూర్తియైనది. "మేఘదూతసమస్యాలేఖ"లోఁ గవి తనమతాచార్యుఁడగు విజయప్రభసూరియొద్దకు మేఘుని దూతగాఁ బంపుట వర్ణితము. ఈ కావ్యము, వి. శ. 1727 (క్రీ శ. 1671) సంవత్సరమునఁ బూర్తిచేయఁబడెను. ఇది విజయదేవగురుస్తోత్రాత్మకము. (36) కాళిదాసీయ 'మేఘదూత' యందలి తురీయపాదములను సమస్యగాఁ దీసి కొని యీకావ్యము రచింపఁబడిన దని తన్నామమే తెలుపుచున్నది. ఈకృతి చమత్కృతి జినసేనుని "పార్శ్వాభ్యుదయము"లోను, బూర్వోల్లిఖితము లగు (XIII) చేతోదూత, (XVI) నేమిదూతలయందును, ముఖ్యముగ నుదాహరింపఁబోవు 'శీలదూత' యందును జూపఁబడినది.

XXXVIII. *యక్షోల్లాసము:—37. శ్రీశిష్టుకృష్ణమూర్తిశాస్త్రికృతము. 'అభినవకాళిదాసబిరుదసముజ్జ్వలస్ఫూర్తి' యగుసీకృష్ణమూర్తికవి వైదికబ్రాహ్మణుఁడు; 'ఆపస్తంబసూత్రుఁడు; వాసిష్ఠగోత్రుఁడు; ఈయనతండ్రి సర్వశాస్త్రి, తల్లి లక్ష్మీదేవి. ఈశేషు పీసింధువు క్రీ. శ. 1790—1800 సం॥ ప్రాంతముల నవతరించె నని శ్రీవీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు. ('ఆంధ్రకవులచరిత్ర' III భా. 229 పు; 1911 క్రీ. శ.) ఆంధ్రగీర్వాణములయందుఁ గూలంకషపైదుష్యము, దీనికి ననురూపముగ జితజాహ్నవీఝరియగుకవితాధార, దీనినిమించిన సంగీతసంపద కృష్ణమూర్తి శాస్త్రివర్యునకుఁ బెట్టనిభూషణము లు. ఈయన క్రీ. శ. 1870 ప్రాంతములఁ గథాశేషుఁ డయ్యెను. సంస్కృతమున నీయన 1. యక్షోల్లాస మనుకావ్యమును, 2. 'వల్లవీపల్లవోల్లాసము,' 3. 'మదనాభ్యుదయ(38)ము'నను భాణములను, 4 రామాయణకథను జెప్పు 'కంకణబంధమును', 5. 'హరికారికల'ను, 6. 'నీలశైలనాథీయము'ను, ఆంధ్రమున 1. 'సర్వకామదాపరిణయము'ను, 2. వేంకటాచలమాహాత్మ్యమును, 3. పిఠాపురణ్యమాహాత్మ్యమును, 4. పంచతంత్రమును, 5. వసుచరిత్రవ్యాఖ్యానమును రచించెను.

---

(35) Dr. Belvelkar's "Systems of Sanskrit Grammar."—P. 79.

(36) 'మేఘదూత సమస్యాలేఖ' V. స 131 శ్లో.

37. "A Triennial catalogue of Manuscripts" collected for the Madras Oriental M. S. S. Library, during 1913— 14, to 1915—'16. Vol. II Part I, Skt. C. Page 2066; R. No. 1466 (b).

38. I bid. Page 2073; R. No. 1467.

యక్షోల్లాసము కాళిదాసమేఘదూతకుఁ బ్రతిధ్వనివంటిది. ఈకావ్యము సర్గద్వయాత్మకము. విరహావిధురుఁడగునొకానొకరసికుఁడు తః ప్రాణప్రియకు మేఘునిద్వారమునఁ బ్రణయసందేశము నంపుట యిందలి యితివృత్తము. చెన్నపురప్రాచ్యలిఖితగ్రంథాలయపట్టికనుండి యీకావ్యశ్లోకముల నుల్లేఖించెద.

శ్లో. యక్షస్సైవం విరహవివరం యాచతో వాచమస్య
శ్రావంశ్రావం క్రమహృతిమతి ర్ద్రవతో దేవతాత్మా
సానుక్రోశ స్సరది సఘన స్సమ్యగాలోచ్య కార్యం
నిర్యాయాగా న్నిజపథగతో మారుత ప్రేరితోఽగాత్.

2 శ్లో. స్వాజ్ఞాసజ్జ క్షణపరిచితభ్రమ్యుదీరాగ్రనేమిః
స్థానే స్వర్ణధ్వజయుజి దివిద్యోమయానప్రతానే
సద్యః ప్రోద్యత్స్తనితముఖరో విద్యుదుద్యోతికక్షో
దుర్లక్ష్యోఽభూ దపినిపుణధీ స్సర్గిణాం స్వర్గిణాం సః.

* * * *

3. శ్లో. విద్యుత్వాన వ్యనుచరమరు త్ప్రేర్యమాణోఽర్యమాధ్వ
ప్రత్యాఖ్యాన ప్రథిమభవనీభూతభూజాగ్రకూటమ్
స్వస్త్రీవీక్షాక్షణవినయిషాస్పదన స్సద్ధఘోటం
క్రీడత్ఖేటం పునరపి కృతీప్రాప తం చిత్రకూటమ్.

4. శ్లో. కాళిందత్తాధికతమధియః కాళిదాసస్య వాక్యే
శ్లాఘాపాత్రే సకలవిదుషాం మేఘసన్దేశకావ్యే
కర్తుః స్ఫూర్తే స్సరసవచసః కృష్ణమూర్తే రిహాభూత్
యక్షోల్లాసాహ్వయయుజికృతా వాదిమ స్సర్గవేషః.

గద్యము:—ఇతి శ్రీమద్వాసిష్ఠగోత్రస్య శిష్టకులపవిత్రస్య సర్వశాస్త్రిపుత్రస్య సకలకవికులమిత్రస్య శ్రీమదభినవకాళిదాసబిరుదసముజ్జ్వలత్ స్ఫూర్తేః కృష్ణమూర్తేః కృతౌ యక్షోల్లాసే మహాకావ్యే ప్రథమస్సర్గః సంపూర్ణః.

ఉపసంహారము:—

5. శ్లో. ఏవం దైవా త్పునరధిగతా మాప్సితార్థాఽపి(థ)పూర్ణాం
పూర్వాతీతప్రచురవిభవాభోగినీం భోగలక్ష్మీమ్

పథ్యాసాకం చిరమనుభవన్ యా(వా)సవ(శ్రీ) స్తథాసః
ప్రాసాదం స్వం సురగిరిసదృ గ్భాసమాసాద్య రేజే.

XXXIX. రథాఙ్గదూత:—39. కోరాడరామచంద్రకవికృత మగు నాంధ్రవచనకావ్యము 'రథాంగదూత' మొకటి కలదు.

XL. * రామసన్దేశము:—40 శ్రీరాజరాజేశ్వరపూజ్యచరణరచితము.

XLI. లక్ష్మీకటాక్షదూత:—41

XLII. వాతదూత:—42 కృష్ణనాథన్యాయపఞ్చానన ప్రణీతము. ఈ యుత్తమకావ్యావతంసమున లంకాలంకారభూత యగుజానకి శ్రీరామునియొద్దకు 'వాయువు' ను దూతగాఁ బంపుట వర్ణింపఁబడెను. ఇదిశతశ్లోకాత్మకము. కవితామాధురీధురీణం బగునీకావ్యమందారమునందలి రెండురెండు శ్లోకామృతబిందువులు రసికరసనాతర్పణము నొనర్చుఁగాక.

1. "శ్లో. సీతా భీతా సుచిరవిరహాజ్జచ్ఛతోఽరణ్యభూమిం
భర్తుః సాధ్వీవ్రతమనుసృతా పఞ్చవట్యా వనస్థా
జహ్రే లఙ్కాం ప్రకృతిసుభగా రావణే నాత్మభూమిం
చేతో యస్మా త్త్రసతి నితరాం హాతదే వాపతే క్షిప్. 1

2 శ్లో. త్వయ్యాసన్నే ప్రణయిని వనే ష్విఙ్గదీస్నేహవద్భి
ర్యాధమ్మిల్లే తనురపిగురా నిర్మితే కేశపాశైః
నోపైక్షిష్ట స్రగుపరచనాం నామ సైవాధునాల్పామ్
వేణీమేకాం కలయతి సదా శైలవ ద్భారభూతామ్. 76

టీకానిర్మాణకాలము:—"సప్తాష్టసప్తశుభ్రాంశుప్రమాణే శకహాయనే
ఆషాఢశుక్లః సప్తమ్యాం టీకేయం పూర్ణతాం గతా."

---

39. 'జైనమేఘదూత' పీఠిక. 10 పు.

40. శ్రీకృష్ణముద్రణాలయమున ముద్రింపఁబడి, పవనజీగురురావుగారిచే శ్రీమధ్వసిద్ధాన్త గ్రన్థాలయపక్షమున, ఉడిపిలోఁ బ్రకటింపఁబడెను. 1917.

41. సంస్కృతసాహిత్యపరిషత్ పత్త్రిక, VIII సంపుటము, 10 సం॥ 380 పు.

42. కలకత్తాలోని "నూతనవాల్మీకిముద్రణాలయము"న శ్రీకన్దర్పచరణపాలునిచే ముద్రింపఁబడి శ్రీభువనచంద్రబసక్ పండితునిచేఁ బ్రచురింపఁబడెను. 1888 సం॥ 2+8+70 పుటలు. టీకాసాకము.

XLIII విప్రసందేశము 48 :—* మ. మ. యస్. లక్ష్మణసూరి నిర్మితము. ఈకవికోవిదుని జీవితము సంగ్రహముగ, ఛాయాచిత్రాన్వితముగ భారతి [V సంపుటము, 6 వ సంచిక- 994 వ పుట; జూన్ 1928] లోఁ బ్రచురింపఁబడినది. ఈవిద్వత్కవి తిరునల్వేలిజిల్లాలోని 'పూనల్ వేలి' గ్రామములో క్రీ. శ. 1859 వ సంవత్సరమున నవతరించెను. వీరు 1896 లో, తంజావూరు కళాశాలయందు గీర్వాణాచార్యులుగ నుండి, తరువాత 1907—20, వఱకు మద్రాసునందలి పచ్చయప్పకళాశాలలోఁ బండితులుగ నుండిరి. వీరు బహుగ్రంథనిర్మాతలు. 1906 లోఁ బ్రకటింపఁబడిన శ్రీభీష్మవిజయ మనువీరిగద్యకావ్యము చివరఁ దన్నిర్మితగ్రంథపట్టిక యొసఁగఁబడినది. అందు నప్పటికిఁ దద్రచితము లగుగ్రంథములు 39 అని యు నందులో 21 ముద్రితము లనియు వ్రాయఁబడియె. వీరిగ్రంథములలోఁ గొన్ని విదేశభాషలలోనికి ననూదితములైన వఁట. వీరికి 1911 సం॥ లో 'దర్బార్ సర్టిఫికేట్ ఆఫ్ ఆనర్స్'ను, 1917 లో 'మహామహోపాధ్యాయ' బిరుదము నొసఁగఁబడినవి. వీరిగ్రంథములలో ముఖ్యములైనవానిం బేర్కొనియెద.

i. 'అద్వైతదర్శనగ్రంథావళి' లోని 'మాండుక్యోపనిషత్కారిక.'

ii. 'పద్యకావ్యావళి' లోని 'విప్రసందేశము,' 'మానససందేశము,' 'శ్రీకృష్ణలీలామృత' మనుమహాకావ్యము.

iii. 'గద్యకావ్యావళి'లో 'భారతసంగ్రహము,' ' విజయము' 'విదురచరితము'

iv. 'వ్యాఖ్యాగ్రంథావళిలో' (a) 'ఆకరము'ను 'ననర్ఘరాఘవ'వ్యాఖ్య.

(b) 'సరళ'యను 'నుత్తరరామచరిత'వ్యాఖ్య.

(c) 'ఉజ్జ్వల'మను 'మహావీరచరిత'వ్యాఖ్య.

(d) 'చూడామణి' యను 'వేణీసంహార'వ్యాఖ్య

(e) 'తత్త్వాలోకము'ను 'బాలరామాయణ' నాటకవ్యాఖ్య

(f) 'పరిమళ' మను (మదననిర్మిత) 'పారిజాతమంజరి'వ్యాఖ్య

ఈనవీనమల్లినాథుఁడు 1928 సం॥లోఁ గీర్తిశేషుఁడయ్యెను. రుక్మిణి తన్ను గ్రహింపు మని (పరిగ్రహింపు మని) తనహృదయేశ్వరుఁ డగుశ్రీకృష్ణుని సన్నిధికి నొకవృద్ధవిప్రుని సందేశహరునిగాఁ బంపుట 'విప్రసందేశము' నందలి

48. తంజావూరు 'పూర్ణచంద్రోదయ'ముద్రాశాలలో ముద్రితము. 30 పుటలు; 1906 సం॥

కథాబీజము. ఈకథ భాగవతములోఁ గూడ [10 స్కం. 52 అ.] నభివర్ణింపఁ బడియున్నది. ఈకావ్యము, పూర్వభాగము (53శ్లో) ఉత్తరభాగము (55 శ్లో) అని విభజింపఁబడినది. ఈకావ్య మతిమాత్రకవితాసౌరభసంపన్నము. ఇందలి శ్లోకములఁ గొన్నిటి నుదాహరించెద. అంబికావతిరాజనునొకవిమర్శకుఁడు కొలంబోనుండి యీకావ్యముంగూర్చి యిట్టుల వ్రాసియున్నాఁడు.

"In the poem "There are many touches of literary beauty, and the poem from beginning to end, is enlivining and delighting to the mind." (1906)

1. శ్లో. కాన్తారీతీ రసికహృదయగ్రాహి రీతీ యదీయే
కానావాత్సీ న్నృపతితిలకో భీష్మకాఖ్యో విదర్భాన్
ప్రాప్యోదన్యా నిపమరతరూన్ కల్పపుత్రాన్ సలేభే
కన్యారత్నం గుణిషు పురుషే షూత్తమే నోపభోగ్యమ్. I. 1.

2. శ్లో. వేద్యో వేదైః శ్రుతిషు కుశలం సత్యవాం స్తథ్యవాచం
ధర్మత్రాతా విపులచరితం శీలవన్తం సుశీలః
వర్షీయాంసం గురుషు వినతః శాన్తమత్యన్తసౌమ్య
ప్రత్యుత్థాయప్రభురభిముఖంమానదో మానయేత్త్వామ్. II. 1.

3. శ్లో. మైత్ర్యాద్యాభి శ్చితసృభి రపి ప్రోజ్జ్వలే దీపికాభి
ర్దివ్యాం పూజాం భజతి నవధా భిన్నయా సుష్ఠుభక్త్యా
శ్రద్ధాభద్రాసనపరిగతౌ చారుకల్యాణవేషౌ
చేతోరఙ్గే మమవిహరతాం రుక్మిణీ వాసుదేవౌ. II. 55. *

XLIV శీలదూత:—44 చారిత్రసున్దరగణికృతము.

ఇతఁడు "మహీపాలచరిత్ర," "కుమారపాలమహాకావ్యము," "ఆచారాదర్శము" మొదలగుగ్రంథముల రచించెను. 'శీలదూత'ను దూతకావ్యమని పేరున్నను నిజముగా నిది దూతకావ్యము కాదు, ఏలన, నిందు దూతప్రసక్తియే లేదు. ఇందు 131 శ్లోకములు గలవు. అందు మొదటి 125 శ్లోకములలోని తురీయపాదములు కాళిదాసీయ 'మేఘసందేశ తురీయపాదములు నొకటియే. ఈసమస్యాపూరణము చేతనే యీకావ్యమునకు దూతకావ్యమను పేరువచ్చియుండును. ఈకృతిచమత్కృ

44. "శ్రీయశోవిజయజైనగ్రంథమాల" 14 సం; ధర్మాభ్యుదయముద్రణాలయము కాశీ; వీరసంవత్సరము 2439 (క్రీ. శ. 1915)

'పార్శ్వాభ్యుదయము' నందును, 'చేతోదూత' (xiii) యందును, విక్రమకవి 'నేమిదూత' యందును, (xvi) మేఘవిజయుని 'మేఘదూతసమస్యా లేఖ'యందును జూపఁబడినది. స్థూలభద్రుఁ డనునొక జైనమహారాజకుమారుఁడు, పితురనంతర మహీకచినాత్యాగ మొనర్చి, భద్రబాహు వనునొక జైనమహర్షియొక్క యంతేవాసి యగుట గుర్వనుసార మాతఁడు నిజనగరము నకు వెడలుట, యాతని సంసారచింతాసక్తునిగను బరమార్థచింతావిముఖుని గను జేయఁ బ్రయత్నించిన యాతనిరాణి యగుకోశాదేవియొక్క సయుక్తికము లగుప్రలోభవాక్యముల కీతఁ డతీతుఁడై నిశ్చలముగ నుండుట, తుదకుఁ దననిష్కళంకచరిత్రప్రభావముచే నాతఁ డామెను గూడ సన్న్యాసినిగా నొన రించుటయు నిందలి కథ. 'శీలదూత' ఘూర్జరదేశములోని ఖాభాంతపుర (Khabhant) ప్రభుప్రోత్సాహమున, వి. శ. 1487 (క్రీ. శ. 1431) వ సంవత్సరమున రచింపఁబడెను. 45.

XLV శుకదూత:—46 యాదవచంద్రవిద్యారత్నరచితము. ఈకావ్యము శా. శ. 1786 లో రచింపఁబడెను.

XLVI శుకసందేశము:—47 లక్ష్మీదాసవిరచితము.

ఒకానొకరసికుఁడు స్వప్నములో సతీవియోగముం జెంది యామెయొద్ద కొ నొకశుకము (చిలుక)ను దూతగాఁ బంపుట యిట వర్ణింపఁబడియెను. రామేశ్వరమునకు గుణపురమునకు [ఈగుణపురము 'క్రంగనూరు' Cranganore గ్రామమున కనతిదూరమున నున్న త్రిక్కణపుర (Trikkanapuram) మని తోఁచెడిని.] మధ్యమున నున్నదేశవర్ణన మనేకభాగోళకవిమయద్యోతకముగ నున్నది. ఈకావ్యమునఁ బూర్వసందేశము (74 శ్లో) ఉత్తరసందేశము (89శ్లో) అని రెండుభాగములు గలవు.

*చెన్నపురప్రాచ్యలిఖితగ్రంథాలయపట్టికలో (45) నీకావ్యము ద్వాదశ ప్రకరణాత్మక మనియు నందు మొదటిమూఁడుప్రకరణములును బూర్వసందేశ మనియుఁ, దక్కినతొమ్మిదిప్రకరణములు నుత్తరసందేశ మనియు వ్రాయఁబడి

---

45 శీలదూత, 181 శ్లో.

46. Published from the Ryot's Friend Press by Brajanath Dutt.

47. J. R. A. S. 1884 pp. 404—448.

(45.) D. C. S. M. S. S. Vol. XX Kavyas; Page 7964; R. No. 11900.

యున్నది. మఱియు మానవేదప్రభునిర్మిత మగు "విలాసిని" యను వ్యాఖ్య కూడఁ గలదనియు, నీవ్యాఖ్యాత బహుశః "కాలికట్టు" ప్రభువై యుండనోపు ననియు వ్రాయఁబడెను. లక్ష్మీదాసుఁ డని యీకవికి నామాంతర మని తెలియుచున్నది. 'భండార్కర్ ప్రాచ్యపరిశోధక' పత్రిక (46) లో నుండి ప్రకృతములగు వాక్యముల నుదాహరించెద.

Saktibhadra does not seem to be the real name of the author. Either it is a pseudonymn, as in the case of Lakshmidasa, the author of the 'Sukasandesam,' who, it is now more or less known, was a member of the Karingampalli Namputiri illom (house) in the Cochin State.

1. "శ్లో. లక్ష్మ్యా రజ్ఞే శరది శశినః సౌధశృఙ్గే కయోశ్చిత్
ప్రేమ్ణాయూనోః సహవిహరతోః పేశలాభిః కలాభిః
ద్వారాన్వ(సే)ధః క్వను హతవిధే ర్దూరనీతః స తస్యాః
శ్రాంతః స్వప్నే శుకమితి గిరా శ్రావ్యయా సన్దిదేశ.

2. శ్లో. ఆయాత్యస్తం వి[ర]హిషు నిజం తావ మాసాద్యమానా
వ్యాఘోల్లాసం ప్రవిశగుణకామూహశాలీ విశాలామ్
అగ్రామ్యోజ్జ్వరణహసితాలాపలీలావిశేషై
ర్మానోద్రేకం మనసిగుణితం కుర్వతీ మంగయోనేః.

ఉపసంహారము:—

3. శ్లో. మాతేమాతే ముకులితధృతి ర్మూర్ఛనా మభ్యుపైతి
మధ్యేఫాలం ఘటితఫల[య]త్యేవ వామం హి దైవమ్
కల్లోలిన్యః కలుషకలుషం కుర్వతే మానసం మే
ప్రాణా స్త్వాణే శ్వరి నవిరహే నహ్యహం ధారయామి."*

XLVII శుకసందేశము:—47. కరింగిపల్లి నంబూద్రి నిర్మితము.

XLVIII శుకసందేశము:—48. రంగాచార్యరచితము. మయూర సందేశకారుఁడు నితఁడు నొకఁడో భిన్నులో తెలియుటలేదు.

(46.) "Annals of the Bhandarkar Oriental Research Institute"— Poona. Vol. VIII. No. 4; pp. 431—32—1927.

47. "List of Sanskrit Manuscripts in the Private Libraries of Southern India." Oppert. No. 2721; 6241.

48. "Catalogue of Sanskrit Mss. in Mysore and Coorg." Rice. No. 2250.

XLIX *శుకసందేశము:—49. మహాదేవకవి. 'తంజావూరుమహారాష్ట్ర — మరాఠా — రాజచరితము'నుండి ప్రకృతము లగువాక్యముల ననువదించెదను.

'సిద్ధాన్తసిద్ధాంజన' మనువేదాంతగ్రంథమునకు 'రత్నతూలికా' వ్యాఖ్యానమును రచించిన భాస్కరదీక్షితుఁడు 'జీవనంద విద్యాపరిణయ' నాటకముల రచించి తనపోషకుఁడగు నానందరాయమఖికి నారోపించిన వేదకవియు, 'శుకసందేశాద్భుతదర్పణము'లను కావ్యనాటకముల రచించిన మహాదేవకవియు (క్రీ శ 17 వ శతాబ్ది), శ్రీధర వేంకటేశకవియు, 'శృంగారమంజరీ షాహాజీయ' రచనమునకు, షాహజీనభాలంకారభూతు లగునవరత్నములచేఁ బ్రశస్తిఁగన్న పెరియప్పకవిమొద లగుకవికోవిదులు తిరవళ్ళూరున రాజసత్కారముంబడసిన తేజఃపుంజములు.

L శుకసందేశము*:—కవి, దేవులపల్లి నరసింహశాస్త్రిగారు-తూర్పుగోదావరిమండలములోని మండపేట గ్రామములో నివసించుచున్నారు. ఈక్రిందివిషయము శ్రీకొత్తపల్లి సూర్యరావుగారివలనఁ దెలిసినది. శుకసందేశము రెండుసర్గలు. 179 శ్లోకములు. కథ:- సింహాచలమునుండి యొకరాజపత్ని చెన్నపురికోర్టులో నున్న న్యాయవాదికడకుఁ జిలుకను బంపుట. మచ్చుశ్లోకములు.

కాచి న్నోచాతరుసుమదిరే సింహశైలస్యకూటే
ప్రాజ్ఞా రాజ్ఞీ వసతిమకరో ద్దూరదేశప్రచారమ్
    స్వరాజ్యం
కాంతం చింతాకలుషహృదయా చింతయంతీ నిశాంతమ్. 1.1

శైలే లీలానరమృగపతేః కుత్రచిత్తత్రసానా
పాంసుక్రీడాప్రవణవయసం పుత్ర మంకే వహంతీ
తత్తన్మాయావచనరచనోత్క్రమైః ఖేలయంతీ
కీరం స్వైరం స్వయ ముపగతం రాజపత్నీ దదర్శ. 12

49. "The Maratha Rajas of Tanjore" by Prof. K. Subramanian, M.A., of the Maharaja's College, Vizianagaram. 1928; 4 Chapter, P. 32.

తత్రైవ *ప్రాగ్జలనిధితటప్రాంతభాగే ఽపసార్ధ్య
భ్రామ్యద్ధూమ్యాశకటపటలీ ... స్థానకూటః
తంత్రీవార్తాసదనసదసః స్తోమవిశ్రామసీమే
తత్తద్యన్త్రాకలనవిలయా దృష్టిరస్మాకం విభాంతి. 1.38
ఘీంకారోద్యన్మదకరిఘటాకీర్ణ భీతిప్రదాత్రీ
స్ఫూర్జద్గర్జానినదకలితా నీలకాదంబినీ వా
హ్రాద్యైర్వాద్యై రసుగతవతీ జంగమా సౌధమాలా
కిం వేత్యుచ్చై ర్జ్వలనశకటో దృశ్యతే దూరతోఽపి.

LI సిద్ధదూత:—50. అవధూతరామరచితము.

LII సుభగసందేశము:—51. నారాయణనిర్మితము.

ఇందు 130 శ్లోకములు గలవు. సుభగుఁ డనఁగా స్నాతకుఁడైన సందేశహారుఁడు(?). ఇతఁడు కన్యాకుమార్యగ్రము (Cape Comorin)నుండి వృషపురీ పౌఙ్గవీపురములకుఁ బంపఁబడుట యిందలి యితివృత్తము.

LIII. హంసదూత:—52 శ్రీరూపగోస్వామికృతము (53) ఈతని పరిపూతజీవనముచే 16 వ శతాబ్దము ధన్యమయ్యెను. (చూ III ఉద్ధవసన్దేశము.) మధురానగరమున (54) నున్న శ్రీకృష్ణునిసన్నిధికి బృందారణ్యమునందలి

---

* ఈస్టుకోస్టురైల్వే.

50. "Report of a Search for Skt. MSS." A. V. Kathavate No. 596.

51. J. R. A. S. 1884, p. 449.

52. (i) Haeberlin's "Sanskrit Anthology" pp. 323 ff.

ii. హరిచన్ద్రహీరచన్దుని "కావ్యకలాపము," బొంబాయి, 1864. 35 వ పుటనుండి.

iii. భువనచంద్రబసక్ సంపాదిత "కావ్యసంగ్రహము II భా. 169 వ పుటనుండి; కలకత్తా; 1874.

iv. శ్రీమత్పండితజీవానన్దవిద్యాసాగర భట్టాచార్య సంపాదిత "కావ్యసంగ్రహము" I భాగము' 441—507 పు.

v. మఱియుఁ బ్రత్యేకముగా బంగాళాక్షరములతో, వంగభాషానువాదాన్వితముగ 'వసుమతీస్టీమ్‌ముద్రణాలయము'న ముద్రితము. (Basumati Steam Machine Press, Calcutta.)

(53) కొన్ని వ్రాఁతప్రతులలోని కావ్యము రూపగోస్వామిభాగినేయుఁ డగు జీవగోస్వామికి నారోపింపఁబడినది. (cf. 'Descriptive catalogue of Sanskrit Manuscripts in the Govt. Skt. College' M. S. No. 162.)

(54.) మహామహోపాధ్యాయ, విద్యావాచస్పతి ప్రొఫెసర్, యస్. కుప్పుస్వామిశాస్త్రి.

గోపికలు హంసను దూతగాఁ బంపుట యీకావ్యకథాబీజము. ఇది శిఖరిణీ వృత్తాత్మకము. శ్లోకసంఖ్య ముద్రితప్రతులయందును, లిఖితప్రతులయందుఁ గూడ వ్యత్యాసముగాఁ గానవచ్చుచున్నది. ఈకావ్యమున జీవానన్దుని 'కావ్యసంగ్రహము'ం బట్టి 142 శ్లోకములు.

1. శ్లో. దుకూలం బిభ్రాణో దలితహరితాలద్యుతిహరం
జపాపుష్పశ్రేణీరుచిరుచిరపాదాంబుజతలః
తమాలశ్యామాఙ్గో దరహసితలీలాఞ్చితముఖః
పరానన్దాభోగః స్ఫురతు హృది మే కోఽపి పురుషః

2 శ్లో. మిలద్భృఙ్గీహంసీరమణవనమాలాం ప్రథమతో
ముదా క్షేమం పృచ్ఛన్నిదముపహరేథా మమ వచః
చిరం కంసారాతే రురసి సహవాసప్రణయినీం
కిమేవా మేణాక్షీం గుణవతి విసస్మార భవతి. 116

3. శ్లో. రసానామాధారై రుపరిచితదోషః సహృదయై
ర్మురారాతిక్రీడానిబిడఘటనాయామపసహితః
ప్రబన్ధోఽయం బన్ధో రఖిలజగతాం తస్య సరసాం
ప్రభో రన్తః సాన్ద్రాం ప్రమదలహరీం పల్లవయతు 142

హీరచంద్ సంపాదిత "కావ్యకలాపము"ం బట్టి 143 శ్లోకములు. వసుమతీముద్రణాలయప్రతిం బట్టి 101, శ్లో. సంస్కృతకళాశాలలోని లిఖితప్రతిం బట్టి 131 శ్లోకములు నున్నట్లు తెలియుచున్నది.

LIV. హంససన్దేశము:—55 కవితార్కికసింహ వేదాన్తదేశికకృతము. (56) వీరు సర్వతంత్రస్వతంత్రులు; నిరంకుశకవిశేఖరులు. వీరికి వేదాంతాచార్యులనియు, వేంకటేశకవియనియు నామాంతరములు. క్రీస్తుశకము 13 వ శతాబ్దిలో నుత్తరార్ధమున, 14 వ శతాబ్దిలోఁ బూర్వార్ధమున విలసిల్లియుండిరి. వివిధ

---

55. i. మైసూరు రాజకీయప్రాచ్యగ్రంథాలయమునుండి వ్యాఖ్యాసనాథముగఁ బ్రకటితము. (ii) శ్రీమదుభయవేదాన్తప్రవర్తకులును వాత్స్యవంశావతంసులును మహామహోపాధ్యాయులు నగు శ్రీనడాదూరు శ్రీరంగరాజాచార్యులవారి 'ప్రకాశా'ఖ్యవ్యాఖ్యాన్వితముగ, సాంగ్లపీఠిక, ఆంగ్లటీక, ఆంగ్లపద్యానువాదసహితముగ స్వర్గతవిద్యావినోది పనప్పాకం అనందా(అనంతా)చార్యులవారిచే, వైజయన్తీముద్రాలయము—(చెన్నపురి) నముద్రింపఁబడి ప్రకటింపఁబడెను. ఆగస్టు 1903. (iii) వ్యాఖ్యాన్వితముగ నాంధ్రాక్షరములలో వావిళ్ళవారిచేఁ బ్రకటింపఁబడిన ప్రతి.

(56.) వీరిజీవితచరితమునకుఁ దద్రచితగ్రంథావళివిమర్శనమునకు నీక్రిందియాంగ్లగ్రంథముల ముఖ్యముగఁ జూచునది. మున్ముందుఁ దద్విషయక మగువిపులగ్రంథముఁ బ్రకటింపఁగలము.

విషయముల వీరు రచించిన గ్రంథములు పరశ్శతములు. అందు 122 ముఖ్యములు. ఇవి వివిధవిషయాత్మకము లగు నద్వితీయ గ్రంథరాజములు. ఇందుఁ గొన్ని యతి విపులముగా నున్నవి. ఉపలబ్ధము లగు వీరి గ్రంథములలో 32 స్తోత్రములు; 8 కావ్యములు; 24 శాస్త్రీయవిషయములు; 38 మతవిషయకములు(Theological works;) ఈ సంస్కృత గ్రంథములు గాక వీరు ద్రావిడమున 24 గ్రంథములు నిర్మించిరి. (చూ. 'హంసనందేశ' పీఠిక VI పుట మైసూరు ప్రతి.) వీరు బహు భాషావిజ్ఞాతులు; సామాన్యముగా నిన్ని యుద్గ్రంథముల రచించినవారు బహు విరళముగా నుందురు. అప్పయదీక్షితులవంటి పండితమత్తదంతావళము వేదాంతదేశికుల "యాదవాభ్యుదయము"నకు వ్యాఖ్యవ్రాయుచుఁ గొన్నియెడలఁ గవిహృదయముం గానక "శిశ్యః కవిరహం విద్వాన్" ('శిశ్య' యనఁ 'దూప్పిల్ పిళ్ళ' యను నామాంతరము గల వేదాంతదేశికులు) అని యనియుండ, వేదాంతదేశిక కవితాసాగరగాంభీర్యముం గూర్చి కించిజ్జ్ఞపరమాణువు లగు నస్మాదృశులు చెప్పవలసిన దేమున్నది? వీరి గ్రంథరాజములలో నొంటిరెంటిం బేర్కొనియెద; (i) యాదవాభ్యుదయము, (ii) సుభాషితనీవి, (iii) సంకల్పసూర్యోదయము, (iv) శతదూషణి, (v) పాదుకాసహస్రము, (vi) దశదీపకనిఘంటువు (ఆర్షముద్రణాలయమున ముద్రితము; విశాఖపట్టణము.)

'హంసనందేశము'న లంకాద్వీపమున నున్న జానకియొద్దకు శ్రీరాముఁడు హంసను దూతనుగాఁ బంపుట యభివర్ణింపఁబడియున్నది. I ఆశ్వాసమున 60 శ్లోకములును, II ఆశ్వాసమున 50 శ్లోకములును గలవు. వీరికవిత్వమునఁ గొన్నియెడలఁ గాళిదాసమేఘదూతకంటె మెఱుఁగులు చూపట్టెడిని.

---

"i. Journal of the Bombay Branch of the Royal Asiatic Society' 1915—16. (Vol. XXIV No. 2) 'The Life & Times of Sri Vedanta Desika' by V. Rangachari, M. A., P. 277—312.

ii. "Vedanta Dasika, His Life and Leterary Writings" by Pandit M. K. Tatacharya, B. A., Published by T. S. Ramaswami Aiyangar, Talugu Pandit, B. S. School, Kuppam. 1922.

iii. Preface in 35 pages to the 'Hamsasandesa' printed in the Vaijayanti Press.

iv. Preface to Vols. I and III of 'Yadavabhyudaya' of Vedanta Desika, Vani Vilas Press, Srirangam.

v. Preface to Vedanta Desika's "Subhashita Nivi" (Vani Vilas Press.)

జనపదవధూవర్ణనమునఁ గాళిదాసుఁడు "భ్రూవిలాసానభిజ్ఞైః" (1 స 16) అనివర్ణింప, వేదాంతదేశికులు "అభ్రూభంగే వ్యధికరుచిరైః" (సుభగైః) (1 స. 19) అని దానికి మెఱుఁగు పెట్టియున్నారు. కాళిదాసుఁడు "కాన్తోదన్తః సుహృదుపనతః సంగమాత్కించి దూనః" అని యనఁగా 'కిం న స్త్రీణాం జనయతి ముదం కాంతవార్తాగమో౽పి? II- 30 అని యు వేదాన్తదేశికులు "కాన్తాశ్లేషా దధికసుభగః కామినాం దూతలాభః (1-4) అని చమత్కరించియున్నారు.

వేదాన్తదేశికులు ప్రౌఢకవికోవిదచూడామణులైనను సార్వలౌకికసారస్వతదృష్టిం బరిశీలించినచో వీరికవిత యితివృత్తవైశిష్ట్యమునఁ గాని, రచనావిధానమునఁగాని కవ్యుపజ్ఞోద్యోతకము కాఁజాల దని యానందాచార్యులవారి యభిమతము.

కాళిదాసుని 'మేఘసందేశము'కంటె వేదాంతదేశికుల 'హంససందేశము'విశిష్ట మని యానందాచార్యవారిట్టులువ్రాసియున్నారు.

"Hamsasandesa is a short poem closely following Meghaduta in plan and method; the author perhaps surpassing his model both in the choice of the subject and in the machinery of the poem: for to the vague story of a Yaksha, he presents to us the story of Sri Rama, and as against the improbability of making a cloud a love-messenger, he introduces a bird that has life and sensibility, The poet is fully concious of his own advantage when he says.

'విశ్లేషేణ క్షుభితమనసాం మేఘశైలద్రుమాద్యా
యాఞ్చాదైన్యం భవతి కిముత వ్యాపి సంవేదనార్హే.'

Anandachary,s Intro.

ఇతివృత్తప్రాశస్త్యముం బట్టి కావ్యరచనావిధానమునకు నతిలోకశాస్త్ర్యమావహిల్లును. కావ్యరచయిత, యనిపుణధిషణుఁడైనప్పటికి వస్తువైశిష్ట్యము రచనాప్రాశస్త్యమున కత్యంతముఁ దోడ్పడును. ప్రకృత'హంససందేశము' నందలి యితివృత్తమా, శ్రీరామచంద్రకథానుధారసపరిషిక్తము; తత్ప్రణేతయా, ప్రపన్నచూడామణియు, నిరంకుశకవికోవిదులు నప్రతిమప్రతిభాభానులు నగు వేదాంతదేశికులు. ఇట్టులు ప్రతిపాద్యవస్తువైశిష్ట్యము వక్తృవైశిష్ట్యములతోఁ గూడిన 'హంససందేశ' ప్రాశస్త్యముం గూర్చి చెప్పవలెనా?

ఈకావ్యమునఁ బదమునందుఁ గాని, రసమునందుఁ గాని యనౌచిత్యము మందునకైనను గానరాదు. మానవజీవితము కవితయందుఁ బ్రతిబింబింపవలెననియుఁ, గవిత మానవజీవితవిమర్శాత్మకముగా నుండవలె ననియు ననునిట్టి పాశ్చాత్యవిమర్శవిధానముం బట్టి సమాలోచనముం జేయుచో హంససందేశమునఁ దల్లక్షణలోపము గానఁబడియెడిని. కాని ప్రాచ్యవిమర్శసూత్రములం బట్టి పరిశీలించినచో నీకావ్యము సంస్కృతిసారస్వతమున నత్యున్నతపదము నలంకరించుననుటకు సందియము లేదు. ప్రతిశ్లోకము ననర్ఘరత్నము; కావ్యమంతయు లోకోత్తరరత్నావళి.*

1. శ్లో. వంశే జాత స్సవితు రనఘే మానయ న్మానుషత్వం
దేవః శ్రీమా న్జనకతనయాన్వేషణే జాగరూకః
ప్రత్యాయాతే పవనతనయే నిశ్చితార్థ స్సకామీ
కల్పాకారాం కథమపి నిశా మావిభాతం విషేహే. I స. 1 శ్లో.

4. శ్లో. సామే దృష్టి శ్శఫరనయనా సన్నతభ్రూస్సుకేశీ
తన్వీతజ్జ స్తనభరనతా తప్తజాంబూనదాభా
బాలా యుష్మ త్ప్రతిమగమనా వేదిమధ్యా వరాంగీ
శృంగారాఖ్యం నిధిమధిగతా శ్రేయసీ దేవతేవ. II స. 10 శ్లో.

5. శ్లో. విద్యాశిల్పప్రగుణమనసా వేంకటేశేన క్లుప్తం
చింతాశాణోల్లిఖితమసకృ త్ప్రేక్షయాసాం ప్రాప్తిహేతుం
సీతాహంసవ్యతికరసఖం రామసందేశరత్నం
పశ్యం త్వంతశ్రవణమనఘం చక్షురుజ్జీవ్య సంతః." II. 50.

LV. *హంససందేశము:—57. (ప్రాకృతభాషాత్మకము.):- వారణాసిధర్మసూరి. (58) ఈవిద్వత్కవిషడ్దర్శనీపారదృశ్వుఁడు; మహామహోపాధ్యాయబిరుదాభిరాముఁడు; ఆలంకారికచూడామణి; శ్రీరామచంద్రచరణసారసచంచరీకుఁడు. ఇతఁడు నరాంకితముగఁ బ్రతాపరుద్రీయమును రచించిన విద్యానాథమహాకవిని నిరసించి, శ్రీరామచంద్రయశోఘనసారసురభీకృత మగు i. 'సాహిత్యరత్నా

57. ధర్మసూరినిర్మిత "సాహిత్యరత్నాకరో"ద్ధృతము.

(58) ధర్మసూరిని,తన్నిర్మితగ్రంథములం గూర్చి,శుక్లసంవత్సరాంధ్రపత్త్రికా సంవత్సరాది సంచికలోని శ్రీరంగము సోమేశ్వరశాస్త్రిగారి "సాహిత్యరత్నాకర"మను వ్యాసము, "ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక" [XVII సం. 6 సంచిక] లోని మదీయ "సాహిత్యరత్నాకర—నాకామన్థర" విమర్శ వ్యాసమును జూచునది.

కరమైన(59)నలంకారగ్రంథమునురచించిధన్యుఁడయ్యెను. ఇతని గ్రంథములలో ii. 'నరకాసురవిజయవ్యాయోగము' ముద్రింపఁబడెను. iii. బాలభాగవతము (కావ్యము) iv కంసవధ. v. కృష్ణాస్తుతి. vi. రవిశతకము. vii. హంససందేశము. ఈగ్రంథములైదును గాలగర్భమున నంతరించినవి. కాని వీనియందలి శ్లోకములు గొన్ని 'సాహిత్యరత్నాకరమున నుదాహరింపఁబడినవి 'హంససందేశము' నుండి యొక్కశ్లోకము మాత్ర ముదాహరింపఁబడెను.

"జాగరో యథావా, మత్కృత ప్రాకృతవిరచితే హంససందేశే."

శ్లో. జాఅం సీఆణఅణజుఅళం లోహిఅంజాఅరాఆ
కిం వాతమ్మం మఅణదహణజ్జాళజాలాహిదావా
చిత్తారద్ధేసురఅవిహవే చుంబణాణం పవేవ
రత్తం కిం వా రహుకఇముహే పీడిఆరాఅజోఆ.

ఛాయ:-శ్లో. జాతం సీతానయనయుగలం లోహితం జాగరాద్వా
కింవా తామ్రం మదనదహనజ్వాలజ్వాలాభితాపాత్
చిత్తారబ్ధే సురతవిభవే చుంబనానాం ప్రభేదే
కింవా రక్తం రఘుకవిముఖే పీటికారాగయోగాత్.

[X రసతరంగము. 16 శ్లో. 346 పు. తెలుఁగు ప్రతి; 353 పు బమ్మాలోఁ బ్రకటితమైన నాగరీప్రతి.]*

LVI హంససందేశము:—60. భట్టవామనకృతము.

కప్పుఁ డగునొకయక్షుఁడు తనప్రియురాలియొద్దకు హంసను దూతగాఁ బంపుటయిందలియితివృత్తము. ఇది కాళిదాసమేఘసందేశమునకుఁ బ్రతిబింబము.

*ఈహంససందేశప్రణేత గద్యకవిసార్వభౌముఁ డగువామనభట్టబాణుఁ డనియు, నీక్రిందివి తత్ప్రణీతకృతు లనియు 'శృంగారశ్రీనాథము' న శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు (78-79 పు.) వ్రాసియుండిరి.

i. వేమభూపాలచరిత మనునాఖ్యాక.

ii. రఘునాథాభ్యుదయము. [కావ్యము]

iii. నలాభ్యుదయము.

---

59. సరస్వతి తిరువేంగడాచార్యులవారిచే, చెన్నపురి సరస్వతీనిలయముద్రాశాలలో ముద్రితము. 1871.

60. "D. C. S. MSS." Volume XX. R. No. 11912. Page 7972.

iv. శబ్దరత్నాకరము. } నిఘంటువులు.
v. శబ్దచంద్రిక.
vi. పార్వతీపరిణయము. } రూపకములు.
vii. శృంగారభూషణము.
viii. హంససందేశము: ఖండకావ్యము.

నలాభ్యుదయగద్యము "ఇతి వామనభట్టబాణకృతౌ నలాభ్యుదయే" అనియున్నది. హంససందేశమునందలి గద్యము "ఇతి శ్రీభట్టవామనస్యకృతిః పూర్వో హంససందేశః సమాప్తః" అనియున్నది. 'శృంగారశ్రీనాథము'న వామనభట్టబాణ భట్టవామనుల నైక్యముగాని భిన్నత్వముగాని చర్చింపఁబడ---దు. చర్చించినతరువాతఁగాని వీరు భిన్నులా, కాదా యనుప్రశ్నము సమాధేయము కాఁజాలదు. హంససందేశకావ్యరత్నమునందలి కొన్నిమయూఖములఁ బ్రదర్శించెద:—కావ్యారంభము:—

1. శ్లో. సోఽహం యక్షో నియతవసతిః సౌమ్య కైలాసశైలే
నామ్నా దక్షో పలితనయనా సాచ కన్దర్పలేఖా
ఆజ్ఞాభఙ్గాత్కుపితమనసా దత్తశాపోఽస్మి రాజ్ఞా
కామీ వర్షం కమపి వనితా విప్రయుక్తో వసేతి.

2. శ్లో. కాలే నస్యాన్నియతమియతా సాపునః కాతరాక్షీ
మ్లానచ్ఛాయా వనగజకరోత్పద్రుతా వల్లరీవ
ప్రత్యాశ్వస్తాం విరచయ సఖే తాం ప-
థారై[రా]సారై రివ జలధరశ్చాతకీం తప్యమానామ్.

4. శ్లో. పూర్వం వాచాకలమధురయా శశ్వదామన్త్ర్య బంధూన్
పాథేయంచ ప్రకృతిమృదులం కల్పయిత్వా మృణాలీమ్
ధ్యాత్వాహంసం తవకులగురుం(తం)విలిఖ్యాచ్ఛవవాహ్యం
శైలాదస్మాద్గగనపదవీ ముచ్చకై రుజ్జిహీథాః.

కావ్యోపసంహారము:—

5. శ్లో. సేయం దీర్ఘా విరహరజనీ హన్త కించిద్విభాతా
శాపస్యాంతః పరదిభవితా వాసరైః కైశ్చిదేవ
మాసా వేతా(గమయ)కదను ప్రోశ్య మోహ్యాపహోతాన్
ఖో। ౮౩ రజసిషుపరం ప్రోషచంద్ర

# ధాతుమాల.

ఈయాంధ్రధాతుమాలకు మూలమగు ప్రాఁతకాగితపుఁబ్రతి సూర్యరాయాంధ్ర నిఘంటుకార్యాలయమునఁ గల చిన్నయసూరిగారి లిఖితగ్రంథసముదయములో దొరకినది. ఇది చిన్నయసూరికృతమగునో కాదో సిద్ధాంతము చేయుటకుఁ దగిన ప్రబలాధారములు దొరకలేదు. మేమువినినంతవఱకు సూరిగారిచే రచియింపఁబడిన యీక్రింది గ్రంథములై యున్నవి.

1. ఆంధ్రశబ్దశాసనము.
2. ఇంగ్లీషు లాచట్టముల భాషాంతరీకరణము.
3. చాటుపద్యములు.
4. రాణిగారిపట్టాభిషేకమునకు రచించినపద్యములు.
5. సంస్కృతబాలబోధ.
6. సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణము (చిన్నయసూరీయము.)
7. ఆంధ్రశబ్దచింతామణివ్యాఖ్య.
8. బాలవ్యాకరణము.
9. నీతిచంద్రిక.
10. శబ్దలక్షణసంగ్రహము.
11. అక్షరగుచ్ఛము.
12. పద్యాంధ్రవ్యాకరణము.
13. విభక్తిబోధిని.
14. అకారాదినిఘంటువు.
15. విశ్వనిఘంటువు.
16. సుజనరంజనీపత్రిక.
17. ఆదిపర్వవచనము.
18. పచ్చయ్యప్పగారిపైఁబద్యములు.

ఈగ్రంథమందు గ్రామ్యరూపములు పెక్కులు కానఁబడుచున్నవి దీనినిబట్టి యిది చిన్నయసూరికృతము కాదేమో యనిసంశయించుట కవకాశము గలదు. ఎట్లయినను తెనుఁగులో ధాతుపాఠ మింతవఱకు లేదు కావున దీనిని బ్రకటించితిమి. ఇందలిగుణదోషములు విచారించుభారము పండితులదియై యున్నది.

దీనిపై విద్వాన్ కట్టి సాంబమూర్తి శాస్త్రిగారి యభిప్రాయము వెనుకవైపునఁ బ్రకటింపఁబడినది.

వే. ఆ.

సరస్వతీసహదేవతాభ్యోనమః.

# ధాతుమాల-పీఠిక.

ఈయాంధ్రధాతుమాలను నేనిపుడు ప్రకటించి యాంధ్రసాహిత్యపరిషత్తు తనముఖ్యవిధి నొకదానిని నెఱవేర్చినది. సాధారణముగా గ్రంథబద్ధము లగుభాషల కెల్ల వ్యాకరణ ముండితీరును. ఏకాలమునం దేయేపదములు వాక్యములు నెట్టిపరిణామములను బొందినవో తెలుపుటయును బహుశిష్టజనవ్యవహారారూఢపదములు మాత్రమే ప్రయోగార్హము లని శాసించుటయే వ్యాకరణముల ప్రయోజనము. ఎల్లభాషలందును దొలుదొల్తఁ బరిమితము లగుక్రియాపదములు మాత్రమే యుండి యవసరముల ననుసరించి కాలక్రమమున నితరపదములకూడికచే నామపదము లగు నని కొందఱు పండితు లందురు. సంస్కృతభాషయందలి పదము లన్నియు ధాతుజన్యములే యని పాణినీయవ్యాకరణమునందలి వ్యుత్పత్తిపథము దెల్పుచున్నది. తెనుఁగుభాషయందలి కాలు చేయి కన్ను ముక్కు మొదలగుపదము లన్నియు ధాతుజన్యములే యని పలువురు పండితు లనుచున్నారు. కాని ధాతురూపములు నామములుగాఁ బరిణమించినవో నామములనుండి ధాతువులు జనించినవో నిర్ణయించుటమాత్ర మలవికానిపని. ఈసంశయ మాంధ్రభాషావిషయమున నత్యధికముగానే కలదు. నేను మేము నీవు మీరు వాఁడు వారు అను ద్వ్యక్షరసర్వనామములందలి ద్వితీయాక్షరములే ప్రకృతక్రియావిభక్తులుగా నగపడుచున్నవి. తొలుదొల్త ధాతువులకు విభక్తిప్రత్యయములు లేవనియు సర్వనామపదములే తత్తదర్థానుసారముగ ననుప్రయోగింపఁబడియెడి వనియుఁ గాలక్రమమున నయ్యవి వర్ణలోపాదివికారములఁ బొంది విభక్తులుగా మాఱిన వనియు నూహింప నగును. అయినను ధాతురూపములు మాత్ర మనాదిసిద్ధములై స్వతంత్రములుగానే యున్నవి.

ఏభాషయం దైనను బాండిత్యమునకు ధాతురూపపరిజ్ఞానము పరమసాధనముగా నున్నది. అనేకశబ్దము లుపసర్గసాహచర్యమునను బ్రకరణవశమునను భిన్నార్థద్యోతకము లైనను రూపసాదృశ్యముంబట్టి యేకధాతుజన్యము లని నిర్ణయించుచున్నాము. ప్రహారాహారసంహారవిహారపరిహారము లిట్టివి. ధాతురూపపరిజ్ఞానము లేనిభాషాజ్ఞానము నేత్రహీన మగుశరీరముం

పోలి నిరర్థక మగుచున్నది. పరిచిత మగుపరిమితధాతుకతిపయముతో నపరిమితము నావశ్యకము నగుపదజాలమును నిర్మించికొనుట వ్యవహారసౌకర్యముం గూర్చును. కావుననే ప్రాచీనపండితులు ధాతుమాలల రచించి యుండిరి. సంస్కృతమునకు ధాతుదశగణీవలనం గలసౌకర్యము వర్ణింప నలవి కానిది గదా! కర్ణాటభాషకు సైతము ధాతుపాఠము గలదు. ఆంధ్రభాషకు లక్షణముల రచించినవారు ప్రాచీననవీను లనేకు లున్నను నీరీతిగా ధాతువుల నెల్ల నేకసూత్రమున గుదిగ్రుచ్చి లోకమున కర్పించినవారు సుగృహీతనామధేయులగు శ్రీపరవస్తు చిన్నయసూరిగారు మాత్రమే. శ్రీసూరిగారికీ రతురాస్యు లగువాంధ్రు లెల్లరజిహ్వాగ్రములందును దాండవించుచునే యుండును. ప్రమాణమే కానిం డప్రమాణమే కాని యీ బాలవ్యాకరణముం బోలెం బటుతర మగు నాంధ్రవ్యాకరణ మాంధ్రావనియం దింకొక్కటి కలదా? చిన్నపొత్తమే యైనను నీతిచంద్రికం బోలు ప్రౌఢవచనకావ్యము వేఱొకటి లేదుగదా? ఈ రెండు గ్రంథములును శ్రీసూరిగారి కీర్తిలతికకు శాఖాద్వయమై యాంధ్రదేశ కాయమానమున నలముకొని యనశ్వరజ్ఞానఫలము లందించుచున్న వనుట యతిశయోక్తి కానేరదు. శ్రీసూరిగారిజీవితచరిత్ర మిదివఱ కీపరిషత్పత్రికయందే ప్రకటింపఁబడినది. అచ్చుపడిన నీతిచంద్రికాబాలవ్యాకరణములు కాక యముద్రిత మగు నొకగొప్ప తెలుఁగునిఘంటువు సూరిగారు రచించినది శ్రీపీఠికాపుర సంస్థానమునఁ గలదు. శబ్దరత్నాకరముకంటె నిది మిగులఁ బెద్దది. శబ్దరత్నాకరమున కిది మూలప్రాయ మైనదికూడను. శబ్దలక్షణసంగ్రహ మను నొకముద్రితాంధ్రవ్యాకరణము సూరిగారు రచించినట్లు ప్రకటింపఁబడియున్నది కాని యది వారిచే రచింపఁబడినది కాదని నేను తెలుఁగుపరిషత్సభలో సిద్ధాంతీకరించియున్నాఁడను. ఇట్లుండ నిపు డీధాతుమాల యొకటి సూరిగారిపేరు మోసికొని లోకమున కవతరించినది. కావున దీనిఁగూర్చి యించుక విమర్శింప వలసియున్నది.

శ్రీసూరిగారు ధాతుమాల నొకదానిని రచించిన ట్లనేకు లెఱుంగరు. ఈ గ్రంథమునం దెక్కడను సూరిగారిపేరు లేదు. శ్రీసూరిగారిమతమునకు విరుద్ధ మగు ననేక విషయము లిందుఁ గలవు. అలాక్షణికత్వమును నిరసించు వారిలో సూరిగా రగ్రగణ్యు లనుట నిర్వివాదముగదా? అట్టిసూరిగారు గ్రామ్యరూపముల నుదాహరింతురా? ఒక వేళ స్పష్టప్రతిపత్తికై గ్రామ్యపద

ములతో నర్థనిరూపణము గావించినఁ గావింపవచ్చును గాని ధాతువులకే గ్రామ్యరూపముల నుదాహరించుట వానియర్థమును సంస్కృతమున నాంధ్రమున ను దెల్పుటయును శ్రీసూరిగారివంటి యభినివిష్టు లాచరింతురా? "ధాత్వాదులకు ధాత్వాదు లనుప్రయుక్తంబు లై విశేషణార్థాభిధాయకంబు లగు నయ్యవి శబ్దపల్లవంబులు నాఁబడును." అని సూత్రించి సూరిగారు ఏగుదెంచు, చనుదెంచు, మేలుకొను, అందిమ్ము, చొత్తెంచు మొదలగురూపములను సాధించిరి. కీనియం దపయవద్వయము వేర్వేఱ స్వతంత్రప్రయోగము గలదియే. ఈగ్రంథమునందు అగపడు మొదలగురూపములనుసమాసధాతువులుగాఁ జేర్కొని అగపడులో అగకు వ్యస్తప్రయోగము లేదనుట సూరిగారిమతమునకు విరుద్ధముగాదా? సమాసధాతుసంజ్ఞ సూరిగారిగ్రంథమునం దెక్కడ నగపడదు. సమాసధాతువు లను సంజ్ఞాకరణమే దుష్టము. ప్రయోగారూఢములగుదేశ్యధాతువులకు మాత్ర మర్థనిరూపణము రూపనిష్పత్తియుఁ గావించుట గ్రంథోద్దేశమయి యుండఁగా నిందు వ్యావహారికములఁగూడ నుదాహరించియుండుఁ గొన్నింటికి మాత్రము గ్రామ్యము లని "గ్రా" సంజ్ఞతో సూచన గావింపఁబడినది. సూచనావిరహితము లయ్యు గ్రామ్యము లనేకములు గలవు. మఱియు ననేకవిధము లగుదోషము లీగ్రంథమునం దగపడుచున్నవి. వాని నీషన్మాత్రముగ నీక్రింద నుదాహరింతును.

అగపడు, అగుపడు- ఆమతించు, ఆమెతించు- ఎదగు, ఎదుగు- ఎదిర్చు, ఎదిఱ్చు, ఎదిఱించు, ఎమఱ్కొను- ఓదార్చు, ఓదర్చు- తడవు, తడుపు, తపుడు_ తపుడుకాడు, మొద లగురూపాంతరము లడుగడుగునఁ జూపఁబడినవి. కాని యిందలిరూపాంతరములును శకటరేఫసంయోగములును గ్రంథములం దెక్కడను గానరావు, కొన్ని వ్యవహారమందును మృగ్యములే. ఓటించు-ఓట్రించు; కతకు-కతుకు, కదకు-కదుకు, తపుడు-తపుడుకాడు, మట్టగించు, మద్దటీలు-మద్దటిలు, లోటు, లోడు అను రూపాంతరములే ఏదేశమం దేవి వ్యవహారసిద్ధములో నా మెఱుఁగినంతవఱకుఁ దెలియరాలేదు.

అర్థనిర్ణయమునందు ననేకదోషము లున్నవి. ఆమెతించు_సత్కారపూర్వకముగాఁ బిలుచుట, విందుచేయుట యగునేమో! క్రచ్=కాంక్షించుట.(చుట్టుకొనుట శ. ర) అవు మొదలగునవి పొడుచుట క్రుమ్ము కాని కుమ్ము కాదు. దుయ్యానకు బాణము దూసిపాఱుట కాని పిడికిలినుండి జాఱుట కాదు. ఇకవేళ

పిడికిటనుండి విడుచుట యగునేమో ? కతకు మొదలగు నాల్గురూపములకు భోజనసామాన్యమే యర్థమైనను శునకాస్వాదనమే యని నియమించుట సరి కాదు. రాపాడు దోషమారోపించి తెల్పుటంట ? వంచివేయుటకు కట్టవంచుట ప్రసిద్ధము. ద్రవపదార్థ మొలికించుట గ్రాహ్యము. ప్రకృతిప్రత్యయ నిరూపణమందును దోషము లగపడుచున్నవి. అచ-అఱచేతితోఁ గొట్టుట యను చు వర్తమానార్థకప్రత్యయము నని తెలుపుట తప్పుగాదా ? ఔడుగలచులో ఔడుగల ధాతువంట, చు వర్తమానార్థకప్రత్యయ మంట. ఇంతటి వైపరీత్య మెందైనఁ గలదా ?

వ్రాఁతప్రతియందు ధాతువు, సంస్కృతార్థము, ఆంధ్రార్థము, వర్తమాన భూతభావికాలికప్రత్యయములు, విశేషములు నని యేడువిభాగములు ప్రదర్శింపఁబడినను, ముద్రణమున ధాతుధాత్వర్థములు మాత్రమే ప్రకటింపఁబడినవి. అన్నిధాతువులకు వర్తమానమున చువర్ణకమును భూతమున ఇత్-ఇన్వర్ణకములును, భావిని ఎద్, ద్వర్ణకములును దెలుపఁబడినవి. విశేషములందు సమానధాతువులు, శాస్త్రీయములు, అస్వతంత్రములు మొదలగువిషయములు పేర్కొనఁబడినవి. అన్నింటికిని జివర డుముప్రత్యయముతో నర్థము నిరూపింపఁబడినది.

పైయంశము లన్నింటి నాలోచించినచో బరిషత్తువారు ప్రకటించినది చిన్నయసూరికృతమేనా యనుసంశయము గలుగుట సహజము. చిన్నయసూరివంటి లాక్షణికశిరోమణిగ్రంథమం దిట్టిదోసఁగులు పొసఁగునా యను శంక దుర్నివారమే యైనను గొంచె మాలోచింపఁదగును. శ్రీమత్సూరిగారు ధాతుమాల నొకదానిని రచించి రనుటలో నెట్టిసంశయమును లేదు. చెన్నపురిప్రాచ్యలిఖితపుస్తకాగారమున నొకధాతుమాల చిన్నయసూరివిరచిత మగునది యుండెడిది. ఆపుస్తకము నెవ్వరో యపహరించినను దానివరుససంఖ్యయుఁ జేరును నిప్పటికిని గలదు. పరిషత్తునకు లభించినప్రతి శ్రీసూరిగారి స్వహస్తలిఖితము కాదు. వారిప్రతికిఁ బుత్రికయో పౌత్రియో యింకనువ్యవహితసంతతియో తెలియదు. ప్రతులఁజూచి పుత్రికల వ్రాసికొన్నవారు తప్పుల దొరలించుట వింత కాదుగదా! శ్రీసూరిగారిగ్రంథములు చాల సీసదుమఁ బరిషత్తువారికి లభించినవి. వానినెల్లఁ జూచిన నీవిషయము సత్యమే యని తేలును. లోకములో వ్రాఁతతప్పులు పడుట నైజమే కాని ప్రక్షిప్తము లధికము

గాఁ దూటుట శ్రీసూరిగారి గ్రంథములకు సంభవించిన మహోపద్రవము. వారియందు గౌరవాతిశయమునఁ దమ రేమియా సాధించితి మనుతలంపున మంచిచెడ్డలారయక యుద్ధమైనగడ్డి నెల్ల గ్రంథమందుఁ జొప్పించుట శ్రీసూరిగారి గ్రంథములం దధికముగా నగపడును. అట్టిచీకాకులు లేకున్న నీధాతుమాల కెంతటిగౌరవము నొందెడిదో ? ఇదియే కాక శ్రీసూరిగారి గ్రంథము లముద్రితము లేవియైనను మనకు నిర్దుష్టముగ లభించుట దుష్కరమే. ఎట్లయినను నేను బ్రారంభమునఁ జేర్కొన్నంత యుపయోగ మిప్పటియీగ్రంథమునకు లేకున్నను దీని కవసరము గలదనియే నావిశ్వాసము. గ్రామ్యములో గ్రాంథికములో యగుధాతువుల నొక్కచోఁ జేర్చి వానియర్థము నిరూపించుట వ్యుత్పిత్సువుల కత్యంతోపకారకముగదా ? అందును గ్రామ్యరూపముల వలన భిన్నదేశవ్యవహారము సుగమ మగును. కావున నీధాతుమాలను బ్రకటించి యాంధ్రసాహిత్యపరిషత్తు మహోపకార మొనరించె ననుట కావంతయు సందేహము లేదు.

నరసన్నపేట, గంజాము.
20-1-1930

కత్తి సాంబమూర్తిశాస్త్రి.

గీ. హారణ మొసఁగుట మామకు నర్హమేచట, నఖిలకర్తకు నీఁదగునట్టి దెద్ది
యయిన సర్వస్వసందర్శనానుకూల, దక్షిణాలోకభర మిచ్చుతలఁపు నాది.

క. హారిదశ్వుఁడు హరి నీగతి, సరసచతురవచనరచన సమ్మోదితుఁగాఁ
గర మొనరింపుచు నానతి, పరమపురుషుచేతఁ గొనుచుఁ బలికెం గూఁతున్.

ఉ. ఓమదగణ్యపుణ్యవిభవోదయపూర్ణఫలస్వరూపపు
శ్రీమణి నీకతంబున గరిష్ఠగుణాంబుధి కృష్ణుఁ డల్లుఁడై
నామదిపూర్ణకామత ననంతసుఖం బగునట్లు సేసె నిం
కేమివిచార మీహిత మహీనతఁ జేకుఱె నీకు సుందరీ. ౧౫౩

గీ. భాగ్యసౌందర్యశీలానపత్నివైన, చాన నీకు సపత్నులు చాలఁ గలరు
వారిమదిలోనవిక్రియోత్పత్తిగగన, కుసుమసాదృశ్య మొందింపఁ గోరవమ్మ.

గీ. అంబుజాక్షి సర్వకార్యంబులందు, ననుసరింపుముహరిజాయననుసరించి
హరివథానుగతిస్ఫూర్తి నలరినీకుఁ, దల్లియగుచాయఁ బోలంగఁ దల్లి మేలు

గీ. వగలుగావించి మాయమ్మ వగలుసేయు, వానిబిడ్డన నడచుట వాసిగాదు
మాకు వన్నెగ నంతటమైత్రిపూని, భువనబాంధవసుత యనబుద్ధిగనుము. ౧౫౫

శా. అమ్మా మమ్మెడఁబాసితంచు మదిలో నావంత యైన న్విచా
ర మ్మానం బనిలేదు కాంతలకు నబ్రహ్మే యదెన్నంగనై
న మ్మానక్ భవదీయసన్నిధి జగన్నాథుండు నన్నుం గృపన్
సమ్మానింపుచుఁ జాయఁ దప్పడు నిజస్ఫారాక్షిగాఁ జూచుచున్. ౧౫౬

చ. సిరికి నివాసమైన హరిచెట్ట గ్రహించిననీకు లక్ష్యమే
హారణముగాఁగ నే నొసఁగునర్థము లైనను దండ్రి వట్టికిన్
హారణమొసంగు టిజ్జగము లాగమముల్ దగఁ దెల్పు నింతె కా
దరయ బిత్రుస్వకాంతు ధృఢమై మదిఁబుట్టెడు నెట్టిబోటికిన్. ౧౫౭

ఉ. కావున సర్వవస్తువులు గల్గుటకై సకలోపచారస
ద్భావముకై ద్యులోకతరుబంధురధేనుచిరత్నరత్నముల్
భావముఁ బొంగ నిత్తుఁ గొను భాగ్యవతీతిలకంబ వాని నీ
భావములో స్మరింపఁ గనుపట్టి ఘటింపఁగ నానతిచ్చెదన్. ౧౫౮

క. అని చాయతోడఁ గూరిమి, తనయామణి గారవించి తరణితనుజచే
వనజాపు డొకవిధంబున, ననుమతి గైకొనుచు నొందె నాత్మాలయమున్

క. కుహనారాజకుమారక, మహనీయగుణాభిరామ మైథిలకన్యా
పహరణపరఖరదూషణ, సహజావైరూప్యకరణ సత్యాభరణా. ౧౬౦

గద్యము.

ఇది శ్రీరామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి మాధవయజ్వ
సముజ్జ్వలత్కృపోక్షిత కటాక్షాసాదిత పాండిత్యాభరణ ప్రభంజనవం
శాబ్ధిరాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవ
సన్నయభట్టారక అహోబలపత్యాహ్వయకవిమహో
పాధ్యాయభట్టారకప్రణీతంబైన కాళిందీకన్యా
పరిణయం బను మహాప్రబంధమునందుఁ
బంచమాశ్వాసము.

చ. చెలులకతిప్రియత్వమె(గఁ)జిత్తముఁ గమ్మనివింటివాసిపూ
ములుకుల *క్రొవ్వడంపుఁ జు(ను) ముప్పిరిఁగొన్న నరాగగర్వమున్
నిలువ(వ)దల్చుచుం జెలువ నిల్చెను నొక్కెడ గ్రక్కకుండ నిం
తలు భళిరా భళీర మదిఁ దాఁకొనుసిగ్గుపటుత్వవైఖరుల్. ౧౧

గీ. మదనుఁ డను కర్త ధాతుండు గదియు నేని, ప్రియుఁడె యనుభావ శోభిల్లు నేని
వేకరంబుల నెరపొరబ్ధి యేని, చెలువ దాఁటంగ లేదయ్యె సిగ్గుకడలి. ౧౨

చ. వెనుకకు సిగ్గులాగఁ దమివేగము ముందఱ కీడ్వ నవ్వధూ
జనుని సహింప †భావమును సంధిలు మధ్యమభావ మైనచో
ఘనకుచ‡భారధారణము గాఁ జవ దంచు వదింపవచ్చునే
ఘనపదమాశ్రయించి కలకాలము §కుందెడివాని గానమే. ౧౩

క. వెడవింటిజోదు విరివి, గ్గుఱుసుపసం జేయఁజేయ గుఱుకుచ యొక్కా
క్కటి గాఁ బడకుం గడవిరఁ, గడుదూకం బయ్యె లజ్జగరిమం బంతో. ౧౪

చ. అలవలరాజు వైదలి రమాధిపు(కజ్జను) వేగఁ (1)జేర్పఁగా
వలమదలిర్ప నూటఁటలఁ బాయుచు గుప్పెడుఁ బువ్వుబాణముల్
చలనము లేనికూర్మి నవసం బయి మించినలజ్జ జాఱఁగాఁ
గలఁగుచు మోము వాంచెఁ గడుఁ గ్రమ్మెడుసిగ్గునఁ గ్రుంగి (2)తాన్ ౧౫

చ. చెలి తలవాంచి తెల్పె బయిచెఱ్ఱపు గ్రొమ్ముడిఁ జిమ్మచీఁకటిం
గలసి మెలంగు పావటచొక్కాటపుఁ జెంద్రపురేఖ చే మనో
మిళదనురాగవైభవము మించఁగఁ జాలదు లజ్జ నెమ్మెయిం
గలుగఁగ నేర్చు సత్వరితగామిత యాంఘ్రముల కెవ్వనం చొగిన్. ౧౬

వ. అప్పు డొక్క చెలికలువకంటి యక్కలికి నుద్దేశించి (యిట్లనియె.) ౧౭

ఉ. క్రొత్తగఁ బ్రాణనాయకునిఁ గూడఁగ నేగెడు వన్నెలాడికిం
బ్రత్తియె లజ్జ లోఁగొనుట కూర్మిచెలుల్ గడితేర్ప జేనికిం
జిత్తము రంజిలంగఁ దగఁ జేయుట యిట్టి విచిత్రలజ్జ మే
మెత్తటినైన విన్నయది యే కను చెక్కడిమాట యూగ్మలీ. ౧౮

వ. మఱియు నొక్కయింతి యక్కాంత కిట్లనియె. ౧౯

క. ఇటువంటి ముద్దరాండ్రే, కటుశరకుచకుంభవజ్రకంజరసీమన్
ఘటియింతురు నిజలీలల, నిటునటుఁ జననీక జీవితేశ్వరశుకమున్. ౨౦

(*) క్రొవ్వు- † భావము- ‡ భావధారణ- §కుందెడి. (1) జెప్పగా- (2)తోఁక

వ. వెండియు నొక్క తేటచెక్కులాఁడి యచ్చక్కనికొమ్మ కి ట్లనియె. ౨౧

క. నను వైచపూలపాన్పున, మనసూఱుచు నున్న వాఁడు మాధవుఁ డయ్యో
తనువునఁ గల్గుమృదుత్వము, మనమున నీ కెట్లు లేదు మంజులవాణీ ౨౨

వ. పిదప నొక్క బింబాధర యయ్యిందుబింబాస్య కి ట్లనియె. ౨౩

క. హరిఁ గూడక క్షణమైనం, భరియింపఁగరాదు మేన ప్రాణము లనుచున్
విరిసెజ్జఁ బొరలు నప్పుడు, దరియా(నక) యిట్టిలజ్జ దా నెటు సనునో. ౨౪

వ. మఱియు నొక్క ప్రౌఢ యబ్బేడిసకంటి కి ట్లనియె. ౨౫

ఉ. అక్కరొ నీవు నీమగని(యందపు)మోమ్మున లచ్చిరీతి నీ
యొప్పులఁ జూప్పుచుం దదధరోష్ఠసుధారస మానుచున్నఁ గాఁ
బొప్పెడు నీమనోవిదళనోదితరాగ మతండు సేయుఁగాఁ
దప్పితి వంచు మాటికి నదల్పఁగ సిగ్గది యెందుఁ బోవునో. ౨౬

వ. అంత నొక్క నిక్కులాఁడి యచ్చక్కఁదనాలకుప్ప కి ట్లనియె. ౨౭

మ. ఈచలజ్జాధర*గహ్వరంబున నరాగోద్వృత్తి కీ వేల దా
పరముం జేసెదు మర్మముం దెలియ మానజ్జన్ వృథా గాదె యె
వ్వరికైనం గనఁ జేటఁ జెందు మదిలోఁ బాటిల్లు రాగంబు
శరవక్త్రాంబుజరాగనామకమహాకర్ణేజపం బంకెటన్. ౨౮

వ. అనంతరంబ యొక్క పృథునితంబ యాకాదంబగమన కి ట్లనియె. ౨౯

ఉ. ఇంతచలంబు సేయు ఫలమే మని చెప్పినఁ గాక సేసె దో
కాంతరొ గట్టివాయి యని కాంతుని నెమ్మిఁ దోఁచునమ్మ శ్రీ
కాంతుని కెందమ్మో కలరు కాంతలు వారలకెల్ల మిన్నవై
కాంతమనోనురంజనముగా సుగుణంబుల వన్నెకెక్క వే. ౩౦

వ. తరువాత నొక్క యుగ్మలి యక్కోమలి కి ట్లనియె. ౩౧

క. అతినిబిడలజ్జ గాదిది, సతికి న్నదిలోన నువిద సంగమవేళం
గృతములకుఁ బ్రతికృతంబుల, నితరవ్యాపార మెడసి యెన్నఁగఁ జొచ్చెన్.

ఉ. అత్తఱి నీలవేణి నగ †వాఁగుచు నెచ్చెలులన్ నడించి యో
చిత్తజుమూర్తి కల్గి విచు చిత్తము నిల్పుచు నాదువిన్నపం
బిత్తఱి నాలసింపవల దెంతయుఁ బ్రొద్దు ఘనంగఁ జొచ్చె న
య్యుత్తమనాయకుం గదియ నొప్పుగఁ నెంతయు నంచుఁ బల్కఁగన్.

* గహ్వరము=నెపము. † వానుచు.

మ. లలనామన్మథ*మూర్తిదృష్టి విలసద్రాగావగావేగసం
†కలనాదీవ్యదపత్రపాధుని నెమర్గా ‡సెం దితభ్రాంతిచేఁ
బలెఁ గ్రొంజెమ్మట గ్రమ్మ మెల్లన రమాప్రాణేశశయ్యాంతిక
స్థలజాగ్రద్ద్విజాధినాయకమణిస్తంభంబు నండం గొనున్. ౩౪

క. కేళీవేళల శ్రీహరి, నీలాంగునఁ గౌఁగిలింతు నే నను క్రియ నా
చ్ఛాలిక కౌఁగిటఁ జేర్చెను, నీలస్తంభంబు సిగ్గు నెరయం గ్రమ్మన్. ౩౫

వ. అంత నక్కాంతం గడచి సఖీజనంబు సవినయభక్తిపూర్వకంబుగా మ్రొక్కి
ముందఱ నిలిచిన నీలవేణీనీలవేణి నీక్షించి జలజాక్షుండు నికటస్థలవిలసదు
గ్రకరనందనాసుందరేందు రేఖావిలాసస ముల్లాసబల ప్రబ(ల)విధవదంతరా
మోదజఃధిఫేనాయమానం బగుమందస్మితంబు ముఖాంబుజంబు నలం
కరింప ని ట్లనియె. ౩౬

క. చెలి వార్తలేమి? దేవర, గలిగినభాగ్యమున మనసు కడురంజిల్లన్
జలజాతనయన మిముఁ గన, వలయుచు వచ్చుటయకాని వార్తలు గలవే.

క. అలికుంతల క్షణదాముఖ, మలంలితతిమిరంబు గ్రమ్మె నది యేమి? హరీ
తెలివిఁ గొను కృష్ణపక్షము, వలగొను నీక్షణదముఖము వదలునెతముమున్.

వ. ఇట్లు సాభిప్రాయంబుగాఁ దనచతురోక్తికిం దగినయుత్తరం బొసంగు నాళీ
రంగనయనప్రౌఢిమకు ముదంబుఁ జెంది నందకపాణి పాణివలయాదిభూష
ణపూర్వకంబుగా నభినవాంబరతాంబూలంబు లందఱకు నిడి వెడలి చను
సంజ్ఞ నవతరింపం జేయఁ జాయపట్టికి నీచెట్టఁబట్టినదొర వంపువెట్టినవను
లకుం జనిమొద మమ్మరో తిరిగి వచ్చెద మిచ్చట నుండుమని మరుంగుగాఁ
బల్కి యచ్చెలుకలకొలుకు లొక్కింత వెడల ననంతరంబ— ౩౯

మ. చతురోక్తిప్రవిలాసవైఖరుల నంచద్రూపాలు నర్తిల్ల ల
జ్జితసంవిస్మిత కాంతముఖ్యలలితశ్రీవీక్షణాళీసితా
సితపంకేరుహమాలికన్ మదనకాఙ్క్షేయప్రభాపాళికన్
సితనీరేజదళాక్షి తేనిఁ గొనఁగెన్ సేవార్థమా కామకన్. ౪౦

ఉ. కామిత మేమియు న్మనసు గాంచనియట్టియవాప్తకాముఁ డ
కాముని తండ్రిఁ గామునిచొకాటపు బాణము భామ చూచు చెం

* యత్న † కలనందివ్యపదత్రపా. ‡ నిందితభ్రాంతి.

తే. మదిఁబుట్టువీరునియుదీర్ణపరాక్రమ మెచ్చి నిచ్చెఁ బో
రామికి నూనుచెంగటఁ బరాజయ మొందుట నీతియేకదా. ౪౧

క. హృదయగ్రంథి(వి)భేదము, మొదలంటఁగఁ జేయుఁబోలు మురారికి నపుడా
మదవతిహస్తగ్రంథిక, వదలించు టతిప్రయాసపాసిత మయ్యెన్. ౪౨

చ. కరమణికంకణధ్వనులు కామధనుర్గుణక్వణంబులోఁ
గరము ఘటిల్లఁ గేల్మొగిడి నొకానొకయత్నమున న్వదల్చి శ్రీ
హరి హరిమధ్య నంకతల మందు నొనర్పఁగఁ గాంత రాజిలెన్
హరిమణినీలవేదిఁ దొలఁకారెడు పుత్తడిబొమ్మయో యనన్. ౪౩

క. చెలికీలుగంటు మెలఁగెడు, నలివాతునిమృదులపాణినఖరుచిరాజుల్
కిలకిలనవ్వఁదొడంగెం, బొలుపూరెడు మేల్మిపయిఁడిపువ్వులసరులన్. ౪౪

వ. అప్పు డప్పురుషోత్తముండు మదనలీలారహస్యప్రతిపాదకకృతు లగుకృతుల నిరర్థకతాదోషంబు నిజానుష్ఠానమహిమంబున సహయింప నవధరించి యమ్మించుఁబోఁడి కిట్లనియె. ౪౫

ఉ. కన్నది కన్నకండు మఱి కన్నకఁ డ్డందపునీదుమోముచ
త్తెన్నఁగఁ గొన్న దిద్దృశదృగీహితవై యలరారు టబ్రమే
సన్నుతగాత్రి నిన్నఖిలసద్గుణసంపద ముజ్జగంబులో
నన్నులమిన్నయంచు విబుధాళి ముదంబున నోలలాడఁగన్. ౪౬

గీ. మానవతి నీవు శృంగారమయత రసిక, చిత్తమెంతయు నలరఁజేసెదవు గాన
నీకలంకారతృత ఘటింప నేర దెట్లు, భాసురైకావళీముఖాభరణగణము.

గీ. భూషణంబంగితభరించభూష్యమగుట, భూషణతఁగాంచియుంగతబూననగును
అర్థములు భావశబలతాద్యములువాని, కాంతరచియింపవేయలంకారములుగ.

ఉ. నేరుపుమీఱఁ గన్నుఁగవ నీటగు కొప్పునఁ గప్పు పూని శృం
గారము నీదురూపుగొని గారవమొప్పఁగ నన్భజింపఁగాఁ
జేరఁగవచ్చెనో తనదుసేవకభావము నాదుసేవ్యతన్
ధారుణి సుప్రసిద్ధముగఁ దా నొనరింపఁదలంచి నెచ్చెలీ. ౪౭

గీ. ఉవిద తావకసుగుణాదియోగమహిమ, వాసనాత్మక మగురతిభావమిపుడు
రసతఁ గైకొనె నీకు నీక్రమము గాన, వ్యక్తికతమంబ మనకు సిద్ధాంత మరయ.

ఉ. నేత్రము పర్వసంతటన నెమ్మి యొనంగెడు సౌష్ఠవంబుగా
సూత్రితరీతి నంగములు చొప్పడుపాత్రత నీకుఁ గల్గదే

మగువ నీకబరి మన్మథశరాయుధముగా జాలివాజంబుపోతజాను గాంచె
భామ నీక్రొమ్ముడి బర్హిబర్హంబుగాఁ జంద్రసంబంధచారు పయ్యోఁ
జెలువ చిత్రాళిపాళిగాఁ జికురభరము, సరసతిభరించెఁ జంపకచ్ఛాయుడాయ
ననుచు నఖరోచులంతటఁ గలసుచు డ, గొప్పు కన్యాన గోవి. దుఃఁ దొప్పుమీఆ

చ. కలికిరో మోము వాంచుటకుఁ గారణ మేమి కలంకిచంద్రువిం
దులఘుటియింకఁగాఁ గలుగు దుష్టుల కళ్ళల సైఁపలేకనో
తెలివి(ని)దప్పి పామరు లతిత్వర సామ్యము పల్కినంతనే
కలుఁగున సాటి లాఘవము గాఁ బనియేమి మృగీవిలోచనా. ౬౦

ఉ. ఎక్కడివింత మాచలి ........... తోఁకట సాటి ప్రొద్దు రా
మిక్కిలి మారుపంకజము మిన్నక పండితమాన్య లీమృషా
వాక్కుల కేల జిహ్వ యులవర్చిరి పంకజవైరి చంద్రునే
నక్కడఁగించుమో ........... యుసందగునే పయోజములో. ౬౧

ఉ. పంకజనీలపంకరుహభావము దాలుచు కన్నుదోయి మే
ల్పొంకము సైఁచునీదుముఖపూర్ణనిశాకరుఁ జూచి చూచి యా
పంక(జబృంద మెల్లఁ దల) వంపులకుం దగఁగాక యవ్వమే
పంకజ*నేత్ర నీకుఁ దలవంపు లహేతుకలజ్జ మెత్తురే. ౬౨

గీ. వనితరో మోముచందురు వాంచెదేల, కుటిలకుంతలతిమిరంబుకొఱ...
...నో యనుశంకనో వచ్చుచెప్పు, నిటలపాదేందు నేమించ నేరదెద్ది. ౬౩

గీ. చెలువ లజ్జను మోము వాంచితి వటన్న
నవధరించితో నీవు ముఖార్ధహాతిగ
విను హాతి దాన నెనయు నెట్టు
లదియు నొకచోట దోషత నంద దరయ. ౬౪

చ. మృగమదచిత్రకాకృతిని మీఱుకలంకము దానిఁజేసి యీ
మృగ†ధరుఁడేతదా(కృతివహిం)చు నటంచును మోము వాంచుటో
మృగ మసుగంధ మప్రియము చుమృష్ట మశృంగము దాఁ గలంకమే
మృగమదచిత్రకం బది సమృద్ధగుణాన్వితమా కలంకమే. ౬౫

చ. మృగమదచిత్రకానుగతి మే లగుఫాలము పిల్లతేఁటికిం
దగు లగుకేతకీదళము దా నగునం చొగి నెంచి కొప్పపే

* నేత్రి † మదుఁడేతదా

రగవడు తేఁటిగుం పెడసి యాడెడునందపుఁదేఁటిపిల్లల
న్నగు నగుగాదు ముంగురులు నవ్యపయోరుహపత్రలోచనా. ౬౬

గీ. ద్విత్వరహితంపుటాకృతిఁ దేజరిల్లి, ప్రాకృతాఖ్యాకభాషవా భావితద్వి
రేఫవైఖరి గలిగి త్రిలింగదేశ, సూక్తియవనోళ్లఁ గస్తూరిచుక్కబొట్టు.

ఉ. పిన్నఁదనంబు వక్రతకె పేరువడం దగఁ గాని లక్షణం
బన్న నెఱుంగనట్టి వని యయ్యరచందురమాను సోగనీ
నెన్నుదు రైజనించి కడునేర్పునఁ గైకొనియెన్ మృగీమదా
ఖిన్నతమాలపత్రరుచిఁ గీల్కొనులక్షణ మోమృగేక్షణా ౬౭

చ. లలితపుబొట్టు ఫాలముఁ గలంకి నొనర్పఁగ నర్ధచంద్రుతోఁ
డులఁ గన దన్నమాట మదిఁ దోఁచిన వాంచితె మోముఁదమ్మి యీ
యలికమునందు నందమగు *నట్టిది బొట్టిది దోషకారియే
యిల వ్యతిరేకభూష వదియింపఁగ హేతువుగాక కోమలీ ౬౮

గీ. చవుతి చందురుఁడలికంబుచక్కఁజూడ, మాకు పాలంభమగునని మాటుకొని తె
యది యుపాలంభవిమయతనందకున్న, నడిఘటిల్లుట వ్యతిరేకమగును భూష.

చ. రసవదమై మృ(దు)త్వమున రాజిలి లక్షణలక్షితంబునై
హసన మొనర్చు సాధుకృతి నందపునీనిటలంబు దుష్కృతిం
గనరఁగఁజూచు సామియయిగాంచిన చందురమామ నిక్కమా
యసదృశగాత్రి లక్షణము నందినయందమువొంకుఁ జెందమిన్. ౭౧

చ. మొయి లెడఁబాయుపూర్ణశశిముద్దులునించు(చు) రాణసించనో
వయివయిఁ గ్రమ్ముమం చెడయుపద్మము రీతి మెలంగ నేర్చునో
దయిత యవక్రపాభరము తారఁగ నీమువ నోష్ఠిశక్తి మే
మొయివిలసిల్లు సంశయము మేకొను నిచ్చట దానిఁ దీర్పవే. ౭౨

చ. వదన మవక్రపాతిమిరబంధతఁ గాంచినఁ జిమ్మచీఁకటిం
జిదిమెడు చందమామ నగు సేయక యుండునె తప్పఁ బల్కితిన్
వదనము సిగ్గుటీర్లు మయివ్రాలఁగ నేనియు నెప్పుడున్ బలెం
బొదలఁగ నిర్లవేళ రుచిపూననిరిక్కలతేఁడు నవ్వునే. ౭౩

గీ. కాంతిసం(ప)న్నవస్తువుల్ గణనసేయు, వేళనీమోముతరువాత వెలయుఁజద్రుఁ
డట్టిచోట వికల్పంబు పెట్టరాక, నగసు లమకల్ప మది యని చదువరాదు.

* నట్టిడి–

చ. నెల యిది యైన మస్తుయవనీరజముల్ వికసిల్లునట్లు దా
నెలయ రసా(ంబు)రాశి వడి నిక్కఁగఁ బంకరుహాంబు గానిచోఁ
గలిగెడు నేగతిన్ భ్రమరకంబులసంగతి దమ్మియైనచో
విలసన మెట్లు రేయి యిది వింతగు సంశయ మింతి తీర్పవే. ౭౫

ఉ. పీనులయా దం(లం)కృతిగఁ బెట్టిననీలపయోజపత్త్రముల్
భానుతనూజ నీయసితభవ్యకటాక్షవిలాసభూషణం
బూని వెలుంగ నీక్షణము లుత్పలకాంతి భరించు నన్నమా
టానఁగరా దొకించుకయు నాఁగవచ్చు విరుద్ధలక్షణన్. ౭౬

ఉ. తోయజవైరి యై మొగము దోఁచినవేళలఁ గన్ను లుత్పల
శ్రీయుతిఁ గాంచు వెన్నెలఁ బ్రసిద్ధిగఁ గ్రోలుచునుండుపుల్లు లై
పాయకనిల్చు మోము నవపద్మముగాఁగ నదెట్టులౌచు నీ
యాయతనేత్త్రముల్ మెలఁగు నౌర ముఖాక్షివిచిత్రవైభవల్. ౭౭

క. వరవర్ణిని నీనయనము, లరమోడ్పున మోముఁ జంద్రునండ మెలఁగుచున్
సురుచిరనీలపయోరుహ, సరసిరుహైకత్వజన్మసంగతిఁ దెలుపున్. ౭౮

సీ. శారదపూర్ణిమాచంద్రమోబింబంబు గర్వసర్వస్వంబు గాసిఁ జెందఁ
దరుణార్కకిరణసంధానజాగ్రన్నవ్యపద్మలాలిత్యంబు పటిమదక్కఁ
జంద్రాతపాస్వాదసమ్మోదమాద్యచ్చకోరవిలాసంబు కొదవగాంచ
మకరందరసపానమత్తమధువ్రతపోతలావణ్యంబు పొలుపుఁదూలఁగ
నెరి మొగంబెత్తి చూడవే నీటులాఁడి, వెడఁదకన్నులు విప్పవే బెడఁగులాఁడి
సిగ్గువడువేళ దప్పవే సిగ్గులాఁడి, నన్ను మన్నింపఁదలఁపవే వన్నెలాఁడి ౭౯

ఉ. ఓపరిపూర్ణచంద్రవిజయోజ్జ్వలవక్త్రశశాంకబింబ నా
చూపులపేరుగొన్నపరిశుద్ధచకోరములానఁ గాంతి దా
లోపము గాంచునంచు నవలోచన వాంఛెదె మోము నర్థినం
తాపము వాప నంపదకుఁ దక్కువె చంద్రుఁడు కీర్తికెక్కఁడే. ౮౦

గీ. విమలముఖచంద్రుసన్నిధి* వేగుగాంచు, కన్నులకు నివ్వడుం డెడుకమలములకు
సాటిఁ జెప్పంగనమరునే సాటియగునె, నెలకు నలరెడుజలజంబు గలిగెనేని. ౮౧

మ. అరమోడ్పైననుఁ దోఁచుకన్న † నెజీయానందంబు గైకొన్న నీ
వరనేత్త్రంబుల కెల్లసాటి యనఁగా వచ్చున్ (న)సంకోచతన్

* వేసు † నెరియానందంబు.

సరసత్వంబుఁ దొరంగి చూడ వెగటై సత్వాంతికిన్ దూరమై
ధరలో నుండెడు వారిజోత్పలములం దన్వీ జగన్మోహినీ. ౮౨

క. విలసనమహిమం బెంతే, కలిగియుఁ దంగట్టుఁ దిగి కలయుఁ జతురిమం
బలవడమి దుర్యశముక, జ్జలమై పైవాడు నీదుచక్షుర్యుగమున్. ౮౩

గీ. మగువ నీవు దృగుత్పలమాలయందు
మీలనాలంకృ(తి)యొనర్ప మెఱుఁగు గాదు
రూపఫలహేతువులఁ జాల రుచికరంబు
మిగుల నుత్ప్రేక్షఁ గావింపు సొగసులాఁడి. ౮౪

ఉ. అప్పతరంగల *స్మిగుల నప్పకుఁ దప్పదు కోప మంచు నీ
విప్పుడు చూపు చాలుకొననీక పెనంగెదొ యట్టులైన నో
యొప్పులకుప్ప కొప్పజిగియొప్పఁదనంబునఁ జాయ మాయఁగాఁ
దప్పక సేయ నప్పుమదిఁ దప్పవిలోఁచు బెఱుంగవైతివే. ౮౫

చ. తెలుపరొ సర్వలోకముల చేతుల మోడ్పులు గాంచఁగాని నేఁ
గలనయినం గరాబ్జములు గట్టిగ మోడ్పుబెఱుంగ నేటికిం
దలపలగన్ను వేదలి(యుఁ)బాయుడు †నన్నుఁ గృతార్థుఁ జేయ మం
చలికులవేణి సిగ్గునకు నంజలి సేసెనఁ జక్కఁ జూడవే. ౮౬

ఉ. ఎట్టివిశిష్టదేశమున నీశుక మెంతటి కాల మెట్టినో
మట్టిటుఁగా కొనర్చుచుఁ గృతార్థతఁ జెందెనొ నీకు మోవితోఁ
జుట్టఱికంబు సేయునతిసుందరపంజరకద్మరాగముం
గట్టిగ దొండపండచుచుఁ గ్రక్కున ముక్కున‡నొక్కుఁ జూచితే. ౮౭

ఉ. వీచులభూషణాంబకునవీనమృదూక్తులు ముల్ కటాక్షదృ
గ్లీనము లయ్యె వాని కవిగీతము శ్రుత్యవతంసభావముల్
గానఁ దదంతరాయఘటకత్వ§మయుక్తము కన్నదోయికిం
బూనిక తెప్పలెత్తి ననుఁ బొందుగఁ జూడుము సుందరీమణీ. ౮౮

ఉ. కన్నుల క్రేవఁ గన్గొనఁగఁ గారణ మేమి కటాక్షవీక్షణా
ఖిన్నమహేంద్రనీలమణికీలితమాలికలన్ శ్రవఃపుటా
పన్నగభీరకూపములఁ జాలఁగ నించుచు వానిమీఁదుగాఁ
జెన్నగ నేగి ముచ్చిలికిఁ జేకుట్రకై జతనంబు పూనెనో. ౮౯

* స్మితము † మన్కి ‡ నొక్కు § మయుక్తమ

గీ. వనితయరగన్నుఁగ్రొక్కానిను(వ)సుదెలియ, నాత్మ భావించెదో యట్టియాత్మనీదు
తనముబల్కినిసాకారతనుభరించి, చాక్షుషంబౌచు నుండెనుఁజక్కఁగను ౯౦
గీ. నాతి ప్రకృతాత్మతాప్రథానత్వమునయ, నతిశబ్దంబునకునీక్షణాన్వయిత్వ
మేలదయసేయఁదలఁతవు హేతువేమి, గర్భసాదృశ్యమబ్బినకతననిటులొ. ౯౧
ఉ. చక్కెరవిల్తుపుల్గులివి చక్కెరయోపిన యంత మెక్కి యీ
చక్కి మఱొక్కమాట వినసంగతిగాని తెలుంగు రాదొదల్
మిక్కిలిఁ జేయుచున్నయవి మిన్నక యుండెదనన్నుగాఁగ నో
చక్కెరబొమ్మ చక్కెరకుఁ జక్కెరయౌమృదులోక్తిఁ బల్కవే. ౯౨
క. నెలయందురు తామరయలి, వలుకుదు రీమోము బుధులఁ భవ్యామృతముం
చిలుకఁగరాదె మరందము, గులుకఁగవలదే బుధోక్తిఁ గులుచవలచెదే ౯౩
క. చిక్కను వాదగుభావము, నిక్కముగా నరచితంపు నెఱిపల్కులకుం
జక్కని చెలిరో యిప్పుడు, చిక్కెదు నీమధురవచనశృంగారములన్. ౯౪
క. రాలుగరఁగించునేరుపు, చాలఁగ నాకబ్బవనెను చందురుగర్వం
*బేలా చెల్లింపఁదలఁతు, రాలెల్లం గరఁగఁ బాట రహింపఁగదే. ౯౫
క. రూపవతి మామకశ్రుతి, కూపంబుల నమృతవృష్టిఁ గురియఁగరాదే
రూపింప నీమువదనం, బేపారెడు పూర్ణచంద్రుఁడే నిజముయిఁకన్. ౯౬
చ. పరుషము లౌచు నీరసతపట్టుయి †చెక్కులఁ డంకరించి ని
ర్భరవహనక్షమాన్పదతఁ బాటిలురత్నపుతొడుకుండలా
భరణములేల వీనులకుఁ బంకజబంధునికూర్మిపట్టి నీ
సరసమృదూక్తి భూషణము చాలు నలంకృతిగాఁగ వీనులన్. ౯౭
క. శృంగారవతి కుచద్వయి, సంగత మగురీతిఁ బల్కు సంగతము దగున్
భృంగాలక నిజువెల్లను, బంగారం బైన మాట బంగారమఁటే ౯౮
గీ. అరిదిమాధుర్యముత్తరోత్తరముగాఁగ, వస్తువులనెన్నఁ బంచమిప్రథమలమరు
సార‡భూమకుఁదక్వె మెచ్చుటకు నీకు, మధురసూక్తికిఁబయినెన్నఁ బ్రథమసున్న.
క. ప్రకృతి విక్రృతిన్మాలు, ప్రకృతి న్నీకవిత చిత్రపద మగు ననుచుం
బ్రకృతి వికృతి న్మాలు, ప్రకృతి న్నిరసించువారు పలుకుదు రింతీ. ౧౦౦
గీ. వనజలోచన నాదుగాయనత కొప్పి, యమళ్ళనైపాట పాడెదో యబ్రమొదవఁ
దరుణి హాయనతస్మితంబుగాఁగ, కొదవెఱుఁగక రామా వద్యోదవా చెపుము.

---

* బేలచలింపందలచెదు † చెక్కులలంకరించి ‡ భూమవద్గు

క. ఆపడఁతి కొంతఁ జక్కఁ, శోకం బెడయంగఁ బ్రేమలుప్తేతరమై
దీపింప బదులొసఁగఁగ, వ్యాపారకు దక్షి కృతము వామోదించున్. ౧౧౪

సీ. సుకుమారవర్ణసంఘటితస్వాకారంబు లలితప్రసాదన లక్షితంబు
శ్రుతికరమాధుర్యధుర్యస్వభావంబు సవిశేషపరివృత్తితాంచితంబు
సతతిరస్కృతవాచ్య మవిహీనదోషసర్వస్వంబు రసికానురంజనంబు
నగుచు సత్కావ్యంబు నందంబు గానియేని సవిస్మృష్టసద్వ్యధేయాంశమగుచు
ప్రీకపదమై పునర్దీప్తి విస్తరిల్లి, భూషణస్ఫూర్తులఁ గనంగఁ బోషణముల
గాటపట్టయియొకవింత తేటఁగాదియె, మోముఁ నీదని వెన్నుండుమూరు గానియె.

గీ. సాత్త్వికస్వేదజలసుధాశ్రయుతఁగాంచు, నలికచంద్రుఁడు విశదముక్తాళిపేరు
గన్నయామ్రియపేశలకాంతిధార, ఘనపదంబునఁబ్బ్వాచెఁ గలికికంబె ౧౧౫

మ. *ఉపమానాన్వయరూపకస్ఫురితమై యొప్పారుచుం జిత్రకం
బపరక్లిష్టతఁ జెందె నేనియును †వక్త్రాభిజ్ఞమా భాగ్యవ
ర్ణపదత్వన్నిటఁ స్ఫురత్తనకపత్రంబంచుఁ బద్మేక్షణుం
డపరిచ్ఛిన్నరసాదృతాశయత ముద్దాడె న్నిటాలస్థలిన్. ౧౧౬

గీ. చాన మోము విశేషోక్తిఁ బూనదిపుడు, సామ్యమందమిగుణహానిజాడఁ జొరమి
సునయనాంజనకవులకుఁ జాడనమరు, భావరసదృష్టు లందుటఁ బద్మనయన.

చ. భ్రమరవిలాసముల్ సభరభవ్యతరోత్పలమాలికల్ కటా
క్షములన చేసె మీల ‡వికస్వరత ల్లలితంబుగాంచె నే
త్రములు భళీర వైదుషి యుదారత యంచు గొగి నెన్నుచున్ రమా
రమణుఁడు చేసెఁ దన్నయనలక్ష్మికిఁ జుంబనలక్ష్మిఁ దోడుగన్. ౧౧౭

క. కంబుధరాధరసంగత, తాంబూలరసంబుసోఁకి తరుణేందువిభా
చుంబితనీలాంబుజములు, చుంబించెను సూర్యజాతచొక్కపుఁగన్నుల్.

క. హరికృతచుంబితపరిచిత, సురుచిరతాంబూలరాగశోభితదయుల్
తరుణ(శశి)కిరణచర్వణ, నిరతచకోరములనీటు నెఱపఁ(గ)సాగెన్. ౧౨౧

గీ. మురవిభంజనుఁ డవ్వేళ ముద్దుగొనఁగ, రమ్యతదధరపీఠికారసము నయన
పద్మములనత్త నుద్వేలబహుళరాగ, రసము వెలికుబ్బెనో యనరమణగాంచె.

---

* ఉపమానాన్వయ † వక్త్రాభిజ్ఞ ‡ వికస్వరతల్ సిలతంపు.

క. పంకజముఖికను కాటుక, పంకజలోచనుని మోవికయి సర్వేశం
బొంకమయి కనఁగనొప్పెన్, మంకెనవిరిమీఁద మెలఁగు మధుప మనంగన్.
గీ. సాంజనాతిచలేక్షణసంగమమున, నతులరాగాధరము కప్పునందె నపుడు
సాంజనాతిచలేక్షణసంగమమున, నతులరాగాధరము కప్పునంచు టవుదె.
గీ. అబ్జహితసందనామణియనుభవింప, చుట్టుఁ ముమాధుర్యరసముంచి మషిబిజాంక
ముద్రయిడి నిల్పు రాజిల్లు విద్రుమంపు నాళమనఁ బొల్పుఁగాటుకనలుపు మోవి.
ఉ. కాటుకకప్పు మోవిజిగి గాదిలివన్నెకు బొత్తుఁగూడు చుం
గైటభదైత్యవైరిముఖకంజమునం దనరారెఁ జూడఁగా
*మాటకి సాటియైన రసముఖ్యము లాదిమశోణశుభ్రముల్
మేటిప్రబంధరాజమున మేళన మంది మెలంగు కైవడిన్. ౧౩౧
మ. తొలుత న్నందునియింటిలో మెలఁగి నీతోఁబుట్టు కాళిందితీ
రలసత్కాననభూమి గోగణము సంరక్షించి తీమీఁద నీ
వలుచుం జెక్కిటఁ గేళిపత్త్రమకరీవారంబు పాలించెదం
గలకాలంబును బాలుపాల్యమె కనంగా నోఁచితిం గోమలీ. ౧౩౨
గీ భవ్యగండద్వయికిఁ గేళిపత్త్రములకుఁ, బొందుఁ గానఁగూడదనన్యభూషణంబు
పుట్టుమొదలుగ బలుగండములకు నోఁచు, నట్టియవిభూషణతకర్షమునఁ గనగునె
గీ. అతులవాసన నచలభావానుభూతి, నసమమార్దవగుణమున నప్రతీత
తాళతళ్యంబుచేఁ గదా తరళనయన, గలిగె నీచెక్కులకుఁ జంద్రఖండసంజ్ఞ.
గీ. అసితపక్షు†లగత్తుహిమాంశుఖండ, తుల యొసంగిననమృతంబు దొలుకవలదె
కలిమిలేములు దెలియంగవలయు మాకు, ననుచుఁ జెక్కిలి నొక్కె శ్రీహరి ముదమున.
గీ. మించుటద్దంబు నీచెక్కు మించునంచు, నెంచుకొనవిందు నదినిజమంచు నెంతు
నిందుబింబాస్యనా మొగంబిచట నిలువ, నమలినచ్ఛాయ ప్రతిబింబమబ్బె నేని.
గీ. ప్రకటదర్పణరుచిరేందుశకలములకు, నువిద నీచెక్కుల(కుఁ)బౌనరుక్త్యమనుచు
బుధులువల్కుదురిటదోషబుద్ధివలదు, శాస్త్రమరయంగ విస్మయస్థానమగుట.
చ. నిటలతటంబునన్ మెలఁగు నిద్దపుఁ గస్తురిచుక్క‡బొట్టులోఁ
గటికికలంక మాననుచుఁ గ్రమ్మితిఁ జుంబనవాంఛ నంశయం
బటమటమే కలంకపద మంచితలక్షణమే వచింపఁగాఁ
గుటిలవినీలకేశి యని కూర్మి నొనర్చెను జుంబనం బటన్. ౧౩౩

*మాటకు బాటయైన †గళస్తుహిమాంశు ‡బెట్టు

క. *పాయదు నంహస్స్ఫురణముఁ, బాయదు దనంకాశరూపభావాస్పదతన్
†వీయనువు మంగళమహా, శ్రీయను సత్ప్రోక్తి యమరెఁ జెలి వీనులకున్.

ఉ. ఇంచుకయేని లీలఁ గొనదీకొను వీనుల కేగుదెంచి నీ
యంచితనేత్రముల్ దఱుము నంతికకర్ణసుహృద్ధుసన్నిధిం
బొంచెను భీతిఁ గూపములఁ బొందవు నేత్రము లంచు మీఁలస్ర
క్రించినవాని కట్టిభయకీర్తన మొప్పునె కాచె సత్కృపన్. ౧౩౫

ఉ. కర్ణవతంసనామ మిటఁ గాంచెద దృక్ప్రభ నంచు విచ్చి యా
భ్యర్ణము సేరెఁ గావలయు నద్దిర యీయసితోత్పలంబు దృ
గ్వర్ణపరంపరాంతరధివాసతఁ గైకొని లీన మయ్యె ని
కర్ణమునందు భూషణ(త) గైకొను నేకరణిం గృశోదరీ. ౧౩౬

గీ. కర్ణమునఁ గల్వకను చాయఁ గప్పుకొనఁగ, మీలితంబయ్యెఁ గంటి వేలాలితాంగి
యింతిసామాన్య మిచ్చట నేలకలుగు, మహితధర్మవిశేషసంబంధ మెడయ.

గీ. బ్రహ్మమన నొప్పు శ్రుత్యంతలక్ష్య మగుచుఁ, దనరు నీ కల్వ శ్రుత్యవతంస మగుచు
నుపనిషద్రీతి నిది మన కొప్పఁబలుకు, వేత్తృవేద్యంబులకు భేదవిదళనంబు.

గీ. తన్వి యీకల్వ శ్రుత్యవతంస మగుచు, నాత్మరూపంబు లక్షింప ననుచితంబు
ఇచట రూపంబు లక్ష్యత నెవయ దెట్లు, దృష్టివిక్షేపమున నది తేటపడదు.

చ. కలువలు వీనుల న్మెలఁగఁ గారణ మేమి విభూషణంబుగాఁ
బలుకఁగ సాహసంబు గద భావము నీయది యేమి తెల్పవే
తెలిసెను గల్వ కన్నులకుఁ జేటల సాటగు నంచుఁ బల్కుచోఁ
జెలివిఁకిఁ దప్పువారలకుఁ జెల్వగఁ జెంతల వాని నుంచితే. ౧౪౦

క. అతినిమ్నశ్రుతికూపం, బతిపూర్తిగ మెలఁగి పైకి నడరుశుచిరసం
బతితీవ్రత వెడలించిన, గతి నున్నది వీనులందుఁ గలువ లోచెలువా. ౧౪౧

చ. సురుచిరహీరనీలముల సొంపగు కమ్మలకాంతిధార యే
కరణి వెలుంగుచున్నయదొ కంటివెఁ దామరకంటి శ్రోత్రకూ
పరమణమాధురీరసము పైకిఁ గడంగుచు జాలుసూపి జ
రసముతో ననం దగిరె నం చొగి నంటెను రెండువీనులన్. ౧౪౨

*బాయదునఘస్స్ఫురణము—†రెయినయవు

గీ. మృదుతనవికలభావత మొఱసివల్ల, వాదులకు నెల్లఁ దానమిూఁ దగుచునుండు
నీదు కెమ్మోవి యధరాఖ్య లేదు ముఖ్య,వృత్తి వికరీశలక్షణ వెఁయు ని తి.
గీ. అతివ నీమోవి యవవర్గ మగుట కేమి, కారణము గ్గు నది తేటగా నచిఁపు
మార్ర తెలి వబ్బె నదివరమూ మృతంబు,గాన వకవర్గభావంబు కలుగఁటయదె.
గీ. గరిత బింబోష్ఠి యనుపేరు గలదునీకు,నచటనుకమా న చ బంత్రుబి బ
శబ్ద మమ్మాటసిద్ధాంతసరణి సారదు,బింబమిది శేషము ప్ర బి బనుఁలుగ.
క. మృదుతన్ నత్తృతిరసనం, వదతం దనరారి న్త్రుబ ధ మ్మఁ దాఁ
బొదలి యు ను హాసవదలక్, వదలదు చిత్రంబు నీదు లైఱ కంతే.
గీ. వెలఁదినీమోవియకవర్గవృత్తి గాంచుఁ, బల్లవచ్ఛాయ రాగసంకడలఁ బొదలి
హాస్యవద మగునవవర్గ మబ్బుటరుదు, వల్లవాకృతి రాగసంవదలు పొదల.
ఉ. ఇంతిరో మోము చంద్రువిషయుత్వము సైఁవనియట్లఁ గెంపుమో
వంత సుధారసం బనఁగ నధ్యవసాయనహిష్ణుతాగుణా
క్రాంతము గాదొ తద్రసము కాదగునో యమృతంబుఁ గొంటి ము
న్నింతిది నిర్ణయింతు నని యింపుగఁ జేసెను జంబకుతుల్. ౧౮౭
క. కెంపుచునుమోవి లత్తుక, కెంపు ఘనంబయ్యె మిగులఁ గీల్గొనె నెఱడా
లిం వగువిడెమున మిక్కిలి, సొంపెసఁగెను రాగమహిమ సురదతుతులన్.
క. నగుచాయల ముకుముల్యము, జిగితోఁ బలుగంట్లు నిండి చెన్నెసలారెం
దగుమోముఁజందువలనం. దిగజాఱుచునుండు మేలుదివ్యాన్న మనన్.
క. మృదుపదమై రసవాసన, లొదవి లసత్కావ్య మనఁగ నొప్పెను నధరం
బుదితరసోత్కర్షం బై, ముద మొసఁగెనువ్రణము గుణత ముసయుంగాదో.
క. ఆమూలచుంబితం బై, లేమ రదచ్ఛదము పూర్వరీతి న్నిగులన్
శ్రీమెఱయుఁగ సంస్కార, వ్యామిశ్రితమంగళార్థ మన సంశయమే. ౧౯౧
క. చ్యుతసంస్కార మపాకృత, మత మనుకృత మగుట దోషమతి యనుచితమే
యతిచిత్రము మృదుపదమై,యతివకుఁబలుఁదెరయవాక్యమగుటఁదలంపన్.
ఉ. మంకెనపువ్వుఁదేనియలు మాటికిమాటికిఁ గ్రోలి సొక్కుచున్
శంక యొకింతయుం గొనక శాతరదక్షతముల్ ఘటించు న
వ్వంకకు డాయఁ గృష్ణమధుపాళిబిదె చూచితె నాతి యన్న న
ప్పంకజగంధి మాటుకొనెఁ బంబినభీతిని మోవి కేలునన్. ౧౯౩

క. అలఘువిలాసత గానా, కలితాజరభాంచితత్వకమకతగా నే
వలనునఁ జంపకమాలా, లలితత్వము నీకు నాస లాగెం జెపుమా. ౧౫౫

గీ. సుఖదమరుదంచితస్పర్శశోభితంబు, నవ్యవహితస్ఫురద్రసం బపయమంబుఁ
గైశికీవృత్తి యున నాస గడు వెలుంగు, నొకసరంధ్రత వదలక యుండుఁగాని.

గీ. మధురిమంబున నీమోవి మధురిమంబు, శంకపడఁజేయు నాసికాచంపకమున
వెడలి యొకురించినిలిచినవిమలమౌక్తికరందబిందువు నాముత్యమంద మొందె.

క. బిత్తరి నీనేత్రంబులు, ముత్తియపుంజిప్ప లనఁగ ముద్దుగులుకు నీ
ముత్తెము జన్యము గాదా, హత్తినప్రేమమునఁ జూడ సర్వము గాదా.

చ. అని వనజాక్షుఁ డంచితముఖాంబుజహాసమరందపాళితో
మనమున రాగసంపద యమందతఁ జెందఁగఁ జిన్నన వ్వొకోఁ .
బెనఁగొని ముత్తియంబు నొకవింతయొయారము దాల్ప నాసనా
ఖని యగునాసపై వదనకంజముఁ జేర్చుచు మాటిమాటికిన్. ౧౫౯

గీ. ఈవిధ మద్భాహుసంవాసయోగ్య మగుటఁ
బ్రతిభటస్ఫూర్తి సైఁపనిప్రభలుగొనుట
పేర్చుఁ గంఠంబుఁ గనఁగ నివ్వేళ నాదు
పాంచజన్యంబు మదిలోనఁ బాదుకొనియె. ౧౬౦

క. సతి నీమకొలికి కుపమే, యత యర్హామె యొక్కభంగి నది యొప్పంగా
నతిమృదుతన్ సుస్వనతన్, వ్యతిరేకం బచుచుఁ బలుకు నది చిత్రంబే.

గీ. కలిగికలుగమిఁ లగుఁగదాకంబుపునకు, నాత్మరూపప్రబోధంబునందునపుడు
గాన జడమగునది యెట్లుగాంచుసాటి, మాత్మరూపప్రబోధంబునందు మెడకు.

గీ. అర్ధనిద్రాన్వితం బగు నారకంబు, పతివ నీకంధరకుఁ జాల నలికియలికి
యట్టిదానికినుపమానతాస్వయంబు, గగనకుసుమంబుతో మైత్రి గాంచుసుమ్ము.

ఉ. చుంబితమై రొదల్ నెఱపఁజొచ్చినకంబువు*తోడిసాటి కం
ఠంబున కందఁజేసెదఁ గటా కట †మచ్చికయూని పల్కుచో
క్షంబుగఁ బల్కఁగాఁ దలఁపుఁగాంచి యకార్యము గాక కార్యమే
కంబువుసాటి కీర్తికరమే యది తీయగఁ బల్కనేర్చునే. ౧౬౪

గీ. సరసిజానన నీకంఠసరణిఁ దెలు(పు), ప్రస్ఫురద్వర్ణమాధుర్యవచనములకు
సాటియగు నెట్లు తతవాద్యజాతరవము, మధురమేనియువర్ణతమానదెపుడు.

---

* తోటిసాటి † మచ్చినయూనిపల్కుచోకంబుగ

క. ఓసరసురాల నిజముగ, నీ *సరసపు:గోలికి వెసలు నెఱపలుకులకున్
దోసము సరియన్న రసా, భాసాస్పదశుకపికాదిపక్షిస్వనముల్. ౧౬౬

గీ. తరుణి తలఁప నవర్థచేతనత నుండు, శుకము పికముఘనాగమస్ఫూర్తి నెసయు
మఱియుఁబికమెట్లు త్వద్ధ్వనినెఱి నెసఁగు, నీకు గళసూక్తిసలెవట్లుఁ గంపుగావు.

ఉ. తావకకంఠనిస్సరదుదంచితభారతి సద్గుణత్వసం
భావితమైన దోషముల భాసిలు దోషగుణత్వదూరతన్
భావుకు లెన్నదోషముల కజ్జ మెలంగదు దోషమా గుణం
బేవిధిఁ బూన దిష్టగుణమే కాను గంచు వచింతు రుత్తముల్. ౧౬౮

క. నీరసములు గాన నలం, కారము లివి గావు నీముకంఠంబునకున్
సా(ర)రసోత్కృష్టగుణా, ధారము లగునువచనములు తగుభూషణముల్.

క. పటుబాధస్ఫురితము లు, త్కటబహురసవస్తుసంవిధానకుము కుల్
†త్రుటితాసారా(?)రంధ్రము, లటు నుగుణములు విఘటిల్లునని గాసొమ్ముల్.

సీ. అనుకరణంబుచే ‡నగృహీతసంస్కారముఖనిత్యదోషసంస్ఫురణ మఱచి
శబ్దతత్త్వార్థవైశారద్యమున శ్రుతికట్వాదిదుష్టత కాకుసేసి
యంగాంగితాకథనాదిసాధనముల రసదోషనిచయంబు రాణఁగుంచి
వ్యక్తవాచ్యార్థప్రబంధౌచితీగతి రచనాద్యసర్హత రహిఁ హసించి
రసికులౌనసఁద్రిప్రకారత ఘటిల్లి, నాల్గువిధముల రచన మిన్నాసగంబుఁ
గొంచు నీకంఠమున నిస్సరించునంచు, వినికి నాకగునదికొల్లి కనువుసొమ్ము.

చ. అని వనితానురాగరసహర్షసముత్కటమానసంబుతో
వనజదళాక్షుఁ డయ్యతివబంధురపేశలకంఠనాళముం
దనముఖపద్మసంగతినిఁ దద్దయు ముద్దుఁదనంబు గుల్కఁగా
ఘనకరినాబ్జసంభరణకౌశలహస్తము మెచ్చెఁ దార్క్ష్యనన్. ౧౭౨

చ. కుచపదమండలంబున నకుంఠసజాతివిజాతిభూషణ
ప్రచయము శ్రీరసీరనయభావముతోఁ దిలకంపులక్రియా
ప్రచితము నాచు పద్రసము భాసిలఁజేయుచు దోషవిక్రియా
వచనము దూరమై మెలఁగ వర్తిలుచున్నది కంటివే చెలీ! ౧౭౩

సీ. నిరుపమనానామణీచిత్రరుచిరాజి డంబుమీఱిన రోహితంబుగాఁగ
భావనాతీతసల్లావణ్యపూరంబు సౌదామనీలతాచ్ఛాయగాఁగ

---

*సరసులకోలికి †త్రుటితనిస్సారరంధ్రియు- ‡నవిగృహీసంస్కా-

వత్సోర్ఘమౌక్తికపంక్తాళి సంతతధారవరయోబింద ధారగాఁగ
ముక్తాళిమధ్యగమోహనహీరముల్ లసమరువర్షోపలములుగాఁగ
లలితరుచివక్త్రశశిమండలంబుదిగువ, దండిమీఱుపయోధరమండలంబు
మా(మ)కమనోరథచ్ఛాయమహితసస్య,ఫలము లెల్లనుమిగులనిష్పన్నములుగ.

క. ముక్తాహారము లివ్వి వి,విక్తచ్ఛాయలు ఘటిల్లి వెలయఁగఁజేయుణ్.
ముక్తావద (?) మన్యమణీ,రిక్తత గన నీసముద్ధరించినకృతులణ్. ౧౭౫

గీ. పూర్వపూర్వవిశేషత పొసఁగె నుత్త,రోత్తరంబున కిది భూషణోత్తమంబు
నాతి యేకావళీభూషణంబు దీని,గన్న రసికులమది మోద మెన్నఁ దరమె.

గీ. రమణి! దీపకభూషణరత్న మిద్ది, మంజులైకావళీ యోగమహిత మగుట
మాలికాదీపకం బౌచు మామకీన, మానసము నాత్మనిష్ఠతఁ బూనఁజేసె.

క. *అరయ సరసత్వఘటకం, బురుతరలోజ్జీవితంబు నొప్పఁగ సుగుణ
స్ఫురణంబున నేకావళి, వరమాలంక్రియలలోనఁ బర్వెందుముఖీ ౧౭౮

చ. సురుచిరవస్త్రరాగపరిచుంబితనీలనిబద్ధహారని
ర్భరరుచిరాజి వింతకనువిందువు సేసెఁ ద్రివేణికైవడిం
గర మనురక్తి నేతదవగాహన మొందె మదీయభావ మ
బ్బురమె నిరంతసౌఖ్యరమ పొందుట యిత్తఱిఁ గామినీమణీ. ౧౭౯

గీ. లేమ నెలచొత్తఁ దారావళికిఁ బ్రకాశ,మబ్బుటరుదని యెంచంగ నగునెచూడఁ
దదుదరోమల నెనసి యుద్ధతపుఁజక్ర,వాకయుగళంబుజోడయివఱలనరుదు.

క. లాలితకుచపదమండల,మాలి నలంక్రియలు చాల నొప్పఁగఁ జేయుణ్
†బాల వీక్షింపు ముపమా,మాలనములఁ బొందుఁగొనుటమెచ్చు తలంపణ్

క. ఇక్కరణిఁ బలికి యమునపతి, చక్కనిరవణమునఁ జిక్కునడలింపుమఁ జణ్
జొక్కపుఁబూసత్తుల పై,నక్కొనఁగాఁ జేసెఁ గన్ను నెఱితుమ్మెదలన్.

క. మించి మహీధరగర్వ ము,డంచుట నిరమిత్రమౌ మిటారికుచంబుల్
కంచుకకవచం బేల ధ,రించెను గాళింది విస్తరించి తెలుపవే. ౧౮౩

ఉ. రంగు లెసంగుమేను మది రాణవహించుదృఢానురక్తిచేఁ
బొంగఁగఁ దద్బలంబునన పుట్టినతత్తనుకంటకంబు లె
క్కం గడుదుర్బలం బగుచుఁ గాంచనకంచుక మిద్ది వక్షుజణ్
భంగముఁజెందెఁ గన్గొను మభంగురలోలకటాక్షవీక్షులన్. ౧౮౪

---

*అరస †బాలావీక్షిం-

గీ. చక్రవర్తిత గొని యురిచక్ర మణఁచి, కటుమహాభోగమున నురోభద్రపీఠి
రాణఁ జేకొను భూధరరాజమునకుఁ, గోకచాఁటున మెలఁగంగఁ గొదవగాదె.

క. ఎడకు డిగి కూడ మా ఖళశిఖ నడఁచి జయింపంగఁ దలఁచు ననుచును జెలువా
కడుఁగొమకజాల కుచ్యోఁ, బడవిడి కుచకోకములను బంధించితివో. ౧౮౬

శా. కాంతాపీనకుచ బులాకృతిచమత్కారంపుగూఢధ్వనుల్
కాంతాసన్నిభపఙ్క్తినం బొగి నలంకారజ్ఞు లూహించుదృ
ష్టాంతవ్యాహృతి సార్థకంబుగ మదిం జాల న్విచారించి యో
కాంతారత్నమ కంచుకాకృతిఁ బరిష్కారించితే గుబ్బలన్. ౧౮౭

గీ. నడుమనెడుమిన్నుపైఁ దన మేడయై కనయ
ఘనఘనత్వంబు ఫలపమ్యోఁ గాని సూక్ష్మ
సూక్ష్మత ఘటిల్ల దనిలజ్జ సొగియు నవిక
చాఁటు కుచమందె నో యది నంది నరుదె. ౧౮౮

మ. అతిసూక్ష్మం బగుటన్ రహస్యతమమే యాఁగా స్వరూపంబు మా
నితిగా దానిమనాంగతం గొనుచు మన్నింపంగ దా సౌఖ్యముల్
నతి నీగుబ్బలు గొప్పగొప్పలగుఁగా స్వాయత్తసంరక్షకై
యతిగోప్యాకృతి మాని యుంపు టసదా యాత్మ న్విచారింపుమా. ౧౮౯

మ. అలగూఢధ్వనికి న్నిదర్శనము దా నాచుం జెలంగుంగదా
బలుచన్నుంగవ మున్ను నే నిపుడు తద్భావంబు సైఁప న్నమ
జ్జ్వల*రీతిత్వము నీవు మెచ్చుకొన సంపాదించెద న్గంచుకా
కలనం బాఁపు చగూఢమైనధ్వనితో గారాపుసాదృశ్యమున్. ౧౯౦

గీ. అనుచు హృద్గతతద్గ్రంధికపుకువికల, భావమొనగూర్చికంచుకావరణముడిపి
పరమకారణ మగువేల్పు బయలువఱిచె, సత్కుచాత్మస్వరూపంబు చాలఁ బ్రీతి.

క. కలికి చిననాఁడు చేతికి, బలుగుబ్బలి మేలుపూలబంతి యగుంగా
యలచేతి కిపుడు కుచమిది, బలుకొండై మేలపూలబంతియు నయ్యెన్.

గీ. మేలుబంతుల నెల్లను గేలిసేయుఁ
బ్రాయమెక్కినకొలఁది నీబలుకటికిత
నంబు గొను సూక్ష్మమొక్క గుణంబు సొరగ
నెనయు దపకాశసద్వృత్తమెట్లు కుచము. ౧౯౩

ఉ. కొండలనైన శేషవిరిగుత్తులకైవడి మీఁట రాజవే
దండముగ్గుండములె విరియు పాఁకెఁగ దక్షుకగల్గి మీఁటి యొం
డ్రాఁటిని డాసి మా తెఱుఁగకొండడు కోడెమిటారిగుబ్బలో
యండజయాన హస్తగత మయ్యెడుసూత్ర మదెద్ది తెల్పవే. ౧౯౪

క. పాలిండ్ల మరగి తిరిగి(తి,) హేలావతి(చి)న్నయప్పు డిప్పుడు నీమే
ల్పాలిండ్లు మరగి తిరుగఁగఁ, బాలయితిం గదవె కోర్కె ఫలియింపంగన్.

గీ. మగువ ! యేతత్పయోధరమండలంబు
బ్రహ్మాధరవ్యాత్తప్రమోదంబు బలియఁజేసె,
మదిరనేత్ర పయోధరమండలంబు
బ్రహ్మాభ్రమోదహేతువై పరఁగు టరుదె. ౧౯౬

క. గురుశుశ్రూషణ మవనిం, బరమసుఖం బిచ్చు ననుచుఁ బలుకుదురు బుధుల్
గురు(వ)కుచశుశ్రూషన్, నిరతిశయసుఖంబు మాకు నెలకొనదె చెలీ

గీ. అధరి ద్విజరాజచక్రంబుఁ డక్కఁ జేసి, మృదులతరసుమనఃపంక్తు లొడుఁగఁజేసి
మిగులనుద్ధతిగొన్ననీమెఱుఁగుగుబ్బ,మగువమర్దింపఁగమాకుమానఁదగునె.

సీ. కుచములు గిరులన్న గొబ్బునఁ బరుషత సాదృశ్యహేతువై చాలఁదోఁచుఁ
దోఁచిన మృదుతనూద్భూతకుచంబుల కదియైన వైషమ్య మనెడుశంక
బలుకుచంబులఁ పూలబంతులైన మృదుత్వమచ్చటఁ గారణం బనెడు తెలివి
వివరింపనత్తైల్వ ! పసుతకవకాశ మంబరకుసుమంబ యనెడు మనసు
కేలఁగైకొని మదిఁ బరీక్షింపఁ దెలియుఁ
బరుషభావమృదుత్వ*సద్వృత్తలత్వ
పీనతౌన్నత్యములఁ గొన్నిభేదము లిటఁ
గరణములు మాటికని చన్నుఁగవ గ్రహించు. ౧౯౯

మ. బలుకొండొక్కటి యున్న నాకరమునన్ బాగైనపూబంతినా
విలసించెం గద మేల్కుచంబు లివి యీవేళం గరాయత్తత
న్వాలయ స్వార్థమేని తత్సదృశత న్విక్రింతు నక్కొండ క
న్తలఁపొప్పన్ జనియించె నంచు హరి మిన్నాగుబ్బ లొత్తుం గడున్. ౨౦౦

క. అతికఠినపీనవక్షోరుహద్వయీవి, మర్దనము చేసి చేసియు మఱియు మఱియుఁ
గాంక్షపడునాడుమృగాక్ష హస్తకంజమింతి, చిత్రమిది యనికుచపీడ దెలఁగిచేయు.

---

*సద్వృత్తత్వ-

సీ. జోడువాయక కూడి జొబ్బిల్లెడు సుగంధభూరిపంకంబున బ్రుంగిబ్రుంగి
కమనీయకుసుమసంగ్రథితకందుకముల పలరులీలల వాడ నాడియాడి
గురుతరమత్తేభకుంభస్థలంబుల నెఱినాక్రమింపంగ నిక్కి నిక్కి
యతిఘనాత్యున్నతాహార్యరాజంబులఁ దడయక త్వద్ధతి దాఁటిదాఁటి
శ్రమజలం బూర టొక్కొక్కి చక్కనిలుచు
కుచకిశోరంబులను జూచి కోర్కె మీఱ
ముద్దు గొన *మనసూట్టెను ముదిత యనుచు
ముద్దుఁ జనుదోయి శ్రీసతి ముద్దుఁగొనియెఁ. ౨౦౨

గీ. చన్నుఁ దొక్కఁడు బాధింపఁ జక్రయుగళి
యింపుమీఱ నీదుగుబ్బలై యొనసి యిపుడు
చూడు బహుచంద్రభూషణస్ఫురిత మయ్యె
ననుచుఁ గుచముల నఖరేఖ లంటఁ జేసె ౨౦౩

క. నెల యొక్కఁ డేచ జక్కవ, లలికుంతల నీదుకుచములై జనియింపం
గలిగెఁ బహునఖచంద్రా, కలితతుహినపీడ యని నఖంబులు నాటెన్. ౨౦౪

గీ. సర్వగురుచిహ్నములు గానిచన్నుదోయి
సర్వగురుభావ మెఱుఁగంగ శక్య మగునె
యనుచు గోవిందుఁ డానంద మతిశయింప
లీలఁ గుచముల బాలేందురేఖ లిడియె. ౨౦౫

క. హరినఖపదచిహ్నిత మా, సురుచిరకుచకుంభయుగళి చూడఁగ నొప్పెన్
వరశుకకలితముఖదారిత, పరిపాకమనోజ్ఞలికుచఫలయుగ మనఁగన్. ౨౦౬

చ. గిరులకుఁ జిత్రపత్రలత గీల్కొను టబ్రమె కప్పురంబుచేఁ
గరము మెఱుంగులీనుమృదుగంధ మలందఁగఁ జేసి తెల్లదా
ల్గిరులకు సాటిఁదెచ్చి యటఁ గేళివసించు శివుండ నయ్యెదం
దరుణి యటంచు నించు హరి తత్కుచసీమ సుగంధపత్రముల్. ౨౦౭

చ. శుకము మహాగమాంతరతిఁ జూడ్కికి నింపగు దాడిమీఫలం
బకట పునర్విదారణము నందెదునట్లు ప్రయత్నమూనె నా
మొకము సమందహాసమయి ముద్దులు గుల్కఁగఁ గొమ్మ పైఁడిదా
ల్చకచకలూరుపయ్యెదను జక్కఁగఁ గప్పెను తొమ్ముఁ గ్రక్కునన్. ౨౦౮

*మనసుపుట్టెడు.

క. అతికఠినోన్నతవృత్తిఁ, బ్రతిశీకుండియును మధురరసమేరీతిన్
సతి నీకుచపదమండల, మతిచిత్రము మధ్యవృత్తి యగుచుం జెలువున్.

క. గేయ మగు నేకగురుతో, స్నేయంబై సర్వవృత్తనిచయాద్యంబై
పాయదు గా శ్రీవృత్త, శ్రీ యీవక్షోజయుగము శృంగారవతీ ౨౧౦

క. పరుషంబు లగుటఁ గుచకులు, సరళ బులు గాక యున్న నఖ చిత్ర చే
స్థిరము లగుచున్న వబ్రము, పరమాణుసమానమధ్య పరికింపంగన్. ౨౧౧

క. ఈకుచపదమండలమున, శ్రీకరభావమున మెలఁగు చెలువౌభావల్
శ్రీకర మభయశ్లేషమొ, కోకస్తని చాలఁజాల గుఱుతుగఁ గంటే. ౨౧౨

చ. మదభిమత(ంపు)శయ్యాయయి మానితభూషణమై యదోషమై
ముద మొనరించుఁ గావ్య మన ముద్దుఁగుచద్వయి చిత్ర మొక్కఁడే
సదమలగాత్రి సద్గుణము చాలఁగ సూక్ష్మతఁగాంచియేని దాఁ
గదిసి సారంగ నంది యటఁ గానఁగ శక్యముగాదు చూడఁగన్. ౨౧౩

క. ఈరీతిఁ గుచము లెన్నుచు, వారిజలోచనుఁడు కాంతివారస్ఫురణా
ధారము లగుదోర్మూలా, కారావారములచాయఁ గనుమీ లడరన్.

చ. చెలి కరపల్లవస్ఫురణఁ జెందినదోర్లతికాలవాలమై
యలరెడుబాహుమూలముల కర్పూము ఖాతము తీవె పూతచే
వెలయఁగ బాగుగా యనుచు వేడ్క నఖంబులునాటెఁ గతుకన్
విలసదనూనబాహువుల వేమఱు గందపుఁబూఁత దానిడన్. ౨౧౪

క. ఆరఁ గనుఁగొనిమె శ్రీహరి, యారుచి ముద మొనరఁజేయు హారిరత్నపుమే
ల్చేరుం జలిచీమలబ, ల్బారుం గలహింపఁ బిలువఁబంపెడుదానిన్. ౨౧౫

గీ. విన్నకొనునఁ బొక్కిటివేల్పుబావి, లేమ యాచెంత మధుకరాలీఢమగుచుఁ
గలదు పేశలరోమాళికల్పవల్లి, విబుధవరు లగుమా కొగి వేడ్కఁజేయు.

గీ. అతివ యున్నంతమేనికి నహివరేణ్యుఁ
డభిమతంబైన తల్పమై యలరఁజేసె
నిపుడు రోమాళిభుజగేంద్రుఁ డీకరాబ్జ
మునకె తా శయ్య యగుచుఁ బల్మిద మొనర్చె. ౨౧౭

క. మాయానరేంద్రహస్తే, చ్ఛాయల రోమాళిభుజగచంద్రుఁడు మిగులం
జాయవహించెను జిత్రము, ఛాయాసుత నీవుఁ జూడఁ జనదే చెప్పుమా.

గీ. పరమబంధమయం బౌటఁ బరఁగుగాఁడ, రీతిఁ బోలెను జనుదోయి లేమ యట్లు
గానరోమాళి యనుపేరు పూనుచీమ, బారు పయి కెక్కు నాభిగహ్వరము వెడలి.

ఉ. పొక్కిటికోమనుండి వలపుంగిరులంచుఁ గుచంబు లంటఁగా
గ్రక్కున నిక్కు నీలఫణిరా జొకొ పొక్కిటిపాదునుండి పెం
పెక్కఁగ నిక్కుచున్ బయట నెంతయు స్రుక్కుచు గబ్బిగుబ్బలన్
జొక్కపుకొండలం చడరి చొప్పడు తీవెయొ యిద్ది దెల్పవే. ౨౨౧

గీ. రమణి మంజులరుచిరోమరాజిభుజగి, తరుణకృష్ణభుజాదంపద దశూక
రాజు తనుగూడ నెంతేని రమణఁ గాంచెఁ, జూచితే యిద్దుఁ దెలితేట చూపులాఁడి.

కం. ఆతల నీతల దేశము, లేతఱి నైనన్ సమృద్ధి నెనయఁగ దూపా
పేక మగు మధ్యదేశము, ఖ్యాతిగ నిట నహిభయంబు కలుగుటకతనన్.

కం. కాళిందిమధ్యగత మగు, కాలాహి న్నాదుపాదగతి మర్దింపం
జాలితిఁ గరమున నిపుడీ, కాళిందీమధ్యగాహిఁ గడఁగితిఁ బెనుపన్ ౨౨౪

కం. అండఁ గొనువారి భూధర, మండలవతు లగుట మిగుల మహిమంబులచే
నుండుకొన మెండు లేమిడి, యుండగువారల*ను బీడయుంటఁగ సాగన్.

గీ. కన్నరో కంటివే నీకు చిన్న నడుము, మిన్ను ముట్టిన కలిమి చేకొన్న దేని
మొన్న నబ్బుర మిద్ది దానున్న దిక్కు, నెట్టి నెఱవాదులకు నేని మొఱుఁగనీకు.

ఉ. ఉరుకుచభూధరంబులకు నొవ్వగఁ బ్రాకులతాసుపత్రముల్
కరముదలిర్పఁ బొక్కిటిచొకాటపు బొడ్డవబావిలోని యా
ద్యరసపు జాలనా మిగుల నందముఁ జెందెడు రోమరాజి యం
చరుదు ఘటిల్లఁగాఁ బొగడు నచ్యుతుఁ డా రొగిఁ గేల నంటుచున్. ౨౨౭

ఉ. విప్పగు నాభిదీర్ఘికను వెల్వడి మీఁదికి వేగఁ బాఱు మే
ల్లిప్పరసంపుజాలుగద గట్టిగఁ జొక్కపురోమరాజి యం
దొప్పగు లేఁదరంగలర రోద్గతదంతురరేఖలో కడే
రొప్పులకుప్ప యీవళు లహో యని మాటికి నంటు మువ్వళిన్. ౨౨౮

గీ. కాదు భావంబు దృష్టికిఁ గానరామి, పటుకుచద్వయిఁ బూన నభావ మెట్లు
నాతి యటుగాన నుభయభిన్నంబు కౌను, మత్స్వభావంబు గనుటచే మాకు ముద్దు.

కం. సర్వద్రష్టను నేనను, గర్వం బిఁక మానుఁగలదె కనుపట్టదుగా
పర్వేందువదన మధ్యము, సర్వపదార్థాంతరాళసంగత మయ్యున్. ౨౩౦

*నపీడ కట్టఁగసాగన్.

గీ. సత్త్వమొనగూడకున్నను జాననము, విష్ణుపదపదమయ్యెడువిధముపిదప
విష్ణుపదపదమయ్యెడు విధము లేమి, సత్త్వమొనగూడననినవ్వెఁ జక్రధరుఁడు.

కం. ఘనజఘనకుచపదంబులు, కనవయ్యెను గురువులగుచుఁ గమలదళాక్షీ
తన వింత మధ్యపద మిది, కనుపట్టెను లఘువిలాసఘటితం బగుచున్.

సీ. బలుకొప్పుకార్కొగుల్ బాగుగా ధరియించి తులకించువదనచంద్రుని భరించి
గంధిలనిశ్వాసగంధవాహముఁ బూని తనతారకుచపర్వతంబు లూని
తన్మధ్యసంధానితనభంబు గైకొని పంచభూతమయప్రపంచ మూని
సూక్ష్మాతిసూక్ష్మ మై చూడ్కికిఁ గనఁగాక మాయాభిరామమై మహిమఁ గాంచి
తనమహాకాశపద మొప్పఁ దనరు నడుము
పరమసూక్ష్మత మను విష్ణుపదతఁ గాంచు
నిపుడు మద్దేహసంగతి నెనయు మిగుల
విష్ణుపదభావ మని కానఁ బడికిలించు. ౨౩౩

గీ. వెలఁది తారుణ్యరసమహావేణియందు, బంధురావర్తమై స్వర్ణపద్మమయ్యె
నతిగభీరమహాహ్రదంబయ్యె మెలఁగు, వేడ్కఁ గనుఁగొంటివే నీదు వెడఁదనాభి.

చ. కలితతనూలతం గలవికస్వరనాభిసుమంబులోపలన్
మెలఁగుచునుండి మీఁదటను మేల్వలపుల్ గులుకం దదుద్భవో
జ్జ్వలకుచగుచ్ఛముల్ గొనసవారణమై బయలొప్పఁ బిల్లతేఁ
టులజిలిబారునా జిగిఁ గనుం దనరారెడు నారుఁ గంటివే. ౨౩౪

గీ. కాంత యేలోకమునునైన గగనకుసుమ
దర్శనము సేయ నొకఁడైన దక్షుఁ డగునె
యిప్పు డీమింటఁ గనుఁగొంటిఁ దప్పుగాదు
చారుభాస్వరవికసదంభోరుహంబు. ౨౩౬

కం. శృంగారరసం బిచ్చటఁ, బొంగెదె మధురంపుగుణము పొలుపారఁగ నో
యంగన మధ్యమవృత్తిం, సంగదె మాధుర్యగుణము సంశయ మేలా.

కం. పునరుక్తిపలెను నుడికిం, గనవయ్యెను నాభి మించు గడురూపమునం
బునరుక్తపదాభాసం, బనఁగ నలంకృతుల నెఱుక నందుట లేదే. ౨౩౮

గీ. పంకజాతాక్షి యీకరపంకజమ్ము, చొరఁగఁ దలఁచెను దాఁబరసుఖముఁ గోరి
చలువమీఱెడు నిమ్మహాబిలబిలంబు, సన్యకార్యసమాసక్తి యంత పదలి.

మ. అలమింటన్ సురదీర్ఘికం దెలిగజా *బాత్మాయతాంచత్కరం
బెలమిం జాఁచుచుఁ గ్రీడసేయఁగద కృష్ణేభంబు కాన్పించె నీ
చెలువంపుంబలుదిగ్గియం బ్రమదిమై చేసాఁచి ప్రశంసఁగాఁ
దలఁచెం జూచితె యంచు నాభికదళం దార్చెం గరాంభోజమున్. ౨౮౦

మ. హృదయగ్రంథి మహాదృఢం బవుఁగదా యివ్వాణ్యు నీక్షింపఁగా
వదల న్నొకలత్మ్యమా యతనికిన్ భావింపఁగా నంబరా
స్పదమా గ్రంథిత వాస్వభావ మనుచుం బాటిల్లుభీతిం గడుం
జెదరె న్నీవి మనోహరాంగి కనుచుం చిత్తంబులో నెన్నెదన్. ౨౮౧

క. ముడితోడన వడిమీఱఁగఁ, గడుసాగెఁ గటి నెసంగుకనకాంబరమున్
సుడివాలుదాల్పుధైర్యపు, ముడి సాకల్యంబుగాఁగ ముద్దుగ జాఱెన్.

ఉ. అత్తఱిఁ జిత్తజుం గనినయట్టిమహాత్ముఁడు రత్నభూషణం
బొత్తు నటంచు నాత్మమృదులోజ్జ్వలచేలచెఱంగు మెత్తనా
మెత్తగఁ జేసి యందిటను మేలిమిబంగరుఁబోఁడిఁ జేర్పఁగాఁ
గుత్తుక పాంచజన్యమునఁగూడినచాయ నొనర్చె నచ్చటన్. ౨౮౩

క. నవ్వుచుఁ బువ్వులతూపుల, గ్రొవ్వుచుఁ బుష్పాయుధుండు గుప్పుచుఁ దిరుగన్
దువ్వుచుఁ గటిపై †జాపులు, రువ్వుచు వెచ్చిందు తిగ్మరుచిసుతఁ గనియెన్.

సీ. వివిధరత్నప్రభావిస్ఫురన్మేఖలానూపురావిచిత్రత మనుటకతన
సూక్ష్మాతిసూక్ష్మత శోభిల్లుకతమున బహుగుణాశ్రయతచేఁ బరఁగుకతన
నంత(టం) దనురోచు లడరించుకతమున నర్ఘ్యజనంబున నబ్బుకతన
మాలిన్యలేశంబు మలయనికతమునఁ గటినుప్రపంచంబు గ్రమ్ముకతనఁ
దరుణి మామిత్ర మిమ్మహాంబరము గానఁ
దనకుఁ దా విడి మాకుఁ హితం బొనర్చె
మేము చేసినదని గాదు లేమ మాకు
నేర మించుకయును లేదు నీవు గినియ! ౨౮౫

గీ. భామ కర్ణావతంసాదిపదములందు, జఘనకాంచికమానగజఘనపదము
గణితమై యున్నదో కాదో కలిమి లేమి,నీ వలంకారపతివిగా నిశ్చయింపు.

క. విరసంబె కనుపట్టెను, సురధునిసికతామయంబు జో డనఁ దగునే
పరమాద్భుతసుమమారన, మిరవొందఁగఁ గాననైనయాకటితటికిన్.

* బాత్మగతాంచ † మాపులు

గీ. అతివ కాంచి గుణస్థాన మగుటకతన, నేతదుజ్జ్వ వరదరాజేష్టవాస
మొట్లు గాకుండు నిటవసియించుమనట్టి, వరమపూరుషు సతనుతాపంబుగొనుని

గీ. చామ యాకటిభూధరచంద్రమునకు, లీల భూచక్ర మంతయు నేలఁజాలు
భాగ్య మొనగూడ గిరిదుర్గపాలనంబు, పులినదేశంబు నేలు టబ్బురముగాదు.

క. ఈ కాళిందినితంబము, జోకై మాక్రీడ నమరఁ జూపెను మదిలో
నా కాళిందిమనోజ్ఞత, రాకృతిపులినస్థలీవిహారము లెల్లన్. ౨౫౦

గీ. అపదశౌందర్యమై కటి యుపహసించఁ
బ్రాకృతవ్యాకృతిని జిత్రరసముఁదోఁచు
నొక్కయెడ నద్ది పురుషత్రయోజ్జ్వలంబు
ప్రథమపురుషైకసంస్పర్శభవ్య మిద్ది ౨౫౧

గీ. కటిపదంబున *వర్ణసంఘటిత మగుచు, జఘన మభిధకు సాటియా సన్నితంబ
మాత్తవశ్చాన్నిరూఢిమై యుందులకు,నాభి యాఖ్యంబురుచిగాంచి వ్యక్తిఁబోలు.

క. నిరుపమసంభ్రమ మొదవఁగఁ, గరిగామిని కుంచితంబు గావింతు నిటం
బరమాద్భుతరస మొదవఁగ, వెరవు దలిర్పంగ †నే వివృత మొనరింతున్.

సీ. పొంగుచు నీకటిరంగస్థలంబున శేమ చక్రభ్రమరిం ఘటింతు
వనుమోదభరమున నంబుజలోచన లీల ఛత్రభ్రమరిం దనర్తుఁ
గువలయేక్షణ కోర్కి గొనలుసాఁగుచు మీఆకుద్వృత్తమునఁజాలనొఆపుగాంతు
నురుతరమై రాగ మొదవ నున్నతవేణి రథచక్రచారిత రమణనింతు
నతివ యిట్టు హరిక్రాంత మైయొనంగ, జతనపడుచును వైష్ణవస్థానమై పొ
సంగ‡వ్యాకృతినొందచుఁ జతురవృత్తి, మెఱయు నీవేళ నీచేత మిప్పుగొందు.

క. ఈరీతి వచింపుచు హరి, చారుదతీపీనజఘనసంగమమోదా
కారపయోనిధి నీదఁగ, నేరీతి న్వెఱపులేక యెడమెలఁగంగన్. ౨౫౨

క. ఊరువులందుచుఁ దద్గత, చారుమృదుత్వంబుఁ గాంచి సరసకదళికా
కారంబు లధికకఠినవి, కారము లని మనసు సాక్షిఁగా నిట్లనియెన్. ౨౫౩

గీ. లలన(నీయూరు) యుగళిపేశలతవలనఁ, బరిభవముఁజెందఁ గదళి కాతరుపనంగ
నయ్యె నచ్చట నమసనార్థాంతరంబు, లోకవిభ్రాంతిమూలంబు గాకయున్నె.

గీ. తరుణి యూరూత్తరపదోక్త్యధాయకత్వ
మొందుయోగంబునఁ ద్విదూరుయుగళపర్య

* వర్ణసంఘటిత † కేలికృత్తమొనర్తున్. ‡వ్యాకృతినొందుట

దానఁ గనఁడయ్యె ముని త్వరితంబుకతన
సభ్రమే వార్తికోక్తుల నతఁడు గొనెనె. ౨౫౬

క. అని యూపద్యయుపొందిక, కనితరసాధార(ణ)ంబు హర్షముగొనుచుం
గనకపుటొల్లి యువెలుపు, కవకాంగిపదద్వయంబు గనుఁగొను చనియెన్.

గీ. ఆంతజాఘూ(?)సద్వృత్తియై నలంగి, లలితవర్ణోయరీతుల లక్ష్య మగుచుఁ
దళుకులీనునలంకృతధ్వనులఁ దనరి, రమణి సొగసైన యీపదరచన వెలయు.

గీ. హారిరస్పర్శసంజాతహర్ష విభవ, యతులమృదురూపనీరజాతాధివాస
లక్ష్మి నీపాదముల సేవ లొసగుచున్న, దింతకన్నను భాగ్య మిం కేమి నీకు.

మ. అను చంఘ్రిద్వయదర్శనాగతమహాహర్షంబు లోకాళిక
ల్పనసత్యల్పవిలాసతం గొనునిజస్వాంతంబు నాత్మాశ్రయం
బన కెం తేవడి మీఁటి శ్రీధవుఁడు ప్రోయాలిం దగం గౌఁగిటం
జెనయంజేసి కుచాంతరం బురము నాశ్లేషించెఁ జెన్నొందఁగన్. ౨౬౦

చ. అతినిశితంపుటగ్రముల నందెను బల్చనుబొంగరంబు లు
న్నతి మిగులంగఁ దాఁక జిగిఁదప్పదురంబు నురంబు(దాఁ)కినన్
క్షతి యొకయింతలే కడరుచక్కనిగుబ్బలు రెంటిదార్ఢ్యముల్
ప్రతిఁగొన *నొక్కుఁడొక్కటికిఁ బాయనిసాక్షులు యుక్తయోగముల్.

గీ. ఘనలసద్వంశమునఁబుట్టి జనులొనర్చు ఛిద్రముల కోర్చి శుద్ధనిర్ణిద్రవృత్తిఁ
జాలరాణిల్లు మేల్ముత్యసరులు విడుచు, సద్గుణంబుల సుద్ధతాశ్రయముకతన.

గీ. ఆంతరం బగుసార మావంత లేక
బయటఁ దెల్పులుగొన్న యాస్పదముగన్న
నొక్కటతి హాని యగు నని యొప్పఁబలుకు
చతులహా(రా)ళిసూత్రంబు లపుడు విరిసె. ౨౬౩

గీ. ఛిన్నసూత్రంపుముత్యముల్ చేయువేళ, నవ్యనక్షత్రమాలిన్న నవ్వఁ గాదు
ముత్యములు నాభిసరసికి మొనయునపుడు, తతపయోధరగళదుదస్రుతములయ్యెం.

ఉ. కంచుకనామసత్త్వచయగర్భగతత్వ మఖండసారభా
వాంచితులైనవారలకు సర్వముగా దని వీడనాడరే
కొంచెపుఁబూఁత తొడగున కూడున కీర్తులు కార్యవేళ నం
చెంచి కుచంబుపూఁత నెడయించె ననం గడువీడెఁ బూఁతయున్. ౨౬౫

*దొక్కుడొక్కటికి

క. బలయుతు లన్యోన్యంబును, బలవత్సంఘర్షసేయ బలమఱి నడుమన్
నలఁగెడునది చెడు ననుచుం, దెలుపుమఁ గుచపత్త్రకాళి దెరలెన్నిగులన్.

మ. పతదుత్కర్ష మఖోరుదోషగుణసంబంధాభిజ్ఞత్వసం
గత మౌదార్యసుకాంతిముఖ్యగుణసాంగత్యాభిరామంబు నా
సతిచక్షుర్ద్వయి యలంకృతాన్యమయినన్ సత్కావ్యముం బోలి శ్రీ
పతిచిత్తాబ్జమునం బ్రమోదభర మాపాదించె నంతేనియున్. ౨౬౯

వ అంత ననంతలీలాపరాయణుం డగు నారాయణుం డమ్మానవతీరత్నంబు నయత్నాయత్తాసాధారణాంగన్యాంగలావణ్యం బనిదంప్రథమపరిదృష్టం బయ్యు నిదంప్రథమావలోకనసంపాదితానుపమానకుతుకంబు మనంబునకు *నాపాదింపం దలంపులో నిబ్బరంపుటుబ్బరం బాగుబ్బుకొన నోయలినీలకబరీ కబరీభారంబున నుదాత్తాలంకారంబును గలితాలికాలకంబున వక్రోక్త్యలంకారంబును గమలాననంబున వికస్వరాలంకారంబును గన్నుదోయి నుత్ప్రేక్షాలంకారంబును గలికానాసిక లలితాలంకారంబును గపోలయుగళిం జిత్రాలంకారంబును గర్ణంబులఁ గుండలీబంధాలంకారంబును గన్నుబొమల దృష్టాంతాలంకారంబును గమనీయాధరంబున రసవదలంకారంబును గంబుకంఠంబున నత్యుక్త్యలంకారంబును †ఘనకకుంభకుచంబుల ‡శ్లిష్టరూపకాలంకారంబును గనద్బాహుల మాలికాబంధాలంకారంబును గరతలంబులఁ బద్మబంధాలంకారంబును గప్పునూగారున నాగబంధాలంకారంబును గనకచ్ఛాయంపువళుల విషమాలంకారంబును గొనుదీఁగె సూక్ష్మాలంకారంబును గభీరనాభి నతిశయోక్త్యలంకారంబును గటితటుల సారాలంకారంబును గరభోపమోరుల రూపకాతిశయోక్త్యలంకారంబును గాదిలిజంఘల ననన్వయాలంకారంబును గలపదంబుల విరోధాభాసాలంకారంబును సర్వాంగంబుల సమాలంకారంబును భరించునించుఁబోఁడివి గావున నానాలంకారలీలామూలాస్పదంబ వయి వెలుంగెదవు గావున ననుపమవేణి సుతనువగుటకు సంశయం బాశయంబున నుదయింప నేర్చునే యనుచు నగుచు నవ్వారారోమాసిజపటుతరవిశాలదోరంతరారోహం గావించి చాఁ బ్రొద్దు పుచ్చుకొన ననంతరంబ. ౨౭౦

---

* నాసాదింప † ఘనకుచంబుల ‡ శ్లిష్టోపమాలంకారంబు

ఉ. అత్తరళాయతాక్షి యసమాయుధపూర్వరణంబు హృదా
యత్తునిచిత్త మాత్తకుతుకాతిశయంబునఁ జేసె వ్యక్తిగా
ఘాత్తచమత్క్రియం బయి కరస్తుశబ్దవిశేషవాచ్యమై
యుత్తమకావ్యముం బలె సదుజ్జ్వలభావరసప్రధానమై. ౨౭౧

క. దయపడుటనో గురుజను లని, భయపడుటనో భ్రాంతి నేమొ బాణాసనరో
చ్చయములు గనువాడుటనో, కయి నిర్వ్యాపార మయ్యెఁ గందర్పునకున్.

చ. అలరులవిల్లు నీరసత నందఁగ నాఁకటిచిచ్చు హెచ్చఁగా
*వలియుచు వీడివీడిపడు బంభరపాళి ధనుర్గుణంబుచేఁ
గలుగదు కార్యసిద్ధి యని కంజశరాసనువీనుఁ డత్తఱిన్
విలు గొనకుండఁగా నిడియె వేళను యూనతి కేలుఁదమ్మికిన్. ౨౭౩

సీ. సజలాంబుదంబున జతకూడి యెడయక మెఱయుచుండెడు కారుమెఱుపనంగ
హరిమణిస్తంభంబునందుసందము మీఱఁబూన్చి జెక్కిన పైఁడిబొమ్మ యనఁగ
దనరారుసహకారతరు (వు)తోఁ బెనఁగొంచు లలిమించు మాధవీలత యనంగఁ
బరమకారణమైన బ్రహ్మంబు నవ్వున సంగతం బగుచిత్రశక్తి యనఁగఁ
బొలిచెఁ గాళిందినెమ్మేను భువనభయని
వారణాధారణాటోపవాసుదేవ
ఘనభుజాదండసంతతాక్రాంత మగుచు
మించు నలయిక వోలయ నిద్రించు వేళ. ౨౭౪

గీ. ఏకశయ్యాపదప్రవేశైధమాన,మూర్తు లగుచును దంపతుల్ పొలిచి రపుడు
నేకశయ్యాపదప్రవేశైధమాన,మూర్తు లైనయలంకారములసరణిఁ. ౨౭౫

సీ. చక్రవాకీశోకచటులాంధకారంబు దొలుకకుప్పాతమంబుతోడ విచ్చ
నమరమూర్ధన్య†దిగ్రమణీయకాంతితో ఘూకోష్ణనిశ్వాసగుణము హెచ్చఁ
బంకజామోదసంభవముతోఁ గలువలం దదభావసంభూతి గదియవచ్చఁ
దరుగతపక్షిసంతతశబ్దములతోడఁ జోరనిశ్శబ్దత సాగియఁజొచ్చ
నఖిలలోకసదాలోకనాంజనంబు, సారథ్యప్రచారాదికారణంబు
జారసంచారదుర్గ్రహోచ్చాటమంత్ర, రాజమగుచు‡నుషర్వేళ తేజరిలఁగ.

గీ. సుప్రసాదత సుకవీంద్రసూక్తు లడర,బోధ గైకొన వేగంబ పుష్పఁబోఁడి
సుప్రసాదత సుకవీంద్రసూక్తు లడర,బోధ వేగంబ చెందుట పోల్కి గాఁగ.

---

* బలియుచు మూఁబడలుచు అనిలడపాఠిసమా! † దిగ్రమణాముగంబుతో ‡నుష, ద్వేళ

సీ. చలిగాడ్పుచేఁ దీఁగెబలెఁ దేటనెమ్మేన నలరులు జలజలంజలను రాలఁ
గొప్పు చక్కఁ గుదుర్పుకొనఁగఁ గత్తుకాంతులు పొంత బంగరుజలపోఁత లీన
పాంచాలికాయష్టిసత్రిలోచనంబులు లత్తాలజలజంబుఁ దప్పుగొనఁగ
మిగిలెడునసురక్తి మగుడిచూడఁగఁజూచి మదనుండు కాల్గూన మనసువడఁగ
నొర్దరన మున్పఁ గాల్కభయంబు నడుమ
నలసయానంబు పాదంబు లడుగు లిడఁగ
నంత యింతనరాని యామూనవడఁగ
బెడఁగువగలాఁడి వడుకయి ల్వెడలి వచ్చె. ౨౭౯
క. అతిసూక్ష్మాంబరకేయూ, గతకృష్ణఘనాంగ మొనసి కమలేక్షణ దా
నతిమందయానమున *రా,నతిభద్రతటిద్విలాస యగుచుం బొలిచెన్.
క. అనలంకృతయానను గొని, వనజాయతనయన యపుడు వఱలె ననంగాఁ
జందే నసుఁగఁ, బనలంకృత నిన మోద మచ్చట లేదే. ౨౮౦
క. అనఘభూషణవిస్ఫూర్తిని దితగొలఁగ, సుతనువు తనూమతల్లి కసొగసు పూను
ననఘభూషణవిస్ఫూర్తి నందకున్న, నతనుభూషణవిస్ఫూర్తిఁ బలరె నపుడు.
గీ. సుప్రసాదత సద్వ్యక్తి సుభగ యగుచు
ఘనతరాలంకృతిస్ఫూర్తిఁ గొనక మగువ
యుత్తమంపుఁగృతి నన్నగు నొక్కవింత
రొక్కసొడ సంస్కృతిచ్యుతి నొప్పు మిగుల. ౨౮౧
సీ. పానపట్టినయట్టి జలజాతబాణునిచేతిమివ్వాహేతిఁ జెనకుదానిఁ
జారుపుంస్కోకిలాస్వాదితం బైనట్టి క్రొమ్మావినిం దప్పు గొనెడుదాని
నంతతరాజహంసక్రీడితం బైనకమలినికై బొమ్మగట్టుదాని
మలయానిలాక్రాంతమర్దనక్లాంత మా సుమశాఖఁ జులుకఁగాఁ జూచుదాని
దనవసుతఁ జాచి ద్వారంబు దాఁటువేళఁ, దోడినెచ్చెలికత్తెలతోడవచ్చి
బిగ్గఁ గౌఁగిటఁ జేర్చుచుఁ బేర్మిమిగుల, మేలుగాఁ బల్కె నొకవాణి నీలవేణి.
ఉ. కోరిక దీరఁగా మగనిఁగూడి సుఖించిననిన్నుఁ జూచినన్
మేరకు మీఱుమోదమున మేను సుఖించె మనంబు చింత మా
కూఱడె నీవు సెజ్జకడనుండి కటాకట తోడులేక యీ
ద్వారముదాఁక నిట్లిటకు వచ్చితివమ్మ భయంబు దక్కుచున్. ౨౮౨

*దానతిభద్రి-

ఉ. అంతట నింతిరొమ్మునను వాసన మూచుకొనంగఁ బిల్చి నీ
యింతికిఁ దోసము గావలెనె యిక్కడ కిక్కడనుండి రాఁగ నా
వంత భయంబు లోఁగొనక యాశ్వవిభుం డనుదంద నీనిశం
గంతుకురంబుఁ జేసి పలుగాయము లందినమేటి గావునన్. ౨౮౫

ఉ. అప్పుడు నీలవేణి చలియందపుఁజేష్టలు చూచిగోరి యా
యొప్పులకుప్ప నీకు నది కొప్పుగ జేఁ దలపూని బూనెనే
తప్పక చెప్పుమన్న నగుఁదాల్చుట సిగ్గున మోము వాంచుటం
జెప్పెను నాతి యంతరము చిన్నలు చెప్పఁగఁ బోనరుక్తిగన్. ౨౮౬

వ. ఇట్లు కాళిందీపుళిందచికురం గరగ్రహణంబు చేసి యనంతరంబ మిత్రవిం
దాకుందరదనం బెండ్లియాడి నాగ్నజితీమాధవతిం జెట్టవట్టి భద్రాభద్రే
భయానం గాలుద్రొక్కి మద్రరాజన్యకన్యక నైనలక్షణకుం బొట్టుగట్టి
యష్టమహిషీనయనచకోరశరచ్చంద్రాకారుండై యక్కటకటయాదవవ
రుండు పిదప నరకాసురుం ద్రుంచి [యింద్రలోకంబునకుం జని యదితిచేఁ
గుండలంబులు గొని పారిజాతనగంబు సంగ్రహించి నరకుం ద్రుంచి] తత్కా
రాగృహానీతషోడశసహస్రరాజకన్యకల నాత్మకరగ్రహణంబున ధన్యలం
గావించి తద్భావతనిరంతరప్రమోదాపాదనదక్షిణుం డగుచు దక్షిణుండై
ధీరలలితనాయకోత్తముం డనవెలయుచు మునులకుఁ దపఃఫలంబై యరి
వీరులకుఁ గృతాంతుండై యర్థులకుం జింతారత్నంబై ధనుర్ధరులకు వీరా
గ్రసరుండై విద్యార్థులకుఁ బరమాచార్యుండై గాయకులకు వాగ్గేయకా
రశిరోరత్నంబై శరణాగతులకు వజ్రపంజరంబై విదగ్ధులకు (ర)సికావతంసం
బై మదవతులకు నభినవమదనుండై సంఖ్యావంతులకు శాస్త్రవేత్తయై
నటులకు హాల్లీసకతల్లజుండై కర్తలకు నమృష్టాత్మప్రకాండుండై తత్త్వవా
దులకుం బరమతత్త్వంబై యోగీంద్రులకు లక్ష్యంబై (రస)వాదులకు జగ
దేకరసంబై సుగుణవాదులకు నుపాస్యంబై భాసిల్లుచుండ నయ్యవ
సరంబున. ౨౮౭

సీ. *శాస్త్రంబు గతి ననుష్ఠాపకత్వవిలాసభాసురంబై చాల వాసిఁగాంచె
దా(హాకరో)దారదవకేలి వంధ్యాకుమారునితోఁ బొందు గోరకానియె

[ ] ఈనడిమివాక్యము సందర్భశుద్ధిగాలేదు *శాస్త్రంబులీల-

దారిద్ర్యఖేదసంధానంబు గగనమండలపుండరీకంబు చెలువు మీఁజె
శశమృగంబుశిరంబు చక్కఁ ద్రొక్కి మెలంగు కొమ్ము న(నద్ధ)ర్మ మిమ్ము చేసె
నవనినాఁబాఁ గోపాల మఖిలజనుల, నలువుమిగులంగఁ బ్రాపించెనవరసముల
నలప్రసాదంబుపొందెమననువుగాఁగ, నతులసౌఖ్యంబుచూపుచులరుదుగనఁగ.

ఉ. మంగళ మంగజాతరిపుమంజులమానసమధ్యవర్తికిన్
మంగళ మబ్జ(జ)ప్రముఖమానితదైవతచక్రవర్తికిన్
మంగళ మానతార్తికృదమంగళభంగదసారకీర్తికిన్
మంగళ మాదిమూర్తికి ఘనప్రథమూర్తికి రామమూర్తికిన్. ౨౮౯

గద్యము.

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి మాధవ
యజ్వసముజ్జ్వలత్కృపాపోషితకటాక్షసాదితపాండిత్యాభరణ ప్రభం
జనవంశాబ్ధిరాకాశశాంక నిరంతరారాధిత విచక్షణ శశాంక
అభినవనన్నయభట్టారకా హోబల పత్యాహ్వయ
కవిమహోపాధ్యాయభట్టారక విరచితం
బైనకాళిందీకన్యాపరిణయం బను
మహాప్రబంధంబునందు
సర్వంబును సప్తాశ్వాసము.

ద్వితీయభాగము సంపూర్ణము.

అఖిలభూతచయము లణఁగి మాయనుజేరె, నదియు నా కనన్య యయ్యె ననెడి
జ్ఞప్తియుంట తాన జ్ఞానరూపుండురా, పటు. ౨౭
నలినభవసురేంద్రనరతిర్యగాదుల, సుఖములును దదీయసుప్తిసుఖము
లంత మగుటఁ దా ననంతరూపుండురా, పటు. ౨౮
అట్లు శ్రౌతయాక్తికానుభూతులను స, త్యాదిలక్షణాత్ముఁడై ప్రమేయుఁ
డగుచు వాస్తవమున నప్రమేయుండురా, పటు. ౨౯
అప్రమేయుఁడైన యమ్మహాపురుషుండు, కలిగి లేని దొక్క కాంత నెనసి
పుట్టి చచ్చుజనులఁ బుట్టించె వినుమురా, పటు. ౩౦
ఆయమేయునం దనాదిగా నొకశక్తి, గలదు మున్నె త్రిగుణకలిత యగుచు
దానిఁ బ్రకృతియనుచుఁ దత్త్వజ్ఞు లండ్రురా, పటు. ౩౧
మట్టివిత్తునందు మట్టిచెట్టున్నట్లు, మంటిలోన ఘటము మలయునట్లు
ఆత్మనందుఁ బ్రకృతి యలవడి యుండెరా, పటు. ౩౨
విపులయందుఁ బెక్కువిత్తనం బున్నట్లు, విత్తనున్న పెక్కు విత్తులట్లు
ప్రకృతియందు జీవపటలంబు లుండురా, పటు. ౩౩
ఆపురాణపురుషుఁ డాజీవపటలమై, తోఁప మాయయగుచుఁ దోఁచెఁ బ్ర
అమలరూప మెద్ది యదియుపో మాయరా, పటు. ౩౪
ఇదియు నదియు నట్టి దిట్టి దింతింతని, యెఱుఁగరాక నదియు నిదియు నిట్టి
దట్టి దంత యింత యనెడిదే మాయరా, పటు. ౩౫
కారణమునఁ దోఁచు కార్య మాకారణ, మణఁచినట్లు లాత్మయందుఁ దోఁచి
యాత్మ నణఁచు నెద్ది యదియె పో మాయరా, పటు. ౩౬
స్థాణువునరుండు త్రాట భుజంగంబు, దొరసి మింట నలుపు దోఁచినట్లు
లాత్మ నెద్ది తోఁచు నదియుపో మాయరా, పటు. ౩౭
యువతిగర్భమందు నుంచిన రేతంబు, అవయవాస్వితాంగ మైనయట్లు
లఖిలజగము లెద్ది యగు నదే మాయరా, పటు. ౩౮
పృథివిలోనఁ గలయుబీజంబు లెల్లను, వృక్షలతిక లగుచు వెలసినట్లు
లఖిలజీవు లెద్ది యగు నదే మాయరా, పటు. ౩౯
తన్నుఁగననివానిఁ దన్నుగాఁ గావించి, తన్నెఱుంగువానిఁ దన్నుఁ జేసి
యాశ్రయించు నెద్ది యదియుపో మాయరా, పటు. ౪౦
ఆత్మనుండకున్న నాత్మ నెర్గకయున్న, నాత్మ నలరకున్న నజ్ఞజనుల
నావరించు నెద్ది యదియుపో మాయరా, పటు. ౪౧

తాను గలిగియున్నఁ దా నెఱుంగుచునున్నఁ, దాను మఱియుచున్నఁ దజ్ఞజనుల
నాక్రమింప దెద్ది యదియపో మాయరా, పటు. ౪౨

తనదుకలిమి లేనితనువునఁ దన తెల్వి, గాని మదిని దనసుఖంబు పోని
యాలిఁ జేస్పె నెద్ది యదియపో మాయరా, పటు. ౪౩

కల దనంగఁ దన్నుఁ గనఁబోవు లేదనఁ, గలదు నజ్ఞదృష్టిఁ గలిగి లేని
దనఁగ రాదు దేని నదియపో మాయరా, పటు. ౪౪

ఆత్మదృష్టి నన్నృత మగు నవాచ్యము యుక్తి, దృష్టినగుచు లౌక్యదృష్టిచే న
నంత మయ్యె నెద్ది యదియపో మాయరా, పటు ౪౫

మాయకాత్మవశత మహదహంకారత, న్మాత్రభూతభువనగాత్రవితతు
లగుచుఁ దనకుఁ దనువు లై యుండె వినుమురా, పటు. ౪౬

మాయ యనెడి ద్రాక్షమాఁని యది వరి, శుద్ధరాలు నవరిశుద్ధరాల
నంగ మించి యిరువిధాంగనలైరిరా, పటు. ౪౭

అవరాత్ముఁ డందు నాశుద్ధశక్తిని, నాశ్రయించి యీశుఁ డయ్యె నతఁడె
మలినశక్తి నెనసి మఱి జీవుఁ డయ్యెరా, పటు. ౪౮

ఘనత సుప్తిహేతుగతి నీశ్వరుఁడు స్వప్న, సూక్ష్మదేహగతిని సూత్రిజాగ్ర
దన్నగతి విరాజుఁ డై యీశుఁ డుండెరా, పటు. ౪౯

వ్యష్టి సుప్తి బీజదృష్టిఁ బ్రాజ్ఞుఁడు స్వప్న, సూక్ష్మదృష్టి దైజసుండు జాగ
రాన్నదృష్టి విశ్వుఁడై జీవుఁ డుండెరా, పటు. ౫౦

శుద్ధరాలు తన్నుఁ జూచి క్రీడించిన, వాని నీశు నింకఁ దాను మూఁడు
దెర్లఁబడుచు మూఁడుతీర్పులఁ బెట్టురా, పటు. ౫౧

రజము మదిఁ బెనంగ రాజసాంగన తన్ను, వలచియున్నబొమ్మ వాయిగట్టి
భువి నశించుజనులఁ బుట్టింపఁజేసెరా, పటు. ౫౨

సత్త్వ మెదఁ బెనంగ సాత్త్వికాంగన తన్నుఁ, నమ్మియున్నచక్రిఁబొమ్ముద్రొక్కి
పుడమిఁ బొడము జనులఁ బోషింపఁజేసెరా, పటు. ౫౩

కేఁలాత్ముఁ డిట్లు జీవేశు లఁశక్తి, భేదకల్పనమున భిన్నుఁడయ్యె
వాస్తవమున నాత్మవస్తువే యొకటిరా, పటు. ౫౪

తమము మతిని గతుకఁ దామసాంగనతన్ను, నౌరయుహరునినగము నొడలుచేసి
ధరణి మురియు జనుల దండింపఁ జేసెరా, పటు. ౫౫

ఉభయదేశకాలయుతమర్త్య నొకనిఁగా, నుండఁజూచుపగిది నుభయవాచ్య
లక్షణములఁ ద్రోయ లక్ష్యార్థ మొకటిరా, పటు. ౫౬.

ఘటశరావములను ఘటమఠంబులఁద్రోచి, మన్ను మిన్ను నొక్కటన్నపగిది
జీవభావరహితజీవేశు లొకటిరా, పటు. ౫౭

వాస్తవములు గాని వాచ్యార్థములు రెంటి, మఱచిమూఁడలక్ష్యమయములగుచుఁ
బరఁగు ప్రత్యగాత్మపరమాత్మ లొకటిరా, పటు. ౫౮

ఘనఘటోదకములఁ గడవఁ దక్కలరహి, తాభ్రమొక్కటైనయట్లు నుభయ
దేహాధీఫలవ్యతీతాత్మ లొకటిరా, పటు. ౫౯

తనువుగానితాను త్వంపదార్థము విశ్వ, తతులుగాని తాను తత్పదార్థ
మసిపదార్థ మౌపరాత్మైక్య మగునురా, పటు. ౬౦

మింటవలుపు దోఁచి మిను గన నలుపులే, నట్లు తాను జీవుఁడగుచుఁ దన్నుఁ
దెలియ జీవగతులు దొలఁగి తా నయ్యెరా, పటు. ౬౧

ఇట్లు నాత్మరూప మేను గా ననిత్రోసి, వెలసి తన్నుఁదెలియ వెరవు నీకు
విస్తరించి తెలియ వినిపింతు వినుమురా, పటు. ౬౨

ఆలు మగఁడుఁ దిన్నయన్నంబువలనను, సురతజనితరక్తశుక్లములను
గూడి మొదల నన్నకోశమై యుండురా, పటు. ౬౩

అన్నమయములోన నైదుప్రాణంబులుఁ, గరపదాదికర్మకరణములును
మమతఁ గూడి ప్రాణమయకోశ ముండురా, పటు. ౬౪

ప్రాణమయములోనఁ బ్రబలమై శ్రోత్రాది, జ్ఞానకరణచిత్తమానసముల
మలయుచున్నహృదయమయకోశ ముండురా, పటు. ౬౫

అమ్మనోమయాంతరమ్మున శ్రవణనే, త్రాదికరణబుద్ధ్యహంకృతులును
మహితమైన బుద్ధిమయకోశ ముండురా, పటు. ౬౬

మఱియు నాప్రబుద్ధిమయకోశమునఁ బ్రియా, ద్యఖిలవృత్తిసహితమై తమోమ
యాత్మకమున నుండు నానందమయమురా, పటు. ౬౭

ఆప్రియాదిసంయుతానందమయములో, నాత్మఁ దుండు వాని నరయ కాత్మ
కోశమయుఁ డటంచుఁ గొలుతు రెట్టన విను, పటు. ౬౮

పుట్టిపెరుఁగుచుండు బొంది తా నని కొంద, ఱందు రదియుఁ దెలియ కనుటగాక
తాను వెడలఁ గాల్చుతను వెట్టు లాత్మరా, పటు. ౬౯

బ్రదికి కుడువ మొదలు ప్రాణ మాత్మని కొంద, అందు రదియు నెఱుఁగకనుటగాక
పట్టు వదలఁ బోవు ప్రాణ మె ట్లాత్మరా, పటు. ౨౦
చేటుపాటుఁదెలుపు చిత్త మాత్మని కొంద, అందు రదియుఁ గాన కనుట గాక
చెప్పినట్లు వినని చిత్త మె ట్లాత్మరా, పటు. ౨౧
నేను నాయి దనుమనీష యాత్మని కొంద, అందు రదియుఁ జూడ కనుట గాక
నిద్ర నణఁగఁగల మనీష యె ట్లాత్మరా, పటు ౨౨
సుప్తి నెలవుగలుగు శూన్య మాత్మని కొంద, అందు రదియు వరయ కనుటగాక
చూడలేని సర్వశూన్య మె ట్లాత్మరా, పటు. ౨౩
సుప్తి నందఁబడెడు సుఖ మాత్మ యని కొంద, అందు రదియు నేర కనుటగాక
మెఱుఁగరాని సౌఖ్య మె ట్లాత్మ యగునురా, పటు. ౨౪
అణువు మధ్యమము మహాత్ముఁ డాత్మని కొంద, అందు రదియుఁ జెద కనుటగాక
ఆత్మ నిర్వికారుఁ డదియుఁ దా నెట్లురా, పటు. ౨౫
చిన్మయుండు మఱియుఁ జిన్మయుండును జెద, చిన్మయుం డటంచుఁ జెప్పికొంద
అందు రళుణుఁ డాత్ముఁ డదియుఁ దా నెట్లురా, పటు. ౨౬
పంచకోశములకుఁ బరున కిట్లనోన్య, మేకవృత్తి యగుట నేర్పఱించి
లోన నున్న తను విలోకింపవలయురా, పటు. ౨౭
గృహగృహాంతరార్థకృత్యాద్యతీతుని, కరణి దేహదేహకలితమూరు
తాత్మమతితమోమయాతీతుఁ డాత్మరా, పటు. ౨౮
గృహములోనివాఁడు గృహము తాఁ గానట్లు, తనువులోనివాఁడు తనువుగాక
తనువు నెఱుఁగుచుండు తా నని మెఱుఁగరా, పటు. ౨౯
కవ్వులోనివాఁడు కవ్వు తాఁ గానట్లు, గాలిలోనివాఁడు గాలిగాక
గాలి నెఱుఁగుచుండు ఘనుఁ డని తెలియురా, పటు. ౩౦
రథములోనివాఁడు రథము తాఁ గానట్లు, మనములోనివాఁడు మనము గాక
మనము నెఱుఁగు బోధమయుఁ డని తెలియురా, పటు. ౩౧
శయ్యలోనివాఁడు శయ్య తాఁ గానట్లు, ప్రజ్ఞలోనివాఁడు ప్రజ్ఞగాక
ప్రజ్ఞ నెఱుఁగుచుండు ప్రాజ్ఞుండె తానురా, పటు. ౩౨
కోటలోనివాఁడు కోట తాఁ గానట్లు, ప్రకృతిలోనివాఁడు ప్రకృతిగాక
ప్రకృతి నెఱుఁగుచుండు ప్రభుఁడని మెఱుఁగరా, పటు. ౩౩

నాఘటంబు నాధనం బనువాఁ డవి, యేమి గాని పగిది నామనంబు
నాశరీర మనెడుఁ దాశేషభూతుండు, పటు. ౮౪

తనువు గాఁడు మారుతము గాఁడు కరణము, ల్గాఁడు హృదయ మతులు గాఁడు కాఁడు
కాఁడని యెడు వాఁడెఁ గనువాఁడె తానురా, పటు ౮౫

తెలుపు నెఱుపుఁ బసుపు నలుపాకుఁబసరును, కొద్ది గొప్ప పొడవు కుఱుచ వాఁడు
గాఁడు వాని నెపుడుఁ గాంచెడి వాఁడురా, పటు. ౮౬

వినెడు వాఁడు స్పర్శ గొను వాఁడు రూపంబు,గనెడు వాఁడు రుచులఁ గొనెడు వాఁడు
తావిఁ గొనెడు వాఁడుఁ దానని యెఱుఁగరా, పటుగు. ౮౭

పలుకులొల్లు వాఁడుఁ బనులు చేసెడు వాఁడు, నడచు వాఁడు మలము విడుచు వాఁడు
తగ సుఖించు వాఁడుఁ దా నని యెఱుఁగరా, పటు ౮౮

ఛిద్రఘటములో వసించెడి దీపంబు, వెలివి లోని వెల్లఁ దెలుపునట్లు
తనువులోననున్న తా నన్ని తెలియురా, పటు. ౮౯

తమ్ము నెఱుఁగలేని తనుకరణాదులు, నాత్మ నెఱుఁగనేర వనుట నిజము
వానిఁ దా నెఱుఁగు వాఁ డని తెలియురా, పటు ౯౦

కమలమిత్రుచాయ గనిపెట్టి తమతమ, పనుల మొదలు నరులపగిదిఁ దన్నుఁ
సంశ్రయించి హృదయచక్షువు త్రైలఁగురా, పటు ౯౧

చుంబకంబునంటి సూదులాడినయట్లు, దారముగొలిచి భటులు దిరిగినట్లు
ఆత్మ నంటి యింద్రియంబులు దిరుగురా, పటు ౯౨

తప్తలోహమందు దహనుండు నున్నట్టు, లొడలిలోన జీవుఁ డుండి మెలఁగు
జీవునందు నిండి చిన్మయుం డుండురా, పటు. ౯౩

* యండమావు లుదకమైనట్లు తా జీవుఁ, డయ్యె నెండమావు లరయ జలము
గాని యట్లు తన్నుఁ గన జీవుఁ డేఁడిరా, పటు. ౯౪

ఘృతముగలిగి యుంట క్షీరంబులనుదీపి, గుడము కలిమిఁ జెఱకుగడలు తీపి
† తాఁగలింగియుంటఁ దనువు భోగ్యంబురా, పటు. ౯౫

కలశవికృతు లెల్లఁ గలశప్రకాశార్థుఁ, జేరనట్లు తనువికారములును
దనువులోననున్నత న్నంటకుండురా, పటు. ౯౬

శ్రుతులు లేక రవము శ్రుతము నొందెడు వాఁడుఁ, దనువు లేక స్పర్శ గొనెడు వాఁడు
గనులు లేక రూపు గను వాఁడు తానురా, పటు. ౯౭

* యండమావులని యకారాదిగా వ్రాసినాఁడు. †కలింగియని బిందుయుతముగా వ్రాసెను.

రసనలేక రుచులు మెసఁగుచుండెడువాఁడు, నాసలేక తావి *మేసువాఁడు
మనములేక తలఁపు గొనువాఁడె తానురా, పటు. ౯౮
వినిన వినును గనినఁ గను సోఁక సోఁకు మూర్కొనిన మూరుకొనుననుభవింప
ననుభవించు నెవ్వఁ డతఁడె తా నయ్యెరా, పటు. ౯౯
పలుకఁబలుకు మెలఁగ మెలఁగుఁదొలంగినఁ,దొలఁగునడువనడుచుదలఁపఁదలఁచు
నరయనరయు నెవ్వఁడతఁడె తానయ్యెరా, పటుగుణాభిరామపరశురామ ౧౦౦
ఉండఁజోటులేక నునికియు భోగ్యవ, స్తువులు లేక తృప్తి నుదతిపొందు
గాకసుఖము దేనఁ గల దదే తానురా, పటుగుణాభిరామ పరశురామ ౧౦౧
కానరానివానిఁ గాంచెడివాఁడును, బలుకరానివానిఁ బలుకువాఁడుఁ
దలఁపరానివాఁడుఁ దానని తెలియురా, పటు. ౧౦౨
తెలియరానివానిఁ దెలిసెడివాఁడను, మఱవరానివాని మఱచువాఁడ
నెఱుఁగరానివాఁడ నేనని తెలియరా, పటు. ౧౦౩
వీనులను గలింగి వినియెడివానిని, వీనులను దొలంగి విననివాని
నొకనిఁగా నెఱుంగుయోగంబె తానురా, పటు. ౧౦౪
తనువుననసి స్పర్శగొనియెడివానిని, దనువులేక ముట్టుకొనని వాని
నొకనిఁగా నెఱుంగుయుక్తియె తానురా, పటు. ౧౦౫
కనులఁగూడి రూపుగనుఁగొనువానిని, గనులులేక యేమి గననివాని
నొకనిఁగా నెఱుంగునూహయే తానురా, పటు. ౧౦౬
రసననెనసి రుచుల మెసఁగెడివానిని, రసనలేక మెసఁగరానివాని
నొకనిఁగా నెఱుంగుయుక్తంబె తానురా, పటు. ౧౦౭
నాస నలరి తావి వాసించువానిని, నాసలేక వాసనానివాని
నొకనిఁగా నెఱుంగునుచితంబె తానురా, పటు. ౧౦౮
శ్రోతయగుచుధ్వనుల శ్రుతమునొందినయట్లు, వినఁగఁబోవఁ దానువినఁగఁబడక
శ్రోతృభావరహితసూత్రంబె తానురా, పటు. ౧౦౯
స్ప్రష్టయగుచు స్పర్శసంస్పృశించినభంగి, సోఁకఁబోవఁ దానసోఁకఁబడక
స్ప్రష్టృభావరహితసారంబె తానురా, పటు. ౧౧౦
భోక్తయగుచు రుచులు భుజియించురీతిని, మెసఁగఁబోవఁదాను మెసఁగఁబడక
భోక్తృభావరహితభోగంబె తానురా, పటు. ౧౧౧

---

*మేయునది మేసు.

ద్రష్టయగుచుఁ గళల దర్శించునైవడిఁ, జూడఁబోవఁ దాను జూడఁబడక
ద్రష్టృభావరహితతత్త్వంబె తానురా, వటు. ౧౧౨

ఘ్రాతయగుచుఁ దావిగ్రహియించునగిది మూ, ర్కొనినతానుమూరుకొనఁగఁబడక
ఘ్రాతృభావరహితగమ్యంబె తానురా, వటు. ౧౧౩

మంతయగుచుఁదలఁపు మననంబుగొనుభాతిఁ, దలఁపఁబోవఁదానుదలఁపఁబడక
మంతృభావరహితమననంబె తానురా, వటు. ౧౧౪

జ్ఞాతయగుచుఁ దెలివి జ్ఞప్తిగైకొన్నట్లు, తెలియఁబోవఁ దాను దెలియఁబడక
జ్ఞాతృభావరహితజ్ఞానంబె తానురా, వటు. ౧౧౫

దృశ్యమర్థములును దృక్కులక్షములవి, దృశ్యమైనమనము దృక్కుమనము
దృశ్యమైననాత్మదృక్కది తానురా, వటు. ౧౧౬

తెలియఁబడెడిదెల్ల దృశ్యంబు దానిని, దెలియుచుండువాఁడు దృక్కు వాని
దెలియుదృక్కుమీఁదఁ దెలియంగ లేదురా, వటు. ౧౧౭

తన్నుఁదెలియ దృక్కు లిదనాత్మయనదది, తెలియఁబనుచుఁ దన్నుఁ దెలియనెట్లు
దీపభాస్యఘటము దీపంబు నెఱుఁగునా, వటు. ౧౧౮

తన్నుఁదెలియుదృక్కు తనకునుదక్కువై, తెలియు ననిన నదియుఁ దెలియునెట్లు
స్వల్పదీప మెఱిఁగి సవితృని దెల్పునా, వటు. ౧౧౯

తన్నుఁ దెలియు దృక్కు తనకు సమానమై, తెలియుననినశ్రుతులఁ గలుగ దదియు
దీప మాత్మసదృశదీపంబు నెఱుఁగునా, వటు. ౧౨౦

తన్నుఁగాంచుదృక్కు తనకెక్కువై తను, గాంచుననిన దానిఁ గాంచునొకటి
యనుచుఁ బెక్కు లగుట ననవస్థ వచ్చురా, వటు. ౧౨౧

కాన దృక్పరంపరానువృత్తులనెల్లఁ, దొలఁగఁద్రోసి వానిఁదెలియు మొదలి
దృక్కు నే నటంచుఁ దెలియంగ వలయురా, వటు. ౧౨౨

ప్రకృతిభూతములును బ్రాణంబులునునింద్రియములుమనముబుద్ధ్యహంకృతులును
నాఁగనిరువదియును నాలుగుక్షరములు, వటు. ౧౨౩

తుదిక్షరుండు తచ్చతుర్వింశకుండు క్ష, రుండు పంచవింశకుండు తత్ప
రాత్ముఁ డాక్షరాక్షరవిలక్షణుండురా, వటు. ౧౨౪

సత్య మక్షరం బసత్యంబు క్షరమును, జిత్తు నక్షరం బచిత్తు క్షరము
సాక్ష్య మక్షరం బసాక్ష్యంబు క్షరమురా, వటు. ౧౨౫

ఆయనజ్ఞుఁ డాసుఖాత్మక్షరము దా, గాక సత్యచిత్సుఖాత్మకాత్మ
రాత్మకుండ నేన యని కనవలయురా, పటు. ౧౨౬

అనిమేష మాది యగు లయాంతంబుగాఁ, గలుగు భూతభావికాల మరుగ
నరుగకుంటఁ దాన యగు సన్మయుండురా, పటు. ౧౨౭

కాయమనిలములును గరణంబులును మనో, మతు లవిద్య పెక్కుమసిపోవ
నమయకుంటఁ దాన సద్రూపకుండురా, పటు. ౧౨౮

ఇవి ఘటాదు లివిహృదింద్రియాదులు నివి, వృత్తు లనుచు నెఱిఁగి వెలిని లోనఁ
జెలఁగుచుంటఁ దాన చిద్రూపకుండురా, పటు. ౧౨౯

తెలియఁజేయ నన్యధీవస్తువులు లేక, వెలుఁగఁజేయ నొండు వెలుఁగు లేక
చెలఁగి వెలుఁగు తాన చిద్రూపకుండురా, పటు. ౧౩౦

సుఖముగలుగఁజేయు సుమగంధములు లేక, శయ్యనొరగి కూడ సతులు లేక
సుఖము గొనుట తాన సుఖరూపకుండురా, పటు. ౧౩౧

ఆలుబిడ్డ లర్థమాదిగాఁ గలవెల్లఁ, బ్రియము లగుచుఁ దనదు ప్రియమువలనఁ
జూడఁబడుటఁ దాన సుఖరూపకుండురా, పటు. ౧౩౨

కంజభవుఁడు మొదలుగా స్తంబపర్యంత, మగుచరాచరములయందు నింగిఁ
బోలి నిండియుంటఁ బూర్ణుండు తానురా, పటు. ౧౩౩

అట్టి పూర్ణసచ్చిదానందమయుఁడ నే, నని యెఱుంగు పారమార్థికుండు
అమృతపదవి నొంద నమనస్కుఁ డయ్యెరా, పటు. ౧౩౪

విషయములఁ గదల్చి వివిధాక్షముల మల్చి, మనముతోడఁ గల్చి మదిమరల్చి
యాత్మ నిల్పి తాన యమనస్కుఁ డగునురా, పటు. ౧౩౫

మనమె దేహకరణమహదహంకృతులును, మనమె రాగరోషమత్సరములు
మనమె విషయములును మనమె కర్మములురా, పటు. ౧౩౬

మనమె జాగరంబు మనమె స్వప్నంబును, మనమె సుప్తియును సమాధి మనమె
మనమె మీరు మేము మన మనుతలఁపురా, పటు. ౧౩౭

మనమె జీవకృతసమస్త సంసారంబు, మనమె యీశకృతసమస్తజగము
మనమె యుభయకృతసమస్తధర్మములురా, పటు. ౧౩౮

ఇంతయేల మనమె యీశులు జీవులు, భువనభవనభాగ్యభోగ్యములును
పటఘటాదు లన్నపానము ల్మనమెరా, పటు. ౧౩౯

మనము గలియఁ గరణమండల మనిలనం, పత్తి విషయములకుఁ బరువువెట్టు
మనము గలియకున్న మఱి సుప్తి నణఁగురా, పటు. ౧౪౦

మనమనంగ నల్పమయి మది సంకల్ప, మదియు లేదు హరిపదాబ్జ మట్లు
అట్టి మనము లేమి యమనస్క మగునురా, పటు. ౧౪౧

లేనిమనముచెలిమి తా నభిమానించి, వేఱె తలఁపుగొనుట వెఱ్ఱితనము
శుక్తిఁ దోఁచు వెండి సామ్యము నిలుచునా, పటు. ౧౪౨

ఉన్నరీతిఁ దన్నుఁ నుండఁగాఁజూచిన, లేనిమనముతోనె లేకపోవుఁ
త్రాడునెఱుఁగఁ బాము తథ్యమై నిలుచునా, పటు. ౧౪౩

తెలివియైనతన్నుఁ దెలివిగాఁ దెలిసినఁ, దెలివిగానిమనము తొలఁగిపోవుఁ
దపనుఁ డుదయమొందఁ దమము చూపట్టునా, పటు. ౧౪౪

సుఖమయైనతన్ను సుఖముగా నెఱిఁగిన, దుఃఖరూపమనము దోఁపకుండుఁ
దొడరి సుషుప్తియందు దుఃఖంబు గల్గునా, పటు. ౧౪౫

హరిపదాబ్జమునకు హరిపదంబునకును, దగుల మెన్నఁడేని దగనియట్లు
తనకు మనమునకును దాదాత్మ్యమున్నదా, పటు. ౧౪౬

గాఁడు నెఱుఁగనరుఁడు గుఱిపడకున్నట్లు, నింగి నెఱుఁగ నలుపు నిలువనట్లు
తన్నెఱుంగ మనము సున్నగాకుండునా, పటు. ౧౪౭

ఎన్నలేనిమనము నున్నదన్నది సున్న, కన్నదెల్లఁగల్ల యెన్నఁడున్న
తన్ను విన్నఁ గన్న మన్న మేలెన్నరా, పటు. ౧౪౮

లేనిమనము నెపుడు లేకుండఁగనుదన్నుఁ, దానవికృతులెట్లు తగిలివచ్చుఁ
గలను గన్నపాము గఱవ నేమయ్యెరా, పటు. ౧౪౯

సుమరసంబుగ్రోలి సొక్కెడుభృంగంబు, చంపకంబు సోఁకసమయుభంగిఁ
దన్నుఁ గనిన మనము తనయందె సమయురా, పటు. ౧౫౦

పాలలోనఁ గలయు *పందార కైవడి, నుదకమందుఁ గలియు నుప్పురీతిఁ
దన్నుఁగనినమనము తా నయిపోవురా, పటు. ౧౫౧

ఇంధనములు లేనియింగలంబును తను, దా కృశించుకరణిఁ దన్నుఁ గన్న
వానిమనము తనకుఁ దానె కృశించురా, పటు. ౧౫౨

శిఖిని జూచి యణఁగు చిలువలకైవడి, హరిని జూచి మ్రగ్గుకరులయట్టు
లాత్మఁగని హృదింద్రియము లూరకుండురా, పటు. ౧౫౩

స్వానుభవవిచారసంపత్తి లేకున్న, మనసు మ్రగ్గ దదియు మ్రగ్గకున్న
స్వానుభవవిచారసంపత్తి లేదురా, పటు. ౧౫౪

* పంచదారయనుటకు "పందార"

కోరి నభమునకును గుందేటికొమ్మునకు, బొంకు లేనియట్లు పూర్ణుఁడైన
తనకు మనమునకును తాదాత్మ్యముండునా, పటు. ౧౫౫

ఉప్పు నీటఁ గలిపి యొకటి రెంటను మూటఁ, నగ్గిని గురవేయ ప్రగ్గినట్లు
లాత్మ నెఱుఁగ మనము నంటంత కఱఁగురా, పటు. ౧౫౬

తప్తలోహనిపతితాంబుబిందువుభంగి, స్వానుభూతి మగ్నశాంతివరుని
మానసంబు తనకుఁ దానె కృశించురా, పటు. ౧౫౭

వెండి పైఁడి యినుము విఱుఁగఁ దత్కారకు, లంటఁగాఁచి మరల నదికినట్లు
మనసు విఱిగిపోవ మఱియతుకకుండురా, పటు ౧౫౮

వేయుఁ జెప్పనేల విఱిగినకాష్ఠంబు, మరల నంటుకొనని మాడ్కి మనసు
విఱిగిపోయెనేని మరలంటకుండురా, పటుగుణాభిరామ పరశురామ(ప తాం)

ఆత్మ తానయైన యంతలోఁ దలుకున, మనసు విఱుగు నట్లు మనసు విఱుగ
నది మహామనస్స మదియెపో ముక్తిరా, పటు. ౧౫౯

అఖిలమునకు హేతువగు మది మదికిని, మాయ హేతువగు నమాయ నెఱుఁగ
మాయతోడ మనసు మాయమై పోవురా, పటు. ౧౬౦

మాయ మాయలాఁడి మాయకంటెను మది, యంకులాఁడి దాని బింకమణఁప
మంత్రతంత్రయోగ మహిమలు గావురా, పటు. ౧౬౧

మఱపు వెఱపుఁ జేయు మాయామనంబులు, నాత్మ నెఱుఁగునపుడె యణఁగు వేద
శాస్త్రోక్తవిధులు శక్తము లగావురా, పటు. ౧౬౨

ఆయమేమి కాయఁ డాయునాలను లేని, మాయ మనము నేమి సేయఁగలదు
గొడ్డుబొడ్డిబిడ్డకొడుకేమి సేయురా, పటు. ౧౬౩

మానసంబుఁ దను దానైన తనటన్నే, తత్వ మెన్నఁడేని గలదె పుడమి
మిత్రతిమిరములకు మిత్రత్వముండునా, పటు. ౧౬౪

లేనిమనము రానిపోని దానిని నంటు, కొనఁగఁగలదె మేలుకొన్ననరుని
బొంచి కలనఁ దోఁచుపులి మ్రింగవచ్చునా, పటు. ౧౬౫

తానఖండసచ్చిదానందరూపకుఁడైన, దనకు మనము గానఁబడదు
కానఁబడిన నదియుఁ దానయిపోవురా, పటు. ౧౬౬

అగ్గిఁ జేరు తూల మగ్గియైయున్నట్లు, నీటఁ గలియు గుడము నీరమట్లు
తన్నుఁ జేరు మనము తానయిపోవురా, పటు. ౧౬౭

పెక్కు సెప్పనేల ఫేనంబు జలము భూ, షణము స్వర్ణమైనసరణి మూన
సంబు త్వత్ప్రతంబు స్వస్వరూపమ్మురా, పటుకణా- ౧౬౮

నీట వానచినుకు పాటున బుగ్గమై, నిలిచి నిలువకట్లు నిజముకోనఁ
గలియుఁ దనకు మనము గలిగి లేకుండురా, పటు. (పాఠాంతరము)

అట్లు స్వస్వరూప మంది మనోలయ, మైనభక్తుఁడే సదామనస్క
పదవిగల సమాధిపరుఁ డని తెలియురా, పటు. ౧౬౯

వింటి వినను గనను గంటిఁ బల్కితిఁ బల్కి, నను నను ననెడినపవనులను
దెలియుచుంట బాహ్యదృశ్యసమాధిరా, పటు. ౧౭౦

అజుఁడ నవ్యయుఁడ ననాఖ్యుండ నగుణుఁడ, నవిషయుండ ననుచు ననెడువృత్తి
సమితిఁ గనుట బాహ్యశబ్దసమాధిరా, పటు ౧౭౧

తలఁచితిని దలంపఁ దెలిసితిఁ దెలియ నె, ఱుఁగ నెఱుఁగు దని కలుంగుమితులఁ
దెలియుచుంట లోనిదృశ్యసమాధిరా, పటు. ౧౭౨

ఆయసంజ్ఞుఁ డాసుఖాతీతసచ్చిత్సు, ఖములఁ దెలిసి వానిఁ గాంచు తెలివి
సడలకుంట లోనిశబ్దసమాధిరా, పటు. ౧౭౩

నడిమి బాహ్యదృశ్యశబ్దవృత్తుల నెల్లఁ, దొలఁగఁ ద్రోచి వానిఁ దెలియు తెలివి
నిలిచియుంట బాహ్యనిర్వికల్పంబురా, పటు. ౧౭౪

ఆయఖండవృత్తి నాంతరదృశ్యశ, బ్దానువృత్తు లణఁచి వానిఁ గాంచు
నిజము గనుట లోని నిర్వికల్పంబురా, పటు. ౧౭౫

తాను సర్వమునను దనయందు సర్వంబు, నరసి స్వరూపుఁడై వెలుంగు
జ్ఞప్తి గలిగియుంట జ్ఞాతసమాధిరా, పటు. ౧౭౬

బ్రహ్మవిదుఁడ ననెడిభావన గలుగక, బ్రహ్మ మైతిననెడి భావ మడుగఁ
దానె యుంట జ్ఞప్తి లేనిసమాధిరా, పటు. ౧౭౭

ఈసమాధు లెఱిఁగి యిందెద్ది గొనినైన, బాలుభంగి సుప్తుభంగిఁ దన్నుఁ
దా నెఱుంగుచున్న ధన్యుండె ఘనుఁడురా, పటు ౧౭౮

అతఁడె బ్రహ్మనిష్ఠుఁ డతఁడె జీవన్ముక్తుఁ, డతఁడె సాంబశివుఁడు నతఁ డెవిష్ణుఁ
డతఁడె గురుఁడు ధన్యుఁ డతఁడని యెఱుఁగురా, పటు ౧౭౯

ఎఱుకవానితోటి మెఱిఁగినకనుసూటి, నెల్లవనులు మీఁటి యిల్లుదాఁటి
చావులేనిచోటి సచివుండు భోగిరా, పటు. ౧౮౦

తెలివివానిఁ జేరి తెలిసిన తనదారి, నింటివారి ద్రోచి హితవు గోరి
మఱపుదాని మీఱి మను మహాత్ముండురా, పటు. ౧౮౧
అంటరానిదాని నంటి తోడగువాని, దంటమూని లోనికంటఁ బూని
యొంటిగానిఁ గూడి యుండు ధీరుండురా, పటు. ౧౮౨
దేహమమతలార్చి దేహాహంతయుఁదీర్చి, సోహమాత్మఁగూర్చి చూడ నేర్చి
యూహలేనివదని నుండుముక్తుండురా, పటు. ౧౮౩
బ్రహ్మమును బఠించి బ్రహ్మనిష్ఠ నెఱింగి, బ్రహ్మ మాచరించి బ్రహ్మ మెఱిఁగి
బ్రహ్మమైనవాఁడు బ్రాహ్మణోత్తముఁడురా, పటు. ౧౮౪
నీరిలోననుండి నీరంబునంటని, తామరాకుపగిదిఁ దత్త్వవిదుఁడు
సంసరించుచుగొనుచు సంగి గాకుండురా, పటు. ౧౮౫
అవ్వ లిచ్చువాని కవ్వలిచ్చివనొవ్వ, నువ్వరంబు కరణి నున్నవానిఁ
గన్నవాఁడు నిర్వికారుఁడై యుండురా, పటు. ౧౮౬
ప్రత్యగాత్మరూపభావనాపరున కే, ర్పడక యుండు జీవభావమింత
వేషధారి నెఱుఁగ వేషంబు నిలుచునా, పటు. ౧౮౭
అఖిలమాత్మఁ డాత్మఁ డఖిలం బనియెఱుంగ, ఘనున కితర మేమి గానఁబడదు
దారువని యెఱుఁగఁ జోరుండు దోఁచునా, పటు. ౧౮౮
తాళగానగతులు దప్పక తలదొంతి, బూనఁజూచునటుని బోలి బుధుఁడు
ఎల్లపనులు గొనుచు నెఱుకతోనుండురా, పటు. ౧౮౯
పరసతీరతుండు బహుళార్థియై దాని, పొందు గోరినట్లు బుధజనుండు
సకలవిధులుగొనుచు సాక్షినే చూచురా, పటు. ౧౯౦
స్వకృతచిత్రపుర మసత్యం బని కాంచి, మాయికుండు మెలఁగుమాడ్కిదద్జ్ఞుఁ
డాత్మకృత్య మనృత మని చూచి నడచురా, పటు. ౧౯౧
మంటనుండి మంటినంటనికుమ్మర, పురుపుభంగిఁ దత్త్వపూర్ణుఁ డఖిల
గుణసమేతుఁడయ్యు గుణరహితుండురా, పటు. ౧౯౨
బ్రహ్మభావనుఁడు ప్రపంచంబు గొనుచుఁద, ప్పించుకొనితొలంగుఁబెరుఁగుదరువ
నడలివచ్చువెన్న చల్లలోఁ గలియునా, పటు. ౧౯౩
నిఖిలమనుభవించి నిష్కల్మషుండైన, యనలునట్లు తద్జ్ఞుఁ డఖిలవిషయ
కాముఁడయ్యు విగతకాముఁడై యుండురా, పటు. ౧౯౪

మోదఖేదవిషయమోహంబువర్జించి, శత్రుమిత్రులందు సమతగలిగి
సర్వపూర్ణుఁడైన జనుఁడు విజ్ఞానిరా, పటు. ౧౯౫
మేలు గలిగెనేని జాలఁగా మురియక, కీడు గలిగెనేని గినుకపడక
సమత నుండువాఁడె సత్పురుషుండురా, పటు. ౧౯౬
సఖులు సంస్తుతింప సంతోషమందక, పరులు నిందచేయ బాధపడక
ఆత్మరతుఁడెపో మహానుభావుండురా, పటు. ౧౯౭
గురుకటాక్షదృష్టి గోష్ఠి దీక్షయు గోష్ఠి, దీక్షనేని మనసు దీక్ష మనసు
దీక్షనేని తనువు దీక్ష దా మీఁదురా, పటు. ౧౯౮
నిఖిలవిషయములను నిఖిలేంద్రియములచే, నెఱుఁగు నెఱుక నెపుడు నేన యనెడి
చిన్మయాత్మరతుఁడు జీవన్ముక్తుండు, పటు ౧౯౯
వెలయ మొదటితనువు విడిచినబోధజీ, వన్ముక్తి నడిమివపువు విడువఁ
గడశరీర మడుగ గతదేహముక్తిరా, పటు. ౨౦౦
నిప్పు నీఁగలంటు నింగిని జెదలంటు, ననుట లేనియట్లు నాత్మవిదుని
సుకృతదుష్కృతములు సుడియకయుండురా, పటు. ౨౦౧
జ్ఞానవహ్నిఁ గాలుసంచితంబెల్ల న,కర్త యగుట భావికర్మముడుగు
బ్రహ్మమైనయపుడె ప్రారబ్ధ ముడుగురా, పటు. ౨౦౨
ఆత్మదృష్టిలేని యారబ్ధ మన్యదృ, ష్టినిఁ గలుఁగ నేమి సేయఁగలదు
అన్యదృష్టిఁ దోఁచు నహి త్రాడు మ్రింగునా, పటు. ౨౦౩
గురునిపదముఁబట్టి గురుకటాక్షమువట్టి, గురుపదమ్ముమెట్టి గుఱుతువట్టి
గురునిలోనఁగలియు గురుఁడె కేవలుఁడురా, పటుగుణాభిరామ పరశురామ.
ఈద్విపద్యశతము నెవ్వఁడేనియు విను, వ్రాయఁ జదువఁ జెప్ప వాఁడు తాన
బ్రహ్మమగుచుఁ బరమపదముసం దుండురా, పటుగుణాభిరామ పరశురామ.
భూమినొదవి పరశురామపంతులరామ, మూర్తి బ్రహ్మతత్వమూర్తులకును
దెలియ రెండుశతకములఁ దేటపఱిచెరా, పటుగుణాభిరామపరశురామ,

# కన్న శతకము

కందపద్యములు.

అబ్బురపు బాలపదముల, జొబ్బిల్లెడి రసముఁ గ్రోల జోకవహింపన్
నిబ్బరపుఁ గవిత లబ్బుట, యబ్బురమా యెఱుకఁగన్న *యెఱుఁగుడికన్నా. ౧
ఎబ్బెట్టుమతము రోయుచు, నిబ్బరముగ బాలపాదనీరజరసమున్
ఉబ్బుచుఁ గ్రోలినయంతట, నబ్బెఁగిని కవితలన్న యెఱుఁగుడికన్నా. ౨
అంజనపుత్త్రునికృపచే, రంజిల్లుచు శారదాంబ రసికత మెఱయన్
మంజులవాక్యము లిచ్చెను, రంజిత బాలాప్రసన్న రసికులకన్నా. 3
పురందర విజయుని కృపఁగని, యంతపయిన్ యోగివరుని యనుపునఁ (గను)విం
పొందఁగ బుచ్చనగురుదయ, నిందిర నీకబ్బెరన్న యెఱుఁగుడికన్నా. ౪
పిల్లలమఱి బుచ్చనగురు, చల్లనివాగమృతఘుటిక సమరస మొసఁగం
గల్ల ప్రపంచము రోసియు, నెల్లప్పుడు నెఱుకఁగన్న యెఱుఁగుడికన్నా. ౫
బుచ్చనగురుపదవనజము, లచ్చుగ నాహృదయమందు నమరినయపుడే
హెచ్చుగ నానందం బిఁక, నచ్చటరా యెఱుకఁగన్న యెఱుఁగుడికన్నా. ౬
పిల్లలమఱి బుచ్చనగురుఁ, డుల్లము చల్లఁగను జేసి యూఁచిన యపుడే
తల్లియుఁ దండ్రియు వారలె, యెల్లప్పుడు నెఱుకఁగన్న యెఱుఁగుడికన్నా. ౭
బుచ్చనగురుఁడే బ్రహ్మము, నిచ్చలముగ వారిపాదనీరజములకున్
సచ్చరితులు పూజించుట, హెచ్చుటరా యెఱుకఁగన్న యెఱుఁగుడికన్నా ౮
బుచ్చనగురుపదవనజము, లిచ్చ మెయిం బూజసేయ నిహమునుం బరమున్
ముచ్చటగనుటవి నీకిఁక, హెచ్చుటరా యెఱుకఁగన్న యెఱుఁగుడికన్నా. ౯
సుబ్బయగురుకృపవల్లను, నబ్బెను బాలాంబకరుణ యానందముతో
గొబ్బునఁ గైకొని మనుమీ, యిబ్భంగిని నెఱుకఁగన్న యెఱుఁగుడికన్నా. ౧౦
ఇన్నిదినంబులు గురుపద, మెన్నుచు నీమనసు గోన మెలఁగినయంతన్
జిన్మయసహజానందము, నెన్నఁగ మదిఁ గంటివన్న యెఱుఁగుడికన్నా. ౧౧
ఉంటివి విశ్వము నేనని, కొంటివి గురుపాదవనజకోమలరసమున్
గంటివి చిద్రూపంబును, నింట స్వది యెఱుకఁగన్న యెఱుఁగుడికన్నా. ౧౨

---

* ఎఱుగుడియనునది, యఱుగుడియని సంజ్ఞావాచకముగాన వాడుచున్నాఁడు.

మనసున వృత్తులు నిలిపిన, నెనయంగాఁ దత్త్వగతిని నెఱుఁగఁగవచ్చుం
దను వలయించుట యేటికి, వినవన్నా యెఱుకగన్న విధమునఁ గన్నా. ౧౩
నేత్రము నాసాపుటములు, శ్రోత్రము నొకచోటఁగూడి సుస్థిరమైనం
బాత్ర మగు నాద మబ్బును, క్షేత్రంబున నెఱుకగన్న శివమగుకన్నా. ౧౪
కన్నులు మూసుక తగనే, తిన్నగఁ దల వంచి మీఁదఁ దిరముగఁ జూడన్
వెన్నెలపోలుపు కనంబడు, నెన్న న్నది నెఱుఁకగన్న యెఱుగుడికన్నా ౧౫
నాసికము మొదలఁ జిత్తము, భాసిల్లఁగ నుంచి చాల భావము గురుపై
నాసక్తితోడ నిలుపుట, యాసుఖమే నీవటన్న యఱుగుడికన్నా. ౧౬
నాసికము తుదను మొదలను, భాసిల్లుచు నందుమీఁదఁ బైపైఁజూడన్
ఆసచెడి బయలు కనఁబడు, నాసాబగే బ్రహ్మమన్న యఱుగుడికన్నా. ౧౭
నాసికము రెంటుదిక్కుల, మోసము లేకుండఁబట్టి మూసినయంతన్
గాసిని సుషుమ్న గనఁబడు, నాసరణిని నెఱుకగన్న యఱుగుడికన్నా. ౧౮
కనుగ్రుడ్డు మధ్యబిందువు, పనుపడ నాచుట్టునున్న ప్రభయే పురుషుం
డనువుగ నీమది నుంచుక, యెనయుర మది యెఱుకగన్న యెఱుగుడికన్నా.
మనసే శక్తియు నిజముగ, గనుఁగొని యాశక్తియందుఁ గాలాంతకునిన్
ఎనయించి ముక్తిగనఁదగు, వినవన్నా యెఱుకగన్న విధమునఁ గన్నా. ౨౦
తనయందు ముక్తియుండఁగ, వినయంబుగ గంగకేగు విధ మేమిటికో
కనవలె విశ్వము మన మని, యెనయఁగ మదినెఱుకగన్న యెఱుగుడికన్నా.
ఎన్నివిధంబులనైనను, దన్నే తా నెఱుఁగవలయుఁ దలక్రిందైనన్
మిన్నైన మోక్ష మబ్బును, యెన్నఁగ మదియెఱుక గన్న యెఱుగుడికన్నా.
కన్నుల విడుచుట ముక్తియొ, యెన్నఁగ మదిలోన నాన యేర్పడకుండం
దిన్నగ విడుచుట ఫల మది, యెన్నఁగ మది నెఱుకగన్న యెఱుగుడికన్నా.
ముక్తిని గనఁబడనిచ్చునె, యుత్తుగ నీయందు నహము నానుకయుండన్
ఎత్తుగ దానిని విడువుము, యిత్తఱి నీవెఱుకగన్న యెఱుగుడికన్నా. ౨౪
తత్తఱపాటులచే మఱి, మత్తిల్లుచు నుండఁగా సుమార్గము గనునా
చిత్తము నిలిచినఁ గనఁబడు, నెత్తుగ మదినెఱుకగన్న యినకులకన్నా. ౨౫
ఎత్తఱి విశ్వము నా దని, పొత్తుగఁ గూడుండినపుడె పొసఁగదు చిత్తం
బొత్తుగ విడువుము యంతయు, నిత్తఱి మదినెఱుకగన్న యినకులకన్నా.

చిత్తము నే నని యుండకు, తత్తఱపడుదానిఁ గూడి తలఁపుడుగకుమీ
యుత్తమశాంభవి గను టది, యెత్తన్నా యెఱుకగన్న యెఱుగుడికన్నా. ౨౭
మత్తేభవృత్తి నుండెడి, చిత్తము గురువంకుసానఁ జిక్కినయపుడే
సత్తును గనఁబడు నంటట, నెత్తటి మది నెఱుకగన్న యెఱుగుడికన్నా. ౨౮
తత్తఱపడుటది వలదిఁకఁ, గుత్తుకమార్గంబు గాను గోమలిపదముల్
అత్తుగాన బ్రహ్మతత్త్వం, బెత్తుగ మది యెఱుకగన్న యెఱుగుడికన్నా. ౨౯
భ్రూమధ్యంబునఁ బ్రభ గని, యామీఁదను నెల్లచోట్ల నది భావింపన్
స్వామి గురుఁ డాత్మ తా నగు, నీమదిచే నెఱుకగన్న యెఱుగుడికన్నా. ౩౦
నాసికము తుదను జూడఁగ, భాసిల్లును బ్రభయుఁ జాల ఫాలాగ్రమునన్
ఆసుఖమునొంది విశ్వము, నిసున దిగనాడవన్న యెఱుగుడికన్నా. ౩౧
నాదముపై బిందువు తగ, నాదరమున వాని మీఁద నాపోజ్యోతిన్
భేదము లేకను గనుటది, యాదిర కృప కెఱుక గన్న యెఱుగుడికన్నా ౩౨
ఒడ్డియాణపుబంధం, బుడ్డాడక నిలిచనని నుపరతి గనురా
దొడ్డగు మోక్షం బంటట, నడ్డుగు న్నెఱుకగన్న యెఱుగుడికన్నా ౩౩
జాలంధరబంధమ్మును, జాలఁగ బంధించితేని సహజంబుగనా
మూలన యుండెడి యమృతముఁ, గ్రోలుదువుర యెఱుకగన్న గురునతకన్నా
బిందువు నేత్రము మధ్యను, బొందుగఁ గూడుండునట్టి పోఁడిమిగనియా
పొందునఁ జిత్తము నిల్పిన, నిందిర నీకబ్బురన్న యెఱుగుడికన్నా. ౩౫
నాదము వే అని చూడకు, మాదరమున నగ్నియందు నమరిన శిఖయే
కాదని నీవెంచిన నది, యేదిర మతియెఱుకగన్న యెఱుగుడికన్నా. ౩౬
నేత్రంబు కళయె పురుషుఁడు, సూత్రంబుగఁ జూచినంత సుస్థిరమతి యా
పాత్రము నీకబ్బినమది, చిత్రంబుగ నెఱుకగన్న శివ మగుకన్నా. ౩౭
చిత్తము నిలిచెడి దరుదని, పొత్తుగ నిహమందుఁ గూడి పోనఁగకనీవున్
ఉత్తమపురుషులఁ గలియుట, యెత్తుర మది యెఱుకగన్న యెఱుగుడికన్నా.
కాయము నిజ మని యెంచకు, మాయను విహరించి చాల మసలకునీవుం
గోయుము యఱిషడ్వర్గము, నీయనువున నెఱుకకన్న యెఱుగుడికన్నా. ౩౯
ఉంచుము చిత్తము గురుపై, నెంచుము ఓకైక్యమందు నేర్పునఁ దలఁపు
న్నించుము బ్రహ్మానందము, నెంచిన మది యెఱుకగన్న యెఱుగుడికన్నా.

([illegible]) హనుమద్దండకము—గ్రం. నం. 176.

వేదపురీనివాసుఁడైన శ్రీయాంజనేయునిపై రచియింపఁబడిన దండకము. కవిపేరు లేదు. దక్షిణదేశప్రతి. తుదనుగూడఁ గవిపేరు లేదు. చాల శిథిలమైనది. కొన్నియాకులు విఱిగిపోయినవి. ఆంజనేయుండు సీతాన్వేషణమునకై బైలుదేఱినది మొదలు యుద్ధకాండము చివరవఱకుఁ గలరామాయణకథయంతయు నీదండకములో వర్ణింపఁబడినది. అక్కడక్కడఁ గొన్నివాక్యములు:—

"శ్రీజానకీనాథ పాదాంబుజధ్యానహృత్సన్నిధానా! నిధానా! సదానంద! సుజ్ఞానపారీణ! వేదాగమజ్ఞానవైమానికానేకగంధర్వగానా! మహన్నందనా! వందనానేకభక్తాభిమానా! సుధాబృందవాక్చాతురీభానమానా! మనోల్లాసకైలాసవాసప్రియా! యుక్తసద్వీర్య సద్రంజనీయాంజనీగర్భసంజాత సంజీవరాయా! మహారాయ......శ్రీవేదపుర్యాశ్రమావాస! హన్మంతరాయా!...... నిన్ను న్నుతింపంగ నేనెంతవాఁడ న్సమర్థుండనా మైననానేర్చినంతం బ్రపంచంబున న్వ్నివింతు న్వినోదంబుగా నీవు త్రేతాయుగంబందు శ్రీరామకార్యార్థమై పార్థివుల్మెచ్చఁగా నుంగరంబంది యెంతోప్రమోదంబునం జెంది బల్వానరానీకము ల్గొల్వఁగా సీత నీక్షింపఁగా వచ్చి............ఎల్లచోటం విచారించి యెచ్చోటనుం గానక............" వ్రాత తప్పులు మెండు. మందబుద్ధేమిరా! నన్గూడయోధ్యాపురం జేలరా! ఇట్టి ప్రయోగములున్నను పదములకూర్పు నియమములు బాగుగానున్నవి. "రాక్షసనామసంవత్సరము, అధికాషాఢ బహుళ చతుర్దశీ శుక్రవారమునాడు వ్రాసిన దీపుస్తకము." అనియున్నదిగాని వ్రాసినవారి పేరుగూడ లేదు ౧౩ పత్రములుగలవు.

భారతారణ్యములోని "శ్రీకంఠలోకేశ" యనుదండకముగూడఁ గొంత కలదు. మఱియు,

సీ. శృంగారరాయని చెలువుమీఱినకొండ ఫణిరాజుపేరింటి పసిఁడికొండ
  పువ్వుజాతులకెల్లఁ బూజింపఁగలకొండ కల్పవృక్షములెల్లఁ గల్గుకొండ
  చిలుకలు కోయిల ల్చెలఁగి యాడెడుకొండ మృగరాజకోట్లెల్ల మెలఁగుకొండ
  ఘోరదురితములాపు కోనేరుగలకొండ తలఁచిన మోక్షంబు దగులుకొండ
  అమరవరులకు వైకుంఠ మైనకొండ, ఆళువారికిఁ బ్రత్యక్షమైనకొండ
  యర్థిఁజూచిన బ్రహ్మాండమైనకొండ, యేను గనుఁగొంటి శ్రీవేంకటేశుకొండ.

అనుపద్యమును నామగిరీశునిమీఁది పాటలు కన్యకామ్మవారి హెచ్చరికలు మొదలైనవి.

అనుచు నాసత్యభామ మదాంధయైన, మోహమొదలోనచు జిమజిమ్ముల్మింప
రంగపురవాసుఁ గానకయుంగఘవృఖి, ధాటిగూపచువెదకెనాలయచనములు.

(48) సుందరకాండము—గ్రం నం. 181.

యక్షగానము—భట్టాభిరామకవికృతము. ఈకవికవిత్వము తక్కినయక్షగాన
కవులకవిత్వము కంటె విర్దుష్టముగా నున్నది

ద్వి ఇది భక్తరక్షణహితమతిపేర. విదితపూర్ణానందవిభవుని పేర
సదనారతప్రభాసాంద్రుని పేర, సదయుఁ డౌ రామచంద్రునిపేర
రచియించె నవసుధారసధాటిలీల, సుచరిత మధురిమస్ఫురణసొంపునను
సూర్యనారాయణసోమయాజికవి, వర్యనందనుఁ డైనభట్టాభిరామ
సుకృతి సుందరకాండసుకృతి నాంధ్రమున, నకలమనుతిసిగే యప్రబంధమునగ.

శా. శ్రీసీతాలలితాంగి యంకమున రంజిల్లంగ నంగాంగలీ
లానంగంబునఁ జెంగలింపుచును గల్పద్రుమ్ఫురచ్ఛాయను
ద్యాపత్ప్రోన్నతరత్నపీఠమున మోదంబొప్పఁగా నున్నయా
కౌసల్యాసుతుఁ డిచ్చు మాకు నెపుడుం గళ్యాణసాకల్యముల్.

అని యిష్టదేవతావందనంబు గావించి శ్రీరామదాసాగ్రేసరుం డైన
యాంజనేయుని గవి యేమని వినుతింపుచున్నాఁడు—ఇది ప్రారంభము.

ద్వి. కోటవాకిటిమీఁది కొత్తళంబునను, గాటంబునను జిప్పుక్కన వేగ దుమికి
వదలించి కట్ల నావలఁ బడద్రోచి, మదముచఁ దనవాలమున నద్భుతముగ
జ్వలియింపుచున్న యాజ్వాలమువిని జూచి, వెలయ సీయగ్నికిఁ బ్రీతిగాలంక
వెలిఁగింతు నని యతివేగంబు మీఱ, నఁప్రహస్తునియింట నగ్ని రగిల్చి
యింద్రజిత్తునిగృహంబిడికుంగఁదన్ని, సాంద్రంబుగానగ్నిసముకొల్పియచట.

ఇది కథాభాగములోని యంశము. పిలవంగనామసంవత్సరం వంగుని
నెల ౧౭ ని శెవ్రుడాకుపట్టి యేర్లగడ్డ వేంకటయుప్పావధానుల కుమారుఁడు రామ
సుబ్బయ్యశాస్త్రి వ్రాసినది.

(49) బచ్చుపురిమల్లికార్జునశతకము - గ్రం. నం. 206.

స్వప్రకాశశతకమును.

ఈపుస్తకములో. దాశరథిశతకము, నరసింహశతకము గూడఁ గలవు
కొన్ని యుబువవు వేదాంతపద్యములు గలవు ధన్యోహం కృష్ణాకృష్ణధన్యోహం,
బ్రహ్మాభిర్ధన్యోహం. అను సంస్కృతకీర్తనలు గలవు. బచ్చుపురమల్లికార్జున

శతకములో అంబికకు మల్లికార్జునునకును సంభాషణముగా నగపడుచున్నది. "బచ్చపురీశ్వర మల్లికార్జునా" అని యంబిక ప్రార్థింపఁగా "బచ్చ :డ నం బికాసఖి!" యని మల్లికార్జునుని ప్రత్యుత్తరమును గలవు. శృంగారభూయిష్ఠ ముగానున్నవి.

ఉ. రజితాద్రివాస మునిసేవిత మీకు నమస్కరించి నే
నేరిచినట్లు వృత్తములు నెమ్మది రంజిల నూఱుపద్యముల్
కోరికలూరఁ జెప్పెదను గొబ్బునఁ గైకొని వేడ్కఁ బ్రోవఁగా
పాదము మీఁద మ్రొక్కెదను బచ్చపు ర మల్లికార్జునా' ఇది కవిప్రార్థన.

చ. చల మిఁక మానరా సరససద్గుణ నిన్నిఁక నన్నుతింతురా
నిలుపరప్రాణ మీమొదల నేరము లెన్నకు మేలుదానరా
బిలిచినఁ బల్కవేమి యిఁకఁ బ్రేమతో చూడర కోర్కి దీర్చరా
వలుమఱు నీకు మ్రొక్కెదను బచ్చపురీశ్వర మల్లికార్జునా.

చ. సరసుఁడ నాదు నెచ్చెలియ సారసలోచన ముద్దుగుమ్మరో
విరసము లాడకే యిఁకను వేడుకచేయవె జోడుగూడవే
నిరతము నీమలోకముగ నిండుగ నున్నది ప్రేమ నామదిం
బరమహితుండ నెవ్వరికి బచ్చపురీశుఁడ నంబికాసఖి.

తొంబదియేడుపద్యములు మాత్రముగలవు కవిపేరు తెలియదు.

స్వప్రకాశశతకము- గీతపద్యములు- "సకలతత్త్వకాశ స్వప్రకాశ" అని మకుటము- మచ్చుచూడుఁడు.

పద్మనేత్రశంభుబ్రహ్మాత్మరూపుల, నొవ్వలవడియాన్వయాత్మకముల ?
నతిముదంబుతోడ నతిరాత్రయాజుల,ననవరతము హృదయమందుఁదలఁతు.
పెండ్లికోరువారు పెండ్లాలుగలవారు, యతులు మునులుఁశూద్రులంగనలును
జ్ఞానమార్గమునకు శ్రవణాధికారులు, సకలతత్వకాశ స్వప్రకాశ. ౨
భాగ్యవంతుఁడైనవాఁడు మోక్షముగోరి, యుండెనేని వాఁడు నుత్తముండు
జ్ఞానసాధకుఁ డని శాస్త్రజ్ఞు లంటురు, సకలతత్వకాశ స్వప్రకాశ. 3

వేదాంతమార్గమును బోధించును. ఎనుబదిరెండుపద్యములు మాత్రమే కలవు. కవిపేరు కానరాదు.

(50) నానార్థ సంగ్రహపద్యకావ్యము. గ్రం. సం. 201.

ఇందుఁ బెక్కుపద్యములు నానావిధములవి గలవు. ముఖ్యాతికపాలు శృంగారరసము.

భూరిగుణహారి శ్రీబృందపురవిహారి, దితిజకులవైరి కేశవదేవశౌరి- ముద్దుశ్రీహరి నేలఁగోముద్దుగుమ్మ- బుధజనావన్న వరకూరిపురముచెన్న- రాజగోపాలుఁ దేవమ్మ రాజవదన- వనితనీవేగి శ్రీవాయలూరిశౌరిఁ, దోడితేవమ్మ పోవమ్మ తోయజాక్షి- బళిర వినవయ్య యీబాలప్రౌఢతనము- సరసమైనట్టి మాటలసత్య మెఱిఁగి, తగవుతీర్చినవాఁడె పో ధర్మరాజు- రారయే లుగో కోదండరామచంద్ర- విపులకరుణాంతరంగ శ్రీవిజయరంగ, చొక్కనాథధరాపాల సుగుణశీల. ఇట్టిమకుటములతోఁ గొన్ని పద్యములున్నవి.

ఇందు మొదట బాలసుబ్రహ్మణ్యశతకములోని పని నాల్గుపద్యము లున్నవి ఆపత్రము శిథిలమైనది. కావున వానిని మాత్రమిందుఁ బూర్తిగఁ జూపుటయైనది.

సీ. శ్రీకంఠవరపుత్ర శృంగారతరగాత్ర సన్మునిస్తుతిపాత్ర జలజనేత్ర
వల్లీమనోహార వాహీకృతమయూర యఖిలలోకాధార యరివిదార
దేవసేనాలోల దివిజసన్నుతశీల కుధరజాబాల సద్గుణవిశాల
భానుకోటిప్రతాప బ్రహ్మణ్యవరరూప యసురసేనాటోప యహికలాప
నీకుపేరిట శతకంబు నేర్చినటులు, విన్నవించెద వినవయ్య వేడ్కమీఱ
శూరసంహార కిరిగిరి సుఖవిహార, సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ. ౧

సంతసంబున నిన్ను సంస్మరించుచు భూమి సంచరించెడువాఁడె సజ్జనుండు
నీపదాంభోజముల్ నిర్లజ్జుఁడై సదా భజన చేసెడువాఁడె భాగవతుఁడు
నిర్మలచిత్తుఁడై నిన్ను సేవించుచు ధరనుండు వాఁడె పో ధన్యుఁడరయ
సకలచరాచర సంతానుఁ డౌనిన్నుఁ బూజచేసెడివాఁడె పుణ్యతముఁడు
నీదు లలరంగ నీనామగానరసము, విని సుఖించెడువాఁడె వివేకధనుఁడు. శూ-

ముంచుగోర్వనివాఁడు మార్తాండుఁ గనిగట్లు                    త్రిగాంచినట్లు
క్షుద్వ్యాధితుఁడు దివ్యసుధగన్న యట్టులు కడుదరిద్రుఁడు నిధివడసినట్లు
జడమధ్యగతునకు సుజన మబ్బినయట్లు ధరఁ దపస్వికి సిద్ధిదొరకినట్లు
తిమిరంబులో మంచి దివ్వెఁ జూచినయట్లు శిశువు తల్లిని జూచి చెలఁగినట్లు
నిన్నుగనుఁగొంటిశుభములు నిండఁగంటి, భవనదారిద్ర్యభూతంబుపాఱఁగంటి.

నట్టింట(లోనున్న) నవ్యనిక్షేపంబు గానక యాచించువానికరణి
యమృత మపేక్షించి యామధకాంక్షియై వనమాలికల కేగువానిపోల్కిఁ
గల్పకంబును బాసి కాంతారములలోనఁ దుమ్మచెట్లను బోయి నమ్మురీతి
భాగీరథినివీడి పల్వలోదకముల నెతకిగ్రుంకెడు వట్టి వెఱ్ఱిమాడ్కి

నిన్ను నేమఱిమూఢుఁడై యన్యసురులఁ, గొలువఁ బోవుటవ్యర్థంబు కువలయమున
దానధర్మము లేని ధనరాసు లవియేల భోగింపఁగాలేని పొలఁతి యేల
ఆప్తులు గాకున్న యన్నదమ్ములు నేల దయతోఁడఁ బ్రోవని దైవ మేల
శరణన్నఁ గావని నరపతి బ్రతుకేల సత్యంబు మాలిన సఖ్యమేల
వేదహీనుండైన విప్రుజన్మ శేల తనయులఁ బ్రోవని తల్లి యేల
బుధులు పలికించిరిన్నియు వృథయటంచు, నిన్నుఁ గొల్చినవారెల్ల ధన్యులండ్రు.

కవి యెవ్వరో తెలియదు. కొన్ని సంస్కృతశ్లోకములుగలవు. వ్రాఁతప్రతులు మెండుగానున్నవి.

శ్లో. లంకానాథకుహేళికాపరిభవః ప్రద్యోతనో జానకీ
వక్షోజద్వయహేళికేళిరసిక స్త్వాం రమాకాతర్పిణా (?)
సర్వైశ్వ స్వపదారవిందయుగళీభాజాం నిలింపద్రుమః
శ్రీరామ శ్శిఖతాతి రస్తు భగవా నామ్నాయ చూడాస్పదః.

(51) దండకములు- చిల్లరపద్యములు- గ్రం. స. 208

(1) నామగిరి దండకము- నామగిరినరసింహస్వామి దేవియైనమహాలక్ష్మిపై దండకము- కవిపేరు లేదు. మచ్చునకు-

శ్లో. తారాధీశసహోదరీ భవమహాదారిద్ర్యసంహారిణీ
కారుణ్యాంబుధి సర్వలోకజననీ కల్యాణి కాంతామణీ
చారుశ్రీకరశోభనాంగి నరపంచాస్య ప్రియా-
క్షీరాంభోధికుమారి నామగిరిలక్ష్మి భక్తసంరక్షణీ.

దండకము— శ్రీమన్మహానిత్యకళ్యాణి నీలాంబుభృద్వేణి నీరేజపాణీ బుధశ్రేణి సంరక్షణీ సైకతశ్రోణి కంజాతసంజాత మాతా జగద్వ్యాతవిఖ్యాత శశ్వద్గుణోపేత......గర్వకుర్వాణుఁడా నిత్యసర్వాపరాధిం గృపంజూడు మావంత మావంతలుం దీర్చి నాయొక్కవిజ్ఞాపనాలాపము ల్వింపు లాలించి పాలించి చేకోఁగదే.......శర్వాణియు న్వాణియుం జామర ల్పట్ట నింద్రాణి కాళాంజి పట్టన్ సుపర్వాంగనల్ ఊడిగంబుల్ ప్రమోదంబుతో సల్ప...... ఓయమ్మ యవ్వారిగా వారికిప్పింపవే కాళిఁగాళీపురీ వేంకటాధీశ్వరుం డైన శ్రీమన్నృకంఠీరవస్వామి గారాపుఁబూఁబోఁడి శ్రీనామగిర్యంబ లక్ష్మీజగన్మాత......నమస్తే నమః.

దండకము చివఱకుఁ జక్కగానున్నది.

(2) ఆర్యపురీనాథదండకము—కవిపేరు దీనికినిలేదు. మచ్చుచూపుడు.

శ్రీమానినీమానసాంభోజసారంగ సాకంగసంగతుణా నిత్యకల్యాణ కల్యాణగోత్రేశధీరా సుధీరప్రజాధార విశ్వంభరాకాంత ధారాధరాకార...... ధూళీకృతాక్రూర మారీచదోఃపాటదోఃపాటవిభ్రాతకంజాతకంజాతనేత్రా అనత్యంబుసుగ్రీవ సుగ్రీవమిత్రానుచారిత్ర...ప్రార్థించినేమ్రొక్కెదన్ మెక్కువన్మక్కువన్నిక్కువం బొప్ప నావిన్నపం బొక్కటాలింపవే మంచి నీపాదపాథోరుహధ్యాన మెక్కాల మేమూఱక - నమ్మితి నమ్మితి న్నిమ్ము......నామాతయున్ ధాతయున్ భ్రాతయు న్నీవె నీవాడ...కృపంబ్రోవుమార్యాస్తుతార్యాపురీనాథు డైనట్టి దేవోత్తమా యుత్తమాంగాచలాధీశ్వరా దేవదేవా నమస్తే.

ఆర్యాపురములో నుత్తమాంగాచలము కలదు కాఁబోలును, ఆయచలముపై నీస్వామి వేంచేసియుండును. కొన్ని మాటలంబట్టి పైదండకము నిదియు నొక్కరేరచియించిరా యను సంశయము కలుగుచున్నది.

(3) కామాక్షీదండకము:—శ్రీమన్మహాదేవి శీతాద్రిజాతా జగన్మాత లోకైకవిఖ్యాతదేహాంగనా రాజితాద్రిప్రపాదంబునందుండు మందారకాదంబజంబీర పున్నాగబిల్వాదిభూజంబులుం గల్గు నారామమధ్యంబున న్వజ్రవైడూర్యరత్నావళీ నిర్మితం బైనసన్మంటపంబందు మాణిక్యసింహాసనాసీనుఁడై యున్న ముక్కంటికి న్వామభాగంబునన్ భద్రపద్మాసనాసీనవై భక్తులం బ్రోచు.........తల్లీ నినుం జూచి సాష్టాంగదండప్రణామంబులం జేసెదన్ నన్నురక్షించు............సర్వలోకేశ్వరుండైన యేకాంబరాధీశ్వరుంగూడియున్నట్టి కాంచీపురీనాయకీ......నన్ను రక్షింపవే చాల నాపాలిదోషాంధకారంబునుం బాపు పోచూరి శ్రీకేశవస్వామికిం జెల్లెలైనట్టి యోకాంచి కామాక్షిదేవీ నమస్తే.

ఈకవి పోచూరినివాసియే కాఁబోలు - పేరు తెల్పుకొనలేదు.

(4) సూర్యదండకము:—శ్రీమన్మహాకశ్యపబ్రహ్మపుత్రా పవిత్రా జగన్మిత్ర పూషార్కమిత్రా......సూర్యనారాయణా వేదపారాయణా దేవదేవా నమస్తే నమః

ఈదండకము క్రొత్తదిగాదు. పలువురు నిత్యమును బఠించునదియే. దీనికిని గవి పేరు తెలియదు.

(౮) చిల్లరపద్యములు:- కాంతాలలామశతకములోనివియు, నల్పు, తెల్పు, పసుపు సీసపద్యములును గలవు.

రామచంద్రునివంటిరాజు తా గల్గెనా పవననందనువంటి బంటుగలఁడు
ధరణి గృష్ణునివంటి తండ్రి దాఁ గల్గెనా కుసుమబాణునివంటి కొడుకు గలఁడు
విక్రమార్కునివంటి వీరుండు గల్గెనా భట్టివంటి యుపాయపరుఁడు గలఁడు
రమణ భోజునివంటి రసికుండు గల్గెనా కాళిదాసునివంటి కవియుఁ గలఁడు
నాఁటివారికిఁ దక్కువే నేఁటివారు, ఎంతవారికిఁ గలుగుదు రంతవారు
కలఁడు వేయింటికొక్కఁడు కడమలేదు, ఆశ్రితామరయూథ సింహాద్రినాథ.

సీ. ఎలనాఁగ నీదేశ మేదేశ మన్నను జెలువంపు [illegible]నొక్క చేతఁజూపెఁ
బద్మాయతాక్షి నీపట్టణం బేదన్న శిలల తటాకంబు పేరబలికె
నిందీవరాక్షి నీయిల్లెక్కడన్నను దలవాయి మోచినతరువుక్రింద
నేటిదానవె కోమ లెటుఁగింపుమన్నను యేటిలో కొన్నల్లు మొదురుబుచ్చి,
నళినాయతాక్షి నీ నామ మేదన్నను తరువాతఁ దినుమని తరుణిబలికె
నెలఁది నీకు విభుఁడు గలఁడే యటన్నను, నీళ్ళమీఁద వ్రాసి నెలఁత చూపె
నెలఁత నీకు నిద్ర గలదెంత యన్నను, చుక్కఁ జూపి సుదతి సున్నచుట్టె.

... ... ... ... ...

క. అంబా పూర్ణసుధాకర, బింబానన త్రిజగదతులబిసరుహానయనా
జంభారివినుత శ్రీబృహదంబా జగదంబ శ్యామలాంబ మదంబా.

బృహదంబపైఁ బద్యములు చాలఁగలవు.

భళిరరవితేజ శ్రీకంచివరదరాజ-రమ్యగుణయూథ కావేటిరంగనాథ-చందమామ- ఏలతరితీపుఁజేసేవు మొమ్మలాఁడి- ఇట్లంత్యనియమములు గల పద్యములు కొన్నిగలవు నాదబ్రహ్మానందయోగి- పదములు గలవు.

ముక్తిమిచ్ఛసి చేత్తాత విషయాన్ విషవత్త్యజ
క్షమార్జవదయాశౌచసత్యం పీయూషవద్భజ

ఇట్లు శ్లోకము లనేకములుగలవు.

ఉ. బూరుగమానియున్నతముఁ బువ్వులుఁ బిందెలుఁ జూచి యాశతోఁ
గీరము లాఱునెల్లు తమకింపఁగఁ గాచి ఫలాభిలాషియై
చేరి రసంబుగ్రోలఁ గొనఁ జించినదూదియు రేఁగినట్లుపో
కూరిమిలేనిరాజులను గొల్చినఁ బెమ్మయసింగధీమణీ.